"కలౌ నష్ట దృశామేష పురాణార్కో ऽ ధునోదితః". అన్నారు. భక్తి జ్ఞాన వైరాగ్య జనకమగు భాగవతము త్రివిధగతి గల సూర్యునితో సమానమేగాక సూర్యునికన్న మిక్కిలి విశిష్టమైన వ్యతిరేకాలంకారాలలో వివరించబడినది. సూర్యుడు పగలు మాత్రమే ప్రకాశిస్తాడు, కాని శ్రీమద్భాగవతము రాత్రింబవలు కూడా వెలుగుతుంది. సూర్యుడు మనోగుహలోని అంధకారాన్ని తొలగించలేడు, కాని భాగవతము మనోగుహాగతమైన అజ్ఞానమనెడి మాలిన్యాన్ని కూడా తొలగించగలదు. భాగవత పురాణ ప్రవచనము జరిగినచోట సర్వ శ్రేయస్సులు చేకూరుతాయి. భాగవత సప్తాహ శ్రవణము వలన ఈ లోకమున ఆయురారోగ్య ఐశ్వర్యాది సత్ఫలితములే కాక అంత్యమున మోక్షము కూడా లభించును. "నాన్యః పంథా విద్యతేయనాయ" అని శ్రుతి. మోక్షానికి జ్ఞానమే కారణము.

భాగవత సప్తాహము సర్వోత్కృష్టమగు జ్ఞాన యజ్ఞము. ఇది భక్తుల పాలిటి పెన్నిధి.

శ్లో ॥ శ్రీమద్భాగవతం పురాణ తిలకం యద్వైష్ణవానాం ధనమ్ ।
యస్మిన్ పారమహంస్యమేకమమలం జ్ఞానం పరం గీయతే ॥
యత్ర జ్ఞానవిరాగభక్తిసహితం నైష్కర్మ్యమావిష్కృతమ్ ।
తచ్ఛృణ్వన్ ప్రపఠన్ విచారణ పరో భక్త్యా విముచ్యేన్నరః ॥

శ్రీమద్భాగవతము 12 స్కంధములు కలది. 12 అక్షరములు గల వాసుదేవ ద్వాదశాక్షరీ మహామంత్రమునకు సమానమని భావింపబడుచున్నది. శ్రీమద్భాగవతము గహనము. అంత సులభముగా అర్థముగాదు. భాగవతార్థము వ్యాఖ్యాగమ్యము. అనేకమంది పండిత ప్రకాండులు భాగవతానికి వ్యాఖ్యలు రచించారు.

వ్యాఖ్యానాలకు వ్యాఖ్యలు కూడా వెలుబడినవి. అన్నిటికన్నా శ్రీధరీయ వ్యాఖ్యానము ముఖ్యమైనది. శ్రీధరస్వామి రచించిన భావార్థ దీపిక అను అద్వైత సిద్ధాంతపరమైన వ్యాఖ్యానము మిక్కిలి విశిష్టమైనది. శ్రీమద్భాగవతము అద్వైత వేదాంత సిద్ధాంతముతో నిండియున్నదనుటకు సందేహము లేదు. దాన్ని ప్రతిపాదించునది భావార్థదీపిక. యథార్థమైనభావమును ప్రకాశింపజేయునది. శ్రీధరస్వామి గొప్ప నృసింహ భక్త్యుపాసనలు కల మహాపండితుడు. అంతటి ఉపాసకునికి గూడా భాగవత శ్లోకాలకు సరియైన అర్థము కొన్నిచోట్ల గోచరించకపోతే ఆయన ముఖముపై వస్త్రం వేసుకొని నృసింహ ధ్యానం

చేస్తూ కూర్చొనేవాడనీ, కొద్ది సేపటికి ముఖవస్త్రం తీసి చూడగా అచట కొన్ని పంక్తులు చక్కని అర్థమును వివరించేవి వ్రాసియుండెడివని చివరన "అయం భావః" అని ఉండిందనీ, ఆ అర్థాలను స్వయంగా నృసింహస్వామి తెల్పినాడని ప్రతీతి. శ్రీధరీయ వ్యాఖ్యానాన్ని ఇతర వ్యాఖ్యానాలను పరికించి పండితులు ఏది గొప్పదని ఆలోచించి శ్రీధర వ్యాఖ్యలేనిచో, భాగవత నిగూఢార్థము ఎవ్వరికినీ తెలిసేది కాదని నిర్ధారించారు.

అట్టి శ్రీధర వ్యాఖ్య భావార్థదీపికకు వంశీధర వ్యాఖ్యానం కూడా వెలుబడింది. అంతేకాక ఈ వ్యాఖ్యానాలనన్నింటినీ జగన్నాథస్వామి గుడిలో ఉంచితే దేనిని స్వామి పరిగ్రహించునో అది గొప్పదని, తెలుసుకుందామని ఆ విధముగా గుడిలో ఉంచితే శ్రీధర వ్యాఖ్య జగన్నాథస్వామి చేతిలో కనిపించినదని ప్రతీతి.

శ్రీధర వ్యాఖ్యానము ప్రతులలో అనేక పాఠభేదాలు కలవని వాటిని శోధించి సుష్ఠు పాఠములను పండితవర్య నారాయణ శాస్త్రి ప్రభృతులు నిర్ణయించి ముద్రించారు. అందుకే.......“వ్యాసో వేత్తి శుకో వేత్తి సంజయో వేత్తి రాజా వేత్తి న వేత్తి వా న వా శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహప్రసాదతః”. అని ఆభాణకం వెలుబడినది. శ్రీధర వ్యాఖ్య గూడా చాలా జటిలం, వంశీధరవ్యాఖ్యయేకాక శ్రీధరీయానికి చాలా వ్యాఖ్యానాలు వెలుబడినవి. అట్టి శ్రీధరస్వామి భావార్థదీపిక సంస్కృత వ్యాఖ్యానానికి తెలుగు అనువాదం పండితులచే వ్రాయించి ప్రచురించాలని శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠం సంకల్పించినది. శ్రీధరులు కఠిన పదాలకు మాత్రమే అర్థం వివరించారు. అనువాదం అటులనే చేసిన పాఠకులకు అగమ్యగోచరమగును. కావున శ్రీమద్భాగవతమునకు శ్రీధరవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ఈ గ్రంథ ధ్యేయము.

డా॥ బ్రహ్మశ్రీ శివునూరి విశ్వనాథశర్మ
పీఠకార్యనిర్వాహక సభ్యులు

**శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః**

**శ్రీమద్భాగవత మహాపురాణమ్**

**ఏకాదశ స్కంధః**

**శ్రీగణేశాయనమః**

**ఓం నమః పరమహంసాస్వాదిత చరణ కమల చిన్మకరందాయ భక్తజన మానస నివాసాయ శ్రీరామచంద్రాయ .**

విజయంతే పరానంద కృష్ణ పాదరజః స్రజః ।
యాధృతామూర్ధ్ని జాయంతే మహేంద్రాది మహః స్రజః ॥
ఉక్తైకత్రింశోధ్యాయైర్ముక్తిరేకాదశే తతః ।
జాయంతే యేతిహాసాద్యైః సమాస వ్యాసరూపతః ॥
నారదో వసుదేవాయ సమాసేన న్యవర్ణయత్ ।
భగవానుద్ధవాయాధ విసకతరేణోపపత్తిభిః ।
తత్ర తు ప్రథమోధ్యాయే యదువంశస్య ।
సంక్షయః ఉపక్షిప్తో విరాగాయ మౌసలవ్యపదేశతః ॥
ప్రవృత్తితః పరానందకృష్ణ క్రీడానువ్ణ్ణతా ।
తన్నివృత్యా పరానంద పదారోహోऽనువర్ణ్యతే ॥

**శ్రీమద్భాగవతమహాపురాణము**

**ఏకాదశ స్కంధము**

**శ్రీగణేశాయ నమః**

**శ్రీకృష్ణాయనమః**

పరమహంసలచే ఆస్వాదించబడెడి చరణకమల చిన్మకరందుడు, భక్తజన మనస్సులలో నివసించెడి శ్రీరామచంద్రునికి నమస్కారము. పరానందాన్నిచ్చెడి కృష్ణపాదరజస్రజములు జయము నొందుచున్నవి. కృష్ణపాదరజస్సును ధరించుటవలన మహేంద్రాది మహస్సు కలుగును.

ఏకాదశస్కంధమున 31 అధ్యాయములలో ముక్తి చెప్పబడినది. ఇతిహాసాదులతో సంక్షేప విస్తరముగా ముక్తి వివరణ చేయబడినది. నారదుడు వసుదేవునకు సంక్షేపముగా వర్ణించెను. భగవంతుడు ఉద్ధవునికి ఉపపత్తులతో విస్తరముగా చెప్పినాడు. ప్రథమాధ్యాయమున యదువంశక్షయము, ముసలోత్పత్తిని నిమిత్తముగా చేసికొని చెప్ప బడినది. వైరాగ్యము కొఱకు ప్రవృత్తిమార్గాన్ననుసరించి (ధర్మము) పరానందకృష్ణ క్రీడాదులు వర్ణింపబడినవి. తన్నివృత్తివలన (ప్రవృత్తి ధర్మ నివృత్తి) పరానందపదమును అధిరోహించుట ఇందు వర్ణింప బడుచున్నది.

ఏవంతావద్దశమస్కంధే భూభారావతారణాయ నిజవిభూతి విభూషిత యదువంశస్య యదువంశావతారిత సకల సురాంశస్య భగవతః శ్రీకృష్ణస్య తదుచిత ప్రవృత్తి విడంబనేన తచ్ఛ్రవణ స్మరణాది పరాణాం పరేషామానంద కారణం క్రీడానిరూపితా, అథేదానీం అపరిమిత యోగమాయా వైభవస్య భక్తానామాత్మతత్త్వ ఉపదేశ పూర్వకం క్రీడార్థం భూతలే అవతారితానాం చాధికారిణాం సురాంశానాం మౌసలాపదేశేన తత్తదధికారపదప్రాపణ పూర్వకం చ. బ్రహ్మాద్య నుగ్రహాయ నిజపదారోహో నిరూప్యతే.

తత్ర కురుక్షేత్రే యాత్రాయామవిరక్తస్య వసుదేవస్య "కర్మణా కర్మ నిర్హారో యథాస్యాన్నస్తదుచ్యతాం" ఇత్యేవం కర్మయోగం పృష్టవతో నారదాదిభిః కర్మయోగో నిరూపితః "కర్మణా కర్మనిర్హారోర ఏష సాధు నిరూపితః". యచ్ఛ్రద్ధయాప్త విద్యేన శుక్లేనేజ్యేత పూరుషః. ఇత్యాదినా తేన చ విశుద్ధసత్త్వస్య శ్రీకృష్ణరామౌ పరమేశ్వరత్వేన జ్ఞాతవతః షడ్గర్భానయనాధ్యాయే శ్రీకృష్ణేనాత్మతత్త్వముపదిష్టమ్. "వచోవః సమవేతార్థం తాతైతదుపమన్మహే. యన్నః పుత్రాన్సముద్దిశ్య తత్త్వగ్రామ ఉదాహృతః. ఇత్యాదినా. తచ్చ విషయభోగాతిశయేన పునస్తిరోహిత మాసీత్తదేవేదానీం నారదముఖేన ప్రథమం పంచాధ్యాయ్యా నిరూప్యతే.

దశముస్కంధమున భూ భారాన్ని తొలగించుటకై తన విభూతితో విభూషితమైన యదువంశముయొక్క మఱియు యదువంశమున అవతరించిన దేవతాంశుడైన భగవత్కృష్ణునికి సంబంధించిన ప్రవృత్తి విడంబనాదులతో, తచ్ఛ్రవణ, స్మరణపదులకు ఆనందకారణమైన క్రీడనిరూపించబడినది. ఇక ఇప్పుడు అపరిమిత యోగమాయా వైభవము యొక్క , భక్తులకు ఆత్మతత్త్వమును ఉపదేశిము చేస్తూ క్రీడకొఱకై భూమిపై అవతరించిన సురాంశులైన వారి యొక్క తమ తమ స్థాన ప్రాప్తి మౌసల వ్యాజముగా తెలియచేస్తూ బ్రహాదులనను గ్రహించుటకై నిజపదప్రాప్తి (వైకుంఠప్రాప్తి) నిరూపించబడుచున్నది.

కురుక్షేత్రయాత్రలో విరక్తుడుకాని వసుదేవునికి "కర్మవలన కర్మనివృత్తి ఎట్లవుతుందో మాకు చెప్పండని" కర్మయోగాన్ని గుఱించి అడుగగా నారదాదులతనికి కర్మయోగమును నిరూపించి.. "కర్మతో కర్మనివృత్తి ఇట్లు చక్కగా నిరూపించబడినది. శ్రద్ధతో శుద్ధమయిన విద్యను పొందినవాడై పరమపురుషుని యజించవలెను." మొదలయి నదిగా బోధించి.. ఈ బోధవలన విశుద్ధసత్త్వుడయిన వసుదేవునికి శ్రీకృష్ణరాములు పరమేశ్వరులని తెలిసెను. ఇట్లు తెలిసిన వసుదేవునికి షడ్గర్భానయనాధ్యాయమున కృష్ణుడాత్మతత్త్వమును ఉపదేశించెను. "వచోవః" ఇత్యాదిగా ఈ అంశమే ప్రతిపాదింపబడినది. ఆ ఉపదిష్ట మయిన తత్త్వము విషయభోగముల ధికముగా అవుట వలన మళ్ళీ మరచినట్టయినది. ఆ తత్త్వమునే నారదాది ముఖముగా ఐదధ్యాయములలో నిరూపింపబడుచున్నది.

## శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః
## శ్రీమద్భాగవత మహాపురాణమ్
## ఏకాదశ స్కంధః
## ప్రథమోऽధ్యాయః

శ్రీశుక ఉవాచ:-

1. శ్లో॥ కృత్వా దైత్యవధం కృష్ణః సరామో యదుభిర్వృతః ।
భువోऽవతారయద్భారం జవిష్ఠం జనయన్ కలిమ్ ॥

టీ :- తత్ర ప్రథమోధ్యాయే వైరాగ్యోత్పాదనాయ యదుకులస్య బ్రహ్మ శాపాపదేశేనాత్యున్నత విషయ సుఖానామప్యనిత్యతా ప్రతిపాద్యతే. తతశ్చతుర్భిర్నిమిజాయంతేయ సంవాదేన సపరికరం పరమతత్త్వ నిరూపణం. తతః షష్ఠే భగవదుద్ధవసంవాద ప్రస్తావః. తతస్త్ర యోవింశతాయ ఉద్ధవం ప్రతి భగవతస్తత్త్వ నిరూపణం. తతో ద్వాభ్యాం మౌసల క్రీడేత్యేవమేక త్రింశతాऽధ్యాయైరేకాదశస్కంధస్య ప్రవృత్తిః తస్య చ యథా మతి వ్యాఖ్యానమారభ్యతే. తత్రమౌసల ప్రసంగార్థం పూర్వస్కంధార్థమనువదతి శ్లోకద్వయేన కృత్వేతి. అవతారయత్ - అవతారయదిత్యడాగమో ద్రష్టవ్యః. జవిష్ఠం వేగవత్తరం అతిశీఘ్రం. హింసా పర్యవసాయి నమిత్యర్థః కలిం = కలహం (1)

## శ్రీమద్భాగవతమహాపురాణము
## ఏకాదశ స్కంధము ప్రథమాధ్యాయము

తా: ప్రథమాధ్యాయమున వైరాగ్యము కలుగుటకై యదుకులానికి బ్రహ్మశాపమనెడి నెపముతో అత్యున్నత విషయ సుఖములు కూడా అనిత్యములే అని ప్రతిపాదింపబడినది. అటునుండి నాలుగధ్యాయములు నిమిజాయంతేయ సంవాదముతో సపరికరమయిన పరమ తత్వము నిరూపింపబడినది. తరువాత ఆరవ అధ్యాయమున భగవదుద్ధవుల సంవాద ప్రస్తావము. తరువాత ఇరవైమూడు అధ్యాయములలో భగవంతుడు ఉద్ధవునికి తత్త్వము నిరూపించినాడు. మిగతా రెండధ్యాయములలో "మౌసలక్రీడ" వర్ణింపబడినది. ఇట్లు ముప్పది ఒక్క అధ్యాయములతో ఏకాదశ స్కంధము ప్రవృత్తమయినది. దీనిని యధామతి వ్యాఖ్యానించ ఆరంభించుచున్నాను. మౌసల ప్రసంగము కొరకై పూర్వస్కంధార్థమును రెండు శ్లోకములలో అనువదించుచున్నాడు కృత్వాఅని. అవతారయత్ అన్నచోట అడాశమము అని గమనించాలి. జవిష్ఠంవేగవత్తరము అతి తొందరగా. హింసాపర్యవసాయిని అని అర్థము. కలి = కలహము (1)

2. శ్లో॥ యే కోపితాస్సుబహు పాండుసుతాస్సపత్నైః
దుర్ద్యూతహేళనకచగ్రహణాదిభిస్తాన్ ।
కృత్వా నిమిత్తమితరేతరతస్సమేతాన్
హత్వా నృపాన్నిరహరత్ క్షితిభారమీశః ॥

టీ:- ఏతద్వివృణోతి. యెకోపితా ఇతి. సపత్నైర్దుర్యోధనాదిభిః కోపితాః కోపంకారితాః. సుబహు యథాభవతితథా బహువారానిత్యర్థంఃతదేవాహ - దుర్ద్యూత హేలన కచగ్రహణాదిభిరితి. దుర్ద్యూతం - కపట దూత్యం. హేలన-అవజ్ఞా, కచగ్రహణం దుఃశాసనేన ద్రౌపద్యాః కేశాకర్షణం, ఏతాన్యాదిర్యేషాం గరదానజతుశృహిదాహాదీనాం తైః కృత్వా యేకోపితాస్తాన్పాండు సుతాన్నిమిత్తం కృతా ఇతరేతరతః ఉభయోః పక్షయో. సమేతాన్మిలితాన్ నృపాన్హత్వాక్షితేర్భారం నిరహిర-జ్జహార. యద్వా యే కోపితా, యైశ్చకోపితా స్తానితరేతరతః పరస్పరం నిమిత్తంకృత్వే ఇత్యన్వయః. యేతావత్ప్రకట దైత్యాః పూతనాదయ స్తాన్స్వయమేవ హతవాన్' యే తు దైతాబాంధవచ్ఛద్మనా స్థితా స్తాన్ప రస్పరం నిమిత్తం విధాయ హత్వాభూభారముపాకృతవానిత్యర్థ.(2)

తా: దీనినే వివరించుచున్నాడు యేకోపితా అని. సపత్నైః దుర్యోధనాదుల వలన. కోపితాః కోపగింపబడ్డవారై. బహు అనేక పర్యాయములు అని అర్థము. అదే వివరించుచున్నాడు "దుర్ద్యూత హేలన కచగ్రహణాదిభిః" అని. దుర్ద్యూత-కపటమయిన జూతము. హేలనం హేలనం - అవమానము, కచగ్రహణము - దఃశాసనునిచే ద్రౌపదీ కేశములు లాగుట. ఇవి మొదలుగాగల ఆది పదముతో విషమిచ్చుట, లక్క ఇంటిని కాల్చుట వంటివి చేసి కోపగింపబడ్డవారై పాండు కుమారులను నిమిత్తముగా చేసికొని, ఇతరేతరతః ఇరుపక్షములకు, సమేతాన్ కలిసి నిన్నృపాన్ హత్వా - రాజుల చంపి భూమి యొక్క భారమును నిరహిరత్ తొలగించెను. పక్షాంతరమున ఎవరి వలన కోపగింపబడ్డవారై పరస్పరము నిమిత్తముగా చేసికొని అని అన్వయము.

ఎవరైతే ప్రకటదైత్యులు పూతనాదులు కలరో వారిని స్వయముగా తానే చంపినాడు. ఏ దైత్యులు బాంధవులనెడి ఛద్మతో వున్నారో వారిని పరస్పరము నిమిత్తముగా చేసికొని సంహరించి భూమి యొక్క భారమును తొలగించెనని యర్థము. (2).

3. శ్లో॥ భూభార రాజపృతానా యదుభిర్నిరస్య
గుప్తైస్స్వబాహుభిరచింతయదప్రమేయః ।
మన్యేऽవనేర్ననుగతోऽప్యగతో హి భారో
యద్యాదవం కులమహో అ విషహ్యమాస్తే ॥

టీ:- అపిచ - భూభారేత్యాది. అన్యాశ్చ భువో భారభూతాః రాజపృతనాః రాజ్ఞాం పృతనాః సేనాః, రాజ్ఞః తేషాం పృతనాశ్చేతి స్వబాహుభిర్గుప్తైః పరిరక్షితైర్యదుభిర్వివాహాదిచ్ఛలేన నిరస్య - హత్వా. బాహుభిరితి బహువచనం. వస్తుతశ్చతుర్భుజాభిప్రాయేణ. నన్వేవం కృష్ణశ్చికీర్షతీతి జ్ఞాత్వా కథం తస్మై యాదవాః నప్రద్రుహ్యాన్తి స్మ తత్రాహ - అప్రమేయః ప్రమాతుమశక్యః. చింతామాహ-మాన్య ఇతి. నన్వితి వితర్కే. అవనేర్భూమేర్భారో యద్యపి లోకప్రతీత్యా గతస్తథాప్యగతమేవ మన్యే. యద్యస్మాదవిషహ్యం. సోఢుమశక్యం. యాదవం కులమిత్యనేనైవ స్వవంశత్వాత్ స్వయం హననమనుచితమితి సూచితమ్ (3).

తా:- మరియు, భూభార "రజాప్రతనా" మొదలుకొని భూమికి భారభూతులయిన ఇతర రాజసేనలు, రాజుయొక్క సేనలు అని కూడా అర్థము. తన బాహువులచే రక్షింపబడిన. యాదవులచే వివాహాదిచ్ఛములచే చంపి బాహువులతో అనెడి బహువచనము. నాల్గు భుజముల యభిప్రాయముతో. కృష్ణుడీ విధముగా చేయగలడని తెలిసికొని యాదవులు అతని యందు ఎందుకు ద్రోహము చేయలేకపోయిరి అనినచో చెప్పుతున్నాడు. - అప్రమేయః ఊహించుటకు వీలులేని వాడు. చింతను చెప్పుచున్నాడు మాన్య అని. నను అని వితర్కమున. భూమి యొక్క భారము లోకప్రతీత్యాపోయిన్పటికినీ నేను మాత్రము భారము పోనట్టుగనె తెలిసికొనుచున్నాను. హి నిశ్చితము. యదీ ఎందువలన యనగా. అవిషహ్యం. ఓర్చుకొన శక్యముకానట్టి. యాదవం కులం అనుట చేతనే తన వంశమయినందున స్వయముగా హననము ఉచితము కాదని సూచితమయినది (3).

4. శ్లో॥ నైవాన్యతః పరిభవోऽస్య భవేత్కథంచిత్
మత్సంశ్రయస్య విభవోన్నహనస్య నిత్యమ్ ।
అంతః కలిం యదుకుల్య విధాయ వేణు
స్తంబస్య వహ్నిమివ శాంతిముపైమిధామ ॥

తా:- అయినచో దీనిని కూడా ఇతరులే నశింపచేయనిమ్ము అన్నచో చెప్పుతున్నాడు నైవ అని. దేవతల నుండి కూడా యాదవ కులానికి తిరస్కారము కలుగదు. ఎందులకనగా నన్నాశ్రయించి ఆ కులము న్నందున. మరియు గజ తురగాదులతో ఉచ్ఛృంఖలమైయున్న లేదా

టీ:- తర్హీదమప్యన్యైర్ఘాత్యతాం, తత్రాహ - నైవేతి. అన్యతో దేవాదిభ్యోఽపి యాదవ కులస్య పరిభవస్తిరస్కారోనభవేత్. కుతః మత్సంశ్రయస్య మాం సంశ్రయత ఇతిమత్సంశ్రయం కులం తస్య. కించ నిత్యం విభవోన్నహనస్య విభవైర్గజతురగాదిభిరుచ్ఛ్రుం. ఖలస్య. యద్వా తర్హీదం కిమితి సంహర్తవ్యం తత్రాహవిభవోన్న హనస్యేతి. తస్మాదేవం కరిష్యామీత్యాహ. అంతః కలిమితి. శాంతి ముపశమముపైమి. "వర్తమాన సామీప్యే వర్తమానవద్వా" ఉపైష్యామి. తదనంతరం ధామ చ వైకుంఠాఖ్యముపైష్యామీత్యర్థః (4).

అయినచో దీనినెందుకు సంహరింతురు అనగా చెప్పుచున్నాడు. విభవోన్నహన అని నిరవధి వైభవము గల అని. అందులకని ఇట్లు చేస్తానని అనుచున్నాడు అంతః కలిమని. శాంతిని ఉపశమమును పొందగలను. అదయిన తరువాత వైకుంఠమునకు వెళ్ళగలనని యర్థము. (4)

5. శ్లో॥ ఏవం వ్యవసితో రాజన్ సత్యసంకల్ప ఈశ్వరః ।
శాపవ్యాజేన విప్రాణాం సంజహ్రే స్వకులం విభుః ॥

టీ:- వ్యవసితః కృతనిశ్చయః. సంజహ్రే ఉపసంహృతవాన్. (5)

తా:- వ్యవసితః నిశ్చయము చేయబడిన. సంజహ్రే ఉపసంహరించుకొనినాడు (5)

6. శ్లో॥ స్వమూర్త్యా లోకలావణ్యనిర్ముక్త్యా లోచనం నృణామ్ ।
గీర్భిస్తాః స్మరతాం చిత్తం పదైస్తానీక్షతాం క్రియాః ॥

టీ:- వదేవమవతార ప్రయోజనం సర్వం సంపాద్య స్వంలోకం జగత్యాహు శ్లోకద్వయేన - స్వమూర్త్యేతి. లోకానాం లావణ్యస్య

తా:- ఈ విధముగా అవతార ప్రయోజనాన్ని అంతటినీ గావించి తనలోకానికి వెళ్ళెను అని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు స్వమూర్త్యా అని. లోకములయొక్క లావణ్య నిర్ముక్తి త్యాగము దేని వలననో. ఏదానినపేక్షించి లోకములలో లావణ్యము లేదు అని అర్థము. లేదా, లోకముల నుండి లావణ్యము యొక్క నిర్ముక్తి దానము

నిర్ముక్తిస్త్యాగోయయా. యామపేక్ష్య లోకేషులావణ్యం నాస్తీత్యర్థః. యద్వా లోకేభ్యో లావణ్యస్య నిర్ముక్తిర్దానం యతః. యత్సంపర్కేణ లోకా లాశన్యవంతో భవంతీత్యర్థః. తయా స్వమూర్త్యా. నృణాం లోచన మాచ్ఛిద్యాకృష్య తతోఽన్యస్యావలోకనే లోచనస్యాప్రవృత్తేః. తథా స్వగీర్భిస్తాగిరః స్మరతాం చిత్తంచాచ్ఛిద్య. తథా పదైస్తత్ర తత్రాంకితైస్తాని పదానీక్షతామీక్షమాణానామన్యతో గమనాదికాః క్రియాశ్చాచ్ఛిద్య. తదానీం తనానాం సర్వేషాం దక్షురాది ప్రవృత్తీః స్వైకనిష్ఠాః కృత్వేత్యర్థః (6)

దేనినుండియో. ఏ దాని సంపర్కము వలన లోకములు లావణ్య వంతములవుతాయో అని అర్థము। ఆ తన మూర్తితో నరుల కన్నుల నాకర్షించి, అతనికన్నా ఇతరుల చూచేందుకై కన్ను ప్రవర్తించవు. అట్లే తన వాక్కులతో ఆ మాటలను స్మరించెడివారి చిత్తములను కప్పిపుచ్చి అట్లే పదములతో అచ్చటచ్చట అంకితములయిన ఆ పదములను చూచే వారికి వేరుచోటికి వెళ్ళెడి గమనాదిక్రియలనూ కప్పిపుచ్చి, ఆ సమయములోని వారందరి చక్షురాది ప్రవృత్తులను తనయందుండేట్టుగా చేసికొని అని అర్థము (6).

7. శ్లో॥ అచ్ఛిద్య కీర్తిం సుశ్లోకీం వితత్య హ్యంజసా సు కౌ ।
తమోఽనయా తరిష్యంతీత్యగాత్స్వపదమీశ్వరః ॥

టీ:- కించ, ఆచ్ఛిద్యేతి. ఇత ఉపతి జనిష్యమాణానాం చ సర్వేషాం సంసారతారణాయ కౌ పృథివ్యాం శోభనాః. కవీనాం శ్లోకాః సుశ్లోకాః యస్యాం తాం స్వకీర్తిం వితత్య విస్తార్యానయా కీర్త్యా అంజసా సుఖేనైవ ను నిశ్చితం తమస్తరిష్యంత్యభిప్రేత్యే ఈశ్వరః స్వంపదం స్థానం ఆగాదితి. (7)

తా:- మరియు ఇక ముందు పుట్టెడి జనించెడి వారికి సంసారమును దాటింపదలచి పృథివియందు మంచి శ్లోకములు సుశ్లోకములు ఆతని కీర్తిని విస్తరించి ఈ కీర్తిచే శీఘ్రముగా సుఖముగాను - నిశ్చితముగా అజ్ఞానమును తరించగలరు. అనెడి అభిప్రాయముతో ఈశ్వరుడు స్వస్థానమును గూర్చి పోయెను. (7).

**రాజోవాచ :-**

8. శ్లో॥ బ్రహ్మణ్యానాం వదాన్యానాం నిత్యం వృద్ధోపసేవినాం ।
విప్రశాపః కథమభూత్ వృష్ణీనాం కృష్ణచేతసామ్ ॥

టీ:- అబ్రహ్మణేభ్యో అదాతృభ్యోవాऽసేవకేభ్యోవా విప్రాః కుప్యంతి, వృష్ణయస్తు న తథేత్యాహ - బ్రహ్మణ్యానామిత్యాదినా. కించ కోపే జాతేऽపి కృష్ణ చేతసాం కథమభూత్ కథం ప్రాదురభూదిత్యర్థః (8).

తా:- బ్రాహ్మణుల యందు భక్తి లేని వారిని దానగుణము లేని వారిని సేవాభావము లేని వారిని గురించి బ్రాహ్మణులు కోపగించుకుంటారు. వృష్ణివంశ్యులు అటువంటివారు కాదు. అని చెప్పుచున్నారు. బ్రహ్మణ్యానామని. మరియు కోపము వచ్చిననూ కృష్ణుని యందు చిత్తముగల వారగు వృష్ణులగు యాదవులకు బ్రహ్మణ శాపమెట్లు కలిగెనని అర్థము (8).

9. శ్లో॥ యన్నిమిత్తః స వై శాపో యాదృశో ద్విజసత్తమ ।
కథమేకాత్మనాం భేదః ఏతత్సర్వం వదస్వ మే ॥

తా:- ఓ బ్రాహ్మణశ్రేష్ఠా ఆశాపమేమి? దానికారణమేమి? ఏకాభిప్రాయము గల యాదవులనడుమ కలహమెట్లు కలిగినదో నాకు తెలుపుము. (9)

టీ:- అతః స్పష్టస్య నిమిత్తస్య అభావాన్నిమిత్తాంతరం పృచ్ఛతి - యన్నిమిత్త ఇతి. ఏకాత్మనాం ఏకచిత్తానాం. కథం భేదః కలహః. (9)

టీ:- అందులకు స్పష్టమయిన నిమిత్తము లేనందున వేరే నిమిత్తమును అడుగుచున్నాడు, వాన్నిమిత్త అని - ఒకే మనస్సు కలవారికి అంతః కలహమెట్లు కలిగినది (9).

10. శ్లో॥ బిభ్రద్వపుస్సకల సుందరసన్నివేశం
కర్మాచరన్ భువి సుమంగలమాప్తకామః ।
ఆస్థాయ ధామ రమమాణ ఉదారకీర్తిః
సంహర్తుమైచ్ఛత కులం స్థితకృత్యశేషః ॥

తా:- అన్ని రమ్యమయిన వస్తువుల కూడికగల శరీరమును భరించుచూ సకల కోరికలను (కామములు) పొందినవాడు భూమియందు శుభకరమైన కర్మలను ఆచరించుచూ స్వధామమును అధిష్ఠించి

రమించుచూ గొప్ప యశస్సుగలవాడు ఇప్పుడు నిల్చియున్న భూభార హరణ కర్మశేషముకలవాడై తన కులమును సంహరింపగోరెను. (10)

టీ:- ఈశ్వరేచ్ఛైవాత్ర నిమిత్తమితి పరిహరతి - బిభ్రదితి - సకలానాం సుందర వస్తూనాం సన్నివేశో విన్యాసవిశేషో యస్మింస్తద్వపుర్బిభ్రత్ తర్హి కిమితి సౌందర్యాద్విషయపరః న సుమంగలం కర్మాచరన్ తత్కిం కయాపి కామనయా న ఆప్తకామః . తర్హి కిమితి కర్మాచరతి . ధామ ద్వారవత్యాఖ్యం గృహమాస్థాయ రమమాణః గృహేరమమాణాన్ కర్మ గ్రాహయితుమిత్యర్థంః. నను కిమాప్తకామస్య గృహరత్యా కర్మభిర్వా తత్రాహ - ఉదారకీర్తిః. ఉదారా బహుబలప్రదా కీర్తిరస్యస్య సః . కీర్తివితానార్థమిత్యర్థః. ఏవం పరమైశ్వర్యేణ వర్తమాన ఏవకులం సంహర్తుమైచ్ఛత్. తత్కస్య హేతోః స్థితః కృత్యే భూభారహరణే శేషో యస్య సః. (10)

టీ :-ఈశ్వరేచ్ఛనే నిమిత్తమని పరిహరించుచున్నాడు బిభ్రత్ అని. జగత్తున ఉన్న సుందర వస్తువుల సంనివేశముగలదైన చాలా సౌందర్యవంతమైన శరీరమును ధరించు, అట్లయిన సౌందర్యము వలన విషయసుఖపరుడయ్యెనా కాదు. జగత్తునకు మంగళకరమైన కర్మచేయుచున్నవాడై, ఏదైనా కోరికచేతనా? కాదు. పూర్ణకాముడై. అట్లయినచో కర్మాచరణ ఎందుకు? ద్వారకయందు గృహముననే ఉండి విహరిస్తున్నవాడై కర్మగ్రహింపచేయుటకు, అని అర్థము. అయ్యా! ఆప్తకాముడయినవాడికి గృహాభిలాషచే ఏమి ప్రయోజనము? కర్మవలన కూడా ఏమి ప్రయోజనము? అనిన 'ఉదారకీర్తిః' అని సమాధానము చెప్పుచున్నాడు. బహు విస్తరించిన కీర్తికలవాడై తన కీర్తిని విస్తరించుట కొఱకు ఈ ప్రకారము పరమైశ్వరమునందు వర్తించుచున్నవాడై భూభారహరణశేషము నిలిచి ఉన్నందున దానిని నివారింపగోరి తన యదుకులమును సంహారము చేయగోరెను. (10).

11. శ్లో॥ కర్మాణి పుణ్యనివహాని సుమంగళాని
గాయజ్జగత్కలిమలాపహరాణి కృత్వా ।
కాలాత్మనా నివసతా యదుదేవగేహే
పిండారకం సమగమన్ మునయో నిసృష్టాః ॥

తా:- పుణ్యము కలిగించునవై మంగళమును కలిగించునవై కీర్తించు లోకుల కలి దోషమును హరించునవైన కర్మలను చేసి వసుదేవుని గృహమందు కాల స్వరూపుడుగా నివసించు కృష్ణునిచే విడిచివేయబడిన (వీడ్కోలు చెప్పబడిన) మునులు పిండారకమనెడి తీర్థమును గూర్చి వెళ్ళిరి. (11)

టీ :- ఈశ్వరేచ్ఛయోత్థితం బ్రహ్మశాపనిమిత్తం వక్తుమాహకర్మాణీతి. కర్మార్థమాహూతాః కర్మాణి కృత్వా నిసృష్టాః మునయః పిండారకం సమగమన్నిత్యన్వయః. నిసృష్టాః ప్రస్థాపితాః పూర్వోక్తా ముదార కీర్తితాం వివృణ్వన్కర్మాణి విశినష్టి - పుణ్యనివహానీత్యాది త్రిభిః పదైః. కానిచిద శ్వమేధాది కర్మాణి పుణ్యమేవ జనయంతి. పుత్రో పలాలనాదీని తు తత్కాలే సుఖమేవ కుర్వంతి. ప్రాయశ్చిత్తాదీని తు పాపమేవ హరంతి. ఏతాని తు సర్వతోముఖానీత్యాహ పుణ్యనివహాని. కీర్తనాదినా పుణ్యాని నివహంతి ప్రాపయన్తీతి తథా సుమంగళాన్యతి సుఖాత్మకాని. గాయతో జగతః కలిమలాప హరాణి కృత్వా. మునిప్రస్థాపనే హేతుః - కాలాత్మనా సంహారక రూపేణ యదుదేవగేహే వసుదేవగృహే నివసతా స్వకులం సంజిహీర్షయా ఇత్యర్థః. పిండారకం తతోనాతిదూరం తీర్థ విశేషం.(11)

టీ:- ఈశ్వరేచ్ఛచే కలిగిన బ్రాహ్మణ శాప నిమిత్తమున చెప్పుచున్నాడు కర్మాణి అని. కర్మల కొరకు ఆహ్వానింపబడి, కర్మల నాచరించి, పొమ్మని శ్రీకృష్ణుడు చెప్పగా (వీడ్కోలు పలుకగా) మునులు పిండారకమునకు పోయిరి. అని అన్వయము. పూర్వశ్లోకమున చెప్పబడిన శ్రీ విష్ణుమూర్తి వైభవమును వివరించుచు కర్మలను విశేషించి చెప్పుచున్నారు. పుణ్యాలు అను మూడు పదములచే అశ్వమేధాదులగు కొన్ని కర్మలు పుణ్యమునే కలిగించుచున్నవి. పుత్రులను పాలించుట మొదలగునవి తాత్కాలిక సుఖమునే కలిగించుచున్నవి. ప్రాయశ్చిత్తకర్మలు కేవలము పాపమునే హరించుచున్నవి. ఇవి మాత్రము అన్నిటికంటే ముఖ్యమైనవని చెప్పెను. పుణ్యనివహమని కీర్తించుటచే పుణ్యమును ప్రాప్తింప చేయును అని. సుమంగళములు అనగా అతి సుఖాత్మకముగా గానము చేయుటచే నీజగత్తు యొక్క కలిదోషము హరించునవి. అయిన (కర్మల) చేసి (ముని ప్రస్థాపనమున హేతువు కాలాత్మను. కాలస్వరూపుడు అనగా సంహారకరూపుడగు కృష్ణుడు మునుల ప్రయాణమునకు హేతువు. పిండారకము అక్కడికి సమీపమున గల తీర్థ విశేషము (11).

12.శ్లో॥ విశ్వామిత్రోऽసితః కణ్వో దుర్వాసా భృగురంగిరాః ।
కాశ్యపో వాసుదేవోऽత్రిః వసిష్ఠో నారదాదయః ॥

తా :- విశ్వామిత్రుడు, అసితుడు, కణ్వుడు, దుర్వాసుడు, భృగువు, అంగిరసుడు, కశ్యపుడు, వామదేవుడు, అత్రి, వసిష్ఠుడు, నారదుడు, మొదలగువారు వచ్చిరి. 12

టీ :- మునీనాహ - విశ్వామిత్ర ఇతి. (12 )

13.శ్లో॥ క్రీడంతస్తానుపవ్రజ్య కుమారా యదునందనాః ।
ఉపసంగృహ్య పప్రచ్ఛుః అవినీతా వినీతవత్ ॥

తా :- యాదవ కుమారులు కొందరు ఆడుతూ వినయ విధేయతలు లేని వారయిననూ వినయము గలవారి వలె ఆ మునులను సమీపించి పాదములకు నమస్కరించి ప్రశ్నించిరి. 13

టీ :- క్రీడంత ఇతి. ఉపసంగృహ్య పాదగ్రహణం కృత్వా. 13

టీ :-ఉపసంగృహ్య - పాదగ్రహణము చేసి. (13)

14.శ్లో॥ తే వేషయిత్వా స్త్రీవేషైః సాంబం జాంబవతీసుతమ్ ।
ఏషా పృచ్ఛతి వో విప్రాః అంతర్వత్న్యసితేక్షణా ॥

తా :- జాంబవతీ సుతునికి సాంబునకు స్త్రీ వేషము వేసి, ఈ అమ్మాయి మిమ్ములనడుగుతున్నది. నల్లని కన్నులు గల, గర్భవతియైన (ఈ అమ్మాయి) 14

టీ:- ప్రశ్నప్రకారమాహ - తేవేషయిత్వేతిద్వయేన. హే అమోఘ దర్శనా విప్రాః. ఏషా అంతర్వత్నీ గర్భిణీ. 14

టీ:- ప్రశ్న ప్రకారము తెలుపుచున్నాడు. తేవేషయిత్వా అనెడి రెండు శ్లోకముల ద్వారా. విఫలముగాని దర్శనములు గల ఓ మునులారా! ఈ స్త్రీ గర్భిణి. (14).

15.శ్లో॥ ప్రష్టుం విలజ్జతీ యుష్మాన్ ప్రబ్రూతామోఘదర్శనాః ।
ప్రసోష్యంతీ పుత్రకామా కిం స్విత్సంజనయిష్యతి ॥

టీ:- వః యుష్మాన్ సాక్షాత్ప్రష్టుం విలజ్జతీలజ్జమానా అస్మన్ముఖేన పృచ్ఛతి. ప్రసోష్యంతీ ఆసన్నప్రసవా . కింస్విత్సంజనయిష్యతి కన్యాం వా పుత్రం వా తత్ప్రబ్రూత.(15)

తా:- మిమ్ములను అడుగుటకు సిగ్గుపడుచున్నదై మా ద్వారా అడుగుచున్నది. ఈమె పుత్రుని గోరుతూ ఆసన్న ప్రసవయైయున్నది. కాన ఈమె పుత్రుని కనునా? లేక పుత్రికను కనునా? చెప్పండి.(15)

టీ:- మిమ్ములను సాక్షాత్తుగా అడుగుటకు సిగ్గుపడుచున్నదై మాద్వారా అడుగుచున్నది ప్రసవము సమీపమున గలదై, పుత్రుని కనునా కన్యను కనునా? చెప్పండి (15).

16.శ్లో॥ ఏవం ప్రలబ్ధా మునయస్తానూచుః కుపితా నృప ।
జనయిష్యతి వో మందాః ముసలం కులనాశనమ్ ॥

టీ:- ప్రలబ్ధాః అపహసితాః వంచితా ఇతి వా. (16).

తా:- ఈ విధముగా యదుకుమారులచే అపహసింపబడినవారై మునులు కోపానికి వచ్చి "ఓ మూఢులారా ! మీ యదుకులమును నాశనము చేసెడి ముసలమును ఈమె ప్రసవింపగలదు" అనిరి. (16)

టీ:- వంచింపబడినవారై (16)

17.శ్లో॥ తే తచ్ఛ్రుత్వాతిసంత్రస్తాః విముచ్య సహసోదరమ్ ।
సాంబస్య దదృశుస్తస్మిన్ ముసలం ఖల్వయస్మయమ్ ॥

టీ:- తస్మిన్నుదరే. అయస్మయం లోహమయమ్. (17).

తా:- ఆ యదుకుమారులు మునులు చెప్పిన మాటలు విని సాంబుని ఉదరమునుండి గర్భాకారమును తీసివేసి ఆగర్భమునందు ఉక్కుతో చేయబడిన రోకలిని చూచిరి (17).

టీ:- ఆయుదరమందు. లోహమయము. (17).

18.శ్లో॥ కిం కృతం మందభాగ్యైః నః కిం వదిష్యంతి నో జనాః ।
ఇతి విహ్వలితా గేహం ఆదాయ ముసలం యయుః ॥

తా:- మందభాగ్యులమగు మనము ఎంతచెడ్డ పని చేసినాము మనవాళ్ళు మననేమందురో అని నివ్వెరపొందినవారై వారు ఏమి తోచక ఆ ముసలమును తీసికొని గృహమునకుపోయిరి. (18)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- మందభాగ్యైర్నాస్మాభిః కిమేతత్కృతం. నోస్మాకం కింవదిష్యతో ఇతి విహ్వలితాః సంతః ముసలమాదాయ గృహం యయుః (18).

టీ:- మందభాగ్యులమయిన మనమేమి చేసితిమి? మనను మన వారేమందురో అని నివ్వెరపాటు పొందిన వారై ముసలాన్ని తీసికొని ఇండ్లకు వెళ్ళిరి (18).

19.శ్లో॥ తం చోపనీయ సదసి పరిమ్లానముఖ శ్రియః ।
రాజ్ఞ ఆవేదయాంచక్రుస్సర్వదాయవసన్నిధౌ ॥

తా:- ఆ రోకలిని రాజసభకు తీసికొని వచ్చి మాసిన ముఖములు కలవారై యాదవులందరి ఎదుట రాజయిన ఉగ్రసేనునికి జరిగినదంతా వివరించిరి. (19).

టీ:- రాజ్ఞే ఉగ్రసేనాయ, న తు శ్రీకృష్ణాయ. (19).

టీ:- రాజునకు ఉగ్రసేనునకు, శ్రీకృష్ణునకు కాదు. (19).

20.శ్లో॥ శ్రుత్వామోఘం విప్రశాపం దృష్ట్వా చ ముసలం నృప ।
విస్మితా భయసంత్రస్తాః బభూవుర్ద్వారకౌకసః ॥

తా:- ఓ రాజా! ద్వారకా వాసులు విప్రశాపాన్ని విని ముసలాన్ని చూచి ఆశ్చర్యమును పొంది, భయముతో దిగులును కూడా పొందిరి. (20)

21. శ్లో॥ తం చూర్ణయిత్వా ముసలం యదురాజస్స ఆహుకః ।
సముద్రసలిలే ప్రాస్యత్ లోహం చాస్యావశేషితమ్ ॥

తా:- ఆ యదుసేనుడు ఉగ్రసేనుడు. ఆముసలాన్ని పొడి చేయించి ఆ పొడిని సముద్రములో వేయించెను. మిగిలిన ఉక్కు ముక్కను సముద్రములో వేయించెను. (21).

టీ:- ఆహుకః ఉగ్రసేనః. సోఽపి శ్రీకృష్ణమపృష్ట్వైవ ప్రాస్యత్ప్రక్షిప్తవాన్. అస్య ముసలస్య చూర్ణీక్రియమాణస్య అవశేషితం లోహం తచ్చ ప్రాస్యత్. (20,21)

టీ:- ఆహుకః ఉగ్రసేనుడు. అతను కూడా కృష్ణుడిని అడుగకనే వేయించెను. ఈ ముసలము చూర్ణము చేయగా మిగిలిన లోహమును సముద్రమున వేయించెను.(20,21)

22. శ్లో॥ కశ్చిన్మత్స్యోऽగ్రసీల్లోహం చూర్ణాని తరళైస్తతః ।
ఊహ్యమానాని వేలాయాం లగ్నాన్యాసన్ కిలైరకాః ॥

టీ:- తరళైః- తరంగైః. 22

23.శ్లో॥ మత్స్యో గృహీతో మత్స్యఘ్నైః జాలైరన్యైస్సహార్ణవే ।
తస్యోదరగతం లోహం స శల్యే లుబ్ధకోऽకరోత్ ॥

టీ:- అన్యైర్మత్స్యైః సహ శల్యే శరాగ్రే. (23)

24.శ్లో॥ భగవాన్ జ్ఞాతసర్వార్థః ఈశ్వరోऽపి తదన్యథా ।
కర్తుం నైచ్ఛద్విప్రశాపం కాలరూప్యన్వమోదత ॥

టీ:- జ్ఞాతాః సర్వేఅర్థాః యేన సః ఈశ్వరోऽపి సమర్థోऽపి సన్ అన్యథా కర్తుం నైచ్ఛత్ . కింత్వన్వమోదత. యతః కాలరూపీ. 24

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
ప్రథమోऽధ్యాయః

తా :- ఒక చేప ఆ లోహపు తనకను మ్రింగినది. ఆ ముసల చూర్ణములు అలలచే కొట్టుకొనివచ్చి సముద్రపు గట్టున తుంగలుగా అయినవి. 22

టీ : - తరంగములచే. 22

తా :- జాలరులు వలలతో సుముద్రమునందలి చేపలతోగూడా ఆ చేపను పట్టి.. ఆ చేప కడుపులోని ఉక్కుముక్కను ఒక బోయవాడు బాణపు కొనగా చేసికొనెను. 23

టీ :- ఇతర చేపలతో సహా - శరాగ్రమునందు. 23

తా:- అన్నీ తెలిసిన భగవంతుడు ఈశ్వరుడైనా ఆ విప్రశాపాన్ని తొలగింప ఇష్టపడలేదు. కాలస్వరూపుడయినందున ఆమోదించెను. 24

టీ:- అన్ని విషయములు తెలిసిన వాడయినందున సమర్థుడయిననూ వేరు విధముగా చేయుటకు అంగీకరించలేదు. కాల స్వరూపుడయి నందున. 24

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
ప్రథమాధ్యాయము సమాప్తము.

## ద్వితీయోऽధ్యాయః

శ్రీశుక ఉవాచ:-

1. శ్లో॥ గోవిందభుజగుప్తాయాం ద్వారవత్యాం కురూద్వహ ।
అవాత్సీన్నారదోऽభీక్ష్ణం కృష్ణోపాసనలాలసః ॥

టీ :- ద్వితీయో నిమిజాయంత సంవాదేనాహ నారదః, ధర్మాన్భాగవతాన్ భక్త్యా వసుదేవాయపృచ్ఛతే. అభీక్ష్ణం ప్రస్థాపితోऽపి పునః పునరవాత్సీదిత్యర్థః. నను నారదస్య దక్షాదిశాపాన్నైకత్రవాసః సంభవతీత్యాశంక్యాహ - గోవింద భుజగుప్తాయామితి న తస్యాం శాపాదేః ప్రభావః ఇత్యర్థః. కృష్ణోపాసనే లాలాసమౌత్సుక్యం యస్య సః. (1)

2. శ్లో॥ కో ను రాజన్నింద్రియవాన్ ముకుందచరణాంబుజమ్ ।
న భజేత్సర్వతో మృత్యుః ఉపాస్యమమరోత్తమైః ॥

## ద్వితీయాధ్యాయము

తా:- శ్రీకృష్ణ బాహుబల రక్షితమయిన ద్వారవతి యందు కృష్ణుని సేవింప ఆసక్తితో నారదుడు మాటిమాటికి బయలుదేర ఉద్యమించి మరలివచ్చి నివసించెను (1).

టీ:- ఈ ద్వితీయాధ్యాయమునందు నారదుడు తనను ప్రశ్నించిన వసుదేవునికి నిమి అను విదేహపతికిని ఋషభునికి జయంతి యనెడు స్త్రీ యందు జనించిన ఋషభ పుత్రులకు జరిగిన సంవాదము ద్వారా భాగవతధర్మములను చెప్పెను. మాటిమాటికి బయలుదేరియు మళ్ళీవచ్చి నివసించెను అని యర్థము . అయ్యా నారదునికి దక్షాదుల శాపము వలన ఒకేచోట ఉండుట సంభవించదు కదా అనిన గోవింద భుజగుప్తాయామని చెప్పినాడు. దానియందు శాపాదుల ప్రభావము లేదని అర్థము. కృష్ణుని ఉపాసించుట యందు లాలసుడై. (1)

తా:- ఓ రాజా! అన్ని లోకములలో అన్నిచోట్లలో మృత్యువు కలదని తెలిసినవాడు ఇంద్రియపాటవము గలవాడు. సురేంద్రులచే ఉపాస్యములైన హరిపాదపద్మములను ఎవ్వడు సేవింపడు? ప్రతివాడు సేవించ గలడు! (2)

టీ:- యద్భజనే ముక్తానామపీదృశ మౌత్సుక్యం తం కోనామన భజే దిత్యాహ – కోన్వితి. ఇంద్రియవానితి. ఇంద్రియవత్వమేవ యత్రాధికారి విశేషణమిత్యర్థః. సర్వతః సర్వేష్వపి లోకేషు మృత్యుర్యస్య సః(2,3)

టీ:- ఎవని భజనయందు ముక్తులకు కూడా ఇటువంటి ఉత్సాహము కలదో ఆ కృష్ణుని భజింపని వాడెవడు? అని చెప్పుచున్నాడు 'కోను' అని ఇంద్రియవత్వ మాత్రమే – అధికారి విశేషణమని అర్థము. అన్ని లోకముల యందు మృత్యువు ఎవనికో వాడు (2,3)

3. శ్లో॥ తమేకదా తు దేవర్షిం వసుదేవో గృహాగతమ్ ।
అర్చితం సుఖమాసీనం అభివాద్యేదమబ్రవీత్ ॥

తా:- ఒకనాడు తన సమీపమునకు వచ్చిన నారదుని అర్చించి సుఖముగా కూర్చుని ఉన్న నారదుడిని వసుదేవుడీమాటలననెను.(3)

**వసుదేవ ఉవాచ:-**

4. శ్లో॥ భగవన్ భవతో యాత్రా స్వస్తయే సర్వదేహినామ్ ।
కరుణానాం యథా పిత్రోః ఉత్తమశ్లోకవర్త్మనామ్ ॥

తా:- తండ్రిరాక సంతానానికి శుభప్రదమెట్లవుతుందో, విష్ణు భక్తులయిన పెద్దల ఆగమనము దాసులకు ఎట్లు మెలగునో, ఆ విధముగా నీ ప్రాణులందరికీ మంగళకరమౌతున్నది. (4).

టీ:- యథా పిత్రోర్యాత్యా ఆగమనమపత్యానాం స్వస్తయే మంగళాయ. యథాచ ఉత్తమశ్లోకస్య వర్త్మభూతానాం మహితాం యాత్రా కృపణానాం స్వస్తయే తథా భగవద్రూపస్య భవతో యాత్రా సర్వదేహినాం స్వస్తయే భవతి. (4)

టీ:- పైన చెప్పిన అర్థమే.(4)

5. శ్లో॥ భూతానాం దేవచరితం దుఃఖాయ చ సుఖాయ చ ।
సుఖాయైవ హి సాధూనాం త్వాదృశామచ్యుతాత్మనామ్ ॥

తా:- ప్రాణులకు ఇంద్రాదుల వర్తనము దుఃఖమునకు, సుఖము కొరకును అగును. విష్ణువుయందు మనస్సు గల నీ వంటి సాధువుల యొక్క ప్రవర్తన (రాక) ప్రాణులకు సుఖమునే కలిగించును.(5)

టీ:- దేవైరపి మహతా ముపమానమనుచితమిత్యాహ - భూతానాం దేవానాం చరితం అతివృష్ట్యాదినా భూతానాం దుఃఖాయాపి భవతి. త్వాదృశాం త్వయాసదృశానాం. అచ్యుతే ఆత్మాయేషాం తేషాం. (5).

టీ:- మహాత్ములను దేవతలతో పోల్చుట కూడా సరియయినది కాదు. అని అనుచున్నాడు భూతానామని. దేవతల చరిత్ర (ప్రవర్తనము) అతివృష్ట్యాదుల వలన, అనావృష్టి వలన ప్రాణులకు దుఃఖమును కలిగించును. (సమవృష్టిచే సుఖమును కలిగించును) మీతో సమాన మయిన వారి, అచ్యుతుని యందు మనస్సు ఎవరికో వారికి.(5)

6. శ్లో॥ భజంతి యే యథా దేవాన్ దేవా అపి తథైవ తాన్ ।
ఛాయేవ కర్మసచివాః సాధవో దీనవత్సలాః ॥

తా:- ఎవరు ఏ ప్రకారము దేవతలను భజించుచున్నారో ఆ ప్రకారమే నీడవలె, కర్మానుగుణ సహాయులయిన దేవతలునూ వారిని భజించు చున్నారు. సాధువులు మాత్రము దీనులయందు దయగలవారై యుంటారు. (6)

టీ:- కించ సుఖం కుర్వంతోऽపి దేవాః భజనానుసారేణ కుర్వంతి, న తథా సాధవ ఇత్యాహ - భజంతీతి. ఛాయేవ, యథా పురుషో యావత్కరోతి తావదేవ తస్య ఛాయాపి తథా. కర్మసచివాః కర్మ సహాయాః (6)

టీ:- మరియు సుఖమునిచ్చే దేవతలు, భజనానుసారముగనే సుఖము నిస్తారు సాధువులట్లుకాదనుచున్నాడు భజంతీ అని. శరీరమెంతయున్న నీడనూ అంతే యుండును (ఎంత చేయునో ఛాయగూడా అంతే చేయును) కర్మసచివాః కర్మానుగుణ సహాయులైన (6)

7. శ్లో॥ బ్రహ్మంస్తథాపి పృచ్ఛామో ధర్మాన్ భాగవతాం స్తవ ।
యాన్ శ్రుత్వా శ్రద్ధయా మర్త్యో ముచ్యతే సర్వతో భయాత్॥

తా:- మీ రాక వలననే మేము ధన్యులమైననూ నిన్ను భాగవత ధర్మములను చెప్పుమని అడుగుచున్నాము. ఈ ధర్మమును శ్రద్ధతో వినుమర్త్యుడు సర్వవిధముల సంసారభయము నుండి విముక్తుడగు చున్నాడు.(7)

టీ:- తదేవం యద్యసి భవతః ఆగమనమాత్రేణైవ వయంకృతార్థాస్తథాపి పృచ్ఛామః. తవేతి, తవ యైర్ధర్మైః ప్రసన్నోభవాన్ తానిత్యర్థః (7)

టీ:- మీ ఆగమనము వలననే మేము కృతార్థులమై ఐనాము ఐననూ అడుగుచున్నాము తవ అని, తవ - యే ధర్మముల వలన తమరు ప్రసన్నులయినారో అట్టి ధర్మములను అని అర్థము. (7).

8. శ్లో॥ అహం కిల పురానంతం ప్రజార్థం భువి ముక్తిదమ్ ।
అపూజయం న మోక్షాయ మోహితో దేవమాయయా ॥

తా:- నేను పూర్వము భూమియందు మోక్షమునిచ్చు విష్ణువును సంతానము కొరకు పూజించితిని. విష్ణు మాయచే మోహింపబడిన వాడనై మోక్షము కొరకు పూజించలేదు.(8)

టీ:- ననుత్వత్తోపికిమన్యో భగవత్ప్రసాదపాత్రమస్తి, తత్రాహ - అహం కిలేతి. భువి ప్రజార్థో అపూజయం పుత్రలాభ ప్రయోజనః సన్ పూజితవాన్ కిలేతి. సూతి గృహే భగవదుక్తమనుస్మరతి.(8)

టీ:- నీకన్న భగవత్ప్రసాదమునకు పాత్రుడన్యుడెవడున్నాడు. అనగా దానికి ఇట్లనుచున్నాడు. అహం కిల అని. భూమియందు సంతానము కోసము పూజించినాను, పుత్రలాభ ప్రయోజనుడనై పూజించితిని. కిలయని సూతీగృహమున భగవంతుని, పుత్రలాభప్రయోజనుడనై పూజించితిని. కిలయని సూతీగృహమున భగవంతుడు చెప్పినదానిని అనుస్మరించుచున్నాడు. (8).

9. శ్లో॥ యథా విచిత్రవ్యసనాత్ భవద్భిర్విశ్వతో భయాత్ ।
ముచ్యేమ హ్యంజసైవాద్ధా తథా నశ్శాధి సువ్రత ॥

తా:- ఓ సువ్రతా! నారదా! వివిధములయిన వ్యసనములు గల ఈ సంసారము నుండి అన్నిటి నుండి భయముగల ఈ సంసారము నుండి అనాయాసముగా సాక్షాత్తుగా మీ వంటి వారిచే ఎట్లు విముక్తిని పొందుతామో అట్లు మాయ, జ్ఞానమును, భక్తిని బోధించండి. (9).

టీ:- అతో యథాముచ్యేమహి తథానోऽస్మాన్ శాధి శనైః శిక్షయ విచిత్రాణి వ్యసనాని యస్మిన్సంసారే తస్మాతమ్సంసారాత్. తథా విశ్వతః సర్వతోభయం యస్మింస్తస్మాత్. భవర్భిర్హేతుభూతైః.అంజసా అనాయాసేన అద్ధా సాక్షాత్॥ (9)

టీ:- అందులకు ఎట్లు విముక్తిని పొందుదుమో ఆ ప్రకారముగా మమ్ములను శిక్షింపుము. వివిధములయిన వ్యసనములు ఏ సంసారము నందు కలవో అట్టి సంసారము నుండి, అట్లే అంతటి నుండి భయము గలదానినుండి, మీరుకూడా కారణముగాగల అంజా అనాయాసముగా, అద్ధా సాక్షాత్తుగా. (9)

శ్రీశుక ఉవాచ:-

10.శ్లో॥ రాజన్నేవం కృతప్రశ్నో వసుదేవేన ధీమతా ।
ప్రీతస్తమాహ దేవర్షిః హరేస్సంస్మారితో గుణైః ॥

శ్రీశుకులవారు చెప్పుచున్నారు

తా:- ఓ రాజా! ఈ ప్రకారముగా బుద్ధిమంతుడయిన వసుదేవుని చేత చేయబడి నారదుడు సంతసించి హరియొక్క గుణములచేత సంస్మరింపజేయబడినవాడై ఆ వసుదేవుని గూర్చి ఇట్లన్నాడు. 10

టీ:- హరేర్గుణైర్వర్ణనీయత్వేన ప్రస్తుతైః హరిః సంస్మారితత్యర్థః 10

టీ:- హరియొక్క గుణముల చేత వర్ణనీయుడగుట వలన ప్రస్తుతమున (గుణములచే) హరి సంస్మరింపబడినాడని తాత్పర్యము. 10

నారద ఉవాచ

11.శ్లో॥ సమ్యగేతద్వ్యవసితం భవతా సాత్త్వతర్షభ ।
యత్పృచ్ఛసే భాగవతాన్ ధర్మాంస్త్వం విశ్వపావనాన్ ॥

నారదులవారు చెప్పుచున్నారు

తా:- ఓ విష్ణు భక్తులలో శ్రేష్ఠుడా! నీవు సర్వశోభనకరములైన లోక పావనములయిన భాగవత ధర్మములను వినగోరుచూ నిశ్చయించి, ప్రశ్నించినావు. (11)

టీ:- ప్రీతిమావిష్కరోతి సమ్యగితిత్రిభిః. పృచ్ఛసే పృచ్ఛసి విశ్వపావనాన్ సర్వశోధకాన్. (11)

టీ:- ప్రీతిని ఆవిష్కరించుచున్నాడు సమ్యగనెడి మూడు శ్లోకములచే పృచ్ఛసే అడుగుచున్నావు, లోకపావనములయిన. (11)

12.శ్లో॥ శ్రుతో ను పఠితో ధ్యాతః ఆదృతో వానుమోదితః ।
సద్యః పునాతి సద్ధర్మో దేవ విశ్వద్రుహోఽపి హి ॥

తా:- ఓ వసుదేవా ! ఉత్తమమగు భాగవత ధర్మము విన్నా, పఠించినా, ధ్యానించినా, ఆదరించినా, ఆమోదించిననూ లోకద్రోహులను సైతము తత్క్షణమే పవిత్రులను చేయును. (12)

టీ:- ఆదృతః ఆస్తిక్యేనగృహీతః, అనుమోదితః పరైః క్రియమాణః సంస్తుతః, సద్ధర్మో భాగవతోధర్మః. దేవ! హే వసుదేవ! ఇత్యర్థః. యద్వా దేవేభ్యో విశ్వస్మై చ ద్రుహ్యంతి యే తానపి (12).

టీ:- ఆదృతః ఆస్తిక్యముగా స్వీకరించిన, అనుమోదితః ఇతరులచేత స్తుతింపబడిన, సద్ధర్మము భాగవతధర్మము. దేవ ! వసుదేవా అని అర్థము. లేదా దేవతలకు విశ్వమునకు ద్రోహము చేయు వారెవరో వారిని కూడా (12).

13.శ్లో॥ త్వయా పరమకల్యాణః పుణ్యశ్రవణకీర్తనః ।
స్మారితో భగవానద్య దేవో నారాయణో మమ ॥

తా:- ఓ వసుదేవా! పరమకళ్యాణుడు, పుణ్యములయిన నామ శ్రవణ కీర్తనలు కలవాడు భగవానుడగు నారాయణుడు నీచే నాకు స్మరింప చేయబడినాడు.(13)

టీ:- కిం చ త్వయా మహానుపకారః కృతః ఇత్యాహత్వయేతి. పుణ్యే శ్రవణకీర్తనే యస్య సః (13.)

టీ:- మరియు నీచే మహాఉపకారము చేయబడినది అని అనుచున్నాడు త్వయా అని. పుణ్యములయిన శ్రవణకీర్తనలు ఎవనికోవాడు. (13)

14.శ్లో॥ అత్రాప్యుదాహరంతీమం ఇతిహాసం పురాతనమ్ ।
ఆర్షభాణాం చ సంవాదం విదేహస్య మహాత్మనః ॥

తా:- ఆర్యా! భగవద్ధర్మ నిర్ణయము నందు ఋషభుని పుత్రులకును, మహాత్ముడు విదేహరాజునకు, నిమికి జరిగిన సంవాదమును చెప్పుదురు. (14)

టీ:- అత్రాపి భగవద్ధర్మ నిర్ణయేఽపి. విదేహస్య నిమేర్జనకస్య। (14)

టీ:- ఇచ్చట భగవద్ధర్మ నిర్ణయమునందునూ, విదేహుని జనకుని. (14)

15.శ్లో॥ ప్రియవ్రతో నామ సుతో మనోస్స్వాయంభువస్య యః ।
తస్యాగ్నీధ్రస్తతో నాభిః ఋషభస్తత్సుతః స్మృతః ॥

తా:- స్వాయంభువమనువు పుత్రుడు ప్రియవ్రతుడు అతని కుమారుడు ఆగ్నీధ్రుడు వాని కుమారుడు నాభి, వాని పుత్రుడు ఋషభుడు (15)

టీ:- ఆర్షభాణాముత్పత్తిం సాన్వయాం వివిచ్య కథయతి ప్రియవ్రత ఇతి సప్తభిః. (15)

టీ:- ఋషభ కుమారులు ఉత్పత్తిని వంశముతో సహా వివరించి చెప్పుచున్నాడు. ప్రియవ్రత అనెడి ఏడు శ్లోకములచే (15)

16.శ్లో॥ తమాహుర్వాసుదేవాంశం మోక్షధర్మవివక్షయా ।
అవతీర్ణం సుతశతం తస్యాసీద్బ్రహ్మపారగమ్ ॥

తా:- మోక్షధర్మ వివక్షచే అవతరించిన వాసుదేవాంశముగా ఆ ఋషభుడిని పేర్కొంటారు. అతనికి వేదములను బాగా తెలిసికొన్న నూర్గురు కొడుకులు కలిగినాడు. (16).

టీ:- మోక్ష ధర్మ వివక్షయా మోక్ష ధర్మాణాం ప్రవర్తనేచ్ఛయ అవతీర్ణం వాసుదేవాంశమాహుః తస్య చ బ్రహ్మ పారగం వేద పారగం సుతశత మాసీత్ (16)

టీ:- మోక్షధర్మములను ప్రవర్తింపచేయు ఇచ్ఛచే అవతరించిన వాసుదేవాంశమని అందురు. అతనికి వేదము బాగుగా తెలిసిన వందమంది కుమారులు ఉండిరి. (16).

17.శ్లో॥ తేషాం వై భరతో జ్యేష్ఠో నారాయణ పరాయణః ।
విఖ్యాతం వర్షమేతద్యత్ నామ్నా భారతమద్భుతమ్ ॥

తా:- ఆ నూర్గురి కుమారులలో జ్యేష్ఠుడు భరతుడు. నారాయణ పరాయణుడు. విష్ణుభక్తుడు. అతని పేరిటనే ఈ వర్షమునకు భారతమని ప్రసిద్ధికెక్కినది. (17)

టీ:- తేషామృషభ సుతానాం మధ్యే నవయోగీశ్వరాణాం చరితం వక్తుమితరేషాం చరితం తతో వివిచ్యాహం-తేషామితి. ఏతదజనాభం నామవర్షం యస్యనామ్నా భారతమిత్యద్భుతం విఖ్యాతమాసీత్ . ఏతేన తస్యధర్మతిరేకో నిరూపితః (17)

టీ:- ఆ ఋషభదేవుని సుతులలో నవయోగీశ్వర చరిత్ర, చెప్పబోతూ ఇతరచరిత్రను వివేచించి చెప్తున్నాడు తేషామని. ఈ అజనాభమనే వర్షమే ఎవనియొక్క పేరున భారతమని అద్భుతమైన విఖ్యాతినొందినది దీనిచే ధర్మాతిశయము చెప్పబడినది (17).

18.శ్లో॥ స భుక్తభోగాం త్యక్త్వేమాం నిర్గతస్తపసా హరిమ్ ।
ఉపాసీనస్తత్పదవీం లేభే వై జన్మభిస్త్రిభిః ॥

తా:- ఆ భరతుడు రాజ్యభోగాలను అనుభవించి భూరాజ్యమును త్యజించి గృహము నుండి వెళ్ళిపోయి విష్ణువును సేవిస్తూ మూడు జన్మలచే వైష్ణవధామమును పొందెను.(18)

టీ:- ఇమాం పృథ్వీం. గృహాన్నిర్గతః.హరిముపాసీనః సేవమానః(18)

టీ:- ఈ పృథ్విని, గృహము నుండి బయలుదేరి విష్ణువును సేవించుచూ (18)

19.శ్లో॥ తేషాం నవ నవద్వీప పతయోఽస్య సమంతతః ।
కర్మతంత్ర ప్రణేతార ఏకాశీతిర్ద్విజాతయః ॥

తా:- వారిలో తొమ్మండుగురు ఈ భారతవర్షము నందలి జంబూ ద్వీపము మొదలయిన తొమ్మిది ద్వీపములకు ప్రభువులైరి. యెనుబది యొక్క మంది కర్మమార్గ ప్రవర్తకులయిన బ్రాహ్మణులైరి. (19)

టీ:- నవసుతాః నవద్వీప పతయో నవానాం బ్రహ్మావర్తాది భూఖండానాం పతయః . అస్య భారతస్య వర్షస్య. ఏకాశీతిః సుతాః కర్మమార్గ ప్రవర్తకాః బ్రాహ్మణా అభూవన్. (19)

టీ:- తొమ్మండుగురు సుతులు నవదీపములకు పతులు బ్రహ్మావర్తాది నవఖండములకు పతులు. అస్య భారతవర్షమునకు. ఎనభయి ఒక్క మంది కర్మమార్గ ప్రవర్తకులయిన బ్రాహ్మణులయిరి. (19)

20.శ్లో॥ నవాభవన్మహాభాగాః మునయో హ్యర్థశంసినః ।
శ్రమణా వాతరశనా ఆత్మవిద్యావిశారదాః ॥

తా:- ఆ తొమ్మండుగురు మునులు మహాత్ములు పరమార్థ నిరూపకులు. ఆత్మాభ్యాసమందు శ్రమ చేసినవారు. ఆత్మ విద్యయందు నిష్ణాతులైనారు.(20)

టీ:- అర్థశంసినః పరమార్థ నిరూపకాః. శ్రమణాః శ్రమవంతః, ఆత్మాభ్యాసే కృతశ్రమాః ఇత్యర్థః. వాతరశనాః దిగంబరాః. ఆత్మ విద్యాయాం విశారదాః నిష్ణాతాః (20,21)

టీ:- అర్థశంసులు - పరమార్థ నిరూపకాలు శ్రమణులు శ్రమవంతులు ఆత్మాభ్యాసమున కృతశ్రములు అని అర్థము.వాతరశనులు దిగంబరులు ఆత్మ విద్యలో విశారదులు నిష్ణాతులు. (20,21)

21.శ్లో॥ కవిర్హరిరంతరిక్ష ప్రబుద్ధః పిప్పలాయనః ।
అవిర్హోత్రో ద్రమీళశ్చ చమసః కరభాజనః ॥

తా:- కవి, హరి, అంతరిక్ష, ప్రబుద్ధ, పిప్పలాయన, ఆవిర్హోత్ర, ద్రుమిళ, చమస, కరభాజనులని తొమ్మండుగురి పేర్లు. (21)

22.శ్లో॥ త ఏతే భగవద్రూపం విశ్వం సదసదాత్మకం ।
ఆత్మనోఽవ్యతిరేకేణ పశ్యంతో వ్యచరన్ మహీమ్ ॥

తా:- ఆ తొమ్మండుగురు సదసదాత్మకమన విశ్వమున భగవంతుని రూపముగా, తన ఆత్మకంటే అవ్యతిరేకముగా, చూచుచూ మహిని సంచరించిరి.(22)

టీ:- తేషాం పారమహంస్యం చరితమాహ - త ఇతి ద్వాభ్యాం. భగవద్రూపం విశ్వం పశ్యంతః. సదసదాత్మకం స్థూలసూక్ష్మరూపమ్. తచ్చ స్వావ్యతిరేకేణ పశ్యంతః (22).

టీ:- ఆ తొమ్మండుగురి పారమహంస్య చరితను చెప్పుచున్నాడు త ఏత అనెడి రెండు శ్లోకములచే. విశ్వమును భగవద్రూపముగా చూచుచూ, సదసదాత్మకము, స్థూలసూక్ష్మ రూపము. ఆ రూపము తమ ఆత్మ కంటే వ్యతిరిక్తముగాకుండునదిగా చూచుచు. (22).

23.శ్లో॥ అవ్యాహతేఽష్టగతయస్సురసిద్ధసాధ్య
గంధర్వ యక్షనరకిన్నర నాగలోకాన్ ।
ముక్తాశ్చరంతి మునిచారణభూతనాథ
విద్యాధరద్విజగవాం భువనాని కామమ్ ॥

తా:- ఇచ్ఛ వచ్చిన నడక గలవారై అనాసక్తులై దేవ, సిద్ధ, సాధ్య, గంధర్వ, యక్ష, నర, కిన్నెర, నాగలోకములను, మునులు చూచు భూతనాథ, విద్యాధర, ద్విజలోకములందు గోలోకమునందు స్వేచ్ఛగా సంచరింతురు. (23)

టీ:- అవ్యాహితా ప్రతిహతా గతిర్యేషాం తే. అనాసక్తాః. (23)

టీ:- అవ్యాహత అప్రతిహితమయిన ఇష్టము వచ్చినట్లు (యథేచ్ఛగా) నడక ఎవరికోవారు. ముక్తులు అనాసక్తులు. (23)

24.శ్లో॥ త ఏకదా నిమేస్సత్రం ఉపాజగ్ముర్యదృచ్ఛయా ।
వితాయమానమృషిభిః అజనాభే మహాత్మనః ॥

తా:- వారొకప్పుడు భారతవర్షము నందలి మహాత్ముడయిన విదేహరాజు, నిమి ఋషులలో కూడుకొని సత్రయాగము చేస్తూండగా అక్కడికి వచ్చిరి.(24)

టీ:- మహాత్మానా నిమేః. వితాయమానం అనుష్ఠీయమానం అజనాభే భారతవర్షే (24)

టీ:- మహాత్ముడగు నిమి యొక్క, వితాయమానం అనుష్ఠీయమానం అనుష్ఠింపబడుచున్న. అజనాభము నందు భారతవర్షమునందు.(24)

25.శ్లో॥ తాన్ దృష్ట్వా సూర్యసంకాశాన్ మహాభాగవతాన్ నృప ।
యజమానోఽగ్నయో విప్రాః సర్వ ఏవోపతస్థిరే ॥

తా:- సూర్యునితో సమానమైన వారిని మహాభాగవతులయిన వారిని చూచి యజమానియగు నిమి విప్రులగు ఋషులు, అగ్నులు, అందరునూ సమీపించిరి.(25)

టీ:- యజమానో నిమిః. అగ్నయః ఆహవనీయాదయః. విప్రాః ఋత్విగాదయః. (25)

టీ:- యజమాని నిమి, అగ్నులు, ఆహవనీయాదులు, విప్రులు, ఋత్విగాదులు. (25)

26.శ్లో॥ విదేహస్తానభిప్రేత్య నారాయణపరాయణనాన్ ।
ప్రీతస్సంపూజయాంచక్రే ఆసనస్థాన్యథార్హతః ॥

తా:- నిమి వారిని ఎదుర్కొని సంతోషించినవాడై పీఠములపై కూర్చుండబెట్టి తగినట్లుగా పూజించెను. (26)

టీ:- విదేహ ఇతి. అభిప్రేత్యజ్ఞాత్వా. (26)

టీ:- నారాయణ పరాయణులుగా విష్ణు భక్తులను తెలిసికొని.(26)

27.శ్లో॥ తాన్ రోచమానాన్ స్వరుచా బ్రహ్మపుత్రోపమాన్ నృప ।
పప్రచ్ఛ పరమప్రీతః ప్రశ్రయావనతో నృపః ॥

తా:- ఓ రాజా! తమశోభ చేతనే ప్రకాశించుచున్న వారిని, బ్రహ్మమానస పుత్రులైన సనకాదులతో సాటివచ్చువారిని ఆ రాజు వినయముతో తలవంచుకొని మిక్కిలి ప్రీతుడై ఈ విధముగా ప్రశ్నించెను. (27)

టీ:- స్వరుచైవ రోచమానాన్ న త్వాభరణాదిప్రకాశైః బ్రహ్మపుత్రోపమాన్ సనత్కుమారాదిసదృశాన్. (27)

టీ:- తమ శోభ చేతనే ఆభరణముల చేతనే గాక తమ శోభ చేతనే . బ్రహ్మమానస పుత్రులయిన సనత్కుమారాది సదృశులను. (27)

**విదేహ ఉవాచ**

28.శ్లో॥ మన్యే భగవతస్సాక్షాత్ పార్షదాన్ వో మధుద్విషః ।
విష్ణోర్భక్తా హి లోకానం పావనాయ చరంతి హి ॥

**విదేహరాజు పలుకుచున్నాడు**

తా:- మధుసూదనుడయిన విష్ణు భగవానుని ప్రత్యక్షమయిన భక్తులనుగా మిమ్ములను తలుస్తాను. విష్ణుభక్తులు లోకములను పవిత్రముచేయుటకు చరింతురు కదా. (28)

టీ:- పరమప్రీత్యా తద్దర్శనమభినందతి ద్వాభ్యాం మన్య ఇతి. నను భగవతః పార్షదానాం కథమత్రోపలబ్ధిః తత్రాహ - విష్ణోరితి విష్ణుభక్తాః లోకపావనార్థం సర్వత్ర పర్యటంతీత్యర్థః (28).

టీ:- పరమప్రేమతో వారి దర్శనమును అభినందించుచున్నాడు మన్యే అనెడి రెండు శ్లోకములతో. అయ్యా! భగవంతుని పార్షదులకిక్కడెట్లా ఉపలబ్ధి అనగా విష్ణో అని. విష్ణు భక్తులు లోకములను పవిత్రము చేయుటకై సంచరించుచుందురని అర్థము.(28)

29. శ్లో॥ దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణ భంగురః ।
తత్రాపి దుర్లభం మన్యే వైకుంఠ ప్రియదర్శనమ్ ॥

తా:– జీవులకు క్షణములో నశించునదైన మనుష్య దేహము లభించుట కష్టము. అందులోను విష్ణుప్రియులయిన భక్తుల దర్శనము దుర్లభము అని నేను తలుస్తాను. (29).

టీ:– మయా దుర్లభం లబ్ధమహో భాగ్యమిత్యాహ దుర్లభ ఇతి. బహవో దేహి భవంతి యేషాం తేదేహినో జీవాస్తేషాం క్షణభంగురోఽపి మానుషో దేహో దుర్లభః, పరమపురుషార్థసాధన్యత్వాత్ వైకుంఠః ప్రియో యేషాం, వైకుంఠస్య వా ప్రియాస్తేషాం దర్శనమ్. (29)

టీ:– నా చేత దుర్లభమయినది పొందబడినది ఆహా ఏమి భాగ్యము అనుచున్నాడు దుర్లభ అని. చాలా దేహములు ఎవరికి కలుగునో వారు దేహినః అనబడుతారు. జీవులు అని అర్థము వారికి క్షణ భంగుర మయినప్పటికినీ మనుష్య దేహము దుర్లభమయినది, పరమపురుషార్థ సాధనమయ్యున్నందున. వైకుంఠుడు (విష్ణువు) ప్రియుడు ఎవరికో, వైకుంఠునికి ప్రియులెవరో వారిదర్శనము. (29).

30. శ్లో॥ అత ఆత్యంతికం క్షేమం పృచ్ఛామో భవతోఽనఘాః ।
సంసారేఽస్మిన్ క్షణార్ధోఽపి సత్సంగశ్శేవధిర్నృణామ్ ॥

తా:– అందువలన ఓ పాపరహితులారా! మిమ్ములను నాశరహితమైన నిత్యమైన మోక్షమును గూర్చి ప్రశ్నించుచున్నాము. ఈ సంసారమందు అర్ధక్షణమైననూ సాధు సంగమము నరులకు నిధియే. (30)

టీ:– హే అనఘా, నిరవద్యాః. భవతోయుష్మానాత్యంతికం క్షేమం పృచ్ఛామః. యతః క్షణార్ధకాల భావోపి సత్సంగః శేవధిర్నిధిః నిధిలాభే యథా ఆనందో భవతి తథాత్ర పరమానంద ఇత్యర్థః. (30).

టీ:– హే అనఘులారా! పాపరహితులారా! మిమ్ములను నాశరహిత మయిన క్షేమమును (మోక్షమును) అడుగుచున్నాము.! ఎందుకనగా అర్థక్షణము కాలమాత్రమయిననూ సత్సంగము నిధియే కదా, నిధి లభించుట వలన ఎట్టి ఆనందమవుతుందో అట్లే ఇచ్చట పరమానంద మవుతుందని యర్థము. (30)

31.శ్లో॥ ధర్మాన్ భాగవతాన్ బ్రూత యదినశ్శ్రుతయే క్షమం ।
యైః ప్రసన్నః ప్రపన్నాయ దాస్యత్యాత్మానమప్యజః ॥

తా:- మాకు వినుటకు తగినదైనచో భాగవత ధర్మములను చెప్పండి. ఏ వాటిని వినుట వలన ప్రసన్నుడై తనను శరణు పొందినవానికి తనను సైతము విష్ణువు ఇవ్వగలడో.(వాటిని బోధించండి) (31)

టీ:- తదర్థం చ భాగవతాన్ధర్మాన్బ్రూత, యదినోఽస్మాకం శ్రుతయే శ్రవణాయ క్షమం యోగ్యం భవతి . కథం భూతాన్, యైర్ధర్మైః ప్రపన్నాయ భక్తాయాజా హరిరాత్మానమపి దాస్యతి తాన్ । (31).

టీ:- అందులకని భాగవత ధర్మములను చెప్పండి ఒకవేళ మేము వినుటకు యోగ్యులమయినచో, ఎట్టి ధర్మములు, ఏ ధర్మముల వలన తనను శరణు పొందిన భక్తునికి అజుడయినహరి తననుతానిచ్చుకో గలడో అట్టి ధర్మములను. (బోధించమని అడిగెను) (31)

నారద ఉవాచ :-

32.శ్లో॥ ఏవం తే నిమినా పృష్టాః వసుదేవ మహత్తమాః ।
ప్రతిపూజ్యా బ్రువన్ ప్రీత్యా ససదస్యర్త్విజం నృపమ్ ॥

నారదుడు చెప్పుచున్నాడు

తా:- ఈ విధముగా నిమిచే ప్రశ్నింపబడిన గొప్పవారయిన ఆ మునులు సదస్సులతో ఋత్విజులతో కూడిన రాజును ఆదరించి ప్రీతితో ఇట్లు చెప్పిరి.(32)

టీ:- సహసదస్యై ఋుత్విగ్భిశ్చ వర్తమానమ్. తేఽపి భగవద్ధర్మ శ్రవణపరా బభూవురిత్యర్థః. "భగవద్ధర్మ తత్భక్త మాయా తత్తరణాని చ. బ్రహ్మ కర్మావతారేహా భక్త ప్రాప్యయుగక్రమాన్. జ్ఞాతం క్రమేణ కృతవాన్ నవప్రశ్నాన్ నిమిర్నవ. ఏకైక స్యోత్తరం ప్రాచుః కవిముఖ్యా మునీశ్వరాః. (32)

టీ:- సదస్యులు ఋత్విక్కులతో కూడియున్న. వారుకూడా భగవద్ధర్మ పరులయినారని యర్థము. భగవద్ధర్మము, తద్భక్తులు మాయాతరణము, బ్రహ్మము, కర్మ, వాంఛ, భక్తప్రాప్యము, యుగక్రమము అనే వాటిని తెలియుటకు క్రమముగా నిమి తొమ్మండుగురు ఆ ప్రశ్నలకు ఒక్కొక్క ప్రకారముగా ఉత్తరములు చెప్పినారు. (32).

కవిరువాచ :-

33.శ్లో॥ మన్యేऽకుతశ్చిద్భయమచ్యుతస్య
పాదాంబుజోపాసనమత్ర నిత్యమ్ ।
ఉద్విగ్నబుద్ధేరసదాత్మభావాత్
విశ్వాత్మనా యత్ర నివర్తతే భీః ॥

కవి చెప్పుచున్నాడు

తా:- అసత్తగు దేహాదికమునందు ఆత్మ భావము వలన ఎల్లప్పుడూ కలత చెందిన బుద్ధి గల పురుషునికి, పూర్తిగా ఏ పాదాంబుజోపాసన వలన భయము నివర్తించుచున్నదో, ఈ సంసారము నందు అచ్యుతుని యొక్క పాదకముల ఉపాసనము వలన దేనివలననూ భయము లేనిదని తలుచుచున్నాను. (33)

టీ:- ప్రథమమాత్యంతికం క్షేమం కథయతి మన్యఇతి. న కుతశ్చిద్భయం యస్మాత్తదకుతశ్చిద్భయం. అత్ర సంసారే అదాత్మ భావాదసతి దేహాదావాత్మ భావనాతో నిత్యం సర్వదోద్విగ్న బుద్ధేః విశ్వాత్మనా సర్వథా నిశ్శేషం యత్ర పాదాంబుజోపాసనేభీర్నిర్వరంతే తత్. (33).

టీ:- మొట్టమొదట ఆత్యంతికమైన క్షేమమును చెప్పుచున్నాడు మన్యే అని. దేనివలనను భయము లేనిది. అకుతశ్చిర్థం ఈ సంసారము నందు అసదాత్మభావము వలన అసత్తయిన దేహాదుల యందాత్మ భావన వలన నిత్యం సర్వదా ఎల్లప్పుడు కలత పొందిన పురుషునికి. విశ్వత్మనా పూర్తిగా నిశ్శేషముగా ఏ పాదాంబుజో పాసన వల్ల భయము నివృత్తి అవుతుందో అది. (33)

34.శ్లో॥ యే వై భగవతా ప్రోక్తాః ఉపాయా ఆత్మలబ్ధయే ।
అంజః పుంసామవిదుషాం విద్ధి భాగవతాన్ హి తాన్ ॥

తా:- ఏవి ఆత్మ ప్రాప్తికి ఉపాయములుగా చెప్పబడినవో అజ్ఞులయిన పురుషులకు సుఖముగా ప్రాపించు వానినే భాగవత ధర్మములుగా తెలిసికొనుము. (34).

టీ:- భాగవతధర్మ లక్షణమాహ - యే వై ఇతి మన్వాది ముఖేన వర్ణాశ్రమాది ధర్మానుక్త్వాऽతిరహ్యా త్వాత్స్వముఖేనైవ భగవతాऽ విదుషామపి పుంసామంజః సుఖెనైవాత్మలబ్ధయే యేవై ఉపాయాప్రోక్తా స్తాన్భాగవతాన్ధర్మాన్విద్ధి. (34).

టీ:- భాగవతధర్మ లక్షణమును చెప్పుచున్నాడు యే వై అని. మన్వాది ధర్మశాస్త్రకారులు వర్ణాశ్రమాది ధర్మములను గూర్చియే తెలిపినారు. అవి అతి రహస్యములగుట వలన సామాన్యజ్ఞానము కలవారికి సరిగా బోధపడవు. అందుకై భగవంతుడు సామాన్య జ్ఞానము కలవారికి కూడా సుఖముగా ఆత్మ లాభమునకై కొన్ని ఉపాయములను బోధించెను. అవియే భాగవత ధర్మాలుగా తెలిసికొనుము. (34).

35.శ్లో॥ యానాస్థాయ నరో రాజన్ న ప్రమాద్యేత కర్హిచిత్ ।
ధావన్ నిమీల్య వా నేత్రే న స్ఖలేన్న పతేదిహ ॥

తా:- ఓ రాజా! నరుడు ఏ ధర్మములను ఆశ్రయించి ఎప్పుడునూ ప్రమాదమును పొందడో, మరియూ నేత్రములను మూసికొని పరుగెత్తుచున్నవాడైననూ ఈ భాగవత ధర్మములందు జారడో పడడో. (పతితుడుగాకుండా ఉండును) (35)

టీ:- అంజః పదేనోక్తం సుకరత్వం వివృణోతియానితి. యానాస్థా యాశ్రిత్య యోగాదిష్వివ న ప్రమాద్యేత విఘ్నైర్న విహన్యేత. కిం చ నిమీలనం నామాత్రాజ్ఞానమ్. యథాహుః"శృతిస్మృతీ ఉభేనేత్రే విప్రాణాం పరికీర్తితే. ఏకేన వికలః కాణో ద్వాభ్యామంధః ప్రకీర్తిత" ఇతి జ్ఞాత్వా పీత్యర్థః. యథా పదన్యాస స్థానమతిక్రమ్య శీఘ్రం పరతః పద న్యాసేన గతిర్ధావనం తద్వదత్రాపి కించిత్కించిదతిక్రమ్యాతి శీఘ్రంనుష్ఠానం ధావనమ్. తథా అనుష్ఠితస్సన్నపి న స్ఖలేత్ ప్రత్యవాయీ స్యాత్. తథా

టీ:- అంజ పదముచే చెప్పబడిన సుకరత్వమును వివరించుచున్నారు. యావని. ఏ ధర్మముల నాశ్రయించి యోగాదుల యందువలె ప్రమాదమును పొందడో విఘ్నములచే దుఃఖితుడు కాడో, మరియు నేత్రములను మూసుకొని పరుగెత్తుచున్నవాడైననూ, ఇహ ఈ భాగవత ధర్మముల యందు నస్ఖలేత్ జారడో, నిమీలనమనగా అజ్ఞానము ఇందుకు ప్రమాణము. "శృతిస్మృతీ" అనెడి శ్లో. శృతిస్మృతులు రెండు (వేదము మన్వాదిస్మృతులు)నూ బ్రాహ్మణునికి నేత్రములని చెప్పబడును.

నపతేత్ఫలాన్న భ్రశ్యేత్. (బ్రాహ్మణాదీనాముక్తానపి ధర్మాన్కాంశ్చిద కుర్వాణో భాగవతాన్ధర్మాన్ శ్రవణ కీర్తనాదీన్కుర్వాణ స్తత్ఫలం ప్రాప్నుయా దిత్యర్థః. (35.)

ఒకటి లేనివాడు ఒంటికంటివాడు. రెండు లేనివాడు గుడ్డివాడు" అని అర్థము, ఈ భాగవతధర్మములను ఆశ్రయించిన నరుడు ఎప్పుడు దేని వలననూ ప్రమాదమును పొందదు. కన్నులు మూసుకొని పరుగెత్తుచున్ననూ ఈ భాగవతధర్మములందు జారిపడదు. అజ్ఞుడైననూ భ్రష్టుడు కాదని అర్థము (కన్నులు మూసికొనుట అనుట అజ్ఞానము) కాలును తీసి తొందరగా వేరొక చోట పాదమును మోపుట ధావనమనబడుతుంది ఎట్లానో అట్లే కొంత కొంత అతిక్రమించి అతి శీఘ్ర అనుష్ఠానమే ధావనము, అట్లుపడదు ఫలము నుండి భ్రష్టుడు కాడు (బ్రాహ్మణాదులకు ధర్మములు చెప్పబడినవి యే అయినప్పటికినీ కొన్నిటిని ఆచరించక శ్రవణ కీర్తనాదులను చేయుట వలననూ ఆ ఫలమును పొందగలడని అర్థము) (35).

36. శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వానుసృతస్స్వభావాత్ ।
కరోతి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయేత్తత్ ॥

తా:- శరీరముచేత, వాక్కుచేత, మనస్సుచేత, ఇంద్రియములచేత, బుద్ధిచేత, చిత్తము లేక అహంకారముచేత అనుసరింపబడిన స్వభావము వలన ఏది యేది చేయుచున్నాడో ఆసర్వమూ పరమాత్మ ఐన నారాయణుని కొరకు అని సమర్పించవలెను. (36)

టీ:- నను కే తే భాగవతాధర్మా. ఈశ్వరార్పితాని సర్వకర్మాణ్యపీత్యాహ కాయేనేతి. ఆత్మనా చిత్తేనాహంకారేణ వా. అనుసృతో యః

టీ:- అయ్యా ! భాగవత ధర్మము లేవి? ఈశ్వరార్పితములయిన సర్వ కర్మములు కూడా భాగవత ధర్మములే అనుచున్నాడు. కాయేన అని .

స్వభావస్తస్మాత్. అయమర్థః నకేవలం విధితః కృతమేవేతి నియమః స్వభావానుసారి లౌకికమపీతి. తథా చ భగవద్గీతాసు– "యత్కరోషి యదశ్నాసియజ్జుహోసిదదాసియత్. యత్తపస్యసికౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్"ఇతి. యద్వా నను కాయాదీనామేవ కర్మ నాత్మన ఇత్యాశంక్యాహ – అధ్యాసేనానుసృతాద్బ్రాహ్మణత్వాద్విభావాద్యద్యత్కరో తీత్యర్థః. తత్సకలంపరస్మై పరమేశ్వరాయ నారాయణాయేతి సమర్ప యేత్. తథా సతిసకలమపికర్మ భాగవతో ధర్మోభవతీతి భావః(36)

ఆత్మనాయన చిత్తముచే లేదా అహంకారముచే. అనుసృతమయిన ఏ స్వభావము కలదో దాని నుండి. (అనుసరింపబడిన స్వభావము వలన) దీని యర్థము విధి విహితమయినది. లౌకికము కూడా అని. భగవద్గీత యందు కూడా "ఏది చేయుచున్నావో ఏది తినుచున్నావో. ఏది హోమము చేయుచున్నావో ఏది దానము చేయుచున్నావో ఏ తపస్సును చేయుచున్నావో అది యంతయు నాయర్పణ చేయుము" అని చెప్పబడినది. లేదా, అయ్యా ! శరీరాదులకే కర్మ ఆత్మకు కాదు అని ఆశంకించి చెప్పుచున్నాడు – ఆధ్యాస వలన నుసరింపబడిన బ్రాహ్మణత్వాది భావముతో ఏదేది చేయుచున్నాడో అని అర్థము. ఆ సకల కర్మ పరమ పరమేశ్వరుడయిన నారాయణునికి సమర్పించాలి. అట్లయినచో సకలమయిన కర్మ కూడా భాగవత ధర్మమవుతుందని భావము. (36).

37.శ్లో॥ భయం ద్వితీయాభినివేశతస్స్యాత్
ఈశాదపేతస్య విపర్యయోऽస్మృతిః ।
తన్మాయయాతో బుధ అభజేత్తం
భక్త్యైకయేశం గురుదేవతాత్మా ॥

తా:– రెండవ వస్తువు వున్నదన్న భావము కలిగినప్పుడు భయము కలుగును. ఈశ్వరుని నుండి తొలగిన వానికి ఆదేవుని మాయచే భగవంతుని స్వరూప స్ఫూర్తి లేక పోవుట కలుగుచున్నది. అందువలన దేహము నేను అనే విపరీత భావము కలుగుచున్నది. ఇందువలన బుద్ధిమంతుడు గురువును దేవతా స్వరూపముగా భావించి, ఏకాంత భక్తి చేత ఆ పరమేశ్వరుని భజించవలెను.(37)

టీ:- నను కిమేవం పరమేశ్వరభజనేన, అజ్ఞాన కల్పిత భయస్యజ్ఞానైక నివర్త్యత్వాదిత్యాశంక్యాహ- భయమితి. యతో భయం తన్మాయయా భవేదతో బుధో బుద్ధి మాంస్తమేహభజేత్ నను భయం దేహాద్యభినివేశతో భవతి, స చ దేహోऽహంకారతః, స చ స్వరూపాస్మరణాత్. కిమత్ర తస్య మాయాకరోత్యత ఆహ- ఈశాదపేతస్యేతి. ఈశ విముఖస్య తన్మాయయాऽస్మృతిర్భగవతః స్వరూపాస్ఫూర్తిస్తతో విపర్యయో దేహోऽస్మీతి తతో ద్వితీయాభినివేశాద్భయం భవతి. ఏవం హి ప్రసిద్ధం లౌకికీష్వపి మాయాసు. ఉక్తం చ భగవతా- "దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా. మామేవ యేప్రపద్యన్తే మాయామేతాం తరంతి తే" ఇతి. ఏకయా అవ్యభిచారిణ్యా భక్త్యాభజేత్. కిం చ గురుదేవతాత్మా గురుదేవతా ఈశ్వరః ఆత్మా ప్రేష్ఠశ్చ యస్య. తథా దృష్టిః సన్నిత్యర్థః. (37).

టీ:- అయ్యా! ఈ ప్రకారము పరమేశ్వర భజనచే ఏమి ప్రయోజనము? అజ్ఞాన కల్పితమయిన భయము కేవలము జ్ఞానము చేతనే నివర్తింప నగును కదా అని ఆశంకించి చెప్పుతున్నారు. భయం ద్వితీయాత్ అని భయమనునది తన్మాయ వలన అగును అందులకు బుధుడు బుద్ధిమంతుడు ఆ పరమేశ్వరుడినే భజించవలెను. అయ్యా! భయము దేహాభిమానము వలన కలుగుతుంది. ఆ యభిమానము అహంకారము వలన కలుగుతున్నది. అది కూడా స్వరూప స్మరణ లేనందు వలన కలుగుతుంది. ఈ విషయాన్ని మాయ ఏమి చేయును అనుశంకకు ఈశాదపేతస్య అనిచెప్పుచున్నాడు. ఈశ్వర విముఖుడయిన వానికి తన్మాయచే అస్మృతి భగవత్సంబంధమయిన స్వరూపాస్ఫూర్తి భగవంతుని స్వరూప స్ఫూర్తి లేనందువలన విపర్యయము దేహము నేనను భావము. దాని వలన ద్వితీయాభినివేశము రెండవ వస్తువున్న దనెడి భావము. అందువలన భయము కలుగుచున్నది. ఈ ప్రకారము లౌకిక మగు మాయల యందునూ ప్రసిద్ధము భగవంతుడు గీత యందు చెప్పినాడు "దైవీహ్యేషా" అని. త్రిగుణాత్మకమగు దైవమాయ అతిక్రమింపరానిది. ఎవరు నన్ను శరణు పొందుదురో వారు మాయను దాటుదురు అని. ఏకయాభక్త్యా అనగా అవ్యభిచారిణి అయిన భక్తితో భజించవలెను. మరియు గురుదేవతాత్మా గురువే దేవతాస్వరూపుడు. ఆత్మ గొప్పనిది అని యెవనికో, అట్టి దృష్టితో కూడుకొని (గురువును దైవముగా భావించి గురువు దేవతా స్వరూపుడు కాగలవాడై. (37)

38. శ్లో॥ అవిద్యమానోఽప్యవభాసతే ద్వయోః
ధ్యాతుర్ధియా స్వప్నమనోరథా యథా ।
తత్కర్మసంకల్పవికల్పకం మనో
బుధో నిరుంధ్యాదభయం తతస్స్యాత్ ॥

తా:- ద్వైతప్రపంచము పూర్వము లేకుండునదైనను ఉన్నట్లు భాసించుచున్నది. ధ్యానించు పురుషుని బుద్ధిచే స్వప్నము కోరిక అనునవి ఏ ప్రకారముగా జనించుచున్నవో, అందువలన కర్మలను సంకల్పించుచు వికల్పించుచునుండు మనస్సును విద్వాంసుడు నిరోధించవలెను. అందువలన అభయము కలుగు. (38)

టీ:- నను విషయ విక్షిప్త చిత్తస్య కుతోఽవ్యభిచారిణీ భక్తిః సంభవతి, కుతస్తరామభయం. తత్రవతావద్విషయో నామ వాస్తవోఽస్తి, కిం తు మనోవిలాసమాత్రమతో మనోనియమనేన భజనాదభయం స్యాదిత్యాహ – అవిద్యమానీపితి ద్వయః ద్వైతప్రపంచః ఏషః ప్రాగవిద్యమానోఽపి అవభాసతే ప్రకాశతే ధ్యాతుః పుంసో ధియా మనసా స్వప్నశ్చ మనోరథశ్చ యథా ఇత్యర్థః. తత్తస్మాత్కర్మాణి సంకల్పయతి వికల్పయతి చ. యన్మనస్తన్నిరుధ్యాన్నియచ్ఛేత్. తతశ్చైకయా భక్త్యా భజనాదభయం స్యాదిత్యర్థః (38).

టీ:- అయ్యా! విషయ విక్షిప్త చిత్తునికి అవ్యభిచారిణియగు భక్తి ఎట్లు కలుగును? ఏ విధముగా భయమును దాటుదుము? అని శంక రాగా విషయమనునది వాస్తవముగా లేదు. మనో విలాసము మాత్రమే అందువలన మనో నియమముచే భజించుట వలన అభయము కలుగునని చెప్పుచున్నారు. అవిద్య మానోపి అని. ద్వయః ద్వైత ప్రపంచము, స్వప్నము, మనోరథము ఏ ప్రకారముగా జనించుచున్నవో అని యర్థము. అందువలన కర్మలను సంకల్పించుచు వికల్పించుచున్న ఏ మనస్సు కలదో దానిని నిరోధించవలెను. అందువలన అభయము కల్గును. (38)

39.శ్లో॥ శృణ్వన్ సుభద్రాణి రథాంగపాణేః
జన్మాని కర్మాణి చ యాని లోకే ।
గీతాని నామాని తదర్థకాని
గాయన్విలజ్జో విచరేదసంగః ॥

తా:- చక్రహస్తుడయిన విష్ణువు యొక్క మంగళకరమయిన అవతారములను, ఆ యవతారకృత్యములను ఏవి లోకమున ప్రసిద్ధములై గానము చేయబడినవో వానిని వింటూ ఆ జన్మ కర్మములు విషయములు గాగల నామములను పాడుతూ సిగ్గు విడిచినవాడై సంగరహితుడై చరించాలి. (39)

టీ: ఏతదత్యంతాశక్యమిత్యాశంక్య సుగమం మార్గమాహ - శృణ్వన్నితి తదర్థకాని తాన్యేవ జన్మాని కర్మాణి - చార్థో యేషాం తాని ఏతాన్యపి సాకల్యేన జ్ఞాతుమశక్యానీత్యాశంక్యాహ - యాని లోకే గీతాని ప్రసిద్ధాని తాని శృణ్వన్గాయంశ్చ విచరేత్. అసంగో నిస్పృహః(39)

టీ:- ఇది చాలా కష్టతరమయినది యని ఆశంకించి సుగమమయిన మార్గమును చెప్పుచున్నాడు శృణ్వన్నని. ఆ జన్మ కర్మలు విషయములుగా కల. (ప్రయోజనములు కలవి ఏవి కలవో వానిని) ఇవి కూడా సాకల్యముగా తెలిసికొనుట అశక్యము కదా అని శంకించి చెప్పుచున్నారు యానిలోకే గీతాని అని. ఏవి లోకము నందు ప్రసిద్ధములై గానము చేయబడినవో వానిని వినుచు పాడుచు చరించవలెను. అసంగిః నిస్పృహుడు. (39).

40.శ్లో॥ ఏవం వ్రతస్స్వప్రియ నామకీర్త్యా
జాతానురాగో ధృతచిత్త ఉచ్చైః ।
హసత్యసౌ రోదితి రౌతి
గాయత్యున్మాదవన్నృత్యతి లోకబాహ్యః ॥

తా:- ఇటువంటి వర్తనము కలవాడు తనకు ప్రియుడైన హరినామ కీర్తనచే హరియందు పుట్టిన ప్రేమ కలవాడును. దృఢమైన మనస్సు గలవాడును అయిన ఈ భక్తుడు. నవ్వును, ఏడ్చును, కూయును, పాడును పిచ్చివాని వలె లోకబాహ్యుడై ఆడును.(40)

టీ:- ఏవం చ భజతః సంప్రాప్త ప్రేమలక్షణభక్తి యోగస్య సంసార ధర్మాతీతాం గతిమాహ-ఏవమితి. ఏవం వృతం ఏవం వృత్తం యస్య సః. స్వప్రియస్య హరేర్నామ కీర్త్యా జాతో అనురాగః ప్రేమ యస్య సః అతేవ ద్రుత చిత్తః శ్లథధ్ధృదయః. కదాచిత్ భక్తి పరాజితం భగవంత మాకలయ్యోచ్ఛైర్హసతి. ఏతావంతం కాలముపేక్షితోస్మీకేతి రోదితి. ఔత్యోత్సుక్యాద్రౌతిక్రోశతి. హేహరే! మామనుగృహాణేతి. అతి హర్షేణ గాయతి జితం జితమితి నృత్యతి. కిందాంభికవత్పరాన్ప్రతి ప్రకాశయితుం, న, ఉన్మాదవద్గ్రహగృహీత ఇవ. లోకబాహ్యః వివశః (40)

తా:- ఈ ప్రకారము భజించుచూ సంప్రాప్తమయిన ప్రేమలక్షణ భక్తి యోగము గల వానికి సంసార ధర్మమునకు అతీత మయినగతిని చెప్పుచున్నాడు. ఏవమని. ఈ ప్రకారము వృత్తము కలవాడై, తనకు ప్రియుడయిన హరినామము కీర్తనముచే హరియందు జనించిన ప్రేమ గలవాడై, నిశ్చలచిత్తుడై ఒకానొకప్పుడు భక్తజితుడయిన భగవంతుని ఆకళించుకొని గట్టిగా నవ్వును. ఇంతకాల ముపేక్షితుడనయినానని ఏడ్చును అత్యుత్సాహము వలన కూయును. ఓయని అరుచును ఓ హరీ నన్ననుగ్రహించుమని ఆక్రోశించును. సంతోషముతో గానము చేయును జయించితినను హర్షముతో నాట్యము చేయును, ఇతరులకు దంభార్థము ప్రకాశించుటకై కాకుండా పిచ్చివాడువలె గ్రహము పట్టిన వానివలె లోకబాహ్యుడై వివశుడై నటించుచున్నాడు. (40)

41. శ్లో॥ ఖం వాయుమగ్నిం సలిలం మహీం చ
జ్యోతీంషి సత్త్వాని దిశో ద్రుమాద్రీన్ ।
సరిత్సముద్రాంశ్చ హరేశ్శరీరం
యత్కించ భూతం ప్రణమేదనన్యః ॥

తా :- ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, భూమి, జ్యోతిర్మండలము ప్రాణులు, దిక్కులు, వృక్షములు, నదులు, సముద్రములు ఇవి అన్నియు హరి శరీరమని భావించి నమస్కరించాలి. ఏకాంతభక్తుడై ప్రణమిల్లాలి. (41)

టీ :- కిం చ ఖమితి. సత్త్వాని భూతాని. ఆకాశాది యత్కించిద్భూత మాత్రం హరేశ్శరీరమితిమత్వా ప్రణమేత్. సంభావనామాం లిఙ్. (41)

టీ :-మఱియు ఖమని. ఆకాశమని. సత్వములు, భూతములు, ఆకాశాది ఏ కించిత్ప్రాణ జాతము కలదో వానిని హరి శరీరముగా భావించి నమస్కరించాలి. సంభావనయందు లిఙ్. (41)

42. శ్లో॥ భక్తిః పరేశానుభవో విరక్తిః
అన్యత్ర చైషత్రిక ఏకకాలః ।
ప్రపద్యమానస్య యథాశ్నతస్స్యాత్
తుష్టిః పుష్టిః క్షుదపాయోఽనుఘాసమ్ ॥

టీ :- నన్విదమారూఢ యోగానామపి బహుభిర్జన్మభిర్దుర్లభా గతిః కథం నామకీర్తనమాత్రేణైకస్మిన్నేవ జన్మని భవేదిత్యాశంక్య స దృష్టాంత మాహ - భక్తిరితి. ప్రపద్యమానస్య హరింభజతః పుంసో భక్తిః ప్రేమ లక్షణా. పరేశానుభవః ప్రేమాస్పద భగవద్రూప స్ఫూర్తిః తయా నిర్వృతస్య తతోఽన్యత్ర గృహాదిషు విరక్తిరిత్యేషత్రిక ఏకకాలో భజన సమకాల ఏవస్యాత్. యథాఽశ్నతో భుంజానస్య తుష్టిః సుఖం పుష్టిరుదరభరణం క్షున్నివత్తిశ్చ ప్రతిఘాసంస్యుః. ఉపలక్షణమేతత్. ప్రతిసిక్థమపి యథా స్యుస్తద్వత్. ఏవమేకైకస్మిన్ భజనే కించిత్ప్రేమాది త్రికే జాయమానే అనువృత్త్యా భజతః పరమప్రేమాది జాయతే. బహుగ్రాసభోజిన ఇవ పరమతుష్ట్యాది. (42)

తా :- శ్రీహరిని భజించెడి భక్తునికి ప్రేమాస్పదుడయిని భగవంతుని రూపము యొక్క స్ఫూర్తి, దానికంటే అన్యమైన గృహాదులయందు విరక్తి, ఈ మూడునూ ఈ భజన సమయమందే కలుగును. భోజనము చేయువానికి తృప్తి, కడుపునిండుట, ఆకలి తొలగిపోవుట, ప్రతి బుక్కను గూర్చి ఎట్లు కలుగునో అట్లు. (42)

టీ :- అయ్యా ! యోగులకుకూడా అనేక జన్మలెత్తిననూ ముక్తి దుర్లభము కదా, అట్టి సద్గతి నామసంకీర్తన మాత్రముచే ఒక్క జన్మయందే ఎట్లు కలుగుతుంది అని ఆశంకించి, దృష్టాంత సహిత ముగా చెప్పుచున్నాడు భక్తియని. ప్రపద్యమానస్య హరిని భజించెడి భక్తునికి భక్తి ప్రేమస్వరూపమయిన. పరుశారుభవః ప్రేమాస్పదుడయిన భగవంతుని రూపముయొక్క స్ఫూర్తి (అనుభవము) (42)

43.శ్లో॥ ఇత్యచ్యుతాంఘ్రిం భజతోऽనువృత్త్యా
భక్తిర్విరక్తిర్భగవత్ప్రబోధః ।
భవంతి వై భాగవతస్య రాజన్ తతః
పరం శాంతిముపైతి సాక్షాత్ ॥

తా:- ఈ విధముగా విష్ణుపాదయుగమును అనువృత్తిచే పునః పునః) భజించువారికి భక్తునికి భక్తి విరక్తి భగవత్ప్రసాదము కలుగుచున్నవి. తరువాత సాక్షాత్తు శాంతిని పొందుచున్నాడు.(43)

టీ:- తతశ్చ భగవత్ప్రసాదేన కృతార్థో భవతీత్యాహ ఇత్యచ్యుతాంఘ్రిమితి. (43)

టీ:- అటు తరువాత భగవత్ప్రసాదముచే కృతార్థుడగును అని చెప్పుచున్నాడు ఇత్యచ్యుతాంఘ్రిమని. (43)

నిమిరువాచ:-

44.శ్లో॥ అథ భాగవతం బ్రూత యద్ధర్మో యాదృశో నృణామ్ ।
యథా చరతి యద్బ్రూతే యైర్లింగైర్భగవత్ప్రియః ॥

నిమి చెప్పుచున్నాడు

తా:- తరువాత భక్తునిగూర్చి చెప్పండి. నరులలో ఏ ధర్మము గలవాడు, ఏ స్వభావము గలవాడో, ఏ ప్రకారము సంచరించునో, ఏమి చెప్పునో, ఏ లక్షణములచే భగవంతునికి భక్తుడగునో చెప్పండి. (44)

టీ:- భాగవతస్య భవన్తీత్యుక్తే తస్య లక్షణం పృచ్ఛతి - అథేతి యద్ధర్మోయస్మిన్ధర్మేపరినిష్ఠితః. యాదృశోయత్స్వభావః. యథా చరతి. వర్తతే, భుఙ్క్తే వా. యైర్లింగైర్భగవతః ప్రియో భవతి. (44).

టీ:- భక్తునికి శాంతి కలుగుచున్నదని చెప్పిన తరువాత ఆ భక్తుని లక్షణమును ప్రశ్నించుచున్నారు అథయని. యేధర్మము గలవాడు ఏ ధర్మమునందు పరినిష్ఠితుడై యుండును. ఏ స్వభావము గలవాడై ఏ ప్రకారము చరించును? వర్తించును. వచించును, ఏ లక్షణముల చేత భగవంతునికి ప్రియుడగును.(44)

**హరిరువాచ:-**

45. శ్లో॥ సర్వభేతేషు యః పశ్యేత్ భగవద్భావమాత్మనః ।
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః ॥

టీ:- యద్ధర్మ ఇత్యస్యోత్తరమాహ త్రయేణ, - సర్వభూతేష్వితి. ఆత్మనః స్వస్య సర్వభూతేషు భగవద్భావం బ్రహ్మభావేన సమన్వయం పశ్యేత్. తథా బ్రహ్మరూపే ఆత్మన్య ధిష్ఠానే భూతాని చ యః పశ్యేత్. యద్వా - "ఆతత్త్వాత్ప్రమాతృత్వాదాత్మా హి పరమో హరిః" ఇతి తంత్రోక్తేరాత్మనో హరేః సర్వభూతేషు మశకాదిష్వపి నియన్తృత్వేన వర్తమానస్య భగవద్భావం నిరతిశయైశ్వర్యమేవ యః పశ్యేన్నతుతస్య తారతమ్యమ్. తథాత్మని హరావేవ భూతాని చ యః పశ్యేత్. కథంభూతే. భగవతి అప్రచ్యుతైశ్వర్యాదిరూపే న పునర్జడమలినభూతాశ్రయత్వేన జాడ్యాది ప్రసక్త్యా ఐశ్వర్యాది ప్రచ్యుతం పశ్యేత్. స సర్వత్ర పరిపూర్ణం భగవత్తత్త్వం పశ్యత్ భాగవతోత్తమ ఇత్యర్థః. (45)

**హరిచెప్పుచున్నాడు**

తా:- ఎవడు సర్వభూతముల యందు బ్రహ్మభావమును ఆత్మ భావమును చూచునో, భగవంతుని యందు, ఆత్మయందును, సర్వ భూతములను చూచునో వాడు భాగవత శ్రేష్ఠుడు. (45)

తా:- ఏ ధర్మ పరినిష్ఠితుడు అను దానికి ఉత్తరమును చెప్పుతున్నాడు సర్వభూతేషు అని మూడు శ్లోకములచే. తనకు సర్వభూతముల యందు బ్రహ్మభావముచే సమన్వయమును చూడాలి. అట్లే బ్రహ్మ రూపమయిన ఆత్మ అధిష్ఠానము నందు భూతములను యెవడు చూచునో. లేదా, "అతత్వాచ్చప్రమాతృతాదని తంత్రమున చెప్పబడుట వలన ప్రమాతా, సాక్షియగు హరియే ఆత్మయగును. ఇట్లు ఆత్మయగు శ్రీహరి సర్వ భూతముల యందు మశకాదులయందునూ, నియన్తయై వుండుట చే భగవద్భావమును నిరతిశయైశ్వర్యమును ఎవడు దర్శించునో వానికి ఎటువంటి తారతమ్యములేదు. (అంతట పరిపూర్ణమయిన భగవత్తత్వ మును చూచువాడే భాగవతోత్తముడని అర్థము). అట్లే ఆత్మని హరి యందే భూతములను ఎవడు చూచునో, ఎట్టివానిని ప్రచ్యుతి కాని ఐశ్వర్యాది రూపుడయిన భగవంతుని యందు, జడమలిన భూతాశ్రయ ము వలన జాడ్యాదులు ప్రసక్తమవును. (తత్రప్రసక్త్యా) ఐశ్వర్యాది చ్యుతిని చూడరాదు. వాడు అంతట పరిపూర్ణమయిన భగవత్తత్వమును చూచుచూ (వుండుట వలన) భాగవతోత్తముడని యర్థము. (45)

46.శ్లో॥ ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ ।
ప్రేమ మైత్రీ కృపోపేక్షా యః కరోతి స మధ్యమః ॥

తా:- ఈశ్వరుని యందు ఈశ్వర భక్తులయందు, నీచులయందు, శత్రువుల యందు, వరుసగా ఈశ్వరునియందు ప్రేమ, తద్భక్తులయందు మైత్రి, నీచులయందు కృప, శత్రువులయందు ఉపేక్షచూపేవాడు భాగవత మధ్యముడు. (46)

టీ:- ప్రేమ చ మైత్రీ చ కృపా చ - ఉపేక్షా చ తాః. ఈశ్వరాదిషు చతుర్షు యః కరోతి స మధ్యమో భాగవతః. ఏవం భూతస్య భేదస్య దర్శనాత్. (46)

టీ:- ప్రేమ, మైత్రీ, కృపా, ఉపేక్షా అనునవి ఈశ్వరాదుల యందు క్రమముగా ఎవడు చేయునో వాడు మధ్యమ భాగవతుడు ఇట్టి భేదమును దర్శించుట వలన (46)

47.శ్లో॥ అర్చాయామేవ తు హరేః పూజాం యశ్శ్రద్ధయేహతే ।
న తద్భక్తేషు చాన్యేషు స భక్తః ప్రాకృతస్మృతః ॥

తా:- ప్రతిమ యందు హరిపూజను శ్రద్ధతో ఎవడు కోరుచున్నాడో, భగవంతుని భక్తులలో పూజను కోరడో ఇతరులను పూజింపగోరడో, అతడు ప్రాకృతుడు (ప్రారంభకుడు) క్రమముగా ఉత్తమ భక్తుడు కాగలడు.(47)

టీ:- అర్చాయామితి. ప్రతిమాయాం పూజామీహతే కరోతి న తద్భక్తేషు అన్యేషుచ సుతరాం న కరోతి. సః ప్రాకృతః ప్రకృతిః ప్రారంభః. అధునైవ ప్రారబ్ధశక్తిః శనైరుత్తమో భవిష్యతీత్యర్థః. (47)

టీ:- ప్రతిమయందు పూజను చేయుచున్నాడు భక్తులయందు ఇతరుల యందు అసలే పూజను చేయకోరడు. అట్టివాడు ప్రాకృతుడు ప్రారంభ కుడు క్రమముగా ఉత్తమభక్తుడు కాగలడు. (47)

48. శ్లో॥ గృహీత్వాపీంద్రియైరర్థాన్ యో న ద్వేష్టి న హృష్యతి ।
విష్ణోర్మాయామిదం పశ్యన్ స వై భాగవతోత్తమః ॥

తా:- ఎవడు ఇంద్రియములచే ఇంద్రియార్థములయిన శబ్దాదులను గ్రహించి కూడా. (దుఃఖము కలిగినప్పుడు) ద్వేషించడో, (సుఖము కల్గినప్పుడు) హర్షింపడో ఈ విశ్వము విష్ణుమాయయని చూచువాడై ఎవడు ప్రవర్తించునో వాడే భాగవతోత్తముడు. (48)

టీ:- పునరష్టభిః శ్లోకైః అభ్యర్థితత్వాదుత్తమ భాగవతస్యైవ లక్షణాన్యాహ - గృహీత్వేతి. శ్రీవాసుదేవావిష్టచేతా న గృహ్ణాతి తావదింద్రియైరర్థాన్గృహీత్వాపీత్యపి శబ్దార్థః. ఇదం విశ్వమ్. (48)

టీ:- మళ్ళీ ఎనిమిది శ్లోకములచే కోరబడువాడగుట వలన ఉత్తమ భగవంతుని లక్షణమును చెప్పుచున్నాడు గృహీత్వాపి అని. వాసుదేవావిష్టచేతస్సు కలవాడై గ్రహించుట లేదా, ఇంద్రియములచేత అర్థములను గ్రహించిననూ అని అపి శబ్దార్థము. ఇదమ్ = విశ్వము. (48)

49. శ్లో॥ దేహేంద్రియ ప్రాణమనోధియాం యో
జన్మాప్యయక్షుద్భయతర్షకృచ్ఛ్రైః ।
సంసారధర్మైరవిముహ్యమానః
స్మృత్యా హరేర్భాగవత ప్రధానః ॥

తా:- దేహమునకు జననమరణములు, ప్రాణమునకు ఆకలి, మనస్సునకు భయము బుద్ధికి తృష్ణా (ఆశ) ఇంద్రియాలకు శ్రమ, అను వానిని కలిగించు సంసార ధర్మముల చేత ఎవడు హరిస్మరణ విషయమున మోహము పొందకుండయున్నాడో, అతడు భాగవత శ్రేష్ఠుడు. (49)

టీ:- కించ దేహాదీనాం సంసారధర్మైర్జన్మాప్యయాదిభిర్యో హరేః స్మృత్యా అవిముహ్యమానః స భాగవత ప్రధానః. తత్ర దేహస్య జన్మాప్యయౌ. ప్రాణస్య క్షుత్పిపాసే. మనసోభయం. బుద్ధేస్తర్షస్తృష్ణా ఇంద్రియాణాం కృచ్ఛ్రం శ్రమః తైః. (49)

టీ:- మరియు దేహాదులకు సంసార ధర్మములైన జన్మప్యయాదులచే ఎవడు హరిస్మరణమున మోహమును పొందడో అతడు భాగవత ప్రధానుడు. దేహమునకు జననమరణములు, ప్రాణమునకు క్షుత్పిపాసలు. మనస్సునకు భయము. బుద్ధికి తృష్ణా. ఇంద్రియములకు శ్రమ. (49)

50.శ్లో॥ న కామకర్మబీజానాం దృశ్యతే యత్ర సంభవః ।
వాసుదేవైకనిలయః స వై భాగవతోత్తమః ॥

టీ:– కామశ్చ కర్మాణి చ బీజాని చ వాసనాః తేషాం వాసుదేవైక నిలయః ఆశ్రమో యస్య సః. ఏతేన గృహీత్వాపీత్యాది శ్లోకత్రయేణ ద్వేష హర్ష మోహ కామాదిరహితశ్చరతీతి. యథా చరతీత్యస్యోత్తరం ఉక్తమ్. (50).

51.శ్లో॥ న యస్య జన్మకర్మభ్యాం న వర్ణాశ్రమజాతిభిః ।
సజ్జతేఽస్మిన్నహంభావో దేహే వై స హరేః ప్రియః ॥

టీ:– యైర్లింగైర్భగవత్ప్రియ ఇత్యస్యోత్తరమాహన యస్యేతి. జన్మ సత్ కులం, కర్మ తప ఆది. జాతయో అనులోమ ప్రతిలోమజాః మూర్ధావసిక్తాదయః. అస్మిన్ = దేహే. అహంకార రహితైః సత్కుల కర్మాది లింగైర్హరేః ప్రియోభవతీత్యర్థః. (51)

తా:– ఎవని యందు కామకర్మ వాసనల సంభారము కనిపించదో, ఎవడు వాసుదేవుడొక్కడే ఆశ్రయము కలవాడో, అతడే భగవతోత్తముడు. (50)

టీ:– కామము కర్మలు బీజములు = వాసనలు వాటికి వాసుదేవుడే ఆశ్రయము కలవాడెవడో వాడు. దీని వలన గృహీత్వాపీత్యాది మూడు శ్లోకములలో ద్వేషహర్ష మోహకామాది రహితుడై ఎట్లు చరించును అను దానికి ఉత్తరమీయబడినది. (50)

తా:– ఎవనికి జన్మకర్మలచే వర్ణాశ్రమ జాతులచే ఈ శరీరము నందు అహంభావము సక్తముకాదో అతడు విష్ణు భక్తుడు. (51)

టీ:– ఏ లక్షణములచే భగవత్ప్రియుడగునో అనుప్రశ్నకుత్తరము చెప్పుచున్నాడు నయస్య అని. జన్మ సత్కులము. కర్మ = తపస్సు మొదలయిన. జాతయో= అనులోమ ప్రతిలోమమున జనించినవారు. మూర్ధావసిక్తాదులు. అస్మిన్ = దేహము నందు. అహంకారరహితులు సత్కులమున జన్మించిన వారు, సత్కర్మల నాచరించువారు (లక్షణము లచే) హరిప్రియుడగుచున్నాడు అని యర్థము. (51)

52.శ్లో॥ న యస్య స్వః పర ఇతి విత్తేష్వాత్మని వా భిదా ।
సర్వభూతసమశ్శాంతః స వై భాగవతోత్తమః ॥

టీ:- విత్తేషు స్వీయం పరకీయమితి. ఆత్మని స్వః పరితి. (52)

53.శ్లో॥ త్రిభువన భవహేతవేఽప్యకుంఠ
స్మృతిరజితాత్మసురాదిభిర్విమృగ్యాత్ ।
న చలతి భగవత్పదారవిందాత్
లవనిమిషార్ధమపి స్మ వైష్ణవాగ్ర్యః ॥

టీ:- కిం చ త్రిభువన విభవహేతవేఽపి త్రైలోక్యరాజ్యార్థమపి లవార్ధమపి నిమిషార్ధమపి భగవత్పదారవింద భజనాద్యో న చలతి స వైష్ణవాగ్ర్యః నను లవార్ధమాత్ర భజనోపరమే చేత్తావాన్ లాభో భవేత్తత్కుతో న చలేత్తత్రాహ -అకుంఠస్మృతిః భవత్పదతోఽన్యత్సారం నాస్తీత్యేవం రూపాఽ కుంఠాఽనపగతాస్మృతిర్యస్య సః భగవత్పదార విందా దన్యత్సారం నాస్తీతి కుతః తత్రాహ - అజితే = హరావేవాత్మా యేషాం

తా:- ఎవనికి ధన, కనక, వస్తు వాహనముల యందు ఇవి నావి ఇవి ఇతరులవి అనెడి భావముండదో వాడు భాగవతోత్తముడు. (52)

టీ:- ధనకనకాదుల యందు స్వీయము పరకీయమని. ఆత్మ యందు తాను పరుడు అని. (52)

తా:- ఎవడుత్రైలోక్యరాజ్య లాభముకొరకు కూడా అర్ధ నిమిషమయినను భగవంతుని పాదపద్మముల నుండి చలించడో అతడు వైష్ణవోత్తముడు, అతడు భగవత్పాదారవిందముల కంటే ఇతరము సారమైనది లేనేలేదు అని గట్టి స్మరణగలవాడు, కావున (తొలగడు) చలించడు. అజితుడయిన శ్రీకృష్ణ రూపుడయిన శ్రీహరి యందు మనస్సు గల బ్రహ్మాది దేవతల చేతనే వెతకబడునది (కావున) (53)

టీ:- మరియు త్రైలోక్య రాజ్యము కొరకు కూడా, అర్ధ నిమిషమైననూ భగవంతుని పాద పద్మముల భజనము నుండి చలించడో అతడు వైష్ణవోత్తముడు, అయ్యా! ఒక్క క్షణకాలము మాత్రము భజన చేసినచో అంతటి గొప్పలాభము కలుగును, (అనిన) అతడు ఎందులకు చలించడు అనిన చెప్పుచున్నాడు అకుంఠ స్మృతియని - భగవత్పాదపద్మ భజనమును బట్టి చూచి ఇతరమైనది అంతయూ సారము లేనిది అనెడి

తథా భూతైః సురాదిభిరపి దుర్లభాత్. కింతు కేవలం విమృగ్యాత్ తదపేక్షయా సర్వస్య తుచ్ఛత్వం స్మరన్ యో న చలతీత్యర్థః. (53)

అకుంఠా తొలగని స్మరణగలవాడు గావున (నచతి) (చలింపదు) భగవత్పాదారవిందమున కన్నా ఇతరమయినది సారములేనిది అనియునూ ఎట్లు? అందులకు చెప్పుచున్నాడు అజితే హరియందే ఆత్మఎవరికో అట్టి సురాదులకు కూడా దుర్లభుడయినందువలన, కాని కేవలము వెతకబడునది. ఆయపేక్షచే సర్వమునకు తుచ్ఛత్వమును స్మరిస్తూ ఎవడు చలించడో అని యర్థము. (53)

54. శ్లో॥ భగవత ఉరువిక్రమాంఘ్రిశాఖా
నఖమణిచంద్రికయా నిరస్తతాపే ।
హృది కథముపసీదతాం పునస్స
ప్రభవతి చంద్ర ఇవోదితేఽర్కతాపః ॥

తా:- భగవంతుని ముల్లోకములాక్రమించిన పాదము వేళ్ళ యందలి గోళ్ళనెడి మణి చంద్రికలచే పోగొట్టబడిన కామాదుల సంతాపము గల. భజించుచున్న వారి హృదయము నందు మళ్ళీ కలుగవు. చంద్రుడుదయించగానే సూర్యుని తాపము వలె ఎట్లు జనిస్తున్నది. (54)

టీ:- అపి చ విషయాభిసంధినా చలనం కామేనాపి సంతాపే సతి భవేత్, స తు భగవత్సేవానిర్వృతౌ న సంభవతీత్యాహ- భగవత ఇతి. ఉరు విక్రమౌ చ తావంఘ్రీ చ తయోః శాఖాః అంగులయస్తాసు నఖాని చ తాని మణయశ్చ తేషాం చంద్రికా శీతలా దీప్తిస్తయానిరస్తః కామాదితాపో యస్మింస్తస్మిన్నుపసీదతాం భజతాం హృది పునస్సతాపః ప్రభవతి చంద్రే ఉదితే సతి అర్కస్యతాప ఇవ న యస్య సః పర ఇత్యాదినా శ్లోకత్రయేణ యాదృశ ఇత్యస్యోత్తరముక్తం వేదితవ్యం.

టీ:- మరియు విషయ సుఖములయందు అభిలాషచేత, కామము చేత, సంతాపము కలుగుచుండగా చలనము కలుగుతుంది. కాని ఆ చలనము భగవత్సేవానందము నందు సంభవించదు అనుచున్నాడు భగవత అని. ఉరువిక్రమౌ చ భూమ్యాకాశములకు విక్రమించిన తావంఘ్రీ చ ఆ పాదములు తయోః ఆ శాఖా వేళ్ళ గోళ్ళు అను యణయశ్చతేషాం చంద్రికా మణుల యొక్క శీతలదీప్తి చేత పోగొట్టబడిన తాపము కలది (కామాది తాపము కలది) యగు.

యద్ద్రుభూతే ఇత్యస్యచ శ్రీహరినామాదీనీతి జ్ఞాతవ్యమ్. (54)

భజించుచున్నవారి హృదయము నందు (భగవంతుని భజించువారికి) మళ్ళీ (కామాదికృత) సంతాపమెట్లు కలుగుతుంది? చంద్రుడు ఉదయించినంతనే సూర్యుని తాపమెట్లుండదో, నయస్య సః పర అనెడి మొదలుకాగల శ్లోకత్రయము చేత, యాదృశ అనుదానికి ఉత్తరము చెప్పినట్లు తెలిసికొనునది. యద్ద్రుభూతే అనుదానికి హరినామాదులను అని తెలిసికొనవలెను. (54)

55. శ్లో॥ విసృజతి హృదయం న యస్య సాక్షాత్
హరిరవశాభిహితోఽప్యఘౌఘనాశః ।
ప్రణయరశనయా ధృతాంఘ్రిపద్మః
స భవతి భాగవత ప్రధాన ఉక్తః ॥

తా:- ఎవని హృదయమును సాక్షాత్తుగ శ్రీహరి వీడడో, ఆ హరి ఎట్టివాడనగా బుద్ధిపూర్వకముగా గాక కీర్తింపబడిన వాడైనను. పాప రాశిని నాశనము చేయువాడు. ఎందుకు విడువడనగా,ఆ భక్తుడు ప్రేమ, రజ్జువుచే ధరింపబడిన హరి పాదపద్మములు గలవాడు. భగవద్భక్తులలో ముఖ్యుడుగా చెప్పబడినాడు. (55)

టీ:- ఉక్తసమస్త భాగవత లక్షణసారమాహ - విసృజతీతి శ్రీహరిరేవ స్వయం సాక్షాద్యస్య హృదయం న విసృజతి, న విముంచతి. కథం భూతః అవశేనాప్యభిహిత మాత్రోఽప్యఘౌఘం నాశయతి యః సః తత్కిం న విసృజతి. యతః ప్రణయ రశనయా ధృతం హృదయే నిబద్ధమంఘ్రి పద్మం యస్య స భాగవత ప్రధానః ఉక్తః భవతి.(55)

టీ:- ఈ చెప్పబడిన భాగవత లక్షణ యొక్క సారమును చెప్పుచున్నాడు. విసృజతీ అని. హరియే సాక్షాత్తు ఎవని హృదయమును విడువడో, ఆ హరి ఎట్టివాడు అనిన, వశము లేక (బుద్ధి పూర్వకముగా గాక) కీర్తింపబడినవాడైననూ పాపరాశిని నాశనము చేయువాడు ఐన, వాడు ఎందుకు విడువడు అనగా (ఆ భక్తుడు) ప్రణయ = ప్రేమ రజ్జువుచే హృదయమున ధరింపబడిన పాద పద్మములు గలవాడు. భగవద్భక్తులలో ముఖ్యుడని చెప్పబడినాడు. (55)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**ద్వితీయోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**ద్వితీయాధ్యాయము సమాప్తము.**

## తృతీయోऽధ్యాయః

రాజోవాచ

1. శ్లో॥ పరస్య విష్ణోరీశస్య మాయినామపి మోహినీమ్ ।
మాయాం వేదితుమిచ్ఛామో భగవంతో బ్రువంతు నః ॥

## తృతీయాధ్యాయము

### రాజు అడుగుచున్నాడు

తా:– మాయ గలవారికి సహా మోహమున కల్గించునట్టి ఈశ్వరుడయిన విష్ణువు యొక్క మాయను గూర్చితెలియగోరుచున్నాను. ఓ భగవంతులారా ! మాకు చెప్పండి. (1)

టీ:– మాయా తత్తరణ, బ్రహ్మ కర్మ ప్రశ్నచతుష్టయే. తృతీయే తూత్తరం దత్తమార్షభైర్మునిభిః పృథక్. విష్ణోర్మాయామిదం పశ్యన్నిత్యుక్తమతో మాయాం పృచ్ఛతి యద్వా. హేయస్వరూపే జ్ఞాతే జ్ఞానం సుకరమితి తదర్థం – పరస్యేతి. హే భగవంతః. (1)

టీ:– మాయ దానిని తరించుట, బ్రహ్మ, కర్మ అను నాలుగు ప్రశ్నలకు ఈ తృతీయాధ్యాయము నందు మునులగు ఋషభ పుత్రులచే ప్రత్యేకముగా ఉత్తరమీయబడినది. విష్ణువు యొక్క మాయను దీనిని చూచుచూ అని చెప్పబడినది, అందులకని మాయను గురించి అడుగుచున్నాడు పరస్య అని. – ఓ భగవంతులారా ! (1)

2. శ్లో॥ నానుతృప్యే జుషన్ యుష్మద్వచో హరికథామృతమ్ ।
సంసారతాపనిష్టప్తో మర్త్యస్తత్తాపభేషజమ్ ॥

తా:– సంసార తాపముచే చాలా తపింపబడిన మరణధర్మముగల మనుజుడను, ఆ తాపమునకు ఔషధమయిన మీవచన రూపమయిన హరికథామృతమును ఆస్వాదించుచూ తృప్తిని పొందకుండా వున్నాను.(2)

టీ:– ననూక్త లక్షణోభాగవతో భూత్వా కృతార్థః స్యాః కిం బహుప్రశ్నైరత ఆహ – నానుతృప్య ఇతి. సంసారతాపైర్నితరాం తప్తోऽహం తస్య

టీ:– అయ్యా ! ఉక్తలక్షణుడైన భాగవతుడనైననూ కృతార్థతతోత్తములతో నానుతృప్య అని అనుచున్నాడు. సంసారతాపముచే చాలా తపింప

తాపస్య భేషజం హరికథామృతరూపం యుష్మద్వచో జుషమాణో నానుతృప్యామి. (2)

బడినాను, ఆ తాపమునకు ఔషధము హరికథామృతము అదియును మీ వచన రూపమై యున్నదానిని ఆస్వాదించుచూ తృప్తిని పొంద కున్నాను. (2).

అంతరిక్ష ఉవాచ

3.శ్లో॥ ఏభిర్భూతాని భూతాత్మా మహాభూతైర్మహాభుజః ।
ససర్జచ్చావచాన్యాద్యః స్వమాత్రాత్మ ప్రసిద్ధయే ॥

తా:- పురాణపురుషుడయిన ఈశ్వరుడు తనచే సృష్టింపబడిన పృథివ్యాది మహాభూతముల చేత వివిధములలైన ప్రాణులను సృష్టించినాడు, తననెవడుపాసించుచున్నాడో ఆ జీవునకు ఉత్తమ సిద్ధికొరకు స్వాంశభూతులయిన జీవులకు విషయ భోగము కొరకు ఆత్మ ప్రసిద్ధమయిన మోక్షము కొరకు సృజించెను. (3)

టీ:- మాయాయాః స్వరూపతో నిరూపణాసంభవాత్సృష్ట్యాది కార్య ద్వారేణ నిరూపయితుమాహ - ఏభిరితి. ఆద్యః పురుషో యయాశక్త్యా భూతానామాత్మా కారణభూతః ఏభిః స్వసృష్టైః మహాభూతైరుచ్చావచాని భూతాని ససర్జ. ఏషా మాయా భగవత ఇతి చరమ శ్లోకపాదస్య ప్రతి శ్లోకమనుషంగః. కిమర్థం ససర్జ. స్వమాత్రాత్మ ప్రసిద్ధయే, స్వంమిమీతే ప్రమిమీతే ఉపాస్తేయః సస్వమాతా తస్యాత్మనో జీవస్య ప్రకృష్టాయై సిద్ధయై. యద్వా స్వాంశభూతానాం జీవానాం మాత్రా ప్రసిద్ధయే విషయభోగాయ ఆత్మ ప్రసిద్ధయే మోక్షాయ చేత్యర్థః. తదుక్తం వేదస్తుతౌ

టీ:- మాయను స్వరూపతః నిరూపించుట పొసగదు కాన సృష్ట్యాదికార్య ద్వారముగా నిరూపించుటకై చెప్పుచున్నాడు ఏభిః అని. పురాణ పురుషుడు అగు ఈశ్వరుడు ఏ శక్తిచే భూతములకు ఆత్మయై కారణమై తనచే సృష్టింపబడిన పృథివ్యాది మహాభూతముల చేత వివిధములయిన భూతములను (ప్రాణులను) సృజించెను. ఏషా మాయా భగవతః అనెడి చివరి శ్లోకపాదము సర్వత్ర అనుషంగము చేయవలెను. ఎందుకు సృజించెననగా, స్వమాత్రాత్మ ప్రసిద్ధికై, తననెవడుపాసించుచున్నాడో వాడు స్వమాతా ఆత్మయయిన జీవునకు, ప్రకృష్టసిద్ధి కొరకు. లేదా

"బుద్ధీంద్రియ మనః ప్రాణాంజనానామసృజత్ప్రభుః. మాత్రార్థం చ భవార్థం చ ఆత్మనేऽకల్పనాయచ "ఇతి. (3)

స్వాంశభూతులైన జీవుల విషయభోగముల కొరకు, ఆత్మసాక్షాత్కారము కొరకు, మోక్షము కొరకును. (సృజించెను) అనియర్థము. వేద స్తుతి యందు చెప్పబడినది.- "ఈశ్వరుడు జనులకు బుద్ధీంద్రియములు, మనస్సు, ప్రాణము అను వానిని విషయభోగము కొరకు, కర్మాను ష్ఠానము కొరకును, భోగముల కొరకునూ, మోక్షము కొరకునూ సృజించెను" అని. (3)

4.శ్లో॥ ఏవం సృష్టాని భూతాని ప్రవిష్టః పంచధాతుభిః ।
ఏకధా దశధాత్మానం విభజన్ జుషతేర్గుణాన్ ॥

తా :- ఈ ప్రకారముగా పంచభూతములచే సృజింపబడిన భూతములను (ప్రాణులను) అంతర్యామిరూపమున ప్రవేశించినవాడై ఒక్కటైన మనస్సుగనూ పది విధములయిన ఇంద్రియములుగనూ తనను విభజించుచూ ఆ మూర్తిని గూర్చిన గుణములను భజించుచూ ప్రీతిని కలిగించుచున్నారు. (4)

టీ :- ఏవం జీవోపకరణార్థం పంచధాతుభిర్మహాభూతైః సృష్టాని భూతాన్యన్తర్యామి రూపేణ ప్రవిష్ట ఏకధా మనసా, దశధా బాహ్యేంద్రియ రూపేణాత్మానం విభజన్గుణాం స్తత్తద్విషయాన్ జుషతే జోషయతీత్యర్థః యద్వా తమాత్మానం ప్రతి గుణాన్విభజన్ జుషతే ప్రీయత ఇత్యర్థః. (4)

టీ :- ఈ విధముగా జీవుల ఉపకారముకొరకై పంచధాతువులచే - మహాభూతములచే, సృజించబడిన భూతములను (ప్రాణులను) అంతర్యామిరూపముతో ప్రవేశించినవాడై ఒక్కటైన మనస్సునూ, పది విధములయిన జ్ఞానేంద్రియ కర్మేంద్రియ రూపముగనూ ఆత్మను విభజించుచూ ఆయా మూర్తిని గూర్చిన గుణములను ఆయా విషయ ములను భజించుచూ ప్రీతి కలిగించుచున్నాడు. (4)

5. శ్లో॥ గుణైర్గుణాన్ స భుంజానః ఆత్మప్రద్యోతితైః ప్రభుః ।
మన్యమాన ఇదం సృష్టం ఆత్మానమిహ సజ్జతే ॥

తా :- ఆ జీవుడు అంతర్యామిచే ప్రకాశించు ఇంద్రియములచేత విషయములను అనుభవిస్తూ, ఈ సృజింపబడిన శరీరమును, ఆత్మగా తలుస్తూ శరీరాదులయందు ఆసక్తుడౌచున్నాడు. (5)

టీ :-స చ జీవ ఆత్మనాంతర్యామిణా ప్రద్యోతితైర్గుణైరింద్రియై ర్గుణాన్విషయాన్భుంజాన ఇదం సృష్టం శరీరమాత్మానం మన్యమాన ఇహ శరీరాదౌ సజ్జతే. అత ఏవ సంసరతీతి భావః. (5)

టీ :- ఆ జీవుడు అంతర్యామిచే ప్రకాశించు ఇంద్రియములచేత విషయములను అనుభవిస్తూ, ఈ సృజింపబడిన శరీరమును, తననుగా తలుస్తూ శరీరాదులయందు ఆసక్తుడౌచున్నాడు, అందులకే సంసారి యగుచున్నాడని భావము. (5)

6. శ్లో॥ కర్మాణి కర్మభిః కుర్వన్ సనిమిత్తాని దేహభృత్ ।
తత్తత్కర్మఫలం గృహ్ణన్ భ్రమతీహ సుఖేతరమ్ ॥

తా:- దేహధారియయిన జీవుడు తనపూర్వ కర్మ వాసనలను బట్టి జనించిన కర్మలను కర్మేంద్రియముల ద్వారా చేస్తూ సుఖ దుఃఖాత్మకమయిన ఆయా కర్మ ఫలమును గ్రహిస్తూ సంసారమున భ్రమించుచున్నాడు. (6)

టీ:- నను భుంజానః కథం సజ్జతే, భంజానో భాగసమాప్తౌ ముచ్యత ఇతి చేత్త్రాహ - కర్మాణీతి. కర్మభిః కర్మేంద్రియైశ్చ సనిమిత్తాని సవాసనాని కర్మాణి కుర్వంస్తత్తత్పూర్వ కర్మఫలం చ గృహ్ణన్నయం దేహభృద్భవతీహ సంసారే, న తు ముచ్యతే; కథం భూతం కర్మఫలం, సుఖేతరం సుఖ దుఃఖాత్మకమ్. (6)

టీ :- ఓయీ! అనుభవిస్తూ ఎట్లాసక్తుడవుచున్నాడు? అనుభవించెడివాడు భోగసమాప్తి అయిన తరువాత ముక్తుడవుచున్నాడు కదా యనిన, చెప్పుతున్నాడు - కర్మాణియని. కర్మేంద్రియములచే వాసన కారణముగ జనించిన కర్మలను చేయుచూ, ఆయా కర్మల పూర్వ ఫలమునూ గ్రహించుచూ వీడు దేహభృత్తవుతున్నాడీ సంసారమున, ముక్తుడు మాత్రము కాడు, కర్మఫలమెట్టిది, సుఖ దుఃఖాత్మకమయినది. (6)

7.శ్లో॥ ఇత్థం కర్మగతీర్గచ్ఛన్ బహ్వాభద్రవహాః పుమాన్ ।
ఆభూతసంప్లవాత్ సర్గప్రళయావశ్నుతేऽవశః ॥

టీ:- కియన్తం కాలం భ్రమతి తదాహ - ఇత్థమితి. బహూన్యభద్రాణి వహంతీతి తథా, తాః సర్గ ప్రళయావుత్పత్తిమరణే॥ (7)

తా:- ఈ ప్రకారము కర్మమార్గములననుసరించుచూ అనేక దుఃఖములను పొందుతూ, ఈ పురుషుడు ప్రళయ పర్యంతము జన్మ మరణాలను పొందుచున్నాడు.(7)

టీ:- ఎంతకాలము భ్రమించుచున్నాడు అనగా ఇత్థమని చెప్పుచున్నాడు. చాలా అభద్రములను వహించుచూ - అమంగళములను వహించుచూ, సర్గప్రళయములు = ఉత్పత్తి మరణములు. (7)

8.శ్లో॥ ధాతూపప్లవ ఆసన్నే వ్యక్తం ద్రవ్యగుణాత్మకం ।
అనాదినిధనః కాలో హ్యవ్యక్తాయాపకర్షతి ॥

టీ:- ఏవం మాయామయీం సృష్టిముక్త్వా ప్రళయం దర్శయితుమారభతే. ధాతూనాం మహాభూతానం ఉపప్లవే నాశహేతావాసన్నే వ్యక్తం కార్యం ద్రవ్యం స్థూలం గుణః సూక్ష్మం తదాత్మకమవ్యక్తాయా వ్యక్తం ప్రతి నేతుమాకర్షతి॥ (8)

తా:- పంచమహాభూతములకు - నాశహేతువు ప్రాప్తించగా. స్థూల సూక్ష్మ స్వరూపమైన కార్యమను జగత్తును ఆద్యంతములులేనిదైన కాలము అవ్యక్తమును (ప్రకృతిని) ఆకర్షించును.(8)

టీ:- ఈ విధముగా మాయామయిన సృష్టిని చెప్పి ప్రళయమును చూపెట్టుట కారంభించుచున్నాడు. ధాతువులకు మహాభూతములకు, ఉపప్లవము నాశహేతువు సంప్రాప్తించగా వ్యక్తము = కార్యము, ద్రవ్యము = స్థూలము, గుణము = సూక్ష్మము తదాత్మకము, అవ్యక్తము కొరకు = అవ్యక్తమును (ప్రకృతిని) పొందుటకు ఆకర్షించును. (8)

9. శ్లో॥ శతవర్షాణ్యనావృష్టిః భవిష్యత్యుల్బణా భువి ।
తత్కాలోపచితోష్ణార్కో లోకాంస్త్రీన్ ప్రతపిష్యతి ॥

టీ:- నాశహేతూనాహ-శతవర్షేతి. తస్మిన్ కాలే ఉపచితశ్చాసౌ వృష్ణశ్చా సావర్కశ్చ. యద్వా తేన కాలేనోపచితముష్ణత్వం యస్య సః. (9)

తా:- భూమి యందు వర్షాభావమధికమై నూరు సంవత్సరముల వరకట్టిస్థితియే యుండును. ఆకాలాన వృద్ధిపొందిన సూర్యుడు (వేడిగలవాడు) ముల్లోకాలను తపింప జేయును. (9)

టీ :- నాశహేతువులను చెప్పుచున్నాడు శతవర్ష అని. ఆ కాలమునందు వృద్ధిపొందిన వేడిమిగల సూర్యుడు, లేదా, ఆ కాలముచేత వృద్ధినొందిన వేడిమి గల సూర్యుడు. (9)

10. శ్లో॥ పాతాళతలమారభ్య సంకర్షణముఖానలః ।
దహన్నూర్ధ్వశిఖో విష్వగ్వర్ధతే వాయునేరితః ॥

టీ:- ఊర్ధ్వశిఖః ఊర్ధ్వజ్వాలః. విష్వక్పరితః. (10)

తా:- పాతాళ లోకము నుండి సంకర్షణరూపముననున్న, శేషుడనెడి సర్పముఖము నుండి జనించెడి అగ్ని, పైకెగురు జ్వాలలుకలదై గాలిచే పెంచబడినదై అంతట దహించుచూ వృద్ధి పొందును. (10)

టీ :- పైకెగురుజ్వాలలు గలదై. విశ్వక్ = అంతట. (10)

11. శ్లో॥ సంవర్తకో మేఘగణో వర్షతి స్మ శతం సమాః ।
ధారాభిర్హస్తిహస్తాభిః లీయతే సలిలే విరాట్ ॥

టీ:- సాంవర్తకః ప్రళయకర్తా. ధారాభిః నతుబిన్దుభిః. హస్తహస్తాభిః తత్ప్రమాణాభిః. (11)

తా:- సంవర్తమనెడి మేఘ గణము ఏనుగు తొండములంత వర్ష ధారలతో నూరు సంవత్సరములు వర్షించును, ఆ జలమునందు విరాడ్రూపమగు జగత్తు లీనమవుతుంది. (11)

టీ :- సాంవర్తకము = ప్రళయము కర్త (అగు) మేఘ బిందువులతోగాదు ధారలతో ఏనుగుతాండవములంతటి ధారలతో. (11)

12.శ్లో॥ తతో విరాజముత్సృజ్య వైరాజః పురుషో నృప ।
అవ్యక్తం విశతే సూక్ష్మం నిరింధన ఇవానలః ॥

టీ:- తత ఉపాదిలయాద్వైరాజః పురుషోऽవ్యక్తం కారణం ప్రవిశతి. నను“బ్రహ్మణాసహతే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే. పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదమ్”. ఇతిస్మృతేర్యావదధికారమవస్థితి రాధికారిణా”మితి న్యాయాచ్చ వైరాజశబ్దాభిధేయస్య చ బ్రహ్మణః పరమభాగవతత్వాన్మోక్ష ఏవసంగచ్ఛతే నాన్యేషామివ కారణమాత్రప్రవేశః సత్యమ్, అశ్వమేధాదినా సత్యలోకం గతానామ పృభక్తానామావృత్తి శ్రవణాదభక్తత్వే చ బ్రహ్మణోऽపి ప్రకృతౌలయః పునరుత్పత్తిశ్చేతి మోక్షదౌర్లభ్య సూచనాయైవముక్తమిత్యవిరోధః. యద్వాకేనాపి ప్రమాణేన నవ్యజ్యత ఇత్యవ్యక్తంబ్రహ్మైవ తత్ప్రవేశేన మోక్ష ఏవోక్త ఇతిద్రష్టవ్యమ్. (12)

తా:- ఉపాధిలయము వలన విరాట్టగు, జనమును విడిచిపెట్టి అందున ఉన్న వైరాజ పురుషుడు కట్టెలు లేని అగ్నివలె కారణమైన ప్రకృతిని ప్రవేశించుచున్నాడు.(12)

టీ :- ఉపాధిలయము వలన వైరాజపురుషుడు అవ్యక్తమైన కారణమును ప్రవేశించుచున్నాడు. అయ్యా! ప్రళయము సంప్రాప్తమైనపుడు అధికార పురుషులందరూ బ్రహ్మతో గూడ జగదవస్థానమునందు దేహాన్ని ధరించియున్న జీవరూపులే పరమపదమున ప్రవేశించుతారు “అనెడి స్మృతివలన” యావదధికారమవస్థితిరాదికారికాణాం” అనెడి న్యాయము వలన (ఎంతవరకు ఆధికారిక పురుషుల అధికారము నిలిచియుండునో) (ఇది బ్రహ్మసూత్రము 3.3.32) వైరాజశబ్దము నామముగా గల బ్రహ్మ పరమభాగవతుడగుట వలన అతనికి మోక్షమే సంభవించుచున్నది. ఇతరులయిన ఆధికారిక పురుషులవలె (జీవులకు) కారణమాత్రముగా ప్రకృతి ప్రవేశముకాదు. అని యన్నచో,సత్యము, అశ్వమేధాది యాగ ఫలముచే సత్యలోకాన్ని పొందిన భక్తులుకాని వారికి ఆ వృత్తి వలన భక్తుడు కానిచో బ్రహ్మకు కూడా ప్రకృతిలో లయమును పునరుత్పత్తియు కలుగును. మోక్షము చాలా దుర్లభమని ఈ విధముగా చెప్పబడినది, కావున విరోధము లేదు. లేదా మరి ఏ ఇతర ప్రమాణము చేతనూ తెలియబడనిది, వ్యక్తము కానిది, అవ్యక్తము బ్రహ్మమే అందున ప్రవేశించుట వలన మోక్షమే చెప్పబడినదని తెలియనగును. (12)

13.శ్లో॥ వాయువా హృతగంధా భూః సలిలత్వాయ కల్పతే ।
సలిలం తద్ధృతరసం జ్యోతిష్ట్వాయోపకల్పతే ॥

తా:- వాయువుచే హరింపబడిన గంధముగలదైన భూమి జలమగుటకు యోగ్యమగుచున్నది. (అనగా భూమి జలములో లయమవుతున్నది) ఆ వాయువు చేత హరింపబడిన రసగుణము కలదైన జలము అగ్నియగుట శక్యమవుచున్నది. (అనగా అగ్నిలో లీనమగును). (13)

టీ:- ఏవం విరాజాలయముక్త్వా తత్కారణానా మహదాది పృథివ్యం తానాం ప్రాతిలోమ్యేన లయయమాహ - వాయునేతి. వాయోర్హి గంధ రసహారిత్వం ప్రసిద్ధమ్, సాంవర్తకేన వాయునా హృతగంధా అత ఏవ గంధస్య వ్యావర్తకస్య గతత్వాత్సలిలత్వాయ కల్పతే సలిలే లీయత ఇత్యర్థః తద్ధృత రసం తేన వాయునైవ హృతోరసోయస్య తత్. (13)

టీ:- ఈ ప్రకారము విరాజలయమును చెప్పి తత్కారణములయిన మహదాది పృథివ్యంతములైన వానికి లయమును చెప్పుచున్నాడు, వాయువా అని. వాయువునకు గంధరసహారిత్వము ప్రసిద్ధము సాంవర్తకవాయువుచే హృతగంధ, అందుకని యే గంధము యొక్క వ్యావర్తకత్వము గతమగుట వలన (భూమి) జలమగుటకు యోగ్యమగు చున్నది. అనగా భూమి నీటిలో లీనమగుచున్నదని యర్థము, ఆ వాయువు చేత హరింపబడిన రస గుణము గలదైన, ఆ వాయువుతోనే హరింపబడిన రస్యముదేనికో అది. (13)

14.శ్లో॥ హృతరూపం తు తమసా వాయౌ జ్యోతిః ప్రతీయతే ।
హృతస్పర్శోఽవకాశేన వాయుర్నభసి లీయతే ॥

తా:- సంవర్తకమయిన తమస్సుచే హరింపబడిన రూపముగలదై అగ్ని వాయువునందు లీనమగుచున్నది. ఆకాశముచే హరింపబడిన స్పర్శగుణముగలదై వాయువు ఆకాశమునందు లీనమగుచున్నది. స్వకాలమై కాలస్వరూపముచేహరింపబడిన శబ్దగుణముగలదై ఆకాశము ఆత్మయందు (తామసాహంకారమునందు) లీనమగుచున్నది. (14)

టీ:- తమసశ్చరూపతిరస్కారిత్వం ప్రసిద్ధం. సాంవర్తకేన తమసా. అవకాశేనాకాశేన. స్వకారాణేన కాలాత్మనా, శబ్దస్య హి కాలత ఏవ నాశః ప్రసిద్ధస్తద్రూపేణాత్మనా ఈశ్వరేణ. ఆత్మని తామసాహంకారే14

టీ:- తమస్సునకు రూపమగుపించకుండా చేయుట ప్రసిద్ధమే, సంవర్తకమైన తమస్సుచేత (చీకటిచేత) అవకాశముచే = ఆకాశముచే. స్వకారణమైన కాలముచే శబ్దమునకు కాలముననే నాశనము ప్రసిద్ధము. అందువలన తద్రూపుడయిన ఆత్మచే అనగా ఈశ్వరునిచే. ఆత్మ యందు తామసాహంకారమునందు. (14)

15.శ్లో॥ కాలాత్మనా హృతగుణం నభ ఆత్మని
లీయతే ఇంద్రియాణి మనో బుద్ధిః ।
సహ వైకారికైర్నృప ప్రవిశంతి
హ్యహంకారం స్వగుణైరహమాత్మని ॥

తా:- పది ఇంద్రియములు, బుద్ధి రాజసాహంకారము నందు లీనమగును. మనస్సు ఇంద్రియాధిదేవతలతోసహా సాత్వికాహంకారము నందు లీనమగును. అహంకారము మహత్తత్వము నందు, మహత్తత్వము ప్రకృతియందును, ఆ ప్రకృతి బ్రహ్మాయందు లీనమగుచున్నవి. (15)

టీ:- ఇంద్రియాణి బుద్ధిశ్చరరాజసాహంకారమ్. మనోవైకారికైర్దేవైః సహ సాత్వికాహంకారమ్. ఏవం త్రివిధైః స్వగుణైః స్వకార్యైః సహితోऽహ మహంకార ఆత్మని మహతి స చ ప్రకృతావితి ద్రష్టవ్యమ్. (15)

టీ:- పది ఇంద్రియములు, బుద్ధి రాజసాహంకారమునందు. మనస్సు ఇంద్రియాధి దేవతలతో సహా సాత్వికాహంకారము నందు. ఈ ప్రకారము త్రివిధములైన కార్యములతో అహం = అహంకారము మహత్తత్వమునందు ఆ మహత్తత్వము ప్రకృతియందును అని దర్శింపవలెను. (15)

16. శ్లో॥ ఏషా మాయా భగవతః సృష్టిస్థిత్యంతకారిణీ ।
త్రివర్ణా వర్ణితాస్మాభిః కిం భూయశ్ర్శోతుమిచ్ఛసి ॥

టీ:- త్రివర్ణా. త్రిగుణా, మాయాశ్రవణభీతం రాజానం తన్నివృత్త్యుపాయ శ్రవణే స్వయం ఛందయతి - కిం భూయ ఇతి. 16

తా:- ఇదియే సృష్టి, స్థితి, సంహారములను చేయునది త్రిగుణములు కలది, మాచేత వర్ణింపబడినది. ఇంకా ఏమివిన గోరుచున్నావు? (16)

టీ:- మూడు గుణములు గలది. మాయా శ్రవణము వలన భీతుడయిన రాజును గూర్చి తన్ని వృత్త్యుపాయశ్రవణమున స్వయం ఇచ్ఛ కలిగించుచున్నది కింభూయః అని. (16)

రాజోవాచ

17. శ్లో॥ యథైతామైశ్వరీం మాయాం దుస్తరామకృతాత్మభిః ।
తరంత్యంజస్థూలధియో మహర్ష ఇదముచ్యతామ్ ॥

తా:- ఓ మహర్షీ! ఈశ్వర మాయను అంతఃకరణము వశ్యము చేసికొనని వారిచే తరింపశక్యము గాని దానిని, స్థూల శరీరమున నేను అనెడి బుద్ధికలవారును సులభముగా ఎట్లు తరింతురో ఇది చెప్పుము. (17)

టీ:- ఏవమను కంపిత స్తన్నివృత్త్యుపాయమేవపృచ్ఛతి - యథైతామితి. యద్యపి "తన్మాయయాऽతోబుధ ఆభజేత్తమ్" ఇతి భక్తి స్తత్తారకత్వే నోక్తైవ, తథాపి కింభక్తి రేవాన్యోऽపి వా తత్రోऽపాయోऽస్తీతి జ్ఞాతుం పునః ప్రశ్నః. అకృతాత్మభిరవశీకృతాన్తః కరణైః స్థూలధియః స్థూలేశరీరే అహం ధీర్యేషాం తే. (17)

టీ:- ఈ విధముగా భయకంపితుడయిన రాజు తన్నివృత్త్యుపాయమును అడుగుచున్నాడు యథైతామని. "తన్మాయ' అందువలన బుద్ధిమంతుడు మాయను తొలగుటకు ఆ ఈశ్వరుడిని భజించవలెను. అని భక్తి ఆ మాయ నుండి తరింపచేయునదిగా చెప్పబడినది. అట్లయిననూ కేవలము భక్తియేకాక ఇతరమయిన ఉపాయమేమయినయున్నదా? అని తెలిసికొనుటకు మళ్ళీ ప్రశ్న. అంతఃకరణమును వశము చేసికొనని వారిచే, స్థూల శరీరమునందు నేననెడి బుద్ధి ఎవరికోవారు. (17)

### ప్రబుద్ధ ఉవాచ

18.శ్లో॥ కర్మాణ్యారభమాణానాం దుఃఖహంత్యై సుఖాయ చ ।
పశ్యేత్పాకవిపర్యాసం మిథునీచారిణాం నృణామ్ ॥

తా:– దుఃఖనాశనమునకు సుఖము కొరకు కర్మలను ఆరంభించువారు నగు నరులకు కల వైపరీత్యమును చూడవలెను.(18)

టీ:– భక్తివ్యతిరేకేణ నాస్త్యన్య ఉపాయ ఇత్యభిప్రేత్య భక్తిమేవససాధనాం నిరూపయతి. తత్ర, ప్రథమం వైరాగ్య ద్వారా గురూపసత్తిమాహ చతుర్భిః కర్మాణీతి. దుఃఖహత్యై దుఃఖప్రతీకారాయ. పాక విపర్యాసం = ఫలవైపరీత్యం. మిథునీ చారిణాః మిథునీభూయ ప్రవర్తమానానామ్. (18)

తా:– భక్తికి వ్యతిరేకముగా ఏ ఉపాయము లేదు అని అంగీకరించి, సాధన సంపదతో కూడిన భక్తిని నిరూపించుచున్నాడు. అందున ప్రథమము వైరాగ్యము ద్వారా గురువును ప్రాప్తించుటను గురించి నాలుగు శ్లోకములతో చెప్పుచున్నాడు కర్మాణి అని. దుఃఖాహుతికై = దుఃఖప్రతీకారమునకై . పాక విపర్యాసం = ఫలవైపరీత్యము. మిథున నీచారిణాం = పర్పరము కలిసికొని ఉండువారగు. (18)

19.శ్లో॥ నిత్యార్జితేన విత్తేన దుర్లభేనాత్మమృత్యునా ।
గృహాపత్యాప్తపశుభిః కా ప్రీతిస్సాధితైశ్చలైః ॥

తా:– దుర్లభమైన తనకు మృత్యు స్వరూపమై నిత్యమార్జించిన ధనము చేత సంపాదించబడిన అనిత్యములైన ఇల్లు, ఇల్లాలు, బిడ్డలు, మిత్రులు, పశువులు అనెడి వీటి చేతనూ ఏమి సంతోషము కలుగుచున్నది?(19)

టీ:– కర్మభిః సాధితా అపి విత్తాదయో న సుఖహేతవ ఇతి చ పశ్యే దిత్యాహ – నిత్యార్జితేనేతి. ఆత్మనః స్వస్య మృత్యురూపేణ. చలై రనిత్యైరసాయిభిశ్చ. (19)

టీ:– కర్మలచే సాధింపబడిన వయ్యు విత్తాదులు సుఖహేతువులు కావు. అని దర్శించవలెనని చెప్పుతున్నాడు నిత్యార్జితేన అని. తనకు మృత్యుస్వరూపమైన, అనిత్యములయిన. (19)

20.శ్లో॥ ఏవం లోకం పరం వింద్యాత్ నశ్వరం కర్మనిర్మితం ।
సతుల్యాతిశయధ్వంసం యథా మండలవర్తినామ్ ॥

టీ:- ఏవం లోకం పరమితి' కర్మ నిర్మితత్వాన్నశ్వరం. తథా చ శృతిః "తద్యథేహ కర్మ చితోలోకః, క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" ఇతి. కించ వర్తమాన సమయోపి దుఃఖయుక్తం పశ్యేదిత్యాహ సతుల్యాతి శయధ్వంసం సహతుల్యేనాతిశయేన ధ్వంసేన చవర్తమానం. అతస్తుల్యే స్పర్ధాతిశయేఽసూయా ధ్వంసాలో చనే భయాదికం చూపరి హార్యమిత్యర్థః(20)

తా:- జ్యోతిష్టోమాది యాగఫలమైన పుణ్యము వలన లభించు స్వర్గమును నశించునదిగా, పుణ్యానుభవమున క్షీణించునదిగా తెలిసికొనవలెను. (20).

తా:- ఏవం లోకం పరమని. కర్మలచే నిర్మితమయినందున నశ్వరము నశించునది. అట్లే శృతి. "తద్యథేహ" అని తాత్పర్యము ఎట్లు కృష్యాదులచే సంపాదింపబడిన ధనధాన్యాదికము అనుభవించుట వలన క్షీణించుచున్నదో, అట్లే జ్యోతిష్టోమాది యజ్ఞకర్మలచే కలిగిన పుణ్యముచే సంపాదించిన స్వర్గము అనుభవము వలన క్షీణించు చున్నది" అని. మరియు వర్తమాన సమయమున దుఃఖ సంయుక్తముగా చూడవలె ననుచున్నాడు. సతుల్యాతిశయధ్వంసం, సమానత్వమును ఆధిక్యమును ధ్వంసము చేయునది అనియూ, ఇందులో సమానత్వము నందు స్పర్థ, అతిశయమందు అసూయ, ధ్వంసాలోచనమున భయమునూ, అపరిహార్యములని అర్థము. యథాఽఖండమండల పతీనాం = అఖండ భూమండలమున వుండెడి వారికి పరస్పరము ఎట్లో అట్లు అఖండ భూమండలమున వున్న రాజులకు పరస్పరము సమానత్వమున స్పర్థ, ఆధిక్యమునందు అసూయ, కలిగి ఒకరినొకరు నాశనము చేయాలి. అనెడి భావము ఎట్లు కలుగునో అట్లు. (20)

21.శ్లో॥ తస్మాద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసుశ్శ్రేయ ఉత్తమమ్ ।
శాబ్దే పరే చ నిష్ణాతం బ్రహ్మణ్యుపశమాశ్రయమ్ ॥

టీ:- ఉత్తమం శ్రేయో జ్ఞాతుమిచ్ఛుః శాబ్దే బ్రహ్మణి వేదాఖ్యే న్యాయతో నిష్ణాతం తత్వజ్ఞం. అన్యథా సంశయ నిరాసకత్వాయోగాత్. పరే చ బ్రహ్మణ్య పరోక్షానుభవేన నిష్ణాతమన్యథాబోధ సంచారాయోగాత్. పరబ్రహ్మనిష్ణాతత్వద్యోతక మాహ - ఉపశమాశ్రయమితి. (21)

తా:- అందువలన ఉత్తమశ్రేయస్సును తెలియగోరినవాడు శబ్ద బ్రహ్మమగు వేదమునందు పరబ్రహ్మమునందు తత్త్వజ్ఞుడగు శాంతికి ఆశ్రయుడగు గురువును శరణుపొందాలి. (21)

టీ:- ఉత్తమశ్రేయస్సును తెలియగోరినవాడు శబ్ద బ్రహ్మమందు వేదమునందు న్యాయతః నిష్ణాతుడయిన = తత్వజ్ఞుడయిన ' అన్యథా ఈ విశేషణములు లేనిచో సంశయ (న్యాయమున) నిరాసకత్వ మనునది కలుగదు. పరబ్రహ్మయందు. అపరోక్షానుభవమున తత్వజ్ఞుడయిన. ఇది లేనిచో బోధ సంచారములు సంగమముల కానందున (ఈ విశేషణమును వేయాలి. పరబ్రహ్మనిష్ణాతుడు అనుటకు ద్యోతకమును తెలుపుచున్నాడు ఉపశమాశ్రయం అని (శాంతికి ఆశ్రయుడు అని అర్థము). (21)

22.శ్లో॥ తత్ర భాగవతాన్ ధర్మాన్ శిక్షేద్గుర్వాత్మదైవతః ।
అమాయయానువృత్త్యా యైః తుష్యేదాత్మాత్మదో హరిః ॥

టీ:- గురురేవాత్మా దైవతం చయస్య సః. అనువృత్యాసేవయా యైర్ధర్మైః వస్తుత ఆత్మా, ఆత్మప్రపదశ్చోపాసకానాం. యథా బలి ప్రభృతీనాం.(22)

తా:- అట్టి గురువును దైవముగా భావించి నిష్కపటమైన సేవచే గురువును సంతోషపెట్టి, ఆ గురువు వలన ఏ ధర్మములచే హరి సంతోషమునుపొందునో అటువంటి ధర్మములను నేర్చుకొనవలెను. 22

టీ:- గురువే తనకు దైవముగా గలవాడై, అనువృత్తిచే సేవచే ఏ ధర్మముల చేత వస్తుతః ఆత్మనో, ఉపాసకులకు ఆత్మ ప్రపదుడు. బలిమొదలయిన వారికిని వలె. (22)

23.శ్లో॥ సర్వతో మనసోऽసంగం ఆదౌ సంగం చ సాధుషు ।
దయాం మైత్రీం ప్రశ్రయం చ భూతేష్వద్ధా యథోచితమ్ ॥

తా:- గురువు మొదట శిష్యునికి దేనియందు మనస్సునకు సంగము కూడదని చెప్పాలి. సాధుసంగము, ప్రాణులయందు, సములయందు మైత్రి, పెద్దల విషయాన వినయము కలిగి వుండాలని తగినట్లుగా బోధించాలి. (23)

టీ:- యథోచితమితి. హీనేషు దయాం సమేషు మైత్రీం ఉత్తమేషు ప్రశ్రయం చ శిక్షేదిత్యర్థః. (23)

టీ:- యథోచితమని. హీనులయందు దయా సములయందు మైత్రీ పెద్దలయందు వినయమును బోధించాలి. (23)

24.శ్లో॥ శౌచం తప స్తితిక్షాం చ మౌనం స్వాధ్యాయమార్జవమ్ ।
బ్రహ్మచర్య మహింసాం చ సమత్వం ద్వంద్వసంజ్ఞయోః ॥

తా:- మృజ్జలాదులతో బాహ్యశౌచము, అభ్యంతరశౌచము తితిక్షా, మౌనము, స్వాధ్యాయముల యందు ఋజుభావము, సత్ప్రవర్తన, బ్రహ్మచర్యము, అహింసా, శీతోష్ణములందు, సుఖదుఃఖములందు సమత్వము అనే వాటిని తెలిసికొనవలెను.(24)

టీ:- శౌచం బాహ్యం మృజ్జలాదిభిః. అభ్యంతరం చ అదంభామానాది శిక్షేత్. తపః స్వధర్మాచరణం. తితిక్షాం = క్షమాం. మౌనంః వృథావాచా మనుచ్చారణమ్. స్వాధ్యాయమధికారాను రూపం వేదపాఠాదికం. ఆర్జవం స్వచ్ఛతాం. బ్రహ్మచర్యం యస్యయాదృగుచిత మృతుకాలే స్వదారనియమాది అహింసాం భూతేష్వద్రోహం. ద్వంద్వ సంజ్ఞయోః శీతోష్ణ సుఖదుఃఖాది రూపయోః. సమత్వం హర్ష విషాద రాహిత్యమ్. (24)

టీ:- మృజ్జలములచే బాహ్యశౌచము. అదంభ, మౌనాదులచే అంతః శౌచము, తపస్సు = స్వధర్మాచరణ రూపము. తితిక్ష ఓర్పు. మౌనము వ్యర్థముగా వాగుచ్చారణ లేకుండుట. స్వాధ్యాయము అధికారాను రూపముగ వేదపాఠాదికము. ఆర్జవం = ఋజుభావము సత్ప్రవర్తన. బ్రహ్మచర్యము = ఎవనికేది ఉచితమో అది, గృహస్థునకు ఋతు కాలమున స్వదారగమనాది నియమాదికము బ్రహ్మచర్యమగును.

అహింస భూతములందు ద్రోహచింతలేకుండుట. శీతోష్ణ సుఖ దుఃఖాది రూపములయిన ద్వంద్వముల యందు సమత్వము = హర్ష విషాదరాహిత్యము మొదలగునవి. (24)

25.శ్లో॥ సర్వత్రాత్మేశ్వరాన్వీక్షాం కైవల్యమనికేతతాం ।
వివిక్తచీరవసనం సంతోషం యేన కేనచిత్ ॥

తా:- సకల వస్తుజాలములందు ఆత్మను చూచుట, ఏకాంత శీలత్వము, గృహాభిమాన రాహిత్యము, శుభ్రములయిన నారచీరలను ధరించుట, దైవికముగా ప్రాప్తించినదానితోనే సంతోషమును. (25)

టీ:- ఆత్మేశ్వరాన్వీక్షాం =సచ్చిద్రూపేణాత్మాన్వీక్షా నియన్తృరూపేణేశ్వరా న్వీక్షాం చ. కైవల్య మేకాంత శీలత్వం. అ నికేతతా గృహాద్యభిమాన రాహిత్యం. వివిక్త చీర వసనం = విజన పతితానాం వస్త్రఖం డానాం శుద్ధానాం వా వల్కలానాం పరిధానమ్. (25)

టీ:- ఆత్మేశ్వరాన్వీక్షాం సచ్చిద్రూపమును జూచుట. నియంతృ రూపమున ఈశ్వరుని చూచుటయు. కైవల్యము = ఏకాంతశీలత్వము. అ నికేతతాం గృహాదులయందు అభిమాన రాహిత్యము వివిక్త చీర వసనమ్ = శుభ్రమైన నారచీరలు ధరించుట. (25)

26.శ్లో॥ శ్రద్ధాం భాగవతే శాస్త్రే నిందామన్యత్ర చైవ హి ।
మనోవాక్కర్మదండం చ సత్యం శమదమావపి ॥

తా:- భగవత్ప్రతిపాదకమయిన శాస్త్రము నందు శ్రద్ధ, ఇతర శాస్త్రముల యందు నిందారాహిత్యమును మనోవాక్కాయములకు డండములను. యథార్థభాషణ శాంతిని ఇంద్రియనిగ్రహములను కలిగియుండుట. 26

టీ:- భాగవతే భగవత్ప్రతిపాదకే. అన్యత్ర శాస్త్రాదౌయా అనిందాతాం. మనసః ప్రాణాయామైర్వాచో మౌనేన కర్మణోऽనీహాయాదణ్డమ్. సత్యం

టీ:- భాగవతే = భతవత్ప్రతిపాదకమయిన శాస్త్రమునందు ఇతర శాస్త్రముల యందు నిందారాహిత్యమును. మనస్సునకు దండము

యథార్థభాషణమ్. శమదమా వంతః కరణ బాహ్యేంద్రివనిగ్రహౌ. 26

ప్రాణాయముచే, వాక్కునకు మౌనముచే, కర్మలకు ఫలపరిత్యాగముచే, దండము. సత్యం = యధార్థ భాషణము శమదమౌ అంతరింద్రియ నిగ్రహ బాహ్యేంద్రియ నిగ్రహము. ఇవి భాగవత ధర్మములు. (26)

27.శ్లో॥ శ్రవణం కీర్తనం ధ్యానం హరేరద్భుతకర్మణః ।
జన్మకర్మగుణానాం చ తదర్థేఽఖిలచేష్టితమ్ ॥

తా:- అద్భుత కర్మలు చేయువాడైన శ్రీహరి యొక్క అవతారముల యొక్క, కర్మల యొక్క, గుణముల యొక్కయు శ్రవణము, కీర్తనము చేయుట, హరినుద్ధేశించి సర్వకర్మలు చేయుట.(27)

టీ:- హరేర్జన్మ కర్మగుణానాం శ్రవణాది తదర్థే. హర్యుద్దేశేన సర్వం కర్మ విశేషతశ్చ యజనాదియత్తదర్థే శిక్షేత్. (27)

టీ:- హరియొక్క జన్మకర్మగుణముల శ్రవణ కీర్తనాదులు హరినుద్ధేశించి. హరినుద్ధేశించి సర్వకర్మలు విశేషముగా యజనాదులేవి కలవో అవి హరికొరకై అని తెలియవలెను. (27)

28.శ్లో॥ ఇష్టం దత్తం తపో జప్తం వృత్తం యచ్చాత్మనః ప్రియం ।
దారాంత్సుతాన్ గృహాన్ప్రాణాన్ యత్పరస్మై నివేదనమ్ ॥

తా:- యాగాదికము, దానము, తపస్సు, జపము చేయుట, సదాచారము. ఏది తనకు ఇష్టమో దానిని, భార్యను, పుత్రులను గృహములను పరమాత్మకు నివేదించుట (భాగవతధర్మములు). 28

టీ:- ఇష్టం దత్తమిత్యాదయో భావేనిష్ఠాః. వృత్తం సదాచారః. ఆత్మనః ప్రియం గంధ పుష్పాది. దారాదీనప్యాలక్ష్య పరస్మై పరమేశ్వరాయ నివేదనం తత్సేవకతయా సమర్పణం యత్తచ్ఛిక్షేత్. (28)

టీ:- ఇష్టము దత్తము మొదలయిన విభావము నందు ఉండునవి. వృత్తం = సదాచారము. ఆత్మనః ప్రియం= గంధపుష్పాదులు భార్యాదులను పరమేశ్వరునికి నివేదించుట = అతనికి సేవకై సమర్పించుట. అనునది ఏది కలదో అది అభ్యసింపవలెను. (28)

29.శ్లో॥ ఏవం కృష్ణాత్మనాథేషు మనుష్యేషు చ సౌహృదం ।
పరిచర్యాం చోభయత్ర మహత్సు నృషు సాధుషు ॥

తా:- ఈ ప్రకారము కృష్ణుడే ఆత్మనాథుడుగా గల మనుష్యులయందు సుహృద్భావము, తనకంటే గొప్పవారైన నరులయందు సాధువుల యందు, స్థావర జంగమములయందు సేవను అభ్యసించవలెను.(29)

టీ:- కృష్ణ ఏవాత్మా నాథశ్చ యేషాం. కృష్ణ ఆత్మనో జీవస్య నాథో యేషామితి వా తేషు. ఉభయత్ర స్థావరే జంగమేచ యా పరిచర్యా తామ్. విశేషతో నృషు తత్రాపి సాధుషు స్వధర్మ శీలేషు. తతోపి మహత్సు శ్రీభాగవతేషు. (29)

టీ:- కృష్ణుడే ఆత్మనాథుడుగాగల, కృష్ణఆత్మ అయిన జీవునికి నాథుడు ఎవరికో వారి యందు అని అయిననూ, ఉభయత్ర స్థావరజంగమముల యందు, ఏ పరిచర్యకలదో దానిని, విశేషముగా నరులయందు, తత్రాపి సాధువులయందు, స్వధర్మశీలురయందు, అంతకన్ననూ మహాత్ముల యందు భాగవతులయందును. (29)

30.శ్లో॥ పరస్పరానుకథనం పావనం భగవద్యశః ।
మిథోరతిర్మిథస్తుష్టిః నిర్వృతిర్మిథ ఆత్మనః ॥

తా:- పవిత్రమయిన భగవంతుని కథాదులను పదేపదే చెప్పుకొనుట, పరస్పరము ఆసక్తి. పరస్పరము సంతృప్తి ఆత్మకు సుఖము మరియు గౌరవమును తెలియాలి. (30)

టీ:- తైశ్చసహ సంగమ్య యత్పావనం భగవద్యశస్తస్య పరస్పరాను కథనం శిక్షేత్. యద్వా యశః ప్రతి తత్ర సంస్పర్ధాది పరిత్యాగేన మిథో యారతిః రమణం, యాచతుష్టిః సుఖం యాచనివృత్తిః "సమస్త దుఃఖ నివృత్తిస్తాం చ శిక్షేత్. (30)

టీ:- ఆ మహాపురుషులతో సంగమించి పవిత్రమైన భగవంతుని కీర్తిని భగవంతుని గుణములను ఒండొరులకు చెప్పుకొనుట, శిక్షించవలెను లేదా యశస్సును గూర్చి అచ్చట సంస్పర్ధాదులు పరిత్యాగమవుట వలన మిథోయారతిః రమణం = పరస్పరమాసక్తి; పరస్పరము సంతృప్తి, సుఖము, ఆధ్యాత్మికాది తాపత్రయ నివృత్తి; దానిని కోరవలెను. (30)

31. శ్లో॥ స్మరంతః స్మారయంతశ్చ మిథోऽఘౌఘహరం హరిం ।
భక్త్యా సంజాయతా మర్త్యా బిభ్రత్యుత్పులకాం తనుమ్ ॥

తా:– పాపరాశిని హరించు హరిని స్మరించువారు ఇతరులను స్మరింపచేయువారు. సాధన భక్తిచేత ప్రేమ లక్షణ భక్తి చేతనూ, గగుర్పాటుతో కూడిన శరీరమును ధరింతురు. (31)

టీ:– ఏవం వర్తమానానాం పరమానంద ప్రాప్తిమహ స్మరంత ఇతి ద్వయేన. భక్త్యాసాధన భక్త్యా సంజాతయా ప్రేమలక్షణయా భక్త్యా. 31

టీ:– ఇట్లు సాధన భక్త్యనుష్ఠాన ప్రకారముగా వుండెడి వారికి పరమానంద ప్రాప్తిని చెప్పుచున్నాడు స్మరంత అని రెండు శ్లోకములతో. భక్త్యా సాధన భక్తిచే, సంజాతయాః ప్రేమలక్షణ భక్తిచేతనూ. (31)

32. శ్లో॥ క్వచిద్రుదంత్యచ్యుతచింతయా క్వచిత్
హసంతి నందంతి నమంత్యలౌకికాః ।
నృత్యంతి గాయంత్యనుశీలయంత్యజం
భవంతి తూష్ణీం పరమేత్య నిర్వృతాః ॥

తా:– పరమేశ్వరుని పొంది సుఖ పరవశులయిన భక్తులు ఒక్కొక్కసారి అచ్యుతుని చింతచే ఏడుస్తారు. ఒక్కొసారి నవ్వుదురు. ఒక్కోసారి సంతోషిస్తారు. పరవశులై నమస్కరిస్తారు. ఆడుతారు, పాడుతారు. ఆయన లీలలను అభినయిస్తారు. వట్టిగావుంటారు.(లీనముకారు) (32)

టీ:– అజం హరిమనుశీలయంతి తల్లీలా మభినయన్తి. ఏవం పరమేత్య ప్రాప్య నిర్వృతాః సన్త స్తూష్ణీం భవంతి. (32)

టీ:– భగవంతుని స్వరూప స్వభావాలు పరిశీలింతురు. ఆయన లీలలను అభినయిస్తారు. ఈ విధముగా పరమేత్య = పరమేశ్వరుడిని పొంది నిర్వృతాః సంతః సుఖమొందినవారై తూష్టీం భవంతి (వట్టిగా వుందురు). (32)

33. శ్లో॥ ఇతి భాగవతాన్ ధర్మాన్ శిక్షేద్భక్త్యా తదుత్థయా ।
నారాయణపరో మాయాం అజం స్తరతి దుస్తరామ్ ॥

తా:– ఇట్లు ఆభాగవత ధర్మముల వలన పుట్టిన భక్తిచేత భాగవత ధర్మములను నేర్వవలెను. నారాయణుని యందాసక్తి కలవాడై తొందరగా తరింప కష్టమయిన మాయను చాటుచున్నాడు. (33)

టీ:- ఉపసంహరతి ఇతీతి. భాగవత ధర్మోత్పన్నయా భక్త్యా.(33)

టీ:- ఉపసంహరించుచున్నాడు ఇతియని. భాగవతధర్మములచే పుట్టిన భక్తి వలన. (33)

**రాజోవాచ:-**

34.శ్లో॥ నారాయణాభిధానస్య బ్రాహ్మణః పరమాత్మనః ।
నిష్ఠామర్హథ నో వక్తుం యూయం హి బ్రహ్మవిత్తమాః ॥

తా:- ఓ బ్రహ్మవేత్తలారా ! నారాయణుడను పేరుగల బ్రహ్మయైన పరమాత్మ యొక్క స్వరూపమును మాకు చెప్పండి. (34)

టీ:- "నారాయణపరో మాయాంతరతీ" త్యుక్తే పృచ్ఛతి - నారాయణాభిధేయస్యేతి. నిష్ఠాం స్వరూపం. అయం భావః బ్రహ్మైవ తావన్నారాయణ ఇతి భగవానితి పరమాత్మేతి చోచ్యతే. తదుక్తం "వదన్తి తత్తత్త్వవిదస్తత్త్వం యజ్ఞ్జాన మద్వయం. బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే." ఇతి. తథా - "నారాయణే భగవతి తదిదం విశ్వమాహితమ్. గృహిత మాయోరుగుణః సర్గాదావగుణః స్వతః." ఇత్యాదిషు. తత్ర కిమేభిః శబ్దైర్నిర్విశేషం తదేవ వస్తూచ్యతే, అస్తివా కోఽపి విశేషాంశ ఇతి.(34)

టీ:- నారాయణపరుడు మాయను తరించుచున్నాడు అని అనిన తరువాత అడుగుచున్నాడు - నారాయణాభి దానస్య అని. నిష్ఠాం స్వరూపమును,ఇది భావము- బ్రహ్మనే నారాయణుడని, భగవంతుడని, పరమాత్మా, అని చెప్పబడుచున్నాడు. "బ్రహ్మవిదులు ఆతత్త్వమును అద్వయమైన జ్ఞానమును బ్రహ్మ, పరమాత్మ, భగవంతుడు అనెడి శబ్దములచే చెప్పుదురు."అని చెప్పబడినది. "అట్లానే" నారాయణే భగవతి. "నారాయణుడను భగవంతుని యందు ఈ విశ్వము నిలిచియున్నది అగుణుడైన భగవంతుడు సర్గాదియందు మాయను గ్రహించి స్వయముగా గొప్ప గుణములు కలవాడగుచున్నాడు". ఇత్యాదుల యందు ఈ శబ్దములచే నిర్విశేషమైన ఆ బ్రహ్మనే చెప్పబడుచున్నది. ఇదికాక మరియేదైన విశేషాంశము కలదా అని ప్రశ్నించినాడు. (34)

**పిప్పలాయన ఉవాచ**

35.శ్లో॥ స్థిత్యుద్భవప్రళయ హేతురహేతురస్య
యత్స్వప్న జాగరసుషుప్తిషు సద్బహిశ్చ ।
దేహేంద్రియా సుహృదయాని చరంతి యేన
సంజీవితాని తదవేహి పరం నరేంద్ర ॥

టీ:- అత్రోత్తరమ్. స్థిత్యుద్భవేతి, అయమర్థః అస్య విశ్వస్య స్థిత్యుద్భవ ప్రళయానాం హేతుః స్వయం చాహేతుః హేతురహితః సనారాయణ ఇతి పరమేవ తత్వమవేహి స్వప్నజాగర సుషుప్తిషు సదను వర్తమానం యత్. వక్ష్యతి చ - "తురీయం త్రిషుసంతతమ్" ఇతి. బహిశ్చ సమాధ్యాదౌ యత్సత్తద్బ్రహ్మేతి పరమేవ తత్వమవేహి. దేహేంద్రియ ప్రాణమనాంసి యేన సంజీవితాని సంతి చరంతి ప్రవర్తన్తే తత్సరమాత్మేతి పరమేవ తత్వమవేహి ఏవం లక్షణ భేదై ర్నారాయణాది నామభిరుచ్య మానమపి పరమేక మేవతత్వం జానీహి. (35)

తా:- ఓ రాజా ! ఈ విశ్వము యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారణమయినవాడు, స్వయము హేతురహితుడు, అతడే పరతత్త్వమని తెలిసికొనుము. ఆ తత్త్వము జాగ్రత్స్వప్న సుషుప్తులయందు వర్తించుచున్నదై ఆ మూడవస్థల యందు తురీయమైనది సంతత ముండునది యని చెప్పబడును, సమాధి మొదలయిన వానియందేది యున్నదో, మరియు, దేహ ఇంద్రియ ప్రాణ హృదయము అనునవి దేనిచేత జీవింపబడినవవుతూ చరించుచున్నవో అదియే పరతత్వమని తెలిసికొనుము. (35)

టీ:- ఉత్తరము చెప్పుచున్నాడు. స్థిత్యుద్భవయని. ఇది యర్థము - ఈ విశ్వమునకు స్థితి, ఉనికి ప్రళయములకు కారణమైన వాడు స్వయముగా అహేతువు = హేతురహితుడు, ఆ నారాయణుడని పరమేల అయిన తత్త్వమని తెలిసికొనుము, స్వప్నజాగర సుషుప్తిల యందు సత్ = అనువర్తించెడిదై ఏది కలదా. "తురీయంత్రిషు సంతతం" అని చెప్పబోవుచున్నాడు, ఆ మూడవస్థల యందు తురీయమైనది సంతతముండునది (యని చెప్పబడును) బహిశ్చ = సమాధ్యాదుల యందు ఏదియున్నదో అదియే బ్రహ్మ పరతత్వమని తెలిసికొనుము దేహేంద్రియప్రాణ మనస్సులు దేనివలన జీవింపబడినవవి అగుచు సంచరించుచున్నవో అదియే పరమాత్మయని అదియే పరతత్వమని తెలిసికొనుము. ఈ విధముగా లక్షణ బేధములచే నారయణాభిధానము చెప్పబడుచున్నది. కాని పరతత్వమొక్కటే (కాని అన్యమే లేదని) తెలిసికొనుము. (35)

36.శ్లో॥ నైతన్మనో విశతి వాగుత చక్షురాత్మా
ప్రాణేంద్రియాణి చ యథానలమర్చిషస్స్వాః ।
శబ్దోऽపి బోధకనిషేధతయాత్మమూలం
అర్థోక్తమాహ యదృతేన నిషేధసిద్ధిః ॥

టీ:- అవేహీత్యనేన విషయత్వం ప్రాప్తం నిషేధతి నైతదితి. ఏతత్పరం తత్త్వం మనోన విశతి నవిషయీకరోతి. వాగుతవాగపి చక్షుశ్చాత్మా బుద్ధిశ్చ ప్రాణశ్చ క్రియాశక్త్యా నప్రాప్నోత్యన్యాని చేంద్రియాణి యథాऽనలం స్వాః స్వాంశభూతాః అర్చిషో విస్ఫులింగాదయోన ప్రకాశయంతి న దహంతి చ, తథా జడాసు మన ఆది వృత్తిష్వభివ్యజ్య మానస్యాత్మ ప్రకాశస్య తత్తద్వృత్తి ప్రకాశకస్య నతత్ప్రకాశ విషయత్వం. "ప్రాణస్య ప్రాణముత చక్షుశ్చక్షురుతశ్రోత్ర స్యశ్రోత్ర మన్న స్యాన్నం మనసో యే మనో విదుః" ఇతి. తథా "యతోవాచోనివర్తన్తే అప్రాప్యమనసాసహ" ఇత్యాదిశ్రుతేః. నను "తంత్వౌపనిషదం పురుషంపృచ్ఛామి" ఇతిశ్రుతేః శబ్దగోచరత్వం ప్రతీయతే తత్రాహ శబ్దోపీతి. శబ్దోప్యాత్మమూలమాత్మని ప్రమాణం సదర్థోక్తమర్థా దుక్తం యథా భవతి తథా ఆహ, న సాక్షాత్. కుతః బోధక నిషేధతయా స్వస్యైవ బోధకస్య నిషేధ రూపత్వాత్ "యతో వాచో నివర్తంతే" అప్రాప్యమనసాసహ". "యద్వాచానభ్యుదితం యేనవాగభ్యుతే. తదేవ బ్రహ్మత్వం విద్ధి" "యన్మనోనమనుతే" "న

తా:- ఈ పరతత్వమును మనస్సు ప్రవేశించలేదు, వాక్కు చక్షువు, బుద్ధి ప్రాణములు, ఇంద్రియములు ప్రవేశించలేవు అగ్నిని ఎట్లు స్వీయ విస్ఫులింగములు ప్రకాశింపచేయలేవో దహింపచేయలవో అట్లు.(36)

టీ:- ఆదేహి అనుటచే జ్ఞాన విషయమగుట ప్రాప్తముకాగా నిషేధించున్నారు. నైతదని. ఈ పరతత్త్వమును మనస్సు ప్రవేశించలేదు, వాగుత, వాక్కు కూడా, చక్షువు, ఆత్మా = బుద్ధియు, ప్రాణము క్రియా శక్తితో ప్రవేశించదు. ఇతర ఇంద్రియములునూ, ఎట్లు అగ్నిని స్వీయ స్వాంశభూతములయిన విస్ఫులింగాదులు ప్రకాశింపలేవో, దహింప చేయలేవో, అట్లు జడములయిన మన ఆది వృత్తుల యందు అభివ్యక్తమయ్యెడి ఆత్మ ప్రకాశమునకు ఆయా వృత్తి ప్రకాశకమునకు చక్షువు, శ్రోత్రమునకు శ్రోత్రము, అన్నమునకు అన్నము, మనస్సునకు మనస్సు అని తెలిసికొన్నరు, అని శృతి. అట్లే "వాక్కులు మనస్సుతో కూడ ఎవనిని తెలిసికొనలేక నివర్తించుచున్నవో" మొదలయిన శృతి వలన, అయ్యా! "తంత్వౌపని"... "ఉపనిషత్సంబంధియగు పురుషుని ప్రశ్నించుచున్నాను" అనెడి శృతిచే శబ్ద గోచరత్వము తోచుచున్నది గదా అనినచో అందులకై చెప్పుచున్నాడు శబ్దోపియని. శబ్దముకూడా ఆత్మ మూలము ఆత్మయందు ప్రమాణము అయినదై అర్థము వలన చెప్పబడిన ఏ ప్రకారము అగునో అట్లు, కాని సాక్షాత్తుగ కాదు,

చక్షుషా పశ్యతి కశ్చనైనం" ఇత్యాది శృతేః" నను తర్హి నైవాహ శృతిః కిమిదముచ్యతే అర్థోక్తమాహేతి తత్రాహ - యదృత ఇతి. "అథాత ఆదేశోనేతినేతి" "అస్థూలమనణు" "యతోవాచో నివర్తంతే" యద్వా చానభ్యుదితం" ఇత్యాది నిషేధస్య యదవధి భూతం బ్రహ్మ, ఋతే = వినా సిద్ధిర్నాస్తి. సర్వస్యనిషేధస్య సావధిత్వాత్. (36)

ఎందువలననగా, బోధక నిషేధత్వము తన యొక్క బోధకము (తనను బోధించు విధము) నిషేధ రూపమగుట వలన యతోవాచో... ఏది వాక్కుచే చెప్పబడునో దేనిచే వాక్కు వచించునో అదియే బ్రహ్మయని నీవు తెలిసికొనుము. " దేనిని మనస్సు తలచలేదో, దేనిచే మనస్సు సంకల్పించునో దానిని బ్రహ్మగా నీవు తెలిసికొనుము. "ఎవడునూ, ఈ ఆత్మను చక్షువులతో చూడలేడు" మొదలయిన శృతులవలన. అయ్యా! అట్లయిన ఇట్లు చెప్పరాదు అనగా ఇది ఏమని చెప్పబడును అర్థోక్తమాహయని = అర్థమునే చెప్పబడిన దానినిచెప్పుచున్నాడు. యదృత అని "అందువలన ఆవేశము ఇది కాదు" స్థూలము కాదు సూక్ష్మముకాదు" ఇత్యాది నిషేధమునకు ఏది అవధి భూతమో అది బ్రహ్మ. ఋతే = నిషేధము వినాసిద్ధి లేదు. సర్వనిషేధము అవధితో కూడినదగుట వలన. (36)

37. శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి త్రివృదేకమాదౌ సూత్రం
మహానహమితి ప్రదంతి జీవం ।
జ్ఞానక్రియార్థఫలరూపతయోరుశక్తి బ్రహ్మైవ
భాతి సదసచ్చ తయోః పరం యత్ ॥

తా:- మొదట ఏది ఏకమైన బ్రహ్మమో అదియే సత్త్వ, రజ, స్తమస్సులనెడి మూడు గుణములచే కూడిన ప్రధానముగా చెప్పుతారు. సూత్రమును ఆ బ్రహ్మగా చెప్పుతున్నారు. తరువాత ఆ యా దేవతలు ఇంద్రియములు అర్థములు. విషయములు అనే ఫలప్రకారమవుట వలన గొప్ప శక్తి గల బ్రహ్మమే; ప్రకాశించుచున్నది, ఏది స్థూల సూక్ష్మమయి కారణమును ఆ సదసత్తులకు పరమైవున్నదో అదీ బ్రహ్మమే. (37)

టీ:- నను తర్హి ప్రమాణా విషయత్వాన్నాస్తి బ్రహ్మేతి ప్రసజ్జేతాత ఆహ - సత్వమితి . సత్ స్థూలం కార్యం, అసత్ సూక్ష్మం కారణం తథ్సర్వం బ్రహ్మైవ భాతి. కుతః, యద్యస్మాత్తయోః సదసతోః పరం కారణం కార్య కారణాద్భిన్నం న భవతి "వాచారంభణ" మితిశృతేః నను కథమేకం బహు విధస్య కారణం తత్రాహ - ఉరుశక్తి అనేక శక్తిమత్. ఉరుర్మహతీ మాయాలణా శక్తిర్యస్య తదితి వా. బహుధా భానమేవ దర్శయతి - ఆదౌ యదేకం బ్రహ్మ తదేవ సత్వం రజస్తమ ఇతి. త్రివృత్ర్పధానం ప్రవదన్తి. తతః క్రియాశక్త్యా సూత్రం జ్ఞానశక్త్యా మహానితి తదేవప్రవదన్తి, తతోఽహమితి జీవం జీవోపాధి మహంకారం చ తదేవ ప్రవదన్తి. తతశ్చ జ్ఞాన క్రియార్థ ఫలరూపతయా జ్ఞాన శబ్దేన దేవతాః, క్రియా ఇంద్రియాణి, అర్థాః విషయా ఫలం తత్ర్పకాశః సుఖాదినా తద్రూపతయా బ్రహ్మైవభాతి. న హి సర్వస్వ రూపేణ స్వతో భాసమానస్య బ్రహ్మణః స్వసిద్ధౌ ప్రమాణాపేక్షేతి భావః.(37)

టీ:- అయ్యా! ప్రమాణ విషయము కానందున బ్రహ్మము లేదు అని బ్రహ్మము ప్రసక్తమగుచున్నది గదా, అనగా అందులకై చెప్పుచున్నాడు సత్వమని. సత్ = స్థూలమయిన కార్యము. అసత్ సూక్ష్మమైన కారణము. అదియంతయూ బ్రహ్మముగానే ప్రకాశించుచున్నది ఎందులకు, సద సత్తులకు పరం - కారణము. కార్యమునూ (అయ్యున్నందున) కార్యము కారణమునకన్నా భిన్నము కాదని "వాచారంభణ" శృతి చెప్పుచున్నది. అయ్యా! ఒక్కటి బహు విధములయిన దానికి కారణమెట్లగును, అనిని చెప్పుచున్నాడు-" ఉరుశక్తియని" అనేక శక్తులు కలది (కావున అట్లు చెప్పబడినది) ఉరు -మహా మాయాలక్షణమయిన శక్తి ఎవనికో, (దేనికో అది) అని అయిననూ అర్థము. అనేక విధములుగా ప్రకాశించుటనే చెప్పుచున్నాడు. ఆదౌయదేకం సృష్ట్యాదియందు ఏది ఏకమైన బ్రహ్మమో అదియే సత్వరజస్తమస్సులు అను త్రివిధ గుణరూపమైన ప్రధానమని చెప్పుచున్నారు. ఆ ప్రధానము యొక్క క్రియాశక్తిచే సూత్రాత్మ, జ్ఞానశక్తిచే మహాన్ అని దానినే చెప్పుచున్నారు. తరువాత జీవునికి జీవనోపాధియైన అహంకారమును ఆబ్రహ్మగా చెప్పుచున్నారు. తరువాత, జ్ఞానక్రియార్థ ఫలరూపతయా జ్ఞాన శబ్దముచేత దేవతలు, క్రియా ఇంద్రియములు, అర్థములు విషయములు. అను ఫల ప్రకాశమగుటచే సుఖాలయిననూ ఆ రూపము వలన బ్రహ్మాగానే ప్రకాశించుచున్నది. అనేక విధములుగా సర్వస్వరూపములతో స్వయముగా భాసమానమగు బ్రహ్మకు స్వసిద్ధియందు ప్రమాణాపేక్ష లేదు. (37)

38.శ్లో॥ నాత్మా జజాన న మరిష్యతి నైధతేऽసౌ
న క్షీయతే సవనవిత్ వ్యభిచారిణాం హి ।
సర్వత్ర శశ్వదనపాయ్యుపలబ్ధిమాత్రం
ప్రాణో యథేంద్రియబలేన వికల్పితం సత్ ॥

తా:- ఆత్మ పుట్టలేదు, మరణించదు, వృద్ధి క్షయాలను పొందదు, ఎందుచేతననగా, ఆగమాపాయములు గలవాని యొక్క ఆయా కాలములకు ద్రష్టయై యుంటాడు కావున, సర్వదేశములందు సర్వకాలములందు అపాయము లేకుండ (అనువర్తమానమే) జ్ఞానరూపమై ఆత్మ ప్రాణశక్తి వలె చక్షు శ్రోత్రాదీంద్రియముల బలముచే వివిధముగా కల్పితమై ఉండును. (38)

టీ:- నను సర్వాత్మకం చేద్బ్రహ్మ తర్హి సర్వస్యకార్యస్య జన్మాది వికారవత్వాద్బ్రహ్మణోऽపి తత్ప్రసంగః స్యాదత ఆహ- నాత్మేతి. ఆత్మా బ్రహ్మ న జజాన జాతః. జన్మాభావాదేవ తదనంతరాస్తితా లక్షణోపి వికారో నాస్తి. నైధతే న వర్ధతే. వృద్ధ్యభా వాదేవ విపరిణామ్యోపి నిరస్తః .కుతః, హి యస్మాద్వ్యభిచారిణామాగమాపాయినాం బాల యువాది దేహానాం సవనవిత్తత్తత్కాల ద్రష్టా. నహ్యవస్థావతాం ద్రష్టా తదవస్థో భవతీత్యర్థః. నను నిరవస్థః కోసావాత్మా, అత ఆహ - ఉపలబ్ధి మాత్రమితి. నన్వాయాతం తర్హి క్షణికత్వం నేత్యాహ - సర్వత్రేతి. సర్వత్ర దేశే శశ్వత్సర్వదా అనపాయ్యను వర్తమానం. ననునీల జ్ఞానం జాతం, పీతజ్ఞానం నష్టమితి ప్రతీతేర్న జ్ఞానస్యానపాయిత్వమత ఆహ' - ఇన్ద్రియబలేనేతి. సదేవ జ్ఞానమింద్రియబలేన వివిధం కల్పితమ్ నీలాద్యాకార వృత్తయ ఏవ జాయన్తే నశ్యంతి చ, న జ్ఞానమితి భావః వ్యభిచారిష్వ వ్యభిచారేదృష్టాన్తః - ప్రాణో యథేతి. (38)

టీ:- అయ్యా ! బ్రహ్మ సర్వాత్మకమయినచో సర్వకార్యమునకు జన్మాది వికారములున్నందున, బ్రహ్మకు ఆ వికారవత ప్రసంగము కలుగును అందులకని నాత్మా యని చెప్పుచున్నాడు. ఆ బ్రహ్మ జన్మించలేదు. జన్మలేదు కావుననే తరువాతదయిన అస్తితా లక్షణమయిన వికారము కూడా లేదు. నైధతే = వృద్ధిపొందదు. వృద్ధి లేదు కావుననే విపరిణామము కూడా నిరస్తమయినది. ఎందులకు, ఎందులకనగా వ్యభిచారిణాం= ఆగమాపాయములు గల వాని యొక్క బాలయువాది దేహావ్యవస్థలకు ద్రష్టయై యుండు వాడు. ఆయా అవస్థలు కలవాడు కాడు. సవనవిత్ = ఆయాకాలములకు ద్రష్టయైయుండును కావున. అవస్థలు కలవారి ద్రష్టా, అవస్థలు లేనివాడు అని యర్థము. అయినచో నిరవస్థుడయిన ఈ ఆత్మ ఎవడు అందులకై చెప్పుచున్నాడు ఉపలబ్ధిమాత్రమని. (జ్ఞానరూపమై). అట్లయినచో క్షణికత్వము

వచ్చిపడినది, అనిన, కాదనుచున్నాడు సర్వత్ర అని. సర్వత్ర సర్వదేశములందు శశ్వత్ సర్వకాలములందు, అనపాయి అపాయము లేకుండా అనువర్తనమానమై, అయినచో 'నీల'వర్ణ జ్ఞానము కలిగిన 'పీత'వర్ణజ్ఞానము నష్టమయినది అనెడి ప్రతీతిననుసరించి జ్ఞానమునకు అనపాయిత్వమనునది లేదుకదా?యనిన చెప్పుచున్నాడు ఇన్ద్రియ బలము చేయని. సద్జ్ఞానమే ఇంద్రియ బలముచే వివిధముగా కల్పించ బడినది. నీలాద్యాకారవృత్తులే పుట్టుచున్నవి, నశించుచున్నవి. (జ్ఞానము మాత్రము కాదని భావము) ఇంద్రియాదుల లయమందు నిర్వికారమైన ఆత్మోపలబ్ధిని తెలుపుతున్నారు. ప్రాణోయథా అని.(38)

39. శ్లో॥ అండేషు పేశిషు తరుష్వవినిశ్చితేషు
ప్రాణో హి జీవముపధావతి తత్ర తత్ర ।
సన్నే యథేంద్రియగణేऽహమి చ ప్రసుప్తే
కూటస్థ ఆశయమృతే తదనుస్మృతిర్నః ॥

తా :- పక్షులయందు నరమృగాదులయందు తరు లతాదులయందు మశక మత్కుణాదులయందు ప్రాణము జీవుని ఏ ప్రకారము అనువర్తిస్తున్నదో, ఆ ప్రకారము జాగరమునందు ఇంద్రియగణము స్వప్నమునందు తత్సంస్కారవంతమైన అహంకారము ఏ ప్రకారము లీనమవుతుందో ఆ ప్రకారము ప్రసుప్తమో. అప్పుడా ప్రసుప్తమునందు ఇంద్రియగుణము లీనమైనను, అహంకారము లీనమైనను, ఆ సుషుప్తి యందు లింగశరీరోపాధిలేకున్ననూ కూటస్థుడైన ఆత్మ తప్పక వుండును. అందుకు కారణమేమనగా విశేషజ్ఞానశూన్యుడై, సుఖస్వరూపుడై సాక్షాత్తుగానున్న ఆత్మానుస్మరణము మనకు కలుగుచున్నది.

టీ:- దృష్టాంతం వివృణ్వన్నిన్ద్రియాది ఇలయేన నిర్వికారాత్మోపలబ్ధిం దర్శయతి. అండేష్వితి. పేశిషు = జరాయుజేషు. తరుషు ఉద్భిజ్జేష్వని విశ్చితేషు. స్వేదజేషు ఉపధావత్యనువర్తతే. ఏవం దృష్టాంతే నిర్వకారత్వం ప్రదర్శ్య దార్ష్టాన్తికే Sపి దర్శయతి - కథమ్. తదైవాత్మా స వికార ఇవ ప్రతీయతే యద్యదా జాగరే ఇంద్రియగణో యదా చ స్వప్నే తత్సంస్కారవానహంకారః. యదా తు ప్రసుప్తం తదా తస్మిన్మ సుప్తే ఇంద్రియగణే సన్నే లీనే అహయ్యహంకారే చ సన్నే కూటస్థో నిర్వికార ఏవాత్మా. కుతః ఆశయమృతే లింగశరీరముపాధిం వినా. వికారహేతోరుపాధేరభావిత్యర్థః. నన్వహంకార పర్యంతస్య సర్వస్య లయే శూన్య మేవావశిష్యతే, తత్కథం తదా కూటస్థ ఆత్మా అత ఆహ - తనుస్మృతిర్నః; తస్య దర్శన స్పర్శనాది విశేష జ్ఞాన శూన్యస్య సుఖాత్మనః సుషుప్తి సాక్షిణః; స్మ ృతిర్నో Sస్మాకం భవతి, ఏతావతం కాలం సుఖమహం సుప్తో న కించిదవేతిషమ్ ఇతి. అతో Sనను భూత స్యాస్మరణాదస్త్యేవ సుషుప్తావాత్మానుభవో విషయ సంబంధా భావాత్తు ఇంతకాలము నేను సుఖముగా నిద్రించినాను ఏమియూ తెలియ కుంటిని అని "అనుభవములేక స్మరణకలుగదు" అందువలన సుషుప్తియందు ఆత్మ సాక్షియైయున్నాడు. విషయసంబంధా భావము వలన స్పష్టము కాదని భావము. (39)

టీ:- ఈ విధముగా దృష్టాంతము యందు నిర్వికారత్వమును ప్రదర్శించి దార్ష్టాంతికముయందు కూడా చూపుచున్నాడు. (తెలుపు చున్నాడు) ఎట్లు. ఆ ఆత్మయే స్వవికారము వలె యిట్లు తోచుచున్నది. జాగరమునందు ఇంద్రియ గణము స్వప్నమునందు తత్ సంసార్క వంతమైన అహంకారము ఏ ప్రకారము లీనమగునో, (ఆ ప్రకారము ప్రసుప్తము) అప్పుడు ఆ ప్రసుప్తము నందు ఇంద్రియగణము లీనమైననూ అహంకారము లీనమైననూ కూటస్థ = నిర్వికారుడగు ఆత్మయే అయి ఉన్నాడు. ఎందువలన, ఆశయ మృతే = లింగ శరీర ఉపాధిని లేకున్ననూ, వికార హేతువులైన ఉపాధి అభావము వలన అని అర్థము. అయ్యా! అహంకార పర్యంతము సర్వమూ లయమైనచో శూన్యమే మిగులును, అయినచో అప్పుడు అది కూటస్థ ఆత్మ ఎట్లగును? అనిన చెప్పుచున్నాడు తదనుస్మృతిర్నః = అప్పుడు విశేష జ్ఞాన శూన్యమైన (కూటస్థుడు ఎక్కడుండును) సుఖాత్మకమైన సుషుప్తి సాక్షి యొక్క స్మరణ మనకు కలుగుచున్నది ఇంతకాలము నేను సుఖముగా

న స్పృష్ట ఇతి భావః. తథా చ శృతిః – "యద్వైతన్న పశ్యతి పశ్యన్వై తద్ద్రష్టవ్యం న పశ్యతి" న హి ద్రష్టుద్దృష్టేర్విపరి లోపోవిద్యతే ఇతి. (39)

నిద్రించితిని ఏమియునూ తెలియకుంటిని అని. అందువలన అనుభూతమైన దాని స్మరణముచే సుషుప్తి యందు ఆత్మానుభవమును ఉండనే యున్నది. విషయ సంబంధము లేనందువలన సృష్ఠముగా లేదని భావము. అట్లే శృతి "యద్వైతం" అనగా "ఏ నిద్రావస్థయందు ద్వైతమును చూడరో అప్పుడునూ", ద్రష్టయొక్క దృష్టి లోపము లేదు అని. (39)

40. శ్లో॥ యర్హ్యబ్జనాభచరణేషణయేరుభక్త్యా
చేతోమలాని విధమేద్గుణకర్మజాని ।
తస్మిన్విశుద్ధ ఉపలభ్యత ఆత్మతత్త్వం
సాక్షాద్యథామలదృశోస్సవితృప్రకాశః ॥

తా:– ఎప్పుడు పద్మనాభుని పాదార విందములయందు ఆసక్తియైన భక్తిచే గుణకర్మల వలన జనించిన చిత్త కులములను నాశనము చేయుట వలన చిత్తము శుద్ధమగుచున్నదో అప్పుడే నేత్రములు తిమిరాది రోగములు లేక నిర్మలములై యుండగా పూర్వ సిద్ధమైన సూర్య ప్రకాశము ఎట్లు తోచునో అట్లు ప్రత్యక్షముగా ఆత్మ స్వరూపమును పొందుచున్నాడు. (40)

టీ:– నను యది సుషుప్తౌ కూటస్థాత్మానుభవో భవేత్ కథం పునరపి సంస్కారః స్యాత్, అవిద్యా తత్ సంస్కారాణాం విద్యమానత్వ దితిచేత్ కదా తర్హి తన్నివర్తకోऽనుభవో భవే దత ఆహయర్హీతి. విత్తైషణాది విహాయ కేవల మజనాభిస్యైవ చరణీచ్ఛయాయా ఉరు భక్తిస్తయా మాంశ్చేతసో మలాని విధయేన్నాశయేత్. చేత ఏవ నా కర్తృస్వ గతాని

టీ:– అయ్యా! సుషుప్తి యందు కూటస్థాత్మానుభవము కలిగినచో మళ్లీ ఎట్లు సంసారము కలుగునో, అవిద్యాదితత్సంస్కారములు ఉన్నందు వలన అన్నచో ఆ సంసార నివర్తకమైన అనుభవము ఎప్పుడూ కలుగును అనిన చెప్పుచున్నాడు – యర్హి యని. విత్తైషణాదులు వదిలి కేవలము అజనాభుని పాదాసక్తమైన ఉరుభక్త్యా ఉరుభక్తిః చేత పురుషుడు మనో

మలాని తయాభక్త్యా క్షాలయేత్. తదా తస్మిన్ విశుద్ధే చేతసి సతి సాక్షా దవ్యవధానేనాత్మతత్వ ముపలభ్యతే అమలయోర్దృశోః సత్యోర్యథా పూర్వమేవ సిద్ధః సవితృ ప్రకాశ ఇతి. (40)

మాలిన్యములను నాశనము చేయుచున్నాడో (అప్పుడు) భక్త చిత్తము కర్తృ స్వగతమైన మలములను ఆ భక్తితో శుద్ధి చేయవలెను। అప్పుడు ఆ విశుద్ధమైన మనస్సు నందు సాక్షాత్ - అవ్యవధానముగ (అడ్డు లేక ప్రత్యక్షముగ) (సుషుప్తి వలె అవిద్యాది వ్యవిధానముగ లేకపోవుట వలన) ఆత్మ స్వరూపము పొందబడుచున్నది. అమలయోర్దృశో. తిమిరాది రోగములు లేక నిర్మలములై యుండు నేత్రములకు పూర్వ సిద్ధమైన సూర్యుని ప్రకాశము వలె అని. (40)

**రాజోవాచ:-**

41. శ్లో॥ కర్మయోగం వదత నః పురుషో యేన సంస్కృతః ।
విధూయేహాశు కర్మాణి నైష్కర్మ్యం విందతే పరమ్ ॥

తా:- మాకు కర్మయోగమును చెప్పుము ఏ కర్మయోగముచే పురుషుడు సంస్కారమును పొందినవాడై ఈ లోకమున కర్మలను తొందరగా వదలించుకుని పరమపదమైన మోక్షమును పొందుచున్నాడు. (అట్టి). (41)

టీ:- భక్తేః కర్మయోగాధీనత్వాత్త పృచ్ఛతి కర్మయోగమితి. నైష్కర్మ్యం కర్మ నివృత్తి సాధ్యం జ్ఞానం. (41)

టీ:- భక్తి కర్మయోగాధీనమైనందు ఆ కర్మను గూర్చి ప్రశ్నించుచున్నాడు. కర్మయోగమని. నైష్కర్మనాం = కర్మ నివృత్తి సాధ్యమైన జ్ఞానమును. (41)

42. శ్లో॥ ఏవం ప్రశ్నమహం పూర్వం అపృచ్ఛం పితురంతికే ।
నాబ్రువన్ బ్రాహ్మణః పుత్రాః తత్ర కారణముచ్యతామ్ ॥

తా:- ఈ విధముగా పూర్వము ప్రశ్నను నా తండ్రియైన ఇక్ష్వాకుని సమీపమునందు ప్రశ్నించితిని. బ్రహ్మమానస పుత్రులైన సనకాదులు చెప్పరైరి అందుకు కారణమును గూడ చెప్పగోరుచున్నాను. (42)

టీ:– ప్రశ్నాంతరమాహ –ఏవమితి. ప్రశ్నం ప్రష్టవ్యమర్థం. పితురిక్ష్వాకోః బ్రహ్మణః పుత్రాః సనకాదయః సర్వజ్ఞా అపి నా బ్రువన్. (42)

టీ:–వేరు ప్రశ్నను అడుగుచున్నాడు ఏవమని. ప్రశ్నంః అడగవలసిన అర్థమును. పితుః ఇక్ష్వాకువుయొక్క , బ్రహ్మపుత్రులు = సనకాదులు. సర్వజ్ఞులయిననూ చెప్పరైరి. (42)

**అవిర్హోత్ర ఉవాచ:-**

43. శ్లో॥ కర్మాకర్మవికర్మేతి వేదవాదో న లౌకికః ।
వేదస్య చేశ్వరాత్మత్వాత్ తత్ర ముహ్యంతి సూరయః ॥

తా:– వేద విహితమయినది కర్మ. తద్విపరీతము అకర్మ; వేద విహితకర్మ చేయకపోవుట వికర్మ, అని ఈ మూడునూ వేదైక గమ్యములు లౌకికములు కావు. వేదము ఈశ్వరాత్మకమయినందున ఆకర్మాదిక మందు పండితులు మోహము పొందుదురు. (43)

టీ:– గహనత్వద్యోతనాయ ప్రథమం ద్వితీయ ప్రశ్నస్యోత్తరమాహ – కర్మేతి. కర్మవిహితమ్. అకర్మ తద్విపరీతమ్ నిషిద్ధమ్. వికర్మవిగతం కర్మ విహితాऽకరణమ్. ఏతత్త్రయం వేదవాదో వేదైకగమ్యమ్. న లౌకికః. వేదస్యేశ్వరాత్మత్వాదీశ్వరాదుద్భూతత్వాదపౌరుషేయత్వాదిత్యర్థః పుంవాక్యేహి వక్తురభిప్రాయతోऽర్థ జ్ఞానం శక్యమపౌరుషేయే తు కేవలం వాక్య పౌర్వాపర్యేణైవ తాత్పర్యావధారణం, తచ్చదుష్కరమితి తత్ర కర్మాదౌ విద్యాంసోऽపి ముహ్యన్తి కిముతాన్యే అతస్తవతదా బాలత్వాన్నైవా బ్రువన్నితి. (43)

టీ:– తెలియుటకు చాలా కష్టమైనదనుటకు మొదట ద్వితీయ ప్రశ్నమునకుత్తరమిచ్చుచున్నాడు కర్మయని. కర్మ విహితమయినది. అకర్మః తద్విపరీతము నిషిద్ధము. వికర్మః విగతమయిన కర్మ (వేద విహిత కర్మ చేయకపోవుట) ఈ మూడునూ వేదవాదో = వేదైక గమ్యములు. లౌకికము కాదు (లౌకికశాస్త్ర వేద్యములు కావు) వేదము ఈశ్వరాత్మకమయినందున = ఈశ్వరుని వలన ఉద్భవించినదగుట వలన, అపౌరుషేయమగుట వలన యని యర్థము. పురుష వాక్యము నందు వక్తయొక్క అభిప్రాయము వలన అర్థజ్ఞానము శక్యమగును, అపౌరుషేయము నందు (వేదమునందు) మాత్రము కేవలము

44.శ్లో॥ పరోక్షవాదో వేదోऽయం బాలానామనుశాసనం ।
కర్మమోక్షాయ కర్మాణి విధత్తేహ్యగదం యథా ॥

టీ:- దుర్జ్ఞేయం వేదతాత్పర్యమాహ - పరోక్షవాద ఇతి. యత్రాऽన్య ధాస్థితోऽర్థః సంగోపయితు మన్యథా కృత్వోచ్యతేసపరోక్షవాదః. తథా చ శృతిః 'తం వా ఏతం చతుర్హోతగ్ం సంతం. చతుర్హోతేత్యాచక్షతే పరోక్షేణ . పరోక్ష ప్రియా ఇవహి దేవాః." ఇతి పరోక్ష వాదత్వమేవాహ- కర్మమోక్షాయేతి. నను స్వర్గాద్యర్థం కర్మాణి విధత్తే, న కర్మమోక్షార్థం తత్రాహ - బాలానా మనుశాసనం యథా భవతి తథా. అత్ర దృష్టాన్తః అశద మౌషధమ్. యథా పితాబాల మగదం పాయయన్ఖణ్డలడ్డు కాదిభిః ప్రలోభయన్పాయయతి దదాతి చ తాని. నైతావతాऽగద పానస్య తల్లాభః ప్రయోజనమ్, అపిత్వారోగ్యమ్. తథావేదోऽప్యవాన్తరఫలైః ప్రలోభయన్ కర్మమోక్షాయైవ కర్మాణి విధత్తే. (44)

పౌర్వాపర్వము చేతనే అర్థ నిర్ణయము చేయదగియుండును; అదియును దుష్కరము అని యాకర్మలయందు విద్వాంసులు కూడా మోహము నొందుదురు. ఇతరుల విషయమేమనవచ్చును. అందులకని నీవప్పుడు బాలుడవగుట వలన నీకు సనకాదులు (కర్మను గూర్చి ఉత్తరమును చెప్పరైరి. (43)

తా:- ఈ వేదము ఏదోనొక విషయమును పరోక్షముగా చెప్పునది, అందువలన కర్మయోచనము కొరకే కర్మలను చేయుదని విధించు చున్నది, బాలురకు శాసించుటకు ఎట్లనగా ఔషదమెట్లో (అట్లు). (44)

టీ:- వేదతాత్పర్యము దర్జ్ఞేయమనుచున్నాడు పరోక్షవాద అని. ఎచ్చట ఏ అర్థము అన్వయము ఏవిధముగా నున్నదో, అన్యవిధముగా చేసి చెప్పబడుచున్నదో, అది పరోక్షవాదము. అట్లే శృతి- "చతుర్హోతగానున్న వానిని చతుర్హోతగా చెప్పుచున్నారు. పరోక్షముగా దేవతలు చెప్పుదురు. పరోక్షప్రియులు కదా దేవతలు"అని. పరోక్ష వాదత్వమునే చెప్పుచున్నారు -కర్మమోక్షాయయాని. అయా! కర్మలు స్వర్గము కొరకు విధింపబడు చున్నాయి. కర్మ మోక్షమునకై కాదు కదా యనిన చెప్పుచున్నారు - బాలానామనుశాసనమ్మని. బాలురకు అనుశాసనమెట్లో అట్లు అని. ఇచ్చట దృష్టాన్తము. అగదము = ఔషధము. తండ్రి బాలునికి ఔషధము

45. శ్లో॥ నాచరేద్యది వేదోక్తం స్వయమజ్ఞోఽజితేంద్రియః ।
వికర్మణా హ్యధర్మేణ మృత్యోర్మృత్యుముపైతి సః ॥

టీ:- నను కర్మ మోక్షశ్చేత్పురుషార్థః తర్హి ప్రథమమేవ కర్మత్యజ్యతామత ఆహ - నాచరేదితి. అజితేన్ద్రియత్వాదజ్ఞః స్వయం యదినాచరేత్తర్హి వికర్మణా కర్మాఽనాచరణ లక్షణేన అధర్మేణ మృత్యోనరన్తరం మృత్యుమేవ ప్రాప్నోతి. తథా చ శృతిః "మృత్వా పునర్మృత్యుమాపద్యన్తే" అర్ద్యమానాస్వకర్మభిః" ఇతి. (45)

త్రాగించదలచి ఖండ లడ్డుకాదులచే ప్రలోభ పెట్టి పానము చేయించుచూ వానిని ఇచ్చుచున్నాడు. ఇంత మాత్రమున ఔషధ దానముచే వానికి లాభము లేదని కాదు. ప్రయోజనము ఆరోగ్యము (ఎట్లో) ఆ ప్రకారము వేదమునూ అవాంతర ఫలముచే ప్రలోభ పెట్టి కర్మ మోక్షము కొరకే కర్మలను విధించుచున్నది. (44)

తా:- ఇంద్రియములను జయించని వాడై అజ్ఞుడు వేదముచే చెప్పబడిన కర్మను ఆచరింపని వాడైనచో అధర్మకర్మాచరణ, ధర్మకర్మను ఆచరించని లక్షణమయిన వికర్మచే మృత్యువు నుండి మృత్యువును పొందుచున్నాడు. (45)

టీ:- అయ్యా! కర్మ మోక్షమే పురుషార్థమయినచో మొదటనే కర్మను (వదలండి) త్యజించండి అనిన చెప్పుచున్నారు నాచరేదని. ఇంద్రియములను జయించనివాడై యున్నందున అజ్ఞుడు స్వయముగా వేదోక్తమయిన దానిని చేయడేని కర్మనాచరించని లక్షణములు గలదైన అధర్మమైన వికర్మ (జనన మరణ రూపమయిన) మృత్యువు నుండి మృత్యువునే పొందుచున్నాడు. ఈ విషయమున "మృత్వా పునర్మృత్యుమాపద్యన్తే" శృతి కూడా మరణించి మళ్ళీ మృత్యువును పొందుచున్నారు తమ అని కర్మలచే పీడింపబడుచున్నవారై (అనిత్యత్వము అని). (45)

46.శ్లో॥ వేదోక్తమేవ కుర్వాణో నిస్సంగోఽర్పితమీశ్వరే ।
నైష్కర్మ్యం లభతే సిద్ధిం రోచనార్థా ఫలశ్రుతిః ॥

తా:- ఫలాసక్తి లేనివాడై ఈశ్వరార్పణ చేసి వేదోక్తకర్మనే చేయుచూ నైష్కర్మ్య సిద్ధిని మోక్షమును పొందుచున్నాడు ఫలశ్రవణము అభిరుచికి పుట్టించుటయే ప్రయోజనముగా గలది. (46)

టీ:- తస్మాద్వేదోక్తమేవ కుర్వాణో న తు నిషిద్ధమ్. నను కర్మణి క్రియమాణే తస్మిన్నాసక్తిస్తత్ఫలం చ స్యాన్నతునైష్కర్మ్యరూపా సిద్ధిరత ఆహ - నిస్సంగోఽనభినివేశవాన్. ఈశ్వరేఽర్పితం న తు ఫలోద్దేశేన. నను ఫలస్య శృతత్వాత్కర్మణి కృతే ఫలం భవేదేవ న, రోచనార్థేతి . కర్మణి, రుచ్యుత్పాదనార్థమగదపానే ఖండలడ్డుకాదివత్ తతశ్చ కర్మాబి రుచ్యా వేదార్థం సమ్యగ్విచారయతి. తదా చ "యేవాఏతదక్షర మవిదిత్వా గార్గ్య స్మాల్లోకాత్ప్రైతి సకృపణః" ఇత్యనాత్మజ్ఞస్యైవ కృపణతామ్. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి. బ్రహ్మచర్యేణ తపసా శ్రద్ధయా యజ్ఞేనాఽనాశకేన" ఇతి యజ్ఞాదీనాం జ్ఞానశేషతాం చావధార్య నిష్కామేఘకర్మసు ప్రవర్తతే. తతశ్చ "స్వర్గకామో యజేత" ఇత్యాదిభిః కామితస్యైవ స్వర్గాదేః ఫలత్వేనావగమాదకామితో ఽసౌన భవతీతి నైష్కర్మ్య సిద్ధిర్భవతీతిభావః. (46)

టీ:- అందులకు వేదోక్తమయిన కర్మనే చేయుచూ, నిషిద్ధమయిన దానినికాదు. అయ్యా! కర్మనాచరించగా దానియన్దాసక్తి, తత్ఫలము కూడా కలుగగలదు నైష్కర్మ్యరూపమయిన సిద్ధి కలుగదు కదా యనిన చెప్పుతున్నాడు నిస్సంగోయని. ఫలాభిసంధి లేనివాడు, ఈశ్వరుని యందు అర్పింపబడినదైన వేదోక్తకర్మ (నా చరించుచూ) ఫలోద్దేశమున కాదు. అయ్యా! ఫలము వినబడుచున్నందున కర్మనాచరించినచో ఫలము వుండే తీరును అనిన కాదు. రోచనార్థా అని అనుచున్నాడు. కర్మయందు రుచి కలిగించేందుకు ఔషధపానమున ఖండశర్కర లడ్డూకముల వలె. తరువాత కర్మాభిరుచి వలన వేదార్థమును చక్కగా విచారించగలడు. "యోవా" "ఓ గార్గి ఎవడు ఈ అక్షర పరబ్రహ్మను తెలిసికొనక ఈ లోకము నుండి చనిపోవుచున్నాడో వాడు కృపణుడు" అని అనాత్మజ్ఞునికి కృపణత్వమును చెప్పుచున్నది శృతి. "బ్రాహ్మణులు వేదాధ్యయనముచే బ్రహ్మచర్యముచే తపస్సుచే, శ్రద్ధచే, యజ్ఞముచే, ఉపవాసముచే ఆ బ్రహ్మమును ఎరుగుచున్నారు. (తెలిసికొన గోరుచున్నారు) అని యజ్ఞాదులు జ్ఞాన శేషములుగా, లెక్కించి

నిష్కామములైన కర్మలందు ప్రవర్తించుచున్నారు. అందువలన, "స్వర్గకామోయజేత" (స్వర్గకాముడు యజించవలెను) ఇత్యాది శృతులచే కోరిన వానికే స్వర్గాదికము ఫలముగా తెలియుట వలన ఇతడు అకాముడయినచో నైష్కర్మ్య సిద్ధియే కలుగునని భావము. (46)

47. శ్లో॥ య ఆశు హృదయగ్రంథిం నిర్జిహీర్షుః పరాత్మనః ।
విధినోపరచరేద్దేవం తంత్రోక్తేన చ కేశవమ్ ॥

తా:- ఎవడు జీవుని యొక్క అహంకార బంధమును త్యజింపగోరుచున్నాడో వాడు ఆగమశాస్త్ర విధానముచే దేవుడయిన కేశవుడిని ఉపచరించవలెను (పూజించాలి). (47)

టీ:- వైదికం కర్మయోగముక్త్వా తాంత్రిక మాహయ ఆశ్వితి. పరాత్మనః పరస్యైవ సతః ఆత్మనోజీవస్య హృదయగ్రంథిమహంకార బంధం నిర్హర్తుమిచ్ఛుః సన్ తంత్రోక్తేన చ విధినా ప్రకారేణ భజేత్. తంత్రమాగమః చకారాద్వైదికేన సహసముచ్చయమాహ. (47)

టీ:- వైదికమయిన కర్మయోగమును చెప్పి తాంత్రికమును చెప్పుచున్నారు – య ఆశుయని. పరాత్మనః = పరుడుగా వున్న జీవుని యొక్క. హృదయగ్రంథిని = అహంకారబంధమును త్యజింపగోరుచున్నవాడై తంత్రోక్త ప్రకారముగా పూజించవలెను. తంత్రము = ఆగమము. చకారము వలన వైదికముతో సహసముచ్చయమును చెప్పుచున్నాడు. (47)

48. శ్లో॥ లబ్ధానుగ్రహ ఆచార్యాత్ తేన సందర్శితాగమః ।
మహాపురుషమభ్యర్చేత్ మూర్త్యాభిమతమాత్మనః ॥

తా:- ఆచార్యుని అనుగ్రహము పొందినవాడై ఆచార్యుడు తెలిపిన ఆగమోక్తమైన అర్చనా ప్రకారముతో తన కిష్టమైన విష్ణుప్రతిమను ప్రతిష్ఠించి ఆ మహావిష్ణువును పూజించవలెను. (48)

టీ:- తమేవ విధిమాహ - లబ్ధానుగ్రహ ఇత్యాదినా. తేనాచార్యేణ సందర్శిత ఆగమోऽర్చన ప్రకారో యస్య సః. (48)

టీ:- ఆ విధినే చెప్పుచున్నాడు లబ్ధానుగ్రహ అనెడి శ్లోకము నుండి. ఆ ఆచార్యుని చేత దర్శింపబడిన ఆగమము అర్చనా ప్రకారము ఎవనికోవాడు. (తెలుపబడిన ఆగమోక్తమైన అర్చనా ప్రకారము గలవాడై) (48)

49. శ్లో॥ శుచిస్సమ్ముఖ ఆసీనః ప్రాణసంయమనాదిభిః ।
పిండం విశోధ్య షణ్ణ్యాసకృతరక్షోऽర్చయేద్ధరిమ్ ॥

తా:- స్నానాదుల నాచరించి పరిశుద్ధుడై భగవత్ప్రతిమ కెదురుగా కూర్చుని ప్రాణాయామము భూత శుద్ధిని మొదలయిన వానిచే దేహమునుశుద్ధి చేసికొని ఆరు విధములగు అంగన్యాసాదులచే ఆత్మరక్ష చేసికొని విష్ణువును పూజించవలెను. (49)

టీ:- మూర్తేః సంముఖమాసీనః. ఆదిశబ్దేన భూతశుద్ధ్యాదిభి. పిండం దేహం విశోధ్యసన్న్యాసైః సద్భిర్న్యాసైః కృతా రక్షా యేన సః. (49)

టీ:- మూర్తికి ఎదురుగా కూర్చొని. ఆది శబ్దముచే భూత శుద్ధ్యాదుచే, పిండంః దేహమును శోధించి, న్యాసములచే చేయబడిన రక్ష గలవాడై. (49)

50. శ్లో॥ అర్చాదౌ హృదయే వాపి యదా లబ్ధోపచారకః ।
ద్రవ్యక్షిత్యాత్మలింగాని నిష్పాద్య ప్రోక్ష్య చాసనమ్ ॥

తా:- ప్రతిమ మొదలయిన వానియందు హృదయమునందుగాని ఆయా సమయములలో లభించెడి ఉపచారములచే, పుష్పాది ద్రవ్యము లను కీటాదులు లేకుండునట్లు శోధించి ఆసనమును ప్రోక్షించి (ముందు శ్లోకముతో). (50)

టీ:- ఆదాదేవ ద్రవ్యాణి పుష్పాదీని జన్వాది శోధనేన క్షితిం సంమార్జ నాదినా, ఆత్మానమవ్యగ్రతయా, లింగంమూర్తి మనులేపక్షాల నాదినా, నిష్పాద్య యోగ్యాని కృత్వా. (50)

టీ:- ముందుగానే ద్రవ్యాదులను పుష్పాదులను కీటాదులు లేకుండు నట్లు శోధించి, భూమిని (చిమ్ముటవలన) ఊడ్చుటతో పరిశుద్ధముచేసి తనకు అవ్యగ్రునిగా చేసికొని, శుద్ధునిగా నిశ్చలునిగా చేసికొని పూజామూర్తిని అనులేప క్షాళనాదులచే శుద్ధిచేసి. (50)

51.శ్లో॥ పాద్యాదీన్యుపకల్ప్యాథ సన్నిధాప్య సమాహితః ।
హృదాదిభిః కృతన్యాసో మూలమంత్రేణ చార్చయేత్ ॥

తా:- తరువాత అవ్యగ్రమయిన మనస్సు గలవాడై పాద్యము మొదలయిన పాత్రలను కల్పించి హృదయమున పూజింపబడెడు భగవంతున్ని ప్రతిమయందు నిలిపి హృదయాది అంగన్యాసములను చేసికొని మూలమంత్రముతో పూజింపవలెను. (51)

టీ:- పాద్యాది పాత్రాణ్యుపకల్ప్య సన్నిధాప్య హృది సంపూజితం శ్రీమూర్తౌ ధ్యాత్వా, హృదాదిభిః హృదయ, శిఖాకవచనేత్రాస్త్ర మంత్రై ర్మూల మన్త్రేణ చ దేవే కృతన్యాసో మూలమన్త్రేణార్చయేత్. (51)

టీ:- పాద్యాది పాత్రలను కల్పించి, హృదయమునందు పూజింపబడిన భగవంతుని, ప్రతిమయందు (నిలిపి) ధ్యానము చేసి, హృదాదిభిః = హృదయ, శిఖా, కవచ నేత్ర అస్త్ర మంత్రముల చేత, మూలమన్త్రము చేతనూ దేవునియందు న్యాసముచేసి, మూలమంత్రముతో అర్చించ వలెను. (51)

52.శ్లో॥ సాంగోపాంగాం సపార్షదాం శాంతాం మూర్తిం స్వమంత్రతః
పాద్యార్ఘ్యాచమనీయాద్యైః స్నానవాసోవిభూషణైః ॥

తా:- హృదయాదులగు అంగములతోడను పరివార దేవతలగు సంవాదులతో గూడిన శాంతమగు విష్ణుమూర్తిని, పాద్య అర్ఘ్య, ఆచమనీయ, స్నాన, వస్త్ర ఆభరణములు మొదలయిన వానిచే ఆ మూర్తి యొక్క మూలమన్త్రముతో పూజించి. (52)

టీ:- అంగాని హృదయాదీని ఉపాంగాని సుదర్శనాదీని తత్సహితాం సపార్షదాం సపరివారాం. కైరూపచారైరర్చయేత్తదాహ పాద్యేతి. ఆది శబ్దేన మధుపర్క మాచమనం చ. (52)

టీ:- అంగములు = హృదయాదులు . ఉపాంగములు సుదర్శనాదులు. వాటితో కూడిన పరివార దేవతలతో కూడిన పార్షదులతో కూడిన. ఏ ఉపచారములుతో అర్చించవలెనో చెప్పుచున్నాడు పాద్య అని. అది శబ్దముతో మధుపర్కము ఆచమనమునూ. (52)

53. శ్లో॥ గంధమాల్యాక్షతస్రగ్భిః ధూపదీపోపహారకైః ।
సాంగం సంపూజ్య విధివత్ స్తవైస్స్తుత్వానమేద్ధరిమ్ ॥

తా:- గంధము, పుష్పములు, అక్షితలు పూలదండలు అను వానిచేతను, ధూపదీపనైవేద్యముల చేతను, సాంగముగా విధివంతముగా పూజించి స్తోత్రములచే స్తుతించి విష్ణువునకు నమస్కరించవలెను. (53)

టీ:- అక్షతాస్తిలకాలంకారే. న తు పూజాయాం. "నాక్షతైరర్చయేద్విష్ణు న కేతక్యా మహేశ్వరమ్" ఇతి నిషేధాత్ ఉపహారో నైవేద్యం. (53)

తా:- అక్షితలు తిలకాలంకారమునందు. పూజయందు కాదు (పూజ కొరకు కాదు) "అక్షతలతో విష్ణువును, మొగిలిపూవుతో శంకరుడిని పూజించగూడదని" నిషేధము వలన. ఉపహారము = నైవేద్యము. (53)

54. శ్లో॥ ఆత్మానం తన్మయం ధ్యాయన్ మూర్తిం సంపూజయేద్ధరేః ।
శేషమాదాయ శిరసి స్వధామ్న్యుద్వాస్య సత్కృతమ్ ॥

తా:- తనకు విష్ణు స్వరూపునిగా ధ్యానించుచూ విష్ణుమూర్తిని చక్కగా పూజించవలెను. నిర్మాల్యమును శిరస్సునందుంచుకొని పూజింపబడిన దేవుని స్వస్థానము నందు స్థాపించవలెను. (పూజా విధి సమాప్తము చేయవలెను.) (54)

టీ:- శేషాం నిర్మాల్యమ్. స్వధామ్ని స్వస్థానే. దేవం హృది మూర్తిం కరండకే ఉద్వాస్య స్థాపయిత్వా పూజా విధిం సమాపయేదితి శేషః. (54)

టీ:- శేషాం = నిర్మాల్యమును, స్వధామ్ని, స్వస్థానము నందు. దేవుడిని హృదయమున మూర్తిని కరండకమునందు భరిణయందు. ఉద్వాస్యః స్థాపించి, పూజావిధిని సమాప్తి చేయవలెను.(54)

55.శ్లో॥ ఏవమగ్న్యర్కతోయాదావతిథౌ హృదయే చ యః ।
యజేదీశ్వరమాత్మానం అచిరాన్ముచ్యతే హి సః ॥

తా:- ఈ ప్రకారముగా ఎవడు అగ్ని, సూర్య, జలము మొదలయిన వానియందు, అతిథియందును, హృదయము నందును, పరమాత్మ యైన ఈశ్వరుని పూజించుచున్నాడో వాడు తొందరగా సంసారబంధ ముక్తిని పొందుచున్నాడు. (55)

టీ:- తాంత్రికం కర్మయోగముపసంహరతి ఏవమితి. (55)

టీ:- తాంత్రికమయిన కర్మయోగమును ఉపసంహరించుచున్నాడు - ఏవమని. (55)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే, తృతీయోऽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు తృతీయాధ్యాయము సమాప్తము.**

## చతుర్థోऽధ్యాయః

రాజోవాచ

1.శ్లో॥ యాని యానీహ కర్మాణి యైర్యైస్స్వచ్ఛందజన్మభిః ।
చక్రే కరోతి కర్తా వా హరిస్తాని బ్రువంతు నః ॥

టీ:- చతుర్థేత్వవతారేహా ప్రశ్నస్యోత్తరముక్తవాన్ జయన్తీనన్దనో నామ్నా ద్రుమిళానవసప్తమః. "మూర్త్యాऽభిమతయాత్మానః" ఇత్యనేనాత్మనః ప్రియమవతారం పూజయేదిత్యుక్తే అవతార జ్ఞానమపేక్షితం, తథా "స్తవైః స్తుత్వా నమేద్ధరిమ్" ఇత్యుక్తే గుణకర్మ జ్ఞానం చాపేక్షిత మతః పృచ్ఛతి - యానియానీతి. కర్తా కరిష్యతి. (1)

ద్రుమీళ ఉవాచ

2.శ్లో॥ యో వా అనంతస్య గుణాననంతాన్
అనుక్రమిష్యేత్స తు బాలబుద్ధిః ।
రజాంసి భూమేర్గణయేత్కథంచిత్
కాలేన నైవాఖిలశక్తిధామ్నః ॥

## చతుర్థాధ్యాయము

తా:- శ్రీహరి ఈ జగత్తునందు ఇష్టము వచ్చిన అవతారములచే, ఏయే యవతారములచే, ఏమి కర్మలు చేసెనో, చేయుచున్నాడో, చేయగలడో వానిని మాకు చెప్పుము. (1)

టీ:- ఈ చతుర్థాధ్యాయమునందు అవతారములను తెలిసికొనెడి ప్రశ్నకు జయంతి పుత్రులు తొమ్మండిగురిలో నేడవవాడు ద్రుమిళుడను పేరుగలవాడు ఉత్తరమును చెప్పెను. "తనకు ప్రియమైన అవతారమును పూజించవలెను" అని చెప్పుట వలన అవతారములను తెలిసికొనెడి కాంక్ష అపేక్షితమగుచున్నది. "స్తోత్రములచే స్తుతించి హరిని నమస్కరించవలెను" అని చెప్పుట వలన గుణ కర్మల జ్ఞానము అపేక్షితమయినది కావున ప్రశ్నించుచున్నాడు 'యాని యాని' యని కర్తా = చేయగలడు.(1).

తా:- ఎవడైతే అనంతుని గుణములను గణించగోరునో వాడు మందమతి, చాలాకాలమునకు (బుద్ధిమంతుడయినవాడు) భూమి రేణువులను ఎట్లయిననూ గణింపవచ్చును కాని సర్వశక్తియుతుడయిన భగవంతుని గుణములను గణింపలేడు". (2)

టీ:- త్వయా పృష్టాని కాలత్రయసంబంధి సకలావతారగుణ కర్మాణి కథయితుమశక్యాని సంక్షేపతస్తు కాని చిత్కథయిష్యామీత్యాహ - యోవా ఇత్యాదినా. అనుక్రమిష్యన్గణయితు మిచ్ఛతి యః స తు బాలానామివ బుద్ధిర్యస్య స మందమతిః. కాలేన మహతా కోऽపి మహామతిః రజాంసి గణయేదపి. అఖిల శక్తిధామ్నః సర్వశక్త్యాశ్రయస్య భగవతో గుణాంస్తు నైవగణయేత్. తథా చ శృతి "విష్ణోర్నుకం వీర్మాణి ప్రవోచం యః పార్థివాని విమమేరజాంసి" ఇత్యాది. (2)

టీ:- నీవడిగిన కాలత్రయ సంబంధులయిన సకలావతార గుణ కర్మలు వచించుట అశక్యము, సంక్షేపముగా మాత్రము కొన్నింటిని చెప్పగలను అని చెప్పుచున్నాడు. యోవా ఇత్యాదిగా. అనుక్రమిష్యన్ = గణించ గోరునో, ఎవడో, వాడు బాలురవలె బుద్ధి కలవాడు మందమతి. చాలాకాలమునకు మహాబుద్ధిశాలియొక్కడు భూమి రేణువులను గణించ వచ్చును. సర్వశక్తియుతుడయిన భగవంతుని గుణములను గణింప లేడు. శృతి కూడా (ఈ విషయమును తెల్పుతున్నది) "విష్ణోర్నుకం ఇత్యాదిగా. (2)

3. శ్లో॥ భూతైర్యదా పంచభిరాత్మసృష్టైః
పురం విరాజం విరచయ్య తస్మిన్ ।
స్వాంశేన విష్టః పురుషాభిధానం
అవాప నారాయణ ఆదిదేవః ॥

తా:- ఆదిదేవుడగు నారాయణుడు ఎప్పుడు తనచే సృష్టింపబడిన పృథివ్యాది పంచభూతములచే బ్రహ్మాండమను పురమును రచించి అందు తన యంశముతో ప్రవేశించెనో అప్పుడు పురుషుడను నామమును పొందెను. (3)

టీ:- తత్రాదౌ పురుషావతారమాహ - భూతైరితి. యదా స్వసృష్టైః భూతైర్విరాజం బ్రహ్మాండం పురం నిర్మాయ తస్మిన్ లీలయా ప్రవిష్టో న తు భోక్తృత్వేన. ప్రభూత పుణ్యస్య జీవస్య తత్ర భోక్తృత్వాత్. (3)

టీ:- అందు మొదటి పురుషావతారమును చెప్పుచున్నారు. భూతైః అని. ఎప్పుడు తనచే సృష్టించిన పృథివ్యాది పంచ భూతముల చేత బ్రహ్మాండమను పురమును నిర్మించి అందు లీలతో ప్రవేశించెను భోక్తృత్వేన కాదు (భోక్తగా కాదు) అత్యధిక పుణ్యము గల జీవునికే భోక్తృత్వము వుండును. (3)

4. శ్లో॥ యత్కాయ ఏష భువనత్రయ సన్నివేశో
యస్యేంద్రియైస్తనుభృతాముభయేంద్రియాణి ।
జ్ఞానం స్వతశ్శ్వసనతో బలమోజ ఈహా
సత్త్వాదిభిస్థితి లయోద్భవ ఆదికర్తా ॥

టీ:- అస్యగుణకర్మాణ్యాహ ద్వయేన-యత్కాయ ఇతి. యస్యాధిష్ఠేయః కాయ ఏషః. కాయ ఇతి సప్తమీ వా. తనుభృతాం సమష్టి వ్యష్టి జీవానాం జ్ఞాన కర్మేన్ద్రియాణి యస్య స్వతః స్వరూపభూతాత్ సత్వాత్త నుభృతాం జ్ఞానం, యస్య స్వతస్సిద్ధంజ్ఞానమితివా. యస్య శ్వసనతః ప్రాణాద్బలం దేహశక్తిః. ఓజ ఇంద్రియశక్తిః. ఈహాక్రియా యశ్చసత్యాది భిర్విశ్వస్య స్థితి లయోద్భవే ఆదికర్తా. (4)

తా:- ఎవని శరీరము ముల్లోకములకుస్థానమో, ఎవని ఇంద్రియములచే దేహధారులకు ఉభయ విధములగు జ్ఞాన కర్మేంద్రియములు కలుగునో, ఎవని స్వరూప భూతమయిన సత్వము ఎల్ల జీవులకు జ్ఞానమో, ఎవని ప్రాణము జీవులకు బలము దేహశక్తి, ఇంద్రియములు, క్రియలు కలిగించుచున్నదో ఎవని సత్వాది గుణములచే సృష్టి, స్థితి, లయములు కలుగుచున్నవో అతడు ఆది పురుషుడు. (4)

టీ:- ఈ పురుషుని గుణకర్మలను రెండు శ్లోకములతో చెప్పుతున్నాడు. యత్కాయయని. ఎవనికి అధిష్ఠేయమో ఈ శరీరము. కాయే అని సప్తమీ కూడా కావచ్చును. దేహధారులగు వ్యష్టి సమష్టి జీవులకు జ్ఞాన కర్మేంద్రియములు ఎవనియొక్క స్వతస్సిద్ధమై స్వరూప భూతమైన సత్వము వలన జీవులకు జ్ఞానము కలుగునో. ఎవనికి స్వతస్సిద్ధమయిన జ్ఞానము అని అయిననూ ఎవని యొక్క ప్రాణము వలన బలం దేహశక్తి. ఓజ = ఇంద్రియశక్తి ఈహా = క్రియ. ఎవడు సత్వాది గుణములచే విశ్వమునకు స్థితిలయోద్భవము లందు ఆదికర్తా = మూలాకారణుడు (4)

5. శ్లో॥ ఆదావభూచ్ఛతధృతీ రజసాస్య సర్గే
విష్ణుస్థితౌ క్రతుపతిర్ద్విజధర్మసేతుః ।
రుద్రోఽప్యయాయ తమసా పురుషస్స ఆద్యః
ఇత్యుద్భవస్థితిలయాస్సతతం ప్రజాసు ॥

తా:- సృష్ట్యారంభ సమయమున ఎవని రజస్సుచే ఈ ప్రపంచము సృష్టికార్యమునందు బ్రహ్మ అయ్యెనో, విశ్వస్థితియందు యజ్ఞ ఫల దాతయు, ద్విజాతులకును వారి ధర్మములకును పాలకుడగు విష్ణువు అయ్యెనో ఎవని తమస్సుచే లయముకొరకు రుద్రుడయ్యెనో, అని ఇట్లు జనులయందు ఎల్లప్పుడు సృష్టి స్థితిలయములు ఎవని వలన కలుగుచున్నవో అతడు ఆది పురుషుడు. (5)

టీ:- ఆదికర్తేత్యనేన తత్పూర్వకం కర్త్రన్తరమపి సూచితమ్, తద్దర్శయితుం గుణావతార ద్వారా చరాచర సృష్ట్యాది కర్తృత్వమాహ - ఆదావితి. యస్యేత్యనుషంగః. యస్య రజసాఽస్య జగతః సర్గే కార్యే శతధృతిర్బ్రహ్మాఽభూత్. స్థితౌ చ విష్ణుర్యస్య సత్వేనేతిశేషః. క్రతుపతిస్తత్ఫలదాతా. ద్విజాతీనాం తద్ధర్మాణాం చ సేతుః పాలక ఇత్యర్థః. యస్య తమసాఽస్యాఽప్యయాయ రుద్రోఽభూత్. ఇత్యేతైర్బ్రహ్మాదిభిర్నిమిత్త భూతైః ప్రజాసూద్భవాదయో యతో భవన్తి స ఆద్యః పురుష ఇత్యన్వయః. (5)

టీ:- ఆదికర్తా అని అనుట వలన తత్పూర్వకమయిన కర్త్రన్తరము (వేరే ఒక కర్త కలడు అని) కూడా సూచింపబడుచున్నది. దానిని చూపుటకై గుణావతారముల ద్వారా చరాచర సృష్ట్యాది కర్తృత్వమును చెప్పుచున్నాడు. అదౌ అని. యస్య అని అనుషంగము. ఎవని రజస్సుచే ఈ ప్రపంచము యొక్క సృష్టి కార్యమునందు బ్రహ్మ అయ్యెనో. ఎవని సత్వముతో విశ్వ స్థితియందు విష్ణువయ్యెనో, ఎవని తమస్సుతో లయముకొరకు రుద్రుడయ్యెనో అని ఈ బ్రహ్మాదులు నిమిత్తభూతులుగా ప్రజలందు సృష్టి, స్థితి, లయములు ఎవని నుండి కలుగునో అతను ఆద్య పురుషుడు. అని అన్వయము. (5)

6. శ్లో॥ ధర్మస్య దక్షదుహితర్యజనిష్ట మూర్త్యాం
నారాయణో నర ఇతి స్వతపః ప్రశాంతః ।
నైష్కర్మ్యలక్షణమువాచ చచార కర్మ యోऽద్యాపి
చాప్తఋషివర్యనిషేవితాంఘ్రిః ॥

టీ:- నరనారాయణావతారమాహ-ధర్మస్యేతి. ధర్మస్య భార్యాయాం దక్షదుహితరి మూర్తి సంజ్ఞాయాం నారాయణోనర ఇతి మూర్తిద్వయేన అంజనిసష్ట జాతః. తచ్చరితమాహ - నైష్కర్మ్యమాత్మ స్వరూపం లక్ష్యతే యేన తత్కర్మ కర్మ నిర్హారరూపం వా ఉవాచ నారదాదిభ్యః స్వయం చచార చ. యోऽద్యాऽపి కర్మాచ రన్నాస్తే. ఋషి వర్యైర్నిషేవితా వంఘ్రీ యస్య సః. (6)

తా:- ధర్మునకు దక్షుని పుత్రికయైన మూర్తిదేవి యందు నారాయణుడు నరుడు అని ఇద్దరుగా జన్మించెను. తన తపస్సుచే చాలా శాంతుడగు అతడు ఆత్మ స్వరూపనిరూపకమగు కర్మను గూర్చి చెప్పెను. స్వయముగా ఆచరించెను, ఇప్పటికినీ మహర్షులచే సేవింపబడిన పాదములు కలవాడై కర్మల నాచరించుచునే యున్నాడు. (6)

టీ:- నరనారాయణావతారమును చెప్పుచున్నారు. ధర్మస్య అని. ధర్ముని భార్యయందు దక్షుని బిడ్డయయిన మూర్తి యనెడి పేరుగల దానియందు నారాయణుడు నరుడు అని మూర్తిద్వయముగా జన్మించెను. అతని చరితమును చెప్పుచున్నాడు - నైష్కర్మ్య = ఆత్మ స్వరూప నిరూపకమ యిన లేదా కర్మ నిర్హారరూపమయినదయిననూ, నారదాదులకు చెప్పెను. స్వయముగా ఆచరించెను. ఎవడయితే ఇప్పటికినీ కర్మ నాచరిస్తూనే వున్నాడు. ఋషివర్యుల చేత సేవింపబడిన పాదములు ఎవనికో వాడు కలవాడు. (ఉన్నాడో) (6)

7. శ్లో॥ ఇంద్రో విశంక్య మమ ధామ జిఘృక్షతీతి
కామంన్యయుఙ్క్త సగణం స బదర్యుపాఖ్యం ।
గత్వాప్సరోగణ వసంత సుమందవాతైః
స్త్రీప్రేక్షణేషుభిరవిధ్యదతన్మహిజ్ఞః ॥

తా:- ఈ ఇద్దరు ఋషులు తపస్సుచే నా స్థానము నాక్రమింతురేమో అని ఇంద్రుడు శంకించి, కాముని, అతని గణములను బదరికాశ్రమము నకు పంపించెను. ఆ కాముడు అప్సరసలు, వసంతుడు, మలయ మారుతము మొదలయినవారు వెళ్ళి ఆ ఋషి మహిమను ఎరుగనివారై స్త్రీల చూపులనెడు బాణములచే కొట్టెను. (వేధించెను) (7)

టీ:- భగవదవతారత్వద్యోతకం పరమోపశమం దర్శయితుమితిహాస మాహ-ఇన్ద్ర ఇతి దశభిః. ధామస్థానం తపసా గ్రహీతుమిచ్ఛతీతి విశంక్య తపోనాశాయ కామం సపరివారం ప్రేషయామాస. సకామో బదరీ భిరుపాఖ్యాయతే యస్తం తస్యాశ్రమమప్సరోగణాదిభిః సహ గత్వా స్త్రీణాం ప్రేక్షణాన్యేవ ఇషవోబాణాస్తైః. న త్యమహి మహిమానం జానాతీ త్యతన్మహిజ్ఞః. (7)

టీ:- భగవదవతార ద్యోతకమయిన పరమశాంతిని తెలుపుటకు ఇతిహాసమును తెలుపుచున్నాడు 'ఇంద్రయని' పది శ్లోకములతో. ధామ = స్థానము గ్రహింపగోరుచున్నాడని శంకించి, తపస్సును నాశనము చేయు మన్మథుని సపరివారునిగా పంపెను. ఆ కాముడు బదరీ వృక్షములచే ప్రసిద్ధమయిన ఆశ్రమమును అప్సరోగణములచే సహ వెళ్ళి, స్త్రీల చూపులను బాణములచే, భూమి యందు అతని మహిమను తెలియనివాడు అయినందుకు అతన్మహిజ్ఞుడు. (7)

8. శ్లో॥ విజ్ఞాయ శక్రకృతమక్రమమాదిదేవః
ప్రాహ ప్రహస్య గత విస్మయ ఏజమానాన్ ।
మాభైర్విభో మదన మారుత దేవవధ్వో
గృహ్ణీత నో బలిమశూన్యమిమం కురుధ్వమ్ ॥

తా:- ఆ ఆదిదేవుడు ఇంద్రుడు కావించిన అక్రమమును తెలిసికొని నవ్వి గర్వము లేనివాడై, సమర్థుడవగు ఓ మన్మథుడా! ఓ మారుతమా! అప్సరసలారా! భయపడకుడు. మా ఆతిథ్యమును స్వీకరించండి. ఈ మా ఆశ్రమమును శూన్యము కాని దానిగా చేయుము అని శాప భీతిచే వణుకుచున్న వారిని గూర్చి పలికెను. (8)

టీ:- అక్రమమ్ అపరాధమ్; అహో అహంధీర ఇతి విస్మయోగర్వస్త ద్రహితః. ఏజమానాన్ శాపభియా కంపమానాన్. భోవిభో! సమర్థ, దేవవధ్వః మాభైష్ట. బలిమాతిథ్యం తాన్ప్రార్థయతే. ఇమమస్మాక మాశ్రమమ్. ఆతిథ్యాభావే శూన్యప్రాయః స్యాదిత్యర్థః. (8)

టీ:- అక్రమమ్ = అపరాధము ఆహా నేను ధీరుడను అని విస్మయము = గర్వము లేనివాడై, శాప భయముతో వణుకుచున్న వారిని సమర్థుడవైన ఓ విభూ! అప్సరసలారా! భయపడకండి! మా ఆతిథ్య మును స్వీకరించండి అని ప్రార్థిస్తున్నాడు. ఈ మా ఆశ్రమమును ఆతిథ్యము లేనిచో శూన్య ప్రాయమగును అని యర్థము. (8)

9. శ్లో॥ ఇత్థం బ్రువత్యభయదే నరదేవ దేవాః
సవ్రీడ నమ్రశిరసస్సఘృణం తమూచుః ।
నైతద్విభో త్వయిపరేఽవికృతే విచిత్రం
స్వారామధీరనికరానతపాదపద్మే ॥

టీ:- హే నరదేవ! అభయదే శ్రీనారాయణే ఇత్థంబ్రువతిసతి దేవాః కామాదయః సవ్రీడాని నమ్రాణి శిరాంసి యేషాం తే లజ్జాభరేణైవావ నతశిరస్కా ఇత్యర్థః. సఘృణయథా భవతి తథాకృపాం జనయన్త ఇత్యర్థః కృపాయుక్తం తమితి వా మాయాతః పరే అతో అవికృతే స్వారామాశ్చతే ధీరాశ్చ తే తేషాం నికరైరానతం పాదపద్మం యస్య తస్మిన్. త్వయ్యే త దక్షోభాను కంపాది న విచిత్రమ్. (9)

తా:- ఓ రాజా! అభయమిచ్చువాడై ఆ నారాయణ ఋషి పట్ల పలుకగా కాముడు మొదలయినవారు సిగ్గుతో తలవంచుకొని మొక్కుతూ ఋషితో ఇట్లనిరి - "ఆత్మారాములై ధీరులైన జ్ఞానులచే మొక్కబడు పాదపద్మములు గలవాడవు పరమాత్మవునీవు మా మాయలకు వికారము పొందకపోవుట ఇదియొక్క విచిత్రము. (9)

టీ:- ఓ నరదేవ! అభయమిచ్చువాడైన నారాయణుడీ విధముగా చెప్పుచున్నంతనే. దేవతలు, కామాదులు సిగ్గుతో వంచిన తలలు కలవారై తలలువంచి యని అర్థము. ఆ ఋషికి కృపగు ఎట్లు కలుగునో అట్లు (కృప కలిగేట్లుగా) అని యర్థము. కృపాయుక్తుడయిన అతనిని అనియుంయిననూ, మాయకుపరుడయిన వికారము పొందని ఆత్మారాములై ధీరులయిన వారి సమూహముచే మొక్కబడు పాదపద్మముకల నీయందు, అక్షోభ అనుకంపాదులు నీయందు విచిత్రమేమి కాదు. (9)

10శ్లో॥ త్వాం సేవతాం సుకృతా బహవోఽంతరాయాః
స్వౌకోవిలంఘ్య పరమం వ్రజతా పదం తే ।
నాన్యస్య బర్హిషి బలీన్ దదతస్స్వభాగాన్ ధత్తే
పదం త్వమవితా యది విఘ్నమూర్ధ్ని ॥

తా:- నిను సేవించుచున్నవారై స్వస్థానమైన స్వర్గమును దాటి నీయొక్క పరమపదమును గూర్చి పోవుచున్నవారికి దేవతలు కలిగించు అనేక విఘ్నములు కలుగును. యజ్ఞములందు తమ భాగమయిన పురోడాశా దులను కప్పములను ఇచ్చునట్టి ఇతరునికి విఘ్నములు రావు సురాధీశ్వరుడవగు నీవు నిశ్చయముగా రక్షకుడవు కావున (నీ భక్తుడు) విఘ్నముల శిరస్సు నందు పాదమును వుంచున్నాడు.(10).

టీ:- అస్మాకం చాపరాధాచరణం స్వభావత్వాన్నచిత్రమిత్యాహుః త్వామితి. త్వాం సేవతాం - సేవమానానాం సురైరింద్రాదిభిః కృతా అంతరాయా విఘ్నాభవంతి. కస్మాదిత్యత ఆహుః స్వైక ఇతి స్వస్థానం స్వర్గమతిక్రమ్య పరమం తవ స్థానం వ్రజతాం. నాన్యస్య త్వామేవ మానస్య. కుతః. బర్హిషియజ్ఞే, స్వాభాగాన్ పురోడాశాదీన్ బలీన్‌కరాన్ కృషీకఇవరాజ్ఞే ఇంద్రాదిభ్యో దదతః ప్రయచ్ఛతః. తర్హి మద్భక్తో విఘ్నైర్భశ్యతి, నేత్యాహుః ధత్తఇతి. యదీతినిశ్చయే. యతస్త్వం సర్వసురాధీశ్వరో Sవితా రక్షకో Sతోసౌ విఘ్నానాం మూర్ధ్ని పాద మంఘ్రిం ధత్తే. కుతః పునస్త్వయి విఘ్నశంకేతి భావః.(10)

టీ:- మాకు అపరాధములు చేయుట స్వభావమయినందున చిత్రము కాదు అనుచున్నాడు - త్వామని. నిన్ను సేవించెడి వారికి ఇంద్రాదులతో అంతరాయములు = విఘ్నములు కలుగుతాయి. ఎందు అని యనగా స్వైక అని చెప్పుచున్నాడు స్వస్థానమయిన స్వర్గమును అతిక్రమించి పరమమయిన నీ స్థానమును గూర్చి పోవుచున్నవారికి నాన్యస్య = నిన్ను సేవింపనివానికి ఎందులకు బర్హిషి = యజ్ఞమునందు తమ భాగములయిన పురోడాశాదులను కప్పములను కృషికుడు రాజునకువలె ఇంద్రాదులకు దదతః ఇచ్చునట్టి. (కృషీవలులు రాజునకు కప్పము కట్టినట్లు ఇంద్రాదులకు హవిర్భాగము ఇచ్చువారికి విఘ్నములు రావు.) అట్లయిన నా భక్తులు విఘ్నములచే నశించునా, లేదు నశించదు. ధత్తే అని అనుచున్నాడు యదియని నిశ్చయమున, నీవు సర్వ సురాధీశుడవు రక్షకుడవు ఎందువలన అయ్యున్నావో, అందులకే నీ భక్తుడు విఘ్నములపైన పాదమును ఉంచుచున్నాడు. ఎందుకు నీ యందు విఘ్న శంకాయని భావము. (10)

11.శ్లో॥ క్షుత్తృట్ త్రికాలగుణమారుతజైహ్వ  
శైశ్న్యాన్ అస్మానపారజలధీనతితీర్య కేచిత్ ।  
క్రోధస్య యాంతి విఫలస్య వశం పదే గోః  
మజ్జంతి దుశ్చరతపశ్చ వృథోత్సృజంతి ॥

తా:- ఆకలి దప్పులను విడిచి, చలి, వేడి, వర్షములు సహించి ప్రాణమును నిరోధించి, జిహ్వేంద్రియము రుచులను త్యజించి, శిశ్నోప భోగ ప్రసంగమును విడిచి, కామాదులనెడి అపార సముద్రములను దాటి కొందరు గోవు పాదమంత జలమునందు మునుగుచున్నారు.

టీ:- త్వదభక్తానాం తు కేవలం తపశ్చరతాం ద్వయీగతిః. అస్మాకం వా వశం యాంతి క్రోధస్య వా, తత్రాస్మద్వశాః కామోప భోగమపి తావదనుభవంతి. క్రోధస్య వశాః పునరతిమన్దాః ఇత్యాహుః క్షుత్తృడితి। క్షుచ్చ తృట్చ త్రికాలగుణాశ్చ శీతోష్ణ వర్షాణి చ మారుతశ్చ ప్రాణో బాహ్యో వా జై వ్యా జిహ్వాభోగాశ్చ శైశ్న్యాగుహ్యోపభోగాశ్చ ఏతానస్మాన పారజలధి రూపావ తితీర్య విలంఘ్య గోష్పదే మజ్జంతి. కుతః యతః క్రోధస్య విఫలస్య వశంయాన్తి గచ్ఛంతి. కించ జలే మజ్జన్తోయథా వివశాః సన్తో మస్తకారోపితం భారము థ్సృజంతి. తథా పృథైవ న మోక్షాయ న చ భోగాయ శాపాదినా దుశ్చరం తప ఉథ్సృజన్తి. (11)

ఎట్లనగా చాలా కష్టపడి చేసిన తపస్సును శాపాదికమునకు వ్యర్థముగా విడిచి వేయుదురు. (11)

టీ:- నీకు భక్తులు కాని వారికి కేవలము తపస్సునే ఆచరించువారికి రెండు గతులు. మాకు అయినా వశమవుతారు. క్రోధమునకయినా వశమవుతారు. అందున మా వశమయిన వారు కామోపభోగములను కూడా అనుభవింతురు. క్రోధవశులయిన వారు అతి మందులు (మందబుద్ధి కలవారు) అని చెప్పుతున్నాడు. క్షత్రుడ అని. ఆకలి దప్పి శీతోష్ణ వర్షములు మారుతుమ = ప్రాణము జిహ్వోప భాగములు శిశ్నోపభాగములు అను వానిని మమ్ములను అంతము లేని సముద్ర రూపమున నున్న వానిని దాటి గోవు పాదమున మునుగుచున్నారు. ఎందువలన?, నిష్ఫలమయిన క్రోధము యొక్క వశమగు చున్నారు. మరియు జలమునందు మునుగుచున్నవారై శిరస్సు నందుంచిన భారమును ఎట్లు వదిలిపెట్టుదురో అట్లే మోక్షమునకు గాని భాగమునకు గాని కాక ఆచరింప వీలుగాని తపస్సును శాపాదులచే విడిచి వేయుచున్నారు.(11)

12.శ్లో॥ ఇతి ప్రగృణతాం తేషాం స్త్రియో యోగ వినిర్మితాః ।
దర్శయామాస శుశ్రూషాం స్వర్చితాః కుర్వతీర్విభుః ॥

తా:- ఇట్లు స్తుతించుచున్న కామాదులను భగవంతుడు యోగ శక్తిచే నిర్మించబడినవారు, చక్కగా అలంకరించుకున్న వారు అయిన తమకు శుశ్రూష చేయుచున్న స్త్రీలను చూపెను.(12)

టీ:- స్త్రియో యోగనిర్మితా స్త్రీః శుశ్రూషాం కుర్వతీః స్వర్చితాః సుష్ఠ్వలంకృతా సైషాం స్వలావణ్యాది దర్పోపశమాయ దర్శయామాస. (12)

టీ:- స్త్రియోః యోగనిర్మితమయిన స్త్రీలు శుశ్రూషను చేయుచున్న చక్కగా అలంకరించుకున్న వారి సౌందర్య లావణ్యాదికృతమగు దర్పము శాంతించుట కొరకు చూపెను. (12)

13. శ్లో॥ తా దేవానుచరా దృష్ట్వా స్త్రియశ్శ్రీరివ రూపిణీః ।
గంధేన ముముహుస్తాసాం రూపౌదార్యహతశ్రియః ॥

తా:- ఇంద్రుని అనుచరులయిన కామాదులు లక్ష్మీదేవివలె రూపవతులయిన ఆ స్త్రీలను చూచి వారి దేహ పరిమళముచే సౌందర్యము యొక్క గొప్పతనముచే కొట్టబడిన కాన్తి గలవారై మోహమును పొందిరి. (13)

టీ:- రూపిణీ మూర్తిమతీ శ్రీరివ తాస్త్రియః స్త్రీర్దృష్ట్వా. తాసాం తు రూపస్యౌదార్యేణ మహత్త్వేన హతా శ్రీః కాన్తిర్యేషాం తే. (13)

టీ:- రూపిణీః రూపవతులయిన, లక్ష్మీవలె ఆ స్త్రీలను చూచి. వారి సౌందర్యాతిశయము చేత తమకాన్తులు క్షీణించినవి కాగా. (సౌందర్యము యొక్క గొప్పదనము చేత కొట్టబడిన కాంతి ఎవరికో వారు) (13)

14. శ్లో॥ తానాహ దేవదేవేశః ప్రణతాన్ ప్రహసన్నివ ।
అసామేకతమాం వృఙ్ధ్వం సవర్ణాం స్వర్గభూషణామ్ ॥

తా:- దేవదేవుడయిన విష్ణువు నమస్కరించిన వారిని గూర్చి నవ్వుతూ ఈ విధముగా చెప్పెను. ఈ స్త్రీలలో సమానమయిన (సరూపను) స్వర్గమునకలంకారమై ఒక్కతెను కోరుకొనుడు. (14)

టీ:- వృంగ్ధ్వం- వృణీధ్వం. క్వవయంవరాకాః, క్వచేమాః ఇతిచేత్త త్రాహ - సవర్ణాం సమానరూపాం . నైకాప్యస్మదనురూపేతి చేన్మాభవతు, తథాపి స్వర్గస్య భూషణ రూపామ్. (14)

టీ:- వృంగ్ధ్వం = కోరుకొనుడు. సామాన్య రూపముగల మేమెక్కడ, వీరెక్కడ అనిని సవర్ణా అని చెప్పుచున్నాడు. సమానరూపను, వీరిలో మా సమానరూప ఒక్కతే లేదనిన లేకపోవుగాక. అయినను స్వర్గమునకు భూషణరూపమైన దానిని. (నేను సృజించిన స్త్రీలలో కోరుకొనుడు)(14)

15.శ్లో॥ ఓమిత్యాదేశమాదాయ నత్వా తం సుర వందినః ।
ఊర్వశీమప్సరశ్శ్రేష్ఠాం పురస్కృత్య దివం యయుః ॥

తా:- అట్లేయని ఆ దేవుని ఆదేశము నంగీకరించి ఆదేవభృత్యులు నమస్కరించి, అప్సరసలలో శ్రేష్ఠమైన ఊర్వశిని ముందిడుకొని స్వర్గమునకు పోయిరి. (15)

టీ:- సురవందినో దేవ భృత్యాః.(15)

టీ:- సురవందినః - దేవభృత్యులు.(15)

16.శ్లో॥ ఇంద్రాయానమ్య సదపి శృణ్వతాం త్రిదివౌకసాం ।
ఊచుర్నారాయణబలం శక్రస్త్రాస విస్మితః ॥

తా:- ఇంద్రునికి నమస్కరించి దేవతలు వినుచుండగా దేవసభయందు నారాయణఋషి ప్రభావమును చెప్పిరి, ఇంద్రుడు భయపడెను, విస్మితుడయ్యెను కూడా. (16)

టీ:- ఇంద్రాయ ఇంద్రం ప్రతి. నారాయణబలమూచుః. శక్రస్త్రాస - త్రాసంప్రాప్తౌ విస్మితశ్చ. తత్ర విస్మిత ఆసేతి వా. (16)

టీ:- ఇంద్రాయ = ఇంద్రుని కూర్చి. నారాయణ బలమును చెప్పిరి. శక్రస్త్రాస భయము నొందెను ఆశ్చర్యమును కూడా. (16)

17.శ్లో॥ హంసస్వరూప్య వదదచ్యుత ఆత్మయోగం
దత్తః కుమార ఋషభో భగవాన్ పితా నః ।
విష్ణుశ్శివాయ జగతాం కలయావతీర్ణ ః
తేనాహృతా మధుభిదా శ్రుతయో హయాస్యే ॥

తా:- విష్ణువు హంసస్వరూపుడు, దత్తాత్రేయుడు సనకాదులయిన కుమార వర్గము మాకు తండ్రియయిన భగవాన్ ఋషభుడుగా జగత్తుల క్షేమమునకై తన యంశతో అవతరించి ఆత్మజ్ఞానయోగమును చెప్పెను. మధుహంతయైన ఆ విష్ణువుచే హయగ్రీవావతారము నందు వేదములు తీసికొని రాబడినవి. (17)

టీ:- అన్యానప్యవతారాంస్తచ్చరితాని చాహ - హంస స్వరూపీతి. దత్తో దత్తాత్రేయః. కుమారః సనకాదిః. నః పితాబుషభశ్చ. విష్ణురేవ కలయావతీర్ణః సన్నాత్మయోగమవదత్. తేన విష్ణునా హయాస్యే హయగ్రీవావతారే మధుభిదా సతాతతః శృతయ ఆహ్నా.(17)

టీ:- ఇతర యవతారములను తచ్చరితములను చెప్పుచున్నాడు - హంస స్వరూపీ యని. దత్తో = దత్తాత్రేయుడు. కుమారః సనకాదులు మా తండ్రియయిన బుషభుడునూ, విష్ణువే తన యంశతో అవతరించి ఆత్మయోగమును చెప్పెను. ఆ విష్ణువుచే, హయగ్రీవావతారమున మధువును సంహరించిన అక్కడి నుండి (పాతాళము నుండి) వేదములు తేబడినవి . (17)

18. శ్లో॥ గుప్తోऽప్యయే మనురిలౌషధయశ్చ మాత్స్యే
క్రోడే హతో దితిజ ఉద్ధరతాంభసః క్ష్మాం ।
కౌర్మే ధృతోऽద్రిరమృతోన్మథనే స్వపృష్ఠే
గ్రాహాత్ప్రపన్నమిభరాజమముంచదార్తమ్ ॥

తా:- ప్రళయకాలమందు మత్స్యావతారమెత్తి మనువును పృథివిని, ఓషధులను రక్షించెను, వరాహావతారమున హిరణ్యాక్షుడను దైత్యుని వధించి సముద్రజలమునుండి భూమిని పైకి లేవనెత్తెను. అమృతానికై క్షీర సాగరమథనమున కూర్మావతారమునందు తన వీపున మంధర పర్వతమును ధరించెను. సాక్షాద్విష్ణువై మొసలి వలన దుఃఖమును పొందిన గజేన్ద్రుని విడిపించెను. (18)

టీ:- ఇలా = పృథ్వీ ఓషధయశ్చ గుప్తాః క్రౌడేచ - వారాహవతారే. గ్రాహద్గజేంద్రామముంచన్మోచయామాస. ఏవమాదౌయత్రావతార నామనాస్తి తత్రవిష్ణుః శివాయ - జగతాం కళ్యాణాయావతీర్ణఇత్యనువర్తనీయమ్. (18)

టీ:- ఇలా- పృథివీ. ఓషధులును రక్షింపబడెను. క్రౌడే చ వరాహ అవతారమున. మొసలి నుండి గజేంద్రుడిని విడిపించెను. ఇటువంటి చోట్ల ఎక్కడ యవతారనామము లేదో, అక్కడ విష్ణువు జగముల క్షేమము కొరకు స్వాంశతో అవతరించెనని తెలియవలెను.(18)

19. శ్లో॥ సంస్తున్వతోऽబ్ధిపతితాన్ శ్రమణానృషీంశ్చ
శక్రం చ వృత్రవధత స్తమసి ప్రవిష్టం ।
దేవస్త్రియోऽసురగృహే పిహితా అనాథా
జఘ్నేऽసురేంద్రమభయాయ సతాం నృసింహః ॥

తా:- కశ్యపుని యాగము కొరకు సమిధలను తెచ్చుచూ గోవు పాద మంత గుంటలో పడిన నిస్సంగులగు వాలఖిల్యాది ఋషులను ఆపద నుండి ఉద్ధరించెను. అట్లే ఇంద్రుడు వృత్రాసుర సంహారము చేసి బ్రహ్మహత్యా పీడితుడు కాగా అతనిని ఆ హత్య నుండి విముక్తుని చేసెను. అసురరాజైన హిరణ్యకశిపుని భవనమందు బందీలుగా దాచబడిన దేవాంగలను విడిపించెను. సాధువులకభయమిచ్చుటకై నరసింహ మూర్తియై అసురప్రభువైన హిరణ్యకశిపుని సంహరించెను. 19

టీ:- సంస్తున్వతః- స్తుతిం కుర్వాణాన్, ఋషీన్ వాలఖిల్యాన్ కశ్యపార్థం సమిదాహరణే గోష్పదే నిమగ్నా నిన్ద్రేణోపహసితానుద్ధృత్యాపదోऽ యోచయత్ . తమసిబ్రహ్మ హత్యాయాం ప్రవిష్టం మోచయామాస. అసురగృహే విహితా = నిరుద్ధాయందేవస్త్రియస్తాశ్చాముంచదనే కావతారైః. (19)

టీ:- సంస్తున్వత =స్తుతిని చేయుచున్న ఋషులను వాలాఖిల్యాదులను, కశ్యపునికై ఆ సమిధలను తీసికొని రాగా గోష్పదమంతగుంటలో నిమగ్నులయిన వారిని, ఇంద్రునిచే అపహసింపబడిన వారిని ఉద్ధరించి ఆపద నుండి విడుదల కావించెను. బ్రహ్మహత్యయందు ప్రవేశించిన (ఇంద్రుని) విముక్తుని చేసెను. అసుర గృహమందు నిరుద్ధలయిన దేవస్త్రీలను కూడా విముక్తులను గావించెను. అనేకావతారములచే. (19)

20. శ్లో॥ దైవాసురే యుధి తు దైత్యపతీన్ సురార్థే
హత్వాంతరేషు భువనాన్యదధాత్కలాభిః ।
భూత్వాథ వామన ఇమామహరద్బలేః క్ష్మాం
యచ్ఞాచ్ఛలేన సమదాదదితేస్సుతేభ్యః ॥

తా:- దేవాసురుల సంగ్రామమునందు దైత్యప్రభువులను దేవతల కొరకు వధించి మన్వంతరముల యందు స్వాంశమూర్తులచే భువనములను పాలించెను. మరియు వామనమూర్తియై యాచన నెపముతో బలినుండి ఈ భూమిని గ్రహించెను. అదితిదేవి యొక్క పుత్రులయిన ఇంద్రాదులకు (భూమిని) ఇచ్చెను. (20)

టీ:- అంతరేషు- సర్వమన్వంతరేషు, కళాభిర్మూర్తిభిః భువనాన్యదధా దపాలయత్. ఇమాంక్ష్మాం సమదాద్దదౌ.(20)

21.శ్లో॥ నిఃక్షత్రియామకృత గాం చ త్రిసప్తకృత్వో
రామస్తు హైహయకులాప్యయభార్గవాగ్నిః ।
సోఽబ్ధిం బబంధ దశవక్త్రమహన్ సలంకం
సీతాపతిర్జయతి లోకమలంఘ్యకీర్తిః ॥

టీ:- హైహయానాం కులస్యాప్యయాయ భార్గవరూపోఽగ్నిః. సరామో దాశరథిః సన్ లంకాం లంకాయాం స్థితమ్. స చ జయతి. వర్తమాన కాలీనోఽవతార ఇత్యర్థః. (21)

22.శ్లో॥ భూమేర్భరావతరణాయ యదుష్వజన్మా
జాతః కరిష్యతి సురైరపి దుష్కరాణి ।
వాదైర్విమోహయతి యజ్ఞకృతోఽతదర్హాన్
శూద్రాన్ కలౌ క్షితిభుజోన్యహనిష్యదంతే ॥

టీ:- అంతరేషు - మన్వంతరములయందు కళాభిఃస్వాంశమూర్తులచే, జగత్తులను పాలించెను. ఈ భూమిని ఇచ్చెను. (20)

తా:- హైహయవంశీయులగు రాజుల నాశనమునకు భార్గవరూపమగు అగ్నియయినపరశురాముడు ఇరవయ్యొక్కమార్లు భూమిని క్షత్రియులను వారు లేనిదిగా చేసెను. ఆ విష్ణువు సీతాపతియై సముద్రమును బంధించెను. లంకలోనున్న దశముఖుని వధించెను. ఇతరులకు అతిక్రమింప వీలుగాని కీర్తి గలవాడై లోకమును జయించుచున్నాడు. 21

టీ:- హైహయవంశీయులగు రాజుల యొక్క భార్గవరూపమగు అగ్ని అయిన. ఆ రాముడు దాశరథియై లంకయందున్న, అతను జయించు చున్నాడు. ఆ సీతాపతి వర్తమాన కాలము నందలి అవతారమని అర్థము. (21)

తా:- పుట్టుకలేని హరి భూమియొక్క భారమును దించుట కొరకై యదురాజుల యందు పుట్టినవాడై దేవతల చేతనూ దుష్కరములయిన కార్యములను చేయగలడు. యజ్ఞములు చేయుచున్ననూ ఆ యజ్ఞములు చేయనర్హులు కాని దైత్యులను హేతువాదముల చేత మోహ పెట్టగలడు కలియుగము నందు చివరన భూపాలురైన శూద్ర ప్రభువులను చంపగలడు.(22)

టీ:- భావినం రామకృష్ణావతారమాహ-భూమేరితి బుద్ధావతారమాహ - వాదైరితి. అతదర్హాన్య జ్ఞానర్హాన్దైత్యాన్విమోహ యిష్యతి. కల్క్యవతార మాహ - శూద్రానితి. నృహనిష్యన్నిహనిష్యతి. (22,23)

టీ:- రాబోవు రామకృష్ణావతారమును చెప్పుచున్నాడు భూమేః అని. బుద్ధావతారమును చెప్పుచున్నాడు వాదైః అని. అతదర్హాన్= యజ్ఞములు చేయ అర్హులు కాని దైత్యులు మోహ పెట్టగలడు. కల్క్యవతారమును చెప్పుతున్నాడు శూద్రాన్ అని. నృహనిష్యత్ = చంపగలడు. (22)

23. శ్లో॥ ఏవం విధాని కర్మాణి జన్మాని చ జగత్పతేః ।
భూరీణి భూరియశసో వర్ణితాని మహాభుజః ॥

తా:- ఓ మహాభుజా! గొప్ప యశస్సుకలవాడై లోకప్రభువైన శ్రీహరి యొక్క ఇటువంటి అవతారములను ఆ కర్మలునూ, అనేకములు వర్ణింపబడినవి. (23)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**చతుర్థోऽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**చతుర్థాధ్యాయము సమాప్తము.**

## పంచమోऽధ్యాయః

**నిమిరువాచ**

1. శ్లో॥ భగవంతం హరిం యే వై న భజంత్యాత్మవిత్తమాః ।
తేషామశాంతకామానాం కా నిష్ఠా విజితాత్మనామ్ ॥

టీ:- పంచమే భక్తి హీనానాం కానిష్ఠా కోయుగేయుగే పూజా విధిరితి ప్రశ్నద్వయస్యోత్తరముచ్యతే "త్వాం సేవతాం సురకృతా బహవోంత రాయా" ఇత్యనేన శ్రీహరి భక్తా విఘ్నమూర్ధ్ని పదందత్వా పరాంగతిం యాన్తి, అభక్తానాం తు విఘ్నా భవన్తీత్యుక్తే తర్హి తేషాం కాగతిర్భవతీతి పృచ్ఛతి - భగవన్తమితి. - హే ఆత్మవిత్తమాః! అవిజితాత్మనాం అత ఏవాశాన్త కామానాం కానిష్ఠా. కింప్రాప్యమిత్యర్థః.(1).

## పంచమాధ్యాయము

తా:- ఆత్మను తెలిసికొనిన వారిలో ఉత్తములారా! ఎవరు భగవంతుడయిన హరిని సేవింపరో శాంతించని కామము కలవారు, మనోనిగ్రహము కలవారు కారో ఆ అభక్తులకు ఏమిగతి? ప్రాప్యమగు స్థానమేది.(1)

టీ:- ఈ పంచమాధ్యాయమునందు భక్తిహీనులయిన వారినిష్ఠ ఎటువంటిది? ప్రతియుగమందును విష్ణుపూజ ఏ విధంగా వుంటుంది? ఈ రెండు ప్రశ్నలకు సమాధానము చెప్పబడును. "త్వాంసేవతాం" "నిన్ను సేవించు భక్తులకు దేవతలు చాలా విఘ్నములు చేయుచుందురు" అని చెప్పుటచే, శ్రీహరి భక్తులు కాని వారికి విఘ్నములు కలుగుచుండును. అని చెప్పబడినది. అట్లయినచో వారికేమి గతి కలుగును అని ప్రశ్నించుచున్నాడు. భగవంతుని. మే ఆత్మవిత్తమాః = ఆత్మను తెలిసికొనిన వారిలో ఉత్తములారా! జయింపబడని మనస్సు కలవారును అగు, అందులకే శాంతించని కామముకలవారును (అగు భక్తులకు) కానిష్ఠాః ప్రాప్యమగుస్థామేది. (1).

**చమస ఉవాచ**

2. శ్లో॥ ముఖబాహూరుపాదేభ్యః పురుషస్యాశ్రమైస్సహ ।
చత్వారో జజ్ఞిరే వర్ణాః గుణైర్విప్రాదయః పృథక్ ॥

**చమసుడు చెప్పుచున్నాడు**

తా:- ఆ మహాపురుషుని యొక్క ముఖ బాహూరు పాదముల నుండి నాలుగు వర్ణములయిన బ్రాహ్మణాదిజాతులు బ్రహ్మచర్యాద్యాశ్రమము లతో సహా జనించిరి. సత్వాదిగుణములచే బ్రాహ్మణులు మొదలయిన వారు వేరుగా జనించిరి. (2).

టీ:- స్వజనకస్య గురోర్భగవతోऽనాదరాద్గురుద్రోహేణ దుర్గతిం యాంతీతి వక్తుం భగవతః సకాశాద్వర్ణాశ్రమాణాముత్పత్తిమాహ ముఖేతి. గుణైః సత్త్వేన విప్రః; సత్వరజోభ్యాంక్షత్రియః, రజస్తమోభ్యాం వైశ్య, తమసాశూద్ర ఇతి. (2)

టీ:- తమకు జనకుడు (తమను పుట్టించినవాడు) గురువును అగు భగవంతుని ఆదరించక గురుద్రోహులయినవారు దుర్గతులను పొందుదురని చెప్పుటకై ముందుగా భగవంతుని వలన వర్ణాశ్రములు కలిగినవని చెప్పుచున్నాడు - ముఖ అని. సత్త్వగుణములతో విప్రుడు, సత్వరజస్సులచే క్షత్రియుడు రజస్తమస్సులచే వైశ్యుడు, తమోగుణముచే శూద్రుడు, అని. (2)

3. శ్లో॥ య ఏషాం పురుషం సాక్షాత్ ఆత్మప్రభవమీశ్వరం ।
న భజంత్యవజానంతి స్థానాద్భ్రష్టాః పతంత్యధః ॥

తా:- ఈ నాలుగు వర్ణముల వారిలో ఎవరు ఆ పరమ పురుషుని ప్రత్యక్షముగా తమ జన్మకారణమైన వానిని సేవింపరో, ఎవరు భజింపక అవమానింతురోవారు, తమ వర్ణాశ్రమముల ధర్మము నుండి భ్రంశమును పొందినవారై భ్రష్టులై పతితులగుదురు. (3)

టీ:- ఏషాం మధ్యేయేఽజ్ఞాత్వా న భజంతి యే చ జ్ఞాత్వాప్య వజానతి. ఆత్మనః ప్రభవోజన్మయస్మాత్తమ్. తదభజనేకృతఘ్నుతామప్యాహ - ఈశ్వరమితి. స్థానాద్వర్ణాశ్రమాద్భ్రష్టాః. (3)

టీ:- ఈ నాలుగు వర్ణముల వారి మధ్యన ఎవరు తెలియక భజింపరో ఎవరు తెలిసికొనియూ భజింపక అవమానింతురోవారు, తన జన్మ కారణమైన వానిని, అతనిని భజించనిచో కృతఘ్నుతను కూడా చెప్పుచున్నాడు ఈశ్వరమని. వర్ణాశ్రమముల నుండి భ్రష్టమయిన.(3)

4.శ్లో॥ దూరే హరికథాః కేచిత్ దూరే చాచ్యుతకీర్తనాః ।
స్త్రియశ్శూద్రాదయస్సర్వే తేఽనుకంప్యా భవాదృశామ్ ॥

తా:- కొందరు విష్ణుకథలను వినక దూరముననుందురు. మరి కొందరు విష్ణు సంకీర్తన చేయక దూరముననుందురు. ఆ స్త్రీలు శూద్రాదులు అందరూ మీవంటి వారికి కనికరింపదగిన వారగుదురు. (4)

టీ:- తత్ర యేఽజ్ఞాస్తే భవద్విధానామనుగ్రహ్యా ఇత్యాహ - దూర ఇతి. దూరే హరికథా శ్రవణం యేషాం తే. అత ఏవచాచ్యుత కీర్తనం యేషాం తే. దూరే అచ్యుత కీర్తనాశ్చేతి వా. (4)

టీ:- వారియందెవరు అజ్ఞానులో వారు మీచోటి వారిచే అనుగ్రహింప దగినవారు అని చెప్పుచున్నారు దూర అని. హరికథాశ్రవణము దూరమున ఎవరికో వారు. అందులకే విష్ణునామ సంకీర్తనము దూరము కలవారు అని.(4)

5.శ్లో॥ విప్రో రాజన్యవైశ్యౌ చ హరేః ప్రాప్తాః పదాంతికం ।
శ్రౌతేన విద్యయా వాపి ముహ్యంత్యామ్నాయవాదినః ॥

తా:- బ్రాహ్మణుడు, రాజు, వైశ్యుడు శృతి చెప్పిన ఉపనయనము చేత శ్రీహరి పాద సాన్నిధ్యాన్ని పొందినవారైయ్యూ వేదమునందలి అర్థ వాదములందు ఇచ్ఛగలవారై కర్మఫలములందు ఆసక్తులగుచున్నారు. 5

టీ:- జ్ఞానలవదుర్విదగ్ధాస్త్వచికిత్స్యత్వాదుపేక్ష్యా ఇత్యాశయేనాహ - విప్ర ఇతి. శ్రౌతేనోపనయనాఖ్యేన. ఉపలక్షణమేతత్. అధ్యయనాదినాపి హరేః పదాన్తికం తద్భజనోత్తమాధికారం ప్రాప్తా అపిముహ్యన్తి కర్మఫలేషు సజ్జన్తే. కుతః ఆమ్నాయేషు యే వాదా అర్థవాదాస్తే మోహకతయా విద్యన్తే యేషాం తే. తదుక్తం గీతాసు. "యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చితః. వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః." ఇత్యాదినా. (5)

టీ:- జ్ఞానలవదుర్విదగ్ధులైన వారైనచో (కొంత జ్ఞానముతో గర్వించు వారైనచో) అచికిత్స్యులగుదురు. చికిత్స చేయ సాధ్యముకానివారగుదురు. అచికిత్స్యులయినందున బాగుపరుచ వీలుకాని వారయి నందున ఉపేక్షించదగిన వారనుచున్నారు విప్ర అని. శ్రౌతేన = ఉపనయనముతో . ఇది ఉప లక్షణము. అధ్యయనాదుల వలన కూడా హరి యొక్క పదాన్తికమును ఆయనను భజించు ఉత్తమాధికారమును పొందినవారయ్యునూ ముహ్యన్తి = కర్మఫలముల యందు ఆసక్తులై మోహమును పొందుతున్నారు. ఎందులకు - వేదము నందలి ఏ అర్థవాదములు కలవో అవి మోహికములయిన వాటియందు వుంటున్నారు (ఎవరోవారు) గీతయందును "ఆత్మ జ్ఞానము లేని పండితులు వేదమునందలి స్వర్గాదిఫలములను చెప్పుచూ అర్థవాదముల లోనూ తత్కర్మలయందునూ ఆసక్తులై స్వర్గఫలముకంటే పొందదగిన ఫలము వేరుగా లేదని వాదించుచూ పుష్పమువలె శోభనమయిన వాక్కును వచించుచున్నారు" అని. (5)

6. శ్లో॥ కర్మణ్య కోవిదాస్తబ్ధాః మూర్ఖాః పండితమానినః ।
వదంతి చాటుకాన్మూఢాః యయా మాధ్వ్యా గిరోత్సుకాః॥

తా:- కర్మానుష్ఠానము నందు కర్మ బంధకమెట్లుకాదో అట్లు చేయుట తెలియని వారు తెలిసినవారిని సైతము అడిగి తెలిసికొననివారును. కావుననే వినయము కలవారు కారు ఏమియూ తెలియనివారయ్యు మేము పండితులమని యభిమానము కలవారు. మధువు వలె రుచి

టీ:- భక్తిమార్గదార్ఢ్యాయ తేషాం మోహం ప్రపంచయన్నిన్దన్తి - కర్మణీత్యాదినా. అకోవిదా యథా బంధకం న భవతి తథా కర్తుమజ్ఞాః న చాభిజ్ఞాన్ పృచ్ఛన్తి. యతః స్తబ్ధా అనమ్రాః. స్తబ్ధత్వేహేతుః - యతో మూర్ఖా అపి పండితావయమితి మానంతః అతః "అపామ సోమ మమృతాఅభూమ" "అక్షయ్యంహవై చాతర్మాస్యయాజినస్సుకృతంభవతి" "యత్రనోష్ణం వశీతం స్యాన్నగ్లానిర్నాప్యరాతయః" "ఇత్యాదికయా యయామాధ్వ్యాగిరోత్సుకాః సన్తో మూఢాస్తయా చాటుకానప్సరోభిః సహ విహరిష్యామ ఇత్యాది ప్రియాన్ శబ్దాన్ వదంతి. (6)

7. శ్లో॥ రజసా ఘోరసంకల్పాః కాముకా అహిమన్యవః ।
డాంభికా మానినః పాపాః విహసంత్యచ్యుతప్రియాన్ ॥

పుట్టించు వాక్కుచే సంతోషము కలవారై మూఢులు ఆ వాక్కుచే అప్సరసలను కూడి సంచరింతుమనునట్టి ప్రియమైన శబ్దములను చాటువులను చెప్పుదురు. (6)

టీ:- భక్తి మార్గము దృఢపడుట కొరకు వారి మోహమును వివరించుచు నిందించుచున్నారు. కర్మణి అని మొదలుకొని, కర్మ బంధకమెట్లు కాదో అట్లు చేయుట తెలియనివారు అభిజ్ఞులను కూడా అడిగి తెలిసికొనరు. వినయము కలవారునూకారు. దీనికి కారణము మూర్ఖులు కూడా అయి ఉండుట వలన మేమన్ని తెలిసిన పండితుల మని గర్వము గలవారై "మేము సోమపానము చేయుదుము అమృత స్వరూపుల మగుదుము చాతుర్మాస్యముల యాజించిన వాని సుకృతము అక్షయ్య మగును" "ఎక్కడ ఉష్ణము శీతము లేదో బడలిక లేదో శత్రువులు కూడా లేరో ఆ స్వర్గమును పొందుము" అని ఇటువంటి మధువువలె రుచికరములయిన వాక్కుచే సంతోషము కలవారై మూఢులు ఆ వాక్కుచే అప్సరసలను కూడుకొని సంచరించుదమనునట్టి ప్రియములైన శబ్దములను చెప్పుదురు.(6)

తా:- ఆ కర్మఠులు, రజోగుణముచే అభిచారము లేక మారణ క్రియ మొదలయిన ఘోరమయిన వానిని చేయ సంకల్పము గలవారై

కాముకులై సర్పమువలె క్రోధము కలవారై కపటాచారులు అహంకారులు పాపులునూ అయి, విష్ణు భక్తులను పరిహసించుచున్నారు. (7)

టీ: కించ తేషాం కర్మాభినివేశాత్కామ క్రోధ దంభాదయో వర్ధన్త ఇత్యాహ త్రయేణ రజసేతి. ఘోరోऽభిచారాదిః సంకల్పో యేషాం తే. అహివన్మన్యుర్యేషాం తే. (7)

టీ:- మరియు వారలకు కర్మఫలాదులందు పట్టుదల ఎక్కువ యగుట వలన కామక్రోధదంభాదులు పెరుగుననుచున్నారు. రజసా అని మూడు శ్లోకములలో, ఘోరము = అభిచారము మారణము చేయ సంకల్పము ఎవరికోవారు. పాము వలె కోపము ఎవరికో వారు.(7)

8.శ్లో॥ వదంతి తేऽన్యోన్యముపాసితస్త్రియో
గృహేషు మైథున్యపరేషు చాశిషః ।
యజంత్యసృష్టాన్న విధానదక్షిణం
వృత్త్యైపరం ఘ్నంతి పశూనతద్విదః ॥

తా:- ఆ కర్మఠులు నిరంతరము స్త్రీలను సేవించుచూ ఆతిథ్యాదులను వీడి స్త్రీసంగమమే ప్రధానముగాగల గృహాదుల యందు నివసించుచూ మైథునమే ప్రధానమైన భాగము అని ఇతరులతో చెప్పికొనుచూ అన్నప్రదానము, దక్షిణాదికములు లేని యజ్ఞము చేయుచూ హింసా దోషము తెలియనివారై కేవలము జీవనము కొరకు పశువుల వధించు చుందురు.(8)

టీ:- కాముకత్వం ప్రపంచయతి - వదంతీతి. ఉపాసితాః స్త్రియో యైర్నతు వృద్ధా స్తే మైథున్యం మిథున సుఖమేవ పరం నత్వాతిథ్యాది యేషు గృహేషు తేష్వాశిషో వదన్తి- “ఇదమద్యమయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్. ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్.

టీ:- కాముకత్వమును ప్రపంచించుచున్నాడు - వదన్తియని ఉపాసింప బడిన స్త్రీలు గల (స్త్రీలను పాసిస్తారు) వృద్ధులను మాత్రము కాదు. వారు మిథున సుఖమునే ఉత్కృష్టముగా (చెప్పుదురు) ఆతిథ్యాదులను కాదు. గృహముల యందు భోగవాంఛలను ప్రధానముగా చెప్పుదురు.

ఇద్యాకారాం. డాంభికతాం ప్రపంచయతి - యజన్తీతి. అసృష్టాన్న విధాన దక్షిణం న సృష్టా న సంపాదితాऽన్న విధాన దక్షిణా యథా తథా యజన్తి. తదా చ వృత్త్యై జీవికార్థం పరం కేవలం పశూన్ఘ్నన్తి. అతద్విదో = హింసాదోషానభిజ్ఞాః. (8)

"ఇదమద్య" ఇప్పుడు నేను దీనిని సంపాదించితిని నేను మనోరథమును పొందగలను ఇది నాకు గలదు. ఈ ధనాదికము నాకు గలుగగలదు. (అనునట్టి దాంభిక వచనములను చెప్పుదురు.) దాంభికతను ప్రపంచించుచున్నాడు. యజంతియని. అసృష్టాన్నవిధాన దక్షిణః సంపాదింపబడని అన్నప్రదానము, దక్షిణలు లేని యజ్ఞములను (చేయుదురు) కేవలము జీవనము కొరకై అజాది పశువులను చంపుచున్నారు. ఆతద్విదః = హింసాదోషమును తెలియని వారు.(8)

9. శ్లో॥ శ్రియా విభూత్యాభిజనేన విద్యయా
త్యాగేన రూపేణ బలేన కర్మణా ।
జాతస్మయేనాంధధియస్సహేశ్వరాన్
సతోऽవమన్యంతి హరిప్రియాన్ ఖలాః ॥

తా:- దుష్టులు ధనాదిసంపదచే, ఐశ్వర్యముచే, సత్కులమున పుట్టుటచే, వేదాది విద్యలచే, ధనాదులను దానము చేయుటచే, సౌందర్యముచే, దేహమనోబలముచే, సత్కర్మానుష్ఠానముచే, గుడ్డిదైన బుద్ధి గలవారై పరమేశ్వరుని ధ్యానించు హరిభక్తులైన సత్పురుషులను అవమానించు దురు. (9)

టీ:- మానితాం ప్రపంచయతి - శ్రీయేతి. శ్రియా ధనాదిసంపదా. విభూత్యా ఐశ్వర్యేణ శ్ర్యాదినా జాతో యః స్మయోగర్వస్తేనాంధా ధీర్యేషాం తే ఈశ్వర సహితాన్ సతోऽవమన్యన్తే. (9)

టీ:- మానితను ప్రపంచించుచున్నాడు శ్రియా అని శ్రియా = ధనాది సంపదచే, విభూత్యా ఐశ్వర్యముచే, శ్రీ వలన గలిగెడి ఏ గర్వము గలదో దాని వలన గుడ్డిదయిన బుద్ధి ఎవరికి గలదో వారు ఈశ్వరు లయిన సత్పురుషుల అవమానించుచున్నారు.(9)

10. శ్లో॥ సర్వేషు శశ్వత్తనుభృత్స్వవస్థితం
యథా ఖమాత్మానమభీష్టమీశ్వరం ।
వేదోపగీతం చ న శృణ్వతే బుధాః
మనోరథానాం ప్రవదంతి వార్తయా ॥

టీ:- కించ ఏవం వర్తమానాస్తే వేద తత్త్వార్థంస్ఫుటమపి నజానన్తీత్యాహ - సర్వేష్వితి. కేత రూపేణావస్థితం తదాహ - ఆత్మానమీశ్వరమాత్మతయా ఈశ్వరతయా చావస్థితమ్. ఏవమప్య సంగతా మాహ - యథా ఖమ్. పురుషార్థతామాహ - అభీష్టమ్. స్ఫుటత్వమాహ - వేదోపగీతం చేతి. తత్కుతః యతో మనోరథానాం వ్యవాయామిషమద్య సేవా విషయాణాం వార్తయా ప్రవదన్తి నివృత్తి పరంసన్తం వేదం ప్రవృత్తి పరం వర్ణయన్తి.(10)

తా:- శరీరధారులయిన వారందరియందు ఆకాశము వలె అంటక అంతర్యామి రూపమున ఉన్నట్టి పరమాత్మ చాలా ఇష్టుడు. వేదములచే కీర్తింపబడినవాడు అగు ఈశ్వరుని గురించి చెప్పిననూ, అజ్ఞానులై వినిపించుకొనరు. మనోరథముల యొక్క వృత్తాంతము చెప్పువాక్కుచే నివృత్తిపరమైన వేదమును ప్రవృత్తిపరముగా చెప్పుదురు. (10)

టీ:- మరియూ ఈ ప్రకారముగా ఉన్నట్టి వారు వేదము యొక్క పరమార్థమును సయితము స్పష్టముగా తెలియజాలరని చెప్పుచున్నాడు సర్వేషుయని. ఎట్టి రూపముతోనున్న (వాడిని) అది చెప్పనున్నాడు ఆత్మానం = ఈశ్వరుడిని ఈశ్వరునిగా ఉన్న వాడిని. ఇట్లయిననూ అసంగతమును చెప్పుచున్నాడు - యథా ఖమ్ అని. పురుషార్థతను చెప్పుచున్నాడు - అభీష్టమని. స్ఫుటత్వమును చెప్పుచున్నాడు. వేదోపగీతమని. తత్కుతః అది ఎందువల్ల ననగా - మనోరథానాం మైథున మాంస మద్యము మొదలయిన విషయ సుఖముల యొక్క వృత్తాంతము చెప్పు వాక్కుచే ప్రవదన్తి = నివృత్తిపరమైన వేదమును ప్రవృత్తిపరముగా వర్ణింతురు. (10)

11. శ్లో॥ లోకే వ్యవాయామిషమద్యసేవాః
నిత్యాస్తు జంతోర్నహి తత్ర చోదనా ।
వ్యవస్థితిస్తాసు వివాహ యజ్ఞ
సురాగ్రహైరాసు నివృత్తిరిష్టా ॥

తా:- ఈ లోకమునందు ప్రాణి మాత్రమునకు మైథునము మాంసాశనము మద్యసేవనము అనునవి. వాని యందును రాగము వలననే సదా ప్రాప్తించినవగును. అందువలన వానియందు వేదవిధి లేదు. ఆ మైథునాదుల యందు నిత్య వ్యవస్థ చేయబడుచున్నది. వివాహ విషయముననే స్త్రీ సంగమము (చేయవలెను) యజ్ఞమునందే ఆమిషసేవన, విహితమయిన యాగమునందే మద్యసేవనము చేయవలెనని నియమము చేయబడుచున్నది వీనియందు సేవింపకుండుట యనునది వేదసమ్మతము.(11)

టీ:- నను వ్యవాయాదీనామపి"ఋతౌభార్యాముపేయాత్" "హుతశేషం భక్షయేత్" ఇత్యాదినా విహిత త్వాత్కిమేవం నింద్యతే ऽత ఆహ - లోక ఇతి. వ్యవాయః స్త్రీసంగః. నిత్యారాగతేవ నిత్యం ప్రాప్తాః. జన్తోః ప్రాణిమాత్రస్య అతస్తత్ర తాసు చోదనా విధిర్నాస్తి. నను "ఋతావుపేయాత్" ఇత్యాదినా విధిర్దర్శితః, సత్యమ్, నత్వయ మపూర్వవిధిః, రాగతః ప్రాప్తత్వాత్, కింతు నియమ విధిరూపేణ రాగిణామభ్యనుజ్ఞా మాత్రం క్రియతే తదాహ - వ్యవస్థితిరితి, తేషు = వ్యవాయాదిషు. వివాహ యజ్ఞసురాగ్రహైః. వివాహ విషయ ఏవవ్యవాయః కార్యఃయజ్ఞ ఏవామిషసేవా. "సౌత్రామణ్యాం సురాగ్రహాన్ గృహ్ణాతి" ఇతిశృతే స్తత్రైవ మద్యసేవేతి నియమః క్రియతే. నను చ నియమపేక్ష స్యావశ్యకత్వాన్న

టీ:- ఓయీ! "ఋతౌభార్యా ముపేయాత్" = ఋతుకాలమునందు భార్యను పొందవలెను. హుతశేషం భక్షయేత్ = హోమముచేయగా మిగిలిన దానిని తినవలెను. అను నిట్టి వాక్యములచే స్త్రీ సంగము మొదలయినవి వేదవిహితములై కనబడుచుండగా వానిని ఎందులకు నిందింతురు అనియనగా చెప్పుచున్నారు. లోక అని. వ్యవాయః = స్త్రీ సంగము. నిత్యా = రాగము వలననే ప్రాప్తించినవి. జన్తోః ప్రాణి మాత్రమునకు. అందులకని తత్ర = వానియందు చోదనా = వేదవిది, నాస్తి = లేదు. ఓయీ! "ఋతౌ భార్యాముపేయా" అనెడి వాక్యము వలన విధి తెలుపబడినదిగదా, యనిన, నిజమే, ఇది అనురాగ ప్రాప్తమగుట వలన అపూర్వ విధిగాను, మరి యేమనగా నియమ

నిందాయక్తాకత ఆహ - ఆసు నివృత్తిరితి. ఆసు వ్యవాయామిష మద్యసేవాసు నివృత్తిరిష్టా. అయంభావః - నాయం నియమ విధిరపి నిత్యప్రాప్తత్వాదతో నివృత్తిః పరిసంఖ్యైవ, కథం తర్హివ్యవస్థితిరిత్యుక్తమ్, ఉచ్యతే, నతావత్పరి సంఖ్యా విధినాశృత్యా నివృత్తి రుచ్యతే. తథా సతి స్వార్థత్యాగః, పరార్థ కల్పనా, ప్రాప్తబాధశ్చేతి దోషత్రయం స్యాత్, అతః క్వచిత్ప్రాప్త్యతోఽప్యర్థస్య ప్రాపణమనర్థక మిత్యపూర్వవిధి ద్వారా అన్యని వృత్తిః ఫలతోభవతి, తద్యథా- "ఇమామగృభ్ణ న్రశనామృత స్యేత్యశ్వాభిధానే మాధత్తే" ఇత్యత్ర రశనా లింగతో గర్దభాశ్వాభిధానీ శనాద్వయే ప్రాప్త్యతో మన్త్రస్యా పూర్వ విధిద్వారా పరిసంఖ్యోఽచ్యతే. యథోక్తం తన్త్రవార్తికే - 'అప్రాప్త విధిరేవాయమీతో మన్త్రస్యనిశ్చితః. పరిసంఖ్యా ఫలేనోక్తా నవిశేషః పునః శృతేః ఇతి. క్వచిత్తు రాగతో నిత్యప్రాప్తప్రాప్తాంశ పూరణ లక్షణస్వనియమ ఫలస్యాప్య భావాన్నియమ విధిద్వారా ఫలతః పరిసంఖ్యా భవతి, యథా - "పంచ పంచ నఖాభక్ష్యా" ఇతి. తథా రాగతో నిత్యవత్ప్రాప్తస్య వ్యవాయాదేర్వివాహాది నియమనాభ్యనుజ్ఞా ద్వారా పరిసంఖ్యైవేతి. నను యద్యభ్యనుజ్ఞా మాత్రమేతద్భవేత్తర్హి "ఋతుస్నాతాం తు యో భార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి. ఘోరాయాం భ్రూణ హత్యాయాం పచ్యతే నాత్ర సంశయః" ఇత్యాది దోష శ్రవణం న స్యాత్. న దోషః. మనసి కామేసత్యపితస్యామరుచ్యా ద్వేషాదినావా తామనుగచ్ఛతో దోష శ్రవణోపపత్తేరితి సర్వమనవద్యమ్.(11)

విధిరూపమున అట్టి రాగమూ కలవారికి అభ్యనుజ్ఞా మాత్రము చేయబడుచున్నది. దానినే చెప్పుచున్నాడు వ్యవస్థితియని. తేషుః ఆ మైథునాదులందు, దేనిచే యనగా వివాహయజ్ఞ సురాగ్రహములచే, వివాహ విషయముననే స్త్రీ సంగము చేయవలెను యజ్ఞమునందే యామిషసేవ; "సౌత్రామణ్యా సురాగ్రహాన్ గృహ్ణాతి" అనెడి శృతి వలన (సురా కలశములను కొనుచున్నాడు అని శృతి యర్థము) సౌత్రామణియాగము నందు చెప్పుట వలన ఆ యాగము నందే మద్యసేవనము చేయవలెనని నియమము చేయబడుచున్నది. ఓయీ! ఆ నియమ పక్షమున సైతము ఆవశ్యమగుట వలన స్త్రీ సంగాదులను నింద చేయుట యుక్తము కాదనగా చెప్పుచున్నారు - ఆసునివృత్తి యని. ఆసు-వీనియందు - వ్యవాయామిష మద్యసేవనములయందు, సేవింపకుండుట యనుని ఇష్టా = సమ్మతమయి యున్నది (వేద సమ్మతము). దీని భావమిది - ఈ మైథునాదికము నిత్యముగా ప్రాప్తమయినది కనుక ఇది నియమవిధియును కాదు. దీని నుండి (మైథునాదికము నుండి) నివృత్తి పరిసంఖ్యా విధి రూపమే. ఈ మైథున ఆమిషమద్య సేవలయందభిమతమై యున్నది. అట్లయినచో వానియందు నియమమెట్లు చెప్పిరి. అనగా చెప్పెదను. పరిసంఖ్యాదులచే వీని నుండి శ్రౌతీనివృత్తి చెప్పబడలేదు. నివృత్తి అర్థ సిద్ధము మాత్రమే. శ్రౌతీ నివృత్తి చెప్పినచో స్వార్థ త్యాగము. పరార్థకల్పన.

ప్రాప్త బాధయను దోషత్రయము కలుగును. అందువలన నిది యపూర్వ విధి యనవలెను. ఒక్కొక్కచో సిద్ధింపబోవు అర్థమును మళ్ళీ విధించుట వ్యర్థమగును. కనుక అపూర్వవిధి అర్థమును బట్టి ఇతర నివారణ ఫలకమగును. ఇది ఎట్లనగా – "ఇమామగృభ్ణన్" అనెడి శృతి యందు రశనా (పగ్గము) లింగమును బట్టి గర్దభము, అశ్వముల యొక్క రశనాద్వయమును పొందింపచేయు మంత్రమునకు అపూర్వ విధి ద్వారా ఇతర నివృత్తి చెప్పబడుచున్నది (పరి సంఖ్య చెప్పబడుచున్నది) ఈ విషయమే తంత్ర వార్తికముననూ చెప్పబడినది."అప్రాప్త విధిరేవాయ మతో వన్త్రస్య నిశ్చయః. పరిసంఖ్యాఫలేనోక్తాన విశేషః పునః శృతిః" అని మరికొన్ని సందర్భములలో రాగము వలన నిత్యప్రాప్తమైన దానికి అప్రాప్తాంగ పూరణ లక్షణమగు నియమఫలము కూడా లేకపోవుట వలన నియమ విధి ద్వారా ఫలమును బట్టి పరిసంఖ్యా విధియగును. ఎట్లనగా. "పంచపంచనఖాభక్ష్యాః" (ఐదుగోళ్ళు గల జంతువులు ఐదు మాత్రము తినదగినవి") ప్రకృతమున రాగమును బట్టి నిత్యప్రాప్తమయిన స్త్రీ సంగమాదికమునకు వివాహాది నియమముచేనభ్యనుజ్ఞద్వారా నివర్తనమే ఇష్టము" విధి గత్యంతమప్రాప్తే నియమః పాక్షి కేసతి. తత్రచాన్యత్ర చప్రాప్తౌ పరిసంఖ్యేతిగీయతే"

(1) అపూర్వ విధి అనగా ముందు ప్రాప్తించనట్టి ప్రయోజనమును ప్రాప్తింపచేయునది ఉదా: "వ్రీహులను ప్రోక్షించవలెను ప్రోక్షించినచో

వ్రీహులకు ముందు లేనట్టి (పారిశుద్ధ్యము) అపూర్వము ఏర్పడుచున్నది. ఇది అప్రాప్తముగాన అపూర్వ విధి.

(2) అప్రాప్తాంశపూరణము చేయునది నియమవిధి "వ్రీహి న వహంతి" ధాన్యమును దంచి తండులములను స్వీకరించాలి. ధాన్యము నకు నఖ విదళనాదుల వలన కూడా తండుల స్వరూపము రాగా పక్ష ప్రాప్తమయిన దానిని అవహననము చేయవలెనని నియమమును చేయువిధి.

(3) రెండింటిలో ఒక దానిని గ్రహింప చేయునది పరిసంఖ్యావిధి అశ్వరశనా, గర్ధభరశనాయను రెండింటిలో అశ్వరశననే గ్రహించవలె నని చెప్పునది పరిసంఖ్యా విధి.

ఓయీ! ఇది యభ్యనుజ్ఞ మాత్రమే అయినచో "ఋతుస్నాతాం ఎవడు ఋతు స్నాతమయిన భార్యను చేరి సంగమింపడో వాడు ఘోరమయిన భ్రూణహత్యను చేసినవాడగును ఇందున సందేహమే లేదు అను దోషశ్రవణమే లేకపోవును కదా!, అనిన ఇది దోషము కాదు ఎట్లన, మనస్సు నందు కామము కలిగియుండియూ, భార్య యందు అభిరుచి లేక గాని, ద్వేషాదులచే గాని ఆమెను పొందని వానికీ దోష శ్రవణము యుక్తమగుచున్నది. (11)

12.శ్లో॥ ధనం చ ధర్మైకఫలం యతోऽస్య
జ్ఞానం సవిజ్ఞానమను ప్రశాంతి ।
గృహేషు యుంజంతి కళేబరస్య
మృత్యుం న పశ్యంతి దురంతవీర్యమ్ ॥

తా:- ధనము యాగాదిరూపమైన ధర్మము ముఖ్య ఫలముగా గలది. ఆ ధర్మము వలననే అపరోక్ష జ్ఞానమును కలిగించు పరోక్ష జ్ఞానము కలుగుచున్నది. పరోక్ష జ్ఞానము కలిగిన తరువాత అపరోక్ష జ్ఞానము అనగా ఆత్మానుభవము కలిగి పిమ్మట పరమశాంతి నిర్వాణ రూపమయిన నిత్యసుఖము కలుగుచున్నది. ఇట్టి పరంపరగా మోక్ష సాధనమగు ధనమును గృహస్థులు గృహములందును, పశువులూ కళత్రాదులందును తమ దేహ సౌఖ్యము కొరకు సంపాదించి వినియోగింతురు. అనివార్యమై నిరంకుశమైన బలము గల మృత్యువును చూడరు. (12)

టీ:- తదేవం వ్యవాయాది మనోరథాకులిత త్వాదభీష్ట మాత్మానం నశృణ్వన్తీత్యక్తమ్, ఇదానీం ధనస్యాపి ధర్మద్వారా పరమాత్మ ప్రాపకస్య దృష్టోపభోగార్థం వినియోగాన్నాత్మజ్ఞాన గంధోऽపీత్యాహ - ధనం చేతి. ధర్మ ఏవ ఏకం ఫలం యస్య తత్. కుతః. యతో యస్మాద్ధర్మాత్స విజ్ఞానమపరోక్షజ్ఞాన సహితం దృఢం పరోక్ష జ్ఞానం భవతి. కథం భూతమ్. అను ప్రశాంతి - అన్వనంతర మేవ ప్రకృష్టాశాన్తిర్నిర్వాణ లక్షణాయస్య తత్. ఏవం భూతం ధనం గృహేషు దేహాద్యర్థం యుంజంతి.(12)

టీ:- ఈ విధముగా వ్యవాయము మొదలగు మనోరథములచే ఆకులత్వము పొందుట వలన మానవులు అత్యంతము ఇష్టమైన పరమాత్మను గూర్చి వినరు అని చెప్పబడినది. ఇప్పుడు ధనము కూడా ధర్మము ద్వారా పరమాత్మను పొందించునదైననూ దృష్టములగు ఉపభాగముల కొరకు ఆ ధనము వినియోగించుట వలన ఆత్మ జ్ఞానగంధము కూడా లేదనుచున్నాడు ధనంచ అని. ధర్మమొక్కటే ఫలము కాగలది ఎందులకు? ఎందులకనగా ఏ ధర్మము వలన అపరోక్ష జ్ఞానముతో కూడిన దృఢఫలమునిచ్చుదైన పరోక్షజ్ఞానము కలుగునో, ఇంకెటువంటిది అను ప్రశాంతి = నేను వెంటనే గొప్ప శాంతి

13. శ్లో॥ యద్ఘ్రాణభక్షో విహితస్సురాయాః
తథా పశోరాలభనం న హింసా ।
ఏవం వ్యవాయః ప్రజయా న రత్యై
ఇమం విశుద్ధం న విదుస్స్వధర్మమ్ ॥

టీ:– కించ వ్యవస్థయాపి వ్యవాయాద్యభ్యనుజ్ఞానం న యథేష్టం, అపి త్వన్యథైవేత్యాహ – యదితి. యద్యస్మాత్సురాయా ఘ్రాణభక్షోఽవఘ్రాణం స ఏవ విహితః, నపానమ్, తథా పశోరప్యాలంభన మేవ విహితం, న తు హింసా అయమర్థః. దేవతోద్దేశేన యత్పశుహననం తదా లభనం "వాయవ్యగ్గ్‌శేత్తమాలభేత" ఇత్యాదిశృతేర్నతు హింసా "యావేద విహితా హింసాన సాహింసేతి కీర్త్యతే" ఇతి వచనాత్

మోక్షరూపమయినది కలుగుచున్నదో (అనగా ఇటువంటి ధనమును) గృహేషు గృహపశుదారాదుల విషయమున తన శరీరము కొరకు వినియోగింతురు. (12)

తా:– సౌత్రామణి మొదలయిన యాగముల యందు సురను వాసన చూచుటయే వేద విహితము కాని పానము చేయుట కాదు. అట్లే కేవలము దేవతనుద్దేశించి ఆ దేవతా ప్రీతికారకు పశువును ఆలంభించుట వేదవిహితమగుట వలన అది హింస కాదు. కాని కేవల జిహ్వా చాపల్యము కొరకై పశువులను వధించుట హింసయే యగును. అట్లే ఋతుకాలము నందు కేవలము సంతానము కొరకగు భార్యా సంగమమే వేద విహితముగాని, కామమగు రతి కాదు ఇటువంటి విశుద్ధములయిన ధర్మములను ఆ కర్మవాదులు తెలిసికొనరు. (13)

టీ:– మరియు స్త్రీ సంగమాదుల యొక్క అభ్యనుజ్ఞ వేదవిహితమై యున్నందున యధేష్టముగా ఆచరింపరానిదగును. మరియు దానికి ఏ విధముగా ప్రయోజనమో చెప్పుచున్నాడు. యదితి. యద్ = ఎందువలన సురాయాః మద్యము యొక్క ఘ్రాణభక్షో = వాసన చూచుట విహితః = వేద విహితము. పానము చేయుట కాదు. అట్లే పశువు యొక్క ఆలంభనమే విహితము. హింసకాదు. దీనియర్థమిది

భక్షణోద్దేశేనతు క్రియమాణం హననం లౌకిక వద్ధింసైవ. అత్రహ్యా లభనమేవ విహితం, న తు హింసా. అతోనయథేష్ట భక్షణాభ్యను జ్ఞేత్యర్థః వ్యవాయోపి ప్రజయానిమిత్త భూతయా, న తు రత్యై. అతో మనోరథ వాదిన ఇమం విశుద్ధం స్వధర్మం నవిదురితి. (13)

దేవతలనుద్దేశించి ఏ పశువులను వధించుట కలదో దానిని ఆలభనమందురు. "వాయవ్యగ్శ్వేత మాలభేత" తెల్లని పశువును వాయుదేవతా ప్రీతి కొరకు ఆలభించవలెను. అనశృతిని బట్టి ఇది హింస కాదు. "వేద విహితమయిన హింస హింస కాదు" అను వచనము వలన భక్షించునుద్దేశ్యముతో చేయబడుచున్న పశుహింసయే హింస కాని ఆలభనము వేద విహితము అగుటచే హింసకాదు అందువలన యధేష్టముగా భక్షణాభ్యనుజ్ఞ లేదు. అని యర్థము. భార్యా సంగము కూడా సంతానము నిమిత్తము విహితము. కేవలము కామాభిలాష తీర్చుకొనుటకై కాదు. అందులకు మనోరథవాదులు ఇటువంటి పరిశుద్ధమయిన స్వధర్మమును తెలిసికొనరు. (13)

14. శ్లో॥ యేత్వ నైవంవిదో సంతః స్తబ్ధాస్సదభిమానినః ।
పశూన్ ద్రుహ్యంతి విస్రబ్ధాః ప్రేత్య ఖాదంతి తే చ తాన్ ॥

తా:- ఎవరు ఇటువంటి విశుద్ధమయిన తమ ధర్మమును తెలిపి కొనలేని వారై అవినీతులై దురహంకారులై పశుమాంస భక్షణమే మా కిష్టమయి నది అని విశ్వాసము కలవారై పశువులను హింసించు చున్నారో, పరలోకమందు వారిచే హింసింపబడిన పశువులు వారిని భక్షించును. (14)

టీ:- ఏవం భగవత్పరాఙ్ముఖానాం బహుదోషతాం ప్రపంచ్య తన్నిష్ఠాం ప్రపంచయతి - యేత్వితి పంచభిః. అనేవం విధః. న ఏవం ధర్మం

టీ:- ఈ ప్రకారముగా భగవత్పరాంగ్ముఖులకు బహు దోషత్వమును ప్రవచించి వారినిష్ఠను ఐదు శ్లోకములచే వివరించుచున్నాడు. అనే

విదన్తి యే తే. విస్రబ్ధా నిఃశ్శంకాః. అనేన మనోరథో భవిష్యతీతి విశ్వస్తా వా. తదానీన్తన పోషణేన వా తైః పశుభిర్విశ్వస్తాః. తే చ పశవః ప్రేత్య అముత్ర తాన్ ఖాదంతి "మాంస భక్షయితాऽముత్ర యస్య మాంస మిహాద్మ్యహం. ఏతన్మాంసస్యమాం సత్వం ప్రవదంతి మనీషిణఃఇతి వచనాత్. (14)

వందిదః = ఈ విధముగా ధర్మమును ఎవరు తెలిసికొనరో వారు విస్రబ్ధానిశ్శంకులై, దీనిచే మా మనోరథమీడేరునని విశ్వసించినవారై, ఆ కాలములోని పోషణాదుల వలన పశువులచే విశ్వసింపబడినవారై, ఆ పశువులు ప్రేత్యః పరలోకమునందు ఆ హింసకులను భక్షించు చున్నవి. "మాంసభక్షయితయగువాడు దేనిమాంసమును నేను తిందున నుచున్నాడో వాడు ఆ పశువునకు పరలోకమందు మాంసమగును" అని విద్వాంసులు చెప్పుదురు. (14).

15.శ్లో॥ ద్విషంతః పరకాయేషు స్వాత్మానం హరిమీశ్వరం ।
మృతకే సానుబంధేऽస్మిన్ బద్ధస్నేహాః పతంత్యధః ॥

తా:- ఇతర ప్రాణులను చంపుట ద్వారా వాని శరీరములందున్న వాడును, తమకును, ఆత్మయైన పరమేశ్వరుడైన హరిని శత్రువని తెలిసికొని ద్వేషించుచూ, పుత్రాదులగు వారి సంబంధము కలిగి చనిపోవునట్టి యీ శరీరమునందు చాలా ప్రేమ గలవారై అధః పతితులగుదురు. (15)

టీ:- అభిచారాదినా ద్విషంతః. మృతకేదేహేసానుబంధే పుత్రాది సహితే (15)

టీ:- అభిచారాది క్రియలచే హింసించుట ద్వారా ద్వేషించుచూ, మృతకే = చనిపోవునట్టి దేహమునందు. పుత్రాదుల సంబంధము గల. (15)

16.శ్లో॥ యే కైవల్యమసంప్రాప్తాః యే వా నీతాశ్చ మూఢతాం ।
త్రైవర్గికాహ్యక్షణికాః ఆత్మానం ఘాతయంతి తే ॥

తా:- ఎవరు తత్వజ్ఞానమును పొందని వారో, ఎవరు అత్యంతము మూఢత్వము కలవారో, ఎవరు త్రివర్గముననే ప్రధానముగా ప్రవర్తించు

వారో, ఎవరు అశాంత హృదయులో, దేహముల యందు స్థిరత్వ బుద్ధి కలవారో, వారు ఆత్మను పరమాత్మను హింసించుచూ ఆత్మ ఘాతకులు ఆత్మజ్ఞానము లేనివారు నగుచున్నారు. (16)

టీ:- అజ్ఞాస్తత్వజ్ఞైరనుకంపితాస్తరంతి, తత్వజ్ఞాస్తు స్వతః యే తు నాత్యంతమజ్ఞాన చ తత్వజ్ఞాస్తేఽన్తరాల వర్తినః పతన్తీత్యాహ య ఇతి. కైవల్యం తత్వజ్ఞానమసంప్రాప్తాః. మూఢతామత్యన్త జడతాం. తత్రహేతుః త్రివర్గప్రధానాః. అక్షణికా ఉపశాన్తి క్షణ రహితా దేహాదిస్థైర్య బుద్ధయో వా స్వయమే వాత్మానం ఘాతయన్తి. (16)

టీ:- అజ్ఞానులు తత్వజ్ఞులచే కనికరింపబడినవారై తరింతురు. తత్వజ్ఞులు స్వయముగా తరింతురనుచున్నాడు ఎవరు అత్యంతమజ్ఞులు కారో, తత్త్వజ్ఞులునూ కారో, వారు అంతరాలవర్తులై పతనమును పొందుచున్నారు అనుచున్నారు యోకైవల్యయని. కైవల్యతత్త్వజ్ఞానమును అసంప్రాప్తాః పొందిన వారుకారో, మూఢతాంః అత్యంత జడతను ఇక్కడ హేతువు - త్రివర్గ ప్రధానాః = ధర్మార్థకామము ప్రధానము కాగలవారు. అక్షణికా క్షణము కూడా శాంతి రహితులో, దేహాదుల యందు స్థిరబుద్ధి కలవారో స్వయముగా తమనుతాము చంపుకొను చున్నారు. (ఆత్మఘాతకులగుచున్నారని భావము) (16)

17.శ్లో॥ ఏత ఆత్మహనోఽశాంతాః అజ్ఞానే జ్ఞానమానినః ।
సీదంత్యకృతకృత్యా వై కాలధ్వస్త మనోరథాః ॥

తా:- వీరు ఆత్మను కప్పిపుచ్చువారు ఆత్మ ఘాతకులు, మనః ప్రశాంతి లేనివారు, అజ్ఞాన దశయందు చేయు కర్మయందు జ్ఞానమును అభిమానము కలవారు, కాలముచే ధ్వంసము చేయబడిన వాంఛలు కలవారు కావున కృతకృత్యులుగాక నశింతురు. (17)

టీ:- తదాహ - ఏత ఇతి. ఆత్మహనః ఆత్మాऽపహ్నవ కర్తారః. అజ్ఞానే కర్మణి. తథా చ శృతిః "అసుర్యానామ తేలోకా అంధేన తమసావృతాః తాంస్తేప్రేత్యాభిగచ్ఛన్తి యేకే చాత్మహనోజనాః" ఇతి. (17)

టీ:- ఆత్మహనః = ఆత్మను కప్పిపుచ్చు వారు. అజ్ఞాని కర్మణి- అజ్ఞాన దశయందు చేయు కర్మయందు. ఎవరు ఆత్మజ్ఞానము లేనివారై అజ్ఞానులై మరణింతురో ఆ నరులు అసురసంబంధములై యజ్ఞానముతో గూడిన స్థావరాది జన్మములను పొందుదురు. అని శృతి. (17)

18. శ్లో॥ హిత్వా ప్రయాసరచితా గృహాపత్యసుహృచ్ఛ్రియః ।
తమో విశంత్యనుచ్ఛ్వాసం వాసుదేవపరాఙ్ముఖాః ॥

తా:- శ్రమచే సంపాదింపబడిన ఇల్లు, సంతానము, బంధువులు, సిరిసంపదలు, అను వానిని విడిచి విష్ణు భక్తులు కానివారు. అంతములేని నరకమున ప్రవేశింతురు. (18)

టీ:- యా గృహాపత్య సుహృచ్ఛ్రియస్తా హిత్వా. (18)

టీ:- గృహము, సంతానము, స్నేహితులు సంపదలేవి కలవో వాటిని వీడి. (18)

**రాజోవాచ**

19. శ్లో॥ కస్మిన్కాలే స భగవాన్ కిం వర్ణం కీదృశో నృభిః ।
నామ్నా వా కేన విధినా పూజ్యతే తదిహోచ్యతామ్ ॥

తా:- ఏ కాలము నందు భగవంతుడు, ఏ వర్ణము, ఏ రూపము గలవాడై యుండును? మానవులు ఆ భగవంతుని ఏ రూపమున ఏ నామమున ఏ విధానమున పూజింతురో? దానిని నాకు చెప్పుము. (19)

టీ:- తదేవం భగవద్భక్తిరేవ కర్తవ్యేతి స్థితే తత్ర విశేషం పృచ్ఛతి - కస్మిన్కాల ఇతి. కిం వర్ణః కీదృగ్వర్ణవాన్. కీదృశః కీదృగాకారః కేన వానామ్నా. కేన వా విధినా. (19)

టీ:- ఈ విధముగా భగవద్భక్తియే చేయవలసినదై యుండగా అక్కడ విశేషమునడుగుచున్నాడు కస్మిన్కాల అని. కింవర్ణ=ఏ వర్ణము కలవాడు. కీదృశః = ఏ ఆకారము గలవాడు, ఏ పేరుతో, ఏ విధి వలన. (19)

**కరభాజన ఉవాచ**

20.శ్లో॥ కృతం త్రేతా ద్వాపరం చ కలిరిత్యేషు కేశవః ।
నానావర్ణాభిధాకారో నానైవ విధినేజ్యతే ॥

టీ:- ఏషు కృతాది కాలేషు. నానా ప్రకారావర్ణాభిధాకారా యస్య సః నానైవ విధినా వివిధేనైవ మార్గేణ. (20)

21.శ్లో॥ కృతే శుక్లశ్చతుర్బాహుః జటిలో వల్కలాంబరః ।
కృష్ణాజినోపవీతాక్షాన్ బిభ్రద్దండకమండలూ ॥

టీ:- తదేవ వర్ణాది చతుష్టయమాహ కృత ఇత్యాదినా - కృష్ణాజినాదీన్బిభ్రదితి బ్రహ్మచారి వేషో దర్శితః. (21)

తా:- కృత, త్రేత, ద్వాపర కలియుగముల యందు శ్రీహరి నానావిధము లయిన వర్ణములు రూపములు నామములు గలవాడై ఉంటూ మానవులచే నానావిధములయిన మార్గములచే పూజింపబడును. (20)

టీ:- ఈ నాలుగు యుగములందు వివిధములయిన వర్ణములు నామములు రూపమును (ఎవనికోవాడు) కలవాడై, వివిధములైన విధానముల చేత. (20)

తా:- కృతయుగమున విష్ణువు తెల్లని వర్ణము కలవాడును నాలుగు చేతులు గలవాడును, జడలు దాల్చిన వాడును, వల్కలములు ధరించిన వాడును, జింక చర్మము జందెము, అక్షమాల, కమండలువు అను వానిని ధరించినవాడును అగుచూ బ్రహ్మచారి వేషమున నుండి పూజింపబడుచుండును.(21)

టీ:- ఆ వర్ణాది చతుష్టయమును చెప్పుచున్నాడు కృత అని మొదలుకొని. కృష్ణాజినాదులను ధరించుచూ అని బ్రహ్మచారి వేషము చూపబడినది. (21)

22.శ్లో॥ మనుష్యాస్తు తదా శాన్తాః నిర్వైరాస్సమదర్శినః ।
యజంతి తపసా దేవం శమేన చ దమేన చ ॥

టీ:- తపసా ధ్యానేన. (22,23)

తా:- కృతయుగము నందు మానవులు శాంత చిత్తులై, వైరమూనివారై, సమదర్శులై యుందురు. మహావిష్ణువును జ్ఞానము చేతను, మనశ్శాంతి చేతను, ఇంద్రియనిగ్రహము చేతను పూజింతురు. (22)

టీ:- తపస్సుతో, ధ్యానముతో. (22)

23.శ్లో॥ హంసస్సువర్ణో వైకుంఠో ధర్మో యోగీశ్వరోఽమలః ।
ఈశ్వరః పురుషోఽవ్యక్తః పరమాత్మేతి గీయతే ॥

తా:- హంస, సువర్ణ, వైకుంఠ, ధర్మ, యోగీశ్వర, అమల, ఈశ్వర, పురుష, అవ్యక్త, పరమాత్మ అని కృతయుగమున నారాయణుడు కీర్తింపబడును.(23)

24.శ్లో॥ త్రేతాయాం రక్తవర్ణోఽసౌ చతుర్బాహుస్త్రిమేఖలః ।
హిరణ్యకేశస్త్రయ్యాత్మా స్రుక్స్రువాద్యుపలక్షణః ॥

టీ:- త్రిగుణా దీక్షాంగభూతా మేఖలా యస్యస యజ్ఞమూర్తిః. హిరణ్యకేశః పిశంగకేశః. (24)

తా:- త్రేతాయుగమునందు విష్ణువు ఎర్రనివర్ణము, నాలుగు చేతులు, త్రిగుణాత్మకమై దీక్షాంగమైన మూడు పేటల మొలత్రాడును, యజ్ఞ స్వరూపమును గలవాడై సుక్స్రువములను యజ్ఞోపకరణములు చిహ్నాములుగా ధరించి యుండును.(24)

టీ:- ముప్పేటలతో కూడిన, దీక్షాంగభూతమైన మొలత్రాడు గలవాడు. యజ్ఞమూర్తి, బంగారు రంగు వెంట్రుకలు గలవాడు. (24)

25.శ్లో॥ తం తదా మనుజా దేవం సర్వదేవమయం హరిం ।
యజంతి విద్యయా త్రయ్యా ధర్మిష్ఠా బ్రహ్మవాదినః ॥

టీ:- త్రయ్యా విద్యయా వేదత్రయోక్త కర్మభిః. (25)

తా:- ఆ త్రేతాయుగమునందు సర్వదేవతా స్వరూపుడయిన శ్రీ మహావిష్ణువును మానవులు, వేద ధర్మపరులై వేదత్రయము నందు చెప్పబడిన కర్మలచే పూజింతురు. (25)

టీ:- వేదత్రయోక్త కర్మలచే. (25)

26. శ్లో॥ విష్ణుర్యజ్ఞః పృశ్నిగర్భః సర్వదేవ ఉరుక్రమః ।
వృషాకపిర్జయంతశ్చ ఉరుగాయ ఇతీర్యతే ॥

తా:– విష్ణు, యజ్ఞ, పృశ్నిగర్భ, సర్వదేవ, ఉరుక్రమ, వృషాకపి, జయంత, ఉరుగాయ అను పేర్లచే విష్ణువు పిల్వబడును. (26)

టీ:– పృశ్నిగర్భః పృశ్నిః సుతపసః ప్రజాపతేః పత్నీ తస్యాః పుత్రః వృషాకపిః స్మృతః సన్వర్షతి కామానాకమ్పయతి క్లేషానీతి తథా జయత్యేవ సర్వదాజయంతః. (26)

టీ:– పృశ్నియను సాధ్వీక పుత్రుడు, సుతపస్సుయనెడి ప్రజాపతి భార్య పృశ్ని, ఆమె పుత్రుడు, తన్ను స్మరించువారికి అభీష్టములను వర్షించువాడు లేక క్లేశములను కంపింపచేయువాడు. సర్వదాజయమే కలవాడును. (26 )

27. శ్లో॥ ద్వాపరే భగవాన్ శ్యామః పీతవాసా నిజాయుధః ।
శ్రీవత్సాదిభిరంకైశ్చ లక్షణైరుపలక్షితః ॥

తా:– ద్వాపరమునందు కృష్ణభగవానుడు నీలమేఘవర్ణుడు పసుపువర్ణపు వస్త్రము కలవాడు, శంఖచక్రాలు ఆయుధములుగా ధరించినవాడు. శ్రీవత్సము, నాభిపద్మము మొదలయిన చిహ్నములు గలవాడును. కౌస్తుభబాహ్య లక్షణములు గలవాడును అయికన్పడును. (27)

టీ:– శ్యామో అతసీపుష్పసంకాశః. నిజాని చక్రాదీన్యాయుధాని చ యస్య సః. శ్రీవథ్సోనామ వక్షసోదక్షిణ భాగే రోమ్ణాం ప్రదక్షిణావర్తః స ఆదిర్వేషాం కరచరణాది గత పద్మాదీనాం తైరంకైరాంగికైశ్చిహ్నైర్లక్షణైః బాహ్యైః కౌస్తుభాదిభిః. (27)

టీ:– నల్లని అవిసెపూవువలె ఆకుపచ్చ లేక నీలవర్ణము గలవాడు. తన చక్రాది ఆయుధములు కలవాడు. శ్రీ వత్సమనగా వక్షము నందు దక్షిణ భాగమునందు ప్రదక్షిణముగా తిరిగిన వెంట్రుకలు, అది మొదలుకని, కరచరణాదులయందలి పద్మము మొదలయిన చిహ్నముల చేతను, కౌస్తుభాది బాహ్య లక్షణములు కలవాడయి, (గోచరించును) (27)

28.శ్లో॥ తం తదా పురుషం మర్త్యాః మహారాజోపలక్షణం ।
యజంతి వేదతంత్రాభ్యాం పరం జిజ్ఞాసవో నృప ॥

తా:- ద్వాపర యుగమునందు మానవులు ఛత్ర చామరములతో గూడ మహారాజ లక్షణములతో గూడియున్న యా పరమేశ్వరుని, ఈశ్వరుని తెలియగోరుచు, వేద విధానముననూ, ఆగమ విధానముననూ పూజింతురు. (28)

టీ:- మహారాజోపలక్షణం ఛత్రచామరాది యుక్తం. వేదతంత్రాభ్యాం. వైదికేనాగమికేన చ మార్గేణ. యజన్తి పూజయన్తి. పరమీశ్వరం జ్ఞాతు మిచ్ఛవః. (28)

టీ:- మహారాజోపలక్షణములయిన ఛత్ర చాయరాజులతోగూడి, వేద ఆగమ మార్గములతో పూజింతురు. ఆ పురుషోత్తముని, ఈశ్వరుని తెలియగోరుచున్నవారై. (28)

29.శ్లో॥ నమస్తే వాసుదేవాయ నమస్సంకర్షణాయ చ ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ తుభ్యం భగవతే నమః ॥

30.శ్లో॥ నారాయణాయ ఋషయే పురుషాయ మహాత్మనే ।
విశ్వేశ్వరాయ విశ్వాయ సర్వభూతాత్మనే నమః ॥

తా:- ఓ పురుషోత్తమా! వాసుదేవుడవగు నీకు నమస్కారము సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ భగవంతుడవయిన నీకు నమస్కారము. నారాయణ ఋషి పురుషుడు మహాత్ముడు విశ్వేశ్వరుడు విశ్వుడు సర్వభూతాత్ముడగు నీకు నమస్కారము. (29,30)

టీ:- నామాన్యాహ - నమస్త ఇతి. (29,30)

టీ:- నామాలను చెప్పుచున్నాడు నమస్తేయని. (29,30)

31.శ్లో॥ ఇతి ద్వాపర ఉర్వీశ స్తువంతి జగదీశ్వరం ।
నానాతంత్రవిధానేన కలావపి యథా శృణు ॥

తా:- ఓ రాజా! ద్వాపరయుగము నందు జగన్నాథుని ఈ ప్రకారముగా స్తుతింతురు. కలియుగమునందన్నచో వివిధములయిన తంత్ర మార్గములచే నేవిధముగ పూజింతురో చెప్పెదను వినుము. (31)

టీ:- నానా తంత్ర విధానేనేతి. కలౌ తంత్రమార్గస్య ప్రాధాన్యం దర్శయతి. (31)

టీ:- వివిధములయిన తంత్రశాస్త్ర మార్గములతోని చెప్పుతూ కలియుగాన తంత్రమార్గ ప్రాధాన్యమును చెప్పుతున్నాడు. (31)

32.శ్లో॥ కలౌ కృష్ణం త్విషా కృష్ణం సాంగోపాంగాస్త్రపార్షదం ।
యజ్ఞైస్సంకీర్తనప్రాయైః యజంతి హి సుమేధసః ॥

తా:- కలియుగము నందు ఇంద్రనీలమణుల వలె ప్రకాశించు నీలవర్ణమైన శరీరము గలవాడు. హృదయాది అంగములు కౌస్తుభాది ఉపాంగములు సుదర్శనాది అస్త్రములు నందాది పార్షములు, అనువారలతో గూడిన శ్రీకృష్ణుని వివేకవంతులు నామ సంకీర్తనము స్తుతి ప్రధానముగాగల అర్చనలచే పూజింతురు. (32)

టీ:- రూక్షతాం వ్యావర్తయతి. - త్విషాకాన్త్యా ఆకృష్ణమింద్ర నీల మణివ దుజ్వలం. యద్వా త్విషాకృష్ణం కృష్ణావతారం అనేన కలౌ కృష్ణావతారస్య ప్రాధాన్యం దర్శయతి. అంగాని హృదయాదీని. ఉపాంగాని కౌస్తుభాదీని. అస్త్రాశిసు దర్శనాదీని. పార్షదాః సునందా దయః 'తత్సహితం. యజ్ఞైరర్చనైః. సంకీర్తనం నామోచ్చారణం స్తుతిశ్చ తత్ప్రధానైః. సుమేధసో వివేకినః. (32)

టీ:- రూక్షతను వ్యావర్తించుచున్నాడు.కాంతిచేత ఇంద్రనీలమణుల వలె ప్రకాశించు, లేదా త్విషాకృష్ణం కృష్ణావతారమును. ఇది చెప్పుట వలన కలియుగమున కృష్ణావతార ప్రాధాన్యమును తెల్పుచున్నాడు. అంగములు హృదయాదులు' ఉపాంగములు కౌస్తుభాదులు. అస్త్రాలు సుదర్శనాదులు. పార్షదులు సునందనాదులు. వీటితో కూడినవాడై, యజ్ఞైః అర్చనలచే. సంకీర్తనము నమోచ్చారణస్తుతిః ఇవి ప్రధానములు గాగల, సుమేధసః వివేకులు.(32)

33. శ్లో॥ ధ్యేయం సదా పరిభవఘ్నమభీష్టదోహం
తీర్థాస్పదం శివ విరంచినుతం శరణ్యం ।
భృత్యార్తిహం ప్రణతపాల భవాబ్ధిపోతం
వందే మహాపురుష తే చరణారవిందమ్ ॥

తా:- ఓ భక్తపాలా! ఓ మహాపురుషా! నిరంతరము ధ్యానింపదగినదై, ఇందియోద్రేకమును హతమార్చునదై, అభీష్టములను కురియునదై, గంగాది తీర్థములకు నాశ్రయమైనందున పరమపావనమైనదై, శివ బ్రహ్మాదులచే స్తుతింపబడినదై, నాశ్రయయోగ్యమై యనగా సుఖాస్పదమై భృత్యుడైనంత మాత్రముననే వాని దుఃఖములను పోగొట్టునదై, సంసార సాగరమును తెప్పయై దాటించునదగు నీ పాదపద్మమునకు నమస్కరించుచున్నాము. (33)

టీ:- స్తుతిమాహ - ధ్యేయమితి. హేప్రణతపాల! హే మహాపురుష! తే చరణారవిందం వందే. కథంభూతం. ధ్యేయం ధ్యాతుంయోగ్యం. సదేతి సర్వత్ర సంబధ్యతే. ధ్యేయత్వే హేతవః ఇంద్రియ కుటుంబాది భిర్యః పరిభవః తిరస్కార్తం హన్తీతి తథా తత్ కించి, అభీష్టదోహం మనోరథపూరకం. కించ తీర్థాస్పదం గంగాద్యాశ్రయత్వేన పరమ పావనం, శివ విరించిభ్యాం నుతం స్తుతం మహత్తమం. నను తౌ కృతార్థామేవ, కిమర్థం తాభ్యాం నుతం, తత్రాహ - శరణ్య మాశ్రయ యోగ్యం సుఖాత్మకమిత్యర్థః. తర్హి బ్రహ్మాదిస్తుత్యం ప్రాకృతస్య కథం గోచరః స్యాత్, న, భృత్యార్తిహం యస్య కస్యాపి భృత్యమాత్రస్యార్తిహన్తృ. న కేవలాగన్తుకార్తిమాత్రం హంతి కింతు భవాబ్ధిపోతం సంసారార్ణవ తారకం చ. (33)

టీ:- స్తుతి తెలుపుతున్నాడు ధ్యేయమని. ప్రణతులు భక్తులను పాలించువాడా! నీ పాదపద్మము ఎట్టిది ధ్యేయం ధ్యానము చేయదగినది సదా అని. సర్వత్ర అనుస్యూతమవుతుంది. ధ్యేయమనుటకు హేతువులు. ఇంద్రియములచేనగు తిరస్కారమును పోగొట్టునది. మరియు మనోరథములను పూరించునది. మరియు గంగాది తీర్థము లకు ఆశ్రయమగుటచేయ పావనము అయినది. మరియు శివ విరించాదు లచే స్తుతింపబడినది. అనగా చెప్పుచున్నాడు శరణ్యమని అనియు యోగ్యమని యర్థము. సుఖాత్మకమని అర్థము. బ్రహ్మాదులచే స్తుత్యమయి నచో ప్రాకృతులకు ఎట్లు గోచరించును. అనిన చెప్పు చున్నాడు. భృత్యార్తిహం భృత్యమాతీయుడయిన అని దుఃఖమును పోగొట్టునది. ఆగన్తకుల ఆర్తిని కాదు, మరియు సంసారాంబుధి తారకము గూడ. (33).

34. శ్లో॥ త్యక్త్వా సుదుస్త్యజసురేప్సిత రాజ్యలక్ష్మీం
ధర్మిష్ఠ ఆర్య వచసా యదగాదరణ్యం ।
మాయామృగం దయితయేప్సితమన్వధావ
ద్వందే మహాపురుష తే చరణారవిందమ్ ॥

టీ:- ఇదానీం స్వయమాప్తకామత్వాన్నైరపేక్ష్యం భక్తార్థం చ సాపేక్షతాం దర్శయన్ శ్రీరామచంద్రం స్తౌతి. - త్యక్త్వేతి. అన్యైః సుదుస్త్యజా యాసురేప్సితా రాజ్యలక్ష్మీస్తాంత్యక్త్వా. యదితి, య ఇత్యర్థః. యో అరణ్యమగాత్. కింరావైకల్య దర్శనేన, న ధర్మిష్ఠః. కుతః. ఆర్యస్య గురోర్దశరధస్య వచసా కించ ఏవం రాజ్యం త్యక్త్వాపి భక్తవాత్సల్యేన దయితయా సీతయేప్సితం మాయామృగం స్వర్ణాకారం యోఽన్వ ధావత్ తస్య భగవతశ్చరణారవిందం వందే. యద్వా హే నిర్మిష్ఠేతి సంబోధనం. తథాప్యవివక్షితత్వాదార్య పదేన సందిర్న భవతి. తథా యదగాదితి చరణారవింద మే వోచ్యతే. యన్మాయా మృగ మన్వ ధావత్తత్తే చరణార విందం వంద ఇత్యన్వయః. అన్యత్సమానమ్. (34)

తా:- ఓ మహాపురుషా! ఎవడు త్యజింప శక్యము కానట్టి దేవతలు వాంఛించదగిన రాజ్యలక్ష్మిని త్యజించి ధర్మాతుడై తండ్రియైన దశరథుని మాటమీద యరణ్యమునకు పోయెనో అట్టి పాద పద్మములకు నమస్కారము చేయుచున్నాను. (34)

టీ:- భగవంతుడు స్వయముగానే ఆప్తకాముడు, నిరపేక్షుడు, అయియున్ననూ భక్తుల కొరకు అపేక్షగలవాడగుచున్నాడని శ్రీరామ చంద్రుని స్తుతించుచున్నాడు త్యక్త్వా అని. అన్యులకుద్యమింప శక్యము కానిది దేవతలకు సయితము వాంఛించదగినది యగు రాజ్యలక్ష్మిని వదిలి, యద్ అను కదియః అని అర్థము చెప్పుకోవాలి. ఎవడు అరణ్యమునకు వెళ్ళెనో, రాజ్యమందలి వైకల్య దర్శమున అడవికి వెళ్ళెనా? అనిన కాదు, ధర్మిష్ఠుడయినందున తండ్రియయిన దశరథ మహారాజుగారి వచనము చేత, మరియు ఈ విధముగా రాజ్యమును వదిలి కూడా భక్తి వాత్సల్యముతో సీతాదేవి చేత కోరబడిన మాయా మృగమయిన బంగారు లేడిని ఎవడు అనుకరించిపోయెనో, అట్టి భగవంతుని చరణారవిందమును నమస్కరించుచున్నాను. లేదా, ఓ ధర్మిష్ఠ! యని సంబోధనము అవివక్షితమయినందున ఆర్యపదముతో సంధి కుదరదు. అట్లే యదగాదని చరణారవిందమే చెప్పబడుతుంది. ఏ మాయామృగమును అనుసరించి పోయెనో అట్టి చరణారవిందమును నమస్కరించుచున్నానని అన్వయము మిగిలినదంతయూ సమానమే34

35. శ్లో॥ ఏవం యుగానురూపాభ్యాం భగవాన్యుగవర్తిభిః ।
మనుజైరిజ్యతే రాజన్ శ్రేయసామీశ్వరో హరిః ॥

తా:- ఓ రాజా! ఈ ప్రకారము భగవంతుడు భక్తులకు వాంఛితము లనిచ్చి శ్రేయస్సు కలిగించు ప్రభువగు శ్రీ హరి ఆయా యుగములకు తగినట్టి నామరూపములు కలిగియుండుచూ, ఆ యుగము లందుండెడి మానవులచేత పూజింపబడుచున్నాడు.(35)

టీ:- యుగానురూపాభ్యాం నామరూపాభ్యాః. (35)

టీ:- ఆయా యుగములకు తగిన నామరూపములతో.(35)

36. శ్లో॥ కలిం సభాజయంత్యార్యా గుణజ్ఞాస్సారభాగినః ।
యత్ర సంకీర్తనేనైవ సర్వైస్స్వార్థో హి లభ్యతే ॥

తా:- కలి ఎన్నో దోషములు కలదైననూ దాని గుణములను తెలిసిన వారు సారమైన గుణమునే గ్రహించువారునగు పెద్దలు కలియుగమును ఎంతో పొగుడుదురు. ఎందుకనగా ఈ కలియందు నామ సంకీర్తనము చేతనే తమ అభీష్టమును పొందగలుగుచున్నారు గదా!. (36)

టీ:- ఏతేషు చతుర్యుగేషు కలిరేవశ్రేష్ఠః ఇత్యాహ - కలిమితి. గుణజ్ఞాః కలేర్గుణం జానన్తి యే తే. నను దోషాణాం బహుత్వాత్కథం సభాజయంతి తత్రాహ - సారభాగినో గుణాంశ గ్రాహిణః. కోऽసౌగుణస్త మాహ - యత్రేతి. తదుక్తం - 'ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరేర్చయన్ యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్" ఇతి. (36)

టీ:- ఈ నాలుగు యుగములలో కలియే శ్రేష్ఠమయినది చెప్పు చున్నాడు. కలిం అని. కలి యొక్క గుణమును తెలిసిన వారు గుణజనులు. అయ్యా! దోషములు ఎక్కువగా వుండుట వలన (కలిని) ఎట్లు ఆదరించు చున్నారు? అనగా సారభాగినః అని. వాడు గుణాంశములనే గ్రహించు వారు. గుణమేదియన చెప్పుచున్నాడు యత్ర అని. "కృతయుగమునందు ధ్యానముచే, త్రేతాయుగము నందు యజ్ఞముల చేతను, ద్వాపర యుగమునందు పూజలచేతను ఏ ఫలమును పొందుచున్నారో కలి యుగమునందు సంకీర్తనచే దానిని (పొందవచ్చును)" పొందుచున్నారు. (36)

37.శ్లో॥ న హ్యతః పరమో లాభో దేహినాం భ్రామ్యతామిహ ।
యతో విందేత పరమాం శాంతిం నశ్యతి సంసృతిః ॥

తా:- ఈ లోకమున సంసారమందు భ్రమించు మానవునకు హరినామ సంకీర్తనమున కంటే ఉత్తమమయిన లాభము లేదు.ఆ సంకీర్తనము వలననే ఉత్తమమయిన శాంతి లభ్యమగుచున్నది సంసారబంధము నశించుచున్నది.(37)

టీ:- తస్మాత్కలావతోऽస్మాత్సంకీర్తనా త్పరమో లాభోనాస్తి. యతః సంకీర్తనాత్.(37)

టీ:- అందువలన ఈ సంకీర్తనము కంటె ఉత్తమ లాభము లేదు. ఏ సంకీర్తన వలన.(37)

38.శ్లో॥ కృతాదిషు ప్రజా రాజన్ కలావిచ్ఛంతి సంభవం ।
కలౌ ఖలు భవిష్యంతి నారాయణపరాయణాః ॥

తా:- ఓ రాజా! కృతాది యుగములందు ప్రజలు కలియుగమునందు పుట్టుకను కోరుదురు. కలియుగమునందు విష్ణుభక్తులు కాగలరుకదా.(38)

టీ:- కించ కృతాదిష్వితి. (38)

టీ:- మరియు కృతాదులయందు యని. (38)

39.శ్లో॥ క్వచిత్క్వచిన్మహారాజ ద్రవిళేషు చ భూరిశః ।
తామ్రపర్ణీ నదీ యత్ర కృతమాలా పయస్వినీ ॥

40. శ్లో॥ కావేరీ చ మహాపుణ్యా ప్రతీచీ చ మహానదీ
యే పిబంతి జలం తాసాం మనుజా మనుజేశ్వర
ప్రాయో భక్తా భగవతి వాసుదేవేऽమలాశయాః ॥

తా:- ఓ మహారాజా! ద్రవిడ జనపదంబులందచ్చట ఎక్కువగా తామ్రపర్ణీయనునది, నిర్మలజలములు కల కృతమాలానది. పరమ పావనమయిన కావేరీనది, పశ్చిమ దిశ నుండి వచ్చు మహానది యను పుణ్య నదులు గలవు. ఏమానవులు ఆ నదుల జలమును పానము చేయుచున్నారో వారు తరుచుగా భగవంతుడైన వాసుదేవుని యందు శుద్ధసాత్త్విక భావము గల భక్తులగుచున్నారు. (39,40)

టీ:- అమలా శయాస్సంతః ప్రాయః. ప్రాయశో భగవతి భక్తా భవంతి. (39,40)

టీ:- అమలాశయులగుచూ తరచుగా భగవంతుడయిన వాసుదేవుని యందు భక్తులగుచున్నారు.(39,40)

41.శ్లో॥ దేవర్షి భూతాప్తనృణాం పితౄణాం న
కింకరో నాయమృణీ చ రాజన్ ।
సర్వాత్మనా యశ్శరణం శరణ్యం
గతో ముకుందం పరిహృత్య కర్తుమ్ ॥

తా:- ఓ రాజా! ఎవడు కర్తవ్యమైన కర్మను పరిహరించి త్రికరణ శుద్ధిగా ఆశ్రయ యోగ్యుడయిన శ్రీహరిని శరణుపొందినవాడో, ఇతడు దేవతలకు, ఋషులకు, బంధువులకు పితృదేవతలకు ఋణము గలవాడు కాదు, అందులకే వారికి కింకరుడై వారి కొరకు పంచ యజ్ఞాదులనూ చేయువాడు కాడు. (41)

టీ:- భక్తస్య విధినిషేధ నివృత్తేః కృత కృత్యతామాహ దేవర్షీతి. ఆప్తా పోష్యాః కుటుంబిన ఇతరే దేవాదయః పంచయజ్ఞ దేవతా ఏతేషాం యథాఽభక్తః ఋణీ అత ఏవ తేషాం కింకరస్తదర్థం నిత్యం పంచ యజ్ఞాది కర్తా. తథా చ స్మృతిః "హీనజాతిం పరిక్షీణ మృణార్థం కర్మ కారయేత్" ఇతి అయం తు న తథా. కోఽసౌ. యః సర్వభావేన శ్రీముకుందం శరణంగతః. కర్తం కృత్యం పరిత్యజ్య. యద్వా కర్తం భేదం పరహి "కృతీచ్ఛేదనే" ఇత్యస్మాద్వాసుదేవస్సర్వమితి బుద్ధ్వా ఇత్యర్థః. (41)

టీ:- భక్తునకు విధి నిషేధములు నివృత్తములయినందున కడు కృత కృత్యుడే యనుచున్నాడు దేవర్షియని. ఆప్తులు -పోష్యులు కుటుంబీకులు ఇతరులు దేవాదులు పంచయజ్ఞ దేవతలు, వీరికి భక్తుడు కానివాడు ఋషి అవుతాడు అందులకే వారికి కింకరుడు వారికై పంచమహాయజ్ఞములు చేయువాడు. స్మృతియందిట్లు కలదు. "హీనజాతి వాడిని క్షీణించెడి వాడిని ఋణము కొరకై కర్మ చేయించ వలెను". ఇతనట్లు కాదు. ఎవడు? ఎవడయితే సర్వభావేన ముకుందుడుని శరణుపొందెనో, కర్తం = కర్తవ్యమై దానిని విడిచి లేదా కర్తం = అనగా భేదమును పరిహరించి. "కృతీ ఛేదనే" అను దానివలన, వాసుదేవస్సర్వమని తెలిసికొని యని యర్థము. (41)

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

42. శ్లో॥ స్వపాదమూలం భజతః ప్రియస్య
త్యక్తాన్యభావస్య హరః పరేశః ।
వికర్మ యచ్చోత్పతితం కథంచిత్
ధునోతి సర్వం హృది సన్నివిష్టః ॥

టీ:- విహితకర్మ నివృత్తి ముక్త్వా నిషేధ నిమిత్త ప్రాయశ్చిత్త నివృత్తి మాహ స్వపాదమూలమితి. త్యక్తోఽన్యస్మిన్దేహాదౌ దేవతాంతరేవా భావో యేన. అత ఏవ తస్య వికర్మణి ప్రవృత్తిర్న సంభవతి. యచ్చ కథం చిత్ప్రమాదాదినా ఉత్పతితం భవేత్తదపి హరిర్ధునోతి. నను యమస్తన్న మన్యేత తత్రాహ - పరేశః. నను శృతి స్మృతీమమై వాజ్ఞే" ఇతి భగవద్వచనాత్ స్వాజ్ఞా భంగం కథం సహేత తత్రాహ. ప్రియస్య. నను నాయం పాపక్షయార్థం భజతే తత్రాహ - హృదిసన్నివిష్టః. న హి వస్తుశక్తిరర్థితామపేక్షత ఇత్యర్థః. (42)

తా:- దేహమునందు ఇతర దేవతలయందు అభిమానమును వదిలి తన పాద సామీప్యమును చేరి భజించు భక్తుని హృదయమునందు యమాది దేవతలను నియమించు నీశ్వరుడైన హరి సన్నిహితుడై నిలిచి ప్రమాదవశముచే ఆ భక్తుడు చేసిన నిషిద్ధకర్మను కూడా పోగొట్టును. (42)

టీ:- విష్ణు భక్తుడు వేద విహితకర్మచేయ పని లేదని చెప్పి ఇప్పుడు నిషేధ కర్మ నిమిత్తమైన ప్రాయశ్చిత్తమును చేయవలదని దానిని వృత్తిని చెప్పుచున్నాడు. స్వపాదమూలమని. దేహాదుల యందును ఇతర దేవతల యందును త్యజింపబడిన స్నేహాదికము కలిగినవాడు కనుకనే యతనికి నిషేధ కర్మయదు నివృత్తి కర్మ సంభవింపదు. ఒకవేళ ప్రమాద వశమున నిషేధ ప్రవృత్తి కలిగినచో దానిని కూడా హరి పోగొట్టును. మరి యముడు దానినంగీకరించడు కదా యనిన పరేశః అనుచున్నాడు. ఇతరులగు యమాదులను శాసించువాడగు అని యర్థము. అయ్యా "శృతిస్మృతులు నాయాజ్ఞయై యున్నాయి" అనెడి భగవద్వచనమువలన స్వాజ్ఞా భంగమును ఎట్లు సహించగలరుయనిన చెప్పుచున్నాడు ప్రియస్య అని- భక్తుని యొక్క అని యర్థము. మరి పాపక్షయమునకై భజించుట లేదు. చెప్పుచున్నాడు హృదిసన్నివిష్టః అని, హృదయము నందు నిల్చిన వాడైయని యర్థము. వస్తుశక్తి అర్థితను ఆపేక్షించదని యర్థము..(42)

**శ్రీ నారద ఉవాచ**

43.శ్లో॥ ధర్మాన్ భాగవతానిత్థం శ్రుత్వా స మిథిలేశ్వరః ।
జాయంతేయాన్మునీన్ప్రీతః సోపాధ్యాయోఽభ్యపూజయత్ ॥

తా:- ఆ మిథిలాధిపతి భాగవత ధర్మములను ఈ ప్రకారము విని సంతోషమును పొంది ఉపాధ్యాయునితో కూడుకొని మునులైన ఆ జయన్తీ పుత్రులగు మొదలయిన వారిని పూజించెను.(43)

టీ:- జాయన్తేయాన్ - జాయంత్యాః. పుత్రాన్. (43)

టీ:- జయంతీ పుత్రులను. (43)

44.శ్లో॥ తతోఽన్తర్దధిరే సిద్ధాః సర్వలోకస్య పశ్యతః ।
రాజా ధర్మానుపాతిష్ఠన్ అవాప పరమాం గతిం ॥

తా:- జయన్తీ పుత్రులయిన సిద్ధులు అందరూ చూచుచుండగనే మాయమైపోయిరి. ఆ రాజు నిమి భాగవతధర్మములయిననుష్ఠించుచు విష్ణు పదమును పొందెను. 44

టీ:- ఉపాతిష్ఠన్ననుతిష్ఠన్. (44)

టీ:- భాగవత ధర్మములననుష్ఠించుచూ.(44)

45.శ్లో॥ త్వమప్యేతాన్ మహాభాగ ధర్మాన్ భాగవతాన్ శ్రుతాన్ ।
ఆస్థితశ్శ్రద్ధయా యుక్తో నిస్సంగో యాస్యసే పరమ్ ॥

తా:- ఓ రాజా నీవునూ, వినిన భాగవత ధర్మములను శ్రద్ధతో అనుష్ఠించుచూ, యోగ్యుడవై సంగరహితుడవై పరమపదమును పొంద గలవు.(45)

టీ:- నిస్సంగోభూత్వాః. (45)

టీ:- ఏసంగమునే-నివాడవై. (45)

46.శ్లో॥ యువయోః ఖలు దంపత్యోః యశసా పూరితం జగత్ ।
పుత్రతామగమద్యద్వాం భగవానీశ్వరో హరిః ॥

తా:- భగవంతుడైన ఈశ్వరుడు మీకు పుత్రుడై జన్మించినందు వలన దేవకీవసుదేవులను దంపతులైన మీ కీర్తి జగమంతా నిండి యున్నది (46)

టీ:- శాస్త్ర ప్రక్రియేయముక్తా, యువాం తు గత ఏవకృతార్థా నిత్యాహ యువయోరితి. (46)

టీ:- ఈ ప్రకారము శాస్త్ర ప్రక్రియ చెప్పబడినది. మీరు మాత్రము సంగము వలననే కృతార్థులైతిరని చెప్పుచున్నాడు. యువయోః అని. 46

47.శ్లో॥ దర్శనాలింగనాలాపశయనాసనభోజనైః ।
ఆత్మా వాం పావితః కృష్ణే పుత్రస్నేహం ప్రకుర్వతోః ॥

తా:- మీరు కృష్ణుని దర్శించుట ఆలింగనము చేయుట సంభాషించుట పడుకొనుట, కూర్చుండుట భుజించుట మొదలగు క్రియలచే ఇతరులకు కలుగు శుద్ధి మా పుత్రుడని శ్రీకృష్ణుని ప్రేమించుట చేతనే మీకు సత్త్వసిద్ధి కలిగి మీ ఆత్మ పావనమయినది.(47)

టీ:- న చ సర్వకర్మార్పణాది భాగవత ధర్మైర్యన్యేషామివ యువయోః సత్వశుద్ధి రాపాదనీయా, పత్రోపలాలనేనైత భాగవతధర్మ సర్వస్వ నిష్పత్తే రిత్యాహ - దర్శనేతి. కృష్ణే పుత్ర ఇతి స్నేహం ప్రకుర్వతోర్వాం తస్య దర్శనాదిభిరాత్మా పావితః శోధితః. (47)

టీ:- పుత్రుని లాలించుట వలననే మీకు భాగవత ధర్మముల సర్వస్వము ప్రాప్తించినది. కనుక సర్వ కర్మలను సమర్పించుట మొదలయిన భాగవత ధర్మములచే ఇతరుల వలె మీరు సత్త్వసిద్ధి కలిగించుకొన పనిలేదని చెప్పుచున్నాడు. దర్శనయన శ్రీకృష్ణుని యందు పుత్రుడని స్నేహమును చేయుచున్న మీయొక్క ఆత్మ శోధితమయినది. (47)

48.శ్లో॥ వైరేణ యం నృపతయశ్శిశుపాల పౌండ్ర
సాల్వాదయో గతివిలాసవిలోకనాద్యైః ।
ధ్యాయంత ఆకృతధియశ్శయనాసనాదౌ
తత్సామ్యమాపురనురక్తధియాం పునః కిమ్ ॥

తా:- శిశుపాలుడు, పౌండ్రకుడు సాల్వుడు మొదలగు రాజులు ఏ కృష్ణుని వైరము చేత గమనము, సౌందర్యము, చూపులు, మొదలగు వానిచేత ఆయా ఆకారకమైన బుద్ధిగలవాడుగా శయనించుట, కూర్చుండుట మొదలయిన కృత్యములయందు ధ్యానించుచున్న వారై ఆ కృష్ణుని సారూప్యమును పొందిరో ఆ కృష్ణుని యందు అనురాగము

పొందిన వారికి సారూప్యము కలుగునని మరియేమి చెప్పనగును అనగా తప్పక సారూప్యము కలుగునని భావము. (48)

టీ:- ఏతదేవకైముత్యన్యాయేన స్ఫుటయతి. వైరేణేతి. యం శయనాసనాదౌ వైరేణాపిధ్యాయన్తస్తస్య గతి విలాసాద్యైరాకృతధియస్తత్తదాకారా ధీర్యేషాం తే తత్సారూప్యమాపుః కిం పునర్వ్యక్తవ్య మనురక్తధియాం తత్సామ్యం భవతీతి. (48)

టీ:- దీనినే కైముతకన్యాయముచే స్పష్టము చేయుచున్నారు. వైరేణయని. ఏ కృష్ణుని శయనాసనాదుల యందు వైరేణాపి వైరము చేతనైనను ధ్యానించుచూ అతని గతిని సౌందర్యచూపులు, మొదలగు వాని చేత ఆయా యాకారమైన బుద్ధిగల వారై ఆ కృష్ణుని సారూప్యమును పొందిరి. ఆ కృష్ణుని యందనాంశము పొందిన వారికి సారూప్యము కలుగునని మరియేమి చెప్పనగును, అనగా తప్పక సారూప్యము కలుగునని భావము.(48)

49. శ్లో॥ మాపత్యబుద్ధిమకృథాః కృష్ణే సర్వాత్మనీశ్వరే ।
మాయామనుష్యభావేన గూఢైశ్వర్యే పరేऽవ్యయే ॥

తా:- నిగూఢమైన విభూతులు గలవాడైన పరమాత్ముడై నాశరహితుడై లీలామానుష విగ్రహుడై ప్రవర్తించు సర్వాత్ముడైన ఈశ్వరుడైన కృష్ణుని యందు నా పుత్రుడితడను భావమును చేయకుము.(49)

టీ:- నను పుత్రస్నేహశ్చేన్మోక్షహేతుస్తర్హి సర్వేముచ్యేరంస్తత్రాహ- మాऽపత్య బుద్ధిమితి. అపత్యమితి బుద్ధిం మాకృథాః అడాగమశ్ఛాందసః (49)

టీ:- అయ్యా! పుత్ర ప్రేమయే మోక్షహేతువైనచో అందరు మోదమును పొందవచ్చునుగదా? అనినచో చెప్పుతున్నాడు మాపత్యబుద్ధియని. పుత్రుడితడను బుద్ధిని చేయకుము. అడాగమము ఛాందసము.(49)

50.శ్లో॥ భూభారాసురరాజన్య హంతవే గుప్తయే సతాం ।
అవతీర్ణస్య నిర్వృత్యై యశో లోకే వితన్యతే ॥

తా:- భూమికి భారమై జన్మించిన అసురులగు రాజులను వధించుటకు సాధువుల రక్షించుటకు మోక్షము కొరకును అవతరించిన కృష్ణునియొక్క కీర్తి లోకమునందు విస్తరింపబడుచున్నది.(50)

టీ:- నను కథమీశ్వరో మానుషః స్యాత్కథం వా తస్య విశ్వ సృష్ట్యాది కర్తుః పూతనాశోషణాది కర్మాశ్చర్యమివ నిరూప్యతే తత్రాహ భూభార రూపా అసురా ఏవ రాజన్యాస్తేషాం హన్తవే తాన్హంతుం. నిర్వృత్యై మోక్షాయ. (50,51)

టీ:- ఓయీ ఈశ్వరుడు మనుష్యుడెట్లగును. జగత్సృష్టి మొదలయినవి చేయునితడు పూతనాదులను సంహారము చేయుట నెట్లాశ్చర్యకరమగు కృత్యముగా పేర్కొనుచున్నారు అనగా అందులకు చెప్పుచున్నారు భూభారమని భూమికి భారమయిన అసురులైన రాజన్యులను వధించుటకు. నిర్వృత్యై మోక్షము కొరకునూ. (50,51)

**శ్రీశుక ఉవాచ**

51.శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా మహాభాగో వసుదేవోఽతివిస్మితః ।
దేవకీ చ మహాభాగా జహతుర్మోహమాత్మనః ॥

తా:- ఇట్లు నారదుడు చెప్పిన విషయమును విని చాలా ఆశ్చర్యపడి వసుదేవుడు మహాభాగ్యవతియగు దేవకియూ భగవంతుని యందు పుత్రత్వ రూపమగు తమయొక్క అజ్ఞానమును వీడిరి. (51)

52. శ్లో॥ ఇతిహాసమిమం పుణ్యం ధారయేద్యస్సమాహితః ।
స విధూయేహ శమలం బ్రహ్మభూయాయ కల్పతే ॥

టీ:- ఇహాస్మిన్నేరేవ దేహే శమలం మోహం విధూయ బ్రహ్మత్వాయ కల్పతే. (52)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
పంచమోऽధ్యాయః**

తా:- ఎవడు చిత్త సమాధానము కలవాడై ఈ పావనమైన వృత్తమును ధరించుచున్నాడో అతడు ఈ జన్మమునందే మోహము పోగొట్టుకొని బ్రహ్మత్వమునందుచున్నాడు. (52)

టీ:- ఈ దేహమునందే మోహమును పోగొట్టుకొని బ్రహ్మత్వము నందుచున్నాడు. (52)

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
పంచమాధ్యాయము సమాప్తము.**

## షష్ఠోऽధ్యాయః

**శ్రీశుక ఉవాచ**

1.శ్లో॥ అథ బ్రహ్మాత్మజైర్దేవైః ప్రజేశై రావృతోऽభ్యగాత్ ।
భవశ్చ భూతభవ్యేశో యయౌ భూతగణైర్వృతః ॥

టీ:- షష్ఠే బ్రహ్మాదిభిస్తుత్వా గంతుం విజ్ఞాపితం హరిం. ఉద్ధవః ప్రార్థయామాస స్వధామ నయమామితి. అతః పరమతి విస్తరేణాత్మ విద్యాం నిరూపయితుం తత్ప్రస్తావమాహ – అథేతి. ఆత్మజైః సనకాదిభిః అభ్యగాత్ ద్వారకామితి చతుర్థేనాన్వయః. (1)

2.శ్లో॥ ఇంద్రో మరుద్భిర్భగవాన్ ఆదిత్యా వసవోऽశ్వినౌ।
ఋభవోऽంగిరసో రుద్రాః విశ్వే సాధ్యాశ్చ దేవతాః ॥

3. శ్లో॥ గంధర్వాప్సరసో నాగాః సిద్ధచారణగుహ్యకాః
ఋషయః పితరశ్చైవ సవిద్యాధరకిన్నరాః
ద్వారకాముపసంజగ్ముః సర్వే కృష్ణదిదృక్షవః ॥

## షష్ఠాధ్యాయము

తా:- ఆ విప్రశాపము నామోదించిన తరువాత బ్రహ్మ, ఇంద్రా దేవతలతో, మరీచ్యాది ప్రజాపతులతో, సనకాది పుత్రులతోగూడి, ద్వారకకుపోయెను. భూత, భవిష్యత్కాలములందు ప్రజేశుడగు శివుడు భూతగణములతో ద్వారకకు వెళ్ళెను. (1)

టీ:- ఈ షష్ఠాధ్యాయము నందు బ్రహ్మాది దేవతలచే స్వర్గమునకు పోవుటకు స్తుతింపబడిన కృష్ణుని చేరి ఉద్ధవుడు కృష్ణా! నన్ను గూడా నీ స్థానమునకు గొనిపొమ్ము అని ప్రార్థించెను. “అనువృత్తము వర్ణింప బడినది. ఇటు తరువాత విస్తరముగా ఆత్మ విద్యను నిరూపించుటకై ముందు ప్రస్తావన చెప్పుచున్నాడు అథ అని. ఆత్మజైః సనకాదులచేత అభ్యగాత్ వెళ్ళెను. ద్వారకకు అని (ముందటి నాలుగవ శ్లోకముతో అన్వయము). (1)

తా:- దేవేంద్రుడు, మరుద్గణములు,ఆదిత్యులు, వసువులు, అశ్వినులు, ఋభువులు, ఆంగిరసులు, రుద్రులు, కిన్నరులు, విశ్వేదేవతలు, సాధ్యులు, ఋషులు, పితరులు, విద్యాధరులు, కిన్నరులు అందరూ కృష్ణుని చూడ ద్వారకకు వెళ్ళిరి.(2,3)

4.శ్లో॥ వపుషా యేన భగవాన్ నరలోకమనోరమః ।
యశో వితేనే లోకేషు సర్వలోకమలాపహమ్ ॥

తా:- భగవంతుడే శరీరముతో నరలోకమున మనోహరుడై అందరి జనుల పాపమును పోగొట్టునదైన కీర్తిని వ్యాపింపజేసెనో ఆ మహా సౌందర్యమూర్తిని చూచుటకు ఇంద్రాదులు ద్వారకకు వెళ్ళిరి.(4)

టీ:- నను తేషాముపేంద్రాదిరూపం భగవంతం నిత్యం పశ్యతాం కేయమతిదిదృక్షా అత ఆహ–వపుషేతి. యేనవపుషా నరలోకమనోరమః సన్సర్వలోకేషు యశో వితేనే తదతి సుందరం వపుర్దిదృక్షవః.(2,3,4)

తా:- ఓయీ! ఆ ఇంద్రాది దేవతలు ఉపేంద్రాది రూపమున నున్న భగవంతుని నిత్యము దర్శించువారికి ఈ కృష్ణుని చూడవలెనన్న కోరిక ఎందులకు అన జెప్పుచున్నాడు వపుషాయని. ఏ శరీరముతో మనుష్యలోకమునకు మనోహరుడై సర్వలోకములయందు కీర్తిని విస్తరించెనో అట్టి అతిసుందరమైన శరీరమును చూడగోరినవారై. 2,3,4

5.శ్లో॥ తస్యాం విభ్రాజమానాయాం సమృద్ధాయాం మహర్ధిభిః ।
వ్యచక్షతావితృప్తాక్షాః కృష్ణమద్భుతదర్శనమ్ ॥

తా:- సకల సంపదలతో నిండి సమృద్ధిమంతమైన ద్వారకమందు నివసించుచున్న ఆశ్చర్యమును గొలిపే సౌందర్యము గల శ్రీకృష్ణుని తనివితీని చక్షురాదీంద్రియములు గలవారై ఆ ఇంద్రాదులు దర్శించిరి. 5

టీ:- వ్యచక్ష తాపశ్యన్.(5)

టీ:- వ్యచక్షత = వీక్షించిరి.(5)

6.శ్లో॥ స్వర్గోద్యానోద్భవైర్మాల్యైః ఛాదయంతో యదూద్వహం ।
గీర్భిశ్చిత్రపదార్థాభిః తుష్టువుర్జగదీశ్వరమ్ ॥

తా:- యదుకుల శ్రేష్ఠుడయిన కృష్ణుని స్వర్గమునందు నందనోద్యాన వనమున జనించిన కల్పవృక్ష ప్రసూన మాలికలచే కప్పుచూ సారవంత ములయిన పదములు అర్థములుగల వాక్కులతో స్తుతించిరి. 6

టీ:- స్వర్గోద్యానస్థైః మాల్యైః. చిత్రాణి శృంఖలా బంధప్రాయాణి పదాన్యర్థాశ్చ యాసుతాభిర్గీర్భిః. (6)

తా:- స్వర్గములోని నందనోద్యానమున జనించిన మాలికలు చేతి సంకెల వలె బంధించు పదములు అర్థములుగల వాక్కులచే- (స్తుతించిరని తాత్పర్యము) (6)

**దేవా ఊచు**

7. శ్లో॥ నతాస్మ తే నాథ పదారవిందం
బుద్ధీంద్రియప్రాణమనోవచోభిః ।
యచ్చింత్యతేऽంతర్హృది భావయుక్తైః
ముముక్షుభిః కర్మమయోరుపాశాత్ ॥

తా:- ఓ ప్రభూ! దర్శనాది క్రియలు గల్గిన జ్ఞానేంద్రియముల చేతనూ బలమిచ్చు ప్రాణముచేతను, మనస్సుచేతను, వాక్కుల చేతనూ, నీ యొక్క పాదపద్మములకు దండప్రణామము చేయుచున్నాము. ఏ నీ పాద పద్మము కర్మరూపమయిన పాశమునుండి భక్తియుక్తులగు మోక్షార్థుల చేత హృదయములోపల చింతింపబడుచున్నదో (అట్టి నీ పాదారవిందమును చూచి నమస్కరించితిమి. (7)

టీ:- బుద్ధీంద్రియాదిభిః దర్శనాదినా ప్రాణేన చ బలహేతునా దండవ ప్రణిపాతేన నతా వయం నమస్కృతవంతః. స్మేతి విస్మయే. యథాహుః "దోర్భ్యాం పదాభ్యాం జానుభ్యామురసాశిరసా దృశా మనసా వచసాచేతి ప్రణామోష్టాంగ ఈరితః" ఇతి. స్మ శబ్దోక్త విస్మయాయ విశేషణం. కర్మమయా దురుపాశాన్ముముక్షుభిర్భావయుక్తై రపి యత్కేవల మన్తర్హృది చిన్త్యతే న తు దృశ్యతే తద్వయం నతాః. అహో భాగ్యమిత్యర్థః. (7)

టీ:- బుద్ధీంద్రయాదిభిః దర్శనాది క్రియలు గల జ్ఞానేంద్రియములచే, బలమునిచ్చు ప్రాణము చేతను, దండవత్ప్రణామము తన నమస్కరించు చున్నాము. స్మ అనునది విస్మయమునందు (ప్రయోగింపబడినది) "చేతులు పాదములు, మోకాళ్ళు వక్షస్థలము, శిరస్సు, చూపు, మనస్సు, వాక్కు వీటిలో చేయునమస్కారము అష్టాంగమనబడును అని" అను శబ్దోక్తమయిన విస్మయానికి విశేషణము. కర్మమయమయిన గొప్ప పాశము నుండి భక్తియుక్తులగు మోక్షార్థుల చేతనూ కేవలము హృదయములోపల చింతింపబడుచున్నదో, దర్శింపబడలేదో, అట్టి నీ పాదారవిన్దములకు మేము నమస్కరించుచున్నాము. ఆహో మా భాగ్యమెంత గొప్పనిది. (7)

8. శ్లో॥ త్వం మాయయా త్రిగుణయాత్మని దుర్విభావ్యం
వ్యక్తం సృజస్యవసి లుంపసి తద్గుణస్థః ।
నైతైర్భవానజిత కర్మభిరజ్యతే వై యత్
స్వే సుఖేఽవ్యవహితేఽభిరతోఽనవద్యః ॥

తా:- నీవు త్రిగుణాత్మకమైన మాయతో గూడి మనస్సుచే ఊహింప శక్యముకాని, మహత్తత్త్వము, పంచభూతములు మొదలయిన వానితో గూడిన ప్రపంచము సృజించుచూ పాలించుచూ లయము చేయుచున్నావు. మాయాగుణమునందు నియంతవై యుంటూ ఈ సృష్ట్యాది కర్మలచే అంటబడవు. మరి నీవు రాగాది రహితుడవై అనావృతమైన ఆత్మ స్వరూప సుఖమునందు ఆసక్తుడవై యుందువు. అందువలన కర్మ చేయుచున్న వాడవై యున్న ఆత్మారాముడు పరమేశ్వరుడగు నిన్ను ముముక్షువులు ధ్యానించుచున్నారు.(8)

టీ:- నను మమాపి దృష్టాదృష్ట కర్మకరణా త్కుతోమత్పదారవింద చింతనం కర్మపాశాన్ముముక్షుభిః క్రియతే తత్రాహుః త్వమితి. హే అజిత, ఆస్తా మిదానీం తనమిదం అత్యల్పం కర్మ, త్వం వ్యక్తం మహదాది ప్రపంచం సృజసి పాలయసి సంహరసి చ తదప్యాత్మన్యేవ న పృథక్ దుర్విభావ్యం మనసాఽప్యవితర్క్యం. తద్గుణస్థస్త్స్యా మాయాయా గుణేం నియన్తృత్వేన స్థితః. అత ఏవ తైః కర్మభిర్భవా న్నాజ్యతే నలిప్యతే. కుతయోభవాననవద్యో రాగాదిరహితః. యతః స్వే ఆత్మరూపే సుఖేఽవ్యవహితే నావృతే అభిరతః. అతస్త్వం కర్మ కుర్వన్నప్యాత్మారామః పరమేశ్వర ఇతి. ముముక్షుభిశ్చిన్త్యస ఇతి భావః(8)

టీ:- ఓయీ నేనును దృష్టాదృష్ట కర్మల నాచరించుచున్నాను గదా, దృష్టములయిన వివాహాదులను, అదృష్టములయిన యజ్ఞాదికమును చేయుచున్నాను గదా. అట్టి నాపాదరవింద చింతనము కర్మ పాశమును విడుదల గోరువారేల చేయుచున్నారు. అనిమీరన్నచో అనగా అందుకు చెప్పుచున్నారుత్వం మాయయా అని. హే అజిత, ఓ జయింపబడని వాడా! నీ వాచరించెడి స్వల్పమగు కర్మ అటుండనిమ్ము, నీవు మహదాది ప్రపంచమును సృజిస్తున్నావు, పాలించుచున్నావు. లయము చేయుచున్నావు. అది గూడ ఆత్మయందేవి కాదు. దుర్విభావ్యం = మనస్సుతో కూడా ఊహించుటకు శక్యముగాని. తటస్థ = ఆ మాయ యొక్క గుణములందు నియంతవై యుంటూ. అందులకే ఆ కర్మలచే లిప్తుడవుకావు, ఎందువలనయనగా అయినీవు అనవద్యుడవు రాగాది

9.శ్లో॥ శుద్ధిర్నృణాం న తు తథేద్య దురాశయానాం
విద్యాశ్రుతాధ్యయనదానతపః క్రియాభిః ।
సత్త్వాత్మనామృషభ తే యశసి ప్రవృద్ధ
సచ్ఛ్రద్ధయా శ్రవణసంభృతయా యథా స్యాత్ ॥

టీ:- నన్వాత్మారామస్య కిం కర్మ కరణేనాత ఆహుః సిద్ధిరితి. హే ఈడ్య, హే ఋషభ! దురాశయానాం రాగాణాం. విద్యా ఉపాసనా. విద్యాదిభిస్తథా శుద్ధిర్నభవతి. సత్త్వాత్మనాం సతాం తే యశసి శ్రవణేన సంభృతయా పరిపుష్టయాఽభివృద్ధయా సచ్ఛ్రద్ధయా యథా స్యాత్. పరమ పావనస్య యశసో వితానాయ తవ కర్మాచరణమితి భావః.(9)

రహితుడవు. ఎందులకన 'స్వే' ఆత్మ స్వరూపమయిన సుఖము నందు అనావృతమగు, ఆసక్తుడవో, ఇందువలన నీవు కర్మను చేయుచున్న వాడవయ్యు ఆత్మారాముడవైన పరమేశ్వరుడవని ముముక్షువులచే ధ్యానింపబడుచున్నావని భావము.(8)

తా:- ఓ శ్లాఘనీయుడా! కోర్కెలనిచ్చువాడా! యశః ప్రకాశములగు నీ స్తోత్రాదులను నిరంతరము శ్రవణము చేయుటచే సత్పురుషుల యుత్తమశ్రద్ధ మరింత వృద్ధి చెందుతున్నది. ఆ శ్రద్ధచే వారు ఇంకా పవిత్రులగుచున్నారు. విషయలాలసులెంతగా ఉపాసన, శ్రవణ, వేదాధ్యయన, తపో, యజ్ఞాదులనాచరించిననూ వారి కట్టి శుద్ధి కలుగుట లేదు. (9)

టీ:- ఆత్మారామునకు కర్మాచరణచే ఏమి ప్రయోజనము అనగా చెప్పుచున్నారు శుద్ధియని. ఓ స్తుతింపదగిన వాడా! కోర్కెలనిచ్చువాడా! ఐహికాదులయందనురక్తులయిన వారికి, ఉపాసన, శ్రవణ దాన, తపస్సులచే శుద్ధి ఆ ప్రకారము కాదు. సత్యమూర్తియైన శ్రీహరి యందు మనస్సుగలవారికి శుద్ధాంతఃకరణులకు నీ కీర్తియందు, నీ కథ యందు శ్రవణము పరిపుష్టమై ప్రవృద్ధమైన ఉత్తమశ్రద్ధచే ఏ ప్రకారముగా నిర్దోషత్వము కలుగునో అట్లు; ఈ ప్రకారము పరమ పావనమైన యశస్సును విస్తరించుకు నీవు కర్మనాచరింతువని భావము. (9)

10. శ్లో॥ స్యాన్నస్తవాంఘ్రిరశుభాశయ ధూమకేతుః
క్షేమాయ యో మునిభిరార్ద్రహృదోహ్యమానః ।
యస్సాత్వతైస్సమ విభూతయ ఆత్మవిద్భిః
వ్యూహేర్చితస్సవనశస్స్వరతిక్రమాయ ॥

తా:- నీ పాదము మా యొక్క విషయవాసనలకు దాహము అగును. ఏ నీ పాదము మోక్షము కొరకు ముముక్షువులచే ప్రేమార్ద్రమైన మనస్సు చేత చింతింపబడుచున్నదో ఏది భక్తులచే సమానమైన ఐశ్వర్యము కొరకు శ్రీవాసుదేవాది చతుర్వ్యూహమందు పూజింపబడునో ఆత్మ విదులచే పూజింపబడినదో(మా విషయవాసనలకు దాహకమౌగాక)10

టీ:- తదేవం త్వద్యశః శ్రద్ధైవ శుద్ధి హేతుః అస్మాభిస్తు తవాంఘ్రిర్దృష్టో తస్తవాంఘ్రిర్నోఽస్మాకమశుభాశయానాం విషయవాసనాం ధూమకేతుస్తద్దాహకః స్యాత్. కథంభూతః. యః క్షేమాయ మోక్షాయ మునిభిర్ముముక్షుభిః ప్రేమార్ద్ర హృదా ఉహ్యమానశ్చిన్త్యమానః. యశ్చ సాత్వతైర్భక్తైః సమవిభూతయే సమానైశ్వర్యాయ వాసుదేవాది వ్యూహేఽర్చితఃతేషు చ కైశ్చిరాత్మవద్భిర్ధీరైః స్వరతిక్రమాయ స్వర్గమతిక్రమ్య వైకుంఠప్రాప్తయే సవసశస్త్రికాలమర్చితః. (10)

టీ:- అందువలన ఈ ప్రకారము వర్ధిల్లే ఉత్తమ శ్రద్ధయే శుద్ధి హేతువు కాని మాచేనైనచో నీ పాదము దర్శింపబడినది అందుకే నీ పాదము మా యొక్క విషయవాసనలకు దాహికము అగును. ఏది యనగా ఏ నీ పాదము మోక్షము కొరకు ముముక్షువులచే ప్రేమార్ద్రమైన మనస్సుచే చింతింపబడుచున్నదో, ఏది సాత్వతులు భక్తులతో సమానమైన ఐశ్వర్యము కొరకు శ్రీవాసుదేవాది చతుర్వ్యూహములందు పూజింపబడునో, వారియందు కొందరైన ఆత్మవిదులగు పండితుల చేత స్వర్గము నతిక్రమించి వైకుంఠ ప్రాప్తి కొరకు త్రికాలము పూజింపబడినదో.(10)

11. శ్లో॥ యశ్చింత్యతే ప్రయతపాణిభిరధ్వరాగ్నౌ
త్రయ్యా నిరుక్తవిధినేశ హవిర్గృహీత్వా ।
అధ్యాత్మయోగ ఉత యోగిభిరాత్మమాయాం
జిజ్ఞాసుభిః పరమభాగవతైః పరీష్టః ॥

తా:- ఓ ప్రభూ! వైదిక కార్యాచరణమునందే తత్పరములైన హస్తములు కల యాజ్ఞికులు హవిస్సును గ్రహించి అధ్వరాగ్నియగు ఆహవనీయము నందుంచుచు ఏ నీ పాదమునే ధ్యానించుచున్నారో. ఆత్మయొక్క యాథాత్మ్య జ్ఞానరూపమగు యోగమునందు అణిమాది విభూతులను

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

ఆకాంక్షించుచు యోగులు ఏ నీ పాదమును ధ్యానించుచున్నారో జీవన్ముక్తులగు పరమభాగవతోత్తములచే మాత్రము సర్వవిధముల పూజింపబడునదేదియో ఆ నీ పాదము మా యెక్క విషయ వాసనలను హతమార్చుగాక. (11)

టీ:- కించ ప్రయతపాణిభిః సంయత హస్తైర్హవిర్గృహీత్వాऽధ్వరాగ్నౌ ఆహవనీయాదౌ యాజ్ఞికైర్యశ్చిన్త్యతే. నను "యస్యై దేవతాయై హవిర్గృహీతం స్యాత్తాం మనసాధ్యాయే ద్వషట్ కరిష్యన్" ఇతివత్తత్త ద్దేవతాశ్చిన్త్యంతే అత ఆహుః - త్రయ్యా నిరుక్తేన విధినేన్ద్రాదిరూపేణైవ యజ్ఞపురుషశ్చిన్త్యంతే ఇత్యర్థః. ఉత కించ. అధ్యాత్మయోగే ఆత్మాధికారే యోగే యోగిభిరప్యాత్మన స్తవమాయా అణిమాది స్తాం జిజ్ఞాసుభిః త్తత్త త్కామైర్యశ్చిన్త్యతే. పరమభాగవతైస్తు ముక్తైర్యః పరీష్టః సర్వతః పూజితః స తవాంఘ్రిర్నోऽశుభాశయ ధూమకేతుః స్యాదితి పూర్వేణాన్వయః (11)

టీ :-మరియు కేవల వైదికకార్యములనాచరించుతో తత్పరములైన చేతులకల యాజ్ఞికులచే హవిస్సు గ్రహింపబడి, ఆహవనీయాదికమగు అధ్వరాగ్నియందు ఏది చింతింపబడుచున్నదో ' ఏ దేవత కొరకు హవిస్సు గ్రహింపబడుచున్నదో ఆ దేవతను వషత్కారము చేయబోవుచు ధ్యానించవలెను' అను వచనమువలన ఆయా దేవతలు చింతింపబడు చుందురుకదా యనిన చెప్పుచున్నారు. త్రయ్యా - వేదములో చెప్పబడిన విధిచే, ఇంద్రాది రూపమున యజ్ఞపురుషుడే చింతింపబడుచున్నాడు అని అర్థము. మరియును ఆత్మను యథార్థముగా తెలిసికొనుటయను యోగమునందు యోగులచేగూడ అణిమాది రూపమగు మాయను తెలియగోరుచున్న ఆయా కోరికలతో ఏది చింతింపబడుచున్నదో, ఉత్తమ భక్తులచేత, జీవన్ముక్తులచేత ఏది సర్వవిధముల పూజింపబడు చున్నదో, ఆ నీ పాదము మా విషయవాసనలకు దాహకము అగుగాక. అని పూర్వ శ్లోకముతో అన్వయము. (11)

12. శ్లో ॥ పర్యుష్టయా తవ విభో వనమాలయేయం
సంస్పర్ధినీ భగవతీ ప్రతిపత్ని వచ్ఛ్రీః ।
యాః సుప్రణీత మముయార్హణ మాదదన్నో
భూయాత్సదాంఘ్రిరశుభాశయ ధూమకేతుః ॥

తా :- ఈ లక్ష్మీదేవి తనతోగూడియున్న వజయంతీమాలతో సవతి వలె ఈర్షగలదియగుచున్నది. అట్లు ఈర్షపడు లక్ష్మిని ఆదరింపక ఏ నీవు పూర్వము ధరించినదైన వనమాలచేత, భక్తులచేత ఇది యర్పింప బడినదని, ప్రీతిచేత చక్కగా సంపాదింపబడినట్లుగా పూజను స్వీకరించితివి. అట్టి నీ పాదము మాకు మా దుష్ట వాసనలను హతమార్చునది యగుగాక. (12)

టీ :- ఏతేషాం చ ముని సాత్వతాదీనాం షణ్ణాం సేవకానాం మధ్యే పరమభాగవతేషు లక్ష్మ్యా అపి తవ ప్రీతిరధికేతి సంస్తువంతి పర్యుష్ట యేతి. ఇడభావశ్ఛాందసః. అహం యత్ర వసామి తత్రైవ వక్షసి పర్యుషితాపీయం వసతీతి ప్రతిపత్నివత్ స పత్నీవచ్ఛ్రీః సంస్పర్ధమానా భవతి. తథాపి స్పర్ధమానాం శ్రియమనాదృత్యయోభవాన్పుర్యుషి తయాపి అముయా వనమాలయా భక్తైరర్పితేయమితి ప్రీత్యా సుప్రణీతం సుష్ఠు సంపాదితం యథా భవతి తథార్హణ పూజామాదదత్ స్వీకృతవాన్. సుప్రణీతమిత్యర్హణ విశేషణం వా. తస్య తవాంఘ్రిర్నోऽశుభాశయ ధూమకేతుర్భూయాత్. యద్వా యోంఘ్రిరముయా సుప్రణీతమర్హణ మాదదత్ త్సనోऽశుభాశయధూకేతుర్భూయాత్ ఇత్యన్వయః. అథనైవం సంబంధః ఏతేభ్యో ధ్యానార్చనాది నిష్ఠేభ్యోऽపి త్వద్యశసి ప్రవృద్ధ సచ్ఛ్రద్ధావంత ఏవకృతార్థా భగవతో యశః ప్రియత్వాదిత్యాహుః

టీ:- ఈ విధముగా చెప్పబడిన మునులు, సాత్వతులు మొదలగు ఆరు విధములగు నీ సేవకులలో పరమ భాగవతులపై లక్ష్మియందుకంటే నీ కధికప్రీతి అని స్తుతించుచున్నారు. పర్యుష్టయా అని. ఇడభావము ఛాందసము. నేనెక్కడుంటానో ఆవక్ష స్థలమునందే తనతో కూడియున్నదని సవతివలె లక్ష్మీదేవి ఈర్ష్యగలదియగుచున్నది, ఐననూ అట్లు ఈర్ష్యపడ్డ లక్ష్మిని ఆదరింపక, ఏ నీవు పూర్వము ధరించినదైన ఈ వనమాల చేత భక్తులచేత నిదియర్పింబడినదని ప్రీతిచేత చక్కగా సంపాదింబడునట్టుగా పూజను స్వీకరించితివి. సుప్రశీతమని అర్హణ విశేషణమయిననూ కావచ్చును. అట్టి నీ అంఘ్రి అశుభాశయములకు ధూమకేతువగుగాక. లేదా, ఏ నీ పాదము ఈ చక్కగా సంపాదింపబడిన పూజను స్వీకరిస్తూ మా దుష్టవాసనలు హతమార్చునది అగును యని అన్వయము. అథవా ఇట్లయిననూ సంబంధము చెప్పవలెను. ఈ

పర్యుష్టయా "వశకాంతౌ" ఇత్యస్మాత్పరితః సర్వాంగే ఉష్టయా కాంతయా శోభితయా వనమూలయా వక్షస్యేకదేశే వర్తమానాశ్రీః సంస్పర్ధమానా భవతి, తథాప్యామ్నాయ మధువ్రతై ర్బహుధా వర్ణితయా కీర్తిమయ్యా వైజయంత్యా వనమూలయైవ యోభవాన్సు ప్రణీతమర్హణ మాదద దిత్యాది పూర్వవత్. (12)

ధ్యానార్చనాది నిష్ఠగల వారికంటెనూ, నీ యశస్సును పెంపొందింప చేయుటలో అత్యంతాసక్తులైనవారే కృతార్థులు. భగవంతుని యశః ప్రియుడు కావున అనియందురు. పర్యుష్టయా తనతో గూడియున్న 'వశకాంతౌ అనెడి దాని నుండి వ్యుత్పత్తి ననుసరించి సర్వాంగమును వ్యాపించియున్న వనమాలతో వక్షస్థల ఏకదేశమువున్న లక్ష్మీదేవి స్పర్థచేయునది అగును. అయిననూ వేదమను తుమ్మెదలచే బహుప్రకారముగా వర్ణితమై కీర్తిమయవై వైజయంతియను వనమాల చేతనే నీవు చక్కగా కల్పింపబడిన పూజను స్వీకరించుచున్నావని మొదటి వలెనే చెప్పుకొనవలెను. (12)

13. శ్లో॥ కేతుస్త్రివిక్రమయుత స్త్రిపతత్పతాకో
యస్తే భయాభయకరోऽసురదేవచమ్వోః ।
స్వర్గాయ సాధుషు ఖలేష్వితరాయ భూమన్ పాదః
పునాతు భగవన్ భజతామఘం నః ॥

తా:- ఓ భూమానందరూపా! బలి బంధన సమయమునందు మూడు విక్రమములు కలిగియున్నదో ద్వితీయ విక్రమమునందు స్వర్గమును పొందినదో మూడు లోకములందును ప్రవహించు గంగకు పతాకముగా కలదియో అట్టి విజయ ధ్వజమయిన నీ పాదము నిన్ను సేవించునట్టి మా పాపమును శోధించుగాక. (13)

టీ:- త్వచ్చరణస్య భక్తపక్షపాతః ప్రసిద్ధ ఏవేతిస్తువంతః ప్రార్థయంతే కేతురితి. బలి బంధనే త్రిభిర్విక్రమైర్యుతః తత్ర ద్వితీయ విక్రమే సత్యలోకం గతస్తవ పాదః కేతురత్యుచ్ఛ్రితో విజయధ్వజ ఇవ. తత్సంపాదయంతి. త్రిపతత్పతాకః త్రిధా పతంతీ త్రిషులోకేషు వా

తా:- నీ పాదమునకు భక్త పక్షపాతము ప్రసిద్ధమేమని స్తుతించుచూ ప్రార్థించుచున్నారు కేతు అని. బలి బంధనము నందు మూడు విక్రములతో. (అడుగులు వేయుటలో) కూడుకొన్నది. అందు ద్వితీయ

పతంతీ గంగా పతాకా యస్య. తథా అసురదేవచమ్వోస్తత్సేనయోరుభయోర్భయా భయకరః సాధుషు సురేషు స్వర్గాయ ఖలేష్వసురేషు ఇతరాయ ఇతరస్మై అధోగమనాయ. య ఏవం కేతురూపస్తే పాదః స భజతాం నోఘం పునాతు శోధయాతు. "అఘాత్" ఇతిపాఠే భజతాం నః ఇతికర్మణి షష్ఠౌ. అఘాద్భజతోऽస్మాన్పునాత్వితి. తథాచ శృతిః" చరణం పవిత్రం వితతం పురాణం యేనపూతస్తరతి దుష్కృతాని, తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతి పాప్మానమరాతిం తరేమ. లోకస్య ద్వారమర్చిమత్పవిత్రం. జ్యోతిష్మద్భ్రాజమానం మహస్వత్. అమృతస్య ధారా బహుధా దోహమానం. చరణనోలోకే సుధితాం దధాతు" ఇతి. 13

విక్రమమునందు సత్యలోకమును పొందినది అయిన నీ పాదకేతువు (ధ్వజము) చాలా ఉన్నతమయినది విజయధ్వజము వలె నున్నది. దానినే చెప్పుచున్నారు.(13)

14.శ్లో॥ నస్యోతగావ ఇవ చ యస్య వశే భవంతి
బ్రహ్మాదయస్తనుభృతో మిథురర్ద్యమానాః ।
కాలస్య తే ప్రకృతి పూరుషయోః పరస్య
శం నస్తనోతు చరణః పురుషోత్తమస్య ॥

తా:- యుద్ధాదులందు పరస్పరము పీడింపబడుచుండ, దేహధారులయిన బ్రహ్మాది దేవతలు కూడా ముక్కుతాడు గుచ్చి బంధింపబడిన ఎద్దువలె నీకు ఆధీనులై యుంటారు. వారెప్పుడు కూడా స్వతంత్రులు కారు అహోరాత్రములగు కాలమును ప్రవర్తింపచేయు కాలస్వరూపుడవై ప్రకృతి పురుషులకు పరుడవై, పురుషోత్తముడవైన నీ పాదము మాకు సుఖములను వర్ధిల్లచేయుగాక. (14)

టీ:- నను యద్ధే దేవాసురాదయః పరస్పర జయంతి, జీయంతేచ కిమహం తత్ప్రోత్యత ఆహుః నసీతి. మిథుర్మిథోऽర్ద్యమానా యుద్ధాదిభిః

టీ:- ఓయీ! యుద్ధమునందు దేవాసురులు మొదలయినవారు పరస్పరము జయించుచున్నారు ఓడుచున్నారు అందు నాతో ఏమి

పీడ్యమానా బ్రహ్మాదయోఽపి యస్య తవ వశే భవంతి న తు జయే పరాజయే వా స్వతంత్రా కే ఇవ. నసి నాసికాయాం ఓతా నాసికామా విద్ధ్య బద్ధాగావో లీవర్దా ఇవ. కుతః కాలస్య కలయితు, ప్రవర్తకస్య. తదేవ కుతః ప్రకృతి పురుషయోరపి పరస్య. తస్య తే పురుషోత్తమస్య పాదోనః శంతనోతు. (14)

పని యందువా? అందులకు చెప్పుచున్నాడు. నసీ అని. పరస్పరము యుద్ధాదుల చేత పీడింపబడుచున్నవారై బ్రహ్మాది దేవతలు సైతము యే నీ యొక్క ఆధీనమందు ఉందురో; జయపరాజయములందు స్వతంత్రులుకారో, ఎవరివలె, ముక్కుతాడు గుచ్చి బంధింపబడిన ఎద్దువలె (ఉంటారు) ఎందువల్ల అనగా కాలమును ప్రవర్తింపచేయునట్టి ప్రకృతి పురుషులకు కూడా పరుడవైన, అట్టి పురుషోత్తముడవైన నీ పాదము మాకు సుఖము విస్తరించుగాక. (14)

15. శ్లో॥ అస్యాసి హేతరుదయస్థితిసంయమానాం
అవ్యక్తజీవమహతామపి కాలమాహుః ।
సోఽయం త్రిణాభిరఖిలాపచయే ప్రవృత్తః
కాలో గభీరరయ ఉత్తమపూరుష స్త్వం ॥

తా:- ఈ జగత్తు యొక్క సృష్టి స్థితి లయములకు నీవే కారణమగు చున్నావు. ఎందుకనగా, ప్రకృతి, పురుషుడు, మహత్త్వము, అను వాటిని నియమిచి కాలస్వరూపుడయిన నిన్ను నియంతగా చెప్పుదురు. ఆ యీ సంవత్సరాత్మకమగు చాతుర్మాస్యములు మూడు నాభులుగా గలదియై సకల లోకముల యొక్క లయమందు ప్రవృత్తమైన కాలము తీవ్రవేగము కలది అట్టి ఈ కాలము ఉత్తమ పురుషుడవైన నీవే యగుదువు. (15)

టీ:- ప్రకృతి పురుషాభ్యాం పరత్వముపపాదయన్తః కాలత్వేన పురుషోత్తమత్వమాహుః. అస్యేతి. అస్య జగతః ఉదయాదీనాం హేతురసి. కుతః అవ్యక్తం ప్రకృతిర్జీవః పురుషోమహాన్మహత్తత్వం తేషాం కాలం

టీ:- ప్రకృతి పురుషుల కంటే పరుడుగా ఉపపాదించుచూ కాలరూపుడగుటచే పురుషోత్తముడని చెప్పుచున్నారు అస్య అని. ఈ జగత్తునకు సృష్టి, స్థితి, లయములకు కారణమువగుచున్నావు. ఎందువలన?

నియన్తారం త్వామాహుః "అక్షరాత్పరతః పరః" మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః. పురుషాన్నపరం కించిత్సాకాష్ఠా సా పరాగతి." ఇత్యాద్యాః శృతయః. కించ అయం సంవథ్సరాత్మకో యః కాలస్త్రిణాభి స్త్రీణి చాతుర్మాస్యాని నాభయో యస్య సోऽపి త్వమేవ. అతస్త్వముత్తమ పురుష ఇతి తథా చ గీతాసు. "యస్మాత్క్షరమతీతో హమక్షరాదపి చోత్తమః. అతోస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమ" ఇతి. (15)

అవ్యక్తము = ప్రకృతి, జీవ = పురుష, మహాన్ = మహత్తత్వము, అను ఈ మూడింటికిని నియంతగ నిన్ను చెప్పుదురు." "చరమైన జగత్తునకు కూటస్థమైన ప్రకృతికంటే పరుడు మహత్తత్వమున కంటే అవ్యక్తమైన ప్రకృతిపరమగును. ఆ అవ్యక్తమయిన ప్రకృతి కంటె పురుషుడు పరుడగును, పురుషుని కంటే పరము లేదా పురుషుడే పర్యవసానము అతడే సంసారులగు జీవులకు పరమ గతియైయున్నాడు. అనెడి శృతులు. మరియు ఈ సంవత్సరాత్మకమైన ఏ కాలము కలదో అది మూడు చాతర్మాస్యములు నాభులుగా గలది; సమస్త జగత్తు యొక్క లయమునందు ప్రవర్తించినదైన కాలము కూడా నీవే అందువలన నీవు ఉత్తమ పురుషుడవు అని. గీతయందు "ఏ కారణము వలన సర్వభూతాత్మకమగు జగత్తును అతిక్రమించియున్నానో, ఏ కారణము వలన తత్కారణమైన ప్రకృతి కంటెను ఉత్తముడనో ఇందువలన నీ లోకమునందును వేదమునందును పురుషోత్తముడని ప్రసిద్ధికెక్కి యున్నాను" అని. (15)

16. శ్లో॥ త్వత్తః పుమాన్ సమధిగమ్య యయాస్య వీర్యం
ధత్తే మహాంతమివ గర్భమమోఘవీర్యః ।
సోऽయం తయానుగత ఆత్మన అండకోశం
హైమం ససర్జ బహిరావరణై రు పేతమ్ ॥

తా:- నీ వలన పురుషుడు వీర్యమును పొందిన మాయతో గూడి యమోఘమయిన శక్తి కలవాడై విశ్వమునకు గర్భము వలె మహత్తత్వమును సృజించుచున్నాడు. ఆ మహత్తత్వము మాయతో గూడినదై తన వలన అహంకారాది బహిరావరణలతో గూడి హిరణ్మయ మైన యండకోశమును సృజించెను. (16)

టీ:- త్వమేవ ప్రకృతి ద్వారా జగత్సృష్ట్యాను ద్వారా జగత్సృష్ట్యాది హేతు రిత్యుక్తం తత్కేన ప్రకారేణతాదాహు తత్వ ఇతి. త్వత్తః పురుషో వీర్యం శక్తిం సమధిగమ్య ప్రాప్యయయా మాయయా సహ మహాన్తం ధత్తే. కమివ. అస్య విశ్వస్య గర్భమివ. సోయం మహాంస్తయైవ మాయయాను గతః సన్నాత్మకః సకాశాదాండకోశం ససర్జ. త్వయాऽనుగత ఇతి పాఠేऽపి తయామాయయా త్వయాధిష్ఠితః సన్నితి.(16)

టీ:- ప్రకృతి మొదలయిన వాని ద్వారా జగత్తు యొక్క సృష్ట్యాదులకు నీవే కారణమని చెప్పబడెను. అది యే ప్రకారమనగా చెప్పుచున్నారు. త్వత్తః అని. నీ వలన పురుషుడు శక్తిని పొంది ఏమాయ చేతను మహత్తత్వమును ధరించుచున్నాడో, ఎవని వలె, ఈ విశ్వమునకు గర్భము వలె ఆయా మహత్తత్వము ఆ మాయచేత కూడినదగుచూ తన వలన హిరణ్మయమైన అండకోశమును సృజించెను త్వయానుగతః అనుపాఠమునందు 'నీ చే నధిష్ఠించబడిన మాయచేత'యని అర్థము16

17.శ్లో॥ తత్తస్థుషశ్చ జగతశ్చ భవానధీశో
యన్మాయయోత్థగుణవిక్రియయోపనీతాన్ ।
అర్థాన్ జుషన్నపి హృషీకపతే న లిప్తో
యేऽన్యే స్వతః పరిహృతాదపి బిభ్యతి స్మ ॥

తా:- ఆ కారణము వలన స్థావరజంగమమునకు నీవు ప్రభుడవు. ఏ కారణము వలన మాయచేత విజృంభించిన ఇంద్రియ వృత్తిచేత పొందబడిన విషయములను సేవించుచున్నవాడవగుచుండియూ, ఓ ఇంద్రియములకు అధిపతీ! నీవు అంటబడవు ఇతరులగు జీవులు యోగులుగా స్వయముగా లేనిదాని వల్లనూ పరిహరింపబడిన దాని వలననూ, విషయముల సేవనము వలన భయపడుచున్నారు. వాసనా మాత్రము చేత బంధింపబడుచున్నారు. అందువలన స్థావర జంగ మాత్మకమయిన అండకోశమునకు నీవు ప్రభువుడను.(17)

టీ:- నన్వేవం భూతమీశ్వరత్వం మమ కుతోవగతం తదాహుః తదితి. తత్తస్మాత్తస్థుషః స్థావరస్య జగతో జంగమస్య చ భవానధీశః. యద్యస్మా

టీ:- ఓయీ ! ఈ ప్రకారముగా నున్నటువంటి నా యీశ్వరత్వము మీకెట్లు తెలిసినది? యనగా చెప్పుచున్నారు తత్ అని. తత్ ఆ

న్మాయ యోత్థా ఉజ్జృంభితా యా గుణవిక్రియా ఇంద్రియవృత్తిః తయోపనీతా నర్థాన్విషయాన్ జుషన్ జుషమాణోऽపి హే హృషీకపతే, నలిప్తస్త్వం. యేత్వన్యేజీవా యోగినో వా స్వతః పరిహృతాదప్య విద్యమానా త్త్యక్తాద్వా విషయజోషణాద్బిభ్యతి. వాసనా మాత్రేణ బద్ధ్యన్త ఇత్యర్థః. (17)

యండకోశము వలన. స్థావరమునకు. చరించని వానికి జంగమము నకు (చరించెడి వానికి) నీవు ప్రభువుడవు. ఏ కారణము వలన మాయచే విజృంభించిన ఇంద్రియ వృత్తిచేత పొందబడిన విషయము లను సేవించుచున్నవాడవగుచుండియు. ఓ ఇంద్రియములకు అధిపతీ! నీవు అంటబడవు. ఇతరులగు జీవులు. యోగులును, స్వయముగా లేనిదానివల్లనూ పరిహరంపబడిన దాని వలననూ కూడా విషయ సేవనము వలన భయపడుచున్నారు. వాసనామాత్రము చేత బంధింప బడుచున్నారు. అని అర్థము. అందువలన స్థావరజంగమాత్మకమైన యండకోశమునకు నీవు ప్రభువుడవు.(17)

18.శ్లో॥ స్మేరావలోకలవదర్శితభావహారి
భ్రూమండలప్రహితసౌరతమంత్రశౌండైః ।
పత్న్యస్తు షోడశసహస్రమనంగబాణై
యస్యేంద్రియం విమథితుం కరణైః న విభ్వ్యః ॥

తా:- చిరునవ్వుతో కూడిన క్రీగంటి చూపులచేత ప్రకటింపబడిన హావభావములచే మనోహరమైన కనుబొమ్మలనుండి పంపబడిన రతిక్రీడా మంత్రములై మన్మథుని సమ్మోహనాస్త్రములైన కామకళల చేత పదహారు వేల మంది భార్యలు కూడా ఎవ్వని మనస్సును కలతపెట్టలేకపోయిరో అట్లే నీవు అలిప్తుడవు.(18)

టీ:- అలిప్తత్వమాహుః స్మాయేతి. స్మాయావలోకమందస్మిత విలసిత్వోలోకస్తస్యలవః కటాక్షః తేన దర్శితోయో భావోऽభిప్రాయః తేన మనోహరి యద్భ్రూమండలం తేనప్రహితా యేసౌరతామంతాస్తైః

టీ:- పరమాత్మ విషయలిప్తుడు కాదని చెప్పుచున్నాడు.స్మాయ అని - చిరునవ్వుతో ప్రకాశించు చూపు యొక్క కటాక్షముచేత చూపబడి అభిప్రాయము చేత మనోహరమైన కనుబొమలచేత పంపబడిన రతి

శౌణ్డైః ప్రగల్భైః అనంగబాణైః కామస్య బాణైః సంమోహనైః కరణైః కావకళాదిభిః షోడశసహస్రం పత్న్యో యస్యేన్ద్రియం మనోవిమథితుం క్షోభయితు నవిభ్వ్యః న సమర్థాః సభవాన్నలిప్త ఇతిపూర్వేణాన్వయః (18)

క్రీడామంత్రముల చేత ప్రగల్భములైన మన్మథుని మోహనాస్త్రములైన కామకళలు మొదలగు వానిచేత పదహారు వేల సంఖ్యగల పత్నులు ఏనీయొక్క మనస్సును క్షోభింపచేయుటకు సమర్థత గలవారు కాలేకపోయిరో అట్టినీవు లిప్తుడవు కావని పూరముతో అన్వయము.(18)

19.శ్లో॥ విభ్వ్య స్త వామృతకథోదవహాస్త్రిలోక్యాః
పాదావనేజ సరితశ్శమలాని హంతుం ।
అనుశ్రవం శ్రుతిరభిరంఘ్రిజమంగసంగైః
తీర్థద్వయం శుచిషదస్త ఉపస్పృశంతి ॥

తా:- అమృత రూపములైన కథలు అను ఉదకములను వహించునట్టి కీర్తినదులు, నీ పాదములు కడిగిన జలములైన గంగానదులు, మూడు లోకముల యొక్క పాపములను నాశము చేయుటకు సమర్థములు. గురువు యొక్క ఉచ్చారణము వెనువెంటనే వినిపించునట్టి వేదము వల్ల కలిగిన కీర్తి రూపమైన తీర్థమును శ్రవణేంద్రియముల చేతను, నీ పాదముల నుండి జనించినదైన గంగాతీర్థమును శరీరావయవ సంబంధములచేతను, ఈ ప్రకారముగా తమ ఆశ్రమ ధర్మమునందున్న వారు నీ యొక్క రెండు తీర్థములను సేవించుచున్నారు.(19)

టీ:- తస్మాత్తవామృత రూపాయా కథా తదేవ ఉదకం వహన్తీతి తథా కీర్తి నద్యః. తథా పాదావనేజ సరితో గంగాద్యా శ్చ త్రిలోక్యాః శమలాని హంతుం విభ్వ్యః. కేన ప్రకారేణ? ఆనశ్రవం గురోరుచ్చారణ మను శ్రూయత ఇత్యనుశ్రవో వేదస్తత్ర భవం కీర్తిరూపం తీర్థం శృతిభిః శ్రవణేంద్రియైః అంఘ్రిజం చాంగసంగై రేవం శుచిషదః స్వాశ్రమ

టీ:- అందులకని నీయొక్క అమృతరూపములైన ఏ కథలు కలవో అనే ఉదకములుగా వహించునట్టి కీర్తినదులు. అట్లే పాదములు కలిగిన జలములైన గంగానది నదులు ముల్లోకములోని పాపములను నశింపచేయుటకు సమర్థములు. ఏ ప్రకారముగా? గురువు యొక్క ఉచ్చాదిణమును వెనువెంటనే వినిపించునట్టి వేదమునందు కలిగిన

ధర్మస్థితాస్తవ తీర్థద్వయముపస్పృశన్తి సేవన్త ఇతి.(19)

కీర్తిరూపమైన తీర్థమును శ్రవణేంద్రియముల చేత, నీ పాదములనుండి జనించిన గంగాతీర్థమును శరీరావయవముల సంబంధముల చేతను ఈ ప్రకారముగా తమ ఆశ్రమ ధర్మమునందున్న వారు నీ యొక్క రెండు తీర్థములను సేవించుచున్నారు అని.(19)

**శ్రీ శుక ఉవాచ**

20.శ్లో॥ ఇత్యభిష్టూయ విబుధైః స్వేశః శతధృతిర్హరిం ।
అభ్యభాషత గోవిందం ప్రణమ్యాంబరమాశ్రితః॥

తా:- బ్రహ్మదేవుడు ఈశ్వరునితో దేవతలతో కూడుకొని శ్రీకృష్ణుని ఈ ప్రకారముగా స్తుతించి ఆకాశమును చేరి నమస్కరించి ఇట్లనెను.(20)

టీ:- ఇతీతి. విబుధైస్సహ. (20,21)

టీ :- దేవతలతోగూడ.(20,21)

**బ్రహ్మోవాచ**

21.శ్లో॥ భూమేర్భారావతారాయ పురా విజ్ఞాపితః ప్రభో ।
త్వమస్మాభిరశేషాత్మన్ తత్తథైవోపపాదితమ్ ॥

తా:- భూమికి భారాన్ని నివారింపుమని పూర్వము మేము నిన్ను విన్నవించుకొంటిమి. ఆ కార్యమును నీవా ప్రకారముగా నెరవేర్చితివి.(21)

22.శ్లో॥ ధర్మశ్చ స్థాపితస్సత్సు సత్యసంధేషు వై త్వయా।
కీర్తిశ్చ దిక్షు విక్షిప్తా సర్వలోకమలాపహా ॥

తా:- ఓ ప్రభూ నీచే ధర్మము సత్య ప్రవర్తకులైన సాధు పురుషులందు స్థాపించబడినది సర్వలోకముల కాలుష్యము పోగొట్టునట్టి కీర్తి దిక్కులందు విస్తరింపబడినది.(22)

టీ:- విక్షిప్తా - విస్తారితా. (22)

టీ :- విస్తరింపబడినది. (22)

23.శ్లో॥ అవతీర్య యదోర్వంశే బిభ్రద్రూపమనుత్తమమ్ ।
కర్మాణ్యుద్దామవృత్తాని హితాయ జగతోऽకృథాః ॥

తా:- ఓ కృష్ణా! నీవు యదువంశమునందవతరించి జగన్మోహన విగ్రహమును ధరించి యుదాత్తములైన పరాక్రమములతో కూడిన సాహసకృత్యములను జగమునకు మేలు కలుగుట కొరకై కావించితివి. (23)

టీ:- అవతీర్యేతి. ఉద్దామాని వృత్తాని విక్రమాః యేషు తాని కర్మాణి. (23 - 29)

టీ:- ఉదాత్తములైన విక్రయములు కల కార్యములను. (23 - 29)

24.శ్లో॥ యాని తే చరితానీశ మనుష్యాస్సాధవః కలౌ ।
శృణ్వంతః కీర్తయంతశ్చ తరిష్యంత్యంజసా తమః ॥

తా:- కలియుగమునందు సాధువులైన మానవులు మీ అవతార స్వరూపాలు వినుచు కీర్తించుచూ అవిద్యారూపమైన సంసారమును దాటుదురు. (24)

25.శ్లో॥ యదువంశేऽవతీర్ణస్య భవతః పురుషోత్తమ ।
శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికం ప్రభో ॥

తా:- ఓ ప్రభూ యదువంశమునందు జనించిన నీకు నూట ఇరువది ఐదు సంవత్సరములు గడిచినవి. (25)

26.శ్లో॥ నాధునా తేऽఖిలాధార దేవకార్యేऽవశేషితమ్ ।
కులం చో విప్రశాపేన నష్ట ప్రాయమభూదిదమ్ ॥

తా:- అన్ని లోకాలకు ఆధారమైనవాడా! నీ భూలోకమునందు దేవతలకు మేలు కలుగుటకొరకై చేసిన కార్యము పూర్తియైనది. ఇప్పుడింక చేయవలసిన (మిగిలిన) కార్యమేదిలేదు. నీ యదుకులము కూడా విప్రశాపము చేత నశించినట్లే అయినది. (26)

27.శ్లో॥ తతస్స్వధామ పరమం విశస్వ యది మన్యసే ।
సలోకాన్ లోకపాలాన్నః పాహి వైకుంఠకింకరాన్ ॥

తా:- ఓ కృష్ణా! నీయవతారకృత్యము పూర్తియయినది యని తలంచితి వేని పరమపదమైన వైకుంఠధామమును ప్రవేశించుము. లోకములతో కూడి, లోకపాలురమైన, విష్ణుసేవకులమైన మమ్ము పాలింపుము. 27

**శ్రీశుక ఉవాచ**

28.శ్లో॥ సంస్తుతో భగవానిత్థం విబుధైః పద్మజాదిభిః ।
ప్రతినంద్యా హతాన్రాజన్ మాయామనుజ ఈశ్వరః ॥

తా:- ఓ రాజా! బ్రహ్మాదిదేవతలీ ప్రకారము తన్ను స్తుతింపగా భగవంతుడు లీలామానుష విగ్రహుడు జగదీశ్వరుడైన శ్రీకృష్ణుడు వారలనభినందించి యిట్లు చెప్పెను.(28)

**శ్రీకృష్ణ ఉవాచ**

29.శ్లో॥ అవధారిత మేతన్మే యదాత్థ విబుధేశ్వర ।
కృతం వః కార్యమఖిలం భూమేర్భారోऽవతారితః ॥

తా:- ఓ బ్రహ్మదేవా! నీవేది నన్ను గూర్చి చెప్పితివో ఆకార్యము నంతయూ అట్లే చేయనిశ్చయించి ఆచరించితిని భూబారమునకు తొలగించితిని.(29)

30.శ్లో॥ తదిదం యాదవకులం వీర్య శౌర్యశ్రియోద్ధతమ్ ।
లోకం జిఘృత్సుద్ధర్మైః వేలయేవ మహార్ణవః ॥

తా:- బలపరాక్రమములచేత సంపదచే పెరిగియున్న ఈ యాదవ కులము ధర్మమునతిక్రమించిన కార్యముల చేత చెలియల కట్టదాటి యుప్పొంగివచ్చు మహాసముద్రమువలె లోకమును కబలించి వేయ గోరుచున్నది.(30)

టీ:- వీర్యశౌర్యయుక్తయాశ్రీమాయా. (30)

టీ:- వీర్య శైర్యముతో కూడిన ఐశ్వర్యముతో. (30)

31.శ్లో॥ యద్యసంహృత్య దృప్తానాం యదూనాం విపులం కులమ్।
గంతాస్మ్యనేన లోకోऽయం ఉద్వేలేన వినంక్ష్యతి ॥

తా:- మదించిన యాదవుల వంశమును సంహరించకనే, నా స్వధామమమునకు బోయితినేని హద్దుమీరి ఉప్పొంగిన సముద్రముచేత వలె యదుకులముచే ఈ లోకము నాశము కాగలదు.(31)

టీ:- ఉద్వేలేన లంఘిత మర్యాదేన.(31)

టీ :- మర్యాదనతిక్రమించిన. (31)

32.శ్లో॥ ఇదానీం నాశ ఆరబ్ధః కులస్య ద్విజశాపతః ।
యాస్యామి భవనం బ్రహ్మన్ ఏతదంతే తవానఘ ॥

తా:- ఓ బ్రహ్మ! విప్రశాపము వలన ఇప్పటికే యాదవకులమునకు నాశనము ప్రారంభమయినది. ఈ కులము పూర్తిగా నాశనమైనంతే వైకుంఠమునకు పోవుచో నీలోకమునకు రాగలను.(32)

టీ:- వైకుంఠ యాస్యం స్తవ భవనం యాస్యామి. (32)

టీ :-వైకుంఠమునకుపోతూ నీ భవనమునకు రాగలను(32)

**శ్రీ శుక ఉవాచ**

33.శ్లో॥ ఇత్యుక్తో లోకనాథేన స్వయంభూః ప్రణిపత్య తమ్।
సహదేవగణైర్దేవః స్వధామ ప్రత్యపద్యత ॥

తా:- లోక ప్రభువుచే ఇట్లు చెప్పబడినవాడై బ్రహ్మదేవుడు దేవగణములతో గూడి మ్రొక్కి తన స్థానమును చేరెను.(33)

34.శ్లో॥ అథ తస్యాం మహోత్పాతాన్ ద్వారకాయాం సముత్థితాన్।
విలోక్య భగవానాహ యదువృద్ధాన్ సమాగతాన్ ॥

తా:- తరువాత ద్వారక యందు గొప్పయుత్పాతములు పుట్టగా చూచి భగవంతుడైన కృష్ణుడు తనను కలిసికొనిన పెద్దలయిన యాదవులను చూచి ఇట్లు చెప్పెను. (34)

**శ్రీకృష్ణ ఉవాచ**

35.శ్లో॥ ఏతే వై సుమహోత్పాతాః హ్యుత్తిష్ఠంతీహ సర్వతః ।
శాపశ్చ నః కులస్యాసీత్ బ్రాహ్మణేభ్యో దురత్యయః ॥

తా:- ద్వారకయందు అంతటను గొప్ప యుత్పాతములు పుట్టుచున్నవి. ఇవి చూచితిరా? మన కులమునకు విప్రుల వలన దప్పించుకొనుటకు వీలుకాని శాపము కూడ కలిగియున్నది. (35)

36.శ్లో॥ న వస్తవ్యమిహాస్మాభిః జిజీవిషుభిరార్యకాః ।
ప్రభాసం సుమహాపుణ్యం యాస్యామోఽద్యైవ మా చిరమ్॥

తా:- ఓ పెద్దలారా, జీవింపగోరుచున్న మనకీ ద్వారకయందు నివసింపదగదు. గొప్ప పుణ్యతీర్థమయిన ప్రభాసమునకు ఆలస్యము చేయక ఇప్పుడే బయలుదేరిపోవుదము.(36)

టీ:- ప్రభాసం యాస్యామ ఇతివదతోఽయమభిప్రాయః ఏతే దేవాంశాః స్వాధికారానే వార్హంతి, నతుసద్యోమోక్షం. ద్వారవత్యాం మృతా ముచ్యేరంస్తస్మాదభ్యుదయ ఫలం ప్రభాసం నేష్యామీతి.(33-36)

టీ:- ప్రభాస తీర్థమునకు పోదాము అనుటలో భగవంతుని అభిప్రాయమిది. "ఈ యాదవులు దేవాంశ సంభూతులు కావున వీరు తమ తమ అధికారపు పదవులను పొందుటకు అర్హులు. ద్వారవతి యందు మరణించిన వారికి సద్యోముక్తిలేదు అందువలన ప్రభాస తీర్థమునందు స్నానాదులు చేసిన వారికి సద్యోమోక్షము కలుగును. కావున ప్రభాస తీర్థమునకు తీసికొని పోయెదనని.(33-36)

37.శ్లో॥ యత్ర స్నాత్వా దక్షశాపాత్ గృహీతో యక్ష్మణోదురాట్।
విముక్తః కిల్బిషాత్సద్యో భూయో భేజే కళోదయమ్ ॥

తా:- పూర్వము అశ్విన్యాది నక్షత్రములకు ప్రభువైన చంద్రుడు దక్షుని శాపముచే క్షయ రోగ గ్రస్తుడై, ప్రభాసతీర్థ స్నానముతో విముక్తుడై మరళ కళలయభివృద్ధి చెందెనో.(37)

టీ:- దక్షశాపాద్యక్ష్మణాగృహీత ఉడురాట్ చంద్రో యత్ర స్నానమాత్రం కృత్వా కిల్బిషాత్తస్మాద్రోగ దుఃఖార్సద్యో విముక్తఃసన్ భూయః కళావృద్ధిం భేజే. (37)

టీ :-దక్షశాపము వలన యక్ష్మరోగగ్రస్తుడయిన చంద్రుడు ఎక్కడ స్నానమాత్రముచేసి కిల్బిషము నుండి, ఆ రోగదుఃఖము నుండి విముక్తినొంది మళ్ళీ కళాభివృద్ధిని పొందెనో.(37)

38.శ్లో॥ వయం చ తస్మిన్నాప్లుత్య తర్పయిత్వా పితౄన్ సురాన్ ।
భోజయిత్వో శిజో విప్రాన్ నానాగుణవతాంధసా ॥

తా :- మనమందరము ఆ ప్రభాసతీర్థమునందు మునిగి దేవతలకు, పితృదేవతలకు తర్పణము విడిచి షడ్రసోపేతమైన అన్నము బ్రాహ్మణులకు పెట్టి భుజింపచేసి. (38)

టీ :-ఉశిజః - కమనీయాన్. అంధసా అన్నేన. (38)

టీ :- ఉశిజః - మనోహరులయిన. అంధసా అన్నముచేత. (38)

39.శ్లో॥ తేషు దానాని పాత్రేషు శ్రద్ధయోప్త్వా మహాంతి వై ।
వృజినాని తరిష్యామో దానై ర్నౌభిరివార్ణవమ్ ॥

తా :- సపాత్రులయిన ఆ బ్రాహ్మణులకు శ్రద్ధతో గొప్ప దానములు చేసి ఓడలచే సముద్రమును దాటునట్లు మనము ఆ దానములచేత పాపములను దాటుదుము. సుక్షేత్రమునందు మంచి విత్తనము నాటినచో చక్కగా పండును. సత్పాత్రునికి దానమిచ్చుటవలన ఫలప్రదము. (39)

టీ :-ఉప్త్వేతి. యథా సుక్షేత్రే బీజముప్తం బహుఫలం భవతి. తథా దానం సత్పాత్ర ఇతి ద్యోతయతి. (39 - 42)

టీ :- ఉప్త్వేతి - నాటియుంచి, సుక్షేత్రమునందు నాటిన బీజము చక్కని ఫలమును ఇచ్చును. అట్లే దానము సత్పాత్రునియందు అని తెలుపుచున్నాడు. (39 - 42)

**శ్రీశుక ఉవాచ**

40.శ్లో॥ ఏవం భగవతాదిష్టాః యాదవాః కురునందన ।
గంతుం కృతధియస్తీర్థం స్యందనాన్ సమయూయుజన్ ॥

తా :- ఓ కురునందన ఈ విధముగా భగవంతుడాదేశించగానే ఆ తీర్థమునకు పోవుటకు నిర్ణయించుకున్నవారై యాదవులు రథములు సిద్ధపరచిరి. (40)

41.శ్లో॥ తన్నిరీక్ష్యోద్ధవో రాజన్ శ్రుత్వా భగవతోదితం ।
దృష్ట్వారిష్టాని ఘోరాణి నిత్యం కృష్ణమనువ్రతః ॥

తా:- ఓ రాజా! ఉద్ధవుడు భగవంతుడు చెప్పినమాటలు విని యతని యుద్యోగము (చేయుపనిని) చూచి, ఘోరములైన యుత్పాతములను చూచి, విడువక కృష్ణుననుసరించెను.(41)

42.శ్లో॥ వివిక్త ఉపసంగమ్య జగతామీశ్వరేశ్వరమ్ ।
ప్రణమ్య శిరసా పాదౌ ప్రాంజలి స్తమభాషత ॥

తా:- లోకపాలకులను ప్రభువైన యా శ్రీకృష్ణుని ఏకాంతము నందు కలిసికొని చేతులు మోడ్చి శిరస్సుతో పాదములకు మ్రొక్కి ఉద్ధవుడిట్లు పలికెను.(42)

**ఉద్ధవ ఉవాచ**

43.శ్లో॥ దేవదేవేశ యోగేశ పుణ్య శ్రవణకీర్తన ।
సంహృత్యైతత్కులం నూనం లోకం సంత్యక్ష్యతే భవాన్ ॥

తా:- ఓ దేవేశ, యోగేశ, పుణ్యశ్రవణ కీర్తన, ఈ యాదవ కులమును సంహరించి నీవు నిశ్చయముగా మర్త్యలోకమును త్యజించగలవు.(43)

టీ :- దేవదేవేతి. లోకం మర్త్యలోకం. (43)

టీ :- దేవదేవా - మర్త్యలోకమును త్యజించి. (43)

44.శ్లో॥ విప్రశాపం సమర్థోऽపి ప్రత్యహన్న యదీశ్వరః ॥

తా:- నీవు ఈశ్వరుడవై యుండి సమర్థుడవైననూ బ్రాహ్మణ శాపమును ప్రతిహతము చేయనైతివి.(44)

టీ :- విప్రశాపమితి. న ప్రతిహతవాన్. (44 - 46)

టీ :-బ్రాహణశాపము ప్రతిహతము చేయదగనిది. (44 - 46)

45.శ్లో॥ నాహం తావంఘ్రికమలం క్షణార్థమపి కేశవ ।
త్యక్తుం సముత్సహే నాథ స్వధామ నయ మామపి ॥

తా:- ఓ కేశవా! నిన్ను విడిచి ఒక్క క్షణమయినను ఇచ్చట వుండలేను నన్నుకూడా నీ లోకమునకు తీసికొనిపొమ్ము.(45)

46.శ్లో॥ తవ విక్రీడితం కృష్ణ నృణాం పరమమంగళం ।
కర్ణపీయూషమాస్వాద్య త్యజంత్యన్యస్పృహాం జనాః ॥

తా:- నీ క్రీడావిలాస వర్తనములు నరులకు మంగళము, శ్రవణా నందము దాని నాస్వాదించి జనులు ఇతరములను త్యజింతురు.(46)

47.శ్లో॥ శయ్యాసనాటనస్థానస్నానక్రీడాశనాదిషు ।
కథం త్వాం ప్రియమాత్మానం వయం భక్తాస్త్యజేమహి ॥

తా:- శయనాసన సంచారములందు, స్నాన, క్రీడలందు , భోజనము నందు ప్రియుడవై యాత్మవైన నిన్ను భక్తులమై సేవించిన మేము ఎట్లు త్యజించగలము. (47)

టీ:- శయ్యాదిషు త్వాం భక్తా నిత్యం సేవితవన్తః వయం కథం త్యజేమ. (47)

టీ:- శయ్యాదుల యందు నిన్ను భక్తులమైన మేము నిత్యము సేవించినాము ఎట్లు త్యజించగలము.(47)

48.శ్లో॥ త్వయోపభుక్తస్రగ్గంధ వాసోఽలంకారచర్చితాః ।
ఉచ్ఛిష్టభోజినో దాసాః తవ మాయాం జయేమహి ॥

తా:- నీవనుభవించిన పూలమాలలు, చందనము, వస్త్రాలంకారాదులు ధరించి నీ ఉచ్ఛిష్టమును భుజించువారమైన దాసులమైన మేము, నీ మాయను తప్పక జయింతుము. (48)

టీ:- త్యక్తుమశక్నువన్ప్రార్థయతే, న మాయాభయాదిత్యాహ – త్వయేతి. చర్చితా అలంకృతాః. హి నిశ్చితం జయేమ. (48)

టీ:- త్యజించుటకు నశక్తుడనై నిన్ను ప్రార్థించుచున్నాను మాయయొక్క భయమువలనకాదు అనుచున్నాడు. చర్చితాః – అలంకరించుకొనబడినది. హి నిశ్చయముగా జయించగలము. (48)

49.శ్లో॥ వాతరశనా య ఋషయః శ్రమణా ఊర్ధ్వమంథినః ।
బ్రహ్మాఖ్యం ధామ తే యాంతి శాంతాస్సన్యాసినోఽమలాః॥

తా:- నిర్మల మనస్కులు శాంతులు నగు దిగంబరులు, ఋషులు శ్రమణులు సన్యాసులు, బ్రహ్మధామమును పొందుచున్నారు. (49)

టీ:- సన్యాసినో హి బ్రహ్మచర్యాదిక్లేశైః కథంచిత్తరంతి,వయన్త్వనాయాసేనైవ తరిష్యామ ఇత్యాహ వాతరశనా ఇతి. ఊర్ధ్వమంథినః ఊర్ధ్వరేతసః (49)

టీ:- సన్యాసులు బ్రహ్మచర్యాది క్లేశముల వలన కష్టముచే నా మాయను తరింతురు. మేము సునాయాసముగా దాటగలము అనుచున్నాడు. వాతరశనా అని. ఊర్ధ్వము మంథినః = ఊర్ధ్వరేతస్కులు. (49)

50.శ్లో॥ వయం త్విహ మహాయోగిన్ భ్రమంతః కర్మవర్త్మసు ।
త్వద్వార్తయా తరిష్యామః తావకైర్దుస్తరం తమః ॥

తా:- ఓ మహాయోగీ! మేము మాత్రము కర్మ మార్గమునదు తిరుగుతూ (వుంటూ) నీ కథాశ్రవణము చేత నీ భక్తులతో గూడి తరింప శక్యము గాని సంసారమును మాయను తరింపగలము. (50)

టీ:- తావకైర్భక్తైః సహ త్వద్వార్తయా దుస్తరం తమః సంసారం. (50)

టీ:- నీ భక్తులతో సహ నీ చరిత్రముచే దాటరాని తమస్సు – సంసారమును. (50)

51.శ్లో॥ స్మరంతః కీర్తయంతస్తే కృతాని గదితాని చ ।
గత్యుత్స్మితేక్షణ క్ష్వేళం యన్నృలోకవిడంబనమ్ ॥

టీ:- క్ష్వేళీ = పరిహాసః. దంద్వైకత్వమ్. (51)

52.శ్లో॥ ఏవం విజ్ఞాపితో రాజన్ భగవాన్ దేవకీసుతః ।
ఏకాంతినం ప్రియం భృత్యం ఉద్ధవం సమభాషత ॥

టీ:- ఏకాంతినమిత్యాది స్వాభిప్రాయావంచనే హేతుః. (52)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
షష్ఠోऽధ్యాయః

తా:- ఓ కృష్ణా! నీ వచనములను, నీ చరితములను, నరలోకమునకు విలాసప్రాయమైన నీగమనము, హాసము, దృష్టి పరిహాసము, మొదలగు వానిని స్మరించుచూ కీర్తించుచూ మేము మాయను తరింతుము.(51)

టీ:- క్ష్వేళ - పరిహాసము - ద్వంద్వైకత్వము.(51)

తా:- ఓ రాజా ఇట్లుద్ధవునిచే విన్నవింపబడినవాడై దేవకీసుతుడు భగవంతుడు ఏకాంతభక్తుడు ప్రియుడు భృత్యుడయిన ఉద్ధవునిగాంచి ఇట్లు పలికెను. (52)

టీ :-ఏకాన్తినము మొదలుకొని స్వాభిప్రాయావంచన యందు హేతువు. (52)

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
షష్ఠాధ్యాయము సమాప్తము.

## సప్తమోఽధ్యాయః

## సప్తమాధ్యాయము

శ్రీభగవానువాచ

1.శ్లో॥ తథాత్థం మాం మహాభాగ తచ్చికీర్షితమేవ మే ।
బ్రహ్మ భవో లోకాపాలాః స్వర్వాసం మేఽభికాంక్షిణః ॥

తా:- మహాభాగ్యశాలివగు ఉద్ధవా! నీవు నన్ను గూర్చి ఏమి అడిగితివో అదియంతయూ నేను చేయదలచినదే. బ్రహ్మ, శివుడు, ఇంద్రాది లోకపాలురు, నేను శ్రీ వైకుంఠమునకు రావలెనని కాంక్షించుచున్నారు. (1)

టీ:- సప్తమేతూద్ధవస్యాత్మజ్ఞాన సిద్ధ్యైహరిః స్వయః అవధూతేతిహసోక్త గురుష్వష్టావ వర్ణయత్. యదాత్థ సంహృత్యైతత్కులమితి. స్వర్వాసం- వైకుంఠవాసంప్రతి. (1,2)

టీ:- ఈ సప్తమాధ్యాయము నందు ఉద్ధవుడు జ్ఞాన సిద్ధికొరకు ప్రశ్నింపగా శ్రీకృష్ణుడు స్వయముగా అవధూతేతిహాసము నందు చెప్పబడిన గురువులందు ఎనమండుగురిని వర్ణించెను. యదాత్థః ఈ కాలమును సంహరించియని. స్వర్వాసంః వైకుంఠమును గూర్చి. (1,2)

2.శ్లో॥ మయా నిష్పాదితం హ్యత్ర దేవకార్యమశేషతః ।
యదర్థమవతీర్ణోఽహం అంశేన బ్రహ్మణార్థితః॥

తా:- నేను బ్రహ్మ ప్రార్థించగా ఈ జగమందు దేనికొరకు అవతరించితినో స్వాంశముచేత ఆ దేవతలకు హితమైన కార్యమంతయూ పూర్తి చేసినాను. (2)

3.శ్లో॥ కులం వైశాసనిర్దగ్ధం నంక్ష్యత్యన్యోన్యవిగ్రహాత్ ।
సముద్రస్సప్తమేఽహ్న్యేతాం పురీం సంప్లావయిష్యతి ॥

తా:- ఈ యదుకులము విప్రశాపముచే దగ్ధమై యాదవుల పరస్పర నిగ్రహము వలన నశింపగలదు. నేటికి ఏడవనాడు సముద్రమీ ద్వారకాపురమును ముంచి వేయగలదు. (3)

టీ:- త్వంచ సర్వత్యాగేనాత్మనిష్ఠో భవేతి వక్తుమాహ కులమితి త్రయేణ. (3)

టీ:- నీవు మాత్రము సర్వత్యాగముచే ఆత్మని నిష్ఠగలవాడవుకమ్ము అని చెప్పుచున్నారు. (3)

4. శ్లో॥ యర్హ్యేవాయం మయాత్యక్తో లోకోऽయం నష్టమంగళః ।
భవిష్యత్యచిరాత్సాధో కలినాపి నిరాకృతః ॥

తా:- నేనెప్పుడు ఈ లోకమును త్యజింతునో అప్పుడే ఈ లోకము శుభములు లేనిదగును త్వరగానే కలిపురుషుడు కూడా దీనిని కష్టపెట్టును. (4)

టీ:- తదైవాయంనష్టమంగలోభవిష్యతి. నిరాకృతోనితరామాక్రాన్తః. (4)

టీ:- అప్పుడేది ఇది శుభములు నశించినది కాగలదు. నిరాకృత ఆక్రమించబడును. (4)

5. శ్లో॥ న వస్తవ్యం త్వయైహైవ మయా త్యక్తే మహీతలే ।
జనోऽధర్మరుచిర్భద్ర భవిష్యతి కలౌయుగే ॥

తా:- నేనీ భూతలమును త్యజించిన తరువాత నీవెంత మాత్రము ఇక్కడ (ఈ ప్రదేశములో) నివసించరాదు. ఈ కలియుగమునందు ప్రజలు అధర్మమునందు అభిరుచి కలవారుకాగలరు. (5)

టీ:- నవస్తవ్యమేవత్వయా. (5,6)

టీ:- నీ వుండనే కూడదు. (5,6)

6. శ్లో॥ త్వం తు సర్వం పరిత్యజ్య స్నేహం స్వజనబంధుషు ।
మయ్యావేశ్య మనస్సమ్యక్ సమదృగ్విచరస్వ గామ్ ॥

తా:- నీవు స్వజన బంధువుల యందు గల ప్రేమను త్యజించి నాయందు మనస్సుంచి భూమిపై సమదర్శివై సంచరించుము. (6)

7.శ్లో॥ యదిదం మనసా వాచా చక్షుర్భ్యాం శ్రవణాదిభిః ।
నశ్వరం గృహ్యమాణం చ విద్ధి మాయామనోమయమ్ ॥

తా:- ఏది మనస్సుచే, వాక్కుచే, నేత్రములచే, చెవులు మొదలయిన వానిచే గ్రహించబడుచున్నదో. అది నశించునదిగా తెలిసికో. మనోమయమైనందున మాయయని తెలిసికొనుము.(7)

టీ:- నను గుణదోషాభ్యాం విషయే లోకే కుతః సమదృష్టిః స్యా మత ఆహ యదిదమితి. మన ఆదిభిర్గృహ్యమాణం మనోమయత్వాన్మాయేతి విద్ధి. తదపి న స్థిరం, కింతు నశ్వరం విద్ధి. (7)

టీ:- అయ్యా! గుణదోషములతో గూడిన లోకమందు సమదృష్టి గలవాడనెట్లగుదును. అనగా చెప్పుచున్నాడు యదిదమని. మనస్సు మొదలయిన వాటివలన తెలియబడుచున్నదంతయు మనోమయమయి యున్నందున మాయయని తెలిసికొనుము. మాయచే కల్పితమయినది. స్థిరము కాదు. అదినశ్వరమని తెలిసికొనుము. (7)

8.శ్లో॥ పుంసోఽయుక్తస్య నానార్థో భ్రమస్సగుణదోషభాక్ ।
కర్మాకర్మవికర్మేతి గుణదోషధియో భిదా ॥

తా:- విక్షిప్త మనస్సుగల మనిషికి భేద విషయక భ్రమయేదియో ఆ భ్రమ గుణదోషములకు స్థానము. గుణదోషములు గల బుద్ధులు కర్మ, అకర్మ, వికర్మ అని భేదము గలవగును.(8)

టీ:- మనోమయత్వే హేతుః పుంస ఇతి. అయుక్తస్సవిక్షిప్త మనసః నానార్థో భేదవిషయః భ్రమః. సభ్రమ ఏవగుణ దోషభాక్. నను వేదేనైవ విధినిషేధాభ్యాం భేదస్య సత్యతోక్తా, న, భ్రమవిజృంభిత గుణదోషబుద్ధేః పుంసః కర్మ, విహితమ్. అకర్మ తల్లోపః. వికర్మ నిషిద్ధమితి భేదః. అవిద్యావద్విషయ ఏవవేద ఇత్యర్థః.(8)

టీ:- మనోమయత్వమున హేతువు పుంసః అని. అయుక్తస్యః విక్షిప్త మనస్సు గల వానికి, నానార్థః= భేద విషయకమయిన భ్రమ. ఆభ్రమనే గుణ దోషములకు స్థానము. ఓయీ! వేదమే విధి, నిషేధములచే భేదము సత్యమని చెప్పినదికాని; భ్రమ విజృంభిత గుణదోష బుద్ధిగల పురుషునికి కాదు గదా అనగా, వేదవిహితమయినది కర్మ, దాని చేయకుండుట

అకర్మ. నిషిద్ధమయినది వికర్మ. ఈ మూడునూ అవిద్యావంతు నుద్దేశించియే వేదమున కనపడునని తెలియుచున్నది అని యర్థము. (8)

9. శ్లో॥ తస్మాద్యుక్తేంద్రియగ్రామో యుక్తచిత్త ఇదం జగత్ ।
ఆత్మనీక్షస్వ వితతం ఆత్మానం మయ్యధీశ్వరే ॥

తా:- కాబట్టి నీవు శ్రోత్రాదీంద్రియములనన్నింటినీ నిగ్రహించి మనోనిగ్రహము కలవాడవై ఈ జగత్తును నీ ఆత్మయందు వీక్షించుము. అట్టి నీ యాత్మను జగదీశుడనై బ్రహ్మమైన నా యందు జగద్రూపముతో వీక్షించుము. (9)

టీ:- కథమాత్మని పరిచ్ఛిన్నే వితతం జగదీక్షణీయం తత్రాహ - ఆత్మాన మితి. మయిబ్రహ్మణి తద్రూపేణేక్షస్వ. (9)

టీ:- పరిచ్ఛిన్నుడైన ఆత్మయందు విస్తారమైన జగత్తును ఎట్లు దర్శింప దగును అనగా చెప్పుచున్నాడు ఆత్మానమని. మయా= బ్రహ్మయైన నాయందు జగద్రూపముతో వీక్షింపుము. (9)

10. శ్లో॥ జ్ఞాన విజ్ఞాన సంయుక్తః ఆత్మభూతశ్శరీరిణాం ।
ఆత్మానుభవతుష్టాత్మా నాంతరాయైర్విహన్యతే ॥

తా:- వేదతాత్పర్య నిశ్చయము, ఆ అర్థానుభవము అను రెంటితో కూడినవాడై ఆత్మానుభవము చేతనే సంతుష్ట చిత్తుడై దేవతలు మొదలగు సర్వదేహులకు ఆత్మయగు వాడైయున్న వానిని విఘ్నములు బాధించవు. (10)

టీ:- నన్వేవం యుక్త చిత్తత్వేన కర్మాకరణే దేవాదయో విఘ్నాన్ కరిష్యన్తి తత్రాహ-జ్ఞానేతి. జ్ఞానం వేదతాత్పర్య నిశ్చయోవిజ్ఞానం- తదర్థానుభవ స్తాభ్యాం సమ్యగ్యుక్త స్తత ఆత్మానుభవేనైవ తుష్ట చిత్తోऽతః శరీరిణాం దేవాదీనామాత్మ భూతోऽన్తరాయైర్న ప్రతిహన్యసే. (10)

టీ:- అయ్యా! ఈ ప్రకారము యుక్తచిత్తుడై కర్మాచరణము చేయనిచో దేవతలు విఘ్నము కలిగింతురు కదా యనగా చెప్పుచున్నారు జ్ఞాన అని. జ్ఞానము = వేదతాత్పర్య నిశ్చయము విజ్ఞానము = తదర్థానుభవము అనువాని (రెంటితో) తో చక్కగా కూడియుండిన ఆత్మానుభవముచే సంతుష్టచిత్తుడై సర్వశరీరధారులకు ఆత్మయై యుండువానిని విఘ్నములు బాధించవు, దీని భావమిది అపరోక్షానుభవము కలుగు వరకు క్రమముగా కర్మలు చేయవలెను. తరువాత అన్ని ప్రాణుల ఆత్మభూతులగుట వలన ఎవ్వడునూ విఘ్నములు చేయడు. శృతి కూడా "జ్ఞానికి దేవతలు తమ ఐశ్వర్యముతో విఘ్నము నాచరింప సమర్థులు కారు ఎట్లనగా ఈ జ్ఞాని అన్ని భూతములకు ఆత్మయగు చున్నాడు" అని చెప్పుచున్నది. (10)

11. శ్లో॥ దోషబుద్ధ్యోభయాతీతో నిషేధాన్న నివర్తతే ।
గుణబుద్ధ్యా చ విహితం న కరోతి యథార్భకః ॥

తా:- అజ్ఞుడైన బాలకుడు సంకల్ప వికల్ప రహితుడై ఒక పని చేయును. అట్లే జ్ఞాని నిషేధ కర్మయని నివర్తించడు. విహిత కర్మయని చేయడు. అనగా ఇది చెడ్డది అని నిషిద్ధకర్మను త్యజింపడు. ఇది మంచిది యని విహిత కర్మనూ చేయడు విధి నిషేధములగు కర్మలు రెండునూ జ్ఞాని దృష్టికి దోషములే యగును. కావున రెంటిని అతిక్రమించినవాడు ప్రాక్తన సంస్కారమును బట్టి నిషిద్ధమైనది చేయడు విహితమైన కర్మను చేయును అని భావము.(11)

టీ:- నచోత్పన్న జ్ఞానస్యాపి యథేష్టాచరణ ప్రసజ్ఞ ఇత్యాహ - దోష బుద్ధ్యేతి. గుణదోష బుద్ధ్యతీతోపి ప్రాక్తన సంస్కారాన్నిషేధాన్ని వర్తత ఏవ కింతు న దోషబుద్ధ్యా, విహితం చ ప్రాయశః కరోతి న గుణబుద్ధ్యా. యథార్భక సంకల్ప వికల్ప రహితః కించిత్కరోతి కుతశ్చిన్నివర్తతే తద్వత్". (11)

టీ:- అపరోక్ష జ్ఞానము కలిగినవాడయ్యు ఇష్టము వచ్చినట్లు కర్మాచరణ ప్రసక్తి కూడదనుచున్నాడు దోషబుద్ధ్యా అని. గుణదోషబుద్ధులకు అతీతుడైనవాడు ప్రాక్తన సంస్కారము వలన నిషేధము నాచరింపక తప్పక నివర్తించువాడే యగును. మరి ఏమన దోషబుద్ధితో మాత్రము కాదు. మరియును అట్లే గుణబుద్ధిచే వేద విహితమైన కర్మ చేయడు. బాలుడెట్లు సంకల్ప వికల్పరహితుడై ఒకదానిని చేయును. ఒక దానిని విడుచును అట్లే. (11)

12. శ్లో॥ సర్వభూతసుహృచ్ఛాంతో జ్ఞానవిజ్ఞాననిశ్చయః ।
పశ్యన్మదాత్మకం విశ్వం న విపద్యేత వై పునః ॥

తా:- సర్వభూతహితుడై శాంతుడై, జ్ఞానవిజ్ఞాన నిశ్చయుడై ఈ విశ్వమును నా స్వరూపముగా చూచుచూ నుండువాడు మళ్ళీ ఈ సంసారమున పడడు. (12)

టీ:- ఏవం భూతస్య న పునః సంసార ఇత్యాహ - సర్వభూతేతి న విపద్యేత న పునః సంసరేత్. (12,13)

టీ:- ఇట్లు వర్తించువానికి మళ్ళీ సంసారము లేదు అనుచున్నాడు సర్వభూతయని. న విపద్యేత - మళ్ళీ సంసారమునపడడు. (12,13)

**శ్రీశుక ఉవాచ**

13. శ్లో॥ ఇత్యాదిష్టో భగవతా మహాభాగవతో నృప ।
ఉద్ధవః ప్రణిపత్యాహ తత్త్వజిజ్ఞాసురచ్యుతమ్ ॥

తా:- ఓ రాజా! ఇట్లు భగవంతుడు ఆదేశించగా విని మహాభాగవతుడగు ఉద్ధవుడు తత్వమును తెలిసికొన గోరి అచ్యుతునికి నమస్కరించి ఈ విధముగా అన్నాడు. (13)

**ఉద్ధవ ఉవాచ**

14. శ్లో॥ యోగేశ యోగవిన్న్యాస యోగాత్మన్ యోగసంభవ ।
నిశ్శ్రేయసాయ మే ప్రోక్తః త్యాగస్సన్న్యాసలక్షణః ॥

తా:- ఓ యోగేశా ! యోగవిదులకు అతిగోప్యమై నిక్షేపమైనవాడా! యోగమందు ఆత్మను ప్రకటించువాడా! యోగస్వరూపా! యోగమును సంభవింప చేయువాడా! నీవు నీ మహిమను బట్టి నాకు త్యాగరూపమైన సన్యాసమును ఉపదేశించితివి. ఈ త్యాగము ఆరోగ్యాదులు కోరువానికి సర్వము దానము చేయుమన్నట్లుకాక సన్యాసరూపము అని భావము. (14)

టీ:- త్వం తు సర్వం పరిత్యజ్యేత్యాద్యుపదేశ మాత్మనోఽయోగ్యం మన్వానః పృచ్ఛతి - యేగేశేతి. యోగఫలదాయిన్ యోగవిదాం న్యాసో నామాతిగోప్యో నిక్షేపవిశేషః. యద్వాయోగో విన్యస్యతే క్రియతే యస్మిన్. యోగాత్మన్ యోగే ఆత్మా ప్రకటోభవతి యస్య. యోగస్వరూపేతి వా. యోగస్య సంభోవో యస్మాత్. చతుర్భిరేతైః సంబోధనైస్స్వమహిమ్నా కేవలం త్వయోపదిష్టం న తు మదధికారం పర్యాలోచ్యేతి ద్యోతితం. తదాహ నిశ్శ్రేయసాయేతి. న చార్యోగ్యాద్యర్థం సర్వస్వదానాది వదయం త్యాగః కింతు సన్యాస లక్షణోఽప్రత్యాపత్తి రూపః. (14,15)

టీ:- నీవు సర్వమును పరిత్యజించ "యని చేసిన యట్టి యుపదేశము తనకు అయోగ్యము అని తలంచుచూ ప్రశ్నించుచున్నాడు. యోగఫలము నిచ్చు వాడా! యోగవిదులందుంచబడిన అతిగోప్యమైన నిక్షేపమైన వాడా లేక యోగమునకు లక్ష్యమైన వాడా! యోగమునందు ఆత్మను ప్రకటించువాడా! లేక యోగస్వరూపుడా! యోగమును సంభవింపచేయు వాడా! ఈ నాలుగు సంభోదనలచే స్వమహిమచే కేవలము తత్త్వము నీచే నుపదేశింపబడినది కాని నా యధికారమును పర్యాలోచించి చెప్పబడినది కాదు అని చెప్పుచున్నాడు నిశ్శ్రేయసాయ అని - మోక్షము కొరకు ఆరోగ్యాదులు కోరువానికి సర్వస్వము దానము చేయుమన్నట్లు కాక సన్యాస రూపము అప్రత్యాపత్తిరూపము. (14,15)

15.శ్లో॥ త్యాగోऽయం దుష్కరో భూమాన్ కామానాం విషయాత్మభిః
సుతరాం త్వయి సర్వాత్మన్ నభక్తైరితి మే మతిః ॥

తా:- ఓ భూమానందరూపా! సర్వ ప్రాణులకు ఆత్మయైనవాడా! విషయేచ్ఛలందు మనస్సు గలవారికి కోరికలను త్యజించుట అసాధ్యమగును. అందునూ నీయందు భక్తులు కాని వారికి ఆకామముల త్యాగము అత్యంతము అసాధ్యమని నా ఉద్దేశము.(15)

16.శ్లో॥ సోऽహం మమాహమితి మూఢమతి ర్విగాఢః
త్వన్మాయయా విరచితాత్మని సానుబంధే ।
తత్త్వంజసా నిగదితం భవతా యథాऽహం
సంసాధయామి భగవన్ననుశాధి భృత్యమ్ ॥

తా:- ఓ భగవంతుడా! నేను మాయా కల్పితమైన భ్రాన్తికిలోనై దేహమునేనని, పుత్రదారాదులు నావారని అహంకార మమకారములకు వశుడనై మూఢమతినైయున్నాను. నీవు నాకుపదేశించిన త్యాగాదికమును నేనెట్లు సుఖముగ సాధింతునో ఆ విధానమును సేవకుడనగు నన్ను మెల్లగా శాసించి చెప్పుము. (16)

టీ:- యంప్రతి త్యాగాద్యుపదిష్టం సోऽహంమూఢ మతిః. కుతః మమేత్యహమితి చ సానుబంధే పుత్రాది సహితే త్వన్మాయయావిరచితే. ఆత్మని దేహే విగాఢో నిమగ్నోऽతస్తత్తు భవతానిగదితం యథాహ మంజసా సంసాధయామి తథా భృత్యం మామనుశాధి శనైః శిక్షయ. (16)

టీ:- ఎవని కొరకై నీవు త్యాగాదికముపదేశించితివో ఆ నేను మన్దమతినై యున్నాను, ఎందులకు, నాది నేను అని పుత్రకళత్రాది సహితమగు నీ మాయచే కల్పింపబడిన దేహము నందు నిమగ్నుడనైయున్నాను. ఇందువలన నీవుపదేశించిన త్యాగాదికము నేనెట్లు సుఖముగా సాధింతునో అట్లు సేవకుడనగు నన్ను మెల్లగా శిక్షితుని చేయుము.(16)

17. శ్లో॥ సత్యస్య తే స్వదృశ ఆత్మన ఆత్మనోఽన్యం
వక్తారమీశ విబుధేష్వసి నానుచక్షే ।
సర్వే విమోహితధియస్తవ మాయయే మే
బ్రహ్మాదయస్తనుభృతో బహిరర్థభావాః ॥

టీ:- మయాసంక్షేపిత ఉక్తం విస్తరతస్త్వన్యాన్పృచ్ఛేతి చేదత ఆహ - సత్యస్యేతి. స్వదృశః స్వ ప్రకాశస్య సత్యస్యాత్మనః ఆత్మనో మాం ప్రతి వక్తారం తే త్వత్తోఽన్యం నానుచక్షే న పశ్యామి. స్వదృశః స్వతస్సిద్ధ జ్ఞానా త్త్వత్తోఽన్యమితి వా కుత ఇత్యత ఆహ - సర్వఇతి. బహిరర్థభావాః విషయోష్వర్థబుద్ధయః. (17)

తా:- స్వప్రకాశకుడవై సత్య స్వరూపుడవై పరమాత్మవైన నీ కంటే ఇతరులు నాకుపదేశించువారు దేవతలందునూ కన్పింపరు. ఎందుకు అనగా నీవు స్వతస్సిద్ధజ్ఞాన సంపన్నుడవు. ఈ శరీర ధారులగు బ్రహ్మాది దేవతలందరు నీమాయా మోహితులు, వారు బాహ్యములగు విషయ సుఖములందాసక్తులై వాటినే ముఖ్య ప్రయోజనములని తలుస్తారు. అంతర్ముఖులు కారు. (17).

టీ:- నేను సంక్షేపముగా చెప్పితిని విస్తరముగా తెలియగోరుచో వేరే వారినడుగుము అని అంటావేమో అందులకు చెప్పుచున్నారు సతస్య అని. స్వదృశః = స్వప్రకాశుడవైన, సత్యస్యాత్మ = సత్యస్వరూపుడవు (అయిన నీ కంటె) నన్ను కూర్చి చెప్పువారిని నీకన్నా ఇతరులను చూడకున్నాను. స్వప్రకాశుడవు. స్వతస్సిద్ధ జ్ఞానము గల నీకన్నా ఇతరుడిని అనియయిన ఎందులకు అనిన చెప్పుచున్నాడు సర్వే అని. బహిరర్థభావా- విషయ సుఖములందు ప్రయోజన బుద్ధికలవారు.(17)

18. శ్లో॥ తస్మాద్భవంత మనవద్యమనంతపారం
సర్వజ్ఞమీశ్వర మకుంఠవికుంఠధిష్ణ్యం ।
నిర్విణ్ణధీరహముహో వృజినాభితప్తో
నారాయణం నరసఖం శరణం ప్రపద్యే ॥

తా:- ఓ భగవంతుడా! అందువలన దోషరహితుడవు దేశకాలములచే నశించని శక్తి కలవాడవు, సర్వము తెలిసినవాడవు, ఈశ్వరుడవు, కాలాదులచే వైకుంఠమున మొక్కవోని నివాసము కలవాడవు, నారాయణుడవు, జీవునికి సఖుడవు, అయిన నిన్ను పాపములచే సన్తప్తుడనై నిర్వేదమును పొందిన బుద్ధికలవాడనై నేను శరణుపొందు చున్నాను. (18)

టీ:- కేచిద్దుఃశీలా భవంతి కేచిత్సేవితాః ఫలకాలే వినశ్యంతి కేచిదజ్ఞాః కేచిద్రక్షణేऽసమర్థాః కేచిత్తు స్థానాద్భ్రష్టా స్తద్వ్యా వృత్త్యర్థమనవద్యమిత్యా దీని పంచ విశేషణాని. న అంతః కాలతః పారం దేశతశ్చ యస్య తం. కాలాదిభిరకుణ్ఠో వికుంఠలోకో ధిష్ణ్యం - స్థానం యస్య తం . ఉ - హే భగవన్. హ- స్ఫుటమ్. నిర్వేదేహేతుః- వృజినైర్దుః ఖైరభి తప్తః హకార గౌరవాయ వృకారోయాక్త ఇవపఠనీయః నన్వనవద్యత్వా దీని కుతోమమ తదాహ - నారాయణమితి. అనుకంపితా మాహ (నరసఖం నీయతే విక్షిప్యతే దుఃఖైరితి నరోజీవస్తస్య సఖాయం భవన్తం శరణం ప్రపద్యే. (18)

టీ:- లోకమున కొందరు దుఃశ్శీలురుగనున్నారు. కొందరు సేవితులయ్యు ఫలితమీయదగిన సమయమున నశింతురు. కొందరి కేమి తెలియదు కొందరు రక్షించుటకు సమర్థులు. కొందరు తమ స్థానము నుండి భ్రష్టులు. వీరిని తొలగించుటకు "అనవద్యం" మొదలయిన ఐదు విశేషణములు ఉద్దేశింపబడినవి. దేశకాలములచే నశించని శక్తికలవాడు కాలాదులచే మొక్కపోని వైకుంఠలోకము ధిష్ణ్యం= నివాస స్థానము కలవాడవు. ఉ - ఓ భగవానుడా! హ ః స్పష్టము, నిర్వేదమునకు హేతువు వృజినైరభితప్తః = దుఃఖములచే సంతప్తుడనై హకారగౌరవమునకై వృకారము యుక్తమని చదువవలెను. అయ్యా! అనవద్యత్వాదులు నాకేలయన్న చెప్పుచున్నాడు నారాయణ యని. అనుకంపితమును చెప్పుచున్నాడు (నరసఖం = దుఃఖముల చేత నిక్షేపము నొందువాడు) నరుడు = జీవుడు వాని స్నేహితుడివయిన నిన్ను శరణుపొందుతున్నాను. (18)

**శ్రీ కృష్ణ ఉవాచ**

19.శ్లో॥ ప్రాయేణ మునయో లోకే లోకతత్త్వవిచక్షణాః ।
సముద్ధరంతి హ్యాత్మానం ఆత్మనైవాశుభాశయాత్ ॥

తా:- సాధారణముగా మునులీ లోకమున లోకతత్త్వమును తెలిసినవారై యున్నారు. వారుతమ ఆత్మజ్ఞానము చేతనే తమను విషయ వాసనల నుండి ఉద్ధరించుకొన గలుగుచున్నారు.(19)

టీ:- తదేవమసంభావనా విపరీత భావనాభ్యాముపదిష్టం తత్త్వమనవగాహమానం ప్రతి తన్నివృత్తయే గురూపదేశం వినాऽపి స్వాన్వయ వ్యతిరేకాభ్యామేవ తత్త్వప్రతిపత్తిర్భవతీతి దర్శయితుమాహ - ప్రాయేణేతి. లోకతత్త్వస్య విచక్షణాః పరీక్షకాః అశుభాశయాద్వితీయ వాసనాతః (19)

టీ:- అందువలన నీ ప్రకారముగా సంశయవిపర్యయములచే ఉపదేశింపబడిన తత్త్వమును నిశ్చయించుకొనలేని వ్యక్తికా సంశయ విపర్యయ నివృత్తికై గురూపదేశము లేకున్ననూ తన ప్రయత్నము చేతనే అన్వయ వ్యతిరేకసహచారములచే తత్త్వజ్ఞానము కలుగునని - చూపుటకు వచించుచున్నారు ప్రాయేణ అని. ఆయావస్తువులలో స్థిరముగా వుండెడి గుణములను పరిక్షించెడివారు. అశాభాయాత- విషయవాసనలనుండి. (19)

20. శ్లో॥ ఆత్మనో గురురాత్మైవ పురుషస్య విశేషతః ।
యత్ప్రత్యక్షానుమానాభ్యాం శ్రేయోऽసావనువిందతే ॥

తా:- పశ్వాది శరీరములందున్నను ఆత్మకు, విశేషించి పురుషునకు ఆత్మయే గురువు. ఏ మోక్షరూపమగు శ్రేయమును ఈ పురుషుడు ప్రత్యక్షము, అనుమానము అను ప్రమాణములచే పొందునో(పొందును) (20)

టీ:- తదుపపాదయతి- ఆత్మనః పశ్వాదిశరీరేऽప్యాత్మైవ హితాహిత జ్ఞానేగురుః. (20)

టీ:- వానినే నిరూపించుచున్నాడు. ఆత్మనః - పశ్వాది శరీరము లందున్నను. ఆత్మనే హితజ్ఞానమున గురువు.(20)

21. శ్లో॥ పురుషత్వే చ మాం ధీరాః సాంఖ్యయోగవిశారదాః ।
అవిస్తరం ప్రపశ్యంతి సర్వశక్త్యుపబృంహితమ్ ॥

తా:- అందు ప్రత్యక్షమును తెలుపుచున్నాడు. పురుషత్వే అని. "అతడు (పరమాత్మ) ప్రకృష్టమైన జ్ఞానముతో కూడినవాడై పురుష ధర్మమందు సూక్ష్మరూపమున నుండును. అతడు ప్రజ్ఞానముతో సంపన్నతముడై

విజ్ఞానమును (తెలియవచ్చు దానిని) వచించును. విజ్ఞానమును దర్శించును. రేపు కలుగబోవుదానిని తెలియును. దృశ్య ప్రపంచమను అదృశ్యమగు మాయను ఎఱుంగును. లోకాలోకములను తెలిసికొనును. మర్త్యరూపముచే అమృతమును (మోక్షమును) కాంక్షించును. ఈ ప్రకారముగనున్నారు. ఇతరములగు పశువులకు జంతువులకు ఆకలిదప్పులనే తెలిసికొనెడి జ్ఞానమైయున్నాడు. (21)

టీ:- తత్ర ప్రత్యక్ష దర్శయతి - పురుషత్వేచేతి తథా చ శృతిః- "పురుషత్వే చావిస్తరామాత్మా స హి ప్రజ్ఞానేన సంపన్నతమో విజ్ఞాతం వదతి. విజ్ఞాతం పశ్యతి వేదశ్వస్తనం వేద లోకాలోకౌ మర్త్యేనామృత మీప్సత్యేవం సంపన్నోఽథేతరేషాం పశూనామశనాపిపాసే ఏవాభి విజ్ఞానమ్" ఇతి. (21)

టీ:- మనుష్య జన్మమునందును సాంఖ్యయోగ దర్శనముల తత్త్వము తెలిసిన పండితులు జ్ఞానైశ్వర్యాది సర్వశక్తులను విస్తరించునన్ను సూక్ష్మరూపునిగా చూచుచున్నారు. (21)

22.శ్లో॥ ఏకద్విత్రిచతుష్పాదో బహుపాస్తథాపదః ।
బహ్వ్యస్సంతి పురస్సృష్టాః తాసాం మే పౌరుషీ ప్రియా ॥

తా:- ఒకటి రెండు మూడు నాలుగు పాదములు కలవి. చాల పాదములు కలవి. అట్లే పాదములు లేనివి. అనేకములుగా పుట్టించ బడినవి. (22)

టీ:- అతః పురుషత్వం స్తౌతి - ఏకేతి. (22)

టీ:- ఇందువలన మానవత్వమును స్తుతించుచున్నాము. (22)

23.శ్లో॥ అత్ర మాం మార్గయంత్యద్ధా యుక్తా హేతుభిరీశ్వరమ్ ।
గృహ్యమాణైర్గుణైర్లింగైః అగ్రాహ్యమనుమానతః ॥

తా:- ఈ పురుష శరీరమునందు అప్రమత్తతతో కూడిన జ్ఞానము కలవారై అగ్రాహ్యుడనైన నన్ను సాక్షాత్తుగా వెతుకుచున్నారు. బుద్ధి మొదలగు గుణములైన కారణముల చేత, వ్యాప్తి ముఖమున గల కారణముల చేత అనుమానమును బట్టి ఇంద్రియాదుల ప్రవర్తకుని అన్వేషింతురు.(23)

టీ:- అనుమానమాహ - అత్ర పౌరుష్యాంపురి. యుక్తా అప్రమత్తా అగ్రాహ్యం గ్రాహ్యేభ్యోऽహంకారేభ్యో వ్యతిరిక్తం మామద్ధా సాక్షాన్మృగయన్తి. మార్గణే ప్రకారద్వయమాహ - గృహ్యమాణై ర్బుద్ధ్యాదిభిర్గుణైర్హేతుభిః. జడానాం ప్రకాశః స్వప్రకాశమేకం వినా నఘటత ఇత్యనుపపత్తి ముఖేన లక్షైః తథా తైరేవలింగై ర్వ్యాప్తి ముఖేనానుమానత ఈశ్వరం ప్రవర్తకం మృగయంతే. బుద్ధ్యాదికరణాని కర్తృప్రయోజ్యాని కరణత్వాద్వాస్యాది వదితి. తదుక్తం - "భగవాన్సర్వభూతేషు లక్షితః స్వాత్మనాహరిః దృశ్యైర్బుద్ధ్యాదిభిర్ద్రష్టా లక్షణైరనుమాపకైః" ఇతి. న చైతావతా ఆనుమానిక ఆత్మేతి మన్తవ్యమ్. దేహాదివ్యతిరక్తత్వం పదార్థశుద్ధి మాత్రస్యైవానుమానేన వివక్షితత్వాత్. (23)

టీ:- అనుమానమును చెప్పుచున్నాడు అత్రఅని. అత్ర = ఈ పురుష శరీరమునందు. యుక్తాః - అప్రమత్తతతోకూడి. అగ్రాహ్యం - గ్రాహ్యములైన అహంకారాదులకంటే వ్యతిరిక్తుడనైన నన్ను. అద్ధా - సాక్షాత్తుగా వెదుకుచున్నారు. అన్వేషణయందు ప్రకార ద్వయమును చెప్పుచున్నారు. గృహ్యమాణైః గుణైః- గ్రహింపబడుచున్న బుద్ధి మొదలయిన గుణములయిన హేతుభిః కారణములచే జడాదులకు ప్రకాశము స్వప్రకాశము ఒక్కటి లేక ఘటిల్లదు. అనుపపత్తి ముఖమున గలుగు లక్షణముల చేతను ఆ ప్రకారము ఆ లింగములచే వ్యాప్తి ముఖమున అనుమానమును బట్టి ఈశ్వరుడిని (ఇంద్రియాదుల ప్రవర్తకుని) అన్వేషింతురు." బుద్ధ్యాదికరణములు కర్తృ ప్రయోజ్యములు, కరణములగుట వలన తత్వజ్ఞాన సాధనములు, ఉలి మొదలయినవాని వలె (అనెడి పక్ష, సాధ్య హేతువులు) భగవంతుడగు హరి సర్వ భూతముల యందును స్వస్వరూపముగ ఆత్మయై గోచరించుచున్నాడు.

దృశ్యములై బాహ్యములై బాహార్థములను గ్రహించుబుద్ధి మొదలయిన వాని ధర్మముల చేత అనుమాపకుడు వ్యాప్తి ముఖమున అనుమానించు అనుమానాది ప్రమాణముల చేత ద్రష్ట(గా) తెలియబడు చున్నాడు. ఇంతమాత్రముననే ఆత్మ అనుమానికుడని తలవరాదు. దేహాదివ్యవతిరిక్తుడన పదార్థశుద్ధి మాత్రమే అనుమానముచే వివక్షితమై యున్నది. (23)

24.శ్లో॥ అత్రాప్యుదాహరతీమం ఇతిహాసం పురాతనం ।
అవధూతస్య సంవాదం యదోరమితతేజసః ॥

తా:- ఈ ఆత్మజ్ఞానము విషయమై పెద్దలు పురాతనమైన ఇతిహాసమును తేజోవంతుడయిన యదురాజునకు ఒక అవధూతకు జరిగిన సంవాదమును దృష్టాంతముగా చెప్పుదురు.(24)

టీ:- భూయోऽన్వయవ్యతిరేకాభ్యామసంభావనాది నివృత్తామితిహాస మాహ - అత్రాపీతి. (24,25)

టీ:- మళ్ళీ అన్వయ వ్యతిరేకములతో అసంభావనా నివృత్తి విషయమై ఇతిహాసమును చెప్పుచున్నాడు. అత్రాపి అని. (24,25)

25.శ్లో॥ అవధూతం ద్విజం కంచిత్ చరంతమకుతోభయమ్ ।
కవిం నిరీక్ష్య తరుణం యదుః పప్రచ్ఛ ధర్మవిత్ ॥

తా:- ఒకనాడు ధర్మములన్ని తెలిసిన యదురాజు దేని వలననూ భయములేక సంచరించుచున్న జ్ఞాని, యువకుడు, ద్విజుడైన అవధూతను చూచి ఇట్లు ప్రశ్నించెను. (25)

**యదురువాచ**

26.శ్లో॥ కుతో బుద్ధిరియం బ్రహ్మన్ అకర్తుస్సువిశారదా ।
యామాసాద్య భవాన్ లోకే విద్వాంశ్చరతి బాలవత్ ॥

తా:- ఓ బ్రహ్మజ్ఞుడా! దేనికినీ కర్తృత్వమును వహించక సంచరించుచూ నీకు ఇట్టి సమర్థమైన బుద్ధి ఎట్లు కలిగినది? అట్టి బుద్ధిని పొందిన నీవు జ్ఞానివయ్యు బాలుని వలె సంచరించుచున్నావు. (26)

టీ:- సువిశారదా - అతినిపుణా సర్వలోక విలక్షణా. (26)

టీ:- సువిశారదా-అతినిపుణమయిన-సర్వలోక విలక్షణమైన. (26)

27.శ్లో॥ ప్రాయో ధర్మార్థకామేషు వివిత్సాయాం చ మానవాః ।
హేతునేహ సమీహంతే ఆయుషో యశసశ్శ్రియః ॥

తా:- తరచుగా మానవులు ఈ జగమందు ధర్మార్థ కామములను పురుషార్థములందును ఆత్మ విచారమందును, ఆయువు యశస్సు సంపద అను వాని యందును ఆసక్తులై ప్రవర్తింతురు.(27)

టీ:- సర్వలోక వైలక్షణ్యమేవాహ - ప్రాయ ఇతి. ధర్మాదిషు వివిత్సాయా మాత్మవిచారేచ మానవాః సమీహన్తే ప్రవర్తన్తే తత్రా ప్యాయురాదేర్హేతునా కామనయైవ. (27)

టీ:- సర్వలోకమునకు ముఖ్యమైన వైలక్షణ్యమును చెప్పుచున్నారు. ప్రాయ అని. ధర్మాదుల యందు ఆత్మ విచారము నందు మానవులు ప్రవర్తించుచున్నారు. అక్కడక్కడ ఆయురాదుల యొక్క కామన అను కారణముచే (ప్రవర్తింతురు). (27)

28.శ్లో॥ త్వం తు కల్యః కవిర్దక్షః సుభగో మితభాషణః ।
న కర్తానేహసే కించిత్ జడోన్మత్తపిశాచవత్ ॥

తా:- నీవు మాత్రము ఏ ఒక్క పనిచేయు కర్తవు గాక ఏ కించిత్తూ కోరక మందమతి. ఉన్మత్త, పిశాచము వలె చరించుచున్నావు. జ్ఞానివి కార్యాచరణ సమర్థుడవు, సుందరుడవు, మితముగా మాట్లాడువాడవు. (28)

టీ:- త్వం తు న కస్య చిత్కర్మణః కర్తాభవసి, న కించి రీహసే ఇచ్ఛసి, నవ్యశక్త్యాऽజ్ఞానేన వా ऽనైపుణ్యేన వా విరూపత్వేనవాऽ వాగ్మతయా వా ఔదాసీన్యం ఘటత ఏవ నేత్యాహ కల్ప ఇత్యాదినా. (28)

టీ:- నీవు మాత్రము ఏ ఒక్క పనికి కర్తవు కావు. ఏ కొంత వాంఛింపవు. ఓయీ అజ్ఞానము వలన నైపుణ్యము లేకపోవుట వలన విరూపము వలన, వాగ్మతలేకపోవుట వలన నయిననూ ఔదాసీన్యం ఘటించును కదా? యనిన కాదనుచున్నాడు అకల్ప మొదలుకొని. (28)

29.శ్లో॥ జనేషు దహ్యమానేషు కామలోభభవాగ్నినా ।
న తప్యసేऽగ్నినా ముక్తో గంగాంభస్థ ఇవ ద్విపః ॥

తా:- లోకమునందు జనులు స్త్రీ సంగమాభిలాషరూపమైన కామము, ధనవాంఛ అను అగ్నిచే చాలా దగ్ధులయిపోవుచుండ నీవు మాత్రము ఆకామాదుల నుండి విడుదల పొంది చల్లని గంగా జలములందున్న ఏనుగువలె ఏతాపములేక హాయిగనున్నావు. (29)

టీ:- మహానానందశ్చ తవకుత ఇతి పృచ్ఛతి జనేష్వితి. (29)

టీ:- మహానందము నీకెక్కడిది అని అడుగుచున్నాడు జనేషు అని. 29

30.శ్లో॥ త్వం హి నః పృచ్ఛతాం బ్రహ్మన్ ఆత్మన్యానందకారణం ।
బ్రూహి స్పర్శవిహీనస్య భవతః కేవలాత్మనః ॥

తా:- ఓ బ్రాహ్మణుడా! విషయభోగ రహితుడు కళత్రాది శూన్యుడు ఐన నీ యొక్క చిత్తము నందు ఆనందమునకు హేతువును ప్రశ్నించుమాకు చెప్పుము. (30)

టీ:- స్పర్శవిహీనస్య విషయభోగ రహితస్య. అత్ర హేతుః కేవలాత్మనః - కళద్రాది శూన్యస్య. (30,31)

టీ:- స్పర్శవిహీనస్య - విషయభోగరహతుడయిన. ఇక్కడ హేతువు కేవలాత్మనః - కళత్రాది శూన్యుడయిన.(30,31)

**శ్రీకృష్ణ ఉవాచ**

31. శ్లో॥ యదునైవం మహాభాగో బ్రహ్మణ్యేన సుమేధసా ।
పృష్టస్సభాజితః ప్రాహ ప్రశ్రయావనతం ద్విజః ॥

తా:- బ్రాహ్మణ భక్తి గలిగి చక్కని ప్రజ్ఞగల యదురాజుచే ఇట్లు ప్రశ్నింపబడి పూజింపబడిన ఆద్విజుడు మహానుభావుడు వినయముతో వంచిన శిరము గల యదువును గూర్చి ఇట్లు చెప్పెను. (31)

**బ్రాహ్మణ ఉవాచ**

32. శ్లో॥ సంతి మే గురవో రాజన్ బహవో బుద్ధ్యుపాశ్రితాః ।
యతో బుద్ధిముపాదాయ ముక్తోఽటామీహ తాన్ శృణు॥

తా:- ఓ రాజా! బుద్ధిచే స్వీకరింపబడినవారు చాలా గురువులు నాకు కలరు. ఏ గురువుల వలన జ్ఞానమును గ్రహించి ముక్తుడనై ఇచ్చట సంచరించుచున్నానో వారిని గూర్చి వినుము.(32)

టీ:- బుద్ధ్యైవోపాశ్రితాః స్వీకృతా నతూపదేశేన అటామి-పర్యటామి. 32

టీ:- బుద్ధిచే స్వీకరింపబడినవారు ఉపదేశముచే కాదు అటామి - పర్యటించుచున్నాను. (32)

33. శ్లో॥ పృథివీ వాయురాకాశః ఆపోఽగ్నిశ్చంద్రమా రవిః ।
కపోతోఽజగరస్సింధుః పతంగో మధుకృద్గజః ॥

తా:- భూమి, వాయువు, ఆకాశము, జలము, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, పావురము, కొండచిలువ, సముద్రము, మిడుత, తుమ్మెద, ఏనుగు. (33)

టీ:- గురూనాహ పృధివీతి. (33)

టీ:- గురువులను చెప్పుచున్నాడు పృథివీ అని. (33)

34. శ్లో॥ మధుహా హరిణో మీనః పింగళా కురరోఽర్భకః।
కుమారీ శరకృత్సర్పః ఊర్ణనాభిస్సుపేశకృత్ ॥

తా:- తేనె దొంగిలించువాడు (తేనె పట్టువాడు), హరిణము, మీనము, పింగళ, జింక, అర్భకుడు, కురరీమృగము, బాణము చేయు కమ్మరి, సర్పము, సాలెపురుగు, భ్రమర కీటకము. (34)

టీ:- శోభనం రూపం కీటస్య కరోతీతి సుపేశకృత్.(34)

టీ:- పురుగునకు శోభనమయిన రూపమును కలిగించునది.(34)

35.శ్లో॥ ఏతే మే గురవో రాజన్ చతుర్వింశతిరాశ్రితాః ।
శిక్షావృత్తిభిరేతేషాం అన్వశిక్షమిహాత్మనః ॥

తా:- ఓరాజా! వీరు నా గురువులు. ఇరువది నలుగురు ఆశ్రయించ బడినవారు. వీరి వర్తనలచే ఇక్కడ నా చిత్తమునకు నేర్చుకొనిన వాడనైతిని. (35)

టీ:- మేమయాశ్రితాః తదాహ ఏతేషాంవృత్తిభిరాత్మనః శిక్షాః శిక్షణీయా నర్థాన్ హేయోపాదేయోదీనన్వశిక్షమను శిక్షితవానస్మి.(35)

టీ:- యే నా చేత ఆశ్రయింపబడినవారు అదే- చెప్పుచున్నాడు. వీరి వర్తనల చేత నా చిత్తమునకు త్యజింపదగినవి గ్రహింపదగినవి యునగు విషయములను నేర్చుకొనినవాడనైనాను. (35)

36.శ్లో॥ యతో యదనుశిక్షామి యథా నా నాహుషాత్మజ ।
తత్తథా పురుషవ్యాఘ్ర నిబోధ కథయామి తే ॥

తా:- ఓ యయాతి పుత్రా! పురుష శ్రేష్ఠుడా! నేను ఏ గురువు వలన ఏ గుణమును ఏ ప్రకారము నేర్చుకొంటినో ఆ గుణమును ఆ ప్రకారముగా చెప్పెదను వినుము. (36)

టీ:- నాహుషోయయాతిః. (36)

టీ :-నాహుషుడు - యాయాతి.(36)

37.శ్లో॥ భూతైరాక్రమ్యమాణోఽపి ధీరో దైవవశానుగైః ।
తద్విద్వాన్ న చలేత్ మార్గాత్ అన్వశిక్షం క్షితేర్వ్రతమ్ ॥

తా:- విధివశమున వర్తించెడి ప్రాణులచే చాలా పీడింపబడుచున్న వాడైననూ పండితుడు ఆ భూతములు దైవవశమున వర్తించునని తెలిసికొన్నవాడై తన ధర్మమార్గమునుండి చలింపగూడదు. అని భూమి నుండి నియమమును నేర్చికొన్నాను.(37)

టీ:- క్షితేః క్షమాం శిక్షితవానిత్యాహ - భూతైతిరి ఆక్రమ్యమాణః పీడ్యమానః తద్విద్వాన్భూతానాం దైవవశ వర్తిత్వం విద్వాన్ వ్రతం నియమమ్. (37)

టీ:- భూమి నుండి క్షమను (ఓర్పును) నిర్చితిని అనుచున్నాడు భూతైః అని. ఆక్రమ్యమాణః - పీడింపబడుచున్నవాడై, ఆ భూతములు దైవవశమున వర్తించునని తెలిసికొనినవాడై, వ్రతం - నియమము. (37)

38. శ్లో॥ శశ్వత్పరార్థసర్వేహః పరార్థైకాంత సంభవః ।
సాధుశ్శిక్షేత భూభృత్తో నగశిష్యః పరాత్మతామ్ ॥

తా:- ఎల్లప్పుడు పరోపకారము కొరకు సర్వవాంఛలు (కార్యములు) కలిగియుండుట పరోపకారము కొరకు ముఖ్యముగా పుట్టుక కల్గుట పరాధీనమైన శరీరము కలవాడై యుండుట అనుదానిని పర్వతము నుండి వృక్షమునకు శిష్యుడైన సత్పురుషుడు నేర్వవలెను. (38)

టీ:- పర్వతరూపా వృక్షరూపాచ యాపృథివీ తస్యాః శిక్షితమాహ - శశ్వదితి. సర్వదా పరార్థాః పరోపకారార్థాః సర్వా ఈహాః యస్య సః పరార్థ ఏవ ఏకాంతతః సంభవోయస్య సః. భూభృత్తః పర్వతాత్, తస్య హి వృక్ష తృణ నిర్ఝర ప్రసవక్రియాః పరార్థా ఏవ యథా తద్వత్. తథా నగశిష్యో వృక్షశిష్యః సన్పరాత్మతాం పరాధీనాత్మతాం. వృక్షో యథా పరైరవఖండ్యోత్పాట్య వా నయన మప్యనుమన్యతే తద్వత్. (38)

టీ:- పర్వతరూపము వృక్షరూపము గలదైన పృథివి వలన నేర్చిన గుణమును చెప్పుచున్నాడు శశ్వత్ అని. సర్వదా పరోపకారము కొరకు సర్వవాంఛము ఎవనికోవాడు. పరోపకారము కొరకే ముఖ్యముగ పుట్టుక ఎవనికోవాడు. భూభృత్తః - పర్వతము నుండి. పర్వతము నుండి జనించిన చెట్లు పొదలు తీగలు గరిక సెలయేళ్ళు నీటి ప్రవాహాలు మొదలయినవి పరోపకారమునకు ఉన్నవో అట్లే పర్వతము వలన పరోపకారమును - వృక్షమునకు శిష్యుడై పరాధీనతను వృక్షము ఖండించినను పెళ్ళగించినను కొనిపోయినను అనుమతించి పరాధీనమైయుండునట్లు వృక్షము (పృథ్వీరూప) నుండి పరాధీనతను సాధుపురుషుడు నేర్వవలెను. అట్లే నేను నేర్చితినని భావము. (38)

39. శ్లో॥ ప్రాణవృత్త్యైవ సంతుష్యేత్ మునిర్నైవేంద్రియప్రియైః ।
జ్ఞానం యథా న నశ్యేత నావకీర్యేత వాఙ్మనః ॥

టీ:- వాయురపి ద్వివిధః ప్రాణో బాహ్యశ్చ. తత్ర ప్రాణస్య గురుత్వమాహ ప్రాణవృత్త్యేతి. ప్రాణాహ్యాహారాదిమాత్రేణ ప్రవర్తతే. రూపరసాదీనింద్రియ విషయాంస్తు నాపేక్షతే తథా మునిరపిభవేదిత్యర్థః ప్రాణ వృత్తేరకరణే మనోవైకల్యేన జ్ఞాననాశః స్యాదతో దేహినిర్వాహః కర్తవ్యః. గుణ లిప్సాయాంతు వాఙ్మనశ్చ విక్షిప్యేత, అతో నాధికం లిప్సేదిత్యాహ-జ్ఞానమితి నావకీర్యేత్ - నవిక్షిప్యేత. (39)

తా:- ప్రాణజీవనమగు ఆహారాదికమును గ్రహించుట చేత సంతోషించవలెను. ఇంద్రియములకు ప్రియమైన రూపరసాదులచేత గాదు విషయములను అపేక్షించగూడదు. ఆ ప్రకారము ముని కావలెను. జ్ఞానము ఏప్రకారముగా నశించదో అనగా ప్రాణమునకు జీవనమునకు ఆహారాదికము లేకున్నచో మనో వైకల్యము గలిగి జ్ఞానము నశించును. అందువలన దేహ నిర్వహణము కర్తవ్యమగును ఏ ప్రకారము వాక్కు మనస్సు విక్షిప్తముకాదో అట్లు వర్తించవలెను. (39)

టీ:- వాయువు కూడా ప్రాణము, బాహ్యము అని ద్వివిధము. ఈ రెంటి యందు ప్రాణమునకు గురుత్వమును చెప్పుచున్నాడు ప్రాణవృత్యా అని. ప్రాణము ఆహారాదిమాత్రము చేత ప్రవర్తించును. ఇంద్రియములకు ప్రియములగురూప రసాదులనపేక్షించుట చేతగాదు. విషయములను అపేక్షించగూడదు. ఆ ప్రకారము ముని కూడా కావలెను అని అర్థము. ప్రాణమునకు జీవనమునకు ఆహారాదికము లేకున్నచో మనోవైకల్యము కలిగి జ్ఞానము నశించును. అందువలన దేహనిర్వహణ కర్తవ్యమగును. శ్రేష్ఠ మధురామ్లాది రసాపేక్షయందునో వాఙ్మనస్సులు విక్షేపమగును. అందుకని శబ్దాది గుణములయధిక వాంఛ కలిగినచో వాక్కును అట్లే వాని సంకల్ప వికల్పము లందు మనస్సు విక్షేపము పొందును. కావున అట్లు కాకుండ వర్తించవలెను. నావకీర్యేత - విక్షేపముకాదో. (39)

40. శ్లో॥ విషయేష్వావిశన్ యోగీ నానాధర్మేషు సర్వతః ।
గుణదోషవ్యపేతాత్మా న విషజ్జే వాయువత్ ॥

టీ :- విషయాన్సేవమానోऽపి తేష్వనాసక్తిం బాహ్యోద్వాయోః. శిక్షేదిత్యాహ - విషయేష్వితి. నానా ధర్మేషు. శీతోష్ణాదిధర్మకేషు. న హి వాయుర్వనే దహనే వా సజ్జేతే తద్వత్. (40)

తా:- యోగి అయినవాడు అంతటను నానా ధర్మములుగల విషయములందు ప్రవేశించువాడయ్యు మంచి, చెడ్డ అను గుణ, దోషములులేని చిత్తముగలవాడై వాయువువలె ఆసక్తుడు కాగూడదు. 40

టీ:- విషములను సేవించుచున్నవాడయ్యు వానియందనాసక్తిని, వాయువువలన నేర్వవలెనని చెప్పుచున్నాడు. విషయేషు అని. నానా ధర్మేషు - శీతోష్ణాది వివిధ ధర్మములుగల. వాయువు వనమునందు దహమునందు ఆసక్తుడుకాడు. (40)

41. శ్లో॥ పార్థివేష్విహ దేహేషు ప్రవిష్టస్తద్గుణాశ్రయః ।
గుణైర్న యుజ్యతే యోగీ గంధైర్వాయురివాత్మ దృక్ ॥

టీ:- యథా వాయుర్గంధాది ధర్మయోగేన ప్రతీయమానోऽపి వస్తుతో న తద్యోగీ, ఏవం దేహాది ధర్మయోగే నాహం ప్రత్యయేన ప్రతీయమానోప్యాత్మా న త ధర్మవానితి సంభావితమితి వాయోరేవశిక్షిత మిత్యాహ - పార్థివేష్వితి. తద్గుణాశ్రయో దేహధర్మాన్ బాల్యాదీనాశ్రిత్య వర్తమానో గుణైస్తైరేవ. (41)

తా:- ఈ జగమున పృథివ్యాది శరీరములందు ప్రవేశించినవాడై ఆ దేహ ధర్మములగు బాల్యాదుల నాశ్రయించి ఉండెడువాడయ్యును, ఆత్మను దర్శించు యోగి ఆ దేహ ధర్మములతో గంధాది గుణములతో వాయువువలె కూడికొనడు. అను గుణము వాయువువలన నేర్చితిని. 41

టీ:- ఏ ప్రకారము వాయువు గంధాది ధర్మయోగమున తోచుచున్ననూ వాస్తవముగా కూడుకొనునది ఎట్లు కానేరదో, ఈ ప్రకారము దేహాది ధర్మ యోగముచే అహం ప్రత్యయముతో దేహమే నేనను భావముతో తోచుచున్న వాడైనను ఆత్మ దేహాదిధర్మములు కలవాడుకాడు. అని సంభావితమయిన దానిని వాయువు వలన నేర్చితినని చెప్పుచున్నారు పార్థివేషు అని. తద్గుణాశ్రయోః ఆ దేహ ధర్మములగు బాల్యాదుల నాశ్రయించి ఉండెడి వాడయ్యు ఆ గుణములతోడనే. (41)

42. శ్లో॥ అంతర్హితశ్చ స్థిరజంగమేషు
బ్రహ్మాత్మభావేన సమన్వయేన ।
వ్యాప్త్యావ్యవచ్ఛేదమసంగమాత్మనో
మునిర్నభస్త్వం వితతస్య భావయేత్ ॥

తా:- ముని దేహాదికముతో కూడినవాడయ్యు తనకు దేహాదికముతో సంగముకాని, పరిచ్ఛేదముగాని లేదని భావించవలెను. ఎట్లనగా స్థావరజంగమ ప్రాణులందు కూడినదై వ్యాపించినదైయున్న బ్రహ్మ స్వరూపమును. "తత్త్వమసి" అనుమహా వాక్యము యొక్క అర్థమును భావించుట ద్వారా సర్వగతుడయిన ఆత్మకు దేహాది సంగము, పరిచ్ఛేదము ఎట్లు లేదో అట్లు లేదని భావించవలెను. ఇట్లు ఆకాశము వలన అసంగము, అపరిచ్ఛేదము అనువానిని నేర్చితిని అని. (42)

టీ:- ఆకాశాచ్ఛిక్షితం సంభావనా ద్వయమాహ - అంతర్హితశ్చేతి ద్వయేన. అంతర్హితశ్చ దేహాంతర్గతోపి మునిరాత్మనో దేహాద్య సంగమత ఏవావ్య వచ్ఛేదం చ భావయేత్. కుతః, స్థిర జంగమేషు సమన్వయేన యా వ్యాప్తిస్తయా. కిం మణిషు సూత్రస్యేవ వ్యాప్తిః , న వితతస్య సర్వగతస్య తత్కృతః. బ్రహ్మాత్మభావేన బ్రహ్మస్వరూప భావనయా "తత్త్వమసి" ఇతి శృతేః. నన్వేతత్పుర్వంకథం సంభవతి తత్రాహి - నభస్త్వం తత్తుల్యత్వం భావయేత్. యథా నభసః సర్వగతస్య న ఘటాదిభిః సంగః పరిచ్ఛేదో వా ఏవమాత్మనోऽపి సంభవతీతి. (42)

టీ:- ఆకాశము వలన నేర్చిన సంభావ ద్వయమును చెప్పుచున్నాడు అంతర్హితశ్చే అనెడి రెండు శ్లోకములతో. అంతర్హితశ్చ దేహాంతర్గతుడైనను. ముని ఆత్మకు దేహాద్యసంగమును అందుకనియే అపరిచ్ఛిన్నత్వ మును భావించవలెను. ఎందులకనగా; స్థావర, జంగమ ప్రాణుల యందు సమన్వయమగు (వ్యాప్త్యా) ఏ వ్యాప్తి గలదో దానిచే వ్యాపించుటచే మణుల యందు సూత్రమువలె చొచ్చియుండు వ్యాప్తియా అనినకాదు, వితతస్య సర్వగతుడయిన, అది యెట్లు బ్రహ్మాత్మభావేన బ్రహ్మస్వరూపమును భావించుటచే "తత్త్వమసి" ఆ యాత్మ నీవై యున్నావు. అను శృతి వలన, ఓయీ! ఇది యంతయు ఎట్లు సంభవించుననగా చెప్పుచున్నారు నభస్త్వం ఆకాశసామ్యమును భావించవలెను. ఏ విధముగా ఆకాశమునకు ఘటాదులతో సంగము పరిచ్ఛేదము గాని కాదో ఆ ప్రకారము ఆత్మకును సంభవించదని. (42)

43. శ్లో॥ తేజోऽబన్నమయైర్భావైః మేఘాద్యైర్వాయునేరితైః ।
న స్పృశ్యతే నభస్తద్వత్ కాలసృష్టైర్గుణైః పుమాన్ ॥

తా:- వాయువు చేత ప్రేరేపించబడినవైన మేఘాదులచే ఆకాశమెట్లు స్పృశించబడదో, అట్లే కాలముచే సృజించబడినవైన అగ్ని, జలము, పృథివి మొదలయినవి భూతములచే రూపొందిన దేహాదులచే పురుషుడు, ఆత్మ స్పృశింపబడదు అని ఆకాశమువలన నేర్చినాను. (43)

టీ:- కించ కూటస్థ స్యాత్మనో నాగమాపాయిదేహాది సంబంధ ఇత్యాహ - తేజోబన్నమయైః తేజశ్చ ఆపశ్చాన్నం పృథివీచతన్మయైః కాలసృష్టైర్గుణై ర్దేహాదిభిః పుమాన్నస్పృశ్యత ఇతి న భావధ్వం భవతీతి. (43)

టీ:- మరియు కూటస్థుడైన ఆత్మకు ఆగమాపాయి (రాకపోకలు) యగు దేహాదుల సంబంధము లేదని చెప్పుచున్నాడు తేజోబన్నమయైః అని అగ్ని, జలము, పృథ్వి అనువాని స్వరూపములైన, కాలముచేత సృజించబడిన గుణముల చేత దేహాదికములచేతను పురుషుడు స్పృశించబడు అని, ఆకాశమువలె నుంటున్నాడని ఆకాశము వలన నేర్చితిని. (43)

44. శ్లో॥ స్వచ్ఛః ప్రకృతితస్స్నిగ్ధో మాధుర్యస్తీర్థభూర్నృణాం ।
మునిః పునాత్యపాం మిత్రం ఈక్షాస్పర్శనకీర్తనైః ॥

తా:- నిర్మలుడు స్వభావము వలన జనులందు అనురాగము కలవాడు మధురభాషణుడు, నరులకు తీర్థస్థానము, ఉదకతుల్యుడు అగు ముని దర్శన, స్పర్శన, కీర్తనములచేత అందరినీ పవిత్రము చేయుచున్నాడు. ఇట్టి గుణమును ఉదకము నుండి నేర్చితిని. (44)

టీ:- స్వచ్ఛత్వాదిభిర్గుణైరుదకంజత్పునాతీతి తద్గుణామయా శిక్షితా ఇత్యాహ- స్వేచ్ఛా నిర్మలః ప్రకృతితః స్వభావతః. స్నిగ్ధోజనేష్వను

టీ:- స్వచ్ఛత్వాది గుణములచేత ఉదకము జగత్తును పవిత్రము చేయుచున్నది. ఆ గుణములు నేను నేర్చితినని చెప్పుచున్నాడు. స్వచ్ఛః

రాగవాన్ మాధుర్యో మధురాలాపీ. తీర్థభూస్తీర్థస్థానమ్. అపాం మిత్ర ముదకతుల్యః అఘాదితిపాఠే సఖాయం పాపాత్పునాతి. స్వచ్ఛత్వాది గుణైరర్థాదుదకసాదృశ్యం జ్ఞాతవ్యమ్. (44)

అని, నిర్మలుడు, ప్రకృతితః స్వభావము వలన, స్నిగ్ధః జనులందు అనురాగము కలవాడు. మాధుర్యః మధురభాషణుడు. తీర్థభూః తీర్థస్థానము. అపాం మిత్రం ఉదకతుల్యుడు. అఘాత్ మిత్రం అనెడి పాఠమునుబట్టి పాపము నుండి సఖుని పవిత్రుని చేయును. స్వచ్ఛత్వాది గుణములచే ఉదకసాదృశ్యము (వున్నదని) తెలియవలెను.(44)

45.శ్లో॥ తేజస్వీ తపసా దీప్తో దుర్ధర్షోదరభాజనః ।
సర్వభక్షోऽపి యుక్తాత్మా నాదత్తే మలమగ్నివత్ ॥

తా:- జ్ఞానాతిశయముచే తేజము గలవాడు విశేషించి తపస్సుచే జ్వలించువాడు, ఉదరము పాత్ర గలవాడు అన్నింటిని భక్షించువాడైనను యోగ్యమైన చిత్తము కలవాడైన ముని. అగ్నివలె కాలుష్యమును పాపమును వాని నుండి పొందదు ఇట్లు అగ్ని వలన నీ గుణములు నేర్చితిని. (45)

టీ:- అగ్నేః శిక్షితమాహ - తేజస్వీతి. జ్ఞానాతిశయాత్. విశేషతస్తపసా దీప్తః. దుర్ధర్షోऽక్షోభ్యః సచాసావుదర భాజనశ్చాపదిగ్రహః యుక్తాత్మా మునిః. (45)

టీ:- అగ్ని వలన నేర్చికొనిన దానిని చెప్పుచున్నాడు తేజస్వీ అని. జ్ఞానాతిశయము వలన తేజము గలవాడు, విశేషించి తపస్సుచే జ్వలించువాడు ఇతరులకు సమీపింపరాక, ఉదరము పాత్రము కాగలవాడు. అపరిగ్రహుడు యుక్తచిత్తుడై ముని.(ఏ పాపమును ఎవ్వని నుండి గ్రహింపడు) (45)

46.శ్లో॥ క్వచిచ్ఛన్నః క్వచిత్ స్పృష్టః ఉపాస్యశ్శ్రేయ ఇచ్ఛతామ్ ।
భుజ్క్తే సర్వత్ర దాతౄణాం దహన్ ప్రాగుత్తరాశుభమ్ ॥

టీ:- అగ్నేరేవ శిక్షాంతరమాహ క్వచిదితి. యథాగ్నిః పరేచ్ఛయైవ హవిర్భుఙ్క్తే తథా మునిరిత్యాహ - దాతౄణామితి. ప్రాగుత్తరాశుభం భూతం భవిష్యచ్చపాపం. (46)

తా:- ఒక్కచోట బూడిద మొదలయిన వానిచే కప్పబడినవాడు ఒకచో ప్రకాశించుచూ శ్రేయస్సును కోరువారికి ఉపాసించదగినవాడై యజ్ఞములందు హవిస్సునిచ్చుయజమానుల యొక్క సంచితము కాల్చుచు యజ్ఞయాగాది క్రియలయందెల్ల భుజించుచున్నాడు.(46)

టీ:- అగ్ని వలననే నేర్చిన వేరొక ఉపదేశమును చెప్పుచున్నాడు। క్వచిత్తని ఏ ప్రకారము అగ్ని పరుల ఇచ్ఛచేతనే హవిస్సును గ్రహించునో అట్లే మునియు అని చెప్పుచున్నాడు. దాతౄణామని ప్రాగుత్తరాశుభం - భూత భవిష్యత్తుల పాపము. (46)

47.శ్లో॥ స్వమాయయా సృష్టమిదం సదసల్లక్షణం విభుః ।
ప్రవిష్ట ఈయతే తత్తత్సరూపోఽగ్నిరివైధసి ॥

టీ:- ఆత్మనో దేహోపాధికమేవోచ్చనీచత్వాది నస్వాభావికమిత్యప్యగ్ని దృష్టాంతేన సంభావిత మిత్యాహ - స్వమాయయా స్వావిద్యయా సృష్టం సదసల్లక్షణం దేవతిర్యగాది రూపం విప్రశూద్రాది రూపం వా. (47)

తా:- పరమేశ్వరుడు తనమాయచే సృష్టించబడిన ఈ దేవతిర్యగాది రూపమును ప్రవేశించినవాడై ఆ దేహాదికము నందు కట్టెయందు అగ్నివలె ఆ అగ్నితో సమానమగు రూపముగలవాడై చూపట్టుచున్నాడు. (47)

టీ:- ఆత్మకు దేహోపాధికమునుబట్టియే ఉచ్చనీచత్వాదికము కనబడును కాని స్వాభావికము కాదని యగ్ని దృష్టాంతముచే చెప్పుచున్నారు. స్వమాయయా-తన మాయచే తన యవిద్యచే సృష్టించబడిన సదస్లక్షణం దేవతిర్యగాది రూపమును లేక విప్రశూద్రాది రూపమును. (47)

48. శ్లో॥ విసర్గాద్యాశ్మశానాంతాః భావా దేహస్య నాత్మనః ।
కళానామివ చంద్రస్య కాలేనావ్యక్తవర్త్మనా ॥

తా:- జన్మించుట, వృద్ధిపొందుట మొదలయిన స్మశానము వరకు గల ధర్మములు తెలియరాని గతిగల కాలముచే చంద్రునికి కళలయొక్క వృద్ధి, క్షయములవలె, దేహమునకు మాత్రము కలుగును కాని ఆత్మకు కలుగవు. (48)

టీ:- ఆత్మనో జన్మాది షడ్వికారాభావశ్చంద్ర దృష్టాన్తేన సంభావిత ఇత్యాహ - విసర్గాద్యా ఇతి. విసర్గోజన్మ శ్మశానంనాశః. తత్రేయం జ్యోతిశ్శాస్త్ర ప్రక్రియా. ఆప్యమండలం చంద్రస్తేజోమయం మండల మాదిత్యః తయోరేక నక్షత్రావస్థానే చంద్రోన దృశ్యతే, చక్షుష అదిత్య మండలేన సమదేశస్థితేన వ్యవధానాత్, సా అమావాస్యా. అథ షష్టి ఘటికాభిశ్చంద్రో నక్షత్రాంతరం గచ్ఛతి. ఆదిత్యస్తు త్రయోదశభి రహో రాత్రైః. అతః ప్రతి పదమారభ్య విషయస్థితస్యాదిత్య మండలస్య పంచదశః పంచదశోభాగః ఆప్యమండలే ప్రతిబింబితో దృశ్యతే సాకలేత్యుచ్యతే. ఏవం పంచదశేహ్ని. త్రయోదశభిర్నక్షత్రైరంతరమితి రాశిచక్రస్య సప్తవింశతి నక్షత్రాత్మకస్య మధ్యే సంముఖౌచంద్రాదిత్యౌ తిష్ఠతః తదా సంపూర్ణం ప్రతిబింబం భూచ్ఛాయా లాంఛితం దృశ్యతే, సా పౌర్ణిమా. తస్యామమావాస్యా ప్రతిబింబేన సహ షోడశకలశ్చంద్ర ఉపచర్యతే. తతః పునః ప్రతిపదమారభ్యమండల యోర్ద్విషమీ భావా త్కలా హ్రాసః. తత్ర యథా కలానామేవోత్పత్త్యాదయో నాప్య మండలస్య తథాత్మనో పీత్యాహ కలానామివేతి. (48)

టీ:- ఆత్మకు జన్మాది షడ్వికారాభాసము చంద్రదృష్టాన్తముచే సంభావింపబడినదనుచున్నాడు విసర్గాద్యా అని. విసర్గః జన్మము, శ్మశానము నాశము. ఆత్మకు సంబంధించిన, భూతానాం- దేహములకు అని యర్థము. అర్చిషాం - మంటలకు. ఇక్కడ జ్యోతిశ్శాస్త్ర ప్రక్రియ ఈ విధముగా వున్నది. ఆప్యమండలము (జలమయుడు) చంద్రుడు, తేజోమండలము సూర్యుడు, ఒక్క నక్షత్రస్థానమున వున్నప్పుడు చంద్రుడు కనపడడు. కంటికి సమదేశస్థితమయిన ఆదిత్యమండలముచే వ్యవధానము (అడ్డముగా వుండుట) సంభవించుట చంద్రుడు కన్నులకు కనపడడు. అట్లు వారిరువురి ఏక నక్షత్ర స్థితి గలది అమావాస్య యగును. మరియు అరవై ఘడియల కాలములో చంద్రుడొక నక్షత్రము నుండి మరి యొక్క నక్షత్రమును చేరును. సూర్యుడైతే పదమూడహో రాత్రములు కాలముచే ఒక నక్షత్రము నుండి ఇంకొక నక్షత్రమును చేరును. అందువలన శుక్ల ప్రతిపత్తు మొదలు విషమ స్థితి గల సూర్యమండలము యొక్క పదిహేనవ భాగము ఆప్యమండలమగు

చంద్రమండల మందు ప్రతిబింబితమై కన్పడును. ఆదృశ్యభాగము కళ అని చెప్పబడును. ఈ ప్రకారము పదిహేనవ దినము పదమూడు నక్షత్రములచే అంతరము (ఎడమ) ఏర్పడును ఇరువైఏడు నక్షత్రము లతో కూడిన రాశి చక్ర మధ్యభాగమునందు ఎదురెదురుగా సూర్య చంద్రులెప్పుడుండెదరో అప్పుడు చంద్రమండలము సూర్యుని పరిపూర్ణ ప్రతిబింబము కలదై భూచ్ఛాయాలాంఛితమై (కళంకము-మచ్చ) కన్పడుచున్నది. ఆ దినము పూర్ణిమ ఆ పూర్ణిమయందు సంపూర్ణ ప్రతి బింబముచే షోడశకళా పూర్ణుడై చంద్రుడు కనబడును. తరువాత మళ్ళీ కృష్ణ పక్షము ప్రతిపత్తు ఆరంభించి చంద్రసూర్య మండలముల యొక్క విషమ గతి ధర్మము వలన ఆ కళలు తగ్గుట సంభవించును. అందే ప్రకారము కళలకు మాత్రమే ఉత్పత్తి హ్రాసములు కలుగును కాని ఆప్యమండలము అగు చంద్రునికి కలుగవో ఆ ప్రకారము జన్మనాశాదులు దేహమునకే గాని ఆత్మకు లేవని కలానాయని చెప్పుచున్నాడు. (48)

49.శ్లో॥ కాలేన హ్యోఘవేగేన భూతానాం ప్రభవాప్యయౌ ।
నిత్యావపి న దృశ్యేతే హ్యాత్మనోఽగ్నేర్యథార్చిషామ్ ॥

తా:- ప్రవాహము వంటి వేగము గల కాలముచేత జన్మ నాశములు నిత్యములే అయిననూ, దేహములకు సంబంధించినవే ఆత్మకు సంబంధించినవి కావు. ఎట్లానో, అగ్నికి సంబంధించిన మంటలకే ఉత్తత్తి వినాశములు కనపడునో అగ్నికి కావో (అట్లు).(49)

టీ:- సింహావలోకనేనాగ్ని దృష్టాన్తేనైవ దేహానాం క్షణ భంగురం తయా వైరాగ్యం శిక్షితమిత్యాహ - కాలేనేతి. ఓఘవద్వేగో యస్య తేన. ఆత్మనః సంబంధినాం భూతానం దేహానామిత్యర్థః. అర్చిషాం జ్వాలానాం. (49)

టీ:- సింహావలోకనము చేత అగ్ని దృష్టాంతము చేతనే దేహములు క్షణభంగురములని వైరాగ్య విషయమున శిక్షితుడైనాననియనుచున్నాడు కాలేన అని ప్రవాహము వంటి వేగము గల. (49).

50. శ్లో॥ గుణైర్గుణానుపాదత్తే యథా కాలం విముంచతి ।
న తేషు యుజ్యతే యోగీ గోభిర్గా ఇవ గోపతిః ॥

తా:- ముని గుణములగు ఇంద్రియములచే శబ్దాది విషయములను గ్రహించును. కాలానుగుణముగా అర్థి వచ్చి యాచించినంతనే ధనాదికమును వదులుచున్నాడు కిరణములచే గ్రహించబడిన జలములను సూర్యుని వలె ఆ విషయములందు అభినివేశమును చేయడు. (50)

టీ:- ఆదిత్యాచ్ఛిక్షితమాహ ద్వయేన-గుణైరితి. (గుణైంద్రియైర్గుణాన్విషయానుపాదత్తే యథా కాలమర్థిన్యా గతే సతి విముంచతి చ, న తేషు యుజ్యతే లబ్ధమితి దత్తమితివాऽభినివేశం న కరోతి. గోభీరశ్మిభిర్గాః జలాని గోపతిః సూర్యో యథా. (50)

టీ:- ఆదిత్యుని వలన శిక్షితమును చెప్పుచున్నాడు రెండు శ్లోకములచే గుణైః అని. గుణైః ఇంద్రియములచే గుణాన్ = శబ్దాది విషయములను ఉపాదత్తేః గ్రహించును. కాలానుగుణముగా అర్థి - వచ్చి యాచించినంతనే అభినివేశమును చేయడు. గోభిః కిరణములచే గాః జలములను. గోపతి = సూర్యుడు. (50)

51. శ్లో॥ బుధ్యతే స్వేన భేదేన వ్యక్తిస్థ ఇవ తద్గతః ।
లక్ష్యతే స్థూలమతిభిః ఆత్మా చావస్థితోऽర్కవత్ ॥

తా:- స్వస్వరూపమునందున్న ఆత్మ భేదముతో అవగతుడుకాడు ఉపాధిలో ప్రతిబింబించిన వస్తువు ఉపాధి ప్రవిష్టమైనట్లు ఆత్మ, మంద బుద్ధులచే నీటిలోనున్న సూర్యునివలె భేదముతో చూడబడుచున్నది. 51

టీ:- స్వతో భేద శూన్యస్యాప్యాత్మనో భేదప్రతీతి రూపాధివశాదిత్యాది దృష్టాంతేనైవ సంభావితమిత్యాహ బుధ్యత ఇతి. స్వేస్వస్వరూపే ऽవస్థిత ఆత్మా భేదేన న బుధ్యతే. అభివ్యనక్తీతి వ్యక్తిరుపాధిః. వ్యక్తిస్థ ఉపాధౌ ప్రతిబింబితస్తు తద్గత ఇవ ఉపాధి ప్రవిష్టఇవ భేదేన స్థూలమతిభిర్లక్ష్యతే. అర్కవదిత్యన్వయః. (51)

టీ:- ఆత్మ స్వయముగా భేదరహితుడయిననూ భేదప్రతీతి ఉపాధి వశమున కలుగుచున్నదని ఆదిత్య దృష్టాంతము చేతనే సంభావించ బడినదని చెప్పుచున్నారు. బుధ్యతే అని. స్వే - స్వస్వరూపమునందున్న ఆత్మ భేదముతో అవగతుడు కాడు భిన్నుడుకాడు. అభివ్యనక్తీ అని వ్యక్తి ఉపాధి. వ్యక్తియందున్న ఉపాధి యందు ప్రతిబింబితుడై ప్రవేశించిన వాడివలె ఉపాధియందు ప్రవేశించిన వానివలె భేదముతో స్థూలమతిభిః=మందమతులతో చూడబడుచున్నది. (51)

52.శ్లో॥ నాతిస్నేహః ప్రసంగో వా కర్తవ్యః క్వాऽపి కేన చిత్ ।
కుర్వన్ విందేత సంతాపం కపోత ఇవ దీనధీః ॥

తా:- ఎవ్వరితోగాని, ఎప్పుడు గాని అతి స్నేహము, లాలించుట మొదలయిన వాటిలో ఆసక్తి కనబర్చకూడదు. అట్లుగాక స్నేహాదికము చేయుటచో పావురమువలె దీనమైన మనస్సు గలవాడై వ్యథను పొందును. (52)

టీ:- కపోతాచ్ఛిక్షితమాహ - నాతిస్నేహ ఇతి స్నేహః ప్రీతి. ప్రసంగ - ఉపలాలనాద్యాసక్తిః. (52)

టీ:- కపోతము వలన తాను నేర్చినది చెప్పుచున్నాడు నాతి స్నేహ అని. స్నేహ - ప్రీతి, ప్రసంగః - ఉపలాలనము మొదలయిన ఆసక్తి. 52

53.శ్లో॥ కపోతః కశ్చనారణ్యే కృతనీడో వనస్పతౌ ।
కపోత్యా భార్యయా సార్ధం ఉవాస కతిచిత్సమాః ॥

తా:- ఒక పావురము అడవి యందు మర్రిచెట్టుపై గూడు కట్టుకొని తన భార్యయగు ఆడు పావురముతో కూడి కొన్నేండ్లు నివసించెను. (53)

టీ:- దృష్టాంతం ప్రపంచయతి - కపోతః కశ్చనేతి. (53)

టీ:- దృష్టాంతమును ప్రపంచించుచున్నాడు కపోతః కశ్చన అని. (53)

54.శ్లో॥ కపోతౌ స్నేహగుణితహృదయౌ గృహధర్మిణౌ ।
దృష్టి దృష్ట్యాంగమంగేన బుద్ధిం బుద్ధ్యా బబంధతుః ॥

తా:- పావురములు రెండును పరస్పరము స్నేహముచే పెంపొందిన మనస్సు కలవై సంసార ధర్మమునుచేపట్టి చూపులను చూపుతో, శరీరమును శరీరముతో బుద్ధిని బుద్ధితో బంధించినవయ్యెను.(54)

టీ:- తయోర్మిథః స్నేహ ప్రసంగౌదర్శయతి కపోతావితి త్రయేణ. స్నేహేన గుణితం బద్ధం హృదయం యయోస్తౌ. (54)

టీ:- వాని పరస్పర స్నేహ ప్రసంగమును చూపుచున్నాడు కపోతౌ అని స్నేహముతో పెంపబడిన మనస్సు గలవై వేటికో అవి. (54)

55.శ్లో॥ శయ్యాటనాటనస్థానవార్తాక్రీడాశనాదికమ్ ।
మిథునీభూయ విస్రబ్ధౌ చేరతుర్వనరాజిషు ॥

తా:- పండుట, కూర్చుండుట, సంచరించుట, నివాసముండుట, వార్తలు చెప్పుకొనుట, విహరించుట, భుజించుట మొదలయిన క్రియలయందు పరస్పరము కలిసిమెలిసివుంటూ జంకులేనివై అరణ్య సీమలయందు సంచరించినవి.(55)

టీ:- విస్రబ్ధౌ = నిఃశంకౌ. (55)

టీ:- విస్రబ్ధౌః శంకలేనివై జంకులేనివై.(55)

56.శ్లో॥ యం యం వాంఛతి సా రాజన్ తర్పయంత్యనుకంపితా ।
తం తం సమానయత్కామం కృచ్ఛ్రేణాప్యజితేంద్రియః ॥

తా:- ఓ రాజా! ఆ యాడ పావురము నవ్వుతో కూడిన చూపు తనపై ప్రేమచూపుచున్నదై దేనిదేనిని గోరుచున్నాదో ఇంద్రియములను గెలువలేని ఆ మగపావురము చాలా కష్టపడియైనా తన భార్యకు ఆయా కోరికలను సంపాదించి తెచ్చెను.(56)

టీ:- సా కపోతీ తర్పయంతీ సహాసవీక్షితాలాపాదిభిః ప్రీణయన్నృత ఏవ తేనానుకంపితా సతీ యం యం వాంఛతి తం తం కామం సమనయత్సం పాదయామాస. రాజన్నితి త్వం యథేతి సూచితం. (56,57)

టీ:- ఆ యాడ పావురము నవ్వుతో కూడిన చూపు, సంభాషణలతో సంతోషపరుచుచున్నది. అందుకనియే దయచూపబడినదై ఏది యేది కోరునో ఆయా వాంఛితమును సంపాదించి ఇచ్చెను. రాజన్నని అనుట వలన నీ వలెనే అని సూచింపబడినది.(56,57)

57.శ్లో॥ కపోతి ప్రథమం గర్భం గృహ్ణతీ కాల ఆగతే ।
అండాని సుషువే నీడే స్వపత్యుస్సన్నిధౌ సతీ ॥

తా:- ఆ యాడ పావురము మొదట గర్భమును దాల్చి ప్రసవకాలము రాగానే తన భర్త సమ్ముఖాన గూటి యందు కొన్ని గ్రుడ్లు పెట్టెను.(57)

58.శ్లో॥ తేషు కాలే వ్యజాయంత రచితావయవా హరేః ।
శక్తిభిర్దుర్విభావ్యాభిః కోమలాంగతనూరుహాః ॥

తా:- జలముతో నిండిన ఆ అండములందు కొంతకాలము గడచినంతనే శ్రీహరి యొక్క ఊహింపశక్యము కానట్టి కాలకర్మ స్వభావాదులచే నిర్మితములయిన, పాదములు, రెక్కలు మొదలయిన అవయవములు కలవి, మృదువులయిన శరీరములు రోమముల కల పిల్లలు పుట్టిరి.(58)

టీ:- తేషు జలభరితేష్వండేషు హరేః స్వభావకర్మాది శక్తి భీరచితా వయవాః పక్షిణః. కోమలాన్యంగాని తనూరుహాశ్చ యేషాం తే.(58,59)

టీ:- జలముతో నిండిన ఆ యండముల యందు శ్రీహరి యొక్క స్వభావ కర్మాది శక్తులచే రచింపబడిన అవయవములు గల పక్షులు. కోమలములయిన శరీరములు రోమములుఎవరికో వారి. (58,59)

59.శ్లో॥ ప్రజాః పుపుషతుః ప్రీతః దంపతీ పుత్రవత్సలౌ ।
శృణ్వంతౌ కూజితం తాసాం వివృతౌ కలభాషితైః ॥

తా:- సంతోషము గల ఆ పావురములు తమ సంతతి యందు ప్రేమగలవై అవ్యక్తమధురమైన పలుకులతో ఆ పిల్లల కూతలను వింటూ విప్పారిన హృదయము కలవై తమ బిడ్డలను పోషించినవి. (59)

60.శ్లో॥ తాసాం పతత్రైస్సుస్పర్శైః కూజితైర్ముగ్ధచేష్టితైః ।
ప్రత్యుద్గమైరదీనానాం పితరౌ ముదమాపతుః ॥

తా:- హర్షమును పొందిన ఆ పిల్లల యొక్క మెత్తనయిన రెక్కల చేత ఆ పిల్లల అందమైన చేష్టలచే కూతల చేతనూ ఎదుర్కొని ఎగురుట చేతనూ తల్లిదండ్రులయిన ఆ పావురములు సంతోషమును పొందినవి. (60)

టీ:- పతత్రైః - పక్షైః. అదీనానాం - హృష్టానాం. (60)

టీ:- పతత్రైః రెక్కలచేత, ఆదీనానాం - హర్షమును పొందిన.(60)

61.శ్లో॥ స్నేహానుబద్ధహృదయౌ అన్యోన్యం విష్ణుమాయయా ।
విమోహితౌ దీనధియౌ శిశూన్ పుపుషతుః ప్రజాః ॥

తా:- విష్ణుమాయచే పరస్పరము స్నేహముతో కూడుకొన్న మనస్సు కలవై కృపతో కూడినవై చాలా మోహమును పొందినవై చిన్నవైన తమ పిల్లలను పోషించినవి. (61)

టీ:- శిశూన్బాలాన్. ప్రజాః పుత్రాన్. (61,62)

టీ:- శిశూన్ చిన్నదైన, ప్రజా తమ పిల్లలను.(61,62)

62.శ్లో॥ ఏకదా జగ్మతుస్తాసాం అన్నార్థే తౌ కుటుంబినౌ ।
పరితః కాననే తస్మిన్నర్థినౌ చేరతుశ్చిరమ్ ॥

తా:- సంతానము కలవైన ఆ పావురములు ఒకనాడు తమ పిల్లల ఆహారము సంపాదింపగోరి ఆ అడవి యందు చాలా కాలము చరించినవి. (62)

63.శ్లో॥ దృష్ట్వా తాన్ లుబ్ధకః కశ్చిద్యదృచ్ఛాతో వనేచరః ।
జగృహే జాలమాతత్య చరతస్స్వాలయాంతికే ॥

తా:- ఒక బోయవాడు అడవి తిరుగుతూ తమగూటి చెంత సంచరించుచున్న ఆ పక్షి పిల్లలను చూచి వలపన్ని వానిని పట్టుకొనెను. (63)

టీ:- స్వాలయాన్తికే చరతః క్రీడతః తాన్కపోతపుత్రాన్. ఆతత్య ః ప్రసార్య. (63)

టీ:- తనగూటి చెంత ఆడుతున్న ఆ పక్షి పిల్లలను, ఆతత్య - వలపన్ని (ప్రసరించి) (63)

64.శ్లో॥ కపోతశ్చ కపోతీ చ ప్రజాపోషే సదోత్సుకౌ ।
గతౌ పోషణమాదాయ స్వనీడముపజగ్మతుః ॥

తా:- ఆ మగ పావురము, ఆ పావురము తమ బిడ్డల పోషణమున ఎప్పుడూ ఉత్సాహముగలవై, పోయి ఆహారాన్ని సంపాదించుకొని తమ గూటికి చేరినవి. (64)

టీ:- ఉత్సుకత్వాదేవతత్పోషణార్థం గతౌసంతౌ. పోషణం భక్ష్యం. (64,65)

టీ:- ఉత్సాహము కలవియై యుండుటచేతనే ఆహారమునకు వెళ్ళినవియై, పోషణం - భక్ష్యము. (64,65)

65.శ్లో॥ కపోతీ స్వాత్మజాన్ వీక్ష్య బాలకాన్ జాలసంవృతాన్ ।
తానభ్యధావత్క్రోశంతీ క్రోశతో భృశదుఃఖితాన్ ॥

తా:- ఆడ పావురము వలలో తగులుకొన్న తన చిన్న కుమారులను చూచి అయ్యో అని అరుస్తూ చాలా దుఃఖమును పొంది కూయుచున్న ఆ పిల్లలను వెంబడించి పరుగుపెట్టెను. (65)

66.శ్లో॥ సా సకృత్స్నేహ గుణితా దీనచిత్తాజ మాయయా ।
స్వయం చా బధ్య శిచా బద్ధాన్పశ్యన్త్యపస్మృతిః ॥

తా:- ఆ యాడ పావురము విష్ణుమాయచే, మరిమరీ స్నేహమున కట్టుబడి దిగులు చెందిన మనస్సుకలదై బంధింపబడిన తన శిశువులను చూచుచూ, మరుపునొందినదై తానునూ వలచే బంధింప బడినది. (66)

టీ:- శిచా - జాలేన (66)

టీ:- శిచా = వలతో.(66)

67.శ్లో॥ కపోతశ్చాత్మజాన్ బంధాన్ ఆత్మనోఽభ్యధికాన్ ప్రియాన్ ।
భార్యాం చాత్మసమాం దీనో విలలాపాతి దుఃఖితః ॥

తా:- ఆ మగ పావురము తనకు ప్రాణాధిక ప్రియులయిన తన పుత్రులను ప్రాణసమానమగు తన కనురూపయయిన భార్యను కూడా చూచి దిగులొంది చాలా దుఃఖము పొందినదై ఏడ్చెను.(67)

టీ:- ఆత్మాను రూపాం భార్యా చ విలలాప శుశోచ.(67)

టీ:- తనకు అను రూపవతియయిన భార్యను గూర్చి ఏడ్చెను.(67)

68.శ్లో॥ అహో మే పశ్యతాపాయం అల్పపుణ్యస్య దుర్మతేః ।
అతృప్తస్యాకృతార్థస్య గృహస్త్రైవర్గికో హతః ॥

తా:- అయ్యో ఏమి నా దురదృష్టము తక్కువ పుణ్యము కలిగి విషయాసక్త మగు బుద్ధి కలిగి దుష్టమగు సుఖమున తృప్తిచెందనట్టి అదృష్టమగు పరలోక సుఖము సంపాదించనట్టి నా యొక్క కష్టమును చూడండి త్రివర్గ సాధనోపయోనియగు గృహస్థాశ్రమము నశించినది. 68

టీ:- విలాపమహ త్రయేణ -అహో ఇతి. అతృప్తస్య దుష్టసుఖే. అకృతార్థస్యాదృష్టమసంపాదయతః. (68- 70)

టీ:- విలాపమును మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు అహో అని అతృప్తస్య - దృష్టమగు సుఖమున తృప్తి చెందనట్టి, అకృతార్థస్య - అదృష్టమగు పరలోకసుఖమును సంపాదించనట్టి. (68-70)

69.శ్లో॥ అనురూపానుకూలా చ యస్య మే పతిదేవతా ।
శూన్యే గృహేమాం సంత్యజ్య పుత్రైస్స్వర్యాతి సాధుభిః ॥

తా:- నాకనురూపయై అనుకూలవతి పతియే దైవముగా భావించునా భార్య ఈ శూన్య గృహమునందు నన్ను విడిచి ప్రియమైన తన కొడుకులతో స్వర్గమునకు పోవుచున్నది.(69)

70.శ్లో॥ సోऽహం శూన్యే గృహే దీనో మృతదారో మృతప్రజః ।
జిజీవిషే కిమర్థం వా విధురో దుఃఖజీవితః ॥

తా:- నేనీ శూన్య గృహమునందు, దిక్కులేక భార్యాపుత్రులను కోల్పోయి విధురుడనై, దుఃఖమయ జీవితముగలవాడనై, ఏ సౌఖ్యము కొరకు జీవింపగోరుదును. (70)

71.శ్లో॥ తాంస్తథైవా వృతాన్ శిగ్భిర్మృత్యు గ్రస్తాన్విచేష్టతః ।
స్వయం చ కృపణః శిక్షు పశ్యన్నప్య బుధో పతత్ ॥

తా:- అట్లు వలలో చిక్కుకొని మృత్యువుతో కబలింపబడి ప్రాణములు కోల్పోవుచున్న వారిని చూచుచు తానునూ అజ్ఞుడై దీనుడై వలలందు పడెను.(71)

టీ:- తానావృతాన్పశ్యన్నపి. శిక్షు - జాలేషు. (71,72)

టీ:- చుట్టబడిన వారిని చూచుచూ కూడా. శిక్షు- వలలందు. 71,72

72.శ్లో॥ తం లబ్ధ్వా లుబ్ధకః క్రూరః కపోతం గృహమేధినం ।
కపోతకాన్ కపోతీం చ సిద్ధార్థః ప్రయయౌ గృహమ్ ॥

తా:- క్రూరుడైన ఆ లుబ్ధకుడు ఇంటి యజమానుడైన ఆ మగ పావురమును ఆ కపోత పిల్లలను ఆ ఆడపావురమును తీసికొని కృతార్థుడై ఇంటికి పోయెను.(72)

73.శ్లో॥ ఏవం కుటుంబ్యశాంతాత్మా ద్వంద్వారామః పతత్రివత్ ।
పుష్ణన్ కుటుంబం కృపణః సానుబంధోऽవసీదతి ॥

తా:- ఇట్టీ పావురము వలె కుటుంబియూ, నిరంతరము రాగద్వేషాదుల చేత కలతనొందిన చిత్తము గలవాడై దీనుడై కుటుంబమును పోషించుచూ చివరికి ఆడబిడ్డలతో కూడ నాశముపొందును.(73)

టీ:- దార్ష్టాంతికేయోజయతి ఏవమితి. (73)

తా:- దార్ష్టాంతికమున యోజించుచున్నాడు ఏవమని.(73)

74. శ్లో॥ యః ప్రాప్య మానుషం లోకం ముక్తి ద్వారమపావృతం ।
గృహేషు ఖగవత్సక్తః తమారూఢచ్యుతం విదుః ॥

తా:- ఎవడు ప్రతిబంధరహిత మోక్ష ద్వారమగు మనుష్యలోకమున మనుష్యుడై పుట్టి ఆ పక్షివలె గృహాదులందు ఆసక్తుడో వాడు మోక్ష స్థానము నుండి భ్రష్టుడైన వాడని పెద్దలు చెప్పుదురు.(74)

టీ:- ఏవం గృహాసక్తి స్తిరశ్చామప్యనర్థ హేతుర్మనుష్యస్యత్వనిన్ది తేత్యాహ - యః ప్రాప్యేతి. (74)

టీ:- గృహాభిలాష తిర్యగ్జంతువులకు సైతము అనర్థ హేతువైయున్నది. కావున అది మనుష్యునకు చాలా నిందితమయినది చెప్పుచున్నాడు యః ప్రాప్యయని.(74)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**సప్తమోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**సప్తమాధ్యాయము సమాప్తము.**

## అష్టమోऽధ్యాయః

బ్రాహ్మణ ఉవాచ

1. శ్లో॥ సుఖమైంద్రియకం రాజన్ స్వర్గే నరక ఏవ చ ।
దేహినో యద్యథా దుఃఖం తస్మాన్నేచ్ఛేత తద్బుధః ॥

టీ:- అష్టమేऽజగరాదిభ్యోనవభ్యః శిక్షితం హరిః అవధూతగిరా ప్రాహ వివేకాయోద్ధవం ప్రతి. ప్రారబ్ధ కర్మభోగస్యావశ్యం భావిత్వా త్తదర్థోద్యమై ర్నాయుర్వ్యయో వృథా కర్తవ్య ఇత్యజగరాచ్ఛిక్షితమిత్యాహ - సుఖ మిత్యాదినా. యద్దైన్ద్రియకం సుఖం తత్స్వర్గేనరకే చ భవత్యేవ. యథా దుఃఖం తస్మాద్బుధస్తన్నేచ్ఛేత్. (1)

2. శ్లో॥ గ్రాసం సమృష్టం విరసం మహాంతం స్తోకమేవ వా ।
యదృచ్ఛయైవా పతితం గ్రసేదాజగరోऽక్రియః ॥

## అష్టమాధ్యాయము

తా:- ఓ రాజా ! పది ఇంద్రియముల సుఖము గలదో ఆ సుఖము జీవునకు స్వర్గమందును నరకలోకమందును కలదో అట్లే ఇంద్రియజన్య మగు దుఃఖమును కలుగును, అందువలన పండితుడు దానిని కోరదగడు. (1)

టీ:- ఎనమిదవ అధ్యాయమున అజగరాదులు తొమ్మిదింటిని నేర్చిన దానిని శ్రీకృష్ణుడు అవధూత ద్వారా వివేకము కొరకు ఉద్ధవుని గూర్చి చెప్పెను. ప్రారబ్ధ కర్మభాగము అవశ్యము కలుగునది కావున దానిని సాధించు ప్రయత్నములచే వ్యర్థముగా ఆయుర్వ్యయము చేయదగనిదని అజగరమునుండి నేర్చిన దానిని చెప్పుచున్నారు సుఖమని మొదలుకొని, ఇంద్రియ సుఖము స్వర్గనరకములు రెండింటను కలుగును. యెట్లు దుఃఖమో, అందుకని బుధుడు దానిని కోరకూడదు. (1)

తా:- కబళము ఆహారము రుచియంతయుగాని లేనిదిగాని ఎక్కువ గాని అల్పముగాని అప్రయత్నముగా తనకుతానై వచ్చియున్న ఆహారమును (ప్రాప్తమయిన వానిని) కొండచిలువ వృత్తి నవలంబించి ఏ క్రియలేనివాడై భుజించవలెను. (2)

టీ:- శరీర నిర్వాహమాత్రం తు యథా లబ్ధేన కర్తవ్యమిత్యాహ గ్రాసమితి. ఆ జగరో అజగరవృత్తి. అక్రియః ఉదాసీనః.(2)

టీ:- శరీర నిర్వహణ మాత్రము తనకుతానై లభించిన ఆహారముతో చేయదగును అనుచున్నాడు గ్రాసమని. అజగరః కొండచిలువ వృత్తిని అవలంబించి. అక్రియః ఏ క్రియలేనివాడై.(2)

3.శ్లో॥ శయీతాహాని భూరీణి నిరాహారోऽనుపక్రమః ।
యది నోపన మేద్గ్రాసో మహాహిరివ దిష్టభుక్ ॥

తా:- చాలా దినములు ఆహారము లేనివాడై పడుకొనియుండవలెను. ఆహారము తనకుతానై లభించినదేని కొండచిలువ వలె దైవమే ఆహారమిచ్చునని ధైర్యవంతుడుకావలెను.(3)

టీ:- యదానాపతతి తదా కిం కర్తవ్యమ్ తత్రాహ శయీతేతి. అనుపక్రయో నిరుద్యమః. దిష్టభుక్ దైవమే ప్రాపకమితి ధైర్యవాన్.(3)

టీ:- ఎప్పుడాహారములభింపదో అప్పుడేమి చేయవలెననగా చెప్పు చున్నారు శయీత అని. అనుపక్రమః నిరుద్యమము. దిష్టభుక్ - దైవమే ప్రాపకుడని ఆహారమిచ్చువాడని ధైర్యవంతుడు కావలెను.(3)

4.శ్లో॥ ఓజస్సహోబలయుతం బిభ్రద్దేహమకర్మకమ్ ।
శయానో వీతనిద్రశ్చ నేహేతేంద్రియవానపి ॥

తా:- ఇంద్రి మనోబలము దేహబలముతో కూడిన దేహమును కనిపించు వస్తువులపై ప్రవర్తింపనట్లుగా భరించుచూ పడుకున్నవాడై నిద్రలేనివాడై ఆత్మజ్ఞానమున దృష్టి యుంచిన ఇంద్రియ పాటవము కలవాడయ్యు దర్శనాది వ్యాపారమేమి చేయ వాంఛింపకయుండ వలెను.(4)

టీ:- నను సమర్థోఽపి శయీలైవ కిం, ఓమిత్యాహ ఓజ ఇతి. ఓజ ఇంద్రియబలం. సహో మనోబలమ్. బలం శారీరమేవ తద్యుక్తమపి దేహ కర్మకమేవ బిభ్రచ్ఛయాన ఏవ భవేత్. వీతనిద్రః స్వార్థే దత్త దృష్టిశ్చ భవేన్న పునరీహేత. ఇంద్రియవానపీతి దర్శనాది వ్యాపారమపి నివారయతి.(4)

టీ:- ఓయీ సమర్థుడయిననూ శయనించియే ఉండవలెనా? అనిన అవునని చెప్పుచున్నాడు ఓజః అని. ఓజః - ఇంద్రియబలము. సహ- మనోబలము. బలం -దేహబలముతో కూడిన, దేహమును కనిపించు వస్తువులపై ప్రవర్తింపనట్లుగా. బిభ్రత్ -భరించుచు. శయాన ఏవ భవేత్. పడియున్నవాడే కావలెను. వీతనిద్రః నిద్రలేనివాడై. ఆయా అర్థముల యందు ప్రవర్తింప గలిగిన ఇంద్రియ పాటవముండియూ ఇంద్రియ వ్యాపారము దర్శనాదికమును (చేయ ఇష్టపడని వాడును కావలెను) నివారించుచున్నాడు.(4)

5. శ్లో॥ మునిః ప్రసన్న గంభీరో దుర్విగాహ్యో దురత్యయః ।
అనంతపారో హ్యక్షోభ్యః స్థిమితోద ఇవార్ణవః ॥

తా:- ప్రసన్నుడై గంభీరుడయి, ఇట్టివాడని తెలియరాని మనోభావ ములు కలవాడు. తేజస్వియైనందున అనతిక్రమణీయుడు. కొలువరాని వాడు. రాగాదులు లేని వాడగుటచే అవికార్యుడునై యుండును ఇట్టి గుణములు సముద్రుని నుండి నేర్చితిని.(5)

టీ:- సముద్రాచ్ఛిక్షితమాహ-మునిరితి బహిః ప్రసన్నశ్చాసావన్తర్గం భీరశ్చ. దుర్విగాహ ఏవంభూత ఇతి పరికలయితుమశక్యః అలక్ష్యాభి ప్రాయత్వాత్. దురత్యయోనతిక్రమణీయ సై జస్విత్వాత్. అనంతపారః కాలతో దేశతశ్చాపరిచ్ఛేద్యః స్వరూపావిర్భావాత్. అక్షోభ్యాఽవికార్యః రాగాద్యభావాత్. స్తిమితోదోనిశ్చలోదకొఽర్ణవోయథా తద్వదెతైర్గుణైర్భవే దిత్యర్థః.(5)

టీ:- సముద్రము నుండి నేర్చిన దానిని చెప్పుచున్నాడు ముని అని. పైకి ప్రసన్నుడై లోపల గంభీరుడు. దుర్విగాహ్యః ఇట్టివాడని తెలియరాని వాడు లక్ష్యముతోడి అభిప్రాయము కలవాడు కాకపోవుట వలన. దురత్యయః తేజస్వియయినందున అనతిక్రమణీయుడు అనంతపారః దేశకాలాదులచే కొలువరానివాడు. ఆత్మ స్వరూపావిర్భావము వలన.

అక్షోభ్యః- రాగాదులు లేనందున అవికార్యుడు. స్తిమితోదః నిశ్చలమైన ఉదకము గల సముద్రము ఎట్లు వుండునో అట్లే ఈ గుణములచే వర్తించవలెనని (సముద్రుని వలన నేర్చితిని). (5)

6. శ్లో॥ సమృద్ధకామో హీనో వా నారాయణపరో మునిః ।
నోథ్యర్వేత న శుష్యేత సరిద్భిరివ సాగరః ॥

తా:- వర్షాకాలమునందు నదులచే జలము సమృద్ధిగా కలిగిననూ సముద్రమెట్లు ఉప్పొంగదో, గ్రీష్మమున జల సమృద్ధిలేనిదై ఎండిపోవదో అట్లే నారాయణ తత్పరుడయిన ముని కోరికలు సమృద్ధిగా పొందియూ విర్రవీగడు, సంపదలు లేని వాడయ్యూ కుంగిపోడు అని నేర్చితిని.(6)

టీ:- కించ వర్షాసు సరిద్భిః సమృద్ధోఽపి సాగరోయథా నోథ్సర్వేత గ్రీష్మే తద్విహీనోపి న శుష్యేత. తథా సమృద్ధకామస్తద్విహీనో వా న హృష్యేన్నశో చేదిత్యర్థః. అత్ర హేతుః నారాయణ పరో న తు విషయ పర ఇతి. (6)

టీ:- మరియు వర్షాకాలమున నదులతో సమృద్ధమయిననూ సముద్రమెట్లు ఉప్పొంగదో, గ్రీష్మమునందు జలము లేనిదై ఎండదో। అట్లు కోరికలు సమృద్ధిగా పొందియూ, సంపదలు లేనివాడయ్యూ శోచించకూడదని అర్థము। ఇచ్చట హేతువు నారాయణపరుడు, విషయపరుడు కాడని. (6)

7. శ్లో॥ దృష్ట్వా స్త్రియం దేవమాయాం తద్భావైరజితేంద్రియః ।
ప్రలోభితః పతత్యంధే తమస్యగ్నౌ పతంగవత్ ॥

తా:- దేవతలను సయితము మోహింపజేయు మాయయయిన స్త్రీని చూచి ఆకాంతప్రేమభావములచే ఇంద్రియములకు లొంగి ఆశపెట్ట బడినవాడై అగ్నియందు మిడతవలె కటికచీకటి వంటి సంసారమునందు పడుచున్నాడు.(7)

టీ:- రూపగంధ స్పర్శశబ్దరసైః పంచభిర్విషయైర్మోహితాః పతంగ మధుకర గజ హరిణమీనాహతాః, అతస్తేష్వనాసక్తా పంచైతే గురవః తదుక్తం. "పతంగ మాతంగ కురంగ భృంగ మీనా హతాః పంచభి రేవపంచ. ఏకః ప్రమాదీ సకథం నహవ్యతేయః సేవతే పంచభి రేవపంచ" ఇతి తత్ర రూపవిలాస మోహితో నశ్యతీతి పతంగాచ్ఛి క్షితమాహ - దృష్ట్వేతి తస్యాభావైః ప్రలోభితః. (7)

టీ:- రూప, రస, గంధ, స్పర్శ, శబ్ద, రసములగు అయిదు విషయము లచే సంమోహితములై మిడుత, తుమ్మెద, ఏనుగు, లేడి, చేపలు హితములగుచున్నవి. అందువలన రూపాదులందనాసక్తములైన ఈ అయిదు నాకు గురువులు, అట్లు చెప్పబడినది కూడా". మిడుత, ఏనుగు, లేడి, తుమ్మెద, చేప, అను ఈ అయిదు క్రమముగా రూపస్పర్శ శబ్ద గంధ రసము అను నైదు గుణములచే అనగా ఒక్కొక్కటి ఒక్కొక్క గుణముచే హితములగుచున్నవి. అట్లు ఐదింద్రియములచే నయిదు గుణములను సేవించువాడెట్లు హితుడు కాకుండును. అందు రూప విలాసవెూహితుడై నశించుచున్నాడనునది పతంగము లేదా మిడుతవలన నేర్చితిని అని అనుచున్నాడు దృష్ట్వాయని. (7)

8. శ్లో॥ యోషిద్ధిరణ్యాభరణాంబరాది
ద్రవ్యేషు మాయారచితేషు మూఢః ।
ప్రలోభితాత్మా హ్యుపభోగ బుద్ధ్యా
పతంగవన్నశ్యతి నష్ట దృష్టిః ॥

తా:- మాయచే వంచించుటకు నిర్మించబడిన స్త్రీ యందు ఆమె ధరించెడి బంగారము మొదలయిన ఆభరణములు వస్త్రములు మాలలు చందనములు మొదలయిన ద్రవ్యముల యందు ఆశపెట్టబడిన మనస్సు గలవాడై మందమతియై ఇష్టసుఖభోగ బుద్ధిచే పరమార్థ దృష్టి నశించినవాడై మిడుతవలె నశించుచున్నాడు. (8)

టీ:- స్త్రీ యముపలక్షీకృత్యైతత్ప్రపంచయతి యోషిదితి. (8)

టీ:- స్త్రీని ఉపలక్షణముగా కాని ఈ విషయము నింకను ప్రవచించు చున్నారు. యోషిత్ అని. (8)

9.శ్లో॥ స్తోకం స్తోకం గ్రసేద్గ్రాసం దేహో వర్తేత యావతా ।
గృహానహింసన్నాతిష్ఠేత్ వృత్తిం మాధుకరీం మునిః ॥

తా:- ముని, గృహస్థులను పీడించనివాడై దేహము ఎంత మాత్రము నిలువగలదో అంతమాత్రము కొంచెము కొంచెము అన్నము తినవలెను. మాధూకరము మధుకరమనగా తుమ్మెద దాని వృత్తిని అనగా వ్యాపారమును అవలంభించవలెను.(9)

టీ:- మధుకరాచ్ఛిక్షిత మాహ - స్తోకమితి. గృహాన్గృహస్థాన హింసన్న పీడయన్. అయంభావః - యథా మధుకరో విశిష్ట గంధలోభేన ఏకస్మిన్నేవ పద్మే వసన్నస్తమయసమయే ముకులితే తస్మిన్బధ్యతే, ఏవం మునిరపి గుణలోభేనైకమేవ గృహమాశ్రితస్తన్మోహేన బధ్యత ఇతి.(9)

టీ:- మధుకరము నుండి శిక్షితమును చెప్పుచున్నాడు. స్తోకమని - గృహాన్ - గృహస్థులను అహింసన్ - పీడించనివాడై - మధుకరము విశిష్టగంధ లోభముతో ఒకే పద్మమునందు నివసించుచూ అస్తమయ సమయమున ఆకమలము ముకుళించినంతనే దానిలో ఎట్లు బంధింపబడుచున్నదో, అట్లే ముని కూడా గుణ లోభముతో ఒకే గృహమునాశ్రయించి ఆ మోహముచే బద్ధుడగును" అని. (9)

10.శ్లో॥ అణుభ్యశ్చ మహద్భ్యశ్చ శాస్త్రేభ్యః కుశలో నరః ।
సర్వతస్సారమాదద్యాత్ పుష్పేభ్య ఇవ షట్పదః ॥

తా:- నేర్పరి అగు మనుజుడు చిన్నవి పెద్దవి అగు శాస్త్రముల నుండి అంతటను సారమును పూవుల నుండి భ్రమరము వలె గ్రహించవలెను. (10)

టీ:- కించ అణుభ్యశ్చేతి. (10)

టీ:- మరియు మధుకర శిక్షితమును ఇంకను చెప్పుచున్నాడు.(10)

11. శ్లో॥ సాయంతనం శ్వస్తనం వా న సంగృహ్ణీత భిక్షితమ్ ।
పాణిపాత్రోదరామత్రో మక్షికేవ న సంగ్రహీ ॥

తా:- దీనిని సాయంత్రము తిందును దానిని రేపు తిందునని భిక్షగాడు అన్నాదికమును సంగ్రహించగూడదు. చేయియే పాత్రగలవాడును కడుపే పాత్రగలవాడును, అయి ఉండవలెను. తేనెటీగవలె సంగ్రహించ రాదు. (11)

టీ:- ద్వివిధా మధుకృత్ - మధుకృంతతి పుష్పాదాచ్ఛిద్య గృహ్ణాతీతి మధుకృద్భ్రమరః. మధుకరోత్యాహారత్వేన స్వరూపేణ చేతి మధుమక్షికా చ. తత్త ప్రథమాచ్ఛిక్షితముక్తం, ద్వితీయాచ్ఛిక్షితమాహ - సాయమిదం భోక్ష్యామి, శ్వ ఇదం భోక్ష్యామితి భిక్షిత మన్నాది న సంగృహ్ణీత, కింతు పాణిపాత్రస్తన్మాత్రగ్రాహీ. యద్వా ఉదరమేవామాత్రం పాత్రం యస్య సః. ఏక భిక్షాయాముదర మాత్రగ్రాహీ భవేత్. సంగ్రహీతు మక్షికేన న భవతి న జీవతీత్యర్థః.(11)

టీ:- మధుకృత్తు రెండు విధములు - మధువును పూవునుండి లాగి తీసికొనునది మధుకృత్ తుమ్మెద, వేరొకటి మధువును ఆహారముగా స్వీకరించునది మధువును సంపాదించునది తేనేటీగ, అందు మొదటిదగు తుమ్మెదను గూర్చి నేర్చినది తెలిపినారు ఇప్పుడు రెండవది యగు తేనే టీగ నుండి నేర్చినది చెప్పుచున్నారు. సాయం ఇదం అని. సాయంత్రము దీనిని భుజించుచున్నాను. రేపు దీనిని భుజింతును అని భిక్షగాడు అన్నాదికమును సంగ్రహించి పెట్టరాదు, కాని పాణిపాత్రః చేయియే పాత్రగా గలవాడు. చేయి పట్టునంత గ్రహించువాడు. లేదా కడుపే పాత్రముగా గలవాడు (ఒక భిక్షయందే ఉదరపాత్రము నింపు కొనువాడు కావలెను) సంగ్రహీ మక్షిక వలె వుండదరాదు. జీవించ రాదు. (తేనేటీగ వలె సంగ్రహించరాదని దాని వలన నేర్చితిని).(11)

12. శ్లో॥ సాయంతనం శ్వసన్తనం వా న సంగృహ్ణీత బిక్షుకః ।
మక్షికా ఇవ సంగృహ్ణన్ సహ తేన వినశ్యతి ॥

తా:- ఉదయము సంపాదించినది సాయంకాలమునకు సాయంకాల మార్జించినది రేపటికని భిక్షాన్నము మొదలయిన వాటిని చేర్చి పెట్టకూడదు. అట్లు చేర్చి పెట్టినవాడు మధువును చేర్చి పెట్టిన తేనేటీగ వలె మధువులో చచ్చునట్లు కూడబెట్టిన దానితో తాను నశించును.(12)

టీ:- ఏతద్వివృణోతి - పునస్సాయంతనమితి. (12)

టీ:- దీనిని వివరించుచున్నారు. సాయంతనమని. (12)

13.శ్లో॥ పదాऽపి యువతీం భిక్షుః న స్పృశేద్దారవీమపి ।
స్పృశన్ కరీవ బద్ధ్యేత కరిణ్యా అంగసంగతః ॥

తా:- సన్యాసి పాదము చేతనయిననూ స్త్రీని కొయ్య బొమ్మను సైతము తాకకూడదు అట్లు తాకుచు ఆడయేనుగ తాకుడుకు మగ యేనుగ వలె బంధింపబడును.(13)

టీ:- స్పర్శాసక్తిర్నాశ హేతురితి గజాచ్ఛిక్షితమిత్యాహ పదాపీతి. పాదేనాऽపి దారవీం దారుమయీమపి. గజోహి కరిణీం ప్రదర్శ్య నిఖాత తృణ పిహితగర్తే నిపాత్య బద్ధ్యతే. (13)

టీ:- స్పర్శాసక్తి నాశహేతువని గజము నుండి నేర్చితినని చెప్పుచున్నాడు. పదాపి అని. పాదముచే సైతము కొయ్యబొమ్మను సైతము. ఒక పెద్ద గోతిని తవ్వి దానిని గడ్డి దారములతో గప్పి దాని సమీపమున ఒక ఆడ ఏనుగను చూపి ఆ మగ ఏనుగు ఆడ ఏనుగను స్పృశించ వచ్చి నడుమనున్న గోతిలో పడిన బంధింతురు.(13)

14.శ్లో॥ నాధిగచ్ఛేత్స్త్రియం ప్రాజ్ఞః కర్హిచిన్మృత్యుమాత్మనః ।
బాలాధికైస్సహన్యేత గజైరన్యైర్గజో యథా ॥

తా:- బుద్ధిమంతుడు ఒకానొకప్పుడు తనకు మృత్యువుతో సమానమగు స్త్రీని పొందగూడదు. ఎక్కువ బలము గల తక్కిన ఏనుగులచే అట్లు పొందువాడు ఆ ఆడేనుగను వెన్నంటిన ఏనుగువలె చంపబడును.(14)

టీ:- కించ నాధిగచ్ఛేదితి నోపగచ్ఛేత్. (14)

టీ:- బుద్ధిమంతుడు ఒకానొకప్పుడు తనకు మృత్యువుతో సమానమగు స్త్రీని పొందగూడదు.(14)

15.శ్లో॥ న దేయం నోపభోగ్యం చ లుబ్ధైర్యద్దుఃఖసంచితమ్ ।
భుజ్క్తే తదపి తచ్చాన్యో మధుహేవార్థవిన్మధు ॥

తా:– లుబ్ధులచే చాలా కష్టపడిన సంపాదించిన ధనము వేరొకరికీయ రానిదై తమకనుభవమునకు రానిదగుచో ఆ ధనము వేరొకడు గ్రహించును. తేనెపట్టువాడు తేనెనువలె.(15)

టీ:– త్యాగభోగవిహీనః ధనసంచయః పరగామీ భవతీత్యత్ర మధుహా గురురిత్యాహ – న దేయమితి. తదన్యోబలవాన్ భుంక్తే తదప్యన్యస్త చ్చాన్యః. మధుహామక్షికాభిః సంచితం మధు యథా భుంక్తే తద్వత్. నను సుగుప్తం ధనం కథమన్యోజ్ఞాస్యతి హరిష్యతి చేతి తత్రాహ అర్థవిత్ లింగైరర్థం తదుపాయం చ వేత్తీత్యర్థవిత్ యథా మధుహా తరుకోటరాది గతం మధు వేత్తి హరితి చ.(15)

టీ:– త్యాగభోగములు లేని ధనసంచయము పరులపాలగునను విషయమున మధుహర్త గురువనుచున్నాడు. న దేయమని. వానికంటే బలవంతుడు ఆ మధువును తీసికొనును. వాని నుండింకొకడు, తేనె పట్టువాడు తేనె టీగలు సంచితము చేసిన తేనెను ఎట్లనుభవించునో అట్లు. అయ్యా! గుప్తమయిన ధనమును ఇతరులెట్లు తెలిసికొందురు హరించగలరు అనిన చెప్పుచున్నాడు. అర్థవిత్ లింగములచే అర్థమును తదుపాయమును తెలియు వానిని అర్థవిత్తందురు. తేనెపట్టువాడు చెట్టుతొఱ్ఱలో నున్న దానిని గుర్తులను బట్టి తేనెను తెలిసికొన హరించును. (15)

16.శ్లో॥ సుదుఃఖోపార్జితైర్విత్తైః ఆశాసానాం గృహాశిషః ।
మధుహేవాగ్రతో భుజ్క్తే యతిర్వై గృహమేధినామ్ ॥

తా:– గృహ ధన దారాపత్యములను వాంఛించు గృహస్థుల యొక్క చాలా శ్రమచే సంపాదింపబడిన పదార్థములచే సిద్ధమయిన యన్నమును సన్యాసియే మధుహారకుడు వలె మొదట భుజించుచున్నాడు. (16)

టీ:- స్వోద్యమం వినాపి భోగః సంభవతీత్యత్రాపి స ఏవ గురురిత్యాహ- సుదుఃఖేతి. ఆశాసానానామితి వక్తవ్యే వర్ణలోపార్షః "యతిశ్చ బ్రహ్మచారీ చ పక్వాన్నస్వామినావుభౌ. తయోరన్నమదత్వాతుభుక్త్వా చాంద్రాయణం చరేత్" ఇతి గృహిణామావశ్యకత్వేన దాన విధానాత్. (16)

టీ:- తన ప్రయత్నము లేకున్నను భోగము కలుగుననుటకు ఆ తేనె పట్టువాడె గురువనుచున్నాడు. సుదుఃఖ అని. ఆ శాసానానా మని చెప్పవలసియుండగా వర్ణలోపము ఆర్షము. "యతి బ్రహ్మచారీ వీరిరువురు వంటచేసి సిద్ధపరచిన అన్నానికి గ్రహింపనధికారులు, వారికన్నమీయక తినువాడు చాంద్రాయణ మాచరించాలి" అని గృహస్థులకు ఆవశ్యముగా దానవిధి గలదు.(16)

17.శ్లో॥ గ్రామ్యగీతం న శృణుయాత్ యతిర్వనచరః క్వచిత్ ।
శిక్షేత హరిణాద్బద్ధాత్ మృగయోర్గీతమోహితాత్ ॥

తా:- అడవిలో తిరుగు యతి గ్రామములోని పామరుల పాటను వినగూడదు. వేటగాని యొక్క పాటచే మోహమొందినదై కొట్టబడి గాయపడిన జింకనుండి ఈ విషయము నేర్వవలెను.(17)

టీ:- హరిణాచ్ఛిక్షితమాహ గ్రామ్యేతి. భగవద్గీతం తు శృణుయాదేవ. మృగయోర్లుబ్ధకస్య. (17)

టీ:- హరిణమువలన శిక్షితమును చెప్పుచున్నారు. భగవత్సంబంధ మయిన గానములేమో విననే వలెను. మృగమో వేటగాని యొక్క.(17)

18.శ్లో॥ నృత్తవాదిత్రగీతాని జుషన్ గ్రామ్యాణి యోషితాం ।
ఆసాం క్రీడనకో వశ్యః ఋశ్యశృంగో మృగీసుతః ॥

తా:- లేడికి జనించిన ఋష్యశుంగుడు స్త్రీల యొక్క గ్రామ్యములయిన నృత్య వాదిత్ర గీతములను సేవించుచూ ఈ స్త్రీలకు ఆట వస్తువుగా లోబడెను.(18)

టీ:- హరిణశబ్దాదేవ హరిణీసుతః ఋష్యశృంగోపి గురుర్జ్ఞాతవ్య ఇత్యాహ నృత్యేతి - వశ్యోబభూవేతి శేషః. (18)

టీ:- హరిణశబ్దముచే లేడి కొడుకైన ఋష్యశుంగుడు సైతము గురువని తెలియజెప్పుచున్నాడు నృత్య అని. వశ్యుడయినాడని తెలిసికొనవలెను. (18)

19.శ్లో॥ జిహ్వయాతి ప్రమాథిన్యా జనో రసవిమోహిత ః ।
మృత్యుమృచ్ఛత్యసద్బుద్ధిః మీనస్తు బడిశైర్యథా ॥

తా:- మిక్కిలి క్షోభ కలిగించు నాలికచే రసవంతములైన భోగ్య వస్తువులందు ప్రేమకలదై జనము క్షణకాలపు రుచికి లొంగినదై మృత్యువును పొందుచున్నది. పైకి మాంసము లోన ముల్లు కల (ఎఱ్ఱలు గుచ్చబడిన గాలములచే) పై మాంసమున కాశపడిన చేపవలె.(19)

టీ:- రసాసక్తిర్నాశహేతురితి మీనాచ్ఛిక్షితమిత్యాహ జిహ్వయేతి. అతి ప్రమాథిన్యా అతిక్షోభికయా దుర్జయయా. ఋచ్ఛతి ప్రాప్నోతి. బడిశైరా మిషలిప్తైర్లోహ కంటకైః. (19)

టీ:- రసమునందాసక్తి నాశహేతువని మీనము వలన నేర్చితిని అనుచున్నాడు. జిహ్వయా అని. అతి ప్రమాథిన్యా - మిక్కిలి క్షోభ కలిగించు, జయించ వీలులేని, ఋచ్ఛతి పొందుచున్నది. మాంసముతో కూడిన లోహ కంటకములచే. (19)

20.శ్లో॥ ఇంద్రియాణి జయంత్యాశు నిరాహారా మనీషిణః ।
వర్జయిత్వా తు రసనం తన్నిరన్నస్య వర్ధతే ॥

తా:- ఆహారము స్వీకరించని పెద్దలు నాలుకను మాత్రము వర్జించి తక్కిన ఇంద్రియములను శీఘ్రముగా జయింతురు రసనేంద్రియము మాత్రము నిరాహారికి పెరుగును గాని తరగదు.(20)

టీ:- దుర్జయత్వముపపాదయతి ఇంద్రియాణీతి ద్వాభ్యాం-అయం భావః - యద్యాహారస్త్యజ్యతే తర్హ్యన్యేంద్రియ జయః కేవలంభవతి, రసనేంద్రియం తు వర్ధతే. యది తు భుజ్యతే తర్హ్పిపునశ్చరసాసక్త్యా సర్వేంద్రియక్షోభః స్యాత్. అతో రసాసక్తిం పరిత్యజ్యౌషధవత్ భుంజీతేతి, ప్రాణవృత్త్యైవ సంతుష్యేదిత్య త్రోక్తమపి రసనస్యాతి దుర్జయత్వ జ్ఞాపనా యోచ్యత ఇతి విశేషః. (20,21)

టీ:- జిహ్వను జయించుట అసాధ్యము అని చెప్పుచున్నాడు - ఇంద్రియాణి అనెడి రెండు శ్లోకములతో. దీని భావమిది - ఆహారమును త్యజించిన యెడల ఇతరమగు శ్రోత్రాదీంద్రియములు జయము మాత్రము శీఘ్రముగగలుగును. రసనేంద్రియము మాత్రము వర్ధిల్లును. అన్నము తినినచో మళ్ళీ రుచియందాసక్తిచే సర్వేంద్రియములకు క్షోభ

కలుగును. అందువలన రుచియందాసక్తిని వదిలి ఔషధమువలె అన్నాదికము భుజించవలెను. జీవనము మాత్రముచే సంతోషించ వలెను. అని ఇచ్చట చెప్పబడినను రసనేంద్రియ మతిదుర్జయమను జ్ఞాపకమునకై చెప్పబడుచున్నది.(20,21)

21.శ్లో॥ తావజ్జితేంద్రియో న స్యాత్ విజితాన్యేంద్రియః పుమాన్ ।
న జయేద్రసనం యావత్ జితం సర్వం జితే రసే ॥

తా:- పురుషుడు ఇతరమగు శ్రోత్రాదీంద్రియములను గెలిచిననూ ఎంతవరకు జిహ్వను జయించడో అంతవరకు జితేంద్రియుడు కాడు. రసనేంద్రియము జయింపబడగ అన్ని ఇంద్రియములను జయించిన వాడగును.(21)

22.శ్లో॥ పింగళా నామ వేశ్యాసీత్ విదేహనగరే పురా ।
తస్యా మే శిక్షితం కించిత్ నిబోధ నృపనందన ॥

తా:- రాజకుమారా! పూర్వము మిథిలానగరమున పింగళయను వైశ్య కలదు. ఆమె వలన నేను నేర్చికొనిన దానిని చెప్పెదను తెలిసికొనుము. (22)

టీ:- పింగళాయానైరాశ్యం శిక్షితమితి వక్తుం తదాఖ్యానమాహ. పింగళేత్యాదినా - మే - యయా శిక్షితః. (22)

టీ:- పింగళ వలన నిరాశ నేర్వబడినదని చెప్పుటకు ఆమె కథను చెప్పుచున్నాడు పింగళా మొదలుకొని. మే - నాచే నేర్వబడినది.(22)

23.శ్లో॥ సా స్వైరిణ్యేకదా కాంతం సంకేత ఉపనేష్యతీ ।
అభూత్కాలే బహిర్ద్వారి బిభ్రతీ రూపముత్తమమ్ ॥

తా:- ఆ కామరూపిణి ఒకనాడు తాను ప్రియుని కూడుటకై సంకేత స్థానమునకు పోవగోరి నగలు, పూలు వస్త్రాలు శరీరాని కలంకరించు కొని ఇంటి వెలుపలి ద్వారమున నిలువబడెను. (23)

టీ:- స్వైరిణీ - కామచారిణీ, సంకేతే = రతిస్థానే. (23)

తా:- స్వైరిణీ = కామచారిణీ. సంకేతే - రతిస్థానమునందు. (23)

24.శ్లో॥ మార్గ ఆగచ్ఛతో వీక్ష్య పురుషాన్ పురుషర్షభ ।
తాన్ శుల్కదాన్ విత్తవతః కాంతాన్ మేనేఽర్థకాముకా ॥

తా:- ఆ వేశ్య, ధనమును కామించునదై రాజమార్గమున సంచరించు పురుషులను చూచి ధనవంతులు తన రతికి వెలనిచ్చు వారిని సంగమార్హులైన వారినిగా ధనకాముకయై తలంచెను. (24)

టీ:- తాన్విత్తవతః సధనా న త ఏవ శుల్కదాన్మూల్యదాన్. కాంతాన్ - సురతార్హాన్. (24)

టీ:- ఆ ధనవంతులను శుక్లదాన్ - వెలనిచ్చువారి కాంతాన్ - సురతార్హులయిన వారిని. (24)

25.శ్లో॥ ఆగతేష్వపయాతేషు సా సంకేతోపజీవినీ ।
అప్యన్యో విత్తవాన్ కోఽపి మాముపైష్యతి భూధరః ॥

తా:- ఎందరో విటులు వచ్చుచు పోవుచున్న వారికి రతి సుఖమునిచ్చి, వారిచ్చే ద్రవ్యమును దీసికొని బ్రదుకు నడుపుకుంటున్న ఆ వేశ్య ఎక్కువ ధనమిచ్చువాడు నా దగ్గరికి రాగలడని దురాశ గలదై. (25)

టీ:- అపి, సంభావనాయాం. అన్యాపి మాముపైష్యత్యేవం దురాశయే త్యుత్తరేణాన్వయః. (25)

టీ:- అపి - సంభావన యందు, వేరొకడు కూడా నా పొందు కోరుటకే రాగలడని దురాశతో అని తరువాత శ్లోకముతో అన్వయము. (25)

26.శ్లో॥ ఏవం దురాశయాధ్వస్త నిద్రా ద్వార్యవలంబితీ ।
నిర్గచ్ఛంతీ ప్రవిశతీ నిశీథం సమపద్యత ॥

తా:- ఈ రీతి దురాశతోనున్న ఆ వేశ్య ఒకనాడు నిద్దురపోగొట్టుకొని లోపలి నుండి వెలుపలికి వెలుపలి నుండి లోపలికి వచ్చుచూ అర్ధరాత్రిని సమీపించెను. (26)

టీ:- ద్వార్యవలంబానా పునః ప్రవిశతీ పునర్నిర్గచ్ఛంతీ ఏవం కుర్వతీ. నిశీథమర్ధరాత్రం ప్రాప. (26)

టీ:- ద్వారమునందంటి పెట్టుకొన్నదై బయటి నుండి లోనికీ, లోనుండి బయటికీ వెళ్ళుతూ, నిశీథం - అర్ధరాత్రిని సమీపించెను.(26)

27.శ్లో॥ తస్యా విత్తాశయా శుష్యత్ వక్త్రాయా దీనచేతసః ।
నిర్వేదః పరమో జజ్ఞే చింతాహేతుస్సుఖావహః ॥

తా:- ఇట్లు ధనమందాశచే వాడిపోయిన ముఖము కలదై దిగులుతో కూడిన మనస్సు కలదైన ఆ వేశ్యకు ధనచింతకారణముగా సుఖము కలిగించునదై మేలైన వైరాగ్యము జనించెను.(27)

టీ:- నిర్వేదోఽలంబుద్ధిః విత్తచింతైవ హేతర్యస్య సః. (27)

టీ:- నిర్వేదము - చాలనెడిబుద్ధి. ధనచింతనయే కారణముగా గల. 27

28.శ్లో॥ తస్యా నిర్విణ్ణచిత్తాయాః గీతం శృణు యథా మమ ।
నిర్వేద ఆశాపాశానాం పురుషస్య యథా హ్యసిః ॥

తా:- ఆ విధముగా నిర్వేదము పొందిన వేశ్య పాడిన గీతమును యథా తథముగా చెప్పుదును వినుము. దీనిని వినుటల వలన పురుషునకు ఆశలను త్రాళ్ళను ఖడ్గము వలె ఛేదించెడి వైరాగ్యముదయిస్తుంది. రాజా! నిర్వేదమును చెందనివాడు ఆశను ఎట్లు విడువగలడు? (ఆశను త్యజించలేడు గదా). (28)

టీ:- యథా యథావత్. మమ మత్తః శృణు నను కిం నిర్విణ్ణాయా గీతశ్రవణేన - తత్రాహ - హి యస్మాత్ పురుషస్యాశాపాశానాం నిర్వేదోఽసిర్యథా తథా ఛేత్తా. (28)

టీ:- యథా = ఏ ప్రకారమో. మయా - నా నుండి వినుము. అయ్యా! నిర్విణ్ణురాలయని దాని గీతమును వినుట ఎందులకు అనిన చెప్పు చున్నాడు - హ - ఎందులకనగా పురుషుని ఆశములను పగ్గములకు వైరాగ్యము ఖడ్గమెట్లో అట్లు ఛేదించును.(28)

29.శ్లో॥ నహ్యంగాజాత నిర్వేదో దేహబంధ జిహాసతి ।
యథా విజ్ఞానరహితో మనుజో మమతాం నృప ॥

తా:- నిర్వేదము లేనివాడు దేహబంధమును పోగొట్టుకొనడు. విజ్ఞానరహితుడయిన వాడు మమతను వలె.(29)

టీ:- తత్ర హేతుః న హీతి. అంగహే రాజన్. (29)

టీ:- ఆ విషయమున హేతువును నహి అని చెప్పుచున్నాడు. అంగ - ఓ రాజా!.(29)

పింగళోవాచ

30.శ్లో॥ అహో మే మోహవితతిం పశ్యతా విజితాత్మనః ।
యా కాంతాదసతః కామం కామయే యేన బాలిశా ॥

తా:- ఇంద్రియములు గెలువలేని నా మోహ విస్తారమును చూడుడు. దీనివల్లనే కదా నేను మూఢురాలనై తుచ్ఛుడైన నరునివలన కామమును రతి సుఖమును కోరుచున్నాను. (30)

టీ:- అవిజితాత్మత్వే హేతుః - యాహం బాలిశా వివేకశూన్యా తస్యాః కుతః. యేన కారణేనాసతస్తుచ్ఛాన్నరాత్కామం కామయే. (30)

టీ:- ఇంద్రియములను జయించని విషయాన హేతువును చెప్పుచున్నాడు. యాహం - ఏ నేను వివేకశూన్యురాలనై. ఆ నా యొక్క. ఏ కామముచేత తుచ్ఛుడయిన విటుని వలన కామాభిలాషను కోరుచున్నాను. (30)

31.శ్లో॥ సంతం సమీపే రమణం రతిప్రదం
విత్తప్రదం నిత్యమిమం విహాయ ।
అకామదం దుఃఖభయార్తిశోక
మోహప్రదం తుచ్ఛమహం భజేऽజ్ఞా ॥

తా:- ఔరా! నేనెంత అజ్ఞురాలను సమీపాన ఉండి నా మనస్సును రమింపచేయుచు రతి సుఖమునిచ్చి ధనమిచ్చు ప్రత్యక్ష దైవము అయిన ఈశ్వరుడని విడిచి కామప్రదుడు కాని దుఃఖ భయ శోకమోహములను కలిగించు తుచ్ఛుడయిన నరుని సేవించుచున్నాను.(31)

టీ:- బాలిశత్వం ప్రపంచయతి - సంతమితి. చతుర్భిః. సమీపే సంతమంతర్యామిత్వాత్. ఇమమపరోక్షమీశ్వరం.(31)

టీ:- బాలిశత్వమును నాలుగు శ్లోకములచే ప్రపంచిచుచున్నారు. నాలుగు శ్లోకములచే, అంతర్యామియై సమీపముననుండు, ఈ అపరోక్షుడయిన ఈశ్వరుని. (31)

32.శ్లో॥ అహో మయాత్మా పరితాపితో వృథా
సాంకేత్యవృత్త్యా హ్యతిగర్హ్యవార్తయా ।
స్త్రైణాన్నరాదర్థతృషోऽనుశోచ్యాత్
క్రీతేన విత్తం రతిమాత్మనేచ్ఛతీ ॥

తా:- అయ్యో! స్త్రీలంపటుడు లోభిశోచనీయుడగు నరుని వలన కొనబడిన నాశరీరముతో ధనమును సంగమమును కోరుచున్నదాననై చాలా నింద్యమైన జీవికి గల వ్యభిచార వృత్తిచే నాచే మనస్సు వ్యర్థముగా పరితపింపచేయబడినది.(32)

టీ:- అతివిగర్హ్యా అతినింద్యా యా వార్తా జీవికా తయా. కుతః. సాంకేత్యేన యా వృత్తి స్తయా బహువ్రీహిణా స్వవిశేషణం వా. పరితాపం ప్రపంచయతి స్త్రైణాదిత స్త్రీలంపటాదథ చార్థతృషో లుబ్ధా దత ఏవానుశోచ్యాన్నరాద్యాహం విత్తం రతించేచ్ఛతీ. మయా వృధాత్మా పరితాపితః కేన విత్తమిచ్ఛతీ, తేన నరేణ క్రీతేన స్వయం విక్రీతేనాత్మనా దేహేన.(32)

టీ:- అతి విగర్హ్యము నింద్యమయినయే వ్యభిచారవృత్తి గలదో దానిచే. (ఈ అర్థము) ఎందులకు అనగా బహు వ్రీహిచే స్వవిశేషణమయిననూ చెప్పవలె. పరితాపమును చెప్పుచున్నాడు స్త్రైణాత్ అని- స్త్రీలంపటుడు, లోభి, కావుననే శోచనీయుడు అయిన నరుని నుండి ఏ నేను ధనమును, రతినీ కోరుతున్నదాననైతిని నాచే వ్యర్థముగా మనస్సు పరితపింప చేయబడినది. ఆ నరునిచే కొనబడిన, స్వయముగా అమ్మబడిన ఈ దేహముతో.(32)

33. శ్లో॥ యదస్థిభిర్నిర్మితవంశవంశ్య
స్థూణం త్వచా లోమనఖైః పినద్ధమ్ ।
క్షరన్నవద్వారమగారమేతత్
విణ్మూత్రపూర్ణం మదుపైతి కాన్యా॥

తా:- ఏ ఎముకలచే నిర్మించిన వెదురు వెన్నముకచే పక్క ఎముకల చేత, కాళ్ళు చేతులు ఎముకలు కలది చర్మముచే, రోమము, మల మూత్రములతో నిండిన ఇటువంటి దేహమును నాకంటే ఇతర కాంత ఎవర్తె సుఖస్థానముగా పొందును.(33)

టీ:- అహోధిఙ్మా యాహమతి బీభత్సితం భజామీత్యాహ. యదితి. వంశోనామ స్థూతాసు నిహితస్తిర్యగ్వేణుః. వంశ్యాస్తస్మిన్నుభయతో నిహితా వేణవః అస్థిభిరేవ నిర్మితా వంశాదయోయస్మింస్తత్. తత్ర పృష్ఠే దీర్ఘమస్థియత్సవంశః. పార్శ్వాస్థీని వంశ్యాని. స్థూణాహస్త పాదాస్థీని. తథా రోమభిర్నఖైశ్చపినద్ధం ఛాదితం. తథాఽపి క్షరంతి నవ ద్వారాణి యస్మిం స్తత్. ఏవం భూతాగార రూపం నృశరీరమే తన్మత్ మత్తోఽన్యా కావా కాంతబుద్ధ్యా ఉపైతి సేవతే.(33)

టీ:- అయ్యో! చాలా అసహ్యమయిన శరీరమును భీభత్సితమయినట్లు అనుభవించుచున్నానే- అనుచున్నది. యదస్థి అని. వంశమనగా, స్తంభములపై అడ్డముగా వుంచిన వెదురు వంశ్యములనగా రెండు వైపులనుంచిన వెదుళ్ళు. అస్థులతో నిర్మించిన వంశాదులు దేనియందో అది. పృష్ఠభాగాన దీర్ఘముగా వుండు అస్థియే వంశము. ప్రక్కలకున్న అస్థులు వంశ్యములు స్థూణా - హస్తపాదాస్థులు. అట్లే రోమములచే నఖములచే కప్పబడినదైన . అయిననూ నవద్వారములు స్రవించునదై, ఈ విధముగా ఇంటివంటిదేహము నాకంటే ఇతర కాంత సుఖ స్థానముగా పొందును.(33)

34. శ్లో॥ విదేహినాం పురే హ్యస్మిన్ అహమేకైవ మూఢధీః ।
యాన్యమిచ్ఛన్త్యసత్యస్మాత్ ఆత్మదాత్కామమచ్యుతాత్ ॥

తా:- ఈ విదేహరాజుల పట్టణములో నేనొక్కతేనే మూఢ మనస్కురాలను, నేను అంకుటాలనై ఆత్మాజ్ఞానమిచ్చెడి హరిని వదిలిపెట్టి అన్యుని, కాంతుని, కోరుచున్నాను.(34)

టీ:- సత్సంగతౌ సత్యామప్యహో మయ మోహ ఇత్యాహ - విదేహినా మితి. యాహమసతీ అచ్యుతాదన్యం కామం భోగం ఇచ్ఛన్తీ సా.(34)

తా:- సత్సంగతికి సత్పురుషులున్ననూ నేను చాలా మోహమునందితిని అనుచున్నది విదేహినాయని. ఏ నేను చెడినదాననై అచ్యుతునికన్నా వేరైన వానిని భోగమును కోరుచున్నాను.(34)

35.శ్లో॥ సుహృత్ప్రేష్ఠతమోనాథ ఆత్మా చాయం శరీరిణాం ।
తం విక్రీయాత్మనైవాహం రేమేఽనేన యథా రమా ॥

తా:- ఈ పరమాత్మ ఈశ్వరుడు, జీవులకు మంచి స్నేహితుడు, ప్రియతముడు, ఆహరిని ఈ శరీరముచే, మనస్సుచే, నేను లక్ష్మివలె క్రీడిస్తాను.(35)

టీ:- ఏవం నిర్విణ్ణాసతీ అతః పరమేవంకరిష్యామీత్యాహ సుహృదితి. అయమీశ్వరః. ఆత్మనైవాత్మాన మేవ నివేద్య తంవిక్రీయ విశేషేణ క్రీత్వాఽనేనైవ సహరేమేరమా లక్ష్మీర్యథా. (35)

టీ:- ఈ ప్రకారముగా నిర్విణ్ణయగుచూ ఇక మీద నేనిట్లు చేయగలనని తలచినదని చెప్పుచున్నది సుహృదని. అయం - ఈశ్వరుడు. ఈ శరీరముచే, మనస్సుచే ఆ హరిని కాని ఈ హరితో క్రీడింతును. లక్ష్మీవలె. (35)

36.శ్లో॥ కియత్ప్రియం తే వ్యభజన్ కామా యే కామదా నరాః ।
ఆద్యంతవంతో భార్యాయాః దేవా వా కాలవిద్రుతాః ॥

తా:- అన్యుడు సేవింపదగినవాడు కాదని తెలుపుచున్నాడు కియత్ అని. జనన మరణములుకల కామములు విషయ సుఖవాంఛలు కామితముల నొసగు మనుజుల లేక దేవతలు కాలముచే తరుమబడిన వారై భార్యకు ఎంత మాత్రము ప్రీతిని చేసరి? ఏమియూ చేయలేరైరి, కావున ఇహమున గాని పరమునగాని ఆ విష్ణువుకన్నా సేవ్యుడింకొక్క డెవ్వడూ లేదని యర్థము.(36)

టీ:- అన్యస్యాసేవ్యత్వం దర్శయతి కియదితి. ఆద్యంతవంతోయే కామా విషయాః కామదా నరా వా దేవా వా కాలకలితా భార్యాయాః కియత్ప్రియం కృతవన్తో న కించిత్. అతోనేహాముత్ర చదద్వ్యతిరిక్తః కోऽపి సేవ్యోऽస్తీత్యతర్థః. (36)

టీ:- ఏ విషయ సుఖవాంఛలు కామితములనిచ్చు నరులు లేక దేవతలు కాలముచే తరుమబడిన వారు కావున జనన మరణములు కలవారు భార్యకు ఎంతమాత్రము ప్రీతిని కలిగించిరి.(కాంతాసక్తులగుదురు) (36)

37.శ్లో॥ నూనం మే భగవాన్ ప్రీతో విష్ణుః కేనాపి కర్మణా ।
నిర్వేదోऽయం దురాశాయాః యన్మే జాతస్సుఖావహః ॥

తా:- భగవంతుడగు విష్ణువు నా ఏదో అపూర్వ కర్మచే నిశ్చయముగా సంతోషించెను. ఏ సంతోషకారణము దుష్టమైన ఆశగల నాకు సుఖము కలిగించు ఈ వైరాగ్యము కల్గినదో.(37)

టీ:- ఏవం నిశ్చిత్య స్వభాగ్యమభినందతి. నూనమితి దుష్టా ఆశా యస్యాస్తస్యా మే. (37)

టీ:- ఈ ప్రకారము నిశ్చయించుకొని తన భాగ్యమునభినందించు చున్నది నూనమని. దుష్టయైన ఆసగల నాకు. (37)

38.శ్లో॥ మైవం స్యుర్మందభాగ్యా యాః క్లేశా నిర్వేదహేతవః ।
యేనానుబంధం నిర్హృత్య పురుషశ్శమమృచ్ఛతి ॥

తా:- నేనదృష్ట హీనురాలనగుచో ఇట్టి కష్టములు వైరాగ్య కారణములు కావు ఏ నిర్వేదముచే నరుడు బంధమగు గృహాదికము త్యజించి శాంతిని పొందుచున్నాడు.(38)

టీ:- నను ధనప్రాప్త్యా క్లిష్టాసి కథం విష్ణుః ప్రీతస్తత్రాహమైనమితి. మందభాగ్యా చేదహంస్యాం తర్హైవ నిర్వేద హేతవః క్లేశానస్యురిత్యర్థః యేన నిర్వేదేనాను బంధం గృహాదికం నిర్హృత్య = పరిత్యజ్య.(38)

టీ:- ధనప్రాప్తి లేకుండుటచే నీవు క్లేశములకు లోనైతివి విష్ణువెట్లు నీ విషయమై ప్రీతిగలవాడయ్యెను అనగా అందుకు చెప్పుచున్నది మైనమని నేనదృష్టహీనురాలయినచో, ఈ కష్టములు వైరాగ్య కారణములు కావు అనియర్థము. ఏ నిర్వేదముచే బంధమగు గృహాదికమును పరిత్యజించి. (38)

39.శ్లో॥ తేనోపకృతమాదాయ శిరసా గ్రామ్యసంగతా ।
త్యక్త్వా దురాశాం శరణం వ్రజామి తమధీశ్వరమ్ ॥

తా:- గ్రామ్య సుఖములగు సంభోగాదులందు కాముకులందును ఆసక్తురాలనైన నేను. విష్ణువు నాకు చేసిన ఉపకారము అగు నిర్వేదము శిరస్సుతో గ్రహించి నా ధన సుఖాదుల దురాశ వీడి ఆ పరమేశ్వరుడిని శరణు పొందెదను.(39)

టీ:- అతస్తేన శ్రీ విష్ణునోపకృతం కృతముపకారం నిర్వేదలక్షణం. గ్రామ్యేషు నరేషు విషయేషు వాసంగతాః. (39)

తా:- అందులకై ఆ విష్ణువుచే చేయబడిన ఉపకారమను నిర్వేదమును, గ్రామ్య నరులయందు, విషయములందు గాని ఆసక్తురాలనైతిని. (39)

40.శ్లో॥ సంతుష్టా శ్రద్ధధత్యేతత్ యథా లాభేన జీవతీ ।
విహరామ్యమునైవాహం ఆత్మనా రమణేన వై ॥

తా:- నాకు లభించిన ధనాదులలో సంతోషించి జీవిస్తూ శ్రీ విష్ణువును గూర్చి శ్రద్ధ చూపుతూ నామనోరమణుడగు శ్రీ మహావిష్ణువును గూడి విహరింతును. (40)

టీ:- కథం వ్రజసి తదాహ సంతుష్టేతి.(40)

టీ:- ఎట్లు పోదువనగా చెప్పుచున్నది సంతుష్టం.(40)

41.శ్లో॥ సంసారకూపే పతితం విషయైర్ముషితేక్షణం ।
గ్రస్తం కాలాహినాత్మానం కోఽన్య స్త్రాతుమధీశ్వరః ॥

తా:- సంసార కూపమున పడి విషయ సుఖముచే అపహరింపబడిన వివేకము కలవాడై కాలసర్పముచే కబళింపబడి శరీర సుఖదుఃఖముల ననుభవించు ఈ జీవుని రక్షించుటకు విష్ణువు కంటే అన్యుడెవడు సమర్థుడు కలడు.(41)

టీ:- నను బ్రహ్మాదీన్హిత్వా అమునైవేతికోయం నియమస్త త్రాహి - సంసారేతి. ముషితేక్షణం - అపహృతవివేకం.(41)

టీ:- బ్రహ్మాదులను వీడి విష్ణువుతో మాత్రం కూడి వుండవలెనని నియమమేమి? అనగా అందుకు చెప్పుచున్నది సంసారం అని. అపహరింపబడిన వివేకము కలదై. (41)

42.శ్లో॥ ఆత్మైవహ్యాత్మనో గోప్తా నిర్విద్యేత యదాఖిలాత్ ।
అప్రమత్త ఇదం పశ్యేత్ గ్రస్తం కాలాహినా జగత్ ॥

తా:- ఎప్పుడు సమస్తమైన ఇహాముత్ర భోగముల నుండి నిర్వేదమును పొందుచున్నాడో అప్పుడు ఆ పరమాత్మ హరియే తనకు రక్షకుడగును. జాగరూకుడై కాలసర్పముచే కబలింపబడినదిగా ఈ లోకమును చూడగలుగును.(42)

టీ:- తర్హి, కిమాత్మత్రాణోపాధినాతం భజిష్యసి, న, తత్ర సర్వతో నిర్విద్య భగద్భజనే ప్రవృత్తస్యాత్మన ఏవ సమర్థత్వాదిత్యాహ - ఆత్మైవేతి. యదా ఏవం జగత్పశ్యేత్తశ్చాప్రమత్తః సన్నిఖిలాదిహాముత్ర చ భోగాన్నిర్విద్యేత తదాహ్యాత్మనైవాత్మనో గోప్తేత్యన్వయః. అతః కేవలం ప్రేమ్ణైవ భజామీతి భావః. (42)

టీ:- అట్లయిన ఆత్మ రక్షకోపాధితో పొందగలవా ఏమి? ఈ సంసార మందుండి ఐహికాముష్మిక సుఖములన్నిటి నుండి నిర్వేదమును పొంది భగవంతుని భజనమందు ప్రవర్తించు ఆత్మయే సమర్థుడగుట వలన అనియనుచున్నారు. ఆత్మైవ అని. ఎప్పుడు ఈ విధముగా జగత్తును చూడగలుగునో, అప్పుడు జాగరూకుడై సమస్తమైన ఇహాముత్ర భోగముల నుండి నిర్వేదమును పొందుచున్నాడో అప్పుడు ఆ పరమాత్మ విష్ణువే తనకు రక్షకుడగును. అని అన్వయము. అందుకని కేవలము ప్రేమతోనే భజించుచున్నాడు అని భావము. (42)

**బ్రాహ్మణ ఉవాచ**

43.శ్లో॥ ఏవం వ్యవసితమతిర్దురాశాం కాంతతర్షజాం ।
ఛిత్త్వోపశమమాస్థాయ శయ్యాముపవివేశ సా ॥

టీ:- కాంతస్య తర్షోऽభిలాషస్తతో జాతం.(43)

44.శ్లో॥ ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్ ।
యథా సంఛిద్య కాంతాశాం సుఖం సుష్వాప పింగళా ॥

టీ:- ఫలితమాహ - ఆశాహీతి. (44)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**అష్టమోऽధ్యాయః**

**బ్రాహ్మణుడనుచున్నాడు**

తా:- ఇట్లా పింగళ మదిలో నిశ్చయించుకొని విటులపైగల కామాభిలాష వలన జనించిన దురాశను ఛేదించి మనశ్శాంతిని పొంది శయ్యపై పరుండెను. (43)

టీ:- ప్రియులందలి అభిలాష వలన జనించిన. (43)

తా:- ఆశయే చాలా దుఃఖకరము, ఆశలేకపోవుట పరమ సుఖము. కావున ప్రియులందరి ఆశను ఈ ప్రకారము విచారణ చేసినదై పింగళ వానిని విడిచి సుఖముగా నిద్రించినది.(44)

టీ:- ఫలితమును చెప్పుచున్నాడు ఆశాహి అని.(44)

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**అష్టమాధ్యాయము సమాప్తము.**

## నవమోऽధ్యాయః

బ్రాహ్మణ ఉవాచ

1. శ్లో॥ పరిగ్రహో హి దుఃఖాయ యద్యత్ప్రియతమం నృణామ్ ।
అనంతం సుఖమాప్నోతి తద్విద్వాన్ యస్త్వకించనః ॥

టీ:- నవమే కురరాదిభ్యో దేహతశ్చోపశిక్షితం. శృత్వా యదుః కృతార్థో భూత్ ఇతికృష్ణేన వర్ణితం . కురరాచ్ఛిక్షితమాహ - పరిగ్రహోహీతి. యద్యత్ప్రియతమం తస్య తస్య పరిగ్రహః. తద్విద్వానపరిగ్రాహో దుఃఖ మితి విదన్సన్, యస్త్వకించనస్త్యక్త పరిగ్రహో న తు దరిద్రః.(1)

2. శ్లో॥ సామిషం కురరం జఘ్నుః బలినోऽన్యే నిరామిషాః ।
తదామిషం పరిత్యజ్య స సుఖం సమవిందత ॥

## నవమాధ్యాయము

తా:- నరులకేది ఇష్టమో దానిని పరిగ్రహించుట దుఃఖానికి మూలము అని తెలిసినవాడై ఎవడు అన్ని పరిగ్రహములను త్యజించినవాడు దరిద్రుడుకాడు నిత్య సుఖమును పొందుచున్నాడు.(1)

టీ:- ఈ నవమాధ్యాయమందు కురరము మొదలయిన వాటి వలన దేహము వలన నేర్వబడిన దానిని విని యదురాజుకృతార్థుడయ్యెను అని కృష్ణునిచే వర్ణింపబడినది. కురరమృగము నుండి శిక్షితమును చెప్పుచున్నారు. పరిగ్రహోహి అని ఏది యేది ప్రియతమమో దానిని పరిగ్రహించుట; ఇట్లు ప్రియతమయిన దానిని గ్రహించుట దుఃఖమని తెలిసినవాడై ఎవడు ఎల్ల పరిగ్రహములను త్యజించినవాడో వాడు దరిద్రుడు కాడు.(1)

తా:- కండలు బలిసియున్న గొఱ్ఱెను చూచి తక్కిన దానికంటే బలవంతులైన నరులు మాంసము లేక బక్కచిక్కిన వారు మాంసము కొరకు చంపుచున్నారు. ఆ మాంసమును వీడి ఆ కురరము సుఖమును పొందెను.(2)

టీ:- తదాహసామిషమితి. (2)

టీ:- ధనాదులుండిన ఇతరులు పీడింతురు అది లేకున్న పీడలేదని కురరము వలన నేర్చితిని.(2)

3. శ్లో॥ న మే మానావమానౌ స్తః న చింతా గేహపుత్రిణామ్ ।
ఆత్మక్రీడో హ్యాత్మరతో విచరామీహ బాలవత్ ॥

తా:- నాకు మానావమానములు లేవు ఇల్లు బిడ్డలు గల సంసారుల కుండే చింతలేదు. ఆత్మయందురమించువాడను ఆత్మయందాసక్తి గలవాడనై బాలునివలె నేనుందును.(3)

టీ:- అర్భకశిక్షామాహ - నేతి. గేహ పుత్రిణాం తద్వతాం యా భవతి చింతా సా చమోనాస్తి, ఆత్మనైవ క్రీడాయస్య ఆత్మని రతిః యస్య సః (3)

టీ:- అర్భకుని వలన శిక్షితమును చెప్పుచున్నాడు న అని. ఇల్లు బిడ్డలు గలవారికి ఏ చింత వుండునో అది నాకు లేదు. ఆత్మతో క్రీడించుచు. ఆత్మయందాసక్తి గలవాడనై. (3)

4. శ్లో॥ ద్వావేవ చింతయాముక్తౌ పరమానంద ఆప్లుతౌ।
యో విముగ్ధో జడో బాలో యో గుణేభ్యః పరం గతః ॥

తా:- ఈ జగత్తున ఇద్దరే చింతను వదిలి బ్రహ్మానందమున మునిగిన వారు కలరు. ఒకడు అజ్ఞుడు ఏ ప్రయత్నము చేయని బాలుడు. రెండవ వాడు ప్రకృతికంటే పరుడగు ఈశ్వరుని పొందిన వాడు.(4)

టీ:- నన్వజ్ఞ సర్వజ్ఞయోః కింసాదృశ్యం నైశ్చిన్త్యం పరమసుఖమిత్యాహ - ద్వావితి. విముగ్ధోऽజ్ఞః జడోऽనుద్యమః, ఏవం భూతో యో బాలో యశ్చప్రకృతేః పరమీశ్వరం ప్రాప్తస్తౌద్వౌ.(4)

టీ:- ఓయీ! అజ్ఞునికి సర్వజ్ఞునికి ఏమి సాదృశ్యము అనగా నిశ్చింతుడగుటయే పరమ సుఖమనుచున్నాడు ద్వౌ అని. విముగ్ధుడు - అజ్ఞుడు జడుడు - ఏ ఉద్యమములేనివాడు. ఇట్టి ఏ బాలుడు కలడో, ఎవడు ప్రకృతికన్నా పరుడయిన ఈశ్వరుని పొందినవాడు గలడో ఆ ఇద్దరు.(4)

5. శ్లో॥ క్వచిత్కుమారీ త్వాత్మానం వృణ్వానాన్ గృహమాగతాన్ ।
స్వయం తానర్హయామాస క్వాఽపి యాతేషు బంధుషు ॥

తా:- ఒకసారి కన్య తనను వరించువారై తన ఇంటికివచ్చిన వారిని తన తల్లితండ్రులెవ్వరును తనకు లేకపోగా తానేవారిని సత్కరించినది. 5

టీ:- కుమార్యాః శిక్షితం వక్తుమాఖ్యాయికామాహి క్వచిదిత్యాదినా- వృణానాన్ స్వవరణాయాగతాన్. బంధుషు పిత్రాదిషు.(5)

టీ:- కుమారి వలన శిక్షితమును చెప్పుటకు ఆ కథను చెప్పుచున్నాడు క్వచిత్ మొదలుకొని. వృణ్వానాన్ - తనకు వరించుటకై వచ్చివారిని. బంధుషుః తల్లిదండ్రులు మొదలయినవారు.(5)

6. శ్లో॥ తేషామభ్యవహారార్థం శాలీన్ రహసి పార్థివ ।
అవఘ్నంత్యాః ప్రకోష్ఠస్థాః చక్రుశ్శంఖాస్స్వనం మహత్ ॥

తా:- ఆ కన్య అట్లు వచ్చిన పురుషులకు భోజనము కొరకు ఏకాన్త స్థలమందు వడ్లుదంచుచుండగా ఆమె మోచేతులందున్న కడియాలు (గాజులు) గల్లు గల్లుమని శబ్దము చేసినది.(6)

టీ:- శంఖాః శంఖవలయాః. మహిద్యధాభవతి తథా స్వనం చక్రుః6

టీ:- శంశవలయములు. పెద్ద ధ్వనిని చేసినవి.(6)

7. శ్లో॥ సా తజ్జుగుప్సితం మత్వా మహతీ వ్రీడితా తతః।
బభంజైకైకశశ్శంఖాన్ ద్వౌ ద్వౌ పాణ్యోరశేషయత్ ॥

తా:- బుద్ధిమంతురాలైన ఆ కన్య చప్పుడు వలన తాను స్వయముగా వడ్లుదంచుట తెలియవచ్చునని దాని వలన తన దారిద్ర్యము బయట పడునని తలచి సిగ్గుపడినదై తన చేతులయందలి గాజులన్నింటిని తీసి, చేతులందు రెండేసి గాజులనుంచుకొనెను. (7)

టీ:- సా మహతీ బుద్ధిమతీ. తత్స్వయం శాల్యవహననం. జుగుప్సితం దరిద్రతా ద్యోతకం. ఏకైకశః క్రమేణైక మేకం బభంజః స్వః కరా దపసారితవతీ. (7)

టీ:- సాః బుద్ధిమంతురాలయిన కన్య. తత్ తానే స్వయముగా వడ్లు దంచుట. జుగుప్సితం తన దారిద్ర్యమును తోపింపచేయు. క్రమముగా, బభంజ తన చేతి నుండి తొలగించెను (ధాతువుల కనేకార్థములుండుట వలన). (7)

8. శ్లో॥ ఉభయోరప్యభోద్ఘోషో హ్యవఘ్నంత్యా స్మ శంఖయోః ।
తత్రాప్యేకం నిరభినత్ ఏతస్మాన్నాభవద్ధ్వనిః ॥

తా:- ఆ కన్య చేతులకున్న రెండేసి గాజులు కూడా దంచుచున్నందున ధ్వనించసాగినవి అప్పుడా కన్య ఒక్కొక్క గాజును తొలగించెను. అప్పుడు మిగిలిన ఒక్క గాజు వలన చప్పుడు కాకుండనుండెను. (8)

టీ:- నిరభిదత్ - పృథకృతవతీ. (8)

టీ:- నిరభిదత్ - తొలగించెను. (8)

9. శ్లో॥ అన్వశిక్షమిమం తస్యాః ఉపదేశమరిందమ ।
లోకాననుచరన్నేతాన్ లోకతత్త్వ వివిత్సయా ॥

తా:- లోకముల తత్త్వమును తెలియగోరి ఈ లోకమునందంతట సంచరించుచు ఆ కుమారి వలన ఈ ఉపదేశః నేర్చితిని. (9)

టీ:- నను కుమార్యాస్తవ చ కథం సంగతిస్తత్రాహ - లోకానితి. (9)

టీ:- ఓయీ! కుమారికి నీకు సంగతి ఎట్లనగా చెప్పుచున్నాడు లోకాన అని. (9)

10. శ్లో॥ వాసే బహూనాం కలహో భవేద్వార్తా ద్వయోరపి।
ఏక ఏవ చరేత్తస్మాత్ కుమార్యా ఇవ కంకణః ॥

తా:- అనేక మందితో కూడి వసించుట యందు జగడము వచ్చును. ఇద్దరు కూడియున్ననూ కలహము కలుగును. అందువలన కుమారి కంకణము వలె ఒక్కడుగనే చరించవలెను. (10)

టీ:- వాస ఇతి. ప్రథమాంత పాఠే కలహహేతుః వార్తా గోష్ఠీ హేతుర్భ వేదిత్యర్థః. (10)

టీ:- వాసః అని ప్రథమాంత పాఠమున కలహానికి కారణము. కయ్యానికి కారణమయిన వార్తలు మెండై కయ్యము పెరుగును, అని అర్థము. (10)

11.శ్లో॥ మన ఏకత్ర సంయుజ్యాత్ జితశ్వాసో జితాసనః ।
వైరాగ్యాభ్యాస యోగేన ధ్రియమాణమతంద్రితః ॥

తా:- స్థిరాసనము మొదలయిన ఆసనమునందు కూర్చుండు వాడును, ప్రాణాయామముచే శ్వాస నరికట్టినవాడై వైరాగ్యముతోడి యోగము నభ్యసించుట ద్వారా తొట్రుబాటు లేనివాడై లక్ష్యమునందు స్థిరీకరణముగా చేయబడుచున్న మనస్సును ఒక్క లక్ష్యమునందే కూర్చవలెను.(11)

టీ:- చిత్తైకాగ్రతాఽద్వైతా స్ఫూర్తి లక్షణ సమాధి హేతురితి శరకారాచ్ఛిక్షితమిత్యాహ మన ఇతి. తత్రోపాయమాహ - జితేతి. ఆసనజయే శ్వాసజయః, తస్య చ జయే శ్వాసాధీనం మనో నిశ్చలం భవతి. నను క్షణం నిశ్చలం సదపి మనో విషయవాసనయా యది విక్షిప్యేత సుషుప్తావివ సర్వధా లీయేతవాతదా కింతత్రాహ-వైరాగ్యేతి. వైరాగ్యేణా విక్షిప్య మాణమభ్యాస యోగేనలక్ష్యే ధ్రియమాణం స్థిరీక్రియమాణం. 11

టీ:- చిత్తైకాగ్రత అద్వైతస్ఫూర్తియగు సమాధికి హేతువని శరకారుని వలన శిక్షితమును చెప్పుచున్నారు. మనఃఅని. అందులకు పాయమును చెప్పుచున్నారు జిత అని. ఆసన జయమయినచో శ్వాసను జయించగలడు. దానిని జయించినచో శ్వాసాధీనమయిన మనస్సు నిశ్చలమవుతుంది. ఓయీ! క్షణకాలము నిశ్చలమయిన మనస్సు విషయ వాసనలచే చలించిన దగునా! లేక సుషుప్తియందువలె పూర్తిగా విలీనమగునా? అప్పుడేమగును? అనగా చెప్పుచున్నాడు వైరాగ్యే అని అనుక్షణము విక్షిప్తమగుచుండు చిత్తమును వైరాగ్యముచే అభ్యాస యోగముచే లక్ష్యమందు స్థిరపరచి ఏ తొట్రుబాటును లేనివాడై (ఆ

12.శ్లో॥ యస్మిన్మనో లబ్ధపదం యదేతత్
శనైశ్శనై ర్ముంచతి కర్మరేణూన్ ।
సత్త్వేన వృద్ధేన రజస్తమశ్చ
విధూయ నిర్వాణము పైత్యనింధనమ్ ॥

టీ:- ఏకత్రేతి కుత్ర తదాహ యస్మిన్నితి. యల్లయ విక్షేపాత్మకం మన ఏతద్యస్మిన్పరమానందరూపే భగవతి లబ్ధాస్పదం సత్కర్మ రేణూన్ కర్మ వాసనా ముంచతి తస్మిన్. నను కర్మవాసనా త్యాగేపి సుషుప్తి వల్లయో దుర్వారః న, సత్త్వేనేతి. వృద్ధేనోప శమాత్మకేన రజస్తమసోరభావే విక్షేపలయాభావాన్ని ర్వాణమవృత్తికం ధ్యేయాకారేణావస్థానముపైతి, కుతః, అనింధనం, ఇంధనం గుణస్తత్కార్యం చ తద్రహితం తదుక్తం యోగశాస్త్రే మనసోవృత్తి శూన్యస్య బ్రహ్మాకారతయాస్థితిః.(12)

మనస్సును ఒక్క లక్ష్యమందే నిలపవలెను) ధ్రియమాణం-లక్ష్యమునందు స్థిరీకరణముగా చేయబడుచున్న. (11)

తా:- లయ విక్షేపాత్మకమయిన మనస్సు ఎప్పుడు పరమానంద స్వరూపుడగు భగవంతుని యందు స్థానము పొందినదగుచున్నదో, ఎప్పుడు కర్మవాసనలను మెల్లమెల్లగా వీడుచున్నదో అప్పుడు సర్వసంకల్ప క్రియల యొక్క ఉపరమమును పొంది యున్న సత్త్వ గుణము చేత రజోగుణమును, తమోగుణమును తిరస్కరించి సర్వవృత్తి శూన్యమైన ధ్యేయాకారస్థితిని, పొగలేని అగ్నివలె పొందు చున్నారు. 12

టీ:- ఒక్కచోట అనునదెక్కడననగా చెప్పుచున్నారు. యస్మిన్ అని. ఏ లయ విక్షేపాత్మకమయిన మనస్సు ఈ పరమానందరూపుడగు భగవంతుని యందు పొందబడిన స్థానము గలదై కర్మ వాసనలను వదులుకొనునో దానియందు. అయ్యా? కర్మ వాసనలను విడిచిననూ సుషుప్తియందు వలె మనస్సునకు లయమగు ద్వారమగునా. అనిన కాదు, ఎట్లనగా సత్త్వేన అని వర్ధిల్లిన ఉపరమరూపమైన సత్త్వగుణముచే, రజస్తమస్సుల అభావమున విక్షేపలయములు లేనందున శూన్యమయిన ధ్యేయాకారముగా నుండుట పొందుచున్నాడు. ఎందులకు అనింధనం -ఇంధనం గుణములు తత్కార్యము అది లేనిదైన స్థితిని. పొందు

చున్నాడు. యోగశాస్త్రమున నిట్లే చెప్పబడిన "సంకల్పవికల్ప రహితమై మనస్సు బ్రహ్మాకారమున నుండు స్థితి ఏదియో అది సంప్రజ్ఞాత సమాధియని" చెప్పబడును.(12)

13.శ్లో॥ తథైవమాత్మన్యవరుద్ధచిత్తో
న వేద కించిద్బహిరంతరం వా ।
యథేషుకారో నృపతిం వ్రజంతం
ఇషౌ గతాత్మా న దదర్శ పార్శ్వే ॥

తా:- ఆ ప్రకారము పరమాత్మయందు బంధింపబడిన చిత్తముకలవాడై వెలుపలగాని లోపలగాని కొంచెమునూ నెఱుంగడు ఎట్లనగా బాణము చేయు శిల్పి బాణమునందు లగ్నమయిన మనస్సుకలవాడై తనపక్కన పోవుచున్న రాజును చూడలేదో. అట్లు.(13)

టీ:- తతశ్చ నద్వైతస్ఫూర్తిరిత్యాహ తదేతి. బహిర్దర్శనాదినా. అంతరం స్మృత్యా. ఇషౌగతాత్మా తస్య ఋజూకరణే దత్తచిత్తోభేదీ ఘోషైరంతికే వ్రజంతం నృపతిమపి నవేద తద్వత్.(13)

టీ:- అందువలన ద్వైత స్ఫూర్తి లేదనుచున్నాడు తదౌ అని. బయట దర్శనాదులతో. ఆంతరం (లోన) స్మృతిచే. బాణమునందు లగ్నమయిన మనస్సు గలవాడు దానిని చక్కదనము చేయుట యందు దత్త చిత్తుడయి భేరీఘోషలతో సమీపమున వెళ్ళుచున్న రాజును కూడా చూడలేదో అట్లు. పరమాత్మయందు నిలిపిన చిత్తము గలయోగి బయటి జగత్తును గాని లోపలి మనోవృత్తులను గాని తెలియనివాడై యుండునని శరకారుని వలన నేర్చితిని.(13)

14.శ్లో॥ ఏకశ్చార్యనికేతస్స్యాత్ అప్రమత్తో గుహాశయః ।
అలక్ష్యమాణ ఆచారైః మునిరేకోఽల్పభాషణః ॥

తా:- ఒంటరిగా సంచరించుచున్నవాడైన సర్పమెట్లు జనులను శంకించుచూ ఏకాకియై తన నడవడులచే స విషమా, నిర్విషమా అని కన్పడనట్లు ఇతరులకు కనపడని వాడై అసహాయుడై మితభాషియై ముని వర్తించును.(14)

టీ:- సర్పాచ్ఛిక్షిత మాహ - ఏకచారీతి. యోగిసంమర్దస్యాసి త్యాగే కుమారీ గురుః జనసంగ త్యాగే సర్పః. సయధా జనాచ్ఛంకమానః ఏకాకీ విచరతి నియతనికేత రహితశ్చ సదాऽప్రమత్తశ్చైకాన్తవాసీ చ ఆచారైర్గతిభిః సవిషో నిర్విషోవేతి న లక్ష్యతే చ. అసహాయశ్చ మితభాషీ చ తద్వన్మునిి ద్వర్తేతేత్యర్థః. (14)

టీ:- సర్పము నుండి శిక్షితమును చెప్పుచున్నాడు యోగుల గుంపు విడుచుటలో కుమారి గురువు. జనసంగము విడుచుటలో సర్పము గురువు, సర్పమెట్లు జనులను శంకిస్తూ ఏకాకియై సంచరించునో, నియతమయిన ఇల్లు (నివాస స్థానము లేక) లేక సదా అప్రమత్తుడై ఏకాంతవాసియై ఆ చారైః - తన నడువడులచే సర్పము సవిషమా నిర్విషమా అని కన్పడనట్లు అ సహాయుడై మితభాషియై యోగియుండ వలె నని యర్థము (సర్పము వలన నేర్చితిని). (14)

15.శ్లో॥ గృహారంభో హి దుఃఖాయ విఫలశ్చాధ్రువాత్మనః ।
సర్పః పరకృతం వేశ్మ ప్రవిశ్య సుఖమేధతే ॥

తా:- నశ్వరమయిన దేహము కల వానికి గృహనిర్మాణము చేయుట ప్రయోజనము లేనిది. దుఃఖమునకే అగును, పాము చెదలు పురుగేర్ప రచిన గృహమును ప్రవేశించి సుఖముగా వుండును. (15)

టీ:- కించ, గృహారంభ ఇతి. అధ్రువాత్మనో నశ్వరదేహస్య సుఖం యథా భవతి తథా వర్ధతే. (15)

టీ:- మరియు గృహారంభ అని. అధ్రువాత్మనః నశ్వరమయిన దేహము కలవానికి, సుఖమెట్లు అగునో అట్లు వృద్ధినొందును. (15)

16.శ్లో॥ ఏకో నారాయణో దేవః పూర్వసృష్టం స్వమాయయా ।
సంహృత్య కాలకలయా కల్పాంత ఇదమీశ్వరః ॥

తా:- అద్వితీయుడు సర్వనియంతయగు దేవుడయిన నారాయణుడు తన మాయచే ముందు సృజించబడిన జగత్తును ప్రళయము నందు కాలశక్తిచే సంహరించును. (16)

టీ:- కారకసామగ్రీ నిరపేక్షాత్కేవలాదీశ్వరా ద్విశ్వసృష్టి సంహారా వూర్ణ నాభి దృష్టాంతేన మయా సంభావితావితి వక్తుం ప్రథమం సంహార ప్రకారమాహ ఏక ఇతి సార్ధత్రయేణ. ఏకః కారకనిరపేక్షః. పూర్వసృష్ట మిదం జగత్కాలకలయా కాలశక్త్యా సంహృత్య.(16)

టీ:- కారక సామగ్రీ నిరపేక్షుడై కేవలుడైన ఈశ్వరుని వలన విశ్వ సృష్టి సంహారములు జరుగును. అని ఊర్ణనాభి వృత్తాన్తము నాచే సంభావింపబడినదని చెప్పుటకు మొదట సంహార ప్రకారమును మూడున్నర శ్లోకములచే చెప్పుచున్నాడు ఏక అని. ఏకః కారక నిరపేక్షుడు. ముందు సృజింపబడిన ఈ జగత్తు కాల శక్తిచే సంహరించి. (16)

17.శ్లో॥ ఏక ఏవాద్వితీయోఽభూత్ ఆత్మాధారో నిరాశ్రయః
కాలేనాత్మానుభావేన సామ్యం నీతాసు శక్తిషు
సత్వాదిష్వాది పురుషః ప్రధానపురుషేశ్వరః ॥

తా:- ఒక్కడే అగుచు తనకు తానే ఆధారమై ఇతరాశ్రయము లేనివాడై తన సంకల్ప ప్రభావమున నడచు కాలశక్తిష సత్వగుణము మొదలగు శక్తులు గుణసామ్యమును ప్రధాన్యతను పొందినవి కాగా పురాణ పురుషుడు అద్వితీయుడు ప్రకృతి పురుషులకు ప్రభువు అయ్యెను.(17)

టీ:- ఏక ఏవాద్వితీయః సజాతీయ విజాతీయ భేదశూన్యోఽభూత్. కారణభూతాను సత్వాదిషు శక్తిష్వపి సామ్యం నీతా సుసతీషు. గుణసామ్యం ప్రధానం తదుపాధిః పురుషశ్చ తయోరీశ్వరః.(17)

టీ:- ఒక్కడై యుండి, అద్వితీయుడు, సజాతీయ విజాతీయ భేద శూన్యుడాయెను. కారణభూతములయిన సత్వాది శక్తులయందు గుణ సామ్యమును పొందినవి కాగా గుణసామ్యమును ప్రధానమును దాని యుపాధి పురుషుడునూ వాటికధీశ్వరుడు ప్రకృతి పురుషులకధీశ్వరుడై ఆది పురుషుడుండెనా.(17)

18. శ్లో॥ పరావరాణాం పరమః ఆస్తే కైవల్యసంజ్ఞితః ।
కేవలానుభవానంద సందోహో నిరుపాధికః ॥

తా:- బ్రహ్మాదులకు, ముక్తులైన జీవులకునూ ప్రాప్యమైన కైవల్యమను సంజ్ఞను పొందినవాడు నిర్విశేషుడై, స్వప్రకాశుడై, అనుభవైక వేద్యములయిన ఆనందముల సమూహమై పరమానంద స్వరూపుడై ఉండును. (18)

టీ:- పరావరాణాం పరబ్రహ్మాదయః అపరే అన్యే చ ముక్తా జీవాస్తేషాం పరమః ప్రాప్య ఆస్తే. కుతః. కైవల్య సంజ్ఞితో మోక్ష శబ్దాభిధేయః తత్రహేతుః కేవలేతి. కేవలోనిర్విషయః. స్వప్రకాశః ఆనందానాం సదోహః సమూహః పరమానంద ఇత్యర్థః. కుతః నిరుపాధికః.(18)

టీ:- పరులగు బ్రహ్మాదులు ఇతరులయిన ముక్తులయిన జీవులు వారికి పరమ ప్రాప్యమయిన కైవల్యమను సంజ్ఞను పొందినవాడై యున్నాడు. ఎందులకు కైవల్య సంజ్ఞితుడయిన మోక్షశబ్దాభిధేయుడు అనగా హేతువు కేవల అని. కేవల - నిర్విషయుడు స్వప్రకాశుడు ఆనందముల యొక్క సమూహమయిన పరమానందమని అర్థము. ఎందులకు, ఉపాధిరహితుడు.(18)

19. శ్లో॥ కేవలాత్మానుభావేన స్వమాయాం త్రిగుణాత్మికమ్ ।
సంక్షభయన్ సృజత్యాదౌ తయా సూత్రమరిందమ ॥

తా:- ఓ అరిందమ! కేవలుడైన తన సంకల్ప ప్రభావముచేత సృజించ బడిన తనకాలశక్తిచే త్రిగుణాత్మకయై సామ్యావస్థను పొందియున్న మాయను, గుణ వ్యవస్థను మార్పు చేసి చలింపచేసి ఆ మాయచే జీవుల సంసారమునకు హేతుభూతమై క్రియా శక్తి ప్రధానమైన మహత్తత్వమును సృజించుచున్నాడు.(19)

టీ:- అతః కేవలాదేవ సృష్టిం దర్శయతి కేవలేనాత్మానుభావేన. కాలేన. సూత్రం క్రియాశక్తి ప్రధానం మహత్తత్వం సృజతి. జీవసంసార హేతు భూతే సూత్రే సృష్టేపిత్వంమాభైరితి సంబోధయతి. అరిందమ - అరీన్‌రాగా దీన్ దమయితుం సమర్థః. (19)

టీ:- అందులకు కేవలుడయిన ఈ నారాయణుని వలననే సృష్టి కలుగుచున్నదని తెలుపుచున్నారు. కేవల్యే ఆత్మానుభావేన కాలేన-తన మహిమచే సృష్టింపబడిన కాలశక్తిచే సూత్రం - క్రియాశక్తి ప్రధానమైన మహత్తత్వమును సృజించుచున్నాడు. జీవుల సంసారమునకు హేతు భూతమయిన సూత్రము సృష్టింపబడినదన్న మాత్రమున నీవు భయపడకుము అని అరిందమ శత్రువులయిన రాగాదులను లయింపచేయ సమర్థుడా! అని సంబోధించినారు.(19)

20.శ్లో॥ తామాహుస్త్రిగుణవ్యక్తిం సృజంతీం విశ్వతోముఖం ।
యస్మిన్ ప్రోతమిదం విశ్వం యేన సంసరతే పుమాన్ ॥

తా:- ఆ వ్యక్తినే క్రియాశక్తిని గుణత్రయము యొక్క కార్యమును నానా విధమై త్రిగుణాత్మకమైన విశ్వమును అహంకారము ద్వారా సృజించు దానినిగా చెప్పుదురు, ఏకారణభూతమయిన సమష్టి రూపమయిన సూత్రము నందు ఈ విశ్వము కూర్చబడియున్నదో ఏ సూత్రముచే పురుషుడు సంసారమునందు భ్రమించుచున్నాడో. (20)

టీ:- సూత్రస్యైవ వ్యక్తిశబ్దేనోచ్యమానస్య తామితి స్త్రీలింగేన పరామర్శః త్రిగుణవ్యక్తిం గుణత్రయకార్యం అత ఏవ విశ్వతో ముఖం నానావిధాం త్రిగుణాత్మకం విశ్వమహంకార ద్వారేణ సృజతీం. త్రిగుణ కార్యస్య సూత్ర సంజ్ఞాయాం కారణమాహ యస్మిన్నితి. కారణభూతే సమష్టిరూపే యస్మిన్నిదం విశ్వంప్రోతం గ్రథితం "వాయుర్వై గౌతమ సూత్రం

టీ:- సూత్రమునకే వ్యక్తి శబ్దముచే చెప్పబడుటచే తామని స్త్రీలింగముతో పరామర్శ. గుణత్రయము యొక్క కార్యమును. అందులకే నానా విధమయిన త్రిగుణాత్మకమయిన విశ్వమును అహంకార ద్వారముచే సృజించుదానినిగా. త్రిగుణ కార్యమునకు సూత్రసంజ్ఞ వచ్చుటకు కారణమును చెప్పుచున్నారు యస్మిన్నని. కారణభూతమయిన సమష్టి

వాయునావై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చలోకః సర్వాణి చ భూతాని సంద్బృబ్ధాని" ఇతి శృతేః. యేన వాయ్వాత్మనా ప్రాణరూపేణ జీవః సంసరతి. (20)

రూపమైన దేనియందిది కూర్చబడియున్నదో, శృతిగూడా "ఓ గౌతమా! వాయువే ఆ సూత్రము వాయువు చేతనే ఈ లోకము పరలోకము సర్వభూతములు లోనజొచ్చి ధరింపబడియున్నవి. ఆవాయ్వాత్మకమైన ప్రాణరూపము చేత జీవుడు సంచరించును" అని చెప్పినది. యే వాయ్వాత్మగా ప్రాణరూపుడయిన జీవుడు సంసారము నందు భ్రమించు చున్నాడో.(20)

21.శ్లో॥ యథోర్ణనాభిర్హృదయాత్ ఊర్ణాం సంతత్యవక్త్రతః ।
తయా విహృత్య భూయస్తాం గ్రసత్యేవం మహేశ్వరః ॥

తా:- సాలెపురుగు తన కడుపులో నున్న ద్రవరూపమయిన లాలను నోటి నుండి నూలుపోగు రూపమున వెలువరించి దానితో వల వలె గూడుగా అల్లి దాని యందు విహరించి మళ్ళీ దాని నెట్లు కబలించి వేయుచున్నదో అట్లే పరమేశ్వరుడు తన మాయచే తనలోన్ను జగత్తును సృజించి పాలించి సంహరించుచున్నాడను నది సాలె పురుగు వలన నేర్చితిని. (21)

టీ:- తదేవం శిక్షితమర్థముక్త్వా దృష్టాన్తమాహ యథేతి - హృదయా దుద్గతాం వక్త్రతో వక్త్రేణ సంతత్య ప్రసార్య విహృత్య క్రీడిత్వా. (21)

టీ:- ఈ ప్రకారము శిక్షితమును చెప్పి దృష్టాంతమగు నర్థమును చెప్పుచున్నారు యథా అని. హృదయమునుండి వచ్చు (లాలా ద్రవమును) నోటినుండి నూలుపోగుగా ప్రసరించి. విహరించి-ఆడి. (21)

22.శ్లో॥ యత్ర యత్ర మనో దేహీ ధారయేత్సకలం ధియా ।
స్నేహాద్ద్వేషాద్భయాద్వాపి యాతి తత్తత్సరూపతామ్ ॥

తా:- ఎందెందు జీవుడు బుద్ధి చేత, స్నేహమువలన, ద్వేషము వలననూ భయము వలనను మనస్సు నిలుపునో దానిదాని సారూప్యమును పొందును.(22)

టీ:- భగవద్ధ్యాన పరాణాం తత్సారూప్యం న చిత్రమితి పేశస్కృతో భ్రమర విశేషాజ్ఞాత మిత్యాహ యత్ర యత్రేతి. సకలమేకాగ్రం.(22)

టీ:- భగవద్ధ్యానపరులకు ఆ భగవత్సారూప్యము కలుగుట విచిత్రము గాదని పేశస్కృత (పట్టు పురుగు) భ్రమర దృష్టాంతముచే తెలియబడిన దనుచున్నారు యత్ర యత్ర యని. సకలం - ఏకాగ్రము.(22)

23.శ్లో॥ కీటః పేశస్కృతం ధ్యాయన్ కుడ్యాం తేన ప్రవేశితః ।
యాతి తత్సమతాం రాజన్ పూర్వరూపమసంత్యజన్ ॥

తా:- ఓ రాజా! పురుగు పట్టు గూడు భ్రమరమును ధ్యానించుచూ ఆ పట్టుగూడు నందు ఆ భ్రమరముచే నిర్బంధిబడినదై తన మొదటి కీట రూపమును త్యజింపకయె. ఆ శరీరముతోను తుమ్మెద రూపమును పొందును.(23)

టీ:- కూడ్యాం ప్రవేశితో నిరుద్ధో భయేన ధ్యాయన్సాత్మతాం తత్సారూప్యం. సామ్యతామితి పాఠే త్వార్షతా. పూర్వరూపమసంత్యజన్నిత్యస్యాయమభిప్రాయః. యదా తేనైవ దేహే నాన్య సారూప్యం దృశ్యతే తదా కింవక్తవ్యం దేహాన్తరేణ సారూప్యం ఘటత ఇతి.(23)

టీ:- పట్టు గూడునందు ప్రవేశించిన నిరోధింపబడిన భయముతో ధ్యానిస్తూ తత్సారూప్యమును. సామ్యతా యను పాఠమున ఆర్షతాయన వలెను. పూర్వ రూపమును వదలక అనుదానికిది యభిప్రాయము ఎప్పుడు ఆ దేహము చేతనే అన్య సారూప్యము కన్పట్టుచున్నదో దేహాంతరముతో సారూప్యము ఘటించునని వేరేల చెప్పవలెను. (తప్పక ఘటించును) (23)

24.శ్లో॥ ఏవం గురుభ్య ఏతేభ్యః ఏషా మే శిక్షితా మతిః ।
స్వాత్మోపశిక్షితాం బుద్ధిం శృణు మే వదతః ప్రభో ॥

తా:- ఓ రాజా! నేనీప్రకారము ఈ గురువుల వలన నా చిత్తముచే ఆయా గుణముల నభ్యసించితిని మరి నా దేహము వలన పొందిన బుద్ధిని గూర్చి చెప్పుదును వినుము.(24)

టీ:- స్వదేహాదేవ శిక్షితమాహ స్వాత్మేతి. స్మాత్మనో దేహాచ్ఛిక్షితాం.(24)

టీ:- తన దేహము వలన శిక్షితమును చెప్పుచున్నారు. నా దేహము వలన శిక్షితమును.(24)

25.శ్లో॥ దేహో గురుర్మమ విరక్తి వివేక హేతుః
బిభ్రత్స్మసత్త్వనిధనం సతతార్త్యుదర్కం ।
తత్త్వాన్యనేన విమృశామి యథా తథాపి
పారక్యమిత్య వసితో విచరామ్యసంగః ॥

తా:- దేహము గురువు అయ్యి నాకు వైరాగ్య జ్ఞానములకు కారణమయి యున్నది. ఉత్పత్తి నాశనములను ఎల్లప్పుడు దుఃఖమును భరించు చున్నది. ఈ శరీరముచే పంచ వింశతి తత్వములను యథాక్రమమున విమర్శించుచున్నాను ఇట్టిఉపకార హేతువయిన ఈ శరీరము కుక్క నక్క మొదలయిన జంతువులకు భక్ష్యమని నిశ్చయించుకొన్నవాడనై దేహము నందు సంగము వీడి చరించుచున్నాను.(25)

టీ:- గురుత్వే హేతుః విరక్తి వివేకయోర్హేతుః విరక్తి హేతుత్వమాహ - సత్వ నిధన ముత్పత్తి వినాశౌ బిభ్రత్స్మ. కించ సతతం సంతత మార్త్యుదర్కం దుఃఖమేవోత్తరఫలం బిభ్రత్. యద్వా సతతార్తిరేవోదర్క ఉత్తర ఫలం యస్య తత్సత్వని ధనం బిభ్రత్. వివేక హేతుత్వమాహ. తత్వానీతి. యథా యథావత్. ఏమత్యుపకారిత్వేపి దేహేనైవాస్థా కర్తవ్యే

టీ:- గురుత్వమునకు హేతువు వైరాగ్య జ్ఞానములకు కారణమై యున్నది. విరక్తి హేతుత్వమును చెప్పుచున్నారు "సత్త్వని" ధన ముత్పత్తి వినాశములను భరించుచున్నది. మరియు ఎల్లప్పుడు దుఃఖమే ఉత్తర ఫలముగా భరించు. లేదా ఎల్లప్పుడు దుఃఖమే ఉత్తరఫలము దేనికో ఆసత్వని ధనములను భరిస్తూ, వివేక హేతుత్వమును చెప్పుచున్నారు.

త్యాహ – తథాపీతి. పారక్యం శ్వశృగాలాది భక్ష్యమితి నిశ్చితవాన్.(25)

తత్వాని అని. యథా యథా క్రమమున. ఇట్లు అత్యుపకారము చేయునదయిన ఈ దేహమునదు ఆస్థి కర్తవ్యము కాదనుచున్నారు. తథాపి యని. పారక్యం – కుక్క నక్క మొదలయిన జంతువులకు భక్ష్యమని నిశ్చయించుకున్నాను.(25)

26.శ్లో॥ జాయాత్మజార్థపశుభృత్యగృహాప్తవర్గాన్
పుష్ణాతి యత్ప్రియచికీర్షతయా వితన్వన్ ।
స్వాంతే సకృచ్ఛ్రమవరుద్ధధనస్స దేహః
సృష్ట్వాస్య బీజమవసీదతి వృక్షధర్మా॥

తా:– పురుషుడు తన దేహమునకు సుఖభోగమును సమకూర్చ నిచ్చ గలవాడై భార్యాపుత్రులు, ధనము, పశువులు, భృత్యులు, గృహములు, బంధుమిత్రులు మొదలయిన వారిని తాను దేహి కష్టమును పొంది సంతాపము చెంది సంపాదించిన ధనముచే పోషించుచున్నాడు. అట్టి ఈ తన దేహము తనకాయుష్యము మూడగానే తాను వృక్షమెండి పోవుచూ తన సంతతి వృక్షములను కలుగుటకు బీజములు సృజించి నట్లు పురుషునికి మరియొక దేహము కలుగుటకు కారణ మయిన కర్మ బీజమును సృజించి నశించుచున్నది.(26)

టీ:– సతతార్త్యుదర్కతాం ప్రపంచయతి. జాయేతి ద్వాభ్యాం. యస్య దేహస్య ప్రియ చికీర్షయా భోగ సంపాదనేచ్ఛయా జాయాది వర్గాన్ వితన్వన్పుష్ణాతి పురుషః. కథంభూతః సకృచ్ఛ యథా భవతి తథా వరుద్ధాని సంచితాని ధనానియేన సః, దేహ విశేషణం వా. సదేహః స్వాన్తే స్వస్యాయుషోఽన్తేఽవ సీదతి నశ్యతి. కించ దేహనాశేఽపి

టీ:– సంతతము దుఃఖమే ఆయతి ఫలముగాగల దనుటకు రెండు శ్లోకములచే వివరించుచున్నారు. జాయాఅని రెంటిచే. ఏ దేహమునకు భోగ సంపాద నేచ్ఛ చేత జాయాది వర్గములను విస్తరించుచు పురుషుడు పోషించుచున్నాడు. ఎట్టివాడు చాలా కష్టపడుటచే చేర్చ పెట్టబడిన ధనము కలవాడై (కృచ్ఛమెట్లవుతుందో అట్లు చేర్చ పెట్టబడిన ధనము

న దుఃఖ సమాప్తి రిత్యాహ – అస్య పురుషస్య దేహాన్తర బీజం కర్మ సృష్ట్వేతి. వృక్షస్యేవ ధర్మోయస్య సః. (26)

కలవాడై) దేహ విశేషణమయిననూ కావచ్చును. ఆ దేహము తన ఆయువు అంతమయినప్పుడు నశించుచున్నది. మరియు దేహము నశించిననూ దుఃఖసమాప్తి లేదు అనుచున్నాడు – అస్య ఈ పురుషుని యొక్క దేహాంతర బీజమును కర్మను సృజించి అని. వృక్ష ధర్మము కలదై. (26)

27.శ్లో॥ జిహ్వైకతోఽముమపకర్షతి కర్హి తర్షా
శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్ ।
ఘ్రాణోఽన్యతశ్చపలదృక్క్వ చ కర్మశక్తిః
బహ్వ్యస్సపత్న్య ఇవ గేహపతిం లునంతి ॥

తా:– నాలుక రుచులకై లాగును దప్పిక జలమునకు ఆకర్షించును శిశ్నము మైథునమునకై పోవును. త్వగింద్రియము స్పర్శమునకు, ఉదరము అన్నమును గూర్చి, శ్రవణము శబ్దమును గూర్చి, ఘ్రాణము గంధమును గూర్చి, చపలపుచూపు రూపును గూర్చి, ఆకర్షించు చున్నాయి ఇతరములయిన వాగాదీంద్రియములు కూడా వాని వాని విషయమును గూర్చి లాగుకొని పోవును. ఒక్కనికి అనేక మంది భార్యలున్న ఎట్లు బాధలను పొందునో గృహ యజమాని అట్లే ఈ ఇంద్రియములన్నీ పురుషుని తునకలు చేయుచున్నవి.(27)

టీ:– కించ జిహ్వేతి. అముం దేహం అదభిమానినం పురుషం వా. ఏకతః రసం ప్రతి జిహ్వా అపకర్షతి ఆచ్ఛినత్తి. కర్హి కదాచిత్. తర్షా పిపాసా జలం ప్రతి. శిశ్నో వ్యవాయం ప్రతి. త్వక్ స్పర్శం ప్రతి. ఉదరం అన్నమాత్రం ప్రతి. శ్రవణం శబ్దమాత్రం ప్రతి. ఘ్రాణో

టీ:– మరియు జిహ్వా అని – ఈ దేహమును తదభిమాన పురుషుని నయిననూ, ఒక ప్రక్క రసమును గూర్చి జిహ్వా ఆకర్షించును. ఒకప్పుడు దప్పి జలమును గూర్చి, శిశ్నము మైథునము గూర్చి, త్వక్ స్పర్శను గూర్చి, కడుపు అన్నమును గూర్చి, చెవులు శబ్దమును గూర్చి, ముక్కు

గంధమాత్రం ప్రతి. చపలదృక్ రూపమాత్రం ప్రతి. క్వచ క్వచిత్. స్వ స్వ విషయం ప్రతి. కర్మశక్తిః అన్యదపి కర్మేంద్రియం లునంతి త్రోటయంతి. (27)

గంధమును గూర్చి, చపలమయిన దృక్కు రూపమును గూర్చి, ఒకొక్కప్పుడు వాగాదికర్మేంద్రియములు వాని వాని విషయములకు లాగుచు పురుషుని తుత్తునుకలు చేయుచున్నది. (27)

28. శ్లో॥ సృష్ట్వా పురాణి వివిధాన్యజయాత్మశక్త్యా
వృక్షాన్ సరీసృప పశూన్ ఖగదంశమత్స్యాన్ ।
తై స్తైరతుష్టహృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః ॥

తా:- పరమేశ్వరుడు ఆత్మ శక్తియగు మాయచే వివిధములగు ప్రాణుల శరీరములను, వృక్షములను, సర్పములను, జంతువులను, పక్షులను, దోమలను, చేపలను సృజించి తృప్తి చెందనివాడై బ్రహ్మమును సాక్షాత్కరించుకొను బుద్ధిగల పురుషుని పురుషదేహమును సృజించి సంతోషమును పొందెను. (28)

టీ:- తదేవం దేహో గురురిత్యాది త్రిభిర్విరక్తి వివేక హేతుత్వముపపాద్య ఇదానీమస్య దేహస్యాతి దుర్లభీత్వం దర్శయన్నీశ్వర నిష్ఠాం విధత్తే సృష్ట్వేతి ద్వాభ్యాం. పురాణి శరీరాణి. పురుషం పురుష దేహం. బ్రహ్మణోఽవ లోకాయా పరోక్ష్యాయ ధిషణాబుద్ధిర్యస్మింస్తమ్. తదుక్తం "తాసాం మే పౌరుషీప్రియా" ఇతి శృతిశ్చ "పురుషత్వే చావిస్తరామాత్మా" ఇత్యాదిః (ఈశ్వరోహికరణాధిష్టాతిరగ్న్యాది దేవతా వాగాదిభిః సహ సృష్టవాన్. తాశ్చ తం ప్రతి భోగార్థం శరీరిమయాచన్త. స చ తాభ్యోగో శరీర మశ్వ శరీరం పురుష శరీరం యథా క్రమమానీతవాన్. తతస్తా దేవతాః సోఽబ్రవీద్యధాయతనం చక్షురాది స్థాన ఆస్మిన్దేహే ప్రవిశతేతి.

టీ:- ఈ ప్రకారము దేహము గురువని మూడు శ్లోకములచే విరక్తి వివేక హేతువుగా నుపపాదించి ఈ దేహమతి దుర్లభమని తెలుపుచూ ఈశ్వర నిష్ఠను రెండు శ్లోకములచే విధించుచున్నాడు. సృష్ట్వా అని. పురాణి శరీరములు. పురుష దేహమును బ్రహ్మను అవలోకించుటకు అపరోక్షముగా తెలియు బుద్ధిగల ఈ విషయమే "తాసాంమే" ఆ మృగాది తనువుల లోపల పురుషుని తనువు నాకు ప్రియమైనది. "శృతి కూడా- పురుష స్వరూపమునందే పరమాత్మ ఆవిర్భవించును" ఈశ్వరుడు ఇంద్రియములతో గూడ సృజించెను. ఆ దేవతలు పరమేశ్వరుని భోగ సంపాదనము కొరకు శరీరమును ఇవ్వమని యాచించినవి. ఆ

తదాహ తాభ్య ఇత్యాది.) తథా తాభ్యోగామానయత్తా అబ్రువన్న వైనోऽయ మలమితి తాభ్యోऽశ్వమాన యత్తా అబ్రువన్నవైనోయ మలమితి తాభ్యః పురుషమానంత్తా అబ్రువన్సుకృతం బత" ఇతి చ.(28)

ఈశ్వరుడు వానికై గో శరీరమును, అశ్వ శరీరమును, పురుష శరీరమును, క్రమముగా సృజించి, అంత ఆ దేవతలను వాగాదులను, ఇంద్రియములతోగూడ సృజించెను. ఆ దేవతలను గూర్చి అతడిట్లు చెప్పెను. మీరు మీమీ ఆయనతములగు చక్షురాల స్థానమును గూర్చి ఈ దేహమునందు ప్రవేశింపుడు అనెను. ఈశ్వరుడా దేవతలకు గోవును సృజించెను. దేవతలు మాకీగో శరీరము చాలదని చెప్పిరి. మరి అశ్వమును సృజించెను ఈ అశ్వ శరీరమునూ మాకు చాలదనిరి పురుష శరీరమును సృజించెను. అంత ఆ దేవతలు పుణ్యవంతమగు ఈ శరీరము మాకు చాలుననిరి.(ఐతరేయోపనిషత్తు) (28)

29.శ్లో॥ లబ్ధ్వా సుదుర్లభమిదం బహుసంభవాంతే
మానుష్యమర్థదమనిత్యమపీహ ధీరః ।
తూర్ణం యతేత న పతేదనుమృత్యు యావత్
నిశ్శ్రేయసాయ విషయః ఖలు సర్వతస్స్యాత్ ॥

తా:- అనేక జన్మలకు చివర చాలా దుర్లభమయిన ఈ మనుష్య జన్మము అనిత్యమయినను ఇహామాత్రమగు పురుషార్థమునిచ్చు దానిని పొంది ధీరుడు నిరంతరము మృత్యువుకల ఈ శరీరము ఎంత వరకు పతితము కాదో అంతలోనే తొందరగా మోక్షము కొరకు ప్రయత్నము చేయవలెను విషయ సుఖము మాత్రము పశ్వాది జన్మములందునూ కలుగునుకదా. (29)

టీ:- తస్మాద్బహూనాం సంభవానాం జన్మనామంతే మానుష్య మనిత్య మప్యర్థదం పురుషార్థ ప్రాపకం దైవాల్లబ్ధ్వేదమనుమృత్యు అన్యను

టీ:- అందులకై చాలా జన్మలకు చివర, ఈ మనుష్యజన్మము అనిత్యమయిననూ, పురుషార్థమునిచ్చు దానిని దైవాత్ పొంది,

నిరంతరం మృత్యవోయస్య తద్యావన్న పతే త్తావదేవ తూర్ణం శీఘ్రం నిశ్శ్రేయసాయ యతేత. విషయః పునః సర్వతః పశ్వాది యోనిష్వపి స్యాదేవ. (29)

నిరంతరము మృత్యువు కల ఈ శరీరమును పొంది ఎంతవరకు భూమి పైన పడదా అంతలోపలనే శీఘ్రముగా మోక్షము కొరకు ప్రయత్నించ వలెను. విషయ సుఖము మాత్రము పశ్వాది జన్మలందునూ కలుగును కదా!. (29)

30. శ్లో॥ ఏవం సంజాతవైరాగ్యో విజ్ఞానాలోక ఆత్మని ।
విచరామి మహీమేతాం ముక్తసంగోऽనహంకృతిః ॥

తా:- ఈ ప్రకారము చాలా మంది గురువుల వలన గుణములను అభ్యసించి విశిష్ట జ్ఞానమను దీపము గల పరమాత్మయందు మనస్సు నిలిపి విరక్తుడనై అన్నిటి యందు సంగమును విడిచి అహంకారమును వీడి ఈ భూమి పై సంచరిచుచున్నాను. (30)

టీ:- తదేవం హేయోపాదేయవివేకం బహుధాని రూప్యేదానీం యదుక్తం "త్వంతుకల్పః కవిర్దక్షః. ఇత్యాది తత్రోత్తరమాహ. ఏవమితి. ఏవం బహుభ్యో గురుభ్యో శిక్షితేన నివిష్టం జ్ఞానమేవాలోకః ప్రదీపోయస్య సః సప్తమ్యంతం వా ఆత్మ విశేషణం. ఆత్మని స్థిత ఏవ మహీం విచరామి. (30)

టీ:- ఈ ప్రకారము హేయోపాదేయ వివేకమును అనేక విధముల నిరూపించి ముందు "నీవు కల్పుడవు కవివి దక్షుడవు" అని పలికిన దానికి ప్రత్యుత్తర మిచ్చుచున్నారు. ఏవమని. - ఈ ప్రకారముగా చాలా మంది గురువుల నుండి శిక్షితమయిన విశిష్ట జ్ఞానమను దీపముగల. సప్తమ్యంతముగా నయిననూ ఆత్మ విశేషణము. ఆత్మ యందుంటూనే ఈ భూమిని సంచరించుచున్నాము. (30)

31. శ్లో॥ న హ్యేకస్మాద్గురోః జ్ఞానం సుస్థిరం స్యాత్సు పుష్కలం ।
బ్రహ్మైతదద్వితీయం వై గీయతే బహుధర్షిభిః॥

తా:- ఒక్క గురువు నుండి పుష్కలమయిన జ్ఞానము ఉత్పన్నము కాదు. ఈ అద్వితీయ బ్రహ్మము మహర్షులచే అనేక రకాలుగా కీర్తింపబడు చున్నది. (31)

టీ:- నను కింబహుభిర్గురుభిన్న హి శ్వేతకేతు భృగుప్రముఖైర్బ హవో గురవ ఆశ్రితాః స్తత్రాహ - నహ్యేకస్మాదితి. బహుధా సప్రపంచనిష్ప్ర పంచ భేదాదిభిః. అయంభావోనైతే పరమార్థోపదేశగురవః కిన్త్వన్వయ వ్యతిరేకాభ్యామాత్మన్య సంభావనాదిమాత్ర నివర్తకాస్తేషాం బహుత్వం యుక్తమే వేతి. జ్ఞానప్రదం గురుమేవేతి జ్ఞానప్రదం. గురుమేకవేవ వక్ష్యతి "మదభిజ్ఞం గురుంశాంతముపాసీత" ఇతి. ఉక్తం చ- "తస్మాద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసుః శ్రేయ ఉత్తమం" ఇతి.(31)

టీ:- ఓయీ చాలామంది గురువులతో పనేమి? శ్వేతకేతువు భృగువు మొదలయినవారు చాలా గురువుల నాశ్రయించిన వారు కారుగదా? అనగా అందులకు చెప్పుచున్నారు నహ్యేకస్యాత్ అని. బహుధా - సప్రపంచ నిష్ప్రపంచభేదాదులచే. దీని భావమిది వీరందరు పరమార్థో పదేశ గురువులు కారు మరియేమనగా, అన్వయ వ్యతిరేకములచే ఆత్మయందు తోచు అసంభావనాదులను మాత్రము పరివర్తింప చేయువారు. వారు చాలామంది ఉండుట యుక్తమే యగును. జ్ఞాన ప్రదుడగు గురువొక్కడే అని "మదభిజ్ఞం" నన్నెరిగిన శాంతుడగు గురువునుపాసింపుము అని ముమ్ముందు చెప్పగలడు. అట్లే 'తస్మాద్గురుం' అందువలన ఉత్తమ శ్రేయస్సగు మోక్షమును గూర్చి తెలియగోరినవాడు ఉత్తముడగు గురువును శరణుపొందవలెను. (31)

**శ్రీ భగవానువాచ**

32. శ్లో॥ ఇత్యుక్త్వా స యదుం విప్రః తమామంత్ర్య గభీరధీః ।
వందితోऽభ్యర్చితో రాజ్ఞా యయౌ ప్రీతో యథాగతమ్ ॥

తా:- అని ఇట్లా స్థిరబుద్ధి గల బ్రాహ్మణరూప ధారియగు దత్తాత్రేయుడు యదువుతో పలికి అతనిని వీడ్కొన అతనిచే నమస్కృతుడై సత్కారము నొంది వచ్చిన దారిన పోయెను.(32)

టీ:- విప్రోదత్తాత్రేయః 'యోగర్ధిమా పురుభయీాం యదుహైహ యాద్యా' ఇత్యుక్తత్వాత్. యథాగతం తథైవ. యదృచ్ఛయా యయావిత్యర్థః. (32)

టీ:- విప్రుడు- దత్తాత్రేయుడు "యదువు కార్తవీర్యుడు కర్మయోగమును, జ్ఞానయోగమును సమగ్రముగా దత్తాత్రేయుని వలన నెఱింగిరని చెప్పబడుట వలన. వచ్చిన మార్గమున అట్లే (వచ్చినట్లుగానే వెళ్ళెనని తాత్పర్యము) (32)

33. శ్లో॥ అవధూతవచశ్శ్రుత్వా పూర్వేషాం నః స పూర్వజః ।
సర్వసంగవినిర్ముక్తః సమచిత్తో బభూవ హ ॥

తా:- మా పూర్వులకు పూర్వుడు మా వంశమునకు మూలపురుషుడగు యదురాజు ఆ అవధూత చేసిన ఉపదేశమును విని సంగములనన్నిటిని విడిచి అన్ని ప్రాణులయందు ఒకే యాత్మను చూచు సమచిత్తము కలవాడై వుండెను. (33)

టీ:- భగవాన్ స్వీయం బ్రహ్మవిత్కులమితి శ్లాఘతే. నః పూర్వేషాం పూర్వజ ఇతి. (33)

టీ:- భగవంతుడు తన బ్రహ్మవేత్తల కులమును శ్లాఘించుచున్నాడు. నః పూర్వేషాం అని. (33)

**శ్రీధరీయంలోని విషయసంగ్రహ శ్లోకములు**

కపోతమీన హరిణ కుమారీగజ పన్నగాః
మధుకృన్మధుహర్తా చ పింగళాథ ద్వయోస్త్రయః
ఉపాదేయార్థ విజ్ఞానే శేషాః పృథ్వ్యాదయోమతాః
తదవాంతర భేదశ్చ తత్ర తత్ర స్ఫుటీకృతః
అధ్యాయ త్రితయే చాష్ట నవాష్టావీరితాః క్రమాత్

తా:- పావురము, చేప, జింక, కన్య, ఏనుగు, పక్షి, మిడుత, గొర్రె, ఈ ఎనిమిది హేయార్థము నందు (విడువదగిన కామాది విషయ మందు) గురువులయిరి. తేనెను కూడబెట్టు తేనెటీగ, తేనెను అపహరించు వాడు. పింగళయను వేశ్య, ఉపాదేయమగు అర్థ విజ్ఞానము నందు గురువలైరి. మిగిలిన పృథివి మొదలయిన గురువులు వారి వారి అవాంతర భేదమగు విజ్ఞానమును స్పష్టపరచి ఈ ప్రకారముగా 7, 8, 9, అధ్యాయములు మూటి యందును క్రమముగా 8, 9, 8 సంఖ్య గల గురువుల క్రమముగా చెప్పబడిరి.

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే, నవమోऽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు నవమాధ్యాయము సమాప్తము.**

## దశమోऽధ్యాయః

**శ్రీభగవానువాచ**

1.శ్లో॥ మయోదితేష్వవహితః స్వధర్మేషు మదాశ్రయః।
వర్ణాశ్రమకులాచారం అకామాత్మా సమాచరేత్॥

**టీ:-** **అత్రసంగ్రహ శ్లోకః**

చతుర్వింశతి గుర్వాఖ్యా లబ్ధ సంభావనా భువః
ఉద్ధవస్యాత్మ తత్వాప్త్యై సాధనోక్తిరతః పరైః ।
దశమే దేహ సంబంధా త్సంసృతిర్నాత్మనః స్వతః
ఇత్యేతద్వర్ణయామాస మతాంతర నిరాసతః॥

తదేవమన్వయ వ్యతిరేకాభ్యాముత్పన్న వివేక జ్ఞానస్య తత్త్వ జ్ఞానాయాదిత ఆరభ్య సాధనాన్యు పదిశతి భగవాన్మయేతిమయా పంచరాత్రాద్యుక్త వైష్ణవధర్మే ష్వవహితో ऽప్రమత్తః సంస్తదవిరోధేన వర్ణా ద్యాచారమను తిష్ఠేత్. (1)

2.శ్లో॥ అన్వీక్షేత విశుద్ధాత్మా దేహినాం విషయాత్మనాం ।
గుణేషు తత్వధ్యానేన సర్వారంభవిపర్యయమ్ ॥

## దశమాధ్యాయము

తా:- నాచే చెప్పబడిన స్వధర్మములందు జాగరూకుడవై నేనే ఆశ్రయముగా కలిగి వర్ణాశ్రమకులాచారమును, ఫలకాంక్ష లేని చిత్తము గలవాడై ఆచరించవలెను.(1)

టీ:- గత అధ్యాయము వరకు చక్కగా భావించు ఉద్ధవునికి ఆత్మతత్వ ప్రాప్తికై సాధనాదిక వాక్యము చక్కగా చెప్పబడినది. ఈ దశమాధ్యాయము నందు దేహ సంబంధము వలన ఏర్పడిన సంసారమాత్మకు లేదని చెప్పబడినది. మతాంతరములను నివారించుట ద్వారా ఇదియంతయూ వర్ణింపబడినది. ఈ ప్రకారము అన్వయ వ్యతిరేకములనే ఉత్పన్నమైన వివేక జ్ఞానము కలవానికి తత్త్వ జ్ఞానమునకై ప్రారంభము నుండి సాధనములనుపదేశించుచున్నారు భగవంతుడు మయా అని. మయాః నాచే చెప్పబడిన పాంచరాత్రాద్యానములందు చెప్పబడిన శ్రేష్ఠమయిన వైష్ణవ (భక్తుల) ధర్మములందు అప్రమత్తుడవై తద విరోధముగా వర్ణాద్యాచారము ఆచరించవలెను.(1)

తా:- స్వధర్మాచరణమున విశుద్ధచిత్తుడై దేహేంద్రియాదులందు సత్యత్వ బుద్ధితో విషయాభిలాషులగు ప్రాణులు గావించు సర్వకామ్య కర్మలకు ఫల వైపరీత్యము కలుగుచుండుటను దర్శించవలెను.(2)

టీ:- కథమకామాత్మతా సంభవతి తత్రాహ అన్వీక్షేతి। స్వధర్మైర్విశుద్ధ చిత్తః సన్దేహినాం విషయేషు సత్యతాభినివేశేన యేసర్వే ఆరంభాస్తేషాం ఫలవైపరీత్యం పశ్యేత్. ఏవంఫల వైపరీత్యా దకామః స్యాత్. (2)

టీ:- అకామాత్మత ఎట్లు సంభవించుననగా చెప్పుచున్నాడు. అన్వీక్షేత అని। స్వధర్మముచే పరిశుద్ధ చిత్తము కలవాడై ప్రాణులయొక్క విషయముల యందు నిత్యత్వాభినివేశముతో ఏ అన్ని పనులు కలవో వాటి యొక్క ఫల వైపరీత్యమును చూడవలెను. ఈ విధముగా ఫల వైపరీత్యము వలన అకాముడు అవుతాడు.(2)

3.శ్లో॥ సుప్తస్య విషయాలోకో ధ్యాయతో వా మనోరథః ।
నానాత్మకత్వాద్విఫల స్తథా భేదాత్మధీర్గుణైః ॥

తా:- నిద్రించుచున్న వాని మనోవాసనా రూపమగు స్వప్నము వలెను, మనస్సునందలి మనోరథము వలెను బహిర్వ్యాపకములైన ఇంద్రియము లచే తెలియవచ్చు వివిధ పదార్థములను కాంచుబుద్ధి బహు విషయక మగుటచే నిష్ఫలమేయగును.(3)

టీ:- కించ కామ్య విషయాణాం మిథ్యాత్వాదపీత్యాహ - సుప్తస్యేతి. విఫలోऽర్థ శూన్యః. అత్రైవం ప్రయోగః ఇంద్రియైర్యాబహిర్నానా బుద్ధిః సా విఫలా, నానాత్మకత్వాత్ ఐంద్రియకత్వాచ్చ. మనోజన్య - స్వప్న మనోరథవదితి. (3)

టీ:- మరియు కామ్యములయిన విషయములు మిథ్యాభూతములై యున్నవి అనుచున్నారు సుప్తస్య అని. విఫలః- అర్థశూన్యము. ఇక్కడ ఈ విధముగా ప్రయోగము - ఇంద్రియముల వలన ఏ బహిర్నానాబుద్ధి కలదో అది విఫలము, నానాత్మకమయినందు వలన, ఐంద్రియికమయి నందు వలన, మనోజన్య స్వప్నమనోరథముల వలె అని.(3)

4.శ్లో॥ నివృత్తం కర్మ సేవేత ప్రవృత్తం మత్పర స్త్యజేత్ ।
జిజ్ఞాసాయాం సంప్రవృత్తో నాద్రియేత్కర్మచోదనామ్॥

తా:- నిష్కామకర్మను సేవించాలి. నేనే పరమ పురుషార్థముగ కలవాడై కామ్య కర్మను విడిచిపెట్టవలెను. ఆత్మ విచారమునందు ప్రవర్తించినవాడై వేదచోదితమయిన ఉపాసనాది కర్మను కూడా ఆదరించరాదు.(4)

టీ:- మోక్షార్థీ న ప్రవర్తేత తత్రకామ్య నిషిద్ధయోః ఇతిస్మృతి రతః ప్రవృత్తం కామ్యం కర్మ త్యజేన్నివృత్తం నిత్యనైమిత్తికమేవకుర్యాత్. ఆత్మ విచారేతు సమ్యక్ప్రవృత్తో నివృత్తకర్మచోదనామపి నాద్రియేత్. (4)

టీ:- "మోక్షార్థీ... సయా" అని స్మృతి వాక్యము మోక్షమునర్థించువాడు కామ్య నిషిద్ధములగు కర్మల యందుగూడా ప్రవర్తించగూడదు. ప్రత్యవాయమును త్యజించు కోరికతో నిత్య నైమిత్తికములయిన కర్మలను మాత్రము చేయవలెను. అందులకై ప్రవృత్తము - కామ్యకర్మ విడిచిపెట్ట వలెను. నివృత్తం - నిత్యనైమిత్తికములను ఆచరించవలెను. ఆత్మ విచారమునందు చక్కగా ప్రవర్తించినవాడై నివృత్తకర్మ చోదనను కూడా (వేదచోదితమయిన ఉపాసనాది కర్మను కూడా ప్రధానముగా) ఆదరించరాదు. (4)

5. శ్లో॥ యమానభీక్ష్ణం సేవేత నియమాన్ మత్పరః క్వచిత్ ।
మదభిజ్ఞం గురుం శాంతం ఉపాసీత మదాత్మకమ్ ॥

తా:- నన్ను శరణముగా గలవాడై యథాశక్తిగా అహింసాదులగు యమములను తపస్స్వాధ్యాయాది నియమములను అత్యాదరముతో అనుష్ఠించవలెను. మరియు యమాదులందు ఆదరము వీడి గురువును ఉపాసింపవలెను. నా తత్త్వమెరిగిన వాడగు శాంతుడయిన గురువును నా స్వరూపునిగా సేవించవలెను. (5)

టీ:- కించ యమా నహింసాదీన్ అభీక్ష్ణమాదరేణ సేవేత. శౌచాదీంస్తు నియమాన్ క్వచిద్యథాశక్తి స్తథా ఆత్మజ్ఞానావిరోధేన. యమాన్ ద్వాదశే, నియమాంశ్చ ఏకోనవింశే అధ్యాయే వక్ష్యతి. కించ యమేష్వప్యాదరం పరిత్యజ్య గురుముపాసీతేత్యాహ - మదభిజ్ఞమితి. మదాత్మకం మద్రూపమ్. (5)

టీ:- మరియు యమములను, అహింసాదులను ఆదరముగా సేవించవలెను. శౌచాది నియమములను యథాశక్తిగా ఆత్మ జ్ఞానా విరోధముగా సేవించాలి. యమములను పన్నెండు నియమములను గూర్చి పందొమ్మిదవ అధ్యాయముల యందు గలదు మరియు యమాదుల యందాదరము వీడి గురువునుపాసించవలెనని అనుచు న్నారు "దభిజ్ఞమని మదాత్మకం" నా స్వరూపునిగా. (5)

6.శ్లో॥ అమాన్యమత్సరో దక్షో నిర్మమో దృఢసౌహృదః ।
అసత్వరోऽర్థజిజ్ఞాసుః అనసూయురమోఘవాక్ ॥

తా:- శిష్యుడగువాడభిమాన రహితుడు మచ్చరము లేనివాడు సోమరితనము లేనివాడు భార్యాపుత్రాదులందు మమత్వము లేనివాడు వేదాంతార్థము తెలియగోరువాడు. ఈర్ష్యలేనివాడు వ్యర్థమగు మాటలు పలుకని వాడు కావలెను.(6)

టీ:- గురుసేవకస్య ధర్మానాహ. అమానీతి. దక్షో అనలసః. నిర్మమో జాయాదిషు మమతాశూన్యః. గురౌ తు దృఢసౌహృదః. అసత్వరః అవ్యగ్రః. అమోఘవాక్. వ్యర్థాలాపరహితః. ఏతాన్యేవశిష్యస్య లక్షణాని జ్ఞేయాని. (6)

టీ:- గురుసేవకుని ధర్మములను చెప్పుచున్నారు - అమానీ అని. సోమరితనములేని. భార్యాదుల యందు మమత లేనివాడు గురువు యందు దృఢమయిన భక్తి గలవాడు. వ్యగ్రతలేనివాడు. మొక్కబోని వాక్కు గలవాడు వ్యర్థాలాపములాడని వాడు. ఇవి శిష్యుని లక్షణాలని తెలిసికొనవలెను.(6)

7. శ్లో॥ జాయాపత్యగృహ క్షేత్రస్వజనద్రవిణాదిషు ।
ఉదాసీన స్సమం పశ్యన్ సర్వేష్వర్థమివాత్మనః ॥

తా:- భార్యా, పుత్ర, గృహ, బంధు, మిత్రులు, ధనము వీటియన్నిటి యందు మమత వీడి- ఉపేక్ష గలవాడై ఎల్లప్రాణులయందు ఆత్మ ప్రయోజనము ఒక్క విధమే అని సమదృష్టి గలవాడై వుండవలెను.(7)

టీ:- నను జాయాదిషు కథం నిర్మమః స్యాత్తత్రాహి జాయేతి. ఔదాసీన్య హేతుం వివేకం దర్శయతి ఆత్మనోర్థం ప్రయోజనం సర్వత్ర సమమివ పశ్యన్నితి. అయంభావః- సర్వదేహేష్వాత్మనః ఏకత్వాజ్జాయాది దేహేऽస్మింశ్చ స్వదేహే ఆత్మనోర్థః సుఖాదిః సమ ఏవ కేన విశేషేణై తేష్వేవ మమత్వాభినివేశ ఇత్యేవముదాసీనః సన్ గురుం ప్రపద్యేతేతి.(7)

టీ:- అయ్యా! జాయాదులందు నిర్మముడెట్లవుతాడు అనగా చెప్పుచు న్నాడు జాయా అని. ఔదాసీన్య హేతువయిన వివేకమును చూపు చున్నాడు ఆత్మ యొక్క ప్రయోజనమును అంతట సమమువలె చూచు వాడై. (7)

విశేషము : అంతటా ఆత్మకు ప్రయోజనము ఒక్కటిగనే చూచుట వివేకము. ఆత్మ ఒకటే అయినందున భార్యాదుల దేహమందును ఆత్మకు కలుగు సుఖాది ప్రయోజనము సమానమే యగును. ఏ విశేషమధికమని వీని యందే మమతాబుద్ధి నుంచవలెను? అని ఉదాసీనుడై గురువును శరణుపొందవలెను.(7)

8. శ్లో॥ విలక్షణస్థూలసూక్ష్మాత్ దేహాదాత్మేక్షితాః స్వదృక్ ।
యథాగ్నిర్దారుణో దహ్యాత్ దాహకోఽన్యః ప్రకాశకః ॥

తా:- ఎవనికి ఏకత్వము వలన సర్వ శరీరములందు సుఖాది ప్రయోజనము సమానమో అట్టి దేహ వ్యతిరిక్తుడైన ఆత్మ ఎట్టివాడు అనగా అతనిని గూర్చి చెప్పుచున్నారు. (8)

టీ:- అహో కోఽసౌ దేహవ్యతిరిక్త ఆత్మా? యస్యైక్యాదర్థస్సర్వేషు సమస్స్యాత్. తమాహ - విలక్షణ ఇతి. స్థూలసూక్ష్మదేహద్వయాదాత్మాన్యః యతో విలక్షణః. ద్విధా వైలక్షణ్యం దర్శయతి - ఈక్షితా స్వదృగితి ద్రష్టా హి దృశ్యాద్విలక్షణః స్వప్రకాశశ్చ జడాద్విలక్షణః. తయోరన్యత్వే దృష్టాంతః. యథాగ్నిః దాహకః ప్రకాశశ్చ దాహ్యాత్ప్రకాశ్యాచ్చదారుణః కాష్ఠాదన్యః. తద్వదితి. (8)

టీ :-కట్టెలను దహించుచు వానిని ప్రకాశింప చేయువాడగు అగ్ని, దహింపదగినవై ప్రకాశింపచేయదగినవైన దారువులకంటే వేరై ఎట్లున్నాడో అట్లే స్థూల సూక్ష్మములగు దేహములు రెండింటికన్నా విలక్షణుడై వానిని చూచేద్రష్టయై వానిని ప్రకాశింపచేయువాడై ఆత్మవేరై యున్నాడు.(8)

9. శ్లో॥ నిరోధోత్పత్త్యణుబృహన్నానాత్వం తత్కృతాన్ గుణాన్ ।
అనుప్రవిష్ట ఆధత్తే ఏవం దేహగుణాన్ పరః ॥

తా:- ఈ దృష్టాంతము చేతనే ఆత్మకు నిత్యత్వము, అనాదిత్వము, విభుత్వము, ఏకత్వము మొదలయిన విశేషణములును సిద్ధించుచున్నవి అనుచున్నారు.

టీ :-అనేనైవ దృష్టాంతేన నిత్యత్వానాదిత్వవిభుత్వైకత్వాదయోऽపి సిద్ధ్యంతీత్యాహ - నిరోధేతి. యథాదారుష్వంతః ప్రవిష్టోऽగ్నిః. తత్కృతాన్నాశాదీన్ ప్రాప్నోతి. న తు స్వతో నాశాదిమాన్. ఏవన్దేహగుణాననిత్యాదీన్ దేహాత్పరో నిత్యాదిస్వరూపోऽపి. ఆత్మానుభవతి. తతశ్చ నిత్యత్వాదిభిరపి వైలక్షణ్యాదన్యత్వమితి. భావః. (9)

కట్టెలో ప్రవేశించియుండే అగ్ని ఆ కట్టె పొందు ఉత్పత్తి నాశములు కృశత్వదార్ఢ్యములు మొదలగు వివిధ ధర్మములను తాను నాశమొందకయే పొందుచున్నాడు. అట్లే ఆత్మ దేహమునకనిత్యములై కల్గు ఉత్పత్తి, నాశ, కృశత్వాదులను తానవినాశియై గ్రహించుచున్నాడు. నిత్యత్వాదులచే గూడ వైలక్షణ్యముండుట వలన ఆత్మ దేహముకన్నా అన్యత్వము కలిగియున్నదని భావము. (9)

10. శ్లో॥ యోऽసౌ గుణైర్విరచితో దేహోऽయం పురుషస్య హి ।
సంసారస్తన్ని బంధోऽయం పుంసో విద్యాఛిదాత్మనః ॥

టీ:- నన్వగ్నేర్దారు సంయోగాత్తద్ధర్మభాక్త్వం ఘటతే. ఆత్మన స్త్వసంగాత్కథం దేహేన తద్ధర్మైర్వా సంబంధః? సంబంధే వా కుతస్తన్నివృత్తిః తత్రాహ - య ఇతి. పురుషస్య ఈశ్వరస్యాధీనైర్మాయాగుణైః యోऽసౌ సూక్ష్మం అయం చ స్థూలో దేహో విరచితః. పుంసో జీవస్యాయం సంసారః తన్నిబంధః తదధ్యాసకృతః. హి యస్మాదేవం తస్మాదాత్మవిద్యా తన్నివర్తకేత్యాహ - ఆత్మనో విద్యావిజ్ఞానం ఛిత్ తస్య ఛేత్రీ ఆఛిదితి వా పదఛేదః. (10)

తా:- అయ్యా! అగ్నికి దారు సంయోగము వలన దారు ధర్మమును. తన్ని వృత్తిని పొందుట ఘటించుచున్నది. ఆత్మ అసంగుడగుట వలన దేహముతో గాని దేహ ధర్మముతో గాని సంబంధమెట్లు కలుగును? ఒకవేళ అట్లు సంబంధము కలిగిననూ దాని నివృత్తి యెట్లు కలుగును అనగా చెప్పుచున్నారు. యౌऽసౌ అని.

పరమ పురుషుడగు ఈశ్వరుని కధీనమైన మాయాగుణములచే నీ సూక్ష్మస్థూల శరీరములు సృజించబడినది. జీవునకీ సంసారబంధమీదేహ ద్వయాధ్యాస చేతనే కలిగినది. ఈ దేహమే నేనను భావన అధ్యాసయగును. ఆ మాయాధ్యాసను ఆత్మ జ్ఞానము ఛేదించునదగును. (10)

11.శ్లో॥ తస్మాజ్జిజ్ఞాసయాత్మానం ఆత్మస్థం కేవలం పరం ।
సంగమ్య నిసేదేతత్ వస్తుబుద్ధిం యథాక్రమమ్ ॥

టీ:- యస్మాదేవం. తస్మాదితి. తస్మాత్ జిజ్ఞాసయా విచారేణ ఆత్మస్థం ఆత్మని కార్యకారణ సంఘాత ఏవ స్థితం. సంగమ్య సమ్యక్ జ్ఞాత్వా. ఏతస్మిన్ దేహాదౌ వస్తుబుద్ధిం స్థూలసూక్ష్మ క్రమేణ నిరసేత్ త్యజేత్. 11

తా:- అందులకై ఈ సంసారము మాయా కార్యమగుట వలన కార్య కారణరూపమగు దేహేంద్రియాది సంఘాతమందున్నవాడు ఒక్కడును దేహేంద్రియాదులకన్నను పరుడైన ఆత్మనుచక్కగా తెలిసికొని ఈ దేహాదికము సత్యము అనెడి బుద్ధిని స్థూల సూక్ష్మక్రమమున త్యజించ వలెను.(11)

12.శ్లో॥ ఆచార్యోఽరణిరాద్యస్స్యాత్ అంతేవాస్యుత్తరారణిః ।
తత్సంధానం ప్రవచనం విద్యాసంధిస్సుఖావహః ॥

టీ:- గురోర్లబ్ధా విద్యా సా. అవిద్యా తత్కార్యనిరసనక్షమేతి స్ఫుటీకర్తుం విద్యోత్పత్తిమగ్న్యుత్పత్తిరూపేణ నిరూపయతి. ఆచార్య ఇతి. ఆద్యః అధరః తత్సంధానం తయోర్మధ్యమం మథనకాష్ఠం. ప్రవచనముపదేశః. విద్యా తు సంధిః. సంధౌ భవన్నగ్నిరివ. తథా చ. శ్రు. "ఆచార్యః పూర్వరూపం. అంతేవాస్యుత్తరరూపం. విద్యా సంధిః. ప్రవచనగ్ం సంధాన"మితి. 12

తా:- గురువు క్రింది అరణి, శిష్యుడు పై అరణి, ఉపదేశము ఆ రెండరణుల నడుమ వుండు కొయ్య ఆత్మ విద్యవాని కలయిక వలన జనించు అగ్నివంటి దగును. శృతి గూడా ఆచార్యః పూర్వరూపం అంతే వాస్యుత్తరరూపం విద్యాసంధిః ప్రవచనగ్ం సంధానం అని ఇదే విషయమును చెప్పినది.(12)

13.శ్లో॥ వైశారదీ సాతివిశుద్ధబుద్ధిః
ధునోతి మాయాం గుణసంప్రసూతాం ।
గుణాంశ్చ సందహ్య యదాత్మమేతత్
స్వయం చ శామ్యత్యసమిద్యథాగ్నిః ॥

తా:- అగ్ని సాదృశ్యముచే చెప్పుచున్నాడు గురూపదిష్టమై అతి నిపుణుడయిన శిష్యునిచే గ్రహింపబడి నిపుణత్వమును పొందినదై చాలా సాత్వికమై నిర్మలమైన బుద్ధి దేహేంద్రియాది కార్యకారణ సంఘాతమును సృజించుమాయను తొలగించుచున్నది. మరియు ఏ గుణత్రయముల

టీ:- అగ్నిసాదృశ్యమేవాహ - వైశారదీతి. విశారదోऽతినిపుణః తేన శిష్యేణ ప్రాప్తా. తేన గురుణోపదిష్టా వా. అతివిశుద్ధా బుద్ధిః. గుణకార్యభూతాం మాయాం ధునోతి నివర్తయతి. యదాత్మక మేతద్విశ్వం తాన్ జీవం సంసృతినిమిత్తాన్ గుణాంశ్చ దగ్ధ్వా. అసమిత్ నిరింధనః తస్మాత్కార్యేణ కారణేనావిద్యయా చ వ్యవధానాభావా త్సాక్షాత్పరమానంద రూపో భవతీతి. (13)

స్వరూపమున ఈ విశ్వము వెలయుచున్నదో ఆ సంసార కారణములైన త్రిగుణములను దహింప దేహాదికము లేనందున ఆ విద్యయను ఉపాధి పోయినందున సాక్షాత్పరమానంద రూపమగు చున్నది. (13)

14.శ్లో॥ అథైషాం కర్మకర్తౄణాం భోక్తౄణాం సుఖదుఃఖయోః ।
నానాత్వమథ నిత్యత్వం లోకకాలాగమాత్మనామ్ ॥

టీ:- ఏవం తావత్స్వప్రకాశజ్ఞాన స్వరూపో నిత్య ఏక ఏవాత్మా తస్య కర్తృత్వాదయశ్చ ధర్మా దేహోపాధికాః.తద్వ్యతిరిక్తం చ సర్వమనిత్యం మాయామయం చ. అతస్సర్వతో విరక్తస్సన్ ఆత్మజ్ఞానేన ముచ్యత ఇత్యుక్తం. విలక్షణస్థూలసూక్ష్మాదిత్యాదినా. తదేవం శ్రుతిసమన్వయేన నిర్ణీతేऽప్యర్థే మతాంతరవిరోధేన సందేహోమాభూదితి తన్మయం నిరాకర్తుముద్భావయతి. అథేతి. అథ మన్యసే. ఏషాం జీవాత్మానాం కర్తౄణాం సుఖదుఃఖయోః. భోక్తౄణాం చ నానాత్వమితి. ఏవం హి జైమినీయా మన్యంతే. అహం ప్రత్యయజ్ఞేయ ఏవాత్మా స చ ప్రతిశరీరం భిన్నః కర్తృభోక్తృరూపశ్చ న తు తత్స్వరూపభూతో నిర్వికార ఏకః పరమాత్మాస్తీతి. తదాహుః - శ్లో. "అహం ప్రత్యయవిజ్ఞేయోజ్ఞాతవ్య

తా: ఈ ప్రకారము స్వప్రకాశ జ్ఞాన స్వరూపుడు నిత్యుడు అగు ఆత్మ ఒక్కడే అగును. అతనికి కర్తృత్వాది ధర్మములు దేహోపాధికములగును. ఆ ఆత్మకంటే వ్యతిరిక్తమయినది. సర్వమనిత్యము మాయామయమై యున్నది. అందువలన అన్నింటి నుండి విరక్తుడై ఆత్మ జ్ఞానముచే సంసార బంధవిముక్తుడగునని "విలక్షణః స్థూల సూక్ష్మాత్" ఇత్యాది శ్లోకముల ద్వారా చెప్పబడినది. ఇట్లు శృతి సమన్వయముచే అర్థము నిర్ణీతమైనను మతాంతర విరోధముచే సందేహము కలుగకూడదని ఆ మతమును నివారించుటకు ఆ మతమునుద్ఘాటించుచున్నాడు. అథయని పుణ్యపాపములు చేయు కర్తలు. వాని ఫలములగు సుఖదుః ఖముల ననుభవించు భోక్తలగు జీవులును భోగస్థానములగ స్వర్గాది లోకములును, వాని భోగకాలమును, శాస్త్రములును అభోక్తల స్వరూపమునకు నానాత్వమును (జీవుల అనేకత్వమును) నిత్యత్వమును ఒక వేళ తలంతువేని దానికి చెప్పుచున్నారు.

స్సర్వదైవహీ”తి. తథా వైరాగ్యం చ న సంభవతి. తథాహి భోగస్థానానా మనిత్యత్వాద్వైరాగ్యం భవేత్. భోగకాలస్య వా తదుపాయకర్మబోధకా గమస్య వా భోక్తురాత్మనో వా నత్త్వేతదస్తీత్యాహ. అథ నిత్యత్వం లోకకాలాగమాత్మనాం మన్యస ఇతి. (14)

**విశేషం:-** మీమాంసకులయిన జైమిని మతానుయాయులిట్లు చెప్పుతారు. అహంప్రత్యయజ్ఞేయుడు అనగా నేనను శబ్దమునకు లక్ష్యమై తోచుచు తెలియవచ్చువాడే ఆత్మ అతడు ప్రతి శరీర భిన్నుడు ఒక్కొక్క శరీరముమందొకొక్క జీవుడుండును. అతడు కర్త భోక్తయేయున్నాడు. ఆ జీవునకు స్వస్వరూపుడై నిర్వకారుడై ఏకమైన పరమాత్మ లేడు. అని వారిట్లంటారు. “అహం ప్రత్యయ విజ్ఞేయోజ్ఞాతవ్య స్సర్వదైవహి” అని నేననితోచుచు తెలియదగినవాడు. సర్వదా తెలియదగినవాడు అగును. అట్లయినచో వైరాగ్యమును కలుగదు. అదెట్లన. భోగస్థానముల నిత్యములైననే వైరాగ్యము కలుగును. భోగ కాలమునకు గాని దానికుపాయమగు కర్మను బోధించు ఆగమమునకు గాని భోక్తయగు ఆత్మకు గాని ఈ అనిత్యత్వము లేదు. అని ఇట్లు లోక, కాల, ఆగమ ఆత్మలు నిత్యములని తలంతువేని అందుకు పైన చెప్పెదము.(14)

15. శ్లో॥ మన్యసే సర్వభావానాం సంస్థా హ్యౌత్పత్తికీ యథా ।
తత్తదాకృతి భేదేన జాయతే భిద్యతే చ ధీః ॥

టీ:- న చ భోగ్యానాం విచ్ఛేదాన్మయామయత్వాద్వైరాగ్యం స్యాదిత్యాహ – మన్యస ఇతి. సర్వభావానాం స్రక్చందనాదీనాం సంస్థా స్థితిః ఔత్పత్తికీ ప్రవాహరూపేణ నిత్యా. తథా చ వదంతి. శ్లో.“న కదాచిదనీదృశం

తా:- భోగ్యములు విచ్ఛిన్నములగుట వలన మాయామయములగుట వలనను, వైరాగ్యము కలుగనేరదన్నచో ఇట్లనుచున్నారు. మన్యసేయని. స్రక్చందనవనితాది సకల భావముల యొక్క స్థితి ప్రవాహరూపముచే నిత్యమగును. అద్దానినే చెప్పుచున్నారు. “నకదాచినీదశంజగత్” ఒకప్పుడు జగత్తు ఇట్టిది కానట్టిదికాదు. అనగా జగత్తు ఇట్లే నిత్యమైయుండును. అందువలన ఈ జగమునకు కర్త ఒకానొకడు

జగది"తి. అతస్తత్కర్తాకశ్చిదీశ్వరోఽపి నాస్తీతి భావః. కించ. యథా యథావత్. న తు మాయామయీత్యర్థః. న చ ఆత్మస్వరూపభూతం నిత్యమేకం జ్ఞానమస్తీత్యాహ – తత్తదితి. ఘటపటాద్యాకారభేదేన ధీర్జాయతే అతో నిత్యా భిద్యతే చ. అయం గూఢోఽభిప్రాయః. న హి నిత్యజ్ఞానరూప ఆత్మా. అపితు జ్ఞానపరిణామవాన్. న చ వికారిత్వే నానిత్యత్వ ప్రసంగః. యథాహుః – శ్లో."విక్రియాజ్ఞానరూపస్య న నిత్యత్వే విరోత్స్యత" ఇతి. అతో ముక్తావింద్రియాదిరహితస్య పరిణామా సంభవాజ్జడత్వేన తత్ప్రాప్తేరపురుషార్థత్వాత్ ప్రవృత్తిరేవ శ్రేయసీ న నివృత్తిరితి. (15)

ఈశ్వరుడు లేడని భావము, జగత్తు సర్వము మాయామయము కాదు ఆత్మస్వరూపభూతము. నిత్యము, ఏకమగు జ్ఞానము లేదనుచున్నారు. ఆయాఘటపటాద్యాకారముచే బుద్ధి కలగుచున్నది. కావున అనిత్యము భేదమునందునదియు, ఇందలి గూఢమయిన అభిప్రాయమిది. ఆత్మ నిత్య జ్ఞానస్వరూపము కాదు. మరి యేమనగా జ్ఞాన పరిణామము కలది (కలవాడు) వికారియగుటచే అనిత్యుడనుటకు వీలుపడదు. అట్లే వచింతురు. "విక్రియాజ్ఞాన రూపస్య ననిత్య త్వేవిరోధ్యతే" అని కావున ముక్తి యందింద్రియాది రహితునకు పరిణామ మసంభవము కావున జడముగా పరిణామము నందుట పురుషార్థఫలకము కాదు. కావుననూ ప్రవృత్తి మార్తమే శ్రేయస్కరము గాని నివృత్తి మార్గము కాదు.(15)

16.శ్లో॥ ఏవమప్యంగ సర్వేషాం దేహినాం దేహయోగతః ।
కాలావయవతస్సంతి భావా జన్మాదయోఽసకృత్ ॥

టీ:– తత్ర తావదుక్తమంగీకృత్య వైరాగ్యోత్పాదనాయ ప్రవృత్తిమార్గస్యా నర్థహేతుత్వం ప్రపంచయతి. ఏవమిత్యాదినా. లోకానాం లోకపాలానా మిత్యతః ప్రాక్తనేన గ్రంథేన ఏవమితి. అంగ హే ఉద్ధవ. కాలావయవతః సంవత్సరాదిరూపాత్. (16)

తా:– అందు పైన చెప్పబడినదాని నంగీకరించి, వైరాగ్యము జనించుటకు ప్రవృత్తి మార్గమనర్థహేతువని ప్రవచించుచున్నారు. ఏవమని, ఓ ఉద్ధవా! ఇట్లు లోకముల స్థితికిని లోకపాలురకు, అందరి ప్రాణులకునూ దేహసంబంధము వలన జన్మ స్థితి లయములను భావములు అనేక పర్యాయములు కాలావయవమగు సంవత్సరముల వలన కలుగుచున్నది.(16)

17. శ్లో॥ తత్రాపి కర్మనాం కర్తుః అస్వాతంత్ర్యం చ లక్ష్యతే ।
భోక్తుశ్చ దుఃఖసుఖయోః కోన్వర్థోవివశం భజేత్ ॥

టీ:- తత్రేతి. తత్రాపి స్వాతంత్ర్యపక్షేऽపి దుష్కర్మణో దుఃఖభోగస్య వా అసంభవాదిత్యర్థః. (17)

తా:- జైవానికి అభిమతమైన కర్తృ భోక్తృపక్షమను బట్టి చూచినను ప్రవృత్తి కర్మలనాచరించుచు సుఖదుఃఖములననుభవించువాడు కర్మాధీనుడే గాని స్వతంత్రుడు కాడు. స్వతంత్రుడగుచో దుష్కర్మలనెట్లు చేయును? దుఃఖాలనెందుకనుభవించును? కావున ఇట్లు పరాధీనుడగు వానిలోనే పురుషార్థము స్థిరముగా నెలకొనును?(17)

18. శ్లో॥ న దేహినాం సుఖం కించిత్ విద్యతే విదుషామపి ।
తథా చ దుఃఖం మూఢానం వృథాహంకరణం పరమ్ ॥

టీ:- నను యే సమ్యక్కర్మ కర్తుం జానంతి. తే సుఖిన ఏవ యేతు నజానంతి త ఏవ దుఃఖిన ఇతి చేత్తత్రాహ - నేతి. విదుషామపి కించిత్సుఖం న విద్యతే. తథా చ మూఢానామపి దుఃఖం న విద్యతే. అతో వయం కర్మకుశలత్వాత్సుఖిన ఇతి తేషాం కేవలం వృథైవాహంకార ఇత్యర్థః. (18)

తా:- అయ్యా! ఎవరు పుణ్యకర్మను చేయ నెఱుంగుదురో వారు సుఖవంతులే యగుదురు. ఎవరెట్లు చేయనెఱుంగరో వారు మాత్రము దుఃఖభాగులగుదురు. అన్నచో అందుకు చెప్పుచున్నారు న దేహినామని సమ్యక్కర్మ అనగా సుఖమను కలిగించు యాగాది పుణ్య కర్మ యొక్క స్వరూపమెరిగిన విద్వాంసులకు సైతము కొంచెమైన సుఖమును కలుగుట లేదు. కనుక మేము కర్మ కుశలురమగుట వలన సుఖులమై యున్నామనుట వ్యర్థమైన అహంకారమే యగును.(18)

19. శ్లో॥ యది ప్రాప్తిం విఘాతం చ జానంతి సుఖదుఃఖయోః ।
తేऽప్యద్ధా న విదుర్యోగం మృత్యుర్న ప్రభవేద్యథా ॥

టీ:- అంగీకృత్యాహ - యదీతి. తం యోగముపాయం న విదుః యథా సాక్షాన్మృత్యుర్న ప్రభవేత్. (19)

తా:- సుఖదుఃఖప్రాప్తి విఘాతముల నెరుగుదురని అంగీకరించియు ఇట్లనుచున్నాడు. సుఖదుఃఖముల ప్రాప్త్యప్రాప్తుల నెరిగినవాడైనను తమకు మృత్యువెట్లు సంభవింపకుండునో ఆయుపాయము నెరుగడు. (19)

20.శ్లో॥ కోన్వర్థస్సుఖయత్యేనం కామో వా మృత్యురంతికే ।
ఆఘాతం నీయమానస్య వధ్యస్యేవ న తుష్టిదః ॥

టీ:- తథాపి యావజ్జీవం సుఖం భవిష్యతీత్యాశంక్య విదుషామప్యర్థ కామౌ న సుఖహేతూ ఇత్యాహ - క ఇతి. యతః అంతికే వర్తమానో మృత్యుర్నతుష్టిం దదాతి. ఆఘాతం వధస్థానం ప్రతి. (20)

తా:- అట్లయినను యావజ్జీవము సుఖము కలుగునన్నచో అట్లు కాదనుచున్నారు కోన్వర్థః అని. వధ్యస్థానమునకు తీసుకపోబడుచున్న వధ్యునికి (అపరాధికి) ఏ పదార్థము సంతుష్టి నొసగనట్లు మృత్యువు సమీపమునందున్నప్పుడు ఈ విద్వాంసునికి ఏ అర్థమును ఏ కామమును గాని సుఖము కలిగింపదు.(20)

21.శ్లో॥ శ్రుతం చ దృష్టవద్దుష్టం స్పర్ధాసూయాత్యయవ్యయైః ।
బహ్వంతరాయకామత్వాత్ కృషివచ్చాపి నిష్ఫలమ్ ॥

టీ:- ఏవమస్మిన్ లోకే సుఖం నాస్తీత్యుక్తం. లోకాంతరేఽపి తథై వేత్యాహ - శ్రుతమితి. శ్రుతం స్వర్గాది తదపి దుష్టం. స్పర్ధా పరసుఖా సహనం. అసూయా పరగుణేషు దోషావిష్కరణం అత్యయో నాశః. వ్యయోఽపక్షయః. తైర్దుష్టం. యద్వా. వ్యయో నాశః. అత్యయోఽన్య స్యాతిశయః. తం దృష్ట్వా తదప్రాప్త్యా దుఃఖమిత్యర్థః. కించ. బహవోఽ ంతరాయా వైగుణ్యాదిరూపా విఘ్నా యస్మిన్ కామే సుఖే తస్య భావస్తత్త్వం తస్మాత్. కృషిర్యథా బహువిఘ్నా తద్వత్ బహువిఘ్నం సుఖత్వేన. శ్రుతమపి నిష్ఫలం. (21)

తా:- ఇహమందు కనపడు కృషి యెట్లు బహు విఘ్నములకులోనై ఏదో కొంత ఫలమునుచేకూర్చి సుఖమును కలుగించుచున్నదో అట్లే వేదము వలన తెలియవచ్చు స్వర్గము కూడా పరసుఖాసహమయిన స్పర్థ చేతను పరగుణములందలి దోషావిష్కరణ చేయు నసూయ చేతను నాశము చేతను, అపక్షయము చేతను చెడ్డదై అనేక విఘ్నములకు ఆలవాలమైన కామ సుఖములకాస్పదమై నిష్ఫలమగుచున్నది.(21)

22.శ్లో॥ అంతరాయైరవిహతో యది ధర్మస్స్వనుష్ఠితః ।
తేనాపి నిర్జితం స్థానం యథా గచ్ఛతి తచ్ఛృణు ॥

టీ:- విఘ్నవైగుణ్యాద్యభావమంగీకృత్యాపి నాశదుఃఖం దుష్పరిహర మిత్యాహ - పంచభిః. అంతరాయైరితి. నిర్జితం సాధితం. (22)

తా:- విఘ్నవైగుణ్యాదులు లేవని అంగీకరించిననూ నాశము వలని దుఃఖము నిరాకరించరాదనుచున్నారు. ఐదు శ్లోకములచే విఘ్నములకు లోనుగాక ధర్మమును చక్కగా అనుష్ఠించిననూ దానిచే సాధించబడిన స్వర్గాదిస్థానము ఎట్లు పోవునో వినుము. (22)

23.శ్లో॥ ఇష్ట్వేహ దేవతా యజ్ఞైః స్వర్లోకం యాతి యాజ్ఞికాః ।
భుంజత దేవవత్తత్ర భోగాన్ దివ్యాన్నిజార్జితాన్ ॥

టీ:- ఇష్ట్వేతి. యజ్ఞైర్దేవతా ఇంద్రాదిరూపా ఇష్ట్వా. (23)

తా:- ఈ లోకమునందు యజ్ఞానుష్ఠాన వశిష్ఠులు యజ్ఞములచే ఇంద్రాది దేవతలను పూజించి స్వర్గలోకమునకు పోవుదురు. ఆ స్వర్గమునందు దేవతలవలె తమచే సంపాదింపబడిన దేవ భోగములను అనుభవింతురు. (23)

24.శ్లో॥ స్వపుణ్యోపచితే శుభ్రే విమాన ఉపగీయతే ।
గంధర్వైర్విహరన్ మధ్యే దేవీనాం హృష్టవేషధృక్ ॥

టీ:- స్వేతి. స్వపుణ్యైరుపచితే సర్వభోగసంపన్నే దేవీనాం మధ్యే విహరన్ గంధర్వైరుపగీయతే. (24)

తా:- తన పుణ్యములచే సర్వభోగ సంపన్నమై స్వచ్ఛమైన విమానమందు మనోహరమయిన రూపాలంకరణములను ధరించినవాడై అప్సరల నడుమ నుండి విహరించుచూ గంధర్వుల గానములచే కీర్తింపబడుచుండును. (24)

25.శ్లో॥ స్త్రీభిః కామగయానేన కింకిణీజాలమాలినా ।
క్రీడన్ న వేదాత్మపాతం సురాక్రీడేషు నిర్వృతః ॥

తా:- చిరుగజ్జెల దండలతో శోభిల్లు కామగమనము గల విమానమునందు అప్సరసలతో గూడిన నందనోద్యానాదులందు క్రీడించుచు కామ

టీ:- స్త్రీభిరితి. కామేన ఇచ్ఛయా గచ్ఛతా యానేన కింకిణీజాలమాలినా క్షుద్రఘంటికాసమూహశోభినా సహ స్త్రీభిః సురాక్రీడేషు నందనాదిషు క్రీడన్ ఆత్మపాతం న వేద. (25)

సుఖములు తృప్తుడగుచునుండునే కాని తాను క్రింద పడుట నెరుగడు. (25)

26.శ్లో॥ తావత్ప్రమోదతే స్వర్గే యావత్పుణ్యం సమాప్యతే ।
క్షీణపుణ్యః పతత్యర్వాక్ అనిచ్ఛన్కాలచాలితః ॥

టీ:- తావదితి. కాలేనచాలితః పాతితః. (26)

తా:- తన పుణ్యమెంతకాలము వరకు నిలిచి యుండునో అంతకాలము స్వర్గము నందు సుఖసంతోషములను చూరగొనుచు నుండి కాలగతిని తన పుణ్యమంతయు క్షీణించినంతనే తన కిచ్ఛ లేకున్ననూ క్రింద భూమిపై పడుచున్నాడు.(26)

27.శ్లో॥ యద్యధర్మరత స్సంగాత్ అసతాం వాజితేంద్రియః ।
కామాత్మా కృపణో లుబ్ధః స్త్రైణో భూత విహింసకః ॥

టీ:- ప్రవృత్తిద్విధా. విధ్యనుసారేణ కామ్యే కర్మణి వా తల్లంఘనేనా ధర్మే వా. తత్ర కామ్యకర్మ ప్రవృత్తేర్గతిరుక్తా అధర్మప్రవృత్తేర్గతిమాహ - యదితి. యదివేత్యన్వయః. అజితేంద్రియత్వాత్కామాత్మా. అతః కృపణః అతః లుబ్ధః భోగతృష్ణాకులః. అతః స్త్రైణ్యః. స్త్రీలంపటః. తదర్థే భూతవిహింసకః. (27)

తా:- ప్రవృత్తి ధర్మము రెండు విధములుగా నుండును. విధి ననుసరించి కామ్యకర్మలందు ప్రవర్తించుట ఒకటి. ఆ విధి నుల్లంఘించి అధర్మము లైన నిషిద్ధ కర్మలందు ప్రవర్తించుట రెండు. ఇందు కామ్య కర్మ ప్రవృత్తికి ఫలము చెప్పబడినది ఇంక అధర్మ ప్రవృత్తికి గతి. (లేక ఫలమును) చెప్పుచున్నారు.

దుష్టుల సాంగత్యము వలన అధర్మాకృత్యములయందాసక్తుడైనను ఇంద్రియములను జయింపని వాడైనను ఇంద్రియ సుఖము లందు మనస్సు నిల్పి వానిపై ఆశగలవాడు భోగతృష్ణచే ఆకులుడై స్త్రీలంపటుడై ఆ స్త్రీల నిమిత్తము ప్రాణులను హింసించువాడై (యున్నాడు).(27)

28.శ్లో॥ పశూనవిధినాలభ్య ప్రేతభూతగణాన్ యజన్ ।
నరకానవశో జంతుః గత్వా యాత్యుల్బణం తమః ॥

టీ:- కించ పశూనితి. దుష్టజనప్రలోభితో ధనాద్యర్థం పశూన్ అవిధినా హత్వా. తమః స్థావరతాం యాతి. (28)

తా:- నిషిద్ధ విధానమున జంతువులను ప్రేతలగు శాకినీ డాకిన్యాదులను బేతాళాదులగు భూతగుణములను వధించి యాగము చేయుచూ కర్మ పరతంత్రుడై నరకములను పొంది చాలా అధమమైన స్థావరాది జన్మమును పొందుచున్నాడు.(28)

29.శ్లో॥ కర్మాణి దుఃఖోదర్కాణి కుర్వన్ దేహేన తైః పునః ।
దేహమాభజతే తత్ర కిం సుఖం మర్త్యధర్మిణః ॥

టీ:- ఏవం కర్మసు ప్రవృత్తస్య న సుఖం న చ నివృత్తిరిత్యుపసంహరతి. కర్మాణీతి. (29)

తా:- ఈ ప్రకారము కర్మలందు ప్రవర్తించు వానికి సుఖము లేదు దుఃఖ నివృత్తి లేదనియుపసంహరించుచున్నాడు. ఈ దేహముచే ఉత్తరకాలమున దుఃఖములు కలిగించు పాపకర్మలు చేయుచు ఆ కర్మఫలములచే మళ్ళీ వేరు దేహాన్ని పొందుచూ నుండు మరణ ధర్మము గల ఈ నరునకు ఇందేమి సుఖము కలదు.(29)

30.శ్లో॥ లోకానాం లోకపాలానాం మద్భయం కల్ప జీవినాం ।
బ్రహ్మణోఽపి భయం మత్తో ద్విపరార్ధపరాయుషః ॥

టీ:- తథాపి లోకానాం నిత్యత్వాదమర్త్యధర్మత్వాచ్చ లోకపాలానాం సుఖమస్తీతి చేత్తత్రాహ - లోకామితి. ద్వౌ పరార్ధౌ పరమాయుర్యస్య తస్య బ్రహ్మణోఽపి. తథాచ. శ్రు."భీషాస్మాద్వాతః పవతే. భీషోదేతి సూర్యః. భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ. మృత్యుర్ధావతి పంచమ"ఇతి. అతః ప్రవృత్తిమార్గస్యైవమనర్థ హేతుత్వాత్ విరక్త్యా తతో నివృత్తిరేవ యుక్తేతి. తాత్పర్యార్థః. (30)

తా:- అట్లయినను లోకములు నిత్యములగుట వలనను అమర్త్య ధర్మము కలుగుట వలనను లోకపాలురకు సుఖము కలుగునన్నచో నిట్లను చున్నాడు. బ్రహ్మదేవుని ఒక అహః ప్రమాణము పదునాల్గు మనువులు పాలించు ఒక్కకల్పకాలము జీవించి నిలిచియుండు స్వర్గాదిలోకములకు ఇంద్రాది దిక్పాలురకు నా వలన భయముగలదు. అట్లే రెండు పదార్థములు పూర్ణాయువు గల బ్రహ్మకు సైతము నా వలన భయము గలదు.

పదిహేడు లక్షల ఇరవై ఎనిమిది వేలు సంవత్సరములు కృత యుగము, పన్నెండు లక్షల తొంభయ్యారు వేల సం॥లు త్రేతాయుగము, ఎనమిది లక్షల అరవైనాలుగు వేల సం॥లు ద్వాపరయుగము, నాల్గు లక్షల ముప్పయిరెండు వేల సం॥లు కలియుగము. ఈ నాల్గు యుగములు కలిపితే నలభైమూడు లక్షల ఇరవై వేల సం॥ల కాలమును ఒక మహా యుగమంటారు. వెయ్యి మహాయుగములు బ్రహ్మకు ఒక పగలు అనగా 432,00,00,000 నాల్గు వందల ముప్పయిరెండు కోట్ల సం॥లు బ్రహ్మకు ఒక దినము ఒక పగటి కాలమును ఒక కల్పమంటారు. ఈ కల్పకాలము ఇంద్రాదులు జీవించియుంటారు. ఈ కల్పకాలముననే స్వాయంభువాది పదునాల్గురు మనువులు పాలింతురు. 31,104 కోట్ల సంవత్సరములు బ్రహ్మకు ఒక సంవత్సరము ఈ లెక్క చొప్పున బ్రహ్మ సం॥లు ఒక పరార్థము రెండు పరార్థములు 100 సంవత్సరములు అనగా 31,10,400 కోట్ల సంవత్సరములు బ్రహ్మదేవుని పూర్ణాయువు. అట్లే శ్రు.“భీషాస్మాద్వాతః పవతే. భీషోదేతి సూర్యః. భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ. మృత్యుర్ధావతి పంచమ”ఇతి. ఆ పరబ్రహ్మ భయముచే వాయువు వీచును. సూర్యుడు దయించును అగ్ని జ్వలించును ఇంద్రుడు వర్షించును. మృత్యువు ప్రాణులను హరించును. అందువలన ప్రవృత్తి మార్గము ఇట్లనర్థహేతు వైనందున దాని నుండి విరక్తిచే నివృత్తి పొందుట యుక్తమని తాత్పర్యము. (30)

31.శ్లో॥ గుణాస్సృజంతి కర్మాణి గుణోऽనుసృజతే గుణాన్ ।
జీవస్తు గుణసంయుక్తో భుఙ్క్తే కర్మఫలాన్యసౌ ॥

టీ:- ఏతేనైవ స్వయమీశ్వరత్వావిష్కారణేన ఈశ్వరాభావాంగీకారః పరిత్యక్తః. అన్యదపి ప్రౌఢ్యా పూర్వమంగీకృతం నిరాకరోతి - చతుర్భిః తత్ర యదుక్తం కర్తృభోక్తృరూప ఏవాత్మేతితన్నిరాకరోతి. గుణాఇతి. గుణాః ఇంద్రియాణి. కర్మాణి సృజంతి. సత్వాత్మా. నను ఆత్మైవేంద్రియాణి ప్రవర్తయన్ కర్మాణి కరోతీతి చేత్తత్రహ - గుణ ఇతి. గుణస్సత్వాదిః. గుణాన్ ఇంద్రియాణి. అనుసృజతే ప్రవర్తయతి నత్వాత్మా అతః కర్తృత్వం తావన్నాస్తి. భోక్తృత్వమప్యౌపాధికమిత్యాహ - జీవస్త్వితి. గుణసంయుక్తః ఇంద్రియాదిసంయుక్తః. కుత ఇత్యత ఆహ - అసౌ తేషు అహంకారవానిత్యర్థః. (31)

తా:- ఇంతమాత్రము చేతనే తాను ఈశ్వరుడని ప్రకటించుట ద్వారా ఈశ్వరాభావము నంగీకరించుట పరిత్యజింపబడినది. ప్రౌఢిచే పూర్వమంగీకరించిన ఇతరమైన దానిని గూడ నాలుగు శ్లోకములచే నిరాకరించుచున్నారు. అందుకర్తృ భోక్తృ రూపము గలవాడే ఆత్మయని చెప్పిన దానిని నిరాకరించుచున్నారు. గుణాః అని చెవి కన్ను మొదలయిన ఇంద్రియములు కర్మలను శబ్దాది విషయములను సృజించును. ఆత్మ సృజించ ఆత్మయే ఇంద్రియములను ప్రవర్తింప చేయుచు కర్మలను చేయును అందువేని అందులకు చెప్పుచున్నాడు గుణః అని సత్వాది గుణము ఇంద్రియములను ఔపాధికము. జీవుడు ఇంద్రియములలో కూడుకొన్నవాడై ఈ ఇంద్రియములు నావి అని వాని యందభిమానము కలవాడై కర్మ ఫలములగు సుఖదుఃఖములను పొందుచున్నాడు. (31)

32.శ్లో॥ యావత్స్యాద్గుణవైషమ్యం తావన్నానాత్వమాత్మనః ।
నానాత్వమాత్మనో యావత్ పారతంత్ర్యం తథై వ హి ॥

టీ:- యచ్చోక్తమాత్మనో నానాత్వం తదప్యౌపాధికమిత్యాహ- యావదితి. గుణానాం వైషమ్యమహంకారాదికార్యరూపం. నన్వాత్మన ఏకత్వే కథం పారతంత్ర్యముక్తం. కథం వా లోకపాలాదీనామపి మద్భయమిత్యుక్తః తత్రాహ - నానాత్వమితి. (32)

తా:- ఆత్మకు చెప్పబడిన నానాత్వము కూడా ఔపాధికమని చెప్పుచున్నారు. యావత్ అని. త్రిగుణముల వ్యత్యాసము వలన ఏర్పడి అహంకారాది కార్యమెంత వరకుంటుందో అంతవరకు ఆత్మకు నానాత్వము ఉండును. (ఆపాదింపబడును) ఎంతవరకు ఆత్మకు నానాత్వముండునో అంతవరకు పారతంత్రము తప్పకయుండును. (32)

33.శ్లో॥ యావదస్యాస్స్వతంత్రత్వం తావదీశ్వరతో భయం ।
యఏతత్సముపాసీరన్ తేముహ్యంతి శుచార్పితాః ॥

టీ:- యావదితి. యచ్చ గూఢమభిప్రేతం ప్రవృత్తిరేవ శ్రేయసీతి. తత్రాహ - య ఏతదితి. ఏతత్ గుణవైషమ్యం తత్కృతం భోగం కర్మచేత్యర్థః. ఉపాసీరన్ సేవేరన్. తే లోకానామ నిత్యత్వాచ్ఛుచార్పితాః ప్రోతాస్సంతో ముహ్యంతి. (33)

తా:- ఏది గూఢమై ఇష్టమై అంగీకృత మైనదో ఆ ప్రవృత్తి మార్గమే శ్రేయస్కరమన్నచో అందుకు చెప్పుచున్నాడు. యావస్యా అని. ఎంతవరకు ఆత్మకు స్వతంత్రతలేదో అంతవరకు ఈశ్వరుని వలన భయము. ఎవరు గుణ వైషమ్యముచే అగు అహంకారాది కృతమగు భోగమును కర్మను సేవించుచున్నారో భోగలోకముల నిత్యములైనందున వాని నుండి భ్రష్టులై శోకాకులులై మోహమయిన సంసారమును పొందుచున్నారు.(33)

34.శ్లో॥ కాల ఆత్మాగమో లోకః స్వభావో ధర్మః ఏవ చ ।
ఇతి మాం బహుధా ప్రాహుః గుణవ్యతికరే సతి ॥

టీ:- న కేవలమనిత్యతామాత్రం. కింతు మాయామయత్వమపీత్యాహ - కాల ఇతి. స్వభావో దేవత్వాదిపరిణామహేతుః. ధర్మస్తద్భోగకారణం. గుణవ్యతికరేమాయాక్షోభే సతి మామేవ ప్రాహుః - న తు మద్వ్యతిరిక్తాః సంతి అతో నివృత్తిరేవ ముక్తిహేతుత్వాత్ శ్రేయసీతి సిద్ధం. (34)

తా:- ఈ కర్మ ప్రవృత్తి కేవలమనిత్యమేగాక మాయా మాత్రమైయున్నదని చెప్పుచున్నారు. అహోరాత్రాది రూపమైన కాలము. ఆత్మ, వేదము, స్వర్గాదికము దేవతిర్యగాది కారణమగు ప్రకృతి, అందు భోగకారణమైన ధర్మము అని నన్ను గుణముల వ్యత్యాసము వలన అనేక విధములుగా చెప్పుదురు. నాకంటే వ్యతిరిక్తమయినది లేదు.(34)

తా:- అందులకై నివృత్తి మార్గమే ముక్తి హేతువగుట వలన అది శ్రేయమగును. ఈ ప్రకారమింతవరకు ఆత్మ ఒక్కడే యని గుణకార్యమగు దేహ సంబంధమే సంసారమనియు ఆత్మ జ్ఞానము

**ఉద్ధవ ఉవాచ**

35.శ్లో॥ గుణేషు వర్తమనోఽపి దేహజేష్వనపావృతః ।
గుణైర్న బధ్యతే దేహీ బధ్యతే వా కథం విభో ॥

టీ:- ఏవం తావదేకఏవాత్మా. తస్య చ గుణకార్యదేహసంబంధకృతః సంసారః. ఆత్మజ్ఞానాచ్చ ముక్తిరిత్యుక్తం. విలక్షణః స్థూలసూక్ష్మాదిత్యాదినా. తదేవ చ మతాంతరనిరాసేన దృఢీకృతం అథైషామిత్యాదినా, తత్ర పృచ్ఛతి - గుణేష్వితి. అయమర్థః. గుణేష్వసత్సు ముక్తిః సత్స్వేవ వా. ఆద్యే జ్ఞానసాధనాభావాన్న ముక్తిః. ద్వితీయే చ గుణేషు వర్తమానోపి తత్కార్యదేహజేషు కర్మసుఖాదిషు చ కథం న బధ్యతే. తథాపి తైరాకాశవదనావృతత్వాన్నబధ్యత ఇతి చేత్తర్హి బంధోఽపి న సంభవతీత్యాహ - అనపావృతః కథం బధ్యత ఇతి. (35)

వలన ముక్తి కలుగునదియు, ఆత్మస్థూల, సూక్ష్మ దేహముల కంటే విలక్షణుడనియు పూర్వము "విలక్షణః స్థూలసూక్ష్మాత్" ఇత్యాది శ్లోకముల ద్వారా చెప్పబడినది అదియే "అథైషాంకర్మ కర్తౄణాం" ఇత్యాది శ్లోకములచే మతాంతర నిరాకరణము ద్వారా దృఢీకరింపబడినది. ఆ విషయమున ప్రశ్నించుచున్నారు. ఇంద్రియములు లేకున్న ముక్తి కలుగునా? ఇంద్రియములున్న ముక్తి కలుగును? ఇంద్రియములు లేకున్న ముక్తి కలుగునందువేని జ్ఞాన సాధనము లేనందున ముక్తి లేదు. ఇంద్రియములున్నప్పుడు ముక్తి కలుగునన్నచో ఇంద్రియములందు ఉన్నవాడై దేహి ఆ ఇంద్రియ కార్యమగు దేహమందు జనించిన కర్మ సుఖాదులందు ఎట్లు బంధితుడు కాకుండును. పోనిండు ఆకాశాదుల వలె ఇంద్రియములచే ఆవరింపబడడు. గనుక వానిచే బంధింపబడడు అన్నచో అట్టి వానికి సంసారబంధము మాత్రము ఎట్లు కలుగును.(35)

36.శ్లో॥ కథం వర్తేత విహరేత్ కైర్వాజ్ఞాయేత లక్షణైః ।
కిం భుంజీతోత విసృజేత్ శయీతాసీత యాతి వా ॥

తా:- ఆ అన్ని విషయేంద్రియములున్ననూ తదభిమానముచే (అహంకారముచే) బంధింపబడుచూ వానియందభిమాన నివృత్తిచే ముక్తుడగును. అనునదే అభిమతమయినచో అది ఎట్లు తెలియవలెను అని ప్రశ్నించుచున్నాడు.

టీ:- యదితు సర్వేషు తేషు అహంకారేణ బధ్యతే తన్నివృత్త్యా చ ముచ్యత ఇతి మతం తర్హి తత్కథం జ్ఞాతవ్యమితి పృచ్ఛతి. కథమితి. బద్ధో ముక్తో వా కథం వర్తేతేత్యాదికం, కిం భుంజీత కథం భుంజీతేత్యర్థః (36)

ఇంద్రియ క్రియలచే బద్ధుడయ్యు వాని నంటిముక్తుడై యున్నవాడు స్వకృత్యములందెట్లు ప్రవర్తించును. ఎట్లు విహరించును. ఏలక్షణము లచే తెలియబడును. ఏ ఆహారమును భుజించును. మలమూత్రాదులెట్లు విసర్జించును. ఎట్లు పడుకొనును ఎట్లుండును. ఎట్లు నడుచును. చెప్పుము. (36)

37. శ్లో॥ ఏతదచ్యుత మే బ్రూహి. ప్రశ్నం ప్రశ్నవిదాం వర ।
నిత్యబద్ధో నిత్యముక్తః ఏక ఏవేతి మే భ్రమః ॥

టీ:- ఏతదితి. ఏతత్ తద్విషయం ప్రశ్నం. కించ. ఏక ఏవాత్మా అనాది గుణ సంబధాన్నిత్యబద్ధః. ముక్తేర్జన్యత్వే అనిత్యత్వ ప్రసంగాన్నిత్యముక్త ఇత్యప్యంగీకార్యం స్యాత్. తత్ర మే భ్రమో భవతీత్యాహ - నిత్యబద్ధ ఇతి. (37)

తా:- ఓ కృష్ణా! ఈ ప్రశ్నలకు నాకుత్తరము చెప్పుమా ఒక్కడేయగు ఆత్మ అనాది గుణముల సంబంధములచే సంసారమున సదాబద్ధుడై యున్నాడు. ముక్తి కర్మజన్యమగుచో అనిత్యత్వ ప్రసంగము వలన ఆ ఆత్మ నిత్యముక్తుడని ఇరువురూ ఒక్కడే అని ఈ అంగీకార్య విషయమునందు నాకు భ్రమకలుగుతున్నది. దీనిని గూర్చి చెప్పుము .(37)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
దశమోऽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
దశమాధ్యాయము సమాప్తము.

## ఏకాదశోऽధ్యాయః

శ్రీభగవానువాచ

1.శ్లో॥ బద్ధో ముక్త ఇతి వ్యాఖ్యా గుణతో మే న వస్తుతః ।
గుణస్య మాయామూలత్వాత్ న మే మోక్షో న బంధనమ్॥

టీ:- శ్లో. ఏకాదశే తు బద్ధానాం ముక్తానామపి లక్షణమ్, సాధూనాం చ తథా భక్తేర్లక్షణం హరిణేరితం. నిత్యబద్ధో నిత్యముక్త ఏక ఏవేతి మే భ్రమః ఇతి. యదుక్తం తత్కిం వస్తుతో విరోధః ప్రతీతో వా. నాద్యః బంధమోక్షయోర్వాస్తవత్వాభావాదిత్యాహ - ద్వాభ్యాం. బద్ధఇతి. ఆత్మా బద్ధో ముక్తశ్చ. మే గుణతః మదధీనసత్త్వాదిగుణోపాధితః. న తు వస్తుతః నన్వోపాధికత్వేऽపి తండులపాకాదివత్ వాస్తవత్వం కిం న స్యాత్తత్రాహ - గుణస్య మాయామూలత్వాద్బంధనం నాస్తి. అత ఏవ మోక్షశ్చ నాస్తీతి. నను కథం సర్వశాస్త్రవిరుద్ధ ముచ్యతే? తత్రాహ - ఇతి మే వ్యాఖ్యా ఏవం మత్కృతో నిర్ణయః. అలమితి కుతర్కైరిత్యర్థః. అథైవమన్వయః ఆత్మా బద్ధో ముక్త ఇతి. యా వ్యాఖ్యా ఉక్తిః. సా మే గుణతః మద్గుణపారతంత్ర్యాత్. అత్ర హేతుత్వేన గుణనియంతరి స్వస్మిన్ తద్వ్యతిరూకమాహ - అతఏవ న మే బంధనం మోక్షో వేతి. అన్య త్సమానం. (1)

## ఏకాదశాధ్యాయము

తా:- ఈ ఏకాదశధ్యాయమునందు బద్ధులు, ముక్తులు అనువారి లక్షణమును, సాధువుల లక్షణము, భక్తి లక్షణము అనువానిని కృష్ణుడు చెప్పెను. నిత్య బుద్ధడు నిత్యముక్తుడు ఒక్కడే అని నా భ్రమ ఏది నీవుచెప్పితివో అది వస్తువును బట్టి విరోధమా? ప్రతీతి వలన విరోధమా అనినచో అందుమొదటిది కాదు. బంధమోక్షములు వాస్తవములు కానివగుట వలన అని రెండు శ్లోకములతో చెప్పబడెను.

ఆత్మ బద్ధుడు ముక్తుడు అని వ్యాఖ్యానించుట నాయధీనమైన సత్వాది గుణమును బట్టి కాని వాస్తవమున కాదు. ఆసత్వాదిగుణము మాయామూలకము అగుట వలన ఆత్మయగు నాకు బంధము లేదు మోక్షము లేదు. అయ్యా! ఔపాధికత్వమందును తండులపాకాదికము వలె ఏల వాస్తవము కాదు? అనగా చెప్పుచున్నాడు గుణ స్వమాయా మూలకత్వాత్. అయ్యా! ఏమిది? సర్వశాస్త్ర విరోధము చెప్పుచున్నారు అనగా ఇదియేవ్యాఖ్యా ఈ ప్రకారముగా నిర్ణయము కుతర్కములు ఇక చాలునని యర్థము. లేదా ఈ విధముగా అన్వయము చెప్పుకోవాలి. ఆత్మ బద్ధుడు ముక్తుడు అనియే వ్యాఖ్య చెప్పబడినదో అది నా గుణము వలన అనగా యద్గుణ పారతంత్ర్యమువలన, ఇందు హేతువుగా గుణ నియంతయగు తనయందు తత్వ్యతిరేకమును చెప్పుచున్నారు. కావుననే నాకు బంధము గాని మోక్షముగాని లేవు" అని మిగిలినదంతయూ సమానమే. (1)

2. శ్లో॥ శోకమోహౌ సుఖం దుఃఖం దేహాపత్తిశ్చ మాయయా ।
స్వప్నో యథాత్మనః ఖ్యాతిః సంసృతిర్న తు వాస్తవీ ॥

టీ:- ఏవం కారణ భూతగుణానాం మాయామయత్వాత్తత్కార్య సంసృతి ర్మాయేతి ప్రపంచయతి - శోకమోహావితి. యథా స్వప్నః ఆత్మనః బుద్ధేరేవ ఖ్యాతిః వివర్తః తద్వత్. (2)

3. శ్లో॥ విద్యావిద్యే మమ తనూ విద్ధ్యుద్ధవ శరీరిణాం ।
బంధమోక్షకరీ ఆద్యే మాయయా మే వినిర్మితే ॥

టీ:- అతో వస్తుతో విరోధస్తావన్నస్తి ప్రతీతిస్త్వౌపాధికీ ఘటత ఇత్యాహ - విద్యావిద్యే ఇతి. తన్వేతే. మోక్షబంధావాభ్యామితి తనూశక్తీ. కుతః మే మాయయా వినిర్మితే మాయావృత్తిరూపత్వాత్. బంధమోక్షకరీత్యేక వచనం ద్వివచనార్థే. నను తత్కార్యత్వే బంధమోక్షయోరనాదిత్వనిత్యత్వే న స్యాతాం. న ఆద్యే అనాదీ అతో యావదవిద్యాం ప్రవర్తయామి తావద్బంధః. యదా విద్యాం దదామి తదా మోక్షస్ఫురతీత్యర్థః. తథా చ స్కాంధే. శ్లో. "బంధకో భవపాశేన భవపాశాచ్చ మోచకః, కైవల్యదః పరం బ్రహ్మ విష్ణురేవ సనాతనః." ఇతి. (3)

తా:- ఈ ప్రకారము కారణభూతములైనను గుణములు మాయామయ ములగుట వలన తత్కార్యమగు సంసారము సైతము మాయయగునని తెలుపుచున్నాడు.

శోకమోహములు దేహప్రాప్తియు, మాయచే యగును స్వప్నమెట్లు బుద్ధి యొక్క వివర్తమో రజ్జువు సర్పముగాతోచినట్లు భ్రాంతి రూపమై తోచునో అట్లే సంసారమునూ వాస్తవము కాదు మాయ యని భావము. (2)

తా:- అందువలన వాస్తవముగ విరోధము లేదు. ప్రతీతిమాత్రము ఉపాధి సంబంధముతో ఘటించుచున్నదని చెప్పుచున్నారు.

ఓ ఉద్ధవా! విద్య, అవిద్య అనునవి దేహధారులగు జీవులకు మోక్ష బంధములను కలిగించునవి నా శక్తులని తెలిసికొనుము ఎట్లనగా నా యొక్క లేదా నా మాయ చేత నిర్మించబడినవి. బంధమోక్షకరీ ఈ పదము ఏకవచనాంతమయిననూ ద్వివచనార్థములో చెప్పబడినది. అయ్యా! వాని కార్యములగు బంధమోక్షములు అనాదులు నిత్యములు కావా? అనిన, కావు. విద్యావిద్యలాద్యములు, అందువలన ఎంత పర్యంతము అవిద్యను ప్రవర్తింపచేయునో అంతవరకు బంధము ఎప్పుడు విద్యనిచ్చునో అప్పుడు స్ఫురించును అని అర్థము అట్లే స్కాందపురాణమున "బంధకో భవపాశేన భవపాశాచ్చమోచకః కైవల్యదః పరంబ్రహ్మ విష్ణురేవసనాతనః" సంసార పాశముచే బంధము సంసార పాశము నండి విముక్తి కలుగించువాడు. కైవల్యమునిచ్చువాడు. పరబ్రహ్మము సనాతనుడు విష్ణువే యని తెలియవలెను. (3)

4. శ్లో॥ ఏకస్యైవ మమాంశస్య జీవస్యైవ మహామతే ।
బంధోऽస్యావిద్యయానాదిః విద్యయా చ తథేతరః ॥

టీ:- తత్ర శరీరాణామితి బహువచననిర్దేశాద్విషయభేదేనావిరోధ ఉక్త ఇతి భ్రాంతిం వ్యావర్తయన్ బంధమోక్షవ్యవస్థాముపపాదయతి - ఏకస్యేతి. తర్హి కిమాత్మాభేదాత్తవాపి బంధః నహీత్యాహ - అస్య జీవస్యైవేతి. నన్వాత్మాభేదే జీవో నామ కోऽనోऽస్తి పృథక్ కా చ బంధ మోక్షసుఖదుఃఖాదివ్యవస్థా? తత్రాహ - మమాంశస్య. అయం భావః యథైకస్యాపి చంద్రాదేర్జలాద్యుపాధినా బింబ ప్రతిబింబరూపో భేదః యథా చ తత్ర జలకృతాః కంపాదయః ప్రతిబింబస్యైవ యథా చ తత్ర ప్రతిబింబానామప్యుపాధిభేదేన భేదాదేకస్మిన్నుదకకుంభే భగ్నే తద్గత ప్రతిబింబస్యైవ బింబైక్యం నాన్యగతస్య. తథా అవిద్యాయాం ప్రతిబింబితస్య మదంశస్య జీవస్యైవ తత్కృతో బంధః. తస్య చోపాధితో భేదాన్నావ్యవస్థేతి. తథాచాహుః. శ్లో."యథైకస్మిన్ ఘటాకాశే రజో ధూమాదిభిర్యుతే, న సర్వేసంప్రయుజ్యంతే తథా జీవాస్సుఖాదిభి" రితి. ఏతచ్చాతిరహస్యం స్వబుద్ధ్యా నిశ్చితవ్యమితి సంబోధయతి- హే మహామతి ఇతి. ఇతరో మోక్షః. (4)

తా:- పై శ్లోకము నందు శరీరులు అని బహువచనముతో నిర్దేశించుట వలన విషయ భేదముచే అవిరోధము చెప్పబడినదను భ్రాన్తిని దూరీకరించుచు బంధమోక్షముల వ్యవస్థను ఉపాదించుచున్నారు.

ఓ మహామతి ఉద్ధవా! ఒక్కడేయై నా యంశమయిన ఈ జీవునికే అవిద్యచే అనాదియైన సంసారబంధమును విద్యచేతదితరమైన మోక్షమును కలుగుచున్నది. జీవుడు ఒక్కడే అయినచో ఆత్మాభేదము. జీవాత్మ పరమాత్మలకు అభేదము కలుగుట వలన అప్పుడునీకుగూడా సంసారబంధము కలదు కదా. అన్నచో లేదనుచున్నారు. ఎట్లనగా ఒక్కడే అయిన చంద్రుడు సూర్యుడు మొదలయిన వానికి జలాదికముగ ఉపాధిచే బింబప్రతిబింబరూపమయిన భేదము కలగుచున్నది ఎట్లో, మరియెట్లు జలకృతములయిన కంపాదులు ప్రతిబింబమునకే కలుగుచున్నవో, ఆకాశము నందున్న బింబమై యున్న చంద్రునకు కలుగవో ఏ ప్రకారము ఆ జలమునందలి ప్రతిబింబము ఉపాధి భేదముచే ఒక్క ఉదక కుంభము భగ్నమైనంతనే దానిని బొందియున్న ప్రతిబింబమునకే బింబముతో నైక్యము కలుగుచున్నదో ఇతరోపాధిని పొందిన ప్రతిబింబమునకు కలుగదో ఆ ప్రకారము అవిద్యయందు ప్రతిబింబితుడై నాయంశమైన జీవునికే ఆ అవిద్యాకృతమయిన బంధము కలుగును. అతనికి ఉపాధి వలనైన భేదము వలన అవ్యవస్థ లేదు. ప్రాచీనులిట్లనిరి. "యథైకస్మిన్ ఘటాకాశే జోధూమాది భిర్యుతే, నసర్వే సంప్రయుజ్యంతేత జీవాస్సుఖాదిభిః" దుమ్ము పొగ అను వాటితో కూడిన ఒకటే ఘటాకాశమునందెట్లో అట్లే జీవులు వారి వారి దేహాద్యుపాదులను బట్టి సుఖాదులను కూడుదురు. జీవులందరు అట్లుకూడదు. (4)

5. శ్లో॥ అథ బద్ధస్య ముక్తస్య వై లక్షణ్యం వదామి తే ।
విరుద్ధధర్మిణో స్తాత స్థితయోరేకధర్మిణి ॥

టీ:- తదేవం వ్యవస్థాముపపాద్య కథం వర్తేతేత్యాదివైలక్షణ్య ప్రశ్నస్యోత్తర మాహ - అథేతి. తచ్చ వైలక్షణ్యం ద్వివిధం - జీవేశ్వరయోరేకం జీవానాం చైకం. తత్ర జీవేశ్వరయోర్వైలక్షణ్యమాహ - విరుద్ధధర్మిణోరితి సార్ధద్వయేన. శోకానం దధర్మవతోః ఏకస్మిన్ ధర్మిణి శరీరే నియమ్య నియంతృత్వేన స్థితయోః. (5)

6. శ్లో॥ సుపర్ణావేతౌ సయుజౌ సఖాయౌ
యదృచ్ఛయా కృతనీడౌ చ వృక్షే ।
ఏకస్తయోః ఖాదతి పిప్పలాన్నం
అన్యో నిరన్నోఽపి బలేన భూయాన్ ॥

టీ:- సుపర్ణావితి. సుపర్ణౌ వృక్షాత్పక్షిణావివ దేహాత్పృథగుద్భూతౌ - సదృశౌ చిద్రూపత్వాత్. సఖాయౌ అవియోగాదైకమత్యాచ్చ. యదృచ్ఛయా అనిరుక్తయా మాయయా వృశ్చ్యత ఇతి వృక్షో దేహః. శ్రు. "ఊర్ధ్వ మూలమవాక్శాఖం వృక్షం యో వేద సంప్రతీ"తి.

తా:- ఈ ప్రకారము బంధమోక్ష వ్యవస్థనుపాదించి ఎట్లు వర్తింతురు అను వైలక్ష్య ప్రశ్నకుత్తరము చెప్పుచున్నారు. ఆ వైలక్ష్ణ్యము రెండు రకములు. జీవేశ్వరుల కొక్కటి. జీవులకందరికొక్కటి. అందు మొదట జీవేశ్వరులకు గల వైలక్ష్ణ్యమును రెండున్నర శ్లోకములలో చెప్పు చున్నాడు.

ఓ గొప్ప బుద్ధి కలవాడా! ఒక్క శరీరము నందే నియమ్య నియంతలై జీవేశ్వరులై యుంటూ శోకానందములను విరుద్ధ ధర్మముల కలవారైన, (శోకము జీవధర్మము ఆనందము ఈశ్వర ధర్మము) బద్ధునికి ముక్తునికి గల వైలక్ష్ణ్యమును చెప్పెదను వినుము.(5)

తా:- వృక్షము కంటే వన్యములైన పక్షుల వలె దేహముకంటే భిన్నులై యున్నవారును చిద్రూపులై ఒకరికొకరు సమానులైన వారును వియోగము లేనందువలన ఐకమత్యము వలన సఖులును, అనిరుక్తమై వచింపరాని దైవమాయచే ఛేదింపబడు వృక్షము వంటిదైన దేహము నందు "ఊర్ధ్వముల మవాక్శాఖం వృక్షం మోవేసంప్రతి" పైన వేరు క్రింద కొమ్మలును గల వృక్షము నెవడు తెలిసికొనునో" అనుశృతి వలనను శ్లో. ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయం ఛందాసి యస్య పర్ణాని యస్తం వేద సవేద విత్ వేరుపైకిని కొమ్మలు కిందికిని గలదైన అశ్వత్థ వృక్షమును అవ్యయముగా చెప్పుదురు. దేని పర్ణములు

శ్రుతేః. శ్లో. "ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయ"మితి స్మృతేశ్చ. తస్మిన్ కృతం నీడం నికేతనం హృదయరూపం యాభ్యాం తౌ. తయోర్మధ్యే ఏకో జీవః పిప్పలాన్నం పిప్పలోऽశ్వత్థః దేహస్తస్మిన్నదనీయం కర్మఫలమిత్యర్థః. ఖాదతి భక్షయతి అన్యః. ఈశ్వరః నిరన్నః అభోక్తాపి నిజానందతృప్తో బలేన జ్ఞానాదిశక్త్యా భూయాన్ అధికః. తథా చ. శ్రు. "ద్వాసుపర్ణా సయుజాసఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీ"తి. 6

వేదములో అట్టి అశ్వత్థమును తెలిసికొన్నవాడు వేదవిత్ అనుస్మృతి వలనను, మాయచే హృదయ రూపమగు గూడును. నిర్మించుకొన్నవారై యున్నారు. వారిలో ఒక్కడు పిప్పలాన్నమును అనగా దేహము నందుండి కర్మ ఫలమును అనుభవించుచున్నాడు. (జీవుడు) అన్యుడు (ఈశ్వరుడు) నిరన్నుడై కర్మ ఫలముననుభవించని వాడై నిజానందతృప్తుడై జ్ఞాన శక్తిచే జ్ఞాన వీర్య తేజః ప్రముఖులయిన శక్తులచే వానికంటే అధికుడై యున్నాడు. "ద్వాసుపర్ణా సయుజా సఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతే. తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి" రెండు పక్షులు మిత్రములై సమానమైన వృక్షమును కూడియున్నవి నజినాఇలో ఒకటి రుచ్యమైన పిప్పలమును భుజించు చున్నది మరియొకటి తినకయేయున్నది.(6)

7. శ్లో॥ ఆత్మానమన్యం చ స వేద విద్వాన్
అపిప్పలాదో న తు పిప్పలాదః ।
యోऽవిద్యయాయుక్స తు నిత్యబద్ధో
విద్యామయో యస్స తు నిత్యముక్తః ॥

తా:- బలాధిక్యమును చెప్పుచున్నారు. కర్మఫలభోక్తగాని ఆ ఈశ్వరుడు జ్ఞాన స్వరూపుడు తనను, ఇతరుడగు జీవుని దేహేంద్రియాదికమును ఎరుగును. కర్మ ఫలభోక్త యగు జీవుడు తనను గాని ఇతరుడగు ఈశ్వరుని గాని తెలియడు. ఎవడవిద్యతో కూడిన వాడో ఆ జీవుడు నిత్యబద్ధుడు. ఎవడు జ్ఞాన స్వరూపుడో అతడు నిత్యముక్తుడు మాయచే ఆదరింపబడనివాడు మాయకు ఆశ్రయమై దానిని ప్రకాశింప చేయు వాడు. (7)

టీ:- బలాధిక్యమేవాహ - ఆత్మానమితి. యతః యః అవిద్యయా యుక్ యుక్తః స తు నిత్యబద్ధః అనాదిబద్ధః. యస్తు విద్యా ప్రధానః స తు

నిత్యముక్తః. మాయాయా అనావారకత్వాత్ ఆశ్రయవ్యామోహకత్వాచ్చ (7)

8. శ్లో॥ దేహస్థోఽపి న దేహస్థో విద్వాన్ స్వప్నాద్యథోత్థితః ।
అదేహస్థోఽపి దేహస్థః కుమతిస్స్వప్నదృగ్యథా ॥

టీ:- ఇదానీం బద్ధముక్తజీవానామేవ మిథోవైలక్షణ్యమాహ - దశభిః. దేహస్థఇతి. విద్వాన్ ముక్తః సంస్కార వశేన దేహస్థోఽపి దేహస్థో న భవతి, యథా స్వప్నాదుత్థితః స్మర్యమాణస్స్వప్నస్థితోఽపి తత్రస్థో న భవతి. తద్గత సుఖదుఃఖాద్యభావాత్తద్వత్. తథా వస్తుతః అదేహస్థోఽపి కుమతిః అవిద్వాన్. దేహస్థః తన్నిమిత్తసుఖదుఃఖభాక్ యథా స్వప్న దేహగత ఇతి. (8)

తా:- ఇప్పుడు బద్ధులు ముక్తులు అగు జీవులకు పరస్పర వైలక్షణ్యమును చెప్పుచున్నారు.

విద్వాంసుడు అనగా ముక్తుడు సంస్కార వశమున దేహము నందున్న వాడైనను స్వప్నము నుండి మేల్కొన్నవాడు వలె దేహము నందుండు వాడు కాడు స్వప్నమునందుతోచిన వానిని స్మరించుచు అవి మిథ్యలని తలంచును. అట్లే ముక్తుడు దేహగత సుఖ దుఃఖాదిక ములు తనవని భావించడు. అట్లే నిజముగ దేహమునందు లేనివాడు అనగా దేహ సంబంధము లేనివాడైననూ అవిద్వాంసుడు స్వప్నగత దేహుడు వలె దేహ నిమిత్తములైన సుఖదుఃఖాదుల ననుభవించు పాత్రయైనందున దేహమునందున్న వాడై బద్ధుడగును.(8)

9.శ్లో॥ ఇంద్రియైరింద్రియార్థేషు గుణైరపి గుణేషు చ ।
గృహ్యమాణేష్వహంకుర్యాత్ న విద్వాన్యస్త్వవిక్రియః ॥

టీ:- అత్ర హేతుత్వేన వైలక్షణ్యంతరమాహ - ద్వాభ్యాం. ఇంద్రియైరితి ఇంద్రియైరింద్రియార్థేషు గృహ్యమాణేష్వపి. యస్తు విద్వాన్. స నాహం

తా:- ఇచ్చట హేతువగుట వలన మరియొక వైలక్షణ్యమును రెండు శ్లోకములచే చెప్పుచున్నారు.

చక్షురాదీంద్రియములచే రూపాదులగు ఇంద్రియార్థములు గ్రహింపబడుచున్నను సత్వాదిగుణముల ద్వారా సుఖదుఃఖ మోహాది గుణములు మనస్సు ద్వారా గ్రహింపబడుచున్ననూ విద్వాంసుడు.

కుర్యాత్. అహం గృహ్ణామీతి మతం న కుర్యాదిత్యర్థః. కుతః. గుణైర్గుణేషు గృహ్యమాణేషు అత ఏవావిక్రియః రాగాదిశూన్యః. తదుక్తం గీతాసు. శ్లో. "తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః, గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జత" ఇతి. (9)

ముక్తుడు రాగా శూన్యుడై యుండును. తత్త్వవిత్తు మహాబాహో గుణ కర్మ విభాగయోః గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే " ఓ అర్జునా గుణకర్మ విభాగముల తత్త్వము తెలిసికొన్నవాడు శ్రోత్రాదీంద్రియములు శబ్దాదిగుణములందు ప్రవర్తించుచున్నవని తలచి వాని యందాసక్తుడు కాడు.(9)

10.శ్లో॥ కర్మాధీనే శరీరేऽస్మిన్ గుణభావ్యేన కర్మణా ।
వర్తమానోऽబుధ స్తత్ర కర్తాస్మీతి నిబధ్యతే ॥

టీ:- కర్మాధీన ఇతి. అథ బుధస్తు పూర్వకర్మాధీనే అస్మిన్ శరీరే వర్తమానః. గుణైరింద్రియైర్భావ్యేన కర్మణా. తత్ర దేహాదౌ నిబధ్యతే. కుతః. కర్తాస్మీత్యహంకారేణ. తదుక్తం తత్రైవ. శ్లో. "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః. అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యత" ఇతి. ఏతైస్త్రిభిశ్శ్లోకైః కథం వర్తేతేత్యస్య ప్రశ్నస్య సుఖదుఃఖ శూన్యో నిరభిమానశ్చ దేహే వర్తత ఇత్యుత్తరముక్తం భవతి. (10)

తా:- అవిద్వాంసుడు కర్మాధీనమైన ఈ శరీరమందు ఉంటూ ఇంద్రియములచే భావింపదగు కర్మచే నేనుకర్తనని అహంకారముచే ఆ దేహమునందు బద్ధుడగుచున్నాడు. "ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః అహంకారవి మూఢాత్మా కర్తాహమితి మన్యతే" ప్రకృతి గుణములచే చేయబడు కర్మలకన్నింటికి అహంకారముచే మూఢమైన చిత్తము గలవాడు నేను కర్తనని తలచును. అని నీతి యందునూ చెప్పబడినది. ఈ మూడు శ్లోకములచే ఎట్లు వర్తించునను ప్రశ్నకు సుఖదుఃఖశూన్యుడు నిరభిమానుడై దేహమునందు వర్తించునని ఉత్తరము చెప్పినట్లగుచున్నది.(10)

11.శ్లో॥ ఏవం విరక్తశ్శయనే ఆసనాటననమజ్జనే
దర్శనస్పర్శనఘ్రాణభోజనశ్రవణాదిషు ।
న తథా బధ్యతే విద్వాన్ తత్ర తత్రాదయన్ గుణాన్ ॥

తా:- ఇంకొక వైలక్షణ్యమును చెప్పుచూ ఏమి ఎట్లు భుజించును అను మొదలయిన ప్రశ్నలకు మూడు శ్లోకములతో ఉత్తరము చెప్పుచున్నారు.

టీ:- వైలక్షణ్యాంతరం వదన్ కిం భుంజీతేత్యాది ప్రశ్నోత్తరమాహ - త్రిభిః. ఏవమితి. అన్యగతమేవ కర్మ మాం న బధ్నాతీత్యేవం విరక్తో విద్వాన్. అవిద్వానివ శయనాసనాదిషు న బధ్యతే. కుతః. తత్ర తత్ర విషయేషు గుణానింద్రియాణి అదయన్ భోజయన్ తత్సాక్షిత్వేన వర్తమానః న స్వయమదన్. (11)

అన్యగతమైన కర్మ నన్ను బంధించదని ముక్తుడు, జ్ఞాని శయ్య యందు శయనించుట, కూర్చుండుట, ఉద్యానవనములందు సంచరించుట జలక్రీడలందు వనితాదుల సౌందర్యములగు వస్తువులను దర్శించుట ఆఘ్రాణించుట, భక్షించుట, శృంగార గీతములు వినుట మొదలయిన ఇంద్రియ వృత్తులందు అనురక్తుడు గాక యా శబ్దాది విషయములందు ఇంద్రియముల ప్రవర్తింపచేయుచు తాను సాక్షి మాత్రమై తాను వాని ననుభవింపక యుంటూ అవిద్వాంసుని వలె బద్ధుడుకారు.(11)

12,13.శ్లో॥ ప్రకృతిస్థోఽప్యసంసక్తో యథా ఖం సవితానిలః ।
వైశారద్యేక్షయాసంగశితయా ఛిన్నసంశయః ।
ప్రతిబుద్ధ ఇవ స్వప్నాత్ నానాత్వాద్వినివర్తతే ॥

టీ:- ఏతదేవ కుతస్తత్రాహ - సార్ధేన. ప్రకృతిస్థ ఇతి. యథా ఖం సర్వగతమపి న సజ్జతే. యథా సవితాజలే ప్రతిబింబితోఽపి. యథానిలః. సర్వత్ర సంచరన్నపి. తద్వత్. అసంగేనైవ వైరాగ్యేణ శితయా తీక్ష్ణయా ఛిన్నాః సంశయాః అసంభావనాదయో యస్య సః. నానాత్వాత్ దేహాదిప్రపంచాత్. (12,13)

తా:- ఆకాశము సర్వగతమయ్యు వానినంటని విధముగా, సూర్యుడు జలము నందు ప్రతిబింబితుడయ్యు ఆ జలకంపనాది ధర్మములను పొందనట్లు, వాయువు సర్వత్ర సంచరించువాడయ్యు ఆయార్ద్రవ ధర్మములను అంటని విధము ముక్తుడు ప్రకృతి కార్యమగు దేహము నందున్న వాడయ్యు వేదాంతార్థ నిశ్చయము గలవాడై, వైరాగ్యముచే నిశితమైన జ్ఞానదృష్టిచే అనగా అట్టి విజ్ఞానముచే అసంభావనాది సంశయములు తొలగిపోగా దేహాది ప్రపంచము నుండి నివృత్తుడై వాని యందాసక్తుడు గాకున్నాడు.(12,13)

14. శ్లో॥ యస్య స్యుర్వీతసంకల్పాః ప్రాణేంద్రియమనోధియామ్ ।
వృత్తయస్స తు నిర్ముక్తో దేహస్థోऽపి హి తద్గుణైః ।

టీ:- కథం విహరేదిత్యస్యోత్తరత్వేన వైలక్షణ్యాంతరమాహ - యస్యేతి. తద్గుణైర్దేహగుణైః. సంకల్పశూన్యాభిః ప్రాణాదివృత్తిభిర్విహరన్ ముక్త ఇత్యర్థః. (14)

తా:- ఎట్లు విహరించును అను దానికి ఉత్తరముగా ఇంకొక వై లక్షణ్యమును చెప్పుచున్నారు. ఎవని ప్రాణము ఇంద్రియములు మనస్సు బుద్ధి మొదలయిన వాని వృత్తులు సంకల్ప వర్జితములో అతడు దేహస్థుడయ్యును దేహగుణములు సంకల్ప శూన్యములగు ప్రాణాది వృత్తులచే విహరించుచు ముక్తుడగుచున్నాడు. (14)

15. శ్లో॥ యస్యాత్మా హింస్యతే హింస్రైః యేన కించిద్యదృచ్ఛయా ।
అర్చ్యతే వా క్వచిత్తత్ర న వ్యతిక్రియతే బుధః ॥

టీ:- ఏవం తావద్బద్ధముక్తయోః స్వసంవేద్యమేవ వైలక్షణ్యముక్తం. ఇదానీం కైర్వా జ్ఞాయేత లక్షణైరిత్యస్యోత్తరతయా తయోః పరైరపి సుజ్ఞేయం వైలక్షణ్యమాహ - త్రిభిః. యస్యేతి. హింస్రైర్దుర్జనైరన్యైర్వా ప్రాణిభిః. యస్యాత్మా దేహః పీడ్యతే యదృచ్ఛయా యేన కేనాపి క్వచిత్కించిదర్చ్యతే వా. స బుద్ధేశ్చేత్తత్ర న వ్యతిక్రియతే నాతివిక్రియత ఇత్యర్థః. తదుక్తం యాజ్ఞ్యవల్క్యేన. శ్లో. "యం కంటకైర్వితుదతి చందనైర్యశ్చ లింపతి, అక్రుద్ధో పరితుష్టశ్చ సమస్తస్య చ తస్యచే"తి. (15)

తా:- ఈ ప్రకారము ఇంతవరకు సంవేద్యమగు బద్ధముక్తుల వైలక్షణ్యము చెప్పబడినది. ఇప్పుడు ఏ యే లక్షణములచే ఆ బద్ధ, ముక్తులు తెలియబడుదురు. అను ప్రశ్నకు ఉత్తరముగా ఇతరులకు సులభముగా తెలియదగినవారి వైలక్షణ్యమును మూడు శ్లోకములచే చెప్పుచున్నాడు. తన శరీరమును క్రూరులైన దుర్జనులు ఇతరములగు ప్రాణులు హింసించుచున్ననూ తనకుతానై ఎవడైనను కొంత ఒకప్పుడు పూజించి ననూ, విద్వాంసుడైనవాడు ఆ హింసా పూజలచే ఏ విధమయిన వికారమును పొందకుండయున్నాడు యాజ్ఞ్యవల్క్యులీ మాటనేచెప్పిరి. "యః కంటకై ర్వితుదతి చందనైర్వశ్చలింపతి అక్రుద్ధా అపరితుష్టశ్చ సమస్తస్య చ తస్య చ." ఎవడు ఎవనిని ముండ్లతో క్రుచ్చుచున్నాడో, ఎవడు గంధముతో పూయుచున్నాడో ఆ ముండ్లను శరీరంపై కుచ్చువానిపై కోపము పొందని వాడును ఆ గంధపు పూత పూసెడు వానిపై సంతుష్టుడు గాని వాడునై ఇద్దరి యందు సమునిగా వుండువాడు ముక్తుడు. (15)

16.శ్లో॥ న స్తువీత న నిందేత కుర్వతస్సాధ్వసాధు వా ।
వదతో గుణదోషాభ్యాం వర్జితస్సమదృఙ్మునిః ॥

టీ:- కించ. నేతి, సాధ్వసాధు వా కుర్వతో వదతో వా జనాన్ న స్తువీత న చ నిందేత. యో లౌకికవ్యవహారే విముఖః స ముక్త ఇత్యర్థః (16)

తా:- మంచిపనిని చెడ్డపనినిగాని చేయువారిని చెప్పువారిని స్తుతించరాదు నిందించరాదు. మంచిచెడ్డలచే విడువబడినవాడై సమదృష్టి గలవాడై మునియై యుండును. వాడే ముక్తుడు.(16)

17.శ్లో॥ న కుర్యాన్నవదేత్కించిత్ న ధ్యాయేత్సాధ్వసాధు వా ।
ఆత్మరామోఽనయా వృత్త్యా విచరేజ్జడవన్మునిః ॥

టీ:- అపిచ. నేతి. యో దైహికేఽపి కర్మణ్యుదాసీనః స ముక్తః ఇతరో బద్ధ ఇత్యర్థః. (17)

తా:- మంచిపనిగాని చెడ్డపనిగాని మంచి మాటగాని చెడ్డమాట గాని కొంత అయిననూ చేయరాదు. చెప్పరాదు. ధ్యానించరాదు ఈ మనో వృత్తిచే ఆత్మయందు రమించువారై జడునివలె ముని చరించవలెను. (17)

18.శ్లో॥ శబ్దబ్రహ్మణి నిష్ణాతో న నిష్ణాయాత్పరే యది ।
శ్రమస్తస్య శ్రమఫలో హ్యధేనుమివ రక్షితః ॥

టీ:- ఏతాన్యేవ సర్వాణి ముముక్షోస్సాధనాని జ్ఞాతవ్యాని. యస్తు కేవలం శబ్దబ్రహ్మణ్యభిజ్ఞః పాండిత్యమాత్రశ్లాఘీ - న తుక్తైస్సాధనైస్తదర్థనిష్ఠో భవేత్ తం నిందతి - శబ్దబ్రహ్మణీతి. శబ్దబ్రహ్మణి నిష్ణాతః పారంగతోఽపి పరే బ్రహ్మణి న నిష్ణాయాత్. ధ్యానాద్యభియోగం న కుర్యాచ్చేత్

తా:- ఎవడు కేవలము శబ్దబ్రహ్మమగు వేదమును మాత్రము అధ్యయనము చేసి పాండిత్యము నొంది పండితుడనని పేరు నొంది పొగడ్తలు పొందినవాడై పరబ్రహ్మ యందు ధ్యాన నిష్ఠ కలవాడు కాడో అట్టివాని శాస్త్ర పరిశ్రమ గొడ్డటావును పోషించువానికి వలె ఫలము శ్రమయే యగును. పరమపురుషార్థమునిచ్చునది కాకపోవుచున్నది.(18)

తస్య శాస్త్ర శ్రమః శ్రమైకఫలః న తు పురుషార్థపర్యవసాయీ అధేనుం చిరప్రసూతాం. (18)

19.శ్లో॥ గాం దుగ్ధదోహామసతీం చ భార్యాం
దేహం పరాధీనమసత్ప్రజాం చ ।
విత్తం త్వతీర్థీకృతమంగ వాచం
హీనాం మయా రక్షతి దుఃఖ దుఃఖీ ॥

తా:- ఈ విషయమునే అన్యార్థ నిదర్శనములచే ప్రవచించుచున్నాడు. ఓ ఉద్ధవా! ఓ ఉద్ధవా! ఎవడు గొడ్డుటావును పోషించునో, అంకులాడి భార్యను కలిగి వుండునో, వృద్ధుడై పరాధీనుడగునో, కుపుత్రుడు కలవాడగునో అట్టివాడు దుఃఖము తర్వాత దుఃఖమును పొందును.(19)

టీ:- ఏతదేవాన్యార్థనిదర్శనైః ప్రపంచయతి - గామితి. దుహ్యత ఇతి దోహః పయః దుగ్ధో దోహః. నోత్తరత్ర దోహోఽస్తి యస్యాస్తాం అర్థశూన్యాం. అసతీం కామశూన్యాం భార్యాం దేహం పరాధీనం ప్రతిక్షణం దుఃఖహేతుం. అసత్ప్రజాం దృష్టాదృష్ట సాధనశూన్యం పుత్రం అతీర్థీకృతం ఆగతే పాత్రే అదత్తం విత్తం దుష్కీర్తి దురితాపాదకం అంగ హే ఉద్ధవ. దుఃఖానంతరం దుఃఖమేవ యస్య సః. (19)

20. శ్లో॥ యస్యాం న మే పావనమంగ కర్మ
స్థిత్యుద్భవప్రాణనిరోధమస్య ।
లీలావతారేప్సితజన్మ వా స్యాత్ వంధ్యాం
గిరం తాం బిభృయాన్న ధీరః ॥

తా:- నా స్తుతిలేని వాక్కు గలవాడు దుఃఖమును పొందగలదు. దానినే వివరించుచున్నాడు. ఏ కథల యందు విశ్వానికి సృష్టి స్థితి లయ హేతువై జగత్పావనమయిన నాకృత్యము ప్రవరించదో ఏ వృత్తము నందు జగత్తునకు ప్రేమాస్పదమయిన లీలావతారములైన

టీ:- రక్షతి మయాహీనాం వాచమిత్యుక్తం. తదేవ వివృణోతి - యస్యామితి. యస్యాం మే జగతః శోధకం పావనం చరిత్రం న స్యాత్. కిం తత్. అస్య విశ్వస్య స్థిత్యాదిరూపం తద్ధేతురిత్యర్థః. లీలావతారేషు ఈప్సితం జగతః ప్రేమాస్పదం శ్రీరామకృష్ణాదిజన్మ వా న స్యాత్. తాం వంధ్యాం నిష్ఫలాం గిరం ధీరో ధీమాన్. న ధారయేత్. (20)

రామకృష్ణాదుల జన్మాదికము కనబడదో, అట్టి నిష్ఫలమయిన వృత్తమును లేక వాక్కును పండితుడయినవాడు ధరించగూడదు అట్టి విషయమును గూర్చి వచింపకూడదు.(20)

21.శ్లో॥ ఏవం జిజ్ఞాసయాపోహ్య నానాత్వభ్రమమాత్మని ।
ఉపారమేత విరజం మనో మయ్యర్ప్య సర్వగే ॥

టీ:- ఉక్తం జ్ఞానమార్గముపసంహరతి - ఏవమితి. ఏవం నిశ్చిత్య విచారేణాత్మని నానాత్వభ్రమం దేహాద్యధ్యాసం నిరస్య నిర్మలం మనో మయి సర్వగే పరిపూర్ణే సమర్ప్య సంధార్య ఉపారమేత ఉపరమేత్. న కించిత్కుర్యాత్ శాస్త్రపాండిత్యమాత్రేణేత్యర్థః. (21)

తా:- చెప్పబడిన జ్ఞానమార్గమును ఉపసంహరించుచున్నాడు ధీరుడు ఇట్లు నిశ్చయించుకొని ఆత్మ విచారముచే ఆత్మయగు తాను దేహాదుల యందు నేనని భావించే అధ్యాసను నిరసించి నిర్మలమైన మనస్సును పరిపూర్ణుడనయిన నాయందు సమర్పించి ఇతరకృత్యములనుండి విరామమును పొందవలెను కేవల శాస్త్ర పాండిత్యముచే తర్కింపరాదు. (21)

22.శ్లో॥ యద్యనీశో ధారయితుం మనో బ్రహ్మణి నిశ్చలం ।
మయి సర్వాణి కర్మాణి నిరపేక్షస్సమాచరేత్ ॥

టీ:- యదీతి. యద్యనీశః అశక్తః తర్హి ఆస్తామిదం మద్భక్త్యైవ కృతార్థో భవిష్యతీత్యాహ - మయీతి. (22)

తా:- ఒకవేళ మనస్సును నిశ్చలము చేసికొని బ్రహ్మనందు నిలుచుట కశక్తుడైనచో తాను చేయు నిత్యనై మిత్తికాదిసర్వకర్మలను నా యందు సమర్పించి ఫలాపేక్ష లేనివాడై ఆచరించవలెను నా భక్తిచేతనే కృతార్థుడు కాగలడు.(22)

23.శ్లో॥ శ్రద్ధాళుర్మే కథాశ్శృణ్వన్ సుభద్రా లోకపావనీః ।
గాయన్ననుస్మరన్ కర్మ జన్మ చాభినయన్ముహుః ॥

టీ:- మదర్పణేన కర్మభిర్విశుద్ధసత్వస్యాంతరంగాం భక్తిమాహ - ద్వాభ్యాం. శ్రద్ధాళురితి. అభినయన్ స్వయమనుకుర్వన్. (23)

తా:- నాయందు ఫలసమర్పణముచే చేయు కర్మలచే శుద్ధ సత్త్వుడైన వానికి అంతరంగ భక్తిని రెండు శ్లోకములచే చెప్పుచున్నారు.

శ్రద్ధకలవాడై మంగళకరములై లోకపావనములయిన నా కథను వింటూ పాడుతూ స్మరిస్తూ నా జన్మకర్మలను స్వయముగా అనుకరిస్తూ శ్రీకృష్ణ వేషధారివలె నటిస్తూ ప్రవర్తించవలెను. (23)

24.శ్లో॥ మదర్థే ధర్మకామార్థాన్ ఆచరన్ మదుపాశ్రయః ।
లభతే నిశ్చలాం భక్తిం మయ్యుద్ధవ సనాతనే ॥

టీ:- మదర్థ ఇతి. ఆచరన్ సేవమానః. (24)

తా:- ఓ ఉద్ధవా! నన్నాశ్రయించి నా భక్తుడై నాకొరకు ధర్మార్థ కామప్రదములగు కర్మలనాచరించుచున్నవాడై సేవించుచు పురాణ పురుషుడనైన నాయందచంచలమయిన భక్తిని పొందుచున్నాడు. (24)

25.శ్లో॥ సత్సంగలబ్ధయా భక్త్యా మయి మాం య ఉపాసితా ।
స వై మే దర్శితం సద్భిరంజసా విందతే పదమ్ ॥

టీ:- సత్సంగేతి. తతశ్చానేన ప్రకారేణ మయి సత్సంగేన లబ్ధయా భక్త్యా, యః మద్భక్తః మాముపాసితా ధ్యాతా భవతి స చ ధ్యానశీలః సద్భిర్దర్శితం వైనిశ్చితం. సుఖేనైవ మే పదం స్వరూపం ప్రాప్నోతి. (25)

తా:- నాయందీ ప్రకారముగా ఎవడు సాధు సంగముచే లభించిన భక్తిచే నన్ను ధ్యానించువాడగునో ఆ ధ్యాన శీలుడు సత్పురుషులు నిశ్చయించిన నా స్వరూపమును సుఖముగనే పొందుచున్నారు. (25)

**ఉద్ధవ ఉవాచ**

26. శ్లో॥ సాధు స్త ఉత్తమశ్లోక మతః కీదృగ్విధః ప్రభో ।
భక్తి స్వయ్యుపయుజ్యేత కీదృశీ సద్భిరాదృతా ॥

టీ:- సత్సంగలబ్ధయా భక్త్యేత్యుక్తం తత్ర సతాం భక్తేశ్చ విశేషం పృచ్ఛతి - సాధురితి. సాధవః స్వస్వ మతపరికల్పితాస్సంతి బహవః. తవ తు కీదృశస్సృతః. భక్తిరపి బహువిధా లోకే కీదృశీ పునస్త్వయ్యుపయుజ్యేత సద్భిశ్చ నారదాదిభిరాదృతా. (26)

తా:- సత్సంగలబ్ధమైన భక్తిచే అని చెప్పబడినది అందు ఆ సత్పురుష విశేషములు భక్తి విశేషములను గూర్చి ప్రశ్నించుచున్నాడు. ఓ ప్రభూ సాధువులు తమతమ చిత్తములను అనుకూలమయిన మార్గమును కల్పించుకొన్నవాడు చాలా మంది కలరు. వారితో నీకు సమ్మతుడు ఉత్తమసాధువు ఎటువంటివాడు భక్తి కూడా లోకమున అనేక రీతులుగా వుండును. నారదాది సత్పురుషులచే ఆదరించబడిన ఎట్టి భక్తి నీయందు ఉపయుక్తమగుచున్నది. (26)

27,28. శ్లో॥ ఏతన్మే పురుషాధ్యక్ష లోకాధ్యక్ష జగత్ప్రభో
ప్రణతాయానురక్తాయ ప్రపన్నాయ చ కథ్యతామ్ ।
త్వం బ్రహ్మ పరమం వ్యోమ పురుషః ప్రకృతేః పరః
అవతీర్ణోऽపి భగవన్ స్వేచ్ఛోపాత్తపృథగ్వపుః ।

టీ:- ఏతదితి. ఏతచ్చ కథ్యతాం ఇదం చాతి గుహ్యం త్వయైవ వక్తవ్యమి త్యైశ్వర్యమావిష్కరోతి - హే పురుషాధ్యక్షేత్యాదినా - హే బ్రహ్మాది నియంతః. అత్ర హేతుః - త్వమితి. వ్యోమవదసంగః యతః ప్రకృతేః పరఃస్వేషామిచ్ఛయా ఉపాత్తం పృథక్పరిమితం వపుర్యేన సః. (27,28)

తా:- ఇది చెప్పుము ఈ రహస్యము నీచేతనే వచింపదగినది, అని ఐశ్వర్యము నావిష్కరించుచున్నాడు. ఓ బ్రహ్మాది పురుషులను నియమించువాడా ఏ ఈ భక్తి రహస్యమును నిన్ను శరణు పొందిన నాకు చెప్పుము. నీవు పరబ్రహ్మవు పరమవ్యోమవు, హృదయాకాశ మువు. దహరాకాశరూపుడవు, హృదయపుండరీకమున వెలుగుదువు. ఆకాశమువలె దేనినంటని అసంగుడవు. ప్రకృతికి పరుడైన పురుషుడవు అగుదువు. నీవారగు భక్తుల కోరికచే ఇష్టము వచ్చిన ప్రత్యేకమైన పరిమితమైన శరీరము గలవాడవై శరీరధారివై భూమియందవతరించి యున్నావు. (27,28)

శ్రీ భగవానువాచ

29.శ్లో॥ కృపాళురకృతద్రోహః తితిక్షుస్సర్వదేహినాం ।
సత్యసారోఽనవద్యాత్మా సమస్సర్వోపకారకః ॥

టీ:– తత్ర త్రింశల్లక్షణైః సాధుం నిరూపయతి – పంచభిః. కృపాళురితి – కృపాళుః పరదుఃఖాసహిష్ణుః. స్వదేహినాం కేషాంచిదపి అకృతద్రోహః తితిక్షుః. క్షమవాన్. సత్వం సారః స్థైర్యం బలం వా యస్య సః అనవద్యాత్మా అసూయాదిరహితః. సుఖదుఃఖయోః సమః. యథాశక్తి సర్వేషాముపకారకః. (29)

తా:– అందు ముప్పయి లక్షణములచే సాధుపురుషుని నిరూపించుచున్నాడు. పరుల దుఃఖమును సహించని వాడును అన్ని ప్రాణులలో ఏ కొన్నిటికికూడా కీడు చేయని వాడును, ఓర్పుగలవాడు, మన స్థైర్యము గలవాడు, అసూయాదులు లేని చిత్తము గలవాడు సుఖదుఃఖములందు సమవర్తనుడు. ఎల్లప్రాణులకు ఉపకారము చేయువాడు.(29)

30.శ్లో॥ కామైరహతధీర్దాంతో మృదుః శుచిరకించనః ।
అనీహోఽమితభుక్ఛాంతః స్థిరో మచ్ఛరణో మునిః ॥

టీ:– కామైరితి. కామైరక్షుభితచిత్తః. దాంతః సంయతబాహ్యేంద్రియః మృదుః అకఠినచిత్తః. శుచిః సదాచారః. అకించనః అపరిగ్రహః. అనీహః దృష్టాదృష్టక్రియాశూన్యః. మితభుక్ లఘ్వాహారః. శాంతః నియతాంతః కరణః. స్థిరః స్వధర్మేమచ్ఛరణః మదేకాశ్రయః మునిః మననశీలః. (30)

తా:– ఇంద్రియకామములచే క్షోభపొందని చిత్తము గలవాడు, చక్షురాది బాహ్యేంద్రియముల నియమించినవాడు, మెత్తని మనస్సు గలవాడు, సదాచారుడు, అపరిగ్రహుడు, దృష్టాదృష్టక్రియాశూన్యుడు, లఘ్వాహారమును భుజించువాడును, అంతఃకరణమును నియమించినవాడును స్వధర్మమునందు చలించని వాడును, నన్నొక్కడినే ఆశ్రయించినవాడు, మననశీలుడు.(30)

31. శ్లో॥ అప్రమత్తో గభీరాత్మా ధృతిమాన్ జితషడ్గుణః ।
అమానీ మానదః కల్యో మైత్రః కారుణికః కవిః ॥

టీ:- అప్రమత్త ఇతి. అప్రమత్తః సావధానః గభీరాత్మా నిర్వికారః. ధృతిమాన్ విపద్యప్యకృణః. జితషడ్గుణః. శ్లో. క్షుత్పిపాసే శోకమోహౌ జరామృత్యూషడూర్మయః, ఏతే జితా యేన సః. అమానీ న మానాకాంక్షీ అన్యేభ్యో మానదః కల్యః పరబోధనే దక్షః మైత్రః అవంచకః. కారుణికః కరుణయైవ ప్రవర్తమానః. న దృష్టలోభేన. కవిః సమ్యక్ జ్ఞానీ. (31)

తా:- ఏమరుపాటు లేనివాడు నిర్వికారుడు, విపత్తులందునూ దిగులు పొందని వాడు, జయింపబడిన షడ్గుణములుకలవాడు "క్షుత్పిపాసే శోకమోహౌ జరామృత్యూషడూర్మయః" ఆకలి దప్పులు, శోకమోహిములు జరామృత్యువులు' ఈ ఆరింటిని జయించినవాడు ప్రతిష్ఠను కాంక్షించనివాడు. ఇతరులను గౌరవించువాడు, దక్షుడు, వంచకుడు కానివాడు, కనబడిన వాని నాశించక కరుణ తోడనే ప్రవర్తించువాడు, చక్కని జ్ఞానము కలవాడు.(31)

32. శ్లో॥ ఆజ్ఞాయైవం గుణాన్ దోషాన్ మయాదిష్టానపి స్వకాన్ ।
ధర్మాన్ సంత్యజ్య యస్సర్వాన్ మాం భజేత్సోఽపి సత్తమః ॥

టీ:- కించ ఆజ్ఞాయేతి. మయా వేదరూపేణ ఆదిష్టానపి స్వధర్మాచరణే సత్త్వశుద్ధ్యాదీన్ గుణాన్ విపక్షే దోషాంశ్చ ఆజ్ఞాయ జ్ఞాత్వాఽపి మద్ధ్యాన విక్షేపకతయా మద్భక్త్యైవ సర్వే భవిష్యంతీతి దృఢనిశ్చయేనైవ సర్వాన్ ధర్మాన్ సంత్యజ్య. యద్వా. భక్తిదార్ఢ్యేన నివృత్తాధికారతయా సంత్యజ్య. అథవా. విద్ధైకాదశీకృష్ణైకాదశ్యుపవాసానుపవాసౌ నివేద్య శ్రాద్ధాదయో యే భక్తివిరుద్ధా ధర్మాస్తాన్ సంత్యజ్యేత్యర్థః. (32)

తా:- ఈ ప్రకారము ధర్మాచరణమున సత్త్వశుద్ధి మొదలయిన గుణములను అధర్మాచరణమున నరకమున బడుట మొదలయిన దోషములను తెలిసికొని వేదరూపుడగునాచే చెప్పబడినవైనను స్వీయము లగు ధర్మములను అన్నిటిని పరిత్యజించి ఎవడునన్ను సేవించునో వాడు సయితము ముందుచెప్పబడిన వానివలె సాధు శ్రేష్ఠుడు.

ధర్మములను అజ్ఞానము వలన నాస్తిక్యము వలన త్యజించుటయో అనగా, కాదు, ధర్మాచరణమందు సత్వశుద్ధి మొదలయిన గుణములను ఆ ధర్మము నందు దోషములను తెలిసికొనియూ నా యొక్క ధ్యాన నిక్షేప భక్తిచే అన్ని గుణములు లభించగలవని దృఢనిశ్చయముతో సర్వధర్మములను పరిత్యజించి లేక భక్తి దార్ఢ్యముచే నివృత్తి మార్గము నందు (జ్ఞాన మార్గము) అధికారము గలవాడగుటచే త్యజించి,

అట్లుగాకున్న శుద్ధ ఏకాదశి, కృష్ణ ఏకాదశి అనువాని యందలి ఉపవాస, అనుపవాసములను నివేదించి భక్తి విరుద్ధ ధర్మములగు ఏ శ్రద్ధాదులు కలవో వానిని త్యజించి అని యర్థము.(32)

33.శ్లో॥ జ్ఞాత్వాజ్ఞాత్వాపి యే వైమాం యావాన్యశ్చాస్మి యాదృశః
భజంత్యనేన భావేన తేమే భక్తతమా మతాః ॥

టీ:- కించ. జ్ఞాత్వేతి. యావాన్ దేశకాలాపరిచ్ఛిన్నః. యశ్చ సర్వాత్మా. యాదృశః సచ్చిదానందరూపః తం మాం జ్ఞాత్వా అజ్ఞాత్వాపి. యద్వా. విశేషతః. పునః పునర్జ్ఞాత్వా ఏకాంతభావేన యే భజంతి. (33)

తా:- ఇట్లు గుణములను, దోషములను తెలిసికొని వేదరూపుడనై నేను చెప్పినవైననూ స్వధర్మములనన్నింటిని పరిత్యజించి ఎవడు నన్ను భజించుచున్నాడో వాడును, అన్ని గుణములు గలవాని వలె సాధు పురుషుడగుచున్నాడు. ముందు భగవంతుడెవడు? ఎంతమాత్రము వాడు? ఎటువంటి వాడు అని నన్ను ఎరుగక క్రమముగా దేశకాలాపరిచ్ఛిన్నుడు సర్వాత్ముడు సచ్చిదానందరూపుడు అని తెలిసికొని ఎవ్వరు నన్ను ఏకాంత భావనచే అనన్య భక్తిచే సేవించుచున్నారో వారు పరమ భక్తులు నాకు సమ్మతులు.(33)

34.శ్లో॥ మల్లింగమద్భక్తజనదర్శనస్పర్శనార్చనం ।
పరిచర్యా స్తుతిః ప్రహ్వ గుణకర్మానుకీర్తనమ్ ॥

టీ:- ఏవం సాధులక్షణముక్తం భక్తేర్లక్షణమాహాష్టభిః- మల్లింగేతి. లింగాని ప్రతిమాదీని. (34)

తా:- ఈ ప్రకారము సాధు భక్తుల లక్షణము చెప్పబడినది. ఇంక భక్తి లక్షణమును ఎనిమిది శ్లోకములతో చెప్పుచున్నాడు. నా విగ్రహములను, నా భక్త జనులను దర్శించుట, స్పృశించుట, పూజించుట, సేవచేయుట, స్తుతించుట, గుణ కర్మలను కీర్తించుట.(34)

35.శ్లో॥ మత్కథాశ్రవణే శ్రద్ధా మదనుధ్యానముద్ధవ ।
సర్వలాభోపహరణం దాస్యేనాత్మనివేదనమ్ ॥

టీ:- మత్కథేతి. సర్వలాభోపహరణం సర్వస్య లబ్ధస్య సమర్పణం.(35)

తా:- ఉద్ధవా! నా కథలను వినుటయందు శ్రద్ధ నన్నుగూర్చి ధ్యానము చేయుట, తనకు లభించిన పత్రపుష్ప ఫలాన్నాదికము సర్వమును, ధనమును నాకు సమర్పించుట, దాస్య భావమున తన్ను నివేదించు కొనుట.(35)

36.శ్లో॥ మజ్జన్మకర్మకథనం మమ పర్వానుమోదనం ।
గీతతాండవవాదిత్రగోష్ఠీభిర్మద్గృహోత్సవః॥

టీ:- మజ్జనేతి. పర్వాణి జన్మాష్టమ్యాదీని తదనుమోదనం. (36)

తా:- నా అవతారములలో నేను చేసిన కృత్యములను చెప్పుట, నేను జన్మించిన జన్మాష్టమి మొదలయిన పర్వదినములందు నన్ను గూర్చి విని సంతోషించుట, గానము, నాట్యము, వీణా, వేణు, మృదంగాది వాద్యములు మొదలయిన వాని గోష్ఠులచే నా దేవాలయములందు మహోత్సవములు జరుపుట.(36)

37.శ్లో॥ యాత్రా బలివిధానం చ సర్వవార్షికపర్వసు ।
వైదికీ తాంత్రికీ దీక్షా మదీయ వ్రతధారణమ్ ॥

టీ:- యాత్రేతి. బలివిధానం పుష్పోపహారాదిసమర్పణం సర్వవార్షిక పర్వసు చాతుర్మాస్యైకాదశ్యాదిషు విశేషతః. (37)

తా:- సంవత్సరము పొడుగున వచ్చు చాతుర్మాస్యములగు ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తిక మాసములందు ఏకాదశులందు విశేషించి ఉత్సవము పూలుపండ్లు మొదలయిన ఉపహారములు సమర్పించుట, వేదోక్తమార్గమునకు ఆగమ విధానమునను నన్ను పూజించి దీక్ష వహించుట నా సంబంధమయిన వ్రతములను చేయుట. (37)

38.శ్లో॥ మదర్చాస్థాపనే శ్రద్ధా స్వత్సంభూయ చోద్యమః ।
ఉద్యానోపవనక్రీడ పురమందిరకర్మణి ॥

టీ:- మదర్చేతి. ఉద్యానాదికరణే సామర్థ్యే సతి స్వతః అసతి వా అన్యైసంభూయోద్యమః. ఉద్యానం పుష్పప్రదానం ఉపవనం ఫల ప్రదానం. ఆక్రీడం క్రీడాస్థానం. (38)

తా:- నా విగ్రహాదికములను ప్రతిష్ఠించుట యందు శ్రద్ధ పూలు ప్రధానం గల పూదోటలను, ఫలములు ప్రధానము గాగల మామిడి, అరటి, కొబ్బరి, జామ మొదలయిన వృక్షములు గల తోపులను, ఛాయా ప్రధానమయిన వృక్షములు గల క్రీడా స్థానములు, గోపుర ప్రాకార విమాన సహితములను దేవాలయములు, భజన మందిరములు మొదలయిన వాని నిర్మాణము నందు స్వయముగా సామర్థ్యమున్ననూ ఇతరులతో గూడి శ్రద్ధతో ప్రయత్నించుట.(38)

39.శ్లో॥ సమ్మార్జనోపలేపాభ్యాం సేకమండలవర్తనైః ।
గృహశుశ్రూషణం మహ్యం దాసవద్యదమాయయా ॥

టీ:- సంమార్జనేతి. సంమార్జనం రజోऽపాకరణం. ఉపలేపః గోమయోదకాదిభిరాలేపనం. సేకస్తైరేవ ప్రోక్షణం. మండలవర్తనం సర్వతోభద్రాదికరణం. మహ్యం మమ. (39)

తా:- చెత్తనూడ్చుట, గోమయముతో అలుకుట నీరుచల్లుట సర్వతో భద్రాది మండలములుగా ముగ్గులు పెట్టుట మొదలయిన వాటిచే ఆలయముకు దాసుని వలె నిష్కపటముగా సేవచేయుట.(39)

40.శ్లో॥ అమానిత్యమదంభిత్వం కృతస్యాపరికీర్తనం ।
అపి దీపావలోకమ్మే నోపయుంజ్యాన్నివేదితమ్ ॥

తా:- అహంకారము లేకుండుట, డాంబికము వీడి యుండుట, తాను చేసిన సత్కృతులు నలుగురితో బొగడకొనుకుండుట భక్తి లక్షణము ఇతరునిచే నివేదించబడిన దీపము ప్రకాశమునైనను నాకుపయోగింప కుండుటయు.

టీ:- అమానిత్వమితి. స్వయమన్యేన వా నివేదితం దీపావలోకమపి న స్వీకుర్యాత్. ఏతచ్చ సాధారణస్థావరవిషయం. రాగప్రాప్తవిషయం వా. భక్త్యా తు గ్రాహ్యమేవ. శ్లో."షడ్భిర్మాసోపవాసైస్తు యత్ఫలం పరికీర్తితం, విష్ణోర్నైవేద్య సిద్ధేన పుణ్యం తద్భుంజతాం కలౌ. హృది రూపం ముఖే నామ నైవేద్యముదరే హరేః, పాదోదకం చ నిర్మాల్యం మస్తకే యస్య సోऽచ్యుత" ఇత్యాదివచనేభ్యః. యద్వా. అన్యస్మై నివేదితం మమ నోపయుంజ్యాత్ మహ్యం న నివేదయేదిత్యర్థః. శ్లో. 'విష్ణోర్నివేదితాన్నేన యష్టవ్యం దేవతాంతరం, పితృభ్యశ్చాపి తద్దేయం తదానంత్యాయ కల్పతే. పితృశేషం తు యో దద్యాద్ధరయే పరమాత్మనే, రేతోధాః పితరస్తస్య భవంతి క్లేశభాగినః. ఆశాసతే సదా దేవాః పితరస్సర్వ ఏవ హి, య ఇష్ట్వాదౌ మహావిష్ణుం పశ్చాత్తేన పితౄన్ సురాన్. యజతే చ స వై పుత్రో వంశ్యో జాయేత జీవతు, ఆస్ఫోటయంతి పితరః ప్రనృత్యంతి పితామహాః, వైష్ణవోऽస్మిన్ కులే జాతస్సనస్సంతారయిష్యతి' ఇత్యాది వచనేభ్యః. (40,41)

ఈ నియమము సాధారణముగా మందుని విషయము అనురక్తిచే నిష్టము పొందగోరిన వాని విషయమగును కాని భక్తితో మాత్రము దీపాదికము గ్రాహ్యమే యగును.

శ్లో. షడ్భిర్మాసోపవాసైస్తు యత్ఫలంపరికీర్తితం
విష్ణోర్నైవేద్యసిక్తేనపుణ్యం తద్భుంజతాంకలౌ
హృదిరూపం ముఖేనామ నైవేద్యముదరే హరేః
పాదోదకం చనిర్మాల్యం మస్తకె యస్య సోచ్యుతః

కలియుగమునందు విష్ణువుకు నివేదించిన పవిత్రమయిన అన్నాదికము దొరికినంతనే భుజించువాడు, ఆరు మాసములుపవాస వ్రతములచే ఫలము కీర్తింపబడినదో ఆ ఫలమును పొందుచున్నాడు. హృదయము నందు హరి రూపమును, ముఖమునందు శ్రీహరి నామమును, ఉదరమునందు శ్రీహరి నివేదనమును, శిరస్సునందు శ్రీహరి పాదోదకమును నిర్మాల్యమును ఎవనికి గలదో వాడే అచ్యుతుడు. యద్వా, ఇతరులకు నివేదించిన దానిని నాకు నివేదించరాదు అని యర్థము.

శ్లో. విష్ణోర్నివేదితాన్నేన యష్టవ్యం దేవతాన్తరం
పితృభ్యశ్చైవ తద్దేయం తదానన్త్యాయకల్పతే ॥
పితృశేషం తు యోదద్యాద్ధరయే పరమాత్మనే
రేతోధాః పితరస్తస్య భవంతి క్లేశభాగినః ॥

విష్ణువునకు నివేదించిన అన్నము ఇతర దేవతలకు నివేదించి పూజించవచ్చును. పితృదేవతలకు ఆ అన్నము పెట్టినచో అది మోక్షము నీయ సమర్థమగును. పితృశేషమును ఎవడు పరమాత్మయగు హరికి నివేదించుచున్నాడో వాడు రేతస్సుపానము చేయువాడగును వాని పితరులు క్లేశ భాగులగుచున్నారు. ఇత్యాది వచనము లెన్నో వున్నాయి. (40)

41. శ్లో॥ యద్యదిష్టతమం లోకే యచ్చాపి ప్రియమాత్మనః ।
తత్తన్నివేదయేన్మహ్యం తదానంత్యాయ కల్పతే ॥

తా:- ఏదేదిలోకమునందు ప్రియమయిన వస్తువు ఏది తనకు ఇష్టమో ఆ యావస్తువును నాకు నివేదించవలెను మోక్షము కొరకు సమర్థ మగును. (41)

42. శ్లో॥ సూర్యోऽగ్నిః బ్రాహ్మణో గావో వైష్ణవః ఖం మరుజ్జలం ।
భూరాత్మా సర్వభూతాని భద్రపూజాపదాని మే ॥

టీ:- ఇదానీం ఏకాదశపూజాధిష్ఠానాన్యాహ - సూర్య ఇతి. హే భద్ర. (42)

తా:- ఇప్పుడు పదకొండు పూజా స్థానములను చెప్పుచున్నాడు సూర్యుడు, అగ్ని, బ్రాహ్మణుడు గోవులు, భక్తుడు ఆకాశము వాయువు, జలము, భూమి, ఆత్మ, సర్వభూతములు నా పూజా స్థానములు. (42)

43. శ్లో॥ సూర్యే తు విద్యయా త్రయ్యా హవిషాగ్నౌ యజేత మాం ।
అతిథ్యేన తు విప్రాగ్ర్యే గోష్వంగ యవసాదినా ॥

తా:- ఓ ఉద్ధవా! సూర్యుని యందునన్ను సూర్య సూక్తములచే ఉపస్థానాది మంత్రములచే, అగ్నియందు అన్నాదికమగు హవిస్సుచేతను గోవుల యందు గోగ్రాసము పచ్చిగడ్డి వేయుట చేతను పూజించవలెను. (43)

టీ:- అధిష్ఠాన భేదేన పూజాసాధనాన్యాహ - త్రిభిః. సూర్య ఇతి. త్రయ్యా విద్యయా సూర్యసూక్తైరుపస్థానాదినా. అంగ హే ఉద్ధవ. యవసాదినా తృణాదినా. (43)

44.శ్లో॥ వైష్ణవే బంధుసత్కృత్యా హృది ఖే ధ్యాననిష్ఠయా ।
వాయౌ ముఖ్యధియా తోయే ద్రవ్యైస్తోయపురస్కృతైః ॥

తా:- విష్ణు భక్తుని యందు బంధువు వలె సన్మానించుట, హృదయాకాశమునందు ధ్యాన నిష్ఠచే, వాయువునందు ప్రాణ దృష్టి చేతను, జలమునందు జలసహిత కుశ తిల తండులాదిద్రవ్యముల నర్పించుట చేత పూజించవలెను. (44)

టీ:- వైష్ణవ ఇతి. బంధుసత్కృత్యా బంధువత్సమ్మానేన. హృది ఖే హృదయాకాశే. ముఖ్యధియా ప్రాణదృష్ట్యా. తోయే తోయాదిభిః ద్రవ్యైః తర్పణాదినా. (44)

45.శ్లో॥ స్థండిలే మంత్రహృదయైః భోగైరాత్మానమాత్మని ।
క్షేత్రజ్ఞం సర్వభూతేషు సమత్వేన యజేత మామ్ ॥

తా:- భూమియందు నన్ను మేదినీ సూక్తాది రహస్యమన్త్ర న్యాసముల చేత తన హృదయము నందు పరమాత్మనయిన నన్ను సంకల్పితమగు ఇంద్రియ సుఖానుభవముల చేతను ఎల్లభూతముల యందు నన్ను క్షేత్రజ్ఞరూపునిగను సమదృష్టితో పూజింపవలెను.(45)

టీ:- స్థండిల ఇతి. స్థండిలే భువి. మంత్రహృదయైః రహస్య మంత్ర న్యాసైః. (45)

46.శ్లో॥ ధిష్ణ్యేష్వేతేషు మద్రూపం శంఖచక్రగదాంబుజైః ।
యుక్తం చతుర్భుజం శాంతం ధ్యాయన్నర్చేత్సమాహితః ॥

తా:- ఈ చెప్పబడిన సూర్యాదిస్థానములందు ధ్యేయ ప్రకారమును చెప్పుచున్నారు. శంఖచక్ర గదాపద్మములతో కూడిన చతుర్భుజములు

టీ:- సర్వాధిష్ఠానేషు ధ్యేయమాహ- ధిష్ణేష్వితి. అనేన ప్రకారేణ ఏషు ధిష్ణేషు. (46)

గలదై ప్రశాంతమై నిర్వికారమగు నా రూపమును ఏకాగ్రచిత్తుడై ధ్యానించుచు పూజించవలెను.(46)

47.శ్లో॥ ఇష్టాపూర్తేన మామేవ యో యజేత సమాహితః ।
లభతే మయి సద్భక్తిం మత్ స్మృతిః సాధుసేవయా ॥

టీ:- యుక్తాయాః భక్తేః ఫలమాహ - ఇష్టాపూర్తానేతి. సద్భక్తిం దృఢాం భక్తిం అస్యాః భక్తేః అంతరంగసాధనమాహ - ఇత్థం మత్స్మృతిః సాధుసేవయాభవతి. యద్వా. స్మృతిర్జ్ఞానం తతశ్చ దృఢభక్తిమతః పుంసః సాధుసేవయా మజ్జ్ఞానం సంభవతీత్యర్థః. (47)

తా:- చెప్పబడిన భక్తికి ఫలమును చెప్పుచున్నాడు. నిశ్చలచిత్తుడై ఎవడు నన్నిష్టములగు యాగముల చేతను దేవాలయము, బావి, ఆరామము అగ్రహారములను నిర్మించుట మొదలయిన పూర్తకర్మల చేతను పూజించుచున్నాడో వాడు సాధుసేవచే నా స్మరణ జ్ఞానము కలిగి నాయందచంచల మగు భక్తిని పొందుచున్నాడు.(47)

48.శ్లో॥ ప్రాయేణ భక్తి యోగేన సత్సంగేన వినోద్ధవ ।
నోపాయో విద్యతే సమ్యక్ ప్రాయణం హి సతామహమ్ ॥

టీ:- జ్ఞానభక్తిమార్గావుక్తౌ తత్ర జ్ఞానమార్గాదపి భక్తిమార్గశ్రేష్ఠ ఇత్యాహ - ప్రాణేయేతి. సత్సంగేన యో భక్తియోగః తేన వినా ఉపాయః సంసారతరణే న విద్యతే. సత్సంగేనేత్యత్ర హేతుమాహ - హి యస్మాత్సతామహం ప్రాయణం ప్రకృష్టమయనం ఆశ్రయః. అతః సత్సంగో భక్త్యంతరంగ ఇత్యర్థః. (48)

తా:- ఓ ఉద్ధవా! తరచుగా లోకమునందు సాధు సంగమముచే గలుగు భక్తి యోగము చేత తప్ప సంసార తరణోపాయము అన్యము లేదు. ఏలయన భక్తజనులకు పరమాశ్రయుడనై యున్నాను. కావున సత్సంగతియే భక్తి యోగమునకు అంతరంగము. జ్ఞానభక్తి మార్గములు రెండూ చెప్పబడినవి ఆ రెంటిలో భక్తి మార్గము శ్రేష్ఠమయినదని చెప్పినారు ఈ శ్లోకమున.(48)

49. శ్లో॥ అథైతత్పరమం గుహ్యం శృణ్వతో యదునందన ।
సుగోప్యమపి వక్ష్యామి త్వం మే భృత్యస్సుహృత్సఖా ॥

టీ:- ఇదానీం సాంఖ్యయోగాదీని సాధనాంతరసవ్యపేక్షాణి సవ్యభిచారీణి చ. సత్సంగస్తు స్వతంత్ర ఏవ సమర్థః ఫలావ్యభిచారీ చేతి వర్ణయితుమాహ - అథేతి. ఏతద్వక్ష్యమాణం పరమం గుహ్యం అతః శృణ్విత్యర్థః. (49)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
ఏకాదశోऽధ్యాయః

తా:- ఇప్పుడు సాంఖ్యయోగాదులు సాధనాంతరసాపేక్షములు సవ్యభిచారులు సత్సంగము మాత్రము స్వతంత్రముగనే సమర్థము ఫలమిచ్చుటయం దవ్యభిచారి (తప్పక ఫలమునిచ్చునది) అని వర్ణింప చెప్పుచున్నారు.

ఓ యదు కుమారా! నేను చెప్పబోవునది చాలా రహస్యమయినది. కావున వినుము అత్యంత రహస్యమయినను నీకు చెప్పగలను. నీవు నాకు సేవకుడవు దగ్గర చుట్టమవు స్నేహితుడవైయున్నావు.(49)

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
ఏకాదశాధ్యాయము సమాప్తము.

## ద్వాదశోऽధ్యాయః

శ్రీ భగవానువాచ

1. శ్లో॥ న రోధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ ।
న స్వాధ్యాయ స్తపస్త్యాగో నేష్టాపూర్తం న దక్షిణా ॥

టీ:– "ద్వాదశోసాధుసంగస్య మహిమావర్ణితః పురా. కర్మానుష్ఠాన తత్యాగ వ్యవస్థాచ తతః పరమ్". నేతి. న రోధయతి న వశీకరోతి. యోగః ఆసన ప్రాణాయామాదిః. సాంఖ్యం తత్వానాం వివేకః. ధర్మః సామాన్యతః అహింసాదిః స్వాధ్యాయో వేదజపః. తపః కృచ్ఛ్రాది. త్యాగః సన్న్యాసః. ఇష్టం చ పూర్తం చ. తత్ర ఇష్టమగ్నిహోత్రాది. పూర్తం కూపారామాది నిర్మాణం. దక్షిణాశబ్దేన సామాన్యతో దానం లక్ష్యతే.(1)

2. శ్లో॥ వ్రతాని యజ్ఞశ్ఛందాంసి తీర్థాని నియమా యమాః ।
యథావరుంధేత్ సత్సంగః సర్వసంగాపహో హి మామ్ ॥

టీ:– వ్రతానీతి. వ్రతాని ఏకాదశ్యుపవాసాదీని. యజ్ఞః. దేవపూజా. చందాంసి రహస్యమంత్రాః. అవరుంధేత్ వశీకరోతి. (2)

## ద్వాదశాధ్యాయము

తా:– "ద్వాదశోసాధుసంగస్య మహిమావర్ణితః పురా. కర్మానుష్ఠాన తత్యాగ వ్యవస్థాచ తతఃపరమ్" ఈ ద్వాదశాధ్యాయమందు ముందు సాధుసంగము యొక్క మహిమ వర్ణింపబడినది. తర్వాత కర్మానుష్ఠానము వలన త్యాగవ్యవస్థ చెప్పబడినది. భగవంతుడు చెప్పుచున్నాడు ఓ ఉద్ధవా! నన్ను ఆసన ప్రాణాయామాదికమయిన యోగము చతుర్వింశతి తత్త్వముల వివేకమగు సాంఖ్యము తెలుపలేదు. అహింసాదికమగు ధర్మము, వేదజపము నన్ను ప్రకటించలేదు. సన్యాసము వలన నేను తెలియరాను. ఇష్టమగు అగ్నిహోత్రాది కర్మగాని, కూపారామ నిర్మాణాది కమగు పూర్తకర్మగాని నన్ను తెలుపసాధ్యములు కావు సామాన్య ధనకనక వస్తువాహనాది దానము నన్ను వశపఱచుకొనలేదు. (1)

తా:– ఏకాదశ్యుపవాసములు, దేవపూజ, రహస్యమంత్రములు తప స్వాధ్యాయాదులు, అహింసాదులు ఇవి అన్నియును సర్వ సంగములను పోగొట్టు సాధుపుంగవుల సంగమము నన్నెట్లు వశించునో అట్లు వశీకరించలేవు. (2)

3.శ్లో॥ సత్సంగేన హి దైతేయా యాతుధానాః ఖగా మృగాః ।
గంధర్వాప్సరసో నాగాః సిద్ధచారణగుహ్యకాః॥

4.శ్లో॥ విద్యాధరా మనుష్యేషు వైశ్యా శ్శూద్రాస్స్త్రియోఽంత్యజాః।
రజస్తమః ప్రకృతయః తస్మింస్తస్మిన్ యుగే యుగే ॥

టీ:- సత్సంగేనేతి. యాతుధానాః రాక్షసాః. (3,4)

తా:- సాధువుల సంగమము చేతనే రాక్షసులు, పక్షులు, పశువులు, గంధర్వాప్సరసలు, నాగులు, సిద్ధచారములు, గుహ్యకులు, విద్యాధరులు, మనుష్యులందు వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, అంత్యజులు ఆయా యుగము నందు రజస్తమస్సుల గుణము గలవారై కూడా ధన్యులయిరి. (3,4)

5.శ్లో॥ బహవో మత్పదం ప్రాప్తాః త్వాష్ట్రకా యాదవాదయః ।
వృషపర్వా బలిర్బాణో మయశ్చాథ విభీషణః ॥

6.శ్లో॥ సుగ్రీవో హనుమానృక్షో గజో గృధ్రో వణిక్పథః ।
వ్యాధః కుబ్జా వ్రజే గోప్యో యజ్ఞపత్న్య స్థతాపరే ॥

టీ:- బహవఇతి. త్వాష్ట్రో వృత్రః. కాయాధవః ప్రహ్లాదః. సుగ్రీవ ఇతి. ఋక్షో జాంబవాన్. గృధ్రో జటాయుః. వణిక్పథః తులాధారః. వ్యాధః ధర్మవ్యాధః. యజ్ఞపత్న్యో దీక్షితభార్యాః. (5,6)

తా:- సత్సంగము చేతనే వృత్రుడు, ప్రహ్లాదుడు, వృషపర్వ, బలి, బాణ, మయ, విభీషణ, సుగ్రీవ, హనుమ, జాంబవన్త, గజేంద్ర, జటాయు, తులాధారుడు, ధర్మవ్యాధుడు, కుబ్జ గోకులమండలి గోపికలు మరియు, యజ్ఞపత్నులు, దీక్షితుల భార్యలు, నా స్థానము పొందిరి.(5,6)

7. శ్లో॥ తేనాధీత శ్రుతిగణాః నోపాసితమహత్తమాః ।
అవ్రతాతప్తతపసః సత్సంగాన్మాముపాగతాః ॥

టీ:- తేషాం సత్సంగవ్యతిరిక్త సాధనాంతరభావమాహ - త ఇతి. న అధీతాః శ్రుతిగణాః యైస్తే. తదర్థం చ న ఉపాసితాః మహత్తమా యైస్తే తథా. కించ అవ్రతాతప్తతపసః నవ్రతాని యేషాం. న తప్తాని తపాంసి యైస్తే చ తే చ తథా. సత్సంగాదితి. సద్భిః సంగో నామమయైవ సంగ ఇత్యభిప్రేత్యోక్తం. యద్వా. స్వసంగస్యాపి సత్సంగత్వం వివక్ష్యతే స్వస్యాపి సత్త్వాత్. యద్వా. మదీయానాం సంగాదిత్యర్థః. (7)

తా:- వారికి సత్సంగముకంటే వ్యతిరిక్తమయిన సాధనాంతరము అభావమును చెప్పుచున్నారు. పైన చెప్పిన వారిలోని వారు వేదముల నధ్యయనము చేసిన వారుకారు. దాని కొరకై పెద్దలను సేవించిన వారుకారు. ఏకాదశ్యుపవాసములు చేసిన వారుకాదు. కృచ్ఛ్రచాంద్రాయణాది తపములు చేసిన వారుకారు. అట్టివారైననూ వారు కేవలము సత్సంగము వలననే నన్ను పొందిరి. సత్సంగమనగా నాతో సంగమును అని అభిప్రాయముతో చెప్పబడినది. లేదా స్వసంగమునకు కూడా సత్సంగత్వము వివక్షింపబడును. తను కూడా సత్తు అయినందున, లేదా నా సంగము వలన యని అయిననూ చెప్ప వచ్చును. (7)

8. శ్లో॥ కేవలేన హి భావేన గోప్యో గావో నగా మృగాః ।
యేऽన్యే మూఢధియో నాగాస్సిద్ధా మామీయురంజసా ॥

టీ:- తత్ర వృత్రాదీనాం తు భవతు నామ కథంచిత్సాధనాంతరం. గోపీప్రభృతీనాం తు నాన్యదస్తీత్యాహ - కేవలేనేతి. సత్సంగలబ్ధేన కేవలేనైవ హి భావేన ప్రీత్యా. నగాః యమళార్జునాదయః. నాగాః కళీమాదయః యద్వా. తదానీంత న సర్వ తరు గుల్మాదీనామపి భగవతి భావోऽస్తీతి గమ్యతే. తదుక్తం భగవతైవ. శ్లో. "అహో అమీ దేవవరామరార్చితం పాదాంబుజం తే సుమనః ఫలార్హణం, నమంత్యుపాదాయ

తా:- పైన చెప్పబడిన వారిలో వృత్రుడు మొదలగు వారికి సాధనాంతరమేదయిన యున్నచో ఉండుగాక గోపికలు మొదలయిన వారికి మాత్రము అన్యమయిన సాధనమేదియు లేదనుచున్నారు. ముఖ్యముగా సత్సంగము వలన లభించిన ప్రీతిచే గోపికలు, గోవులు, యమళార్జునాది వృక్షములు, బృందావనమున వుండెడి పర్వత తరుగుల్మాదులకు సైతము భగవంతుని యందు భావముండెనని తోచుచున్నది. జాంబవదాదులు కాళీయుడు అన్యులగు మందమతులును కృతార్థులగుచు శీఘ్రముగా నన్ను పొందిరి. భగవంతుడే ఇట్లు చెప్పుచున్నారు.

శిఖాభిరాత్మనసత్తమోపహత్యై తరుజన్మ యత్కృత" మిత్యాదినా. సిద్ధాః కృతార్థాః సంతః ఈయుః ప్రాపుః. (8)

9.శ్లో॥ యం న యోగేన సాంఖ్యేన దాన వ్రతతపోఽధ్వరైః ।
వ్యాఖ్యాస్వాధ్యాసన్యాసైః ప్రాప్నుయాద్యత్నవానపి ॥

టీ:- స్వప్రాప్తే దుర్లభతామాహ- యమితి. యోగాదిభిః కృతప్రయత్నోఽపి యం న ప్రాప్నుయాత్. తం మామీయురితి పూర్వేణాన్వయః. తత్ర ప్రథమం యా గోప్యః పశ్వాదయో వా శ్రీకృష్ణేన సహ సంగతాస్తే సంతః సత్సంగోఽన్యేషాం సత్సంగః. తేన చ తేషాం భక్తిరితి జ్ఞాతవ్యం. (9)

శ్లో. ఆహో అమీ దేవవరామరార్చితం
పాదాంబుజం తే సుమనః ఫలార్హణమ్।
నమన్త్యుపాదాయ శిఖాభిరాత్మన
స్తమోపహత్యైతరు జన్మయత్కృతమ్ ॥

ఔరా! ఈ బృందావనమందలి తరులతాదులు తరు జన్మను పొందినవయ్యు వంచిన తమ చిట్ట చివరి కొమ్మలచే తమ అజ్ఞానము పోవుటకై దేవతలకు ఫలమీయ దగినవై పుష్పఫల సమర్చనమునకు యోగ్యమై దేవేంద్రుడు లోనగుసురులచే పూజింపబడినవైన నీ పాద పద్మములను నమస్కరించుచున్నవి.(8)

తా:- నన్ను పొందుట దుర్లభమని చెప్పుచున్నాడు. అట్టి నన్ను పొంద వలెనని ప్రయత్నపడినవాడైనను ధ్యానయోగముచేతగాని, జ్ఞానయోగము చేతగాని, దానములు వ్రతములు తపస్సులు యాగముల చేతగాని శాస్త్రవ్యాఖ్యానములచే, వేదాధ్యయనముచే సన్యాసముచేతనూ పొంద నేరడు. అనగా కేవలము సాధుసంగము చేతనే నన్ను పొందగలడని భావము.(9)

10.శ్లో॥ రామేణ సార్ధం మధురాం ప్రణీతే
శ్వాఫల్కినా మయ్యనురక్త చిత్తాః ।
విగాఢభావేన న మే వియోగ
తీవ్రాధయోऽన్యం దదృశుస్సుఖాయ ॥

టీ:- గోపీనాం భావం ప్రపంచయతి- చతుర్భిః. రామేణేతి. శ్వాఫల్గినా అక్రూరేణ. మయి ప్రణీతే సతి. మే మత్తోऽన్యం సుఖాయ న దదృశుః కుతః. వియోగేన తీవ్రో దుస్సహః ఆధిర్యాసాం తాః అత్ర హేతుః. మయి విగాఢేన భావేన ప్రేమ్ణా అనురక్తాని చిత్వాని యాసాంతాః. 10

తా:- గోపికల భావమును ప్రపంచించుచున్నారు. అక్రూరుడు బలరామునితో నన్ను మధురకు తీసుకొని పోయినంతనే నాయందను రక్తచిత్తలగు గోపికలు నా మీది గాఢమగు ప్రేమ కలవారగుటచే నా యెడబాటుచే తీవ్రమగు మనోవ్యధ గలవారై తమ సుఖమునకై యే ఇతరవస్తువునూ కానరైరి.(10)

11.శ్లో॥ తాస్తాః క్షపాః ప్రేష్ఠతమేవ నీతాః
మయైవ బృందావనగోచరేణ ।
క్షణార్ధవద్యాః పునరంగ తాసాం
హీనా మయా కల్పసమా బభూవుః ॥

టీ:- తీవ్రాధిత్వం ప్రపంచయతి - తా ఇతి. మయా యాయా ఏవ క్షపాః రాత్రయః క్షణార్ధవన్నీతాస్తాస్తా ఏవ పునర్మయా విహీనాస్తాసాం కల్పసమా బభూవుః. కథం భూతాస్తాస్తా వాచామగోచరా ఇత్యర్థః. (11)

తా:- తీవ్రమయిన మనోవ్యథను తెలియపరుస్తున్నారు. ఓ ఉద్ధవా! గోపికలు బృందావనమందు నాతో గూడి ఏ యే రాత్రులను అర క్షణముగా గడిపిరో ఆ రాత్రులే నేను లేకపోగా వారి కవి కల్పకాల సమయములయినవి. (వాక్కుల కగోచరములనియర్థము).(11)

12. శ్లో॥ తా నావిదన్ మయ్యనుషంగబద్ధ
ధియస్స్వమాత్మానమదస్తథేదం ।
యథా సమాధౌ మునయోऽబ్ధితోయే
నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే ॥

టీ:- కించ ఏవం తీవ్రాధయః తామోహమిషేణ సమాధిం ప్రాప్తా ఇత్యాహ - తా ఇతి. మయి అనుషంగేణ ఆసక్త్యాబద్ధా ధియో యాభిస్తాః స్వమాత్మానం స్వదేహం. అదః దూరస్థం. ఇదం సన్నిహితం. చ. నావిదన్. యద్వా స్వం పతిపుత్రాది. మమతాస్పదం. ఆత్మానం అహంకరాస్పదం. అదః పరలోకం ఇదం ఇమం లోకం చ. నావిదన్నితి. యథా మునయః సమాధౌ నామపూపే న విదుస్తద్వత్ కింతు అబ్ధితోయే నద్య ఇవ మయి ప్రవిష్టా ఇత్యన్వయః. (12)

తా:- ఈ ప్రకారమున తీవ్రమయిన మనోవ్యథగలవారు మోహ వ్యాజమున సమాధిని పొందిరని చెప్పుచున్నారు. నా యందలి ప్రేమచే కట్టుబడిన చిత్తము గల ఆ గోపికలు సమాధి యందు మునుల వలెను, సముద్రజలమందు ప్రవేశించిన నదుల వలెను తమను గాని, నావారను మమకారమున కాస్పదమయిన పతిపుత్రాదులను గాని, తమ అహంకారమున కాస్పదమయిన దేహమును గాని, దూరపు వస్తువులను గాని, పరలోకమునుగాని, దగ్గర వస్తువునుగాని, ఈ లోకమును గాని తమతమ రూపములను గాని యెఱుగరైరి.(12)

13. శ్లో॥ మత్కామా రమణం జారం మత్స్వరూపవిదోऽబలాః ।
బ్రహ్మామాపరమం ప్రాపుః సంగాచ్ఛతసహస్రశః ॥

టీ:- మత్కామా ఇతి. ఏవం తాః అబలాః కేవలం మత్కామాః. మత్స్వరూపావిదః మమ స్వరూపం తు న జానంతి. తథాపి. సత్సంగాత్ జారం బ్రహ్మ. జారబుద్ధివేద్యమపి బ్రహ్మస్వరూపమేవ మాం పరమం ప్రాపురిత్యర్థః. (13)

తా:- జారుడై ప్రియుడైన నన్ను కామించినవారై నా స్వరూపము నెరుగని వారైనను, అబలలైన గోపికలు జారుడను బుద్ధితో నూర్లవేల కొలది పరబ్రహ్మమగు నన్ను సత్సంగము వలన పొందిరి.(13)

14.శ్లో॥ తస్మాత్త్వముద్ధవోత్సృజ్య చోదనాం ప్రతిచోదనాం ।
ప్రవృత్తిం చ నివృత్తిం చ శ్రోతవ్యం శ్రుతమేవ చ ॥

టీ:- తస్మాదితి. యస్మాదేవంభూతో మద్భజనప్రభావః తస్మాత్. త్వం చోదనాం శ్రుతిం ప్రతిచోదనాంస్మృతిం చ యద్వా. విధిం నిషేధం చ ఉత్సృజ్య. (14)

తా:- ఓ ఉద్ధవా! నా భజన ప్రభావమిట్టిది కావున నీవు ధర్మ బోధకమగు శృతిని ఆ ధర్మమును విస్తరించి చెప్పు స్మృతిని లేక విధి నిషేధ కర్మలను, కర్మమార్గమును, జ్ఞానమార్గమును శ్రోతవ్యమగు ఆత్మతత్వమును శృతయైన తత్సాధనమైన యోగ విధానమును వీడినవాడవై.(14)

15.శ్లో॥ మామేకమేవ శరణం ఆత్మానం సర్వదేహినాం ।
యాహి సర్వాత్మభావేన మయా స్యాహ్యకుతో భయః ॥

టీ:- మామితి. మాం శరణం యాహి మయైవా కుతో భయస్స్యాః భవేః. (15)

తా:- ఎల్ల ప్రాణులకు ఆత్మయయిన నన్నొక్కనినే స్వరూప భావముతో శరణుపొందుము. నాతోడ గూడి దేని వలనను భయము లేని వాడవగుదువు.(15)

ఉద్ధవ ఉవాచ

16.శ్లో॥ సంశయశ్శృణ్వతో వాచం తవ యోగేశ్వరేశ్వరః ।
న నివర్తత ఆత్మస్థో యేన భ్రామ్యతి మే మనః ॥

టీ:- పూర్వం తావన్మయోదితేష్వవహితః స్వధర్మేష్విత్యాదినా కర్మ కర్తవ్యమిత్యుక్తం. ఇదానీం తు సర్వం త్యక్త్వా మాం శరణం

తా:- పూర్వమున "నాచే చెప్పబడిన వాని యందు జాగరూకుడవై స్వధర్మములందు వర్తింపుము. కర్మను విధిగా అనుభవించాలని చెప్పి ఇప్పుడు అంతా వదిలి నన్ను శరణుపొందుమని చెప్పబడినది. అసలు ఆత్మ కర్తృత్వాదికమున్నదా లేదా అని ఆత్మ విషయమై హృదయము నున్న సంశయము నివర్తించలేదు అని ప్రశ్నించుచున్నాడు. లేదా కర్మ

యాహీత్యుచ్యతే తత్ర కిమాత్మనః కర్త ృత్వాద్యస్తినాస్తివేతి ఆత్మస్థ ఆత్మవిషయః సంశయో న నివర్తతే. యద్వా. కర్మకార్యం త్యాజ్యం వేత్యాత్మస్థః హృదిస్థః సంశయో న నివర్తత ఇతి పృచ్ఛతి – సంశయ ఇతి. యేన సంశయేన ఉత్తరం స ఏష ఇత్యష్టభిః. అయం భావః – ఈశ్వరస్తావత్సమాయావశాత్ప్రపంచాత్మనా భాతి తత్ప్రపంచాధ్యాసాచ్చ జీవానా మనాద్యవిద్యయా కర్త ృత్వాది. తతో విదిప్రతిషేధాధికారః. తదానీం సత్వశుధ్యర్థం కర్మాణి కుర్విత్యుక్తం. సత్త్వేచ శుద్ధే పునః కర్మజాడ్య పరిహారాయ భక్తివిక్షేపకం కర్మాదరం పరిత్యజ్య దృఢవిశ్వాసేన భజేత్యుక్తం జాతాయాం తు విద్యాయాం న కించిత్కర్తవ్యమస్తీతి. (16)

**శ్రీకృష్ణ ఉవాచ**

17.శ్లో॥ స ఏష జీవో వివర ప్రసూతిః
ప్రాణేన ఘోషేణ గుహాం ప్రవిష్టః ।
మనోమయం సూక్ష్మముపేత్య రూపం
మాత్రా స్వరో వర్ణ ఇతి స్థవిష్టః ॥

టీ:– తత్రతావత్ ఈశ్వరాద్వాగాదీంద్రియద్వారా జీవసంసృతికారణ భూతం ప్రపంచోద్గమాహ – సార్ధైశ్చతుర్భిః. స ఇతి. స ఏషః అపరోక్షః జీవయతీతి. పరమేశ్వరః. అపరోక్షత్వే హేతుః. వివరాణి ఆధారాది

ఆచరించవలెనా? వదలవలెనా?అని హృదయ గతమయిన సంశయము నివృత్తియగుట లేదని యడుగుచున్నాడు.(16)

తా:– ఆ సంశయమునకుత్తరము "స ఏ ష" అని మొదలుకొని ఎనమిది శ్లోకములలో చెప్పబడుతున్నది. దీని భావమిది ఈశ్వరుడు తన మాయా వశము వలన ప్రపంచాత్మగా ప్రకాశించుచున్నాడు. ఆ ప్రపంచాధ్యాస వలన జీవులకు అనాద్య విద్య వలన కర్తృత్వాదికము అటు తరువాత విధి ప్రతి నిషేధాదికమేర్పడినది. అప్పుడు సత్వశుద్ధి కొరకు కర్మల నాచరించుమని చెప్పబడినది. ఈ సత్త్వము శుద్ధమయినచో మఱల కర్మ జాడ్య పరిహారమునకై భక్తి విక్షేపకమయిన (చలింప చేయునదైన) కర్మాదరమును పరిత్యజించి దృఢ విశ్వాసముతో నన్ను భజింపమని చెప్పబడినది. విద్యయనగా బ్రహ్మాజ్ఞానము అది కలుగగనే

చక్రాణి. శ్లో."ఆధారో మణిబంధశ్చ మణిపూరక ఏవచ, అనాహతో విశుద్ధ్యాజ్ఞాచక్రాణ్యేతాని షట్క్రమాత్." తేషు ప్రసూతిరివ ప్రసూతి రభివ్యక్తిః యస్య సః. తామేవాభివ్యక్తిమాహ – ఘోషేణేతి. ఘోషేణ పరాఖ్యేన నాదవతా ప్రాణేన సహ గుహాం ఆధారచక్రం ప్రవిష్టస్సన్ మనోమయం సూక్ష్మరూపం పశ్యంత్యాఖ్యం మధ్యమాఖ్యంచ మణిపూరక చక్రే విశుద్ధచక్రే చ ఉపేత్య ప్రాప్య. వక్త్రే మాత్రా హ్రస్వాదిః స్వర ఉదాత్తాదిః. వర్ణః అకారాదిరిత్యేవం వైఖర్యాఖ్యః స్థవిష్ఠః. అతిస్థూలః నానావేదశాఖాత్మకో భవతీతి. తథా చ. శ్రు."చత్వారివాక్పరిమితా పదాని తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః. గుహా త్రీణి నిహితా నేంగయంతి. తురీయం వానోమనుష్యావదంతీ"తి. అభియుక్తశ్లోకశ్చ. శ్లో."యాసా మిత్రావరుణ సదనాదుచ్చరంతీ త్రిషష్టిం వర్ణానంతః ప్రకటకరణైః ప్రాణసంగాత్ప్రసూతే, తాం పశ్యంతీం ప్రథమముదితాం మధ్యమాం బుద్ధిసంస్థాం వాచం వక్త్రే కరణవిశదాం వైఖరీం తాం ప్రపద్యే" ఇతి. (17)

కర్తవ్యమేమియు కొంచెమయిననూ లేదు. ఆ విషయమై ఇప్పుడు ఈశ్వరుని వలన వాగాదులోను ఇంద్రియముల ద్వారా జీవులకు సంసార కారణమైయున్న ప్రపంచోద్గమమును నాల్గున్నర శ్లోకముల ద్వారా చెప్పుచున్నారు.

ఆ ఈ అపరోక్షుడయిన జీవుడు సర్వమును జీవింప చేయు పరమేశ్వరుడు అపరోక్షత్వమందు హేతువును చెప్పుచున్నారు వివరములయిన మూలాధారాది చక్రములందు ప్రసవము వంటి ప్రసవము అనగా అభివ్యక్తిగలవాడై (మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహితము, విశుద్ధి (ద్ధ), ఆజ్ఞ అని క్రమముగా ఆఱు చక్రములు) ఆ అభివ్యక్తిని చెప్పుచున్నాడు. పరాఖ్యమను నాదము కలదైన ప్రాణముతో గూడ ఆధారచక్రమును ప్రవేశించిన వాడై మనోమయమై సూక్ష్మరూపమైన పశ్యంతి యను పేరు గల వాక్కును, మధ్యమ అను వాక్కును మణిపూరక చక్రమునందు విశుద్ధచక్రము నందు పొంది ముఖమునందు హ్రస్వాదికము ఉదాత్తాదిక్తము ఆకారాది వర్ణము ఈ ప్రకారమునై వైఖరియను పేరు గలవాడై స్థిరముగానున్నాడు. అతిస్థూలుడై నానా వేదశాఖా స్వరూపుడగుచున్నాడు. శృతి ఇట్లు చెప్పుచున్నది.

చత్వారి వాక్పరిమితా పదాని
తాని విదు బ్రాహ్మణా మనీషిణః ।
గుహాత్రీణి నిహితా నేంగయంతి
తురీయం వాచో మనుష్యావదంతి ॥

నాలుగు విధములగు వాక్కులచే ప్రకటమగు పదమును మనుషులగు బ్రాహ్మణులు తెలిసికొందురు. వీరిలో మూడు వాక్కులు హృదయ గుహయందు గూఢమైయున్నవి. అవి చలించవు. నాలుగవదయిన వైఖరీ వాక్కును మనుష్యులు వచింతురు.

(శాస్త్ర నిర్ణీతములయిన నాలుగు స్థానములు పరాపశ్యంతీ, మధ్యమా వైఖరీ అని, అద్దానిని అధ్యాత్మకుశలురు ఎఱుగుదురు. వాటిలో మొదటి మూడు శరీరమునందు ఆధారనాభి హృదయముల యందు ఉన్నవి. స్వరూపమును ప్రకాశింపచేయవు. వైఖరీ యనబడే తురీయము మనుష్యులు చెప్పుదురు. మనుష్యుల యొక్క వదనము నందు అర్థ బోధకమయిన శబ్దముండునని అర్థము.)

అభియుక్తుల శ్లోకము కూడా–

శ్లో. యాసామిత్రావరుణ సదనాదుచ్చరంతీ త్రిషష్టిం
వర్ణానంతః ప్రకట కరణైః ప్రాణమంగాత్ప్రసూతే ।
తాంపశ్యన్తీం ప్రథమముదితాం మధ్యమాం బుద్ధి సంస్థాం
వాచంవక్త్రే కరణ విశదాం వైఖరీంచప్రపద్యే ॥

శ్లోకార్థము – ఆ త్రివిధ భారతిని శరణుపొందుతున్నాను. ఆ భారతి ఎట్టిదనిన అగ్నీష్టోమస్థానము నుండి ఉద్భవించునది. మిత్రా వరుణుల ఆవాస స్థానము, పరమాత్మా, ఆ పరమాత్మ నుండి ఉద్భవించి అరువది మూడు వర్ణములను జనింపచేయును. అ ఇ ఉవర్ణోములు. హ్రస్వదీర్ఘప్లుత భేదముతో త్రివిధములయిన తొమ్మిది. ఋకారము ప్లుతహీనము రెండు విధములు ఇకారము రెండు విధములు దీర్ఘ హీనము సంధ్యక్షరములు హ్రస్వ హీనములు ఎనిమిది. ఈ విధముగా స్వరములు ఇరవయ్యొక్కటి. ఇరవయ్యయిదు స్పర్శలు కాదిమాంతములు యాదులు ఎనిమిది అంతస్థములు, ఊష్మములు . అనునాసికములు ఐదు, అనుస్వార, విసర్గములు, జిహ్వామూలీయ, ఉపధ్మానీయములు చేరి అరువది మూడు. వాయు సంగజములయిన ఈ వర్ణములను ప్రకటకరణములై బుద్ధికి చేరిన సమయాన ప్రత్యక్ష రూప ఇంద్రియము లచే లోనచూచును ఉచ్ఛరించడు. దానిని పశ్యన్తీ అని అందురు. అది మొదటి ఉత్పన్నమయినది. బుద్ధి సంస్థ అయిన దానిని ఉచ్ఛరింతును అను విచారముతోనూ కూడియున్న దానిని మధ్యమా యందురు నోటి యందు కరణముచే విశదమగు స్థాన ప్రయత్న నిర్మలమగు వైఖరిని (వాక్కును) శరణుపొందుచున్నాను.(17)

18.శ్లో॥ యథానలః ఖేऽనిలబంధురూష్మా
బలేన దారుణ్యధిమథ్యమానః ।
అణుః ప్రజాతో హవిషా సమిధ్యతే
తథైవ మే వ్యక్తిరయ హి వాణీ ॥

టీ:- అవ్యక్తస్య సతః సూక్ష్మ మధ్యమ క్రమేణాభివ్యక్తౌ దృష్టాంతః - యథేతి. యథాగ్నిః ఖే కాష్ఠచ్ఛిద్రే ఊష్మా అవ్యక్తోష్మరూపః. దారుణి అధికం మధ్యమానః అనిలసహాయస్సన్ అణుః సూక్ష్మవిస్ఫులింగాది రూపో భవతి. పునః ప్రకృష్టో జాతో హవిషా సంవర్ధతే తథైవేయం వేదలక్షణా వాణీ మమాభివ్యక్తిరితి. (18)

తా:- అవ్యక్తుడైన ఈశ్వరునికి సూక్ష్మ మధ్యమ చెప్పుచున్నారు. దారువు యొక్క సూక్ష్మ రంధ్రమునందు దాగి యున్న అగ్ని బలముచే దారువు నందధికము మథించగా తన సన్నని నిప్పురవ్వలతో గూడి సూక్ష్మరూపుడై యుదయించి తృణాదులచే వర్ధిల్లి హవిస్సుచే నెట్లు ప్రజ్వలించుచున్నదో అట్లే వేదవాణి నా వలన జనించుచున్నది నా అభివ్యక్తి యగు చున్నది.(18)

19.శ్లో॥ ఏవం గదిః కర్మగతి ర్విసర్గో ఘ్రాణో రసోదృక్స్పర్శః శ్రుతిశ్చ।
సంకల్పవిజ్ఞానమథాభిమానః సూత్రం రజస్సత్త్వతమోవికారః

టీ:- ఉక్తాం వాగ్వృత్తిముపసంహరన్నితరేంద్రియవృత్తిష్వతిదిశతి - ఏవమితి. ఏవం గదిః గదనం భాషణం మే వ్యక్తిరిత్యుపసంహారః. కర్మహస్తయోర్వృత్తిః. గతిః పాదయోః. విసర్గః పాయూపస్థయోరితి కర్మేంద్రియాణాం. ఘ్రాణోऽవఘ్రాణం. రసో రసం. దృగ్దర్శనం. స్పర్శః స్పర్శనం. శ్రుతిః శ్రవణమితి జ్ఞానేంద్రియాణాం. సంకల్పో మనసః

తా:- ఇప్పుడు చెప్పబడిన వాగ్వృత్తిని ఉపసంహరించుచు ఇతరేంద్రియ వృత్తులందు అతిదేశించుచున్నాడు. ఈ ప్రకారము సంభాషణ రూపమైన వాక్కు నా అభివ్యక్తి యని గ్రహించుట, ఇచ్చుట మొదలయిన హస్తముల వృత్తి, పాదముల వృత్తి యగు గమనము విసర్జించుట మలమూత్రము లను విసర్జించుట పాయూపస్థల (గుదశిశ్నముల) వృత్తి. ఇవి కర్మేంద్రియ వృత్తులు మధురాది రసములు రుచిచూచుట గంధాదులను వాసనచూచుట, దర్శనము, స్పర్శనము, వినుట, జ్ఞానేంద్రియ వృత్తులు; సంకల్పరూపమగు విశేషజ్ఞానము, మనోవృత్తి; అహంకారము

విజ్ఞానం బుద్ధిచిత్తయోః. అభిమానోహంకారస్య. సూత్రం ప్రధానస్య సత్త్వ రజస్తమసాం వికారోధిదేవతాదిస్త్రివిధః ప్రపంచః మే వ్యక్తిరితి పూర్వేణాన్వయః. (19)

ప్రధానము యొక్క వృత్తి సత్వరజస్తమస్సుల యొక్క వికారము ఈ ప్రకారము అధి దేవతాదిత్రివిధమగు ప్రపంచము నా అభివ్యక్తియని పూర్వ శ్లోకము అన్వయము.(19)

20.శ్లో॥ అయం హి జీవస్త్రివృదబ్జయోనిః
అవ్యక్త ఏకో వయసా స ఆద్యః ।
విశ్లిష్టశక్తి ర్బహుధేవ భాతి బీజాని
యోనిం ప్రతిపద్య యద్వత్ ॥

టీ:- తస్మాదీశ్వరాభివ్యక్తరూపః ప్రపంచోనేశ్వరాద్భిన్నోస్తీత్యాహ - అయమితి. అయం హి జీవః ఈశ్వరః ఆదావవ్యక్తః ఏక ఏవ వయసా కాలేన విశ్లిష్టావిభక్తా వాగాదీంద్రియరూపాశ్శక్తయో యస్య. యద్వా. విశేషేణశ్లిష్టా ఆలింగితా మాయా శక్తిర్యేన సః. బహుప్రకార ఇవాభాతి యః. స ఏవాద్యః. త్రివృత్ త్రిగుణాశ్రయః. అబ్జయోనిః లోకపద్మస్య కారణభూతః ఏకస్య బహుధా భానే దృష్టాంతః. యోనిం క్షేత్రం ప్రతిపద్య ప్రాప్య బీజాని యద్వదితి. (20)

తా:- అందుకని ఈశ్వరాది వ్యక్తి రూపము ప్రపంచము ఈశ్వరునికన్నా భిన్నముగా లేదు అని తెలుపుతున్నాడు. ఈ జీవుడు స్వర్వజీవాధారుడయిన ఈ పరమేశ్వరుడు మొదట అవ్యక్తుడు. ఒక్కడు ఆద్యుడయిన ఆ ఈశ్వరుడు కాలముచే విభక్తములయిన వాగాదీంద్రియ రూపములను శక్తులు గలవాడై లేక విశేషముగా ఆలింగనము చేయబడిన మాయా శక్తి గలవాడై త్రిగుణాశ్రయుడు లోకపద్మమునకు కారణమై బీజములు క్షేత్రమును పొంది, ఎట్లో, అట్లే అనేక విధములుగా ప్రకాశించుచున్నాడు. (ఒక్క బీజము క్షేత్రమును పొంది వివిధములగు శాఖా పత్రపుష్పఫల శోభితమై అనేక విధములుగా కన్పడునట్లు మొదట అవ్యక్తుడై, ఒక్కడైన సర్వజీవుల కాధారుడైన ఆద్యుడైన ఈ పరమేశ్వరుడు మాయా శక్తితో కూడిన వాడై మాయా గుణములకాశ్రయుడై జగమను పద్మమునకు కారణమై వాగాదీంద్రియముల ద్వారా అనేకవిధములుగా ప్రకాశించుచున్నాడు. (20)

21. శ్లో॥ యస్మిన్నిదం ప్రోతమశేషమోతం
పటో యథా తంతువితానసంస్థః ।
య ఏష సంసార తరుః పురాణః
కర్మాత్మకః పుష్పఫలే ప్రసూతే ॥

టీ:- తస్మాత్తన్మాయావిలసితత్వాత్తదాశ్రయమిదం జగన్న తతః పృథగితి. సదృష్టాంతమాహ - యస్మిన్నితి. తంతువితానే సంస్థా స్థితిర్యస్య సః పటో యథా. తథా. యస్మినిదం విశ్వం పీతం దీర్ఘతంతుషు పట ఇవ ప్రోతం తిర్యక్తంతుష్వివ. ఏవం భూతం సమష్టివ్యష్ట్యాత్మకం విశ్వం. అవిద్యయాత్మన్యధ్యస్తం వృక్షరూపం జీవస్య కర్తృత్వాది సంసారహేతుః అతస్తద్వివేకజ్ఞానేన కర్మాదిసర్వం పరిత్యాజ్యమిత్యుక్తమిత్యాశయేనాహ - య ఏష ఇతి సార్ధైస్త్రిభిః. పురాణః అనాదిః. కర్మాత్మకః ప్రవృత్తిః స్వభావః పుష్పఫలే భోగాపవర్గౌ. కర్మ తత్ఫలే వా. ప్రసూతే జనయతి. (21)

తా:- అందువలన ఆ పరమేశ్వరుని మాయా విలసితమగుట వలన తదాశ్రయమైన ఈ జగము ఆ పరమేశ్వరుని కంటే వేరుగాదని దృష్టాంత సహితముగా చెప్పుచున్నారు. తంతువుల సమూహమందున్న వస్త్రము వలె ఏ పరమేశ్వరుని యందు ఈ విశ్వము సమస్తము పడుగురూపమైన తంతువులందు నిడువుగా కూర్చబడినది పేకరూపమగు అడ్డముగా గూడిన తంతువుల వలె ఇట్టి సమష్టి వ్యష్ట్యా త్మకమైన విశ్వము అవిద్య ఆత్మయందు వృక్షరూపమున అధ్యస్తమైనది. జీవునకు కర్తృత్వాదికము సంసార హేతువు అందువలన ఆ కర్తృత్వాది వివేక జ్ఞానముచే కర్మాదికము సర్వము పరిత్యాజ్యమని చెప్పబడినదను ఆశయముచే చెప్పుచున్నారు. ఏ ఈ సంసార వృక్షము అనాది ప్రవృత్తి స్వభావము భోగోపవర్గములు కర్మఫలములు, జనింపచేయుచున్నది. (21)

22. శ్లో॥ ద్వేఽస్య బీజే శతమూలస్త్రినాళః
పంచస్కంధః పంచరస ప్రసూతిః ।
దశైకశాఖో ద్విసుపర్ణనీడః
త్రివల్కలో ద్విఫలోఽర్కప్రవిష్ట ః ॥

తా:- వృక్ష రూపకమును ప్రపంచించుచున్నాడు. ఈ సంసార వృక్షము నకు రెండైన పుణ్య పాపములు బీజములు నూఱు అపరిమితము లయిన వాసనలను వెళ్ళు కలది. మూడు గుణములు ప్రకాండములు చెట్టు మొదటి యందలి పెద్ద కొమ్మలు కలది. పంచభూతముల కొమ్మలు గలది. శబ్దాది పంచతన్మాత్రలను రసమును కనుట గలది. పదకొండు

టీ :-వృక్షరూపం ప్రపంచయతి - ద్వే ఇతి. ద్వే అస్య పుణ్యపాపే బీజే స చ శతమూలః శతపరిమితాః వాసనాః మూలాని యస్య సః. త్రయో గుణాః నాళాని ప్రకాండాః యస్య. పంచభూతాని స్కంధాః యస్య. పంచరసాః శబ్దాదివిషయాః తేషాం ప్రసూతిర్యస్మాత్. దశ చ ఏకా చ శాఖా ఇంద్రియాణి యస్య ద్వయోస్సుపర్ణయోర్జీవ పరమాత్మనోర్నీడం యస్మిన్ త్రీణి వల్కలాని త్వచో వాతపిత్తశ్లేష్మాణో యస్య. ద్వే సుఖ దుఃఖే ఫలే యస్య సః. అర్కం ప్రవిష్టః సూర్యమండలపర్యంతం వ్యాప్తః తన్నిర్భిద్య గతస్య సంసారాభావాత్. (22)

ఇంద్రియములు చిన్న కొమ్మలు గలది. పక్షితుల్యులగు జీవ పరమాత్మల గూడు గలది. వాత పిత్త శ్లేష్మములను మూడు వల్కలములు పట్టములు గలది. సుఖదుఃఖములను రెండు ఫలములు గలది. సూర్య మండలము పర్యంతము వ్యాపించునది (సూర్యమండలమును ఛేదించుకొని పోయిన వానికి సంసారము లేనందు వలన అట్లు చెప్పబడినది.) (22)

23. శ్లో॥ అదంతి చైకం ఫలమస్య గృధ్రాః
గ్రామేచరా ఏకమరణ్యవాసాః ।
హంసా య ఏకం బహురూపమిజ్యైః
మాయామయం వేద స వేద వేదమ్ ॥

టీ:- తత్ఫలభోక్తౄనాహ - అదంతీతి. గృధ్నంతీతి గృధ్రాః కామినః. గ్రామేచరాః గృహస్థాః అస్య వృక్షస్యైకం ఫలం దుఃఖమదంతి విపరిణామతః స్వర్గాదేరపి దుఃఖస్వరూపత్వాత్, హంసా వివేకినోఽరణ్య వాసాః సన్న్యాసినః ఏకం ఫలం సుఖమదంతి ఏకం పరమాత్మానాం మాయామయం ఏవం బహురూపం ఇజ్యైం పూజ్యైః గురుభిః కృత్వా యో వేద సః వేదం తత్త్వార్థం వేద. (23)

తా:- ఆ వృక్షఫల భోక్తలను చెప్పుచున్నారు. కాముకులు, గృహస్థులు ఈ సంసార వృక్షము యొక్క దుఃఖరూపమయిన ఒక ఫలమును (విపరిణామము వలన స్వర్గము సైతము దుఃఖస్వరూపమే యగును) భక్షించుచున్నారు. వివేకవంతులు సన్యాసులు సుఖరూపమయిన ఒక్క ఫలమును భక్షించుచున్నారు. ఒక్క పరమాత్మను మాయా స్వరూపుడై అనేక రూపములు గలవానిని ఎవడు ఈ ప్రకారము పూజ్యులయిన గురువులతో భజించి ఎఱుగుచున్నాడో వాడు తత్త్వార్థమును తెలుసుకొను చున్నారు.(23)

24. శ్లో॥ ఏవం గురూపాసనయైకభక్త్యా
విద్యాకుఠారేణ ధీరః వివృశ్చ్య ।
జీవాశయమప్రమత్తః సంపద్య
చాత్మానమథత్యజాస్త్రమ్ ॥

టీ:- త్వం చైవం జ్ఞాత్వా కృతకృత్యస్సన్ సర్వసాధనం త్యజేత్యాహ - ఏవమితి. ఏకాంతభక్త్యా శితేన తీక్ష్ణేన జ్ఞానకుఠారేణ స్వతంత్రతా వా. ద్వయోః జ్ఞానభక్త్యోః జీవోపాధిం త్రిగుణాత్మకం లింగశరీరం వివృశ్చ్య ఛిత్వా పరమాత్మానం సంపద్య ప్రాప్య. అథ అస్త్రం సాధనం త్యజేత్. (24)

తా:- నీవుగూడ ఈ ప్రకారము తెలిసికొని కృతకృత్యుడవగుచూ సాధనములన్నింటినీ త్యజింపుమని చెప్పుచున్నారు. ఈ ప్రకారము గురువులను సేవించుటచే లభించినదైన ఏకాంత భక్తియను వాడియైన గొడ్డలిచేత (జ్ఞానకుఠారము చేత) ధీరుడు (పండితుడు) జాగరూకుడై జీవమునకుపాధియైన లింగశరీరమును ఛేదించి పరమాత్మను పొంది ఆ తరువాత సాధనమయిన జ్ఞానమును త్యజించును. (24)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**ద్వాదశోऽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**ద్వాదశాధ్యాయము సమాప్తము.**

## త్రయోదశోஉధ్యాయః

### శ్రీకృష్ణఉవాచ

1. శ్లో. సత్త్వం రజస్తమ ఇతి గుణా బుద్ధేర్న చాత్మనః ।
సత్త్వేనాన్యతమౌ హన్యాత్ సత్త్వం సత్త్వేన చైవ హి ॥

త్రయోదశేஉథ సత్త్వస్య వృద్ధ్యా విద్యోదయక్రమః, హంసేతి హాసతశ్చిత్తవిశ్లేష వర్ణనమ్. విద్యాకుఠారేణ జీవాశయం సంవివృశ్చ్య సాధనంత్యజేత్యుక్తం. నను తత్ర తమ ఆది గుణత్రయ వృత్తిప్రతిబంధే సతి కథం విద్యోత్పత్తిరిత్యాశంక్య తన్నివృత్త్యా విద్యోత్పత్తి ప్రకారమాహ–సప్తభిః. సత్త్వమితి. తత్ర యద్యానందాదివదాత్మధర్మా గుణాః స్యుఃతర్హి తత్స్వరూపత్వాత్ తేషాం నివృత్తిర్నస్యాత్ నత్వేతదస్తీత్యాహ. బుద్ధేః ప్రకృతేరేవైతే గుణానత్వాత్మన ఇతి. అతః సత్త్వేన సత్త్వ వృత్త్యా అన్యతమౌ హన్యాత్ రజస్తమోవృత్తీ జయేదిత్యర్థః. సత్త్వం చ సత్వదమాది సృతి రూపముపశమాత్మకేన సత్త్వేనైవ హన్యాత్. (1)

## త్రయోదశాధ్యాయము

తా:– సత్త్వము రజస్సు తమస్సులను ఈ మూడు గుణములు ప్రకృతి వేయగును ఆత్మగుణముల కావు సత్వగుణముచే అన్యములైన రజస్తమస్సులను అనువాని వృత్తులను జయించవలెను. సత్వదమాది రూపమును ఉపశమాతకమైన సత్వముచే జయించవలెను. (1)

త్రయోదశాధ్యాయము యందు సత్త్వగుణవృద్ధిచే జ్ఞానము దయించు క్రమము, హంసేతి హాసము వలన చిత్తగుణము నెడబాయుటను వర్ణింపబడింది. జ్ఞానకుఠారముచే జీవోపాధిని, లింగశరీరమును ఛేదించి, సాధనమును త్యజింపుమని చెప్పబడినది. (ఓయీ! జీవోపాధిని ఛేదించి అని చెప్పబడినది. అందు తపస్సు మొదలయిన గుణత్రయవృత్తి ప్రతిబంధముగా వున్నప్పుడు విద్యోత్పత్తి ఎట్లు కలుగును? అని ఆశంకించి ఆ ప్రతిబంధనివృత్తి ద్వారా విద్యోత్పత్తి కలుగు విధమును ఏడుశ్లోకములచే చెప్పుచున్నారు. అందు ఆనందాది గుణములవలే సత్యాది గుణముల మూడు ఆత్మధర్మము లగునేని అప్పుడవి పరమాత్మ స్వరూపములగుట వలన)వాని నివృత్తిగలుగదు అనిన ఇది ఈప్రకారము కాదని చెప్పుచున్నారు. సత్త్వము రజస్సు తమస్సులను ఈ మూడు గుణములు ప్రకృతి వేయగును ఆత్మగుణముల కావు సత్వగుణముచే అన్యములైన రజస్తమస్సులనువాని వృత్తులను జయించవలెను. సత్వదమాదిరూపమును ఉపశమాత్మకమైన సత్వముచే జయించవలెను. (1)

2 శ్లో॥ సత్త్వాద్ధర్మో భవేచ్ఛుద్ధాత్ పుంసో మద్భక్తిలక్షణః ।
సాత్త్వికోపాసయా సత్త్వం తతో ధర్మః ప్రవర్తతే ॥

టీ:- నను గుణత్రయవృత్తీనాం పరస్పరోపమర్దనరూపత్వాత్కథం సత్త్వవృత్త్యైవ ఇతర వృత్తయో నియమేన హంతవ్యాస్తత్రాహ- సత్త్వాదితి. మద్భక్తిం లక్షయతి. యో ధర్మః సః మద్భక్తిరూప ఏవ వా. సత్త్వ మేవ కథం వర్ధతే? తత్రాహ- సాత్త్వికానాం పదార్థానాం ఉపాసయా సేవయా సత్త్వం వృద్ధం భవతీత్యర్థః. (2)

తా:- గుణత్రయ వృత్తులు పరస్పరము సమర్థన రూపములగుట వలన సత్త్వ గుణములచే ఇతర గుణవృత్తులు ఎట్లు తప్పక జయింపదిగిన వగుననగా చెప్పుచున్నారు. రజస్తమస్సులు కలువని శుద్ధసత్త్వము వలన పురుషునికి నాయందలి భక్తిరూపమయిన ధర్మము కలుగును. సాత్త్విక మగు పదార్థముల సేవనము వలన సత్త్వము వృద్ధి యగును ఆ సత్త్వమువలన ధర్మము ప్రవర్తించున్నది.(2)

3 శ్లో॥ ధర్మో రజస్తమో హన్యాత్ సత్త్వవృద్ధిరనుత్తమః ।
అనునశ్యతి తన్మూలో హ్యధర్మ ఉభయే హతే ॥

టీ:- ధర్మఇతి. స చ ధర్మో రజస్తమశ్చ హన్యాత్ కుతః. న విద్యతే ఉత్తమో యస్మాత్సః. సర్వోత్తమ ఇత్యర్థః. యతః సత్త్వవృద్ధిః యస్మాత్కారణాత్సః అత ఏవ తత్కార్యో ధర్మ ప్రతిబంధో నాస్తీత్యాహ - తస్మిన్నుభయస్మిన్ హతే తన్మూలః తే రజస్తమసీ రాగద్వేషాదినా ప్రమాదాలస్యాదినా చ మూలం యస్య సః. (3)

తా:- సత్త్వగుణము యొక్క వృద్ధిగలదియు, సర్వోత్తమమునగు నా భక్తి రూపమగు ధర్మము రజస్తమస్సులను నశింపజేయును. ఆ రజస్తమస్సులు రెండునూ హతమైనంతనే ఆ రజస్తమస్సులు కారణము గాగల రాగద్వేశాదులు, ప్రమాదాలస్యములు మూలముగాగల అధర్మము వెనువెంటనే నశించుచున్నది. (3)

4 శ్లో॥ ఆగమోపః ప్రజా దేశః కాలః కర్మ చ జన్మ చ ।
ధ్యానం మంత్రోఽథ సంస్కారో దశైతే గుణహేతవ ॥

టీ:- సాత్త్వికోపాసనయా సత్త్వం వర్ధత ఇత్యుక్తం. తానేవ సత్త్వవృద్ధి హేతూన్ దర్శయితుం సామాన్యతో గుణత్రయవృద్ధి హేతూనాహ - ఆగమ ఇతి. ఆగమః శాస్త్రం. అపః ఆపః. క్వచిదాగమోఽర్థ ఇతి వా పాఠః. (4)

తా: సాత్త్వికోపాసనచే సత్త్వము వర్ధిల్లునని చెప్పబడెను ఆ సత్త్వవృద్ధికి. హేతువులయిన వాటిని తెలుపుటకు సామాన్యముగా గుణత్రయ వృద్ధి హేతువులను చెప్పుచున్నారు. ఆగమము అనగా శాస్త్రము; జలము; (పాఠభేదముననుసరించి.) ప్రజ - సత్పుత్రుడు; దేశము - కృష్ణమృగ సంచారము; కాలము- వసన్తాది; కర్మ- వర్ణాశ్రమాదివిహితము; జన్మ- ఉభయకాల విశుద్ధము; ధ్యానము - దేవతాదివిషయకము; మంత్రము- గాయత్ర్యాది; సంస్కారము - గర్భాదానాది; ఈ పది త్రిగుణోత్పత్తి హేతువులు.(4)

5 శ్లో॥ తత్తత్సాత్త్వికమేవైషాం యద్యద్వృద్ధాః ప్రచక్షతే ।
నిందంతి తామసం తత్తద్రాజసం తదుపేక్షితమ్ ॥

టీ:- ఏషు సాత్త్వికాది నిర్ణయమాహ - తదితి. ఏషామేవ. మధ్యే వృద్ధాః ప్రచక్షతే ప్రశంసంతి యద్యన్నిందంతి తత్తత్. యత్తు వృద్ధైరుపేక్షితం న స్తుతం న చ నిందితం తద్రాజసం. (5)

తా:- వీనియందు సాత్త్వికాదుల నిర్ణయమును చెప్పుచున్నాడు. వీని లోపల దేనిని పెద్దలు ప్రశంసింతురో అది సాత్త్విక హేతువేయగును. దేనిని నిందింతురో అది తామసమగును. ఏది ప్రశంసింపబడదో అది రాజసమగును.(5)

6 శ్లో॥ సాత్త్వికాన్యేవ సేవేత పుమాన్ సత్త్వవివృద్ధయే ।
తతోధర్మస్తతో జ్ఞానం యావత్స్మృతిరపోహనం ॥

తా:- పురుషుడు సత్వగుణవృత్తి యొక్క వృద్ధికొరకు సాత్త్వికములైన శాస్త్రముల సేవించవలయును. అనగా నివృత్తి శాస్త్రములనే (జ్ఞాన ప్రదములు) సేవించవలెను. ప్రవృత్తి పరములను పాషండ శాస్త్రములను సేవింపరాదు. పుణ్యతీర్థజలములనే సేవించవలెను. గంధోదకము,

టీ:- సాత్త్వికానీతి. సాత్త్వికాన్యేవేతి నివృత్తిశాస్త్రాణ్యేవ సేవేత నప్రవృత్తి పాషండశాస్త్రాణి తీర్థాపఏవ న గంధోదకసుర్యాద్యాః ప్రజాః నివృత్తావ జనావ . న ప్రవృత్త దురాచారావ వివిక్త దేశం నరథ్యాతదేశావకాలం బ్రాహ్మీముహూర్తాదికం ధ్యానాదౌ. న ప్రదోషనిశీథాదీవ. కర్మ చ నిత్యం న కామ్యాభిచారాదీని. జన్మ చ వైష్ణవశైవదీక్షాదిలక్షణం. న శాక్త క్షుద్రదీక్షారూపం ధ్యానం శ్రీవిష్ణోః. న తు కామినీవిద్విషాం. మంత్రం ప్రణవాదికం. నకామ్యక్షుద్రాదీవ సంస్కారం ఆత్మనస్సంవోధనం న తు కేవలం దేహ గృహాదీనాం. నను జ్ఞానం మహావాక్యశ్రవణాదేవోత్పద్యతే. ఇం తత్ర సత్త్వ వృద్ధ్యా ధర్మేణ వా? అత ఆహ- యావత్మ్స్రృతిః ఆత్మా పరోక్షం యావచ్చ దేఫద్వయ తత్కారణభూతగుణాపోహః, తావత్పర్యంతం జ్ఞానం భవతీత్యర్థః. (6)

సుర మొదలగు వానిని సేవింపరాదు. అట్లే నివృత్తి పరులగు జ్ఞానులను సేవించవలెను. ప్రవృత్తి పరులగు దురాచారులను సేవించరాదు. నిర్జనప్రదేశమను సేవించునది. రాజవీధులను, జూదమాడు ప్రదేశములను ప్రవేశింపరాదు. బ్రాహ్మీముహూర్తమును మొదలయిన కాలమును ధ్యానాది విషయకమై సేవించవలెను. ప్రదోషమును అర్ధరాత్రమును సేవింపకూడదు. నిత్యకర్మలను ఆచరిం చాలి కామ్యములను. ఆభిచారాదులను అనుష్ఠింపరాదు. వైష్ణవ శైవ దీక్షా లక్షణము అయిన జన్మనుపొందవలెను. శాక్తక్షుద్ర దీక్షా రూపమగు దానిని పొందవలెను శ్రీవిష్ణు ధ్యానమును గ్రహించవలెను. కామినిని, శత్రువులను ధ్యానింపకూడదు. ప్రణవాదికమగు మంత్ర మును జపించాలి. కామ్య, క్షుద్రాది మంత్రములను జపించకూడదు. తన చిత్త సంశోధనము గావింపవలెను. కేవలము దేహ, గృహములను శోధింపకూడదు. అయ్యా ! మహావాక్య శ్రవణముద్వారానే ఆత్మజ్ఞాన ముద్భవించును గదా. మరి దానికి సత్త్వవృద్ధితో గాని ధర్మముతో గాని ఏమి ప్రయోజనము అన్నచో ఎంతవరకు ఆత్మాపరోక్షము కలుగునో ఎప్పటికి స్థూలసూక్ష్మ దేహములకు కారణభూతమయిన రజస్తమస్సుల గుణవృత్తుల పోకడ కలుగునో అప్పటికి జ్ఞానము కలుగు చున్నది. అందువలన పైన పేర్కొన్న వానిని తప్పక సేవించవలె నని భావము. (6)

7 శ్లో వేణుసంఘర్షజోవహ్నిర్దగ్ధ్వా శామ్యతి తద్వనమ్ ।
ఏవంగుణవ్యత్యయజో దేహః శామ్యతి తత్క్రియః॥

టీ:- నను గుణవ్యతికరాజ్జాతో దేహః కథం స్వాశ్రయభూతాన్ గుణాన్ స్వత ఏవోత్పన్నయా విద్యయా- పోహ్య స్వయముప్యుపరమేత్? తత్రాహ -వేణ్వితి. వేణూనాం సంఘర్షాజ్జాతోఽగ్నిర్యథా స్వత ఏవ ఉత్పన్నాభిర్జ్వాలాభిస్తద్వనం సర్వం దగ్ధ్వా స్వయం శామ్యతి ఏవం దేహోఽపి. తత్క్రియః. తస్యాగ్నేరివ క్రియావ్యాపారో యస్య సః. (7)

తా:- ఓయీ! గుణముల వ్యతిరేకము వలన (హెచ్చుతగ్గుల) జనించిన దేహము స్వాశ్రయ భూతములయిన గుణములను స్వయముగనే ఉత్పన్నమైన విద్యలేక జ్ఞానముచే ఎట్లు పోగొట్టి తాను సయితము ఉపశమిల్లుననగా అందుకు చెప్పుచున్నారు. వెదురుచెట్ల రాపిడివలన జనించిన అగ్ని ఏప్రకారము స్వయముగా ఉత్పన్న ములైన జ్వాలలచేత ఆవనమును దహించి శమించునో ఈ విధమముగా గుణముల హెచ్చు తగ్గుల వలన జనించిన దేహము. ఆ అగ్నివలె క్రియా వ్యాపారము అనగా జ్ఞానవ్యాపారము గలదై జ్ఞానమును కలిగించి తానును శమించుచున్నది. (7)

**ఉద్ధవ ఉవాచ**

8. శ్లో విదంతిమర్త్యాః ప్రాయేణ విషయాన్ పదమాపదామ్ ।
తథాపి భుంజతే కృష్ణ తత్కథం శ్వఖరాజవత్ ॥

టీ:- నను నియతేంద్రియతయా సాత్త్వికసేవాయామియానస్తి పురుషార్థః. తథాపి రాజసాదీన్ విషయాన్ దుఃఖమితి జానంతోఽపి కథం సేవంత ఇతి పృచ్ఛతి విదంతీతి. పదం స్థానం. శ్వానో యథా భర్త్స్యమానా అపి శునీమనుధావంతి ఖరా యథా పద్భ్యాం తాడ్యమానా అపి ఖరీమనుధావంతి అజా యథా నిర్లజ్జా హంతుమానీతా అపి తద్వత్. (8)

తా:- అయ్యా! నియతేంద్రియులై సాత్వికసేవ చేయుటలో ఇంత మాత్రము పురుషార్థము కలదే, మరి అటులయిననూ రాజసాదులగు విషయసుఖములను, దుఃఖమని తెలిసికొనుచున్నవారయ్యు మర్త్యులు వానినెట్లు సేవించుచున్నారని ప్రశ్నించుచున్నారు. ఓ కృష్ణా మానవులు సహజముగా ఇంద్రియ సుఖములన్నీ ఆపదల స్థానమని తెలిసిన వారే అగుదురు. అట్లెరిగిన వారయ్యూ కుక్కలెట్లు ఆడుకుక్కలచే బెదిరింప బడినవయ్యూ ఆ ఆడ కుక్కను వెంబడించుచున్నవో గాడిదలెట్లు ఆడు గాడిద కాలి తన్నులు తగిలినవగుచూ, ఆడగాడిదను పైకొనుచున్నావో. మేకపోతులెట్లు వధింప కొనిపోబడుచున్ననూ, సిగ్గులేనివై ఆడుమేకను

**శ్రీభగవానువాచ**

9 శ్లో॥ అహమిత్యన్యథాబుద్ధిః ప్రమత్తస్య యథాహృది ।
ఉత్సర్పతి రజో ఘోరం తతోవైకారికం మనః ॥

టీ:- మిథ్యాభినివేశేన భుంజత ఇతి సహేతుకమాహ- త్రిభిః. అహమితి. ప్రమత్తస్య వివేకశూన్యస్య. దేహాదౌ అహమితి మిథ్యాబుద్ధిః హృది యథావదుపసర్పతి. తతోఽహం బుద్ధేశ్చ వైకారికం సత్త్వ ప్రధానమపి మనః ప్రతిఘోరం దుఃఖాత్మకం రజః ఉత్సర్పతి. మనోవ్యాప్నోతీత్యర్థః. (9)

10. శ్లో॥ రజోయుక్తస్య మనసః సంకల్పః సవికల్పకః ।
తతః కామోగుణధ్యానాద్దుస్సహః స్యాది దుర్మతేః ॥

టీ:- తతః రజ ఇతి. ఇదమేవం భోగ్యమితి సవికల్పకః సంకల్పస్స్యాత్. తతశ్చ అహో రూపమహో భావ ఇతి గుణధ్యానాద్దుర్ధరః కామస్స్యాత్. (10)

పైకొన గమనించుచున్నవో అట్లే విషయసుఖము వలన శ్రమ కలుగు చున్ననూ వానినే ఎట్లనుభవించుచున్నారు. (8)

తా:- మిథ్యాభినివేశముచే అనుభవించుచున్నారు అని సహేతుకముగా మూడుశ్లోకములుచే చెప్పుచున్నారు. వివేకశూన్యుడయిన వానికి దేహాదికము నందు నేనను మిథ్యాబుద్ధి (అసత్యమగు నిశ్చయము) ఆ అహం బుద్ధి వలన సత్త్వప్రధానమైననూ, మనస్సును దుఃఖాత్మకమైన రజోగుణవృత్తి వ్యాపించుచున్నది.(9)

తా:- రజోగుణవృత్తితో కూడిన మనస్సునందు, స్త్రీ విత్తాదికము నాకు భోగ్యవస్తువను వికల్పరూపమగు సంకల్పము కలుగును. దానివలన ఆహా స్త్రీ ఎంత చక్కనిది దీని ప్రేమ ఎంతటిది, అని దాని గుణములను ధ్యానించుట వలన దుష్టబుద్ధి కలవానికి భరింపరాని కామము కలుగును. (10)

11.శ్లో॥ కరోతి కామవశగః కర్మాణ్యవిజితేంద్రియః ।
దుఃఖోధర్మాణి సంపశ్యన్ రజోవేగ విమోహితః ॥

టీ:- కరోతీతి. తతో విషయాన్ భోక్తుం కర్మాణి కరోతి.(11)

తా:- కామములకు లోనైనవాడు ఇంద్రియములను గెలువనివాడై రజోగుణవృత్తి వేగముచేత మోహమును పొంది ఉత్తరకాలమున ఇవి దుఃఖమును కలిగించునని తెలిసియు అట్టి కాముక కర్మలు చేయుచున్నాడు. (11)

12శ్లో॥ రజోస్తమోభ్యాం యదపి విద్వాన్విక్షిప్తధీః పునః ।
అతంద్రితో మనో యుంజన్దోష దృష్టిర్నసజ్జతే ॥

టీ:- ఏవం చేన్నకస్యాపి దుఃఖ నివృత్తిస్స్యాదిత్యాశంక్యాహ రజస్తమోభ్యామితి. యద్యపి రజస్తమోభ్యాం విక్షిప్తధీః మూఢధీశ్చ తథాపి విద్వాన్ వివేకి పునర్మనో నిరుంధన్న సజ్జతే. (12)

తా:- ఇట్లైనచో ఎవ్వనికినీ దుఃఖ నివృత్తి కలుగదని ఆశంకించి చెప్పుచున్నారు. రజస్తమస్సులచే ఆవరింపబడి మూఢమైన చిత్తముకల వాడైనప్పటికిని మరల వివేకవంతుడు సోమరితనములేనివాడై స్త్రీ మొదలయిన వానిని దోషపుచూపుచే, మనస్సును అరికట్టుచూ ఆ భోగ్య వస్తువులందు ఆసక్తుడు కాదు. (12)

13శ్లో॥ అప్రమత్తో౽ను యుంజీత మనోమయ్యర్పయన్ శనైః
అన్విర్విణ్ణో యథా కాలం జితశ్వాసో జితాసనః ॥

టీ:- విషయదోషదృష్ట్యాపి మనోనిరోధాశక్తౌ సుఖేన తన్నిరోధోపాయమాహ అప్రమత్త ఇతి. అనిర్విణ్ణః అనలసః.యథా కాలం త్రిషవణం. మయి పరమానందరూ పే. అర్పయన్ సమాదధ్యాత్. (13)

తా:- విషయముల యందు దోషదర్శనము చేసినప్పటికినీ మనస్సు నిరోధించుట అశక్యమన్నవారిని ఉద్దేశించి సుఖముగా తన్నిరోధోపాయమును చెప్పుచున్నారు. (13)

14శ్లో॥ ఏతావాన్యోగ ఆదిష్టో మచ్ఛిష్యైః సనకాదిభిః ।
సర్వతో మన ఆకృష్య మయ్యద్ధావేశ్యతేయథా ॥

టీ:- విషయైస్సంగ్రంథి తస్య మనసస్తద్వియోగే నేశ్వరనిష్ఠత్వమ సంభావితం మన్యమానం ప్రతి తన్నిరూపణాయేతిహాసముసముపక్షిపతి ఏతావానితి. యథా యథావన్మయ్యావేశ్యత ఇత్యేతావానిత్యర్థః.(14)

తా:- విషయసుఖములలో కూడుకొనియున్న మనస్సుకు వాటిని విడగొట్టుటచే ఈశ్వరుని యందు నిష్ఠతో మనస్సమాధానముకావించుట సాధ్యము కాదను వానిని గూర్చి ఆ ఈశ్వరనిష్ఠను నిరూపించుట కొరకు ఇతిహాసమును తెలుపుచున్నాడు. జ్ఞానమార్గ ప్రవర్తకులగు నా శిష్యులు సనక సనందనాదులు అన్ని విషయసుఖముల నుండి మస్సును ఏ ప్రకారమాకర్షించి నాయందు సమాధానము చేయవలెనో, అట్టి ధ్యాన యోగమును గూర్చివారు నన్నడుగగా పూర్వము నేను ఆ యోగమును చక్కగా చెప్పినాను. (14)

**ఉద్ధవ ఉవాచ**

15శ్లో॥ యదా త్వం సనకాదిభ్యో యేన రూపేణ కేశవ ।
యోగమాదిష్టవాన్ ఏతద్రూప మిచ్ఛామి వేదితుమ్ ॥

టీ:- మచ్ఛిష్యైరిత్యుక్తే తేషామతిజ్యాయసామనేన రూపేణ నిరూపణా సంభవాత్పృచ్ఛతి. యదేతి.తం కాలం తదేతద్రూపం చ వేదితుమిచ్ఛామి తత్కథయేతి. (15)

తా:- నా శిష్యులచేనని చెప్పుటచే వయస్సున చాలా పెద్దలయిన వారికి ఈ విధమయిన యోగనిరూపణము అసంభవమగుట వలన ప్రశ్నించుచున్నాడు. ఓ కృష్ణా! నీవెప్పుడు ఏ రూపమున సనకాదులకు నీ ధ్యానయోగమును ఉపదేశించితివో ఆ రూపమును తెలియ గోరు చున్నాము. (15)

**శ్రీభగవానువాచ**

16శ్లో॥ పుత్రా హిరణ్య గర్భ మానసాః సనకాదయః ।
పప్రచ్ఛుః పితరం సూక్ష్మాం యోగస్యైకాన్తికీం గతిమ్ ॥

టీ:- పుత్రా ఇతి. మానసాః పుత్రః సూక్ష్మాం సుదుర్జ్ఞేయం ఐకాంతికీం గతిం పరాంకాష్ఠామ్. (16)

తా:- బ్రహ్మదేవుని మానసపుత్రులైన సనకాదులు తండ్రిని చేరి ఒకనాడు నా ధ్యానయోగము యొక్క సూక్ష్మమైన ఏకాంతగతియైన పరాకాష్ఠను గూర్చి అనన్యమైన గతిని గూర్చి అడిగిరి. (16)

సనకాదయ ఊచు

17శ్లో॥ గుణేష్వా విశతేచేతో గుణాశ్చేతసి చ ప్రభో ।
కథమన్యోన్య సంత్యాగో ముముక్షోరతి తితీర్షోః ॥

టీ:- తదేవాహ- గుణేష్వితి. గుణేషు యేషు విషయేషు స్వభావతో రాగాదివశాచ్చేతః ప్రవిశతి. తే చానుభూతా విషయాః వాసనారూపేణ చేతసి ప్రవిశంతి. అతితితీర్షోః విషయానతి క్రమితుమిచ్ఛోః.(17)

తా:- ఓ ప్రభూ! చిత్తము విషయరూపములయిన గుణములందు అనురాగవశమున చొరబడుచున్నవి. ఆ విషయములు కూడా వాసనా రూపమగు చిత్తము నందు ప్రవేశించుచున్నవి వాని పరస్పర దూరీకరణము ఎట్లో చెప్పుము. (17)

శ్రీభగవానువాచ

18శ్లో॥ ఏవం పృష్టో మహాదేవః స్వయంభూర్భూతభావనః ।
ధ్యాయమానః ప్రశ్నబీజం నాభ్యపద్యత కర్మధీః ॥

టీ:- ఏవమితి. మహాదేవోఽపి. స్వయంభూరపి భూతానాం స్రష్టాపి ధ్యాయమానః విచారన్నపి ప్రశ్నబీజం. యదజ్ఞానాదయం ప్రశ్నస్తన్నావిందత్. యతః కర్మవిక్షిప్తధీః. (18)

తా:- ఈ విధమయిన ప్రశ్నను విని మహాదేవుడు, స్వయముగా అవతరించిన బ్రహ్మ, ప్రాణుల సృష్టికర్తయయ్యును చాలాసేపు చింతించి ఆ ప్రశ్నకు తగిన ప్రత్యుత్తరమును సృష్టి క్రియ యందు విక్షిప్తమైన చిత్తము కలవాడైనందున ఎరుంగని వాడయ్యెను. (18)

19.శ్లో॥ సమామచింత యద్దేవః ప్రశ్న పారతితీర్షయా ।
తస్యాహం హంసరూపేణ సకాశమగమం తదా ॥

తా:- ఆ బ్రహ్మ ప్రశ్నకుత్తరము దాటగోరి, అభిప్రాయము తెలిసికొను కోరికచే దేవుడనగు నన్ను చింతించెను. నేను హంసరూపముతో క్షీర నీరములు వేరచేయ సమర్థమయినది హంసయే కనుక విషయ చిత్తములను తెల్పుటకు అప్పుడు అతని సమీపమునకు వెళ్ళితిని.(19)

20శ్లో॥ దృష్ట్వామాంత ఉపవ్రజ్య కృత్వా పాదాభివందనం ।
బ్రహ్మాణమగ్రతః కృత్వా పప్రచ్ఛుః కోభవానితి ॥

టీ:- సఇతి. ప్రశ్నస్య పారముత్తరమభిప్రాయో వా తస్య తితీర్షయా జిజ్ఞాసయా హంసరూపేణేతి యథా హంసో నీరం క్షీరం చ పృథక్కర్తుం శక్తః ఏవమహం గుణాంశ్చేతశ్చేతి ద్యోతయితుం హంసరూపేణ ఆగతో ఽస్మీతి. (19,20)

తా:- సనకాదులు నన్ను చూచి సమీపించి, పాదాభివందనము చేసి ఆ బ్రహ్మను ముందిడుకొని నీ వెవడవని ప్రశ్నించిరి.(20)

21శ్లో॥ ఇత్యహం మునిభిః పృష్టస్తత్వజిజ్ఞాసుభిస్తదా ।
యదవోచమహం తేభ్యస్తదుద్ధవ నిభోధ మే ॥

టీ:- ఇతీతి.ఇత్యహం మునిభిః పృష్ట ఇతి పృథగ్వాక్యం యదవోచమితి పృథక్ అతోఽస్మచ్ఛబ్దావృత్తిరదోషః తేభ్యోయదవోచం తన్మే వచనం నిబోధ. (21)

తా:- ఈ విధముగా తత్త్వము తెలియగోరిన సనకాదులచే అప్పుడు ప్రశ్నింపబడిన వాడనై నేను వారలకు ఏమి చెప్పితినో ఓ ఉద్ధవా ! దానిని నావలన తెలిసికొనుము. "ఇత్యహం మునిభిః పృష్టం" అను వాక్యము వేరు. యదవోచమనునదివేరు. అందులకు అస్మచ్ఛబ్దావృత్తి దోషము కాదు.(21)

22 శ్లో॥ వస్తునో యద్య నానాత్వం ఆత్మనః ప్రశ్న ఈదృశః ।
కథం ఘటేత వో విప్రా వక్తుర్వామేక ఆశ్రయః ॥

టీ:- దేహాదివివిక్తాత్మజ్ఞానే సతి తన్నిష్ఠస్య రాగాద్యసంభవాత్స్వయమేవ

తా:- ఓ విప్రులారా! మీరు నీవెవడవని నన్ను అడిగిన ప్రశ్న ఆత్మను గూర్చినదా లేక ఆత్మకుపాధిభూతమయిన ఈ దేహధారులగు భూత సంఘమును గూర్చియా. ఆత్మను గూర్చినదైనచో ఆత్మపరమార్థ వస్తువు దానికి నానాత్వము లేదు. అట్లుగుచో మీ ప్రశ్నయు అనేక విషయము

విషయచేతసోర్విశేషో భవతీతి శక్తుం ప్రశ్న ఖండనమిష్టేనైవ తావదాత్మా నాత్మవివేకమాహ– త్రిభిః. వస్తున ఇతి. కిమాత్మనోఽయం ప్రశ్నః తదుపాధేర్భూతసంఘస్య వా. యద్యాత్మనస్తర్హి తస్య వస్తునః పరమార్థ రూపస్య నానాత్వే సతి. హే విప్రాః వః యుష్మాభిః కృతః ప్రశ్నః ఈదృశః బహుషు నిర్ధారణరూపః కథం ఘటేత. వక్తురుత్తరం దాతుర్వా మే మమ క అశ్రయః అవిశేషే ఆత్మని కం జాతిగుణాదివి శేషమాశ్రిత్యో త్తరం వక్ష్యామీత్యార్థః. (22)

లందు నిర్ధారణ రూపమును అయ్యుండి అట్టి ప్రశ్న ఒక్కదానికెట్లు ఘటించును. మీకుత్తరము నేను దేని నాశ్రయించి, నిర్వేశేషమయిన ఆత్మయందు ఏ జాతి గుణ విశేషముల నాశ్రయించి ప్రత్యుత్తరమీయ గలను. (22)

23శ్లో॥ పంచాత్మ కేషు భూతేషు సమానేషు చ వస్తుతః ।
కోభవానితి వః ప్రశ్నః వాచారంభో హ్యనర్థకః ॥

టీ:– పంచాత్తకేష్వితి. భూతసంఘవిషయత్వేఽపి అయం వః ప్రశ్నః వాచారంభః వాఙ్మాత్రేణారబ్ధః యతోఽనర్థకః కుతః భూతేషు దేవమనుష్యాది దేహేషు పంచభూతాత్మనేషు అతః సమానేషు అభిన్నేషు పునశ్చ వస్తుతః పరమకారణాత్మనా అభిన్నేషు. శ్రు."వాచారంభణం వికారో నామధేయం మృతికేత్యేవ సత్యమి"తి శ్రుతేః. (23)

తా:– పంచభూతముల మిశ్రమములై వర్ధిల్లు ఈ దేవమనుష్యాదుల దేహములన్నియు భూతాదులను బట్టి సమానములు అభిన్నములు. అట్లే పరమాత్మను బట్టి చూచినను అన్నింట పరమాత్మ ఒక్కడే అయ్యు న్నందున అన్నియూ పరమాత్మ కారణముకాగలవి కనుక అట్లు చూచిననూ అభిన్నములు ఏ విధముగ చూచిననూ నీవెవడవను ప్రశ్న కేవలము వాక్కుచే గోచరించు నామము గలదై అనర్థకమగుచున్నది. (కావున భూతసంఘ విషయమునకు మీ ప్రశ్నసరిగాదని భావము) "వాచరంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యమ్" మృద్వికార మగు ఘటశరా వాదికము యొక్క నామధేయము కేవలము వాగ్వ్య వహార గోచరము అనును గాని మృత్తికయే సద్వస్తువగును.(23)

24శ్లో॥ మనసా వచసా దృష్ట్యా గృహ్యతేన్యైరపీంద్రియైః ।
అహమేవ నమత్తోఽన్యదితి బుధ్ధ్వ ధ్ధ్వమంజసా ॥

టీ:- తత్ర పంచాత్మకత్వం ప్రత్యక్షాది సిద్ధమేవేతి పరమకారణాభేదమేవోపపాయతి మనసేతి. న ఆదిభిర్యద్యద్గృహ్యతే తత్తదహమేవేత్యర్థః. అంజనా తత్త్వవిచారేణ. ఏతేనైవ సర్వాత్మకోఽహమిత్యంజసా ప్యుత్తర ముక్తం భవతి.(24)

తా:- అందు భూతములు పంచ భూతాత్మకములనుట ప్రత్యక్షాది సిద్ధమేయైయున్నది. అని పరమకారణాభేదమునుపపాదించుచున్నారు. మనస్సుచే, వాక్కుచే, చక్షురాదీంద్రియములచే ఇతరములగు ఇంద్రియముల చేతను మనచే ఏదేది గ్రహింపబడుచున్నదో అదియది నేనే నా కంటే ఇతర మేదియు లేదని తత్త్వవిచారము చేసి తెలిసికొనుము ఇట్లనుటచే నేను సర్వాత్మకుడనని తత్త్వరూపమగు ఉత్తరము చెప్పినట్లుగుచున్నది (24)

25శ్లో॥ గుణేష్వా విశతే చేతో గుణాశ్చేతసి చ ప్రజాః ।
జీవస్య దేహ ఉభయం గుణాశ్చేతోమదాత్మనః ॥

టీ:- ఏవం ప్రశ్న ఖండనమిషేణైవాత్మస్వరూపం సామాన్యతో నిరూప్య బ్రహ్మణోఽతిదుష్పరిహరం యత్పృష్టం తత్రోత్తరమాహ యావదధ్యాయ సమాప్తిః. గుణేష్వితి. అయమభిప్రాయః యది కర్తృత్వ భోక్తృత్వాత్వాదిరూపతయా విషయైస్సంగ్రథితం చిత్తం బుద్ధ్యాది శబ్దవాచ్యమేవ జీవస్య స్వరూపం భవేత్ తతస్తద్వియోగో న ఘటేత తస్య తు స్వరూపం బ్రహ్మైవ చిత్తాధ్యానేన తు తస్వభావతయా విషయైస్సంగ్రథనం అతః స్వస్య బ్రహ్మ్వభావనయా విషయాణాం చ మిథ్యాత్వానుసంధానేన సర్వంతో నిర్విద్య భగవంతం భజతో భవత్యేవ పరిపూర్ణ స్వరూపావస్థా

తా:- ఈ ప్రకారము ప్రశ్నను ఖండించు నెపమున ఆత్మస్వరూపమును సామాన్యముగ నిరూపించి పరిహహరింపశక్యము గాని బ్రహ్మను గూర్చి ప్రశ్నించిన దానికి ఉత్తరమును చెప్పుచున్నారు. అధ్యాయ సమాప్తి పర్యన్తము. ఓ పుత్రులారా! చిత్తము గుణములందు ప్రవేశించుచున్నది గుణములు చిత్తమునందు ప్రవేశించుచున్నవి. గుణములు, చిత్తము ఈ రెండునూ నాస్వరూపమయిన బ్రహ్మస్వరూపమయిన జీవునికి దేహము అద్వస్తమైన ఉపాధియగును స్వరూపము గాదు. ఇది ఈ శ్లోకాభిప్రాయము కర్తృత్యభోక్తృతాదిరూపమున విషయములతో సమకూడిన చిత్తము బుద్ధ్యాదివాచ్యమై జీవుని స్వరూపమగునేని దాని వియోగము ఘటిల్లదు. దాని స్వరూపము నేను బ్రహ్మనే, జీవుని స్వరూపమన్నను బ్రహ్మకు చిత్తాధ్యాసము చేతను దాని స్వభావముకల్గుట చేతను

నమితి. హే ప్రజాః పుత్రకాః. సత్త్వాదిగుణేషు చేతః. ఆవిశతి. గుణాశ్చేతసి. ఏవం. గుణాశ్చేతశ్చోభయం సంగ్రథితం మదాత్మనో బ్రహ్మస్వరూపస్య జీవస్య దేహః అధ్యస్త ఉపాధిః. న తు స్వరూపం.(25)

26శ్లో॥ గుణేషు చావి శచ్చిత్తమభీక్ష్ణం గుణసేవయా ।
గుణాశ్చచిత్త ప్రభవా మద్రూప ఉభయంత్సజేత్ ॥

టీ:- తస్మాత్ గుణేష్వితి అభీక్ష్ణం పునః పునః గుణసేవయా తత్సంస్కారేణ గుణేష్వావిశచ్చిత్తం తే చ. పునర్వాసనా రూపేణ చిత్తే ప్రకర్షేణ భవంతీతి తథా. తే గుణాశ్చేతశ్చ. ఏవ యదుభయం తత్ మద్రూపస్సన్ త్యజేత్ . (26)

27శ్లో॥ జాగ్రతస్వప్నః సుషుప్తం చ గుణాతో బుద్ధివృత్తయః ।
తాసాం విలక్షణోజీవః సాక్షిత్వేన వినిశ్చితః ॥

టీ:- నను జాగ్రదాద్యవస్థావతః కుతః కుటస్థరూపతా తత్రాహ జాగ్రత్. జాగరః స్వప్నః సుషుప్తిశ్చేతి బుద్ధేరేతా వృత్తయః తాశ్చ న

విషయములతో జీవుడు సమకూడుట సంభవించును. అందువలన స్వస్వరూపమగు బ్రహ్మమును భావన చేయుట చేతను విషయ ములు మిథ్యలని అనుసంధానముకావించుట చేతను అన్నిటియందు నిర్వేదము పొంది భగవంతుని భజించు వానికి పరిపూర్ణ స్వరూపావస్థానము కలుగుచున్నది. (25)

తా:- పదే పదే సత్యాదిగుణముల సేవనచే చిత్తమువాని సంస్కారముచే గుణములందు ప్రవేశించుచున్నది ఆ సత్త్వాది గుణములు వాసనా రూపములని చిత్తమునందు అధికముగా ఉనికి కాంచు చున్నవి. కావున సాధకుడు బ్రహ్మస్వరూపమయిన నా రూపమునుపొంది ఆ రెండింటిని త్యజించవలెను. (26)

తా:- అయ్యా! జాగ్రత్స్వప్నాద్యవస్థలుగల జీవునికి కూటస్థ స్వరూపము కలుగుట ఎట్లనగా దానికి చెప్పుచున్నారు. జాగ్రత్స్వప్న సుషుప్తియను నవి మూడును బుద్ధి యొక్క వృత్తులై యున్నవి. అవి జీవునకు స్వాభావికములు గావు. “సత్త్వాజ్జాగరణం విద్యేద్రజసా స్వప్నమాదిశేత్. ప్రస్వాపం తమసా జంతోస్తురీయం త్రిషు సంతతం” ఈ ప్రాణికి సత్వగుణము వలన జాగ్రదవస్థ కలుగునని చెప్పవలెను

స్వాభావికాః కింతు. శ్లో. "సత్త్వా జ్జాగరణం విద్యాద్రజసా స్వప్న మాదిశేత్, ప్రస్వాపం తమసా జంతో స్తురీయం త్రిషు సంతతమి"తి వక్ష్యమాణ క్రమేణ గుణత ఏవ జీవస్తు విలక్షణః తదవస్థా రహిత ఏవ వినిశ్చితః కుతః తాసాం సాక్షిత్వేన. (27)

రజోగుణముచేత స్వప్నము కలుగునని చెప్పవలెనుతమో గుణము చేత సుషుప్తికల్గును ఈ మూడవ స్థలయందును తురీయమును సంతత మున్నట్లు తెలియవలెను ఈ చెప్పబోవు క్రమమును బట్టి సత్వాది గుణముల వలననే ఆ అవస్థారహితుడనియే వినిశ్చితము, ఎందువలన? జీవుడన్ననో ఆ మూడవస్థలకు వేరై సాక్షిగా వుండునని నిశ్చయింపబ డినది. (27)

28శ్లో॥ యర్హి సంసృతి బంధోఽయమాత్మనో గుణవృత్తిదః ।
మయి తుర్యే స్థితో జహ్యాత్త్యాగస్తద్గుణ చేతసామ్ ॥

టీ:- నను తర్హి కథమహం జాగర్మీత్యాది. ప్రతీతిస్తత్రాహ- యర్హీతి. యర్హి యస్మాత్ సమ్యక్ సృతిః సరణమనయేతి సంసృతిః బుద్ధిః తయా బంధోఽయం ఆత్మనో గుణవృత్తీర్దదాతి. తస్మాన్మయి తుర్యే. స్థితసన్ ఇమం సంసృతి బంధం జహ్యాత్. తత్తదా గుణచేతసాం గుణానాం చేతసశ్చాన్యోన్యం త్యాగో భవతి. (28)

తా:- అయ్యా!అట్లయినచో నేను మేల్కొనియున్నానను ప్రతీతి ఎట్లన చెప్పుచున్నాడు.ఏది ఈ సంసారమును జరుపుచున్నదో అది సంసృతి, అనగా బుద్ధి (చక్కగా దీనిచే జరుగునది కనుక సంసృతి అనగా బుద్ధి) దీనితో బంధము జీవునికి గుణవృత్తులనిచ్చుచున్నది. ఆ బుద్ధివలన జీవుడు తాను అవస్థాత్రయమునకతీతుడు తురీయడనయిన నా యందు ఉనికిని కాంచి ఆ బంధమును వీడుచున్నాడు. అప్పుడు గుణములకు చిత్తమునకు పరస్పర త్యాగము కలుగుచున్నది. (28)

29శ్లో॥ అహంకార కృతం బంధం ఆత్మనోర్థ విపర్యయం ।
విద్వాన్నిర్విద్య సంసార చింతాం తుర్యే స్థితస్త్యజేత్ ॥

తా:- సంసృతిలో బంధమెట్లు ఎట్లు దానిని వీడనగునన చెప్పు చున్నాడు. అహంకారముచే నేర్పడిన సంసార బంధము తనకు ఆనందా దికము నావరించి అనర్థము తెచ్చిపెట్టుననియు ఈ బంధము దుఃఖ

టీ:- కథం చ తజ్జహ్యాత్తదాహ అహంకారేతి. అహంకారేణ కృతం బంధం ఆత్మనః అర్థవిపర్యయం ఆనందాద్యావరణేన అనర్థహేతుం విద్వాన్ జానన్ సన్ నిర్విద్య దుఃఖమేతదితి జ్ఞాత్వా తుర్యేస్థితో భూత్వా. సంసారో బుద్ధిః తస్మిన్ చింతాం అభిమానం తత్కృతాం భోగ చింతాం చ త్యజేత్. (29)

రూపమని తెలిసినవాడై విద్వాంసుడు తురీయస్వరూపడగుచు సంసార బుద్ధి యందలి అభిమానము. దానిచేనగు భోగాసక్తిని వీడవలెను.(29)

30శ్లో॥ యావన్నానార్థధీః పుంసో న నివర్తేత యుక్తిభిః ।
జాగర్త్యపి స్వపన్నజ్ఞః స్వప్నే జాగరణం యథా ॥

టీ:- యావదేవం న త్యజేత్తావత్తస్య కర్మజ్ఞానాది సర్వం వ్యర్థమిత్యాహ యావదితి. యద్యపి జాగర్తే కర్మాదిషు తథాపి స్వపాన్ పశ్చన్నివ భవతి. యతః అజ్ఞః అసమ్యగ్దర్శీ. అజ్ఞ జాగరస్య స్వప్నత్వే దృష్టాంతః స్వప్న ఇతి. (30)

తా:- ఎంత వరకు ఈ భోగచింతను వీడడో అంత వరకు ఈతని కర్మ, జ్ఞానములు వ్యర్థమనుచున్నారు. ఎంత వరకు పురుషునికి వివిధ విషయములయందు ఆసక్తి, శాస్త్రప్రమాణములచే నివర్తించదో స్వప్నావస్థ యందు జాగరణస్థితివలె జాగ్రద్దశయందు అనగా కర్మాదుల యందు సమ్యగ్ధర్శికానివాడు కలలు గాంచుచుండును. (30)

31శ్లో॥ అసత్త్వాదాత్మనోఽన్యేషాం భావానాం తత్కృతోభిదా ।
గతయో హేతవశ్చాస్య మృషా స్వప్నదృశో యథా ॥

టీ:- నను కథం వేదప్రమిత వర్ణాశ్రమకర్మాది నానాధీర్నివర్తేత? తత్రాహ అసత్త్వాదితి. భావానాం దేహాదీనాం. తత్కృతా భిదా వర్ణాశ్రమాదిరూపా. గతయః స్వర్గాదిఫలాని. హేతవః కర్మాణి చ అస్యాత్మనో మృషా. అవిద్యావద్విషయో వేద ఇతి భావః. (31)

తా:- ఓయీ ! వేదప్రమాణ బద్ధమైన వర్ణాశ్రమకర్మాదుల యందు వివిధ బుద్ధులను ఎట్లు నివర్తింపనగును అనగా చెప్పుచున్నారు. జీవునికి తన కంటే ఇతరములైన దేహాదుల యొక్క, ఆ దేహాదులచే నేర్పడిన వర్ణాశ్రమాది భేద రూపము స్వర్గాది ఫలమును వానికి హేతువు లయిన యాగాది కర్మలును సత్త్వములుకానివగుట వలన ఈ ఆత్మకు, కలనుగాంచు వానికివలె మిథ్యయగును వేదము ఏ అవిద్యా వంతునికి విషయమైనదని భావము. (31)

32శ్లో॥ యో జాగరే బహిరనుక్షణ ధర్మిణోర్థాన్
భుంక్తే సమస్తకరణైర్హృది తత్సదృక్షాన్ ।
స్వప్నే సుషుప్త ఉపసంహరతే స ఏకః
స్మృత్యన్వయా త్రిగుణ వృత్తి దృగింద్రియేశః ॥

టీ:- యుక్తిభిరిత్యుక్తం తా ఏవ యుక్తీరాహ- య ఇతి. అర్థాన్ స్థూల దేహాదీన్ సమస్తకరణైః చక్షురాదిభిః భుఙ్క్తే కథం భూతాన్ అనుక్షణ ధర్మిణః క్షణిక బాల్యతారుణ్యాది ధర్మవతాః యశ్చ స్వప్నే హృది జాగ దృష్ట సదృశాన్ వాసనామయాన్ భుఙ్క్తే యశ్చ సుషుప్తే తావ సర్వాన్ ఉపసంహరతి. స ఏకః కుతః త్రిగుణవృత్తి దృక్ అవస్థాత్రయ ద్రష్టా. నను జాగ్రదవస్థాం సర్వేంద్రియాణి పశ్యంతి స్వప్నం మనః సుషుప్తం తత్సంస్కార విశేషా బుద్ధి కథమాత్మాతద్ద్రష్టా? తత్రాహ- ఇంద్రియేశః నను ఇంద్రియేశా అపి విశ్వ తైజస ప్రాజ్ఞాభిన్నాః న కుతః స్మృత్యా ప్రతిసంధానేన సర్వావస్థాస్వన్వయాత్ యః స్వప్నా సద్రాక్షం యశ్చ తదనం తరం న కించిదవేదిషం స ఏవ ఏవ తర్హి జాగర్మీతి ఉపాధి భేదేన విశ్వాదివ్యవహార ఇతి భావః. ఏతేన బాల్యయువాద్యవస్థాత్వపి ప్రతిసంధానేన ఆత్మైక్యం ద్రష్టవ్యం.(32)

తా:- యుక్తులతోయని లోగడ చెప్పబడినది. ఆ యుక్తులనే ఇప్పుడు చెప్పుచున్నారు. ఎవడు జాగ్రదవస్థయందు బాహ్యములై కనబడే ప్రతిక్షణము మారుచుండు క్షణికములైన బాల్యయౌవనాది ధర్మములు కల స్థూలదేహాదులను చక్షురాదులగు సర్వేంద్రియముల చేత అనుభ వించుచున్నాడో, ఎవడు స్వప్న దశయందు హృదయ మందు జాగ్రద్దశ యందు చూచిన వానితో సమానమయిన వానిని వాసనామయములను అనుభవించుచున్నాడో. తరువాత ఎవడు సుషుప్తి యందు వానిన న్నింటిని ఉప సంహరించుచున్నాడో అతడొక్కడే. ఏలయన త్రిగుణ వృత్తిదృక్ - అవస్థాత్రయ ద్రష్టయు. ఓయీ! జాగ్రదవస్థను సర్వేంద్రియ ములు చూచును, స్వప్నమున మనస్సుచూచును, సుషుప్తిని తత్సంస్కార విశేషమగుబుద్ధిచూచును. కాబట్టి ఆత్మ ఎట్లు ద్రష్టయగును అనగా, ఇంద్రియేశ-ఇంద్రియనియామకుడై యున్నాడు. ఓయీ! ఇంద్రియేశు లయిననూ విశ్వ తైజస ప్రాజ్ఞులు భిన్నులగు వారుకదా యనిన కారు. ఏలయన స్మృత్యన్వయాత్ - స్మరణశక్తిచే. అన్ని అవస్థలయందును అన్వయిం చుట వలన ఏ నేను స్వప్నములు చూచితినో. ఏ నేను తరువాత సుషుప్తి యందు ఏకొంచమైనను ఎరుగకుంటిని. ఆ నేనే ఇప్పుడు మేల్కొనుచున్నాను,అని ఉపాధి భేదమందే విశ్వాది వ్యవహారము అని భావము. దానిచే బాల్యయువాద్యవస్థలందును ప్రతిసంధానముచే ఆత్మైక్యము ద్రష్టవ్యమగును. ఎవడు జాగ్రదాద్యవస్థయందు బాహ్యములై

33శ్లో॥ ఏవం విమృశ్య గుణ తోమనసస్త్ర్యవస్థా
మన్మాయయా మయికృతాఇతి నిశ్చితార్థాః ।
సంఛిద్య హార్దమను మానసదుక్తి తీక్ష్ణ
జ్ఞానాసినా భజత మాఖిల సంశయాధిమ్ ॥

టీ:- తతః కిమత ఆహ ఏవమితి. గుణతో యా ఏతామనసః త్ర్యవస్థాస్తాః. మదవిద్యయా మయి కృతాః న తత్త్వతస్సంతీతి నిశ్చిత ఆత్మారూపః ఆర్థో యైస్తే యూయం. అఖిలసంశయానామాధిం అధీయంతే అస్మిన్నితి ఆధిరహంకారస్తం సంఛిద్యహార్దం హృదిస్థితం మాం భజత. కేన ఛిత్వా? తదాహ అనూమానైస్సదుక్తిభిః సతాముపదేశైః శ్రుతిభిశ్చ తిక్ష్ణేన జ్ఞానఖడ్గేన. (33)

తోచుచు అనుక్షణము మారుచుండు బాల్యయౌవనాది ధర్మములు స్థూలదేహాదులను అనుభవించుచున్నాడో ఎవడు స్వప్నము నందు జాగ్రదవస్థ యందు చూచిన స్థూలదేహాదులకు సాటియైన వానిని వాసనామయములైన వాని కాంచుచూ అనుభవించుచున్నాడో ఎవడు సుషుప్తి యందు ఈ అన్నింటిని ఉపసంహారించుచున్నాడో అతడు ఒక్కడే యగును. అనగా ముగ్గురూ ఒక్కరే అగుదురని భావము. 32

తా:- అందువలన ఏమి యేర్పడినదనగా చెప్పుచున్నారు. సత్వాది గుణములనుబట్టి మనస్సునకేర్పడు జాగ్రదాది మూడవస్థలును నా అవిద్యచేత నాయందు కల్పింపబడినది. ఇవి వాస్తవముగా లేవని తద్వారా ఆత్మ స్వరూపమును నిశ్చయించుకొన్నవారై మీరు అన్ని సంశయములకు అధిష్ఠానమైన హృదయమందున్న అహంకారమును ఊహాపోహలకు ఆస్పదమగు అనుమానాది ప్రమాణముల చేత సాధుపురుషులుపదేశించిన శృతి వాక్యముల చేతను. తీక్ష్ణమయిన జ్ఞానమను ఖడ్గముచే ఖండించి నన్ను భజింపుము. (33)

34శ్లో॥ ఈక్షేత విభ్రమమిదం మనసోవిలాసం
దృష్టం వినష్ఠమాతిలోలమలాత చక్రమ్ ।
విజ్ఞానమేకమురుదైవ విభాతి మాయా
స్వప్న స్త్రిధా గుణ విసర్గ కృతో వికల్పః ॥

టీ:- అనుమానాని దర్శయతి ఈక్షేతేతి. ఇదం జగత్ విభ్రమ మీక్షేత. అత్ర హేతవః. మనోవిజృంభితత్వాత్ దృష్టత్వాత్ వినాశిత్వాచ్చ స్వప్నవత్ అతి చంచలత్వాచ్చ అలాతచక్రవత్. నను భ్రమోఽపి నిర్విషయః కథంస్యాత్తత్రాహ విజ్ఞానమితి. నిగమనం తస్మాత్త్రిధాయోఽయం గుణపరిణామ కృతో వికల్పో భేదః సస్వప్నస్స్వపన్మృషాసామాయేతి. 34

తా:- అనుమానాదులను చూపెట్టుచున్నాడు. ఇదం జగత్ (పక్షము), విభ్రమమక్షేత్ర (సాధ్యం), 1.మనో విజృంభితత్వాత్ (హేతువు), 2. దృష్టత్వాత్ 3.వనాశిత్వాత్. 1.స్వప్నవత్ (దృష్టాంతం) 2.అలాతచక్రవత్ పరార్థానుమానమున పంచావయవవాక్యముంటుంది. జగద్విభ్రమ మీక్షతే 1.ప్రతిజ్ఞా. 2.దృష్టత్వాత్ హేతుః, యద్య ద్దృష్టత్వాద్య వచ్ఛిన్నం తత్తద్భ్రమ మాత్రం, యథా స్వప్నాది. 3.ఇత్యుదా హరణం, యదా భ్రమత్వవ్యాప్యదృష్టత్వాదిమాన్ స్వప్నాదిః తథా చేదం జగత్ అని 4. ఉపనయం, అందులకని గుణపరిణామ కృతమయిన వికల్పము ఏదికలదో అది మాయ మిథ్యా అని సాధ్యోపసంహార క్షణము. 5. నిగమనము, మనస్సు యొక్క సంకల్పవికల్పములకు అనేక లీలలుగా కల్పించుట వలనను చక్షురాదులగు ఇంద్రియములకుస్పష్టముగా గోచరించుచున్నందునను స్వప్నమువలె నశించి పోవుచుండుట చేతను, చాలా చాంచల్యము కలదగుట వలనను, గిరగిరా త్రిప్పెడి కొరివి వలనే నేర్పడు చక్రమువలె ఈ జగము భ్రాంతి రూపమగును. అనుభవైకవేద్యమగు బ్రహ్మ మొక్కటే మూడు విధములుగా త్రిగుణముల సృష్టిచే కల్పింపబడిన భేదముగలదై అనేక విధములుగా ప్రకాశించు చున్నది. ఈ భేదమంతయూ స్వప్నమువలె మాయా లేక మిథ్య యగును. (34)

35శ్లో॥ దృష్టిం తతః ప్రతి నివర్త్య నివృత్తతృష్ణః
తూష్ణీం భవేన్నిజ సుఖానుభవో నిరీహః ।
సందృశ్యతే క్వచియదీదయ వస్తు బుద్ధ్యా
భ్రమాయ నభవేత్స్మృతిరానిపాతాత్ ॥

టీ:- తస్మాత్ దృష్టిమితి. తతః దృశ్యాత్ దృష్టిం ప్రతినివర్త్య నిజ సుఖానుభవో భవేత్. తన్నైశ్చల్యార్థం చ నివృత్త తృష్ణః తూష్ణీం నిరీహశ్చ భవేత్. మనోవాక్కాయవ్యాపార రహిత ఇత్యర్థః. నను దేహవతః సర్వదా ద్వైతదృష్టి ప్రతినివర్తనాయోగాత్పునః సంసారస్స్యాదేవ తత్రాహ - సందృశ్యత ఇతి. క్వచిదావశ్యకాహారాదిషు యద్యపీదం సందృశ్యతే తథాపి పూర్ణమవస్తుబుద్ధ్యా యత్త్యక్తం తత్పునర్మోహాయ న భవదేవ కిం తు దేహపాతపర్యంతం స్మృతిః సంసారమాత్రేణావభాసో భవేదిత్యర్థః (35)

తా:- తన దృష్టిని ఈ దృశ్యప్రపంచము నుండి మరలించి మనో నిశ్చలత కొరకు తొలగించుకొన్న విషయాభిలాష కలవాడై ఆత్మసుఖా నుభవము కలవాడై నిష్క్రియుడు, మనోవాక్కాయ కర్మ రహితుడు కావలెనని అర్థము. ఓయీ! దేహముకల వానికి ఎప్పుడూ ద్వైత దృషి నుండి మరలుట పొసగనందున మళ్ళీ సంసారము కలుగుచునే యుండునుకదా! అనిన అందుకు చెప్పుచున్నారు క్వచితని. ఒకప్పుడు ఆవశ్యకమగు ఆహారముల యందు ఈ దృశ్యము కనపడుచుండిననూ ఏది పూర్ణముగా సత్యముగాదను బుద్ధితో విడువబడినదో అది మళ్ళీ మోహాము కొరకు కానేరదు. ఈ ద్వైత స్మరణము దేహపాత పర్యన్తము సంసార మాత్రమున అవభాసించుచుండును అనదగును. (35)

36శ్లో॥ దేహం చ నశ్వర మవ స్థిత ముత్థితం వా
సిద్ధోన పశ్యతి యతోఽధ్యగ మత్స్వరూపం ।
దైవాదపేతముత దైవ వశాదుపేతం
వాసో యథా పరికృతం మదిరామ దాంధః ॥

తా:- దీనినే ఉపపాందిచుచున్నాడు దేహమని. సిద్ధపురుషుడు ఏ దేహముద్వారా స్వరూపమగు బ్రహ్మమునధిగమించునో నశించు స్వభావముగల ఆ దేహము ఆసనమందున్నను పీఠము నుండి లేచినను కర్మవశమున వీడిననూ, కూడిననూ, కల్లుదాగి మత్తు వలన కైపెక్కిన

టీ:- ఏతదేవోపపాదయతి దేహమితి. ఆసనాదుత్థితం ఉద్ధాయ తత్రైవ స్థితం తతః క్వచిదపేతం నిర్గతం పునస్తత్రైవోపేతం వా దేహమపి నానుసంధాత్తే కుతోఽన్యత్. యతః యేన దేహేన. స్వరూపమధ్యగమత్ జ్ఞాతవాన్ తం దేహం యతః కారణాదితి వా. అత్యంతాననుసంధానే దృష్టాంతః వాసః ఇతి. పరికృతం పరిపాతం వా సః గతం వా స్థితం వా యథా న వేత్తి తద్వత్.(36)

వాడు తాను కట్టిన వస్త్రము తొలగిననూ, ఉన్ననూ ఎట్లు ఎరుగడో సిద్ధుడట్లు దేహమును గమనింపడు. (36)

37శ్లో॥ దేహోఽపి దైవవశగః ఖలు కర్మ యావత్
స్వారంభకం ప్రతిసమీక్ష్యత ఏవసాసుః ।
తం ప్రపంచమధిరూఢ సమాధి యోగః
స్వాప్నం పునర్న భజతే ప్రతిబుద్ధ వస్తుః ॥

టీ:- నను చ యః పరిపాల్యమానోఽపి ముమూర్షతి తం చేన్న పశ్యతి తర్హి పతేదేవ నేత్యాహ - దేహ ఇతి. దైవవశేన గచ్ఛన్ స్వారంభకం కర్మయావదస్తి తావత్పర్యంతం ప్రతిసమిక్ష్యత ఏవసాసుః ప్రాణేంద్రియసహితః నను తర్హి తస్మిన్ కదాచిదాసజ్జేతాపి నేత్యాహ - తమితి. స్వాప్నం స్వప్నతుల్యం అధిరూఢః ప్రాప్తః సమాధిపర్యంతో యోగో యేన అత ఏవ ప్రతిబుద్ధం జ్ఞాతం పరమార్థం వస్తు యేన సః తథా చ. శ్రు."తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్య త" ఇతి. (37)

తా:- ఓయీ! ఏ ఈదేహమును పరిపాలించుచున్నను మరణోన్ముఖ మయిననూ చూడనిచో, పతనమవును గదా యనిన చెప్పుచున్నాడు దేహ అని. దేహము కూడ విధికి లోనై సంచరించుచూ తన పుట్టుకకు కారణమైన పూర్వకర్మ ఎంత వరకుండునో అంత వరకు ప్రాణేంద్రియ ములలో కూడినదై కాలమునెదురుచూచుచూ సహజస్థితి లోనే ఉంటున్నది. నశించదని అర్థము. అట్లయినచో ఒకప్పుడు సిద్ధుడు దేహాసక్తుడు కాడా? అన్నచో కాదనుచున్నాడు. ఏ ప్రపంచము ప్రాణేంద్రియ మనో బుద్ధులతో గూడిన ఆ దేహమును స్వప్నము నందు భాసిల్లు దానివలె చూచి ప్రాప్తమగు సమాధి పర్యన్తము ధ్యానాది యోగము కలవాడగుచు తెలిసికొనిన పరమాత్మ వస్తువు కల సిద్ధుడు మళ్ళీ ఆ దేహాసక్తిని పొందడు. (37)

38శ్లో॥ మయైతదుక్తం వో విప్రా గుహ్యం యత్సాంఖ్య యోగయోః।
జానీత మాగతం యజ్ఞం యుష్మద్ధర్మ వివక్షయా ॥

టీ:- ఉక్తార్థే తేషాం విశ్వాసార్థం స్వస్వరూపమాహ - మయేతి. సాంఖ్యమాత్మానాత్మ వివేకః. యోగోఽష్టాంగః. తయోర్గుహ్యం రహస్యం యజ్ఞం విష్ణుం యుష్మద్ధర్మ వివక్షయే త్యనేన ధర్మా అప్యుపదిష్టా ఇతి జ్ఞేయం అత ఏవ. శ్లో."యత్తేన హంసరూపేణ బ్రహ్మణేఽప్యాత్థ మాధవే" త్యనువాదో భవిష్యతి. (38)

తా:- చెప్పబడిన విషయమందు వారికి విశ్వాసము కలుగుట కొరకు స్వస్వరూపమును చెప్పుచున్నారు. ఓ విప్రులారా! ఆత్మానాత్మ వివేక రూపమగు సాంఖ్యశాస్త్రము, యమ నియమాదులగు అష్టాంగ యోగముల రూపమగు పాతంజల యోగశాస్త్రము. అనువాని యందు ఏ రహస్యము కలదో ఆ ఆత్మతత్త్వమును మీకు నేను చెప్పినాను మీకు ధర్మము చెప్పు కోరికతో ఇచ్చటకి వచ్చిన నన్ను విష్ణువుగా మీరు తెలిసికొనండి."యజ్ఞోవై విష్ణుః"అని శృతి. "యత్తేన హంసరూపేణ బ్రహ్మణేప్యాత్త మాధవ".అని మాధవుడు హంసరూపమున బ్రహ్మ దేవునికి ఆత్మతత్త్వము చెప్పెనని అనువాదమగును. (38)

39శ్లో॥ అహం యోగస్య సాంఖ్యస్య సత్యస్యర్తస్య తేజసః ।
పరాయణం ద్విజశ్రేష్ఠాః శ్రియః కీర్తేర్దమస్య చ॥

టీ:- అహమితి. ఋతం ప్రమీయమానో ధర్మః సత్యమనుష్ఠీయమానో ధర్మః తేజః ప్రభావః.ఏతేషాం పరమయనం. (39)

తా:- ఓ ద్విజశ్రేష్ఠులారా! నేను సాంఖ్యయోగములకు, వేదచోదిత ధర్మమగు ఋతమునకు, అనుష్ఠింపబడు ధర్మమగు సత్యమునకు, ప్రభావమునకు, లక్ష్మికి, కీర్తికి, ఇంద్రియనిగ్రహమునకు, పరమప్రాప్య మైన వాడనని తెలిసికొనుడు. (39)

40శ్లో॥ మాంభజన్తి గుణాస్సర్వే నిర్గుణం నిరపేక్షకం ।
సుహృదం ప్రియమాత్మానం సామ్యాసంగాదయో గుణా ॥

టీ:- కించ. మామితి. కథం భూతాః అగుణాః గుణ పరిణామరూపా న భవంతి. కింతు నిత్యా ఇత్యర్థః. (40)

తా:- గుణరహితుడు, దేనియందపేక్షలేని వాడు, జీవుల మేలుకోరు వాడు, ఇష్టుడు, ఆత్మస్వరూపుడు అయిన నన్ను సామ్యాసంగాదయో గుణాః-ఆ గుణములు పొందును. సత్యాది గుణ పరిణామరూపములు గాక ఆ గుణములు నిత్యములై నాయందున్నవి. (40)

శ్రీభగవానువాచ

41శ్లో॥ ఇతి మేచ్ఛిన్న సందేహా మునయస్సనకాదయః ।
స భాజయిత్వా పరయా భక్త్యా గృణత సంస్తవైః ॥

టీ:- ఇతీతి. మే మయా. అగృణత మాం తుష్టువుః. (41)

తా:- ఇట్లునాచే బోధితులయిన సనకాదిమునులు సంశయములు తొలగినవారై ఏకాంత భక్తిచే నన్ను పూజించి, స్తుతించిరి. (41)

42శ్లో॥ తై రహం పూజితం సమ్యక్ సంస్తుతః పరమర్షిభిః ।
ప్రత్యయాయ స్వకంధామ పశ్యతః పరమేష్ఠినః ॥

టీ:- తైరితి ప్రత్యేయాయ ప్రత్యాగతోఽస్మి. (42)

తా:- ఇట్లు ఋషిశ్రేష్ఠులగు సనకాదులచే చక్కగా పూజను, సన్నుతులను గైకొన్నవాడనై బ్రహ్మదేవుడు చూచుచుండగా నా వైకుంఠ ధామమునకు మరలి వచ్చితిని.(42)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**త్రయోదశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**త్రయోదశాధ్యాయము సమాప్తము.**

## చతుర్దశోఽధ్యాయః

**ఉద్ధవ ఉవాచ**

1శ్లో॥ వదంతి కృష్ణ శ్రేయాంసి బహూని బ్రహ్మవాదినః ।
తేషాంవికల్ప ప్రాధాన్యముతాహో ఏకముఖ్యతా ॥

టీ:- శ్లో.చతుర్థశే పరం శ్రేయో భక్తిరేవ నచేతరత్, ఇత్యేతద్వర్ణ్యతే ధ్యానయోగశ్చ సహ సాధనైః.ఏవం తావద్భగవతా భక్త్యా మోక్ష ఇత్యుక్తం అన్యేత్వన్యాని సాధనాని వదంతి తత్ర విశేషనిర్ధారణాయ పృచ్ఛతి- వదంతీతి. శ్రేయాంసి శ్రేయస్సాధనాని కిం వికల్పేన ప్రాధాన్యం ఉతాఽహో కిం వా ఏకస్యైవ ముఖ్యతా? (1)

2శ్లో॥ భవతోదాహృతః స్వామిన్ భక్తి యోగోఽనపేక్షితః ।
నిరస్య సర్వతః సంగం యేన త్వయ్యా విశేన్మనః ॥

టీ:- ఏకముఖ్యతాపక్షోత్థానే కారణం. భవతేఇతి. అనపేక్షితఃన అపేక్షితం అపేక్షా యస్మిన్ సః హైతుకః అయమర్థః భవతా యో భక్తియోగ ఉక్తః. అన్యే చ యాని శ్రేయస్సాధనాని వదంతి. తేషాం

## చతుర్దశాధ్యాయము

తా:- ఈ పదునాల్గవ అధ్యాయము నందు ఉత్తమమయిన శ్రేయస్సునకు సాధనము భక్తి యొక్కటియే గాని ఇతరము గాదు అని వర్ణింపబడును. ధ్యానయోగము సాధనములతో తెల్పబడును. భగంతుని యందు భక్తివలన మోక్షమని చెప్పబడినది. ఇతరులు ఇతర సాధనములను చెప్పుచున్నారు. వాటిలో విశేష నిర్ధారణకై అడుగుచున్నాడు వదంతియని. ఓ కృష్ణా! వేదవాదులు మోక్షముకు సాధనములను అనేకముగా చెప్పుచున్నారు. వాటిలో ఇదినదియు ఒక్కటేను వికల్పరీతిని అన్నింటికి ప్రాధాన్యమగును. లేక వానిలో ఒక్కదానికి మాత్రమే ప్రాధాన్యమగునా? చెప్పుము.(1)

తా:- ఒకదానికే ముఖ్యత్వమను పక్షముద్భవించుటకు కారణము చెప్పుచున్నారు భవతాయని. ఓస్వామి ! మీచే చెప్పబడిన భక్తియోగము ఇతర ఫలాపేక్షలేనిది. అహైతుకము. ఏ భక్తి యోగముచే అన్నింటి నుండి సంగమును నిరసించి నీ యందు మనపు ప్రవేశించునో, దీని యర్థమిది. నీవు భక్తియోగమును చెప్పితివి. అన్యులు మరికొన్నింటిని శ్రేయస్సాధనములని చెప్పుచున్నారు. దానిలో ఏది సాక్షాత్తుగా

కిం సాక్షాత్ఫలసాధనత్వేన ప్రాధాన్యమేవ సర్వేషాం ఉతాంగాంగిత్వం ప్రాధాన్యేఽపి కిం వికల్పేన సర్వేషాం తుల్యఫలత్వం, యద్వా కశ్చిదస్తి విశేష ఇతి. (2)

ఫలసాధనముగా ప్రధానమగును. అన్నియు అంగాంగి భావమున ప్రధానలై యున్నవి. వీని యందు ప్రాధాన్యత ఉన్నప్పటికినీ వికల్పముగా అన్నింటికి తుల ఫలత్వమా ? లేదా వానిలో ఏదైనా విశేషమున్నదా అని చెప్పుమనుచున్నాడు.(2)

3శ్లో॥ **శ్రీభగవానువాచ**

కాలేన నష్టాప్రళయే వాణీయం వేద సంజ్ఞితా ।
మయాదౌ బ్రహ్మణే ప్రోక్తా ధర్మో యస్యాం మదాత్మకః ॥

టీ:- తత్ర భక్తిరేవ మహాఫలత్వేన ముఖ్యా. అన్యాని తు స్వస్వకృత్యనుసారేణ పుష్పస్థానీయ స్వర్గాది ఫలబుద్ధిభిః ప్రాణిభిః ప్రాధాన్యేన పరికల్పితాని క్షుల్లక ఫలానీతి వివేక్తుం ప్రకృత్యనుసారేణ బహుధా వేదార్థ ప్రతిపత్తిమాహాథ సప్తభిః కాలేనేతి. మదాత్మకః మయ్యేవాత్మా యేన సః. (3)

తా:- వీనియందు భక్తియే మహాఫలమగుటచే ముఖ్యమైనది. అన్యములైనచో వాని వాని ప్రకృత్యనుసారముగా పుష్పస్థానీయములగు స్వర్గాది ఫలబుద్ధులు గల ప్రాణులచే ప్రాధాన్యముగా కల్పింపబడినవి. అవి అల్ప ఫలములు కలవగును అని విడమర్చుటకు ప్రకృత్యనుసారముగ వేదార్థజ్ఞానము అనేక విధములుగా చేయబడినదని ఏడుశ్లోకములచే చెప్పుచున్నారు. ప్రళయకాలము నందు ఈ వేదమను పేరు పొందిన వాక్కు కాల గతిన నశించినది. నా చే సృష్టికి మొదలు బ్రహ్మకు చెప్పబడినది. ఏ వేదవాణి యందు నా యందు చిత్తమునిల్పెడి భక్తిరూప ధర్మము తెల్పబడినదో.(3)

4శ్లో॥ తేన ప్రోక్తాచ పుత్రాయ మనవే పూర్వజాయసా ।
తతో భృగ్వాదయోఽగృహ్ణన్ సప్త బ్రహ్మ మహర్షదీయః ॥

తా:- ఆ బ్రహ్మ తన జ్యేష్ఠ పుత్రుడగు స్వాయంభువ మనువునకు ఆ వేదవాణిని ఉపదేశించెను. ఆ మనువువలన భృగువు, మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అను ఏడుగురు ప్రజాపతులు ఆ వేదవాణిని గ్రహించిరి. (4)

5శ్లో॥ తేభ్యం పితృభ్యస్తత్పుత్రా దేవ దానవ గుహ్యకాః ।
మనుష్యాః సిద్ధగంధర్వాః స విద్యాధర చారణాః ॥

టీ:- తేనేతి. భృగాదయః భృగుశ్చ మరీచిరత్ర్యంగిరసౌ. పులస్త్యః పులహః క్రతురిత్యేతే చ సప్తబ్రహ్మాణః ప్రజాపతయః తే చ తే మహర్షయశ్చ. (4,5)

తా:- ఆ ఏడుగురు మునుల వలన దేవతలు, దానవులు, గుహ్యకులు, మనుష్యులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, చారణులు గ్రహించిరి. (5)

6శ్లో॥ కిం దేవాః కిన్నరాః నాగాః యక్షః కింపురుషాదయః ।
బహ్వ్యస్తేషాం ప్రకృతయో రజస్సత్త్వతమో భువః ॥

టీ:- కిం దేవా ఇతి. కిం దేవాః క్లమస్వేదదౌర్గంధ్యాదిరాహిత్యేన భూస్పర్శాదినా చ కిం దేవా మనుష్యా వేతి సందేహాస్పద ద్వీపాంతర మనుష్యాః. ఏవం కిన్నరాః కించిన్నరా ఇవ ముఖతః శరీరతో వా. కింపురుషాః కించిత్పురుషా ఇవ వానరాదయః ప్రకృతయః వాసనాః బహ్వ్యః కుతః రజస్సత్త్వ తమాంసి భువః జన్మస్థానాని యాసాం తాః.(6)

తా:- అలసట, చెమట దుర్గంధములేని శరీరము గలవారై భూస్పర్శ గలిగి సంచరించు ద్వీపాంతరవాసులగు మనుష్యులును, ముఖమును బట్టి, శరీరమునుబట్టి, మనుష్యుని సరిపోలికగల కిన్నరులు. కొంచెము మానవాకృతిగల వానరులు, మొదలయిన వారును ఆ వేద వాణిని గ్రహించిరి వారి జన్మ ప్రవర్తనలు రజస్సత్వ తమో గుణములు గల వగుటచే వారి మనోవాసనలు అనేక విధములై యుండును.(6)

7శ్లో॥ యాభిర్భూతాని భిద్యన్తే భూతానాం మతయస్తథా ।
యథా ప్రకృతి సర్వేషాం చిత్రావాచః స్రవంతి హి ॥

టీ:- యాభిరితి. భూతాని దేవాసుర మనుష్యాదీని. యథా ప్రకృతి మనతిక్రమ్య. చిత్రా వాచః వేదార్థ వ్యాఖ్యాన విషయాః. (7)

తా:- ఏ కర్మవాసనలచే దేవాసుర మనుష్యాదులగు ప్రాణుల చిత్తములును భేదిల్లుచున్నవో, ఆ ప్రాణులందరి యొక్క వారి వారి స్వభావము నతిక్రమింపక వేదార్థ వ్యాఖ్యాన విషయములైన వాక్కులు జారుచుండును (ప్రకటనమగుచుండును) (7)

8శ్లో॥ ఏవం ప్రకృతి వైచిత్ర్యాత్ భిద్యన్తే మతయో నృణామ్ ।
పారంపర్యేణ కేషాం చిత్ పాఖణ్ణ మతయోఽపరే ॥

టీ:- ఏవమితి. ఏవమిత్యుక్తోపసంహారః కేషాం చిదధ్యయనాది శూన్యానామన్యుపదేశ పారంపర్యేణ అపరే పాషండ మతయః. (8)

తా:- ఈ ప్రకారము కర్మవాసనల భేదము వలన నరుల చిత్తవృత్తులు మారుచుండును కొందరు వేదాధ్యయన శూన్యులైన వారి యొక్క ఉపదేశక్రమము చేతను ఇతరులు వేద విరుద్ధ ధర్మచిత్తులైరి. (8)

9శ్లో॥ మన్మాయామోహితధియః పురుషాః పురుషర్షభ ।
శ్రేయోవదన్త్యనేకాన్తం యథా కర్మ యథారుచి ॥

టీ:- మదితి. తత్రప్రకృతీనాం మాయా గుణమాలత్వాత్ మన్మాయా మోహితధియః. అనేకాంతం నానావిధం. (9)

తా:- ఓ పురుషశ్రేష్ఠుడా ! నా మాయచే మోహమును పొందినవారై పురుషులు వారి కర్మవాసనానుసారముగను, వారియభిరుచికనుగుణముగును, నానా విధములయిన శ్రేయస్సాధనములను అనేక విధములుగా చెప్పుచున్నారు. (9)

10శ్లో॥ ధర్మమేకే యశశ్చాన్యే కామం సత్యం దమం శమమ్ ।
అన్యేవదంతి స్వార్థం వా ఐశ్వర్యం త్యాగ భోజనమ్
కేచిద్యజ్ఞ తపో దానం వ్రతాని నియమాన్యమాన్ ॥

టీ:- తదేవాహ - సార్ధేన ధర్మమితి. ధర్మం నిత్యనైమిత్తికాఖ్యం కర్మ కర్మమీమాంసకాః తదుక్తం. శ్లో."మోక్షార్థీ నప్రవర్తేత తత్ర కామ్య నిషిద్ధ యోః, నిత్యనైమిత్తికే కుర్యాత్రప్రత్యవాయ జిహాసయే"త్యాది. యశః కావ్యాలంకారకృతః. యదాహుః శ్లో."యావత్కీర్తిర్మనుష్యస్య పుణ్యలోకేషు గీయతే, తావద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయత"ఇతి కామంద వా

తా:- దానినే చెప్పుచున్నారు. నిత్య నైమిత్తికమైన కర్మను కొందరు కర్మమీమాంసకులు చెప్పుదురు. అట్లే చెప్పబడినది. "మోక్షార్థీ న ప్రవర్తేత తత్ర కామ్య నిషిద్ధయోః నిత్యనైమిత్తికే కుర్యాత్రప్రత్యవాయ జిహాసయా". అనగా మోక్షముగోరువాడు కామ్యములు, నిషిద్దములయిన కర్మాలనాచరించగూడదు. తన కనుదినము సంప్రాప్తించు దురిత క్షయమునకు నిత్యనైమిత్తకములగు స్నాన, సంధ్యా, జప, పంచ మహాయజ్ఞాదులగు కర్మలనాచరించ వలెను. యశః= కీర్తిని, కావ్యాలంకారమగు కృతిని కొందరు అందురు. అట్లే యావత్కీర్తిర్మనుష్యస్య పుణ్యలోకేషు గీయతే

త్స్యాయనాదయః. సత్యం దమం శమం చ యోగశాస్త్రకృతః అన్యే దృష్టార్థవాది దండనీతికృతః. వై ప్రసిద్ధం ఐశ్వర్యమేవ స్వార్థం పురుషార్థం వదంతి. అతః సామ్యాద్యుపాయా ఏవ శ్రేయస్సాధనమితి తేషాం మతం. తథైవ త్యాగం భోజనం చ లోకాయతికాః. యజ్ఞం తపో దానం యజ్ఞో దేవానాం పూజనం తపశ్చ దానంచ. (10)

11శ్లో॥ ఆద్యన్తవన్త ఏవైషాం లోకాః కర్మవినిర్మితాః ।
దుఃఖోదర్కా స్తమోనిష్ఠాః క్షుద్రానందాః శుచార్పితాః ॥

టీ:- తేషాం తుచ్ఛ ఫలత్వమాహ- అద్యంతవంత ఇతి. ఏషాం లోకాః ఏతైస్సాధ్యాని ఫలాని తమోనిష్ఠాః మోహావసానాః. భోగకాలేఽప్య సూయాదిభిః. శుచా అర్పితాః వ్యాప్తాః. (11)

తావద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే మనుష్యుని కీర్తి ఎంతకాలము పుణ్య లోకములందు కీర్తింపబడునో అన్ని వేలకొలది సంవత్సరములు మనుష్యుడు స్వర్గమునందు కీర్తింపబడును. కామం - ఇంద్రియ సుఖానుభవమును వాత్స్యాయనాదులు చెప్పుదురు. సత్యం, శమం, దమము. మొదలయిన వానిని యోగశాస్త్ర ప్రవర్తకులు చెప్పుదురు దృష్టాంతవాదులు ప్రత్యక్షప్రమాణవాదులు ప్రత్యక్ష సుఖమునుగాంచు వారు. దండనీతిని రచించిన వారు. సంపద ప్రభుత్వములను వానిని పురుషార్థమును చెప్పుదురు. ఇందువలన సామాదులగు నుపాయములే శ్రేయస్సాధనములని వారి మతము. ఒకరికిచ్చుట తానను భవించుట అని లోకాయతులు చెప్పుదురు. కొందరు యజ్ఞము, తపస్సు, దేవతల పూజ, దానము, ఏకాదశ్యాదివ్రతములు, స్వాధ్యాయాది నియమములను అహింసాది యమములను శ్రేయస్సాధనములుగా చెప్పుదురు. (10)

తా:- ఆ లోకములు తుచ్ఛఫలములు అనుచున్నారు. పైన శ్రేయ స్సాధనములను చెప్పిన వీరికి లభించు పుణ్యలోకములు, కర్మఫలములచే చేకూరినవి. మొదట లభించి ఆ తరువాత లేకుండపోవునవి. కనుక అస్థిరములై యున్నవి. ఉత్తరకాలమందు దుఃఖ ఫలమును ఇచ్చునవి. మోహము అవసానము గలవి అయియున్నవి. అల్పానందము కలిగియున్నవి. భోగకాలములోకూడ అసూయలతో శోకముల కూడి యున్నవి. (11)

12శ్లో॥ మయ్యర్పితాత్మనః సభ్య నిరపేక్షస్య సర్వతః ।
మయాత్మనా సుఖం యత్తత్కుతః సాద్విషయాత్మానామ్ ॥

టీ:- భక్తేర్ముఖ్యత్వమాహ - యావత్సమాప్తి మయీతి. హే సభ్య. మయా పరమానందరూపేణ. ఆత్మనా స్వరూపత్యేన స్ఫురతా. (12)

తా:- ఓ సభ్య! నాయందు తన చిత్తముసమర్పించి, అన్య విషయముల నందు అపేక్షలేని వానికి, పరమానన్ద స్వరూపుడనయిన నాతో, స్వస్వరూపుడయిన నా తోడి సుఖము ఏదిగలదో, అది విషయ సుఖాభి లాషులకెట్లు లభిస్తుంది. ఏ విధముగనూ కలుగదు.(12)

13శ్లో॥ అకించనస్య దాన్తస్య శాన్తస్య సమచేతసః ।
మయాసన్తుష్ట మనసః సర్వాః సుఖమయా దిశః ॥

టీ:- కించ. అన్యేషాం తత్తల్లోకాది పరిచ్ఛిన్నం సుఖం తుచ్ఛం భక్తస్య తు పరిపూర్ణమిత్యాహ - అకించనస్యేతి.(13)

తా:- మరియు ఇతరులకు ఆయా లోకములు పరిమితములు, అనిత్యములు. భక్తు నికి మాత్రము పరిపూర్ణమనుచున్నాడు. పరిగ్రహ శూన్యుడు, దాన్తుడు, శాన్తుడు, సమదృష్టికలవాడు. తుష్టి కల మనస్సు కలవానికి అన్నియూ సుఖమయములే.(13)

14శ్లో॥ న పారమేష్ఠ్యం న మహేంద్ర ధిష్ణ్యం
న సార్యభౌమం న రసాధి పత్యమ్ ।
న యోగసిద్ధీ రపునర్భవం వా
మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్ ॥

టీ:- పరిపూర్ణతామేవాహనేతి. రసాధిపత్యం పాతాళాది స్వామ్యం అపునర్భవం మోక్షమపి మద్వినా మాం వినా అన్యత్ నేచ్ఛతి. అహమేవ తస్య ప్రేష్ఠ ఇత్యర్థః. (14)

తా:- పరిపూర్ణత్వమునే చెప్పుచున్నాడు. నా యందు చిత్తముంచిన నా భక్తుడు నేను లేక ఇతరమైన బ్రహ్మ ఉండేది సత్యలోకమును, ఇంద్రుని స్థానమగు స్వర్గమును, చక్రవర్తి పదవిని, పాతాళ లోకాధి పత్యమును అభిలషించదు. అణిమాది యోగసిద్ధులనూ కోరడు చివరకు మోక్షమునైన కోరడు.(14)

15శ్లో॥ న తథా మే ప్రియతమ ఆత్మయోనిర్నశంకరః ।
న చ సంకర్షణో నశ్రీర్నైవాత్మా చ యథా భవాన్ ॥

టీ:- మమాపి స ఏవ ప్రేష్ఠ ఇత్యాహ ద్వాభ్యాం. నేతి. ఆత్మయోనిః బ్రహ్మపుత్రోஉపి. శంకరః మత్స్యరూపభూతోஉపి. సంకర్షణః భ్రాతాపి. శ్రీః భార్యాపి. ఆత్మా శ్రీమూర్తిరపి. యథా భక్త ఇతి వక్తవ్యే అతిహర్షేణాహ - భవానితి. (15)

తా:- నాకును అతడే గొప్పవాడని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. బ్రహ్మపుత్రుడైననూ ప్రియతముడుగాడు. మత్స్యరూపడయిన శంకరుడునుగాడు. సోదరుడైన బలరాముడునుగాడు. భార్య అయిన లక్ష్మియుగాదు నా మూర్తిసయితమూ గాదు. ఏ ప్రకారము నీవు ప్రియతముడవో, భక్తుడు ప్రియతమడని చెప్పదగియున్నదని అతిహర్షమున అట్లు చెప్పెను. (15)

16శ్లో॥ నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమ దర్శనమ్ ।
అనువ్రజామ్యహం నిత్యం పూయే యేత్యంఘ్రిరేణుభిః ॥

టీ:- హీన మధ్యమభక్తాభ్యాం ఉత్తమ భక్తిజ్ఞాని నిజప్రీతిమాహ నిరపేక్షమితి. సమదర్శనం వాసుదేవస్సర్వమితి పశ్యంతం పూయేయ మదంతర్వర్తి బ్రహ్మాండాని పవిత్రీకుర్యామితి భావేనేత్యర్థః. (16)

తా:- ఐహికాముష్మిక సుఖేచ్ఛలేనివాడు, మననశీలుడు, కామక్రోధాదులు శాంతించిన వాడు, ఎవనియందు ఈర్ష్య లేనివాడు, అన్నింట వాసుదేవుడు కలదు సర్వమూ వాసుదేవుడను సమదృష్టిగల భక్తుని నేనే నిత్యమూ అనుసరించి పోవుదును. పాదధూళలచే నాలో నుండు బ్రహ్మాండములను పవిత్రము చేయుచున్నాను. అనుభావమున అని యర్థము. (16)

17శ్లో॥ నిష్కించనా మయ్యను రక్త చేతసః
శాంతమహాన్తోஉఖిల జీవవత్సలాః ।
కామైరనాలబ్ధ ధియో జుషన్తి
యత్తైనైరపేక్ష్యం న విదుః సుఖం మమ ॥

తా:- మరియు నా భక్తులకు కలుగు సుఖమింత మాత్రమని చెప్పుకొనుటకెవ్వడు సమర్థుడు?ఆ సుఖము స్వసంవేద్యము నిరుపమము అని చెప్పుచున్నారు. తమది ఇది అని ఏ ఇంచుక వస్తువులేని వారు, నాయందు ప్రేమతో చిత్తముగలవారును, మనశ్శాంతిగల వారును

టీ:- కించ మద్భక్తానాం సుఖం ఏతావదేవం భూతమితి వా వక్తుం కస్సమర్థః. యతః తత్స్వసంవేద్యం నిరుపమిత్యాహ నిష్కించనా ఇతి. మహాంతో నిరహంమానాః అనాలబ్ధధియః. అస్పృష్టచిత్తాః నిష్కించనత్వాదీనాం యథేష్టం హేతుహేతుమద్భావః. ఏవం భూతాః మమ మదీయాః యత్సుఖం జుషంతి సేవంతే. తత్సుఖం తఏవ విదుః నాన్యే కుతః. నైరపేక్ష్యం నాస్తి అపేక్షా యేషాం తే నిరపేక్షాః తైరేవ లభ్యం న తు మోక్షాపేక్షైరపీత్యర్థః. యద్వా ఏవం భూతాస్సంతో యే మమ మామిత్యర్థః. జుషతి ప్రీణయంతి త ఏవ యన్నైరపేక్ష్యం సుఖం తద్విదుర్నాన్య ఇత్యర్థః.(17)

విషయవాంఛలచే అస్పృష్ట చిత్తులును (విషయవాంఛలను కోరని వారు) నిష్కించనోత్యాది ఈ విశేషణములు స్వేచ్ఛగా హేతుహేతుమద్భావము గలవి. ఇట్టివారు నాభక్తులు; ఏ సుఖమును సేవింతురో ఆ సుఖమును వారే తెలిసికొందరు. అన్యులుతెలిసికొనలేరు. అపేక్షలేని చేతనే లభ్యమగునది. మోక్షాపేక్షగలవారి చేత లభ్యము గాని దగును. లేక ఇట్టివారై ఎవరు నన్ను సంతోషపెట్టుదురో వారే నిరపేక్షమగు సుఖమును తెలిసికొనిన వారు. అన్యులు ఎరుగరని భావము. (17)

18శ్లో॥ బాధ్యమానోఽపి మద్భక్తో విషయైరజితేంద్రియః ।
ప్రాయః ప్రశల్భయా భక్త్యా విషయైర్నాభి భూయతే ॥

టీ:- అపిచ ఆస్తాం తావదుత్తమ భక్త కథా యతః ప్రాకృతోఽపి భక్తః కృతార్థ ఏవేత్యాహ ద్వాభ్యాం. బాధ్యమాన ఇతి. బాధ్యమానః విషయైరా కృష్యమాణోఽపి ప్రగల్భయా సమర్థయా. (18)

తా:- మరియు అట్టి ఉత్తమ భక్తుల కథ అటుండనిమ్ము పామరుడైననా భక్తుడు సైతము కృతార్థుడే అయ్యున్నాడు అనుచున్నాడు. ఇంద్రియములను జయింపని నా భక్తుడు ఇంద్రియ విషయములచేత ఆకర్షింపబడినవాడయ్యు తరచుగా సమర్థమైన నా భక్తిచే (సమర్థమయిన భక్తియుండుట వలన) విషయ సుఖములచే పీడింపబడదు.(18)

19శ్లో॥ యథాగ్నిః సుసమిద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్ ।
తథా మద్విషయా భక్తిరుద్ధవైనాంసి కృత్స్నశః ॥

తా:- ఇందుకు దృష్టాంతము చెప్పుచున్నాడు. పాకాదికము కొరకు బాగుగా మంటలు మండుచున్న అగ్నిజ్వాలలుగల అగ్ని ఏ ప్రకారము

టీ:- అత్ర దృష్టాంతః యథేతి. పాకాద్యర్థం ప్రజ్వాలితోఽగ్నిర్యథా కాష్ఠాని భస్మీకరోతి తథా రాగాదినాఽపి కథం చిన్మద్విషయా సతీ భక్తిః సమస్త పాపానీతి భగవానపి స్వభక్తిమహిమాశ్చర్యేణ సంబోధయతి అహో ఉద్ధవ విస్మయం శృణ్వితి. (19)

కట్టెలను బూడిద చేయునో ఆ ప్రకారము నా యందలి రాగాదికముతో గూడిన, నా విషయమయిన భక్తి అన్ని పాపములను భస్మము చేయుచున్నది. భగవంతుడు కూడా భక్తి మహిమను గూర్చిన ఆశ్చర్యముతో అహో ఉద్ధవా! వినుమని విస్మయముతో సంబోధించు చున్నాడు. (19)

20శ్లో॥ న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ ।
న స్వాధ్యాయస్తపస్త్యాగో యథా భక్తిర్నమోర్జితా ॥

టీ:- అతః ఏవం భూతం శ్రేయో నాన్యదస్తీత్యాహ ద్వాభ్యాం నేతి.(20)

తా:- అందువలన ఇటు వంటి శ్రేయస్సు ఇంకొకటి లేదనుచున్నాడు రెండు శ్లోకములచే. ఓ ఉద్ధవా! నన్ను యాగాది ధర్మనిష్ఠవశము చేసికొన లేదు. సాంఖ్యము, యోగము, స్వాధ్యాయము, దానము, నా బలిష్ఠమయిన భక్తి వశముచేసి కొన్నట్లు ఇవి ఏవియూ వశము చేసికొనవు. (20)

21శ్లో॥ భక్త్యాహ మేకయా గ్రాహ్యః శ్రద్ధయాత్మాప్రియస్సతామ్ ।
భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్ ॥

టీ:- భక్త్యేతి. శ్రద్ధయా యా భక్తిస్తయా మన్నిష్ఠా మద్విషయా ఆస్తిక్య బుద్ధిమాత్రేణ. సంభవాత్ జాతిదోషాదపీత్యర్థః. (21)

తా:- ఆత్మస్వరూపడనగు నేను సాధువులకు ప్రియుడను. శ్రద్ధలో కూడిన ఒక్క భక్తి తోడనే గ్రహింపదగినవాడను. నా యందు దృఢముగా ఉన్నభక్తి, ఆసక్తి, బుద్ధి మాత్రమున సంభవించు దానివలన కుక్క మాంసము తిను చండాలురను సైతము పవిత్రులను చేయచున్నది.(21)

22శ్లో॥ ధర్మస్సత్యదయోపేతో విద్యావా తపసాన్వితా ।
మద్భక్త్యాపేత మాత్మానం న సమ్యక్ర్పపునాతి హి ॥

టీ:- భక్త్యభావే అన్యత్సాధనం వ్యర్థమిత్యాహ ద్వాభ్యాం ధర్మఇతి.(22)

తా:- భక్తిలేకున్నచో అన్యమగు సాధనమంతయు వ్యర్థమనుచున్నారు. సత్యముగాని, భూతదయతోగూడిన ధర్మపథముగాని, తపస్సుతో గూడిన వివేకమగు విద్యగాని. నా భక్తిలేని చిత్తముగల నరుని చక్కగా పావనుని చేయలేదు. (22)

23శ్లో॥ కథం వినారోమహర్షం ద్రవతాచేతసావినా ।
వినానన్దాశ్రు కలయా శుద్ధ్యేద్భక్త్యా వినాశయః ॥

టీ:- తర్హి తస్య భక్తిర్నాస్తీతి కథమజ్ఞా యీత్యాశంకాయాం భక్తేశ్చిహ్నా న్యాహ కథమితి. రోమ హర్షాదికం వినా కథం భక్తిర్గమ్యతే. భక్త్య చ వినా కథమాశయః. శుద్ధ్యేదితి. (23)

తా:- అట్లుయిన భక్తిలేదని ఎట్లు తెలియబడును అను శంకరాగా భక్తికి చిహ్నములను చెప్పుచున్నారు. శరీరము గగుర్పాటు లేక భక్తి ఎట్లు తెలియబడును. కరిగిన చిత్తము కలుగక భక్తి ఎట్లు తెలియును. భక్తిలేక చిత్తము ఎట్లు పరిశుద్ధమగును. (23)

24శ్లో॥ వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం
రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ
విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ
మద్భక్తి యుక్తో భువనం పునాతి. ॥

టీ:- కించ. భక్తిస్స్వాశయం శోభయతీతి కిము వక్తవ్యం. యతో గద్గద వాగాది లక్షణో మద్భక్తియుక్తస్సర్వం లోకం పునాతీత్యాహ వాగితి.(24)

తా:- మరియు నాభక్తి చిత్తమును శోభిల్లచేయునని ఏమి చెప్పనగును? ఏ భక్తి వలన తొట్రుపాటు వాక్కు , మొదలయిన లక్షణములగల నా భక్తి గలవాడు సర్వలోకమును పావనముచేయుచున్నాడనుచున్నాడు. ఎవని వాక్కు డగ్గుత్తిక గలదో చిత్తము కరుగునో పదే పదే నా పారవశ్యమున నవ్వునో, ఒకప్పుడు ఏడ్చునో, సిగ్గువీడనివాడై బిగ్గరగా పాడునో, ఆడునో ఇట్టిన భక్తుడు లోకములను పావనము చేయు చున్నాడు. (24)

25శ్లో।। యథాగ్నినా హేమ మలం జహాతి
ధ్మాతం పునః స్వం భజతే చ రూపమ్ ।
ఆత్మా చ కర్మానుశయం విధూయ
మద్భక్తి యోగేన భజత్యథోమామ్ ।।

టీ:- అపిచ.భక్త్యైవాత్మశుద్ధిర్నాన్యత ఇతి. సదృష్టాంతమాహ- యథేతి. యథా అగ్నినా ధ్మాతం తాపి తమేవ. హేమ సువర్ణం అంతర్మలం జహాతి న క్షాళనాదిభిః స్వం నిజం చ రూపం భజతే. ఏవం కర్మా నుశయం కర్మ వాసనాం మాం భజతే మద్రూపతామాపద్యతే.(25)

తా:- భక్తిచేతనే ఆత్మశుద్ధి కలుగునుగాని అన్యము వలన గాదని దృష్టాంతముతో చెప్పుచున్నారు. బంగారమేవిధముగా అగ్నితో పుటము వేయబడినదై తనలో ఉన్న మాలిన్యమును తొలిగించుకొనుచున్నదో. (పైపైన కడుగుట వలన మాలిన్యము తొలగిపోదు) మళ్ళీ తన స్వచ్ఛమయిన పూర్వ రూపమును పొందుచున్నది. అట్లే జీవుడు నా భక్తి యోగముచే కర్మవాసనను పోగొట్టుకొని తర్వాత నా స్వరూపమును పొందుచున్నాడు. (25)

26శ్లో।। యథా యథాత్మా పరిమృజ్యతేఽసౌ
మత్పుణ్య గాథా శ్రవణాభిధానైః ।
తథా తథా పశ్యతి వస్తు సూక్ష్మం
చక్షుర్యథైవాంజన సంప్రయుక్తమ్ ।।

టీ:- నను శ్రు."బ్రహ్మవిదాప్నోతిపరం." "శ్రుతమేవ విదిత్వాతి మృత్యు మేతి" త్యాది శ్రుతిభిః జ్ఞానాదేవా విద్యా నివృత్త్యా త్వత్ప్రాప్తి రవగమ్యతే కుతో భక్తియోగే నేత్యుచ్యతే? తత్రాహ యథేతి. ఆత్మా చిత్తం పరిమృజ్యతే. శోధ్యతే మత్పుణ్య గాథానాం శ్రవణైరభిధానైశ్చ. భక్తేరేవావాంతర వ్యాపారో జ్ఞానం న పృథగిత్యర్థః. (26)

తా:- ఓయీ!" బ్రహ్మవిదాప్నోతిపరం" "తమేవవిదిత్వాతిమృత్యుమేతి" బ్రహ్మనెరిగిన వాడు బ్రహ్మను పొందును అతనిని తెలిసికొని మృత్యు వున తిక్రమించుచున్నాడు. అను మొదలయిన శృతులచే జ్ఞానము వలననే అవిద్య నివర్తించుట నన్ను పొందుటయని తెలియచున్నది. మరి భక్తియోగ మెందుకు అనిన చెప్పుచున్నారు. పవిత్రములయున నా కథలను వినుటచేత, నన్ను కీర్తించుట చేత, ఏ యే ప్రకారము ఈ చిత్తము మాలిన్యము తుడువబడునో ఆ యా ప్రకారము కాటుక బెట్టిన కన్నువలె బ్రహ్మ యొక్క యాథాత్మ్యమగు సూక్ష్మరూపమును చూడ గలుగుచున్నది. భక్తి అవాంతర వ్యాపారమే జ్ఞానమగును కాని వేరుగాదు. (26)

27శ్లో॥ విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే ।
మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ॥

టీ:- కించ జ్ఞానం నామ చిత్తస్య యదాకార పరిణామః. స చ మాం భజతః స్వభావత ఏవ భవతి. న తు యత్నాంతరమపేక్షత ఇతి స దృష్టాంతమాహ - విషయానితి. (27)

తా:- మరి జ్ఞానమనగా చిత్తమునకు కలుగు నా ఆకార పరిణామ మగును. అదియూ నన్ను భజించుట వలన స్వభావముననే కలుగు చున్నది. మరి ప్రయత్నాంతర మేదియునపేక్షింపదు. అని దృష్టాంత సహితముగా చెప్పుచున్నారు. ఇంద్రియసుఖములను ధ్యానించువాని చిత్తము ఆ విషయ సుఖములందే ఆసక్తమగుచున్నది. నన్నునుక్షణము స్మరించు వాని చిత్తము నా యందే లీనమగుచున్నది. (27)

28శ్లో॥ తస్మాద సదభి ధ్యానం యథా స్వప్నమనోరథమ్ ।
హిత్వా మయిసమాధత్స్వ మనోమద్భావ భావితమ్ ॥

టీ:- యస్మాదన్యత్సాధనం తత్ఫలం చ స్వప్న మనోరథవదసదభి ధ్యాన మాత్రం. తస్మాత్తద్విహాయ మయ్యేవ మనః సమాహితం కుర్వితి ప్రకరణార్థముపసంహరతి తస్మాదితి. మద్భావభావితం మమ భావేన భజనేనైవ శోధితం. (28)

తా:- అన్యమగుసాధన, దానిఫలము, స్వప్న మనో రథములవలె ఆ సత్యమును ధ్యానము చేయునట్టిది. ఎందువలన అగునో, అందువలన అట్టి దానిని విడిచి నా యందే మనస్సును ఏకాగ్రము చేయుమని ప్రకరణ విషయమును ఉపసంహరించుచున్నాడు. కల యందు కానవచ్చిన ధనాదికము, మనస్సంకల్పముచే గోచరించు ఔన్నత్యము, ఎట్లు అసత్యములో, అట్లే అసత్యములు అనిత్యములునైన విషయము లను ధ్యానించుటను త్యజించి నా భజన వలన పరిశుద్ధమైన నీ మనస్సు నా యందు నిశ్చలముగానుంచుము. (28)

29శ్లో॥ స్త్రీణాం స్త్రీసంగినాం సంగం త్యక్త్వా దూరత ఆత్మవాన్ ।
క్షేమే వివిక్త ఆసీనశ్చిన్తయేన్మామతన్ద్రితః ॥

తా:- విశేషించి వాత్స్యాయనాదులు చెప్పిన కామ(శాస్త్రమును) మార్గములు తప్పక పరిత్యజించాలి అనుచున్నారు. స్త్రీల స్నేహము స్త్రీలను ప్రేమించు పురుషుల స్నేహము పూర్తిగా త్యజించి నిరుపద్రవ

టీ:- విశేషతో వాత్స్యాయనాద్యుక్తాః కామమార్గాః పరిత్యాజ్యా ఇత్యాహ స్త్రీణామితి. ఆత్మవాన్ ధీరస్సన్ క్షేమే నిర్భయే దేశే. వివిక్తే విజనే.(29)

30శ్లో॥ న తథాస్య భవేత్ క్లేశో బంధశ్చాన్య ప్రసంగతః ।
యోషిత్సంగాద్యథా పుంసో యథా తత్సంగి సంగతః ॥

టీ:- ఏతదేవోపపాదయతి నేతి. అస్య పుంసః యథా తత్సంగి సంగతః క్లేశోభవేత్. యథా చ బంధో యోషిత్సంగత ః. తథా అన్య ప్రసంగతో న భవేదితి. (30)

ఉద్ధవ ఉవాచ

31శ్లో॥ యథా త్వామరవిందాక్ష యాదృశం వా యదాత్మకమ్ ।
ధ్యాయేన్ముముక్షురేతన్మే ధ్యానమ్మే వక్తుమర్హసి ॥

టీ:- మాం చింతయేదిత్యుక్తం తత్ప్రకారం పృచ్ఛతి యథేతి. ధ్యానాంగ ప్రశ్నః యాదృశమితి ధ్యేయ విశేషణ ప్రశ్నః యదాత్మకమితి యస్యైతాని విశేషణాని తత్ స్వరూపప్రశ్నః ఏతన్మేధ్యానం మే వక్తుమర్హసీతి వా పాఠః తత్రాయ మర్థః. ముముక్షుస్త్వా యథా ధ్యాయేత్తన్మే వక్తుమర్హసీతి జిజ్ఞాసోః కథనాయ.మే మమ పునరేతత్ త్వద్దాస్య మేవ పురుషార్థః.

మైన నిర్జన ప్రదేశమునందు కూర్చుండి తొట్రుపాటులేని వాడవై నన్ను ధ్యానింపవలెను. (29)

తా:- దీనినే ఉపపాదించుచున్నాడు. ఆ ప్రకారము నన్ను చింతంచుచున్న వానికి ఇతరులతో స్నేహము వలన దుఃఖ బంధము కలుగదు. పురుషునికి స్త్రీల స్నేహము వలన ఆ స్త్రీల సంగము గలవారి స్నేహము వలనను కల్గునో. (30)

తా:- నన్ను చింతంచవలెనని చెప్పబడినది. ఆ చింతన ప్రకారమును ప్రశ్నించుచున్నారు. ఓ అరవిందాక్షా! మోక్షము గోరువాడు నిన్ను ఏ ప్రకారముగా ఎటువంటి వస్త్రభూషణాలు గలవానిని. ఏ స్వరూపము గల వానిని ధ్యానించవలెను ఈ నీ ధ్యానమును నాకు చెప్పుము. యథా.ఏ ప్రకారము అని ధ్యానాంగ ప్రశ్న. యాదృశము అని ధ్యేయ విశేషణ ప్రశ్న. యదాత్మకమని విశేషణముల గూర్చి ప్రశ్న అని తెలియనగును. ఇచ్చట ఇది దీని యర్థము. ముముక్షు నిన్నెట్లు ధ్యానించును నాకు చెప్పుమని జిజ్ఞాసువునకు చెప్పుటకు నాకు మాత్రము నీ దాస్యమే పురుషార్థము. ధ్యానముచే ఏ కృత్యము లేదు. అట్లేచెప్పబడినది "త్వయోపభుక్తస్రగ్గంధ వాసోలంకార చర్చితాః

న తు ధ్యానేన కృత్యమస్తీతి. తదుక్తం శ్లో."త్వయోప భుక్త స్రగ్గంధ వాసోఽలంకార చర్చితాః, ఉచ్ఛిష్టభోజినో దాసాస్తవ మాయాం జయే మహీ"త్యాది. త్వాం వక్తుమర్హసీతి. పాఠస్సుగమః. (31)

ఉచ్ఛిష్టభోజినో దాసాస్తవ మాయాం జయే మహి" నీవు ధరించిన పూలదండలు పూసికొన్న గంధము కట్టిన వస్త్రము,పెట్టుకొన్న నగలు, పైపూతలు అనువాటిని తీసికొని నీ యెంగిలి అన్నము భుజించు నీ దాసులమై నీ మాయను జయించచుచ్నాము. "త్వంవక్తుమర్హసి" అను పాఠము సుగమము. (31)

శ్రీభగవానువాచ

32శ్లో॥ సమ ఆసన ఆసీనః సమకాయో యథా సుఖమ్ ।
హస్తావుత్సంగ ఆధాయ స్వనాసాగ్ర కృతేక్షణ ॥

టీ:- తత్ర ధ్యానాంగత్వేనాసనప్రాణాయామ ప్రకారమాహ - చతుర్భిః సమఇతి. సమేనాత్యుచ్ఛ్రితే నాతినీచేన ఆసనే కంబళాదౌ సమకాయస్సన్ యథా సుఖమాసీన ఇతి. నాత్ర స్వసికాది నియమ ఇత్యుక్తం. నాసాగ్ర నిరీక్షణం చ చిత్తస్థైర్యాయ. శ్లో."అంతర్లక్ష్యో బహిర్దృష్టిస్థిర చిత్త స్సుసంయత" ఇతి. యోగశాస్త్రోక్తేః. (32)

తా:- అందు ధ్యానాంశముగా ఆసనప్రాణాయామ ప్రకారము చెప్పు చున్నాడు నాలుగు శ్లోకములచే. తొడల యందు హస్తములుంచి ఎక్కువ ఎత్తుపల్లములులేని, కంబళము మొదలయిన అసనమందు నడుము వంచక నిల్పిన ఊర్ధ్వకాయముగలవాడై, (స్వస్తికాద్యాసననియమములేదు) చిత్తస్థైర్యముకొరకు ముక్కు చివరన కంటి చూపును నిల్పినవాడై."అంతర్లక్ష్యో బహిర్దృష్టి స్థిరచిత్తస్సు సంయుత" లోపలి లక్ష్యము, వెలుపలి దృష్టి, స్థిరచిత్తుడు ఇంద్రియ సంయమనము గలవాడు కావలెనని యోగ శాస్త్రమున చెప్పబడినది. (32)

33శ్లో॥ ప్రాణస్సశోధయేన్మార్గం పూర కుంభక రేచకైః ।
విపర్యయేణాపి శనైరభ్యసేన్నిర్జితేంద్రియః ॥

తా:- పూరకము, కుంభకము, రేచకము. నాసికా రంధ్రముల ద్వారా గాలిని లోపలికి పూరించుట, నిల్పుట, విడుచుట అను విధముగా ప్రాణవాయువు నడుచు మార్గమును శోధనము చేయవలెను. పైన చెప్పిన దానికి వ్యతిరేక మార్గమునైన శోధింపవలెను. ఇంద్రియములను

టీ:- ప్రాణస్యేతి. విపర్యయేణ రేచక పూరక కుంభక క్రమేణాపి. యద్వా వామనాడ్యా పూరితం దక్షిణయా త్యజేత్. తయా వా.పూరితం వామయా త్యజేత్. ఇత్యేవం విపర్యయేణ. యథోక్తం యోగే. శ్లో. "ఇడయా పూరయేద్వాయుం త్యజేత్పింగళయా పునః, పింగళాపూరితం వాయు మిడయా చ పరత్వజేది"తి నిర్జితేంద్రియ ఇతి ప్రత్యాహార ఉక్తః.(33)

జయించినవాడై చాలా మెల్లగా ప్రాణాయామము నభ్యసించవలెనని యోగమున చెప్పబడినది. ఈ రీతిగానే ఇడయా పూరయే ద్వాయం త్యజేత్పింగలయా తతః పింగళా పూరితం వాయుమీడయా చ పరిత్యజేత్. ఇడ, కుడిముక్కు రంధ్రము. దాని ద్వారా వాయువునులోనికి పీల్చుట, పింగళ, ఎడమ ముక్కు రంధ్రము. నుండి వాయువును వదలుట అయినను లేదా. పింగళచే వాయువు పూరించి ఇడతో వదులుట. (33)

34శ్లో॥ హృద్యవచ్ఛిన్న మోంకారం ఘంటానాదం బిసోర్ణవత్ ।
ప్రాణేనోదీర్య తత్రాథ పునః సంవేశయేత్స్వరమ్ ॥

టీ:- ప్రాణాయామో ద్వివిధః సగర్భః, అగర్భశ్చేతి తత్ర శ్రేష్ఠత్వాత్ప్రణవ గర్భమాహ- ద్వాభ్యాం హృదీతి. మూలాధారాదారభ్య. అవిచ్ఛిన్నం సంతతం. ఘంటానాద తుల్యం ఓంకారం హృది స్థితం. ప్రాణేన ఉదీర్య ఊర్ధ్వం ద్వాదశాంతపర్యంతం నీత్వాం. కథం బిసోర్ణవత్ కమళనాళ తంతువత్. తత్ర మాత్రాతీతే. స్వరం పంచదశబిందుం స్వవేశయేత్. అథ పునరిత్యస్య. తం చ బిందుశిరస్కం కుర్యాదిత్యర్థః. యద్వా. మూలాధారాదారభ్య మూర్థాంతపర్యంతం బిసతంతువత్ సూక్ష్మం. అవిచ్ఛిన్నం సంతకం హృదిమనసి. ప్రాణేనోదీర్యాభివ్యాప్య. అథ పునస్తత్రై వోంకారే ఘంటానాదతుల్యం స్వరం ఉదాత్తనాదం స్థిరం కుర్యాదితి. 34

తా:- ప్రాణాయామము సగర్భము, అగర్భమని రెండు విధములు. అందులో శ్రేష్ఠమయినది ప్రణవగర్భమని, దానిని చెప్పుచున్నారు. హృదయమందు మూలాధారచక్రము నుండి నిరంతరము ఘంటాధ్వని వంటిదై న ఓంకారమును హృదయ మందున్న దానిని ప్రాణవాయువుతో తామర నూలిపోగువలె ద్వాదశమాత్రల కాల పర్యంతము పైకి పొంది మాత్రాతీతమైన హృదయమందు పదునైదు బిందువుల గల స్వరమును నిలుపవలెను. లేదా మూలాధారము నుండి శిరస్సు పర్యంతము తామర నూలిపోగునువలె సూక్ష్మమై నిరం తరము హృదయమందున్న ఘంట ధ్వని వంటి ఓంకారమును ప్రాణవాయువుచే పైకి తీసికవచ్చి మళ్ళీ ఆ ఓంకారమును ఉదాత్తానుదాత్తనాదమును హృదయమందు స్థిరముగా నిల్పుము.(34)

35.శ్లో॥ ఏవం ప్రణవ సంయుక్తం ప్రాణ సంయమమభ్యసన్ ।
దశకృత్వస్త్రిషవణం మాసాదర్వాగ్జితానిలః ॥

టీ:- ఏవమితి. మాసాదర్వాక్ జితానిలో భవతి. (35)

తా:- ఈ ప్రకారము ఓంకారముతో కూడిన ప్రాణాయామమును పూటకు పదిసార్లు చేయుచు మూడుమార్లు స్నానము చేయుచూయున్న, ఒక నెల తరువాత శ్వాసను జయించినవాడనుగు. (35)

36శ్లో॥ హృత్పుండరీక మంతస్థం ఊర్ధ్వనాశమధో ముఖం
ధ్యాత్వోర్ధ్వముఖ మున్నిద్రమష్ట పత్రం సకర్నికమ్ ।
కర్ణికాయాం న్యసేతూర్య సోమాగ్నీ నుత్తరోత్తరం ॥

టీ:- ఏవం ధ్యానాంగముక్త్వా యాదృశ మిత్యస్యోత్తరం వక్తుం ధ్యేయ పీఠమాహ-సార్ధేన హృత్పుడరీకమితి. అంతస్థ్సం దేహాంతర్వర్తి ఊర్ధ్వనాళ మధో ముఖం. ముకుళితం చ కదళీపుష్ప సంకాశం యదస్తి తద్విపరీతం ధ్యాత్వేత్యర్థః. న్యసేత్ చింతయేత్. (36)

తా:- ఈ విధంగా ధ్యానాంగమును చెప్పియాదృశమ్మను దానికి ఉత్తరమును చెప్పుటకు ధ్యేయ పీఠమును చెప్పుచున్నాడు. దేహము లోపల నున్నది, కాడపైకిగలది, క్రిందముఖముగలదై అరటి పూవు మొగ్గవలె నున్నది, ఎనిమిది రేకులుగది. కర్ణికతో కూడుకొన్నది. హృదయకమలమును, పైపైకి ముఖము గలదానిగను, వికసించిన దానిగనుచేసి, ధ్యానించి, పైస్థితికి విపరీతముగా ఆ కర్ణిక యందు ఒకరి తరువాత ఒకరిని సూర్యచంద్రాగ్నులను ఉంచునట్లు భావించి చింతించవలెను. (36)

37శ్లో॥ వహ్నిమధ్యే స్మరేద్రూపం మమైత ద్ధ్యానమంగళమ్ ।
సమం ప్రశాంతం సుముఖం దీర్ఘచారు చతుర్భుజమ్ ॥

టీ:- సవిశేషణం ధ్యానమాహ-షడ్భిః వహ్నిమధ్య ఇతి. ధ్యాన మంగళం ధ్యానస్య శుభవిషయం సమం అనురూపావయవం దీర్ఘాశ్చార వశ్చత్వారో భుజా యస్మిన్ తత్తథా. (37)

తా:- సవిశేషణ ధ్యానమును ఆరుశ్లోకములతో చెప్పుచున్నారు. వహ్నిమధ్యే అని. అగ్ని మధ్య మందు ధ్యానమునకు శుభవిషయమై, అనురూపమైన అవయవములుగలదై, ప్రశాంతమై, అందమైన ముఖము గలదై, పొడవులై సుందరములైన, నాలుగు బాహువులు గలదైన నా రూపమును స్మరింపవలెను. (37)

38శ్లో॥ సుచారు సుందర గ్రీవం సుకపోలం శుచిస్మితమ్ ।
సమానకర్ణ విన్యస్తస్ఫురన్మకర కుండలమ్ ॥

టీ:- సుచార్వితి. సుచారు అతిరమ్యం. సమానయో కర్ణయోర్విన్యస్తే స్ఫురతీ మకరాకారే కుండలే యస్మిన్ తత్. (38)

తా:- అతి రమ్యమైన చక్కని కంఠము గలది, అందమైన చెక్కిళ్ళు గలది, చక్కని నవ్వు గలది, సరిసమానముగా వుండు కర్ణములందు, ప్రకాశించు మొసలి, రూపమునున్న చెవి పోగులు గలదానిని స్మరించవలెను. (38)

39శ్లో॥ హేమాంబరం ఘనశ్యామం శ్రీవత్స శ్రీనికేతనమ్ ।
శంఖ చక్రగదా పద్మ వనమాలా విభూషితం ॥

టీ:- హేమేతి. శ్రీవత్సశ్రియోగ్ని కేతనం వక్షసి దక్షిణ వామ హస్తాభ్యాం యుక్తమిత్యర్థః. (39)

తా:- సువర్ణకాంతులను వెదజల్లు పసువు వర్ణముగల పట్టుదిగలదై. మబ్బువలె నీలివర్ణముగలిగి, రొమ్మునందు శ్రీవత్సమను పుట్టుమచ్చ కును, ఎడమ వనమాలాదులచే అలంకరింపబడిన నా రూపమును ధ్యానించవలెను. (39)

40శ్లో॥ నూపురైర్విలసత్పాదం కౌస్తుభ ప్రభయా యుతమ్ ।
ద్యుమత్కిరీట కటక కటిసూత్రం గదాయుతమ్ ॥

టీ:- నూపురైరితి. ద్యుమద్భిః కిరీటాదిభిః ఆసమంతాత్ యుతం అలంకృతం. (40)

తా:- అందియలతో ప్రకాశించు పాదములు గలది, కౌస్తుభమణి కాంతులతో కూడినది, మెరిసే కిరీటము, చేతి కిరీటము, మొలత్రాడు, భుజకీర్తులు అనువానిచే ప్రకాశించునది. (40)

41శ్లో॥ సర్వాంగ సుందరం హృద్యం ప్రసాద సుముఖేక్షణమ్ ।
సుకుమార మభిధ్యాయే త్సర్వాంగేషు మనోదధత్ ॥

తా:- అన్ని అవయవములు సుందరముగా ఉండునది ప్రసన్నమయిన ముఖము, కన్నులు గలది. కోమలమునగు రూపమునందు అన్ని అవయవములందు మనస్సు నుంచుచూ ధ్యానించవలెను. (41)

టీ:- సర్వేతి. ప్రసాదేన శోభనం ముఖ మీక్షణం చ యస్మిన్ తత్. సుకుమారం అతికోమలం. (41)

42శ్లో॥ ఇంద్రియాణీంద్రియార్థేభ్యో మనసా కృష్యతన్మనః ।
బుద్ధ్యా సారథినా ధీరాః ప్రణయేన్మయి సర్వతః ॥

టీ:- సవిశేషణం ధ్యానముపసంహరతి ఇంద్రియాణీతి. ప్రకర్షే నయేత్. సర్వతః సర్వాంగయుక్తే మయి. (42)

తా:- విశేషణములలో కూడిన ధ్యానమునుపసంహరించుచున్నాడు. శ్రోత్రాదులగు ఇద్రియములను, ఇంద్రియార్థములగు శబ్దాదుల నుండి మనస్సుచే ఆకర్షించి ఆ మనస్సును బుద్ధియను సారథి ద్వారా సర్వాంగ శోభితుడినైన నా యందు అధికముగా పొందజేయవలెను. (42)

43శ్లో॥ తత్సర్వవ్యాపకం చిత్తమాకృష్యైకత్రధారయేత్ ।
నాన్యాని చింతయేద్భూయః సుస్మితం భావయేన్ముఖమ్ ॥

టీ:- యాదృశమిత్యస్యోత్తరత్వేన సవిశేషణముక్త్వా యదాత్మకమిత్యస్యోత్తరతయా శనైర్విశేషణ త్యాగేన ధ్యానమేవ సమాధిపర్యంతమాహ త్రిభిః తదితి. ఏకత్రాంగే. అన్యాన్యంగాని న చింతయేత్ ఏకత్రేతి యదుక్తం తదేవాంగం దర్శయతి సుస్మితమితి. (43)

తా:- ఎటువంటి వానిని అనుదానికి ఉత్తరముగా సవిశేషణమును చెప్పి, యదాత్మకం = ఏ స్వరూపమును దానికి, మెల్లగా విశేషణము త్యాగము చేయుటచేత ధ్యానమునే సమాధి పర్యంతము. మూడు శ్లోకములచే చెప్పుచున్నాడు. అట్లు నా సర్వాంగములందు వ్యాపించిన చిత్తమును ఆకర్షించి ఒక్క చోటనే నిల్పవలయును ఇతరములగు సంగములను వేనినీ ధ్యానించగూడదు చక్కని చిరునవ్వుగల నా ముఖమును ధ్యానించవలెను. (43)

44శ్లో॥ తత్ర లబ్ధపదం చిత్త మాకృష్యవ్యోమ్ని ధారయేత్ ।
తచ్చ త్యక్త్వా మదారోహో న కించిదపి చింతయేత్ ॥

తా:-ఆ సుస్మితముఖమునందు స్థిరత్వము నొందిన చిత్తమును ఆకర్షించి సర్వకారణ రూపమునందు నిల్పవలెను. ఆ కారణరూపమును త్యజించి

టీ:- తత్రేతి. వ్యోమ్ని సర్వకారణరూపే తచ్చ కారణత్వమపి త్యక్త్వా. మదారోహః మయి శుద్ధే బ్రహ్మణ్యారూఢస్సన్. న కించిత్ ధ్యాయేత్ ధ్యాతృధ్యేయ విభాగమపి న చింతయేత్. (44)

శుద్ధబ్రహ్మమునందు ఆరూఢుడై ఏ కొంచెమును చింతించకూడదు. ధ్యాత్యా ధ్యేయ విభగమును కూడా చింతించరాదు. (44)

45శ్లో॥ ఏవం సమాహితమితి ర్మామేవాత్మానమాత్మని ।
విచష్టే మయి సర్వాత్మన్ జ్యోతిర్జ్యోతిషి సంయుతమ్ ॥

తా:- ఇట్లు సమాహిత చిత్తుడై తన యందు ఆత్మయై యున్న నన్నే గాంచుచు సర్వాత్ముడనైన నాయందు తన్ను గాంచుచు జ్యోతియందు కూడిన జ్యోతివలెనగును. (45)

టీ:- ఏవమితి. మామేవాత్మని విచష్టే ఆత్మానం చ సర్వాత్మని మయి సంయుతం విచష్టే. జ్యోతిర్జ్యోతిషి సంయుతమివేతి. (45)

46శ్లో॥ ధ్యానేనేత్థం సుతీవ్రేణ యుంజతోయోగినో మనః ।
సంయాస్యత్యాశు నిర్వాణం ద్రవ్యజ్ఞాన క్రియా భ్రమః ॥

తా:- ఇట్టి సమాధి పర్యంత ధ్యానము యొక్క ఫలమును చెప్పు చున్నాడు. ఈ ప్రకారము చాలా తీక్ష్ణణమయిన ధ్యానముతో మనస్సును నిల్పుచున్న యోగికి ఆధిభూతము, ఆధిదైవము, ఆధ్యాత్మికము అను త్రివిధ భ్రాన్తిలేక దృశ్యము, ద్రష్ట, దర్శనము అను వాని భ్రమ శీఘ్రముగా శాంతిని పొందుచున్నది అంత, ఆ సర్వమూ బ్రహ్మగా తెలియనగును. 4 (46)

టీ:- ఏవం భూతసమాధి పర్యంత ధ్యానస్య ఫలమాహ - ధ్యానేనేతి. మనో యుంజతః సమాదధతః ద్రవ్యజ్ఞాన క్రియా భ్రమఃఆధిభూతాది దైవాధ్యాత్మ రూపః దృశ్య ద్రష్టృ దర్శనరూపో వా భ్రమః. నిర్మాణం శాంతిం సమ్యగ్జ్ఞ స్యతీతి. (46)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**చతుర్దశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**చతుర్దశాధ్యాయము సమాప్తము.**

## పంచదశోఽధ్యాయః

**శ్రీభగవానువాచ**

1శ్లో॥ జితేంద్రియస్య యుక్తస్య జితశ్వాసస్య యోగినః ।
మయిధారయతశ్చేతః ఉపతిష్ఠన్తి సిద్ధయః ॥

టీ:- శ్లో. తతః పంచదశే ప్రోక్తాస్సిద్ధయో ధారణానుగాః, శ్రీవిష్ణుపద సంప్రాప్తావంతరాయతయా మతాః.ఏవం మనో యుంజతో యోగినోఽంతరావిర్భవంత్యః సిద్ధయోఽప్యంతరాయప్రాయా ఏవ. అతస్తాః పరిహృత్య పరమేశ్వర పర ఏవ భవేదితి వక్తుం సిద్ధీరాహ జితేంద్రియ స్యేతి. యుక్తస్య స్థిరచిత్తస్య. (1)

**ఉద్ధవ ఉవాచ**

2శ్లో॥ కయాధారణయాకాస్విత్కథం వా సిద్ధిరచ్యుత ।
కతివా సిద్ధయో బ్రూహి యోగినాం సిద్ధిదో భవాన్ ॥

టీ:- కయేతి. స్విదితి వితర్కే. కాస్విత్ కిన్నామ? కథం వా కీదృశీ వా? ధారణాశ్చ కతీతి ప్రశ్నాంతరే వా శబ్దః త్వమేవైతజ్ఞానాసి నాన్య ఇత్యాశయేనాహ-యోగినామితి. (2)

## పంచదశాధ్యాయము

తా:- ఈపదిహేనవ అధ్యాయమున చిత్తధారణానుసారములయి కలుగు సిద్ధులు, అణిమాదులు చెప్పబడినవి. అవి శ్రీమహావిష్ణు పదమును సంప్రాప్తించుటకు అంతరాయములు(విఘ్నము)లుగా చెప్పబడినవి. ఈ ప్రకారము మనస్సును సమాధియందు నిలుచున్న యోగికి లోన ఆవిర్భవించునట్టి అణిమాది సిద్ధులు సయితము విఘ్న ప్రాయములేయగును కావున యోగి వానిని పరిహరించి పరమేశ్వర పరుడే కావలెనని చెప్పుటకు సిద్ధులను చెప్పుచున్నారు. ఇంద్రియములను జయించినవాడై, ప్రాణాయామపరుడై శ్వాసను జయించినవాడై, నా యందు నిశ్చలముగా చిత్తమును నిల్పుచున్న యోగిని అణిమాది సిద్ధలు వాటి యంతట అవేకలుగును.(1)

**ఉద్ధవుడు చెప్పుచున్నాడు.**

తా:- ఓ అచ్యుతా ఏ ధారణాయోగముచే ఏ సిద్ధి కలుగును. ఆ సిద్ధి స్వరూపమెట్టిది? సిద్ధులెన్ని? నీవు యోగులకు సిద్ధినిచ్చు వాడవు కావున తెల్పుము. (2)

### శ్రీభగవానువాచ

3శ్లో॥ సిద్ధయోఽష్టాదశ ప్రోక్తా ధారణా యోగపారగైః ।
తాసామష్టౌ మత్ప్రధానా దశైవ గుణహేతవః ॥

టీ:- సిద్ధయఇతి. ధారణాశ్చ అష్టాదశేత్యనుషంగః. యోగపారగైరితి త్రి కాలజ్ఞత్వాదిక్షుద్రసిద్ధీరన్యేఽపి జానంతీతి భావః. అహమేవప్రధానం ముఖ్యః స్వభావతః ఆశ్రయో యాసాం తాః మత్సారూప్యం ప్రాప్తేషు కించన్న్యూ నా భవంతీతి భావః. గుణహేతవః సత్త్వోత్కర్ష హేతుకాః (3)

### భగవంతుడు తెల్పుచున్నాడు

తా:- ధ్యానయోగ సిద్ధిని గాంచిన యోగులచే త్రికాల జ్ఞానము మొదలుగు క్షుద్ర సిద్ధులను, ఇతరములను కూడా వారెరుగుదురని భావము సిద్ధులుధారణలును పద్దెనిమిది చెప్పబడినవి. వాటిలో నేను ముఖ్యముగా గల సిద్ధులు స్వభావమును బట్టి నేను ఆశ్రయుడనుగా గలవి ఎనిమిది మాత్రము. మిగిలిన పదిసిద్ధులు సత్వగుణోత్కర్ష హేతువుగా గలవి యగును. (3)

4శ్లో॥ అణిమా మహిమా మూర్తేర్లఘిమా ప్రాప్తిరింద్రియైః ।
ప్రాకామ్యం శ్రుతదృష్టేషు శక్తిప్రేరణ మీశితా ॥

టీ:- తాః స్వరూపేణోద్దిశతి సార్ధైః పంచభిః. అణిమేతి అణిమా మహిమా మహిమా లఘిమా చ మూర్తేర్దేహస్యతి స్రస్సిద్ధయః ప్రాప్తిర్నామ సిద్ధిః సర్వప్రాణినా మింద్రియైస్సహ తత్తదధిష్ఠాతృదేవతారూపేణ సంబంధ ఇత్యర్థః. శ్రు తేషుపార లౌకికేషు దృష్టేషు దర్శన యోగ్యేష్వపి సర్వేషు భూవివరాదపి హితేష్వపి ప్రాకామ్యం భోగదర్శన సామర్థ్య సిద్ధిః. శక్తిర్నామ మాయా. తదంశభూతానాం ప్రేరణం. తత్రేశ్వరే

తా:- వానిని ఐదున్నర శ్లోకములచే స్వరూపములతో నిర్దేశించుచు న్నారు. మిక్కిలి సూక్ష్మరూపమును పొందుట, మిక్కిలి స్థూలరూపమును పొందుట, తేలిక రూపమును పొందుట. (అణిమా, మహిమా, లఘిమా) దేహమునకు సంబంధించినవి మూడు సిద్ధులు. ప్రాప్తియను సిద్ధి ఇంద్రియములతో గూడి ఆయా ఇంద్రియాధి దేవతల రూపముతోడి సంబంధము గలది. చూపబడిన, వినబడినవగు పారలౌకికములు దర్శన యోగ్యమును అగు అన్నింటియందు, భూ బిలాదులు కప్పబడిన వాని యందును, ప్రాకామ్యమను సిద్ధి, భోగవస్తు దర్శన యందు సామర్థ్య రూపమయిన శక్తి ప్రాకామ్య సిద్ధియగును. శక్తియనగా

మాయాయాః అన్వేషు తదంశ భూతానాం ప్రేరణం ఈశితానామ సిద్ధిః. (4)

మాయ ఆ మాయ అంశమున జనించిన ఐశ్వర్య జ్ఞానాదిశక్తులయొక్క పైకి తెలియ వచ్చునది. అందు ఈశ్వరునందు మాయాప్రేరణము ఇతర ప్రాణులందు మాయాంశములైన జ్ఞానాది శక్తి ప్రేరణము ఈశిత్వ సిద్ధియగును. (4)

5శ్లో॥ గుణేష్వ సంగో వశితా యత్కామస్తదవస్యతి ।
ఏతామే సిద్ధయః సౌమ్య అష్టావౌత్పత్తి కామతాః ॥

టీ:- గుణేష్వితి. విషయభోగేష్వసంగో వశితానామ సిద్ధిః. యత్కామః యద్యత్సుఖం కామయతే తత్తదవస్యతి తస్య సీమానాం ప్రాప్నోతీతి సిద్ధిః. ఔత్పత్తికాః స్వాభావిక్యో నిరతిశయాశ్చేర్థః. (5)

తా:- విషయ భోగములందు ఆసక్తి లేకుండుట వశితాసిద్ధి అగును. ఏ యే సుఖము ను కోరుచున్నాడో దానియవధిని హద్దును పొందునది, ఇవి నాకు సంబంధించిన సిద్ధులు ఎనిమిది. స్వాభావికములు నిరతిశయములు అని ప్రసిద్ధికెక్కినవి. (5)

6శ్లో॥ అనూర్మిమత్త్వం దేహేఽస్మిన్ దూరశ్రవణ దర్శనమ్ ।
మనోజవః కామరూపం పరకాయ ప్రవేశనమ్ ॥

టీ:- గుణహేతుకాస్సిద్ధీరాహ అనూర్మిమత్త్వమితి. అనూర్మిమత్త్వం క్షుత్పిపాసాదిరాహిత్యం. దూరే శ్రవణం దర్శనం చేతి ద్వేసిద్ధీ. మనోవేగేన దేహస్య గతిః. కామితరూప ప్రాప్తిః పరకాయే ప్రవేశః. (6)

తా:- గుణహేతుకములయిన సిద్ధులను చెప్పుచున్నారు. ఈ దేహము నందు ఆకలి దప్పులు లేకుండుట. దూరదేశము నందు శబ్దమును వినుట. రూపమును చూచుటయనునని రెండు సిద్ధులు. మనోవేగమున దేహ గమనమును, కామిక రూపప్రాప్తి, ఇతరుల శరీరములందు ప్రవేశించుట. (6)

7శ్లో॥ స్వచ్ఛంద మృత్యుర్దేవానాం సహక్రీడాను దర్శనమ్ ।
యథా సంకల్ప సంసిద్ధి రాజ్ఞాఽ ప్రతిహతా గతిః ॥

టీ:- స్వచ్ఛందమృత్యురితి స్వేచ్ఛామృత్యుః. అప్సరోభిస్సహ దేవానాం యాంః క్రీడాస్తాసామనుదర్శనం. సంకల్పానురూపప్రాప్తిః. అప్రతిహతా ఆసమంతాద్గతిర్యస్యాస్సా ఆజ్ఞా చేత్యేతాదశ. (7)

తా:- తన ఇచ్ఛవచ్చినపుడు మరణించుట, అప్సరసలతో కూడిన దేవతల జలక్రీడా విహారాదులను చూచుట, తన సంకల్పాను రూపమయిన ప్రయోజన సిద్ధి, అడ్డులేనిదై తనంతట తాను చలామణి యగు ఆజ్ఞ అనునదిచేరి పది సిద్దులు. (7)

8శ్లో॥ త్రికాలజ్ఞత్వ మద్వంద్వం పరచిత్తాద్యభిజ్ఞతా ।
అగ్న్యర్కాంబు విషాదీనాం ప్రతిష్టం భోఽ పరాజయః ॥

టీ:- క్షుద్రసిద్ధీశ్చ పంచాహ-త్రికాలజ్ఞత్వమితి. అద్వంద్వం శీతోష్ణా ద్యనభి భవః అగ్న్యాదీనాం స్తంభనం. (8)

తా:- క్షుద్ర సిద్దులనయిందింటిని చెప్పుచున్నాడు. భూత భవిష్య ద్వర్తమాన కాలముల స్థితిని తెలిసికొనుట. శీతోష్ణ ద్వంద్వ సహనము. ఇతరుల ఉద్దేశములు తెలిసికొనుట అగ్ని, సూర్య, జల, విషములను స్తంభింప చేయుట, ఎవరి వలన అపజయము లేకుండుట, అనునవి క్షుద్ర సిద్దులు. (8)

9శ్లో॥ ఏతాశ్చోద్దేశతః ప్రోక్తా యోగధారణ సిద్ధయః ।
యయా ధారణయా యాస్యాద్యథా వాస్యాత్తన్నిబోధ మే ॥

టీ:- ఏతాఇతి. తత్తద్ధారణాదిభిస్సహ విశేషతో నిరూపయతి యయేతి యావత్సమాప్తి. (9)

తా:- ఆయా ధారణములతో గూడ ఆ సిద్ధులను విశేషముగా నిరూపించుచున్నాడు. ఇవి ధరణాయోగముచే గలుగు సిద్ధులు, ఉద్దేశించిన క్రమున చెప్పబడినవి. ఏ ధారణచే ఏ సిద్ధిగలుగును ఏ విధముగా గల్గును దానిని నా వలన వినుము. (9)

10శ్లో॥ భూతసూక్ష్మాత్మని మయి తన్మాత్రం ధారయేన్మనః ।
అణిమా న మవాప్నోతి తన్మాత్రోపాసకో మమ ॥

టీ:- భూతేతి. భూతసూక్ష్మోపాధౌ మయి. తన్మాత్రం భూతసూక్ష్మాకారం సః తన్మాత్రోపాసకః. మమ మదీయ మాణిమానం.(10)

తా:- పృథివ్యాది పంచభూతముల సూక్ష్మ స్వరూపుడనైన నా యందు భూతసూక్ష్మాకారమైన మనస్సును నిల్పుచున్నవాడు నా సంబదియైన అణిమాది సిద్ధిని పొందుచున్నాడు.(10)

11శ్లో॥ మహత్యాత్మన్మయి పరే యథా సంస్థం మనోదదత్ ।
మహిమాన మవాప్నోతి భూతానాంచ పృథక్ పృథక్ ॥

టీ:- మహతీతి. మహత్తత్త్వోపాధౌ మయి. యథా సంస్థం మహత్త త్వాకారం భూతానాం చేతి ఆకాశాది భూతోపాధౌ చ మయి ధారయన్ తత్తద్భూత మహిమానం ప్రాప్నోతీత్యర్థః. (11)

తా:- మహత్తత్త్వోపాధి గల పరుడనైన నా యందు ఆ మహత్తత్త్వా కారమైన మనస్సును నిల్పుచున్నవాడై మహిమయను సిద్ధిని పొందు చున్నాడు . ఆకాశాది భూతముల ఉపాధి గల నాయందు మనస్సును నిలుపుచున్నవాడై, ఆ యా భూతముల యొక్క మహత్త్వమును వేరు వేరుగా పొందుచున్నాడు. (11)

12శ్లో॥ పరమాణుమయే చిత్తం భూతానాం మయిరంజయన్ ।
కాలసూక్ష్మార్థతాం యోగీలఘిమానమవాప్నుయత్ ॥

టీ:- పరమాణుమయఇతి. వాయ్వాదిభూతానాం యే పరమాణవ స్తన్మయే తదుపాధౌ మయి చిత్తం రంజయన్ ధారయన్ యోగీ కాలసూక్ష్మార్థతాం కాలపరమాణూపాధిరూపతామితి లఘుత్వవివరణం తదుక్తం. శ్లో."స కాలంః పరమాణుర్వైయో భుఙ్క్తే పరమాణుతామి"తి. 12

తా:- వాయువు మొదలుగు పరమాణువులుపాధిగా గల నా యందు చిత్తమును స్థిరముగా నిల్పి ధ్యానించుచున్న యోగి కాలము యొక్క పరమాణువులుపాధిగా గల రూపత్వమును, లఘిమా సిద్ధిని పొందును. అది చెప్పబడినదిట. "సకాలః పరమాణుర్వై యో భుంక్తే పరమాణుతాం" ఆ కాలము పరమాణువగును పరమాణుత్వమును పొందుచున్నాడనగా పరమాణుపాసకుడు పరమాణుధర్మమును పొందుచున్నాడు "అని"(12)

13శ్లో॥ ధారయన్మయ్య హంతత్త్వే మనోవైకారికేఽఖిలమ్ ।
సర్వేంద్రియాణా మాత్మాత్వం ప్రాప్తిం ప్రాప్నోతి మన్మనాః ॥

టీ:- ధారయన్నితి. వైకారికాహంకారోపాధౌ మయి. అఖిలం ఏకాగ్రం ఆత్మత్వం అధిష్టాతృత్వం. అత్రహేతుః. మన్మనాః మయి మనోధారణా ప్రభావాదేవ భవతి నాత్రాతీతహేతురనుసంధేయ ఇతి భావః. ఏవం శ్లో."మద్ధారణానుభావేన మద్యోగబలమాశ్రిత" ఇత్యాదిషు ద్రష్టవ్యం. 13

తా:- సాత్వికమయిన అహంకారముపాధిగాగల నా యందు ఏకాగ్రమయిన మనస్సును నిల్పుచూ అన్ని ఇంద్రియముల యొక్క అధిష్ఠాతల ధర్మమును, ప్రాప్తియను సిద్ధిని పొందుచున్నారు. ఇందుకు హేతువు మన్మనాః అని. అనగా నా యందు మనోధారణ ప్రభావము వలననే ప్రాప్తిసిద్ధి కలుగుతుంది. ఇందు ఇతర హేతువనుసంధానించ పనిలేదు అని భావము. ఈప్రకారమే "మద్ధారణాను భావేన మద్యోగబల మాశ్రిత " నా యందు ధారణా ప్రభావము చేతనే నా యోగబలము నాశ్రితుడగును. అనుచోటకూడా ఇదే రీతిన అనుసంధానించవలెను. 13

14శ్లో॥ మహత్యాత్మనియః సూత్రే ధారయేన్మయి మానసమ్ ।
ప్రాకామ్యం పారమేష్ఠ్యం మే విందతేఽవ్యక్త జన్మనః ॥

టీ:- మహతీతి. క్రియాశక్తిప్రధానం మహత్తత్త్వమేవ సూత్రం తదుపాధౌ మయి. సః మే పారమేష్ఠ్యం సర్వోత్కృష్టం ప్రాకామ్యం విందతే. కథం భూతస్య అవ్యక్తం జన్మ యస్య తస్య సూత్రస్య తదుపాధేః మమ్యేత్యర్థః. (14)

తా:- క్రియా శక్తి ప్రధాన భూతమయిన మహత్తత్త్వము సూత్రాత్మ ఉపాధిగాగల నా యందు ఎవడు మనస్సు నిల్పి ధ్యానించువాడై తెలియని జన్మ కలవాడైన నా యొక్క సర్వోత్కృష్ట మైన ప్రాకామ్యమను సిద్ధిని పొందుచున్నారు. (14)

15శ్లో॥ విష్ణౌత్ర్యధీశ్వరే చిత్తం ధారయేన్ కాల విగ్రహే ।
స ఈశిత్వమవాప్నోతి క్షేత్రజ్ఞ క్షేత్ర చోదనామ్ ॥

తా:- త్రిగుణాత్మికయగు మాయకు నియంతయై అహోరాత్రాది కాలరూపమున గణించుకాల స్వరూపుడై అంతర్యామినైన నా యందు

టీ:- విష్ణావితి. త్ర్యధీశ్వరే త్రిగుణమాయా నియంతరి అతఏవ కాల విగ్రహే ఆకలయితృరూపే అంతర్యామిణి. ఈశిత్వం విశినష్టి క్షేత్రజ్ఞానాం జీవానాం క్షేత్రాణాం తదుపాధీనాం చ చోదనాం ప్రేరణం. న తు విశ్వసృష్ట్యాది కర్తృత్వలక్షణమిత్యర్థః. (15)

చిత్తము నిలిపి ధ్యానించుచున్న అతడు యోగి. జీవులను వారి క్షేత్రము లగు శరీరములను వారి కుపాధులగు అంతఃకరణాదులను వాని వాని వ్యవహారమును నిర్వహింప పురికొల్పునదైన (విశ్వమును సృజించు బ్రహ్మ మొదలయిన వారిని ప్రేరేపించునది కాదు) ఈశిత్వమను సిద్ధిని పొందుచున్నాడు. (15)

16శ్లో॥ నారాయణే తురీయాఖ్యే భగవచ్ఛబ్ద శబ్దితే ।
మనోమయ్యా దధద్యోగీ మద్ధర్మా వశితా మియాత్ ॥

టీ:- నారాయణఇతి. తురీయాఖ్యే. శ్లో. "విరాడ్ఢిరణ్యగర్భశ్చ కారణం చేత్యుపాధయః, ఈశస్య యత్త్రిభిర్హీనం తురీయం తత్పదం విదు"రితి. ఏవం లక్షణే. శ్లో. "ఐశ్వర్యస్య సమగ్రస్య వీరస్య యశసశ్శ్రియః, జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా."తద్వతి భగచ్ఛబ్దశబ్దితే. (16)

తా:- తురీయుడు అను పేరు గల (ఈశ్వరునికి విరాట్, హిరణ్యగర్భ, మాయ, అని మూడు ఉపాధులు. ఈ మూడు ఉపాధులు లేని వాడు) తురీయుడగు అందరికీ అధికుడగు భగవం తుడను శబ్దముచే పలుకబడువాడు. "ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః జ్ఞాన వైరాగ్యయోశ్చేవ షణ్ణాంభగ ఇతీరణా". సమగ్రమయిన ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము ఈ ఆరును భగ మని చెప్పుదురు ఇవి కలవాడు భగవంతుడు. నారాయబడనైన నా యందు మనస్సునుంచుచున్న యోగి నా ధర్మము గలవాడై వశిత్వమను సిద్ధిని పొందుచుచున్నాడు. (16)

17శ్లో॥ నిర్గుణే బ్రహ్మణి మయి ధారయన్విశదం మనః ।
పరమానందమాప్నోతి యత్ర కామోఽవసీయతే ॥

తా:- ఏ గుణములు స్ఫురింపని నా యందు నిర్మలమయిన మనస్సు నిల్పి ధ్యానించు యోగి పరమానంద స్వరూపుని నన్ను పొందుచున్నాడు. ఏ పరమానంద స్వరూపమునందు సమస్తమైన కామము తదంశము

టీ:- నిర్గుణఇతి. యత్ర పరమనందరూపే. సర్వోఽపి కామస్తదంశ భూతః, అవసీయతే సమాప్యతే.(17)

సమాప్తిగాంచుచున్నదో అట్టి పరమానందరూపుని, నన్ను పొందు చున్నాడు. (17)

18శ్లో॥ శ్వేతద్వీప పతౌ చిత్తం శుద్ధే ధర్మమయే మయి ।
ధారయన్ శ్వేతతాం యాతి షడూర్మిరహితో నరః ॥

టీ:- అతః పరం గుణహేతుకాస్సిద్ధీరాహ - శ్వేత ద్వీపేతి. శుద్ధే సత్త్వాత్మకే శ్వేతతాం శుద్ధ స్వరూపతాం. (18)

తా:- ఆ తరువాత గుణహేతుకములయిన సిద్ధులను చెప్పుచున్నారు. శ్వేతద్వీపమునకు పతియై శుద్ధసత్త్వమూర్తియై ధర్మస్వరూడనైన నా యందు చిత్తము నిల్పి ధ్యానించువాడు క్షుత్పిపాసలు శోకమోహములు జన్మమరణములు లేనివాడై, నరుడు శుద్ధ స్వరూపుడై నా ధర్మమును పొందుచున్నాడు. (18)

19శ్లో॥ మయ్యాకాశాత్మని ప్రాణే మనసాఘోష ముద్వహన్ ।
తత్రోపలబ్ధా భూతానాం హంసో వాచః శృణోత్యసౌ ॥

టీ:- మయీతి. ఆకాశాత్మా యః ప్రాణః సమష్టిరూపః తద్రూపే మయి. మనసా ఘోషం నాదం చింతయన్ అసౌ హంసః జీవః తత్ర ఆకాశే ఉపలబ్ధా జ్ఞాతాసన్. తత్రస్థాః విచిత్రాః వాచః శృణోతి. యద్వా. తత్రాకాశే. ఉపలబ్ధాః. అభివ్యక్తాః. యా భూతానాం వాచః తాః దూరతః శృణోతి. (19)

తా:- ఆకాశాత్ముడై సమష్టి ప్రాణరూపుడనైన నా యందు మనస్సుచే నాదమును చింతించుచు హృదయాకాశమునుండి ప్రాణాపానముల రాకపోకలను ధ్యానించువాడగు ఈ జీవుడు, ఆ యాకాశమునందు అభివ్యక్తములైన వివిధములైన భూతముల వాక్కులను దూరము నుండి యే వినుచున్నాడు. (19)

20శ్లో॥ చక్షుస్త్వష్టరి సంయోజ్య త్వష్టారమపి చక్షుషి ।
మాం తత్ర మనసాధ్యాయన్ విశ్వం పశ్యతి సూక్ష్మదృక్ ॥

టీ:- దూరశ్రవణముక్త్వా దూరదర్శనమాహ చక్షురితి. త్వష్టా ఆదిత్యః తస్మిన్నపరిచ్ఛిన్నే చక్షుః సంయోజ్య తం చక్షుషి సంయోజ్య. తత్రోభయ సంయోగే మాం ధ్యాయన్ విశ్వం దూరతః పశ్యతి. (20)

తా:- చక్షురింద్రియమును ఆదిత్యుని యందుంచి లేదా చక్షురింద్రియ మునందు ఆదిత్యుడినైన నన్ను గూర్చి, ఆ యుభయుల సంయోగమందు నన్ను మనస్సుచే ధ్యానించువాడు సూక్ష్మ దృష్టి గలవాడై జగత్తును దూరము నుండి యే చూచుచున్నాడు. (20)

21శ్లో॥ మనోమయుసు సంయోజ్య దేహంతదనువాయునా ।
మద్ధారణాను భావేన తత్రాత్మా యత్రవై మనః ॥

టీ:- మన ఇతి. మనో దేహం చ తదనువర్తినా వాయునా సహ మయి సుసంయోజ్య యా మద్ధారణా క్రియతే తస్యాః ప్రభావేన. యత్ర మనో యాతి. తత్రాత్మా దేహో యాతీత్యర్థః. యద్వా. మనః కర్తృ. ఆత్మానాం వాయునా సహ దేహం చ మయి సుసంయోజ్య యత్ర యాతి. తదను తత్ర దేహో యాతీతి. (21)

తా:- మనస్సును దేహమునందు అనువర్తించు వాయువుతో చక్కగా జోడించి ధారణా యోగముచే నన్ను ధ్యానించువాడు. ఆ యోగ ప్రభావముచే తన మనస్సు ఎక్కడికి పోతున్నదో అక్కడికి తన దేహమును తీసుకొని పోగలుగుచున్నాడు. లేదా కర్తయగు మనస్సు తన్ను, (దేహమును) వాయువుతో నా యందు సమకూర్చి ఎక్కడికి పోయిననూ దాని వెంట దేహము పోవును అని. (21)

22శ్లో॥ యదా మన ఉపాదాయ యద్యద్రూపం బుభూషతి ।
తత్తద్భవేన్మనో రూపం మద్భోగ బల మాశ్రయః ॥

టీ:- యదేతి. మనః ఉపాదాయ ఉపాదానకారణం కృత్వా. యద్యద్దేవాది రూపం భవితుమిచ్ఛతి. తత్తన్మనోరూపం మనసో౽భీష్టం

తా:- యోగి ఎప్పుడు తన మనస్సునుపాదానకారణముగా చేసి ఏ యే దేవతా రూపమును తాను కాగోరుచున్నాడో, అచింత్య శక్తినై నానాకారుడనై యున్న నా యందు మనస్సును పెట్టి ధారణాయోగ మును చింతించుచున్నాడో అప్పుడు ఆ నా ధారణాయోగ ప్రభావము

రూపం యోగీ భవేత్ కుతః. యతో మద్యోగబలమాశ్రయః. యోఽహ మచింత్యశక్తిర్నానాకారస్తస్మిన్ మయి మనసో యోగో ధారణా తస్య బలం ప్రభావః స ఏవాశ్రయః కారణం. (22)

23శ్లో॥ పరకాయం విశన్ సిద్ధ ఆత్మానం తత్ర భావయేత్ ।
పిండం హిత్వా విశేత్ప్రాణో వాయుభూతః షడంఘ్రివాన్ ॥

టీ:- పరకాయమితి. యత్ర ప్రవివిక్షతి తత్రాత్మానం చింతయేత్. తతః పిండం స్వదేహం హిత్వా ప్రాణః ప్రాణ ప్రధానలింగశరీరోపాధిః వాయుభూతః బాహ్యావాయౌ భూతః ప్రవిష్టస్తేన మార్గేణేత్యర్థః. షడంఘ్రివత్ భృంగో యథా. పుష్పాత్పుష్పాంతరమనాయాసేన ప్రవిశతి తద్వత్. (23)

24శ్లో॥ పార్ష్ణ్యా పీడ్యగుదం ప్రాణం హృదురః కంఠమూర్ధసు ।
ఆరోప్య బ్రహ్మ రంధ్రేణ బ్రహ్మ నీత్వోత్సృజేత్తనుమ్ ॥

టీ:- పిండం హిత్వేత్యుక్తం తత్ప్రకారం కథయన్ స్వచ్ఛంద మృత్యు మాహ పార్ష్ణ్యేతి. పార్ష్ణ్యా పార్ష్ణినా. గుదం నిరుధ్య ప్రాణం ప్రాణోపాధి మాత్మానం. బ్రహ్మరంధ్రేణ మూర్ధద్వారేణ. బ్రహ్మేత్యుప లక్షణం బ్రహ్మ అన్యద్వా అపేక్షితం స్థానం. మనసా నీత్వా ప్రాపయిత్వా. (24)

కారణము కాగా ఆ యా దేవతా రూపమును పొందచున్నాడు. (22)

తా:- సిద్ధుడు ఏ పరకాయమును ప్రవేశింప గోరుచున్నాదో ఇతర శరీర మందు తన చిత్తమును అందు చేరు దానినిగా భావించవలెను. అంత తన స్థూలరూపమును వదిలి ప్రాణప్రధానమైన లింగ శరీరోపాధికుడై బాహ్యావాయువును ప్రవేశించిన వాడై ఆ మార్గమున అని అర్థము. ఆరుకాళ్ళు గల తుమ్మెద వలె. తుమ్మెద ఎట్లు పుష్పము నుండి మరియొక్క పుష్పమును ప్రవేశించునో అట్లే సునాయాసము గా పరకాయమును ప్రవేశింపవలెను. (23)

తా:- పిండమును వీడిఅని చెప్పబడినది ఆ విధమును చెప్పుచు స్వచ్ఛంద మరణమును చెప్పుచున్నాడు. ప్రాణోపాధికుడయిన జీవుని లోపలి హృదయాకాశము వెలుపలి వక్షము కంఠము శిరస్సు అను వానియందు ఆరోపించి కుడికాలిమడమచే గుదస్థానమును నిరోధించి శిరస్సుపై గల బ్రహ్మరంధ్రము ద్వారా బ్రహ్మము, లేక అపేక్షిత స్థానమును మనస్సుచే పొందిపచేసి శరీరమును త్యజింపవలెను. (24)

25శ్లో॥ విహరిష్యన్ సురాక్రీడే మత్స్థం సత్త్వం విభావయేత్ ।
విమానేనోపతిష్ఠన్తి సత్యవృత్తి సురస్త్రియః ॥

టీ:- విహరిష్యన్నితి. మత్స్థం మన్మూర్తిరూపం శుద్ధం సత్త్వం చింతయేత్. తదా సత్త్వవృత్తయః సత్త్వాంశ భూతాః. (25)

తా:- దేవతల ఉద్యానముల యందు విహరింప గోరుచున్నవాడై నా యందు గల సత్వమును చింతింపవలెను. సత్వాంశ సంభూతలగు అప్సర స్త్రీలు విమానము నెక్కి వచ్చి చెంత చేరుదురు. (25)

26శ్లో॥ యదా సంకల్పయేద్బుధ్యా యదా వా మత్పరః పుమాన్ ।
మయి సత్యే మనో యుంజన్ తథా తత్సమువాశ్నుతే ॥

టీ:- యదేతి. యదా వా అకాలేऽపి యథా వేతి పాఠే యథా వా యేన కేనాపి ప్రకారేణ. బుద్ధ్యా సంకల్పయేత్ తత్తథా యథావత్ప్రాప్నో తీత్యర్థః. యద్వా. సంకల్పయేత్. యథా వా మత్పరో మయి విశ్వాసవాన్ భవతి. తథా తదనురూపం సర్వం ప్రాప్నోతీత్యర్థః కిం కుర్వన్ సత్యే సత్య సంకల్పే మయి మనో యుంజన్. (26)

తా:- నేనే శరణ్యముగాగల పురుషుడు ఏ అకాలమందున ఏ ప్రకారముగానీ దేనిని పొందవలెనని సంకల్పించుచున్నాడో సత్య రూపడయిన నా యందు మనస్సును చేర్చుకున్నవాడై ఆ ప్రకారము దాని కనురూపముగా సర్వమును పొందుచున్నాడు. (26)

27.శ్లో॥ యో వై మద్భావమనుప్రాప్త ఈశితుర్వశితుః పుమాన్ ।
కుతశ్చిన్న విహన్యేత తస్య చాజ్ఞా యథా మమ ॥

టీ:- యఇతి. మదితి పృథక్ పదం మమేత్యర్థః ఈశితుః సర్వ నియంతః. వశితుః స్వతంత్రస్య. మమ భావం స్వభావం ప్రాప్తం:. ఏతాః గుణాహేతవః. (27)

తా:- మత్ అనగా విడిగా పదము. నా యొక్క అని అర్థము. ఏ పురుషుడు, సర్వనియంతను, స్వతంత్రుడనైన నాయొక్క స్వభావమును పొందినవాడు అగునో, నా యాజ్ఞవలె అతని ఆజ్ఞ కూడా చెల్లెను. దేని వలననూ అతడు విపత్తును పొందదు. (27)

28. శ్లో॥ మద్భక్త్యా శుద్ధ చిత్తస్య యోగినో ధారణా విదః ।
తస్య త్రైకాలికీ సిద్ధిర్జన్మ మృత్యూప బృంహితా ॥

టీ:- మద్భక్త్యేతి. అతః పరం క్షుద్రధారణావిద ఇతి. త్రికాలజ్ఞేశ్వర ధారణా సూచితా. త్రైకాలికీ త్రికాలవస్తు విషయా స్వజన్మ మృత్యుభ్యా ముప బృంహితా తత్సహితా అనయైవ పరచిత్తాభిజ్ఞతాపి వ్యాఖ్యాతా. 28

తా :- ఇటునుండి క్షుద్రములు నా యందలి భక్తిచే శుద్ధ చిత్తుడైన క్షుద్రమగు ధారణాయోగము తెలిసినవాడగు యోగికి త్రికాలవస్తు విషయముల తెలిసికొను సిద్ధి, జన్మ మృత్యువుతో కూడినది అగుచున్నది. దీని వలన పరుల చిత్తమును తెలిసికొనుట కూడా వ్యాఖ్యానింపబడినది. (28)

29. శ్లో॥ అగ్న్యాదిభిర్న హన్యేత మునే ర్యోగమయం వపుః ।
మద్యోగ శ్రాన్త చిత్తస్య యాదసాముదకం యథా ॥

టీ:- అగ్న్యాదిభిరితి. అగ్న్యాదిసర్వోపఘాత శూన్యో భవానిత్యేవం భూతం యోగమయం తైర్నాభిభూయేత. అత్ర హేతుః. మద్యోగేతి. యాదసా ముదకం యథాభిఘాతకం న భవతి తథా తస్య వపుషోఽగ్న్యాదయ ఇత్యర్థః. అనయైవా ద్వంద్వతాపి వ్యాఖ్యాతా. (29)

తా:- నా యందు చిత్తమునుంచి చేసిన ధారణాయోగముచేత సఫలమైన చిత్తముగల ముని వలె, అగ్ని మొదలయిన వాని వల్ల బాధలు లేని వాడవు నీవు అని, ఇట్టి యోగసిద్ధిని పొందిన శరీరము నీటిలో ఉండు జల జంతువులవలె, అగ్ని మొదలగు వానిచే బాధింపబడదు. దీనిచే శీతోష్ణాది ద్వంద్వములు పీడించవని చెప్ప బడినది. (29)

30. శ్లో॥ మద్విభూతిరభిధ్యాయన్ శ్రీవత్సాదివిభూషితాః ।
ధ్వజాత పత్ర వ్యజనైః స భవేదపరాజితః ॥

టీ:- మద్విభూతీరితి. మద్విభూతీః మమావతారాన్ ధ్వజాదిభిస్సహ. (30)

తా:- శ్రీవత్సమను పుట్టుమచ్చ మొదలయిన వాటిచే అలంకరింప బడిన, ధ్వజము, శ్వేతఛత్రము, వింజామరలు మొదలయిన వానితో గూడినవియగు నా అవతారములను ధ్యానించువాడై ఆ యోగి ఓటమిని పొందనివాడగును. (30)

31.శ్లో॥ ఉపాసకస్య మామేవం యోగధారణయా మునేః ।
సద్ధియః పూర్వ కథితాః ఉపతిష్ఠన్త్యశేషతః ॥

టీ:- ఉపసంహరతి - ఉపాసకస్యేతి. ఏవం పృథగ్ధారణాదిభిః 31

తా:- ఈ ప్రకారముగా నన్ను వేరువేరు యోగధారణలచే ఉపాసించు మునికి పూర్వము చెప్పబడిన అణిమాది సిద్ధులు సంపూర్ణముగా సిద్ధించుచున్నవి. (31)

32శ్లో॥ జితేంద్రియస్య దాంతస్య జితశ్వాసాత్మనో మునేః ।
మద్ధారణాం ధారయతః కా సా సిద్ధిః సుదుర్లభా ॥

టీ:- యద్వా కిం నానా ధారణా ప్రయాసేన. ఏకయైవ సర్వాస్సిద్ధయో భవంతీత్యాహ - జితేంద్రియస్యేతి. మద్ధారణాం నారాయణే తురీయాఖ్యే ఇత్యత్రోక్తాం. యా సుదుర్లభాస్యాత్. సా కాను?న కాచిదిత్యర్థః. (32)

తా:- లేక - వివిధములైన ధారణా యోగములు అభ్యసించు ప్రయాస పడుట లేక ఒక్క ధారణ చేతనే సర్వసిద్ధులుకలగుచున్నవని చెప్పు చున్నారు. ఇంద్రియములను జయించినవాడు ఇంద్రియములను నిశ్చలము చేసి ప్రాణాపానముల నిరోధించి మనస్సును నిగ్రహించిన వాడై, తురీయుడై, నారాయణుడనైన నా యందు ధారణాయోగమును అభ్యసించు వానికి ఏ సిద్ధి దుర్గభమగును? అన్ని సిద్ధులు సిద్ధించు నని భావము. (32)

33శ్లో॥ అంతరాయాన్వదన్త్యేతా యుంజతో యోగముత్తమమ్ ।
మయా సంపద్యమానస్య కాలక్షపణ హేతవ ః ॥

టీ:- యద్యప్యేవం తథాపి న ప్రార్థ్యా ఇత్యాహ అంతరాయానితి.(33)

తా:- ఈప్రకారము ఆ సిద్ధులు సిద్ధించినను, అవి ప్రార్థింపదగినవి కావు అనుచున్నారు. శ్రేష్ఠమయిన ధారణాయోగము నభ్యసించి మునికి, నన్ను పొందుగోరు వానికి, ఈ అణిమాది సిద్ధులు కేవలము కాలముగడుపుటకు హేతువులనియు యోగవిఘ్నము లైన వానినిగా పెద్దలు చెప్పుచున్నారు. (33)

34శ్లో॥ జన్మౌషధి తపోమంత్రైః యావతీరిహ సిద్ధయః ।
యోగేనాప్నోతి తాః సర్వాః నాన్యైర్యోగ గతిం వ్రజేత్ ॥

టీ:- తస్మాదహైతుకీయమేవ ధారణా కార్యా నాన్యాః కామ్యా ఇత్యాహ- జన్మేతి. జన్మనైవ కాశ్చిత్సిద్ధయో భవంతి. యథా దేవానాం. యథా చ యాదసాముదకస్తభః. పక్ష్యాదీనాం ఖేచరత్వాది. తదుక్తం పాతంజలే. శ్లో. "జన్మౌషదితపోమంత్రయోగజాస్సిద్ధయస్మృతా"ఇతి. యోగేన మద్ధారణామిత్యుక్తేన యోగగతిం మత్సాలోక్యాదిరూపాం.(34)

తా:- అందుకనిఈ ధారణ అహైతుకీ అయినందున ఒక్కటి అభ్యసించ దగిది. కామ్యములయిన ఇతర ధారణలుకావని చెప్పుచున్నారు. జన్మతోనే కొన్ని సిద్ధులు కలుగును. దేవతలకు, చేపలకు నీటియందు మునిగి యుండుట. పక్షులు ఆకాశమున ఎగురుట మొదలయినవి. జన్మము చేతను, ఓషధుల చేతను, తపస్సు చేతను, మంత్రములచేతను ఎన్నెన్నిసిద్దులు లభించుచ్చునవో ఆ సిద్ధులన్నింటినీ నా ధారణా యోగముచే పొందుచున్నాడు. ఇతర ధారణా యోగముల నభ్యసించి ననూ యోగఫలమగు నా సాలోక్యము త్యజింపకూడదు. పతంజలి ఈ విధంగాచెప్పినాడు.జన్మౌషది తపో మంత్ర యోగజాః సిద్ధయస్మృతాః ఇట్లు ఏ యే సిద్ధులు గలవో ఆ సిద్ధులన్ని ఉత్తమమగు నా ధారణా యోగము చేతనే లభించుచున్నవి. కావున ఇతర ధారణాయోగము నభ్యసించుటచేత, నా సాలోక్యము పొందు (నా) ధారణా యోగమును వీడకూడదు. నా సాలోక్యము పొందజేయు ఉత్తమయోగధారణయే ముఖ్యము. (34)

35శ్లో॥ సర్వాసామపి సిద్ధీనాం హేతుః పతిరహం ప్రభుః ।
అహం యోగస్య సాంఖ్యస్య ధర్మస్య బ్రహ్మవాదినామ్ ॥

టీ:- తత్కృత ఇత్యతఆహార్ధేన - సర్వాసాహితి. ప్రభుత్వోపపాదనం హేతుః కారణం. పతిః పాలయితా చేతి. కించ. న కేవలం సిద్ధీనామేవ

తా:- ఎందువలన యనగా చెప్పుచున్నారు. ఈ చెప్పిన అన్ని పద్ధతు లకు నేను కారణము పాలకుడు ఇచ్చే సమర్ధుడు. కేవలము సిద్ధులనే కాక మోక్షమునకు కూడ ప్రభువనుచున్నారు. నేను మోక్షమునకు, దీనికి సాధనమగు జ్ఞానమునకు, ధర్మమునకు, ఆ ధర్మమునుపదేశించు వేదవాదులకును ప్రభువునైయున్నాను. (35)

ప్రభుః. అపితు మోక్షాదీనామపీత్యాహ - అహమితి. యోగో మోక్షః సాంఖ్యం తత్సాధనం జ్ఞానం ధర్మస్య తదుపదేష్టౄణాం బ్రహ్మావాదినాం చ. (35)

36శ్లో॥ అహమాత్మాన్తరో బాహ్యోఽనావృతః సర్వదేహినామ్ ।
యథా భూతాని భూతేషు బహిరంతః స్వయం తథా ॥

తా:- ఎందువలననగా చెప్పుచున్నారు. అన్ని జీవులకు నేను ఆత్మనై యున్నాను. అంతార్యామి స్వరూపుడను, పైన వ్యాపించి ఉండువాడను, దేని చేతను ఆవరింపబడని వాడను. ఏ విధముగా పంచ మహా భూతములు, జరాయుజాది చతుర్విధములయిన ప్రాణుల యందు లోపల బయట స్వయముగ నున్నవో ఆ ప్రకారముగా. (36)

టీ:- కుతస్తత్రాహఅహమితి. సర్వదేహినాం జీవానామాత్మ యతః అంతరః అంతర్యామీ.శ్రు."ఏషత ఆత్మాంతర్యామ్యమృత"ఇతి శ్రుతేః. తర్హి కిమంతర్వర్తిత్వాత్పరిచ్ఛిన్నః. న బాహ్యశ్చ వ్యాపక ఇత్యర్థః. అత్ర హేతుః అనావృతః ఏతత్సదృష్టాంతమాహ - తేషు చతుర్విధేషు మహాభూతాని యథా అంతర్బహిశ్చ భవంతి. స్వయమహమపి తథేత్యర్థః (36)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
పంచదశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
పంచశాధ్యాయము సమాప్తము.

## షోడశోऽధ్యాయః

షోడశే తు హరేరావిర్భావ యుక్తా విభూతయః
జ్ఞానవీర్య ప్రభావాది విశేషేణోపవర్ణితాః
అంతశ్చిత్తేన యద్ధ్యాన మశక్య మకృతాత్మనాం
అతస్తద్యోగతా ప్రాప్త్యై విభూత్యాది నిరూపణం
ఏవం తావన్నవా ధ్యాయ్యా మష్ట ప్రశ్నా నిరూపితాః
బ్రహ్మత్వ సంభవే తావత్ సప్తమాది చతుష్టయే
బంధముక్త్యోశ్చనిర్ధారే సద్భక్త్యోశ్చ తతః పరే
ద్వాదశేऽనంతరం కర్మ కృత త్యాగ వ్యవస్థితౌ
హంసేతిహాసతో యోగ నిష్ఠాయాం చ త్రయోదశే
శ్రేయాస్సాధన నిర్ధారే ధ్యానే నైవ చతుర్దశే
ధారణాసిద్ధి భేదే చ ప్రసంగేన నిరంతరే
ఉద్ధవ ప్రశ్నతో దత్తముత్తరం హరిణోచితమ్
షోడశే భూతివిస్తారో ద్వయోర్వర్ణాశ్రమ వ్రతే
జ్ఞానాది నిర్ణయే చాతో యమాదీనాం చ నిర్ణయే
యోగ త్రయాధికారే తు వింశేచ తదనంతరమ్
తత్త్వ సంఖ్యా వివాదే చ పుంప్రకృత్యోర్వివేచనే
జన్మమృత్యు ప్రకారే చ ద్వావింశే దత్తముత్తరం

## షోడశాధ్యాయము

తా:- ఈ షోడశాధ్యాయమునందు శ్రీహరి యొక్క ఆవిర్భావముతో కూడిన విభూతులు, జ్ఞాన, వీర్య, ప్రభవాది విశేషములతో వివరింపబడినవి. ఇంద్రియజయము మనోనిగ్రహములేని వారికి చిత్తము లోపల ధ్యానించుట అశక్యమగును. అందువలన అట్టి ధ్యానయోగ ప్రాప్తికి విభూతులు మొదలగు వానిని నిరూపించుట జరిగినది. ఈ ప్రకారము తొమ్మిది అధ్యాయములందు ఎనిమిది ప్రశ్నలు నిరూపింపబడినవి. బ్రహ్మత్వము సంభవించు విషయము మాత్రమే 7వ అధ్యాయము మొదలు నాలుగధ్యాయములందు. బంధముక్తులు తర్వాతి పదకొండవ అధ్యాయమున. పన్నెండవ అధ్యాయమున, కర్మ చేయుట, దానిత్యాగము అనువాని స్థితులు. త్రయోదశాధ్యాయము నందు హంసోపాఖ్యానము వలన యోగనిష్ఠ. చతుర్దశాధ్యాయమునందు శ్రేయస్సాధన నిర్ధారణము. పంచదశాధ్యాయనందు ధారణాసిద్ధుల భేదమును, ఉద్ధవ ప్రశ్నమును బట్టి శ్రీహరిచే ఉత్తరమీయబడినది. షోడశాధ్యాయమునందు భూతి విస్తారము. పదునేడవ అధ్యాయమందు వర్ణాశ్రమ వ్రతములు. అష్టాదశాధ్యాయమందు జ్ఞానాదినిర్ణయము. పందొమ్మిదవ అధ్యాయమందు యమ నియమాదులునిర్ణయము. ఇరువదవ అధ్యాయ మందు యోగత్రయాధికారము. ఇరువది ఒకటవ అధ్యాయమందు తత్త్వ,

పరాపరాధసహనే చతుర్ధిస్తదనంతరైః
సప్తవింశే క్రియాయోగ ప్రశ్నే తదుపవర్ణనం
అష్టావింశే తతః ప్రోక్తా జ్ఞాన యోగోపసంహృతిః
సంసార సంభవ ప్రశ్నే తన్మధ్యే దత్త ముత్తరమ్
తదశక్త్యా పునః ప్రశ్నే భక్తి యోగోపసంహృతిః
ఏవం ప్రశ్నోత్తరాణ్య క్రమేణైతాని వింశతిః ॥

**ఉద్ధవ ఉవాచ**

1.శ్లో॥ త్వం బ్రహ్మ పరమం సాక్షాదనాద్యన్తమపావృతమ్ ।
సర్వేషామపి భావానాం త్రాణస్థిత్యప్య యోద్భవః ॥

టీ:- అహమాత్మాంతరోబాహ్యో - నావృతస్సర్వ దేహినామ్. యథా భూతాని భూతేషు బహిరంత స్స్వయంతథే"త్యుక్తం. తత్ర భూతాని యథా క్వచిత్ కేనచిత్ గుణవిశేషణోద్రిక్తాని వర్తంతే క్వచిత్సామాన్య రూపేణైవ తథా త్వమపి క్వ కథం వర్తసే? ఇతి విభూతీః ప్రష్టుం ప్రథమం తావదుక్తమేవ సర్వాత్మకత్వమనువదతిత్వం బ్రహ్మేతి. అపావృతం నిరావరణం స్వతంత్రం వా అతఏవ సర్వేషామపి త్రాణం రక్షణం స్థితిర్జీవనం. త్రాణస్థితిసహితౌ అప్యయోద్భవౌయస్మాత్. సః త్వం ఉపదానకారణమిత్యర్థః. (1)

సంఖ్యావివాదము, ప్రకృతి పురుష వివేకము. ఇరువది రెండవ అధ్యాయము నందు జన్మమృత్యు ప్రకారము అనువానికి పత్యుత్తరములు చెప్పబడినవి. తరువాత ఇరువది మూడు నుండి ఇరువదిఆరు అధ్యాయముల వరకు పరాపరాధ సహనము. ఇరువది ఏడవ ఆధ్యాయ మందు క్రియా యోగప్రశ్నము వర్ణింపబడినవి. ఇరువది ఎనిమిదవ అధ్యాయమందు జ్ఞానయోగోప సంహారము. ఇరువది తొమ్మిదవ అధ్యాయము నందు సంసార సంభవ ప్రశ్నము వివరింపబడినవి. ముప్పది, ముప్పదిఒక్క అధ్యాయముల యందు భక్తియోగముప సంహరింపబడినది. ఈ ప్రకారము ప్రశ్నోత్తర క్రమములు ఇరువది చెప్పబడినవి. "అహమాత్మాంతరోబాహ్యో౽నావృతస్సర్వ దేహినాం యథా భూతాని భూతేషు బహిరంతస్స్వయం తథా" అందు పంచ భూతము లెట్లు ఒక్కొక్కరు ఒక్కొక్క గుణ విశేషముచే ఉద్రేకమును పొందియు వేరొకచో సామాన్యరూపముననువర్తించుచున్నవో. అట్లే నీవు కూడా ఎక్కడ ఎట్లు ఉందువు అని విభూతులను ప్రశ్నించుటకు ప్రథమమున చెప్పబడిన సర్వాత్మకత్వమునే యనువదించుచున్నారు. నీవు ఆద్యంత ములులేని, దేనిచేత ఆవృతముకాని, స్వతంత్రమై, అన్ని ప్రాణులకు రక్షణము, జీవనము, ఉత్పత్తి , లయము కల్గించునుపాదాన కారణము అయి ఉన్నావు.(1)

2శ్లో॥ ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయమకృతాత్మభిః ।
ఉపాసతే త్వాం భగవన్ యాథా తథ్యేన బ్రాహ్మణాః ॥

టీ:- అత్ర సదాచారం ప్రమాణమాహ- ఉచ్చావచేష్వితి. యథా తథ్యేన. యథార్థత్వేన. సర్వభూత కారణం త్వాం బ్రాహ్మణాఃవేదతాత్పర్య విదః. (2)

తా:- ఇందు సదాచారము ప్రమాణమనుచున్నాడు. అన్ని ప్రాణముల యందుంటూ, నిశ్చల చిత్తులు కాని వారికి తెలియశక్యము గాక సర్వభూతకారణుడై యున్న నిన్ను వేదతాత్పర్యవిదులైన బ్రాహ్మణులు ఉపాసించుచున్నారు. (2)

3శ్లో॥ యేషు యేషు చ భావేషు భక్త్యా త్వాం పరమర్షయః ।
ఉపాసీనాః ప్రపద్యంతే సంసిద్ధిం తద్వ దస్వమే ॥

టీ:- ఏవం కారణత్వేన సర్వాత్మకత్వమనూద్య విభూతీః పృచ్ఛతి. యేష్వితి ఉపాసీనాః సేవమానాస్సంతః. (3)

తా:- ఈ ప్రకారము కారణస్వరూపడగుటచే సర్వాత్మకునిగా అనువదించి విభూతులను గూర్చి ప్రశ్నించుచున్నారు. ఏ యే భూతము లందు ఏ విధమున నిన్ను ఋషిశ్రేష్ఠులు ఉపాసించుచున్న వారై నిన్ను శరణు పొందుచున్నారో ఆ సంసిద్ధమయిన రూపమును నాకు చెప్పుము. (3)

4శ్లో॥ గూఢశ్చరసి భూతాత్మా భూతానాం భూతభావన ।
నిత్యాం పశ్యంతి భూతాని పశ్యంతం మోహితాని తే ॥

టీ:- దుర్జ్ఞేయత్వమేవాహ - గూఢ ఇతి. గూఢః అస్ఫుటః. భూతానాం ప్రాణినాం మధ్యే తత్ర హేతుః భూతానామాత్మా అంతర్యామీ అత్రాపి హేతుః. హే భూతభావనేతి. తే త్వయా. (4)

తా:- దుర్జ్ఞేయత్వమును చెప్పుచున్నాడు. ప్రాణులలోపల అవ్యక్తుడవై యుంటావు, భూతములకు అన్తర్యామి వైయున్నావు, భూతములను సృజించువాడవు. నీచే మోహమును పొందిన ప్రాణులు తమ్ము చూచుచున్న నిన్ను చూడలేవు. (4)

5శ్లో॥ యాః కాశ్చభూమౌ దివి వై రసాయాం
విభూతయో దిక్షుమహా విభూతే ।
తామహ్యామాఖ్యాహ్యనుభావితాస్తే
నమామితే తీర్థ పదాంఘ్రి పద్మమ్ ॥

టీ:- తా ఏవ సాకల్యేన పృచ్ఛతి యా ఇతి. హే మహావిభూతే. యాః కాశ్చిద్భూమ్యాదిషు తే విభూతయః. రసాయాం రసాతలే అను భావితాః త్వయైవ కేన చిచ్ఛిక్తి విశేషేణ సంయోజితాః తీర్థానాం పదం చ తదంఘ్రిపద్మం చ. (5)

తా:- ఓ గొప్ప విభూతులుగలవాడా! భూమియందు, స్వర్గ, పాతాళము లందు, దిక్కు లందు, ఏ యే విభూతులను నీవు చిచ్ఛక్తిచే గూర్చి యున్నవో ఆ విభూతులను నాకు చెప్పుము. గంగాది పుణ్యతీర్థములకు స్థానమయిన నీ పాద పద్మమును నమస్కరింతును.(5)

శ్రీ భగవానువాచ

6శ్లో॥ ఏవమేతదహం పృష్ట ప్రశ్నం ప్రశ్నవిదాంవర ।
యుయుత్సునా వినశనే సపత్నై ర్నరర్జునేన వై ॥

టీ:- నరావతారభూతార్జున ప్రశ్నసంవాదిత్వాత్తవాయం ప్రశ్నస్సాధీయానితి తావదనుమోదతే త్రిభిః ఏవమితి. ప్రశ్నం ప్రష్టవ్యం సపత్నై ర్యోద్ధుమిచ్ఛతా. వినశనే కురుక్షేత్రే.(6)

భగవంతుడు చెప్పచున్నాడు.

తా:- నరఋషి అవతారమైన అర్జునుని ప్రశ్నవంటిదేయగుట వలన నీయీ ప్రశ్నము సాధుసమ్మతమగునని అనుమోదించుచున్నారని మూడుశ్లోకములచే చెప్పుచున్నారు. ఓ ప్రశ్నవిదులలో శ్రేష్ఠుడా! నీవడిగిన ప్రకారమే పూర్వము కురుక్షేత్రమునందు శత్రువులతో యుద్ధము చేయగోరిన అర్జునుడు. ఈ విభూతులు విస్తరమును గూర్చి నన్నడిగెను. (6)

7శ్లో॥ జ్ఞాత్వా జ్ఞాతివధం గర్హ్యమ ధర్మం రాజ్యహేతుకమ్ ।
తతో నివృత్తోఽ హంతాహం హతోయమితి లౌకికః ॥

టీ:- యుయుత్సోర్విభూతి ప్రశ్నే కః ప్రసంగస్తత్రాహ - జ్ఞాత్వేతి. లౌకికః ప్రాకృతమతిస్సన్. (7)

తా:- యుద్ధము చేయగోరిన వానికి విభూతులను గూర్చిన ప్రసంగ మెట్లు కలిగిన దనగా అందులకు చెప్పుచున్నారు. రాజ్యప్రాప్తి కారణమై, అధర్మాయుతమై, అతినింద్యమైనది ఈ బంధువధ అని తెలిసికొన్నవాడై అర్జునుడు, నేను ఈ బంధువులకు హంతకుడను. వీరు నాకు హంతకాలు అని ప్రాకృతబుద్ధి కలవాడై నేను యుద్ధము చేయనని మరలెను. (7)

8శ్లో॥ స తదా పురుష వ్యాఘ్రో యుక్త్యా మే ప్రతిబోధితః ।
అభ్యభాషత మామేవం యథా త్వం రణమూర్ధని ॥

టీ:- స ఇతి. స చ యథా తతో జ్ఞాతివధాన్నివృత్తః. తదా మయా ప్రతిబోధితస్సన్. యథా త్వమభిభాషసే ఏవం సంగ్రామముఖే మా మభ్యభాషత తద్వదేవ తవాపి కథమిష్యామీతి భావః. (8)

తా:- యుద్ధమునుండి వెనుదిరిగినవాడై ఆ పురుషశ్రేష్ఠుడు నాచే శాస్త్ర యుక్తిచే ఆత్మాబోధము చేసి ఇప్పుడు నీవు నన్నడినట్లు సంగ్రామ ముఖమున నన్ను ఆడిగెను వానికి చెప్పిన మార్గమున ఉత్తరము నీకు చెప్పెదను. (8)

9శ్లో॥ అహమాత్మోద్ధవా మీషాం భూతానాం సుహృదీశ్వరః ।
అహం సర్వాణి భూతాని తేషాం స్థిత్యుద్భవాప్యయః ॥

టీ:- తాః విభూతీః కథయతి అహమితి. అస్మచ్ఛబ్ద సమానాధికరణాః ప్రథమాంతా ద్వితీయాంతాశ్చ సర్వా విభూతయః తాస్తాశ్చోపాసనార్థం కథ్యంతే షష్ఠీ చ క్వచిన్నిర్ధారణే సంబంధే చ క్వచిద్యథా యోగ్యం

తా:- విభూతులనే చెప్పుచున్నారు. అస్మచ్ఛబ్ద సమానాధికరణములు, విశేషణములు, ప్రథమాన్త, ద్వితీయాంతములు, అన్ని విభూతులు ఉపాసన కొరకు చెప్పబడినవి, షష్ఠీ కొన్ని సందర్భమున నిర్ధారణ యందు సంబంధము నందు కూడా యథా యోగ్యముగా తెలియ నగును. (9)

ద్రష్టవ్యా. తతశ్చామీషాం భూతానాం ఆత్మేతి సుహృదీశ్వర ఇతి చ సామాన్యేనాహముపాస్య ఇత్యర్థః. ఏవం సర్వత్ర తేషాం స్థిత్యుద్భవాప్యయః తద్ధేతురిత్యర్థః. (9)

10శ్లో॥ అహం గతిర్గతిమతాం కాలః కలయతామహమ్ ।
గుణానాం చాప్యహం సామ్యం గుణిన్యౌత్పత్తికోగుణః ॥

టీ:- విశేషతో భూతీరాహ అహమితి. కలయతాం వశీకుర్వతాం. మధ్యే గుణానాం. మధ్యే సామ్యం సర్వత్ర సమత్వం సత్త్వాదీనాం సామ్యమవ్యాకృతం నా. గుణిని ధర్మిణి ఔత్పత్తికస్వాభావితో యో గుణః సోఽహం. (10)

11శ్లో॥ గుణినామప్యహం సూత్రం మహతాం చ మహానహమ్ ।
సూక్ష్మాణామప్యహం జీవో దుర్జయానామహం మనః ॥

టీ:- గుణానామితి. సూత్రం ప్రథమకార్యం మహాన్ మహత్తత్త్వం. సూక్ష్మోపాధిత్వాత్ దుర్జ్ఞేయత్వాచ్చ జీవస్య సూక్ష్మత్వం. శ్రు. "బుద్ధేర్గుణేనాత్మ గుణేనచైవ దూర్వాగ్రమాత్రోహ్యా పరోఽపి దృష్ట" ఇతి. శ్రుతేః. (11)

తా:- విశేషించి విభూతులను చెప్పుచున్నాడు. నేను కర్మమార్గము, జ్ఞానమార్గములందుడెడి వారికి ప్రాప్యమయిన వాడను. అహోరాత్రాది రూపముల గణించి ప్రాణమును వశీకరించు వానిలో కాలమును శంత్యాది గుణములలో సర్వత్ర సమాత్వమగుదాని గుణమును నేను. గుణములలో సామ్యావస్థయగు అవ్యాకృతమగు మూలప్రకృతిని సత్యాది గుణముగల వాని యందు స్వాభావికమయిన గుణమును. (10)

తా:- ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులను గుణములలో నేను ప్రథమమయిన ఇచ్ఛాశక్తియను గుణమును అనగా అహంకారతత్వము. పెద్దదయిన వానిలో మహత్తత్వమును. నేను సూక్ష్మములయిన వానిలో నేను అవిద్య ఉపాధిగా గలవాడను జీవుడను. దుర్జ్ఞేయడగుట వలన జీవుడు సూక్ష్మరూపడగును. "బుద్ధేర్గుణేనాత్మగుణేనచైవ వాతాగ్రమాత్రోఽహ్యవ రోపి దృష్టః" బుద్ధిగుణమగు జ్ఞానముతోను, చిత్తగుణము, మనోగుణము అనువానితో గూడ గరకపోచ కొనయంత సూక్ష్మమయిన ఇతరుడగు జీవుడును చూడబడినాడు జయింప శక్యముకాని వానిలో నేను మనస్సును. (11)

12శ్లో॥ హిరణ్యగర్భో వేదానాం మంత్రాణాం ప్రణవస్త్రివృత్ ।
అక్షరాణామకారోఽస్మి పదానిచ్ఛందసామహమ్ ॥

తా:- వేదములలో వేదాధ్యాపకుడగు బ్రహ్మను నేను. వేదమంత్రములలో ఓంకారమును నేను. వర్ణసమామ్నాయమున అకారమును నేను. ఛందస్సుల్లో మూడు పాదములుగల గాయత్రిని నేను. (12)

13శ్లో॥ ఇంద్రోహం సర్వదేవానాం వసూనామస్మిహవ్యవాట్ ।
ఆదిత్యానా మహిం విష్ణుః రుద్రాణాం నీలలోహితః ॥

తా:- దేవతలలో ఇంద్రుడను, వసువులతో అగ్నిని, ఆదిత్యులలో విష్ణువును, రుద్రులలో నీలలోహితుడను. (13)

టీ:- హిరణ్యగర్భ ఇతి. వేదానాం సంబంధీ తేషా మధ్యాపకః. పదాని త్రీణి త్రిపదా గాయత్రీత్యర్థః. (12,13)

14శ్లో॥ బ్రహ్మర్షీణాం భృగురహం రాజర్షీణామహం మనుః ।
దేవర్షీణాం నారాదోఽహం హవిర్ధాన్యస్మి ధేనుషు ॥

తా:- బ్రహ్మర్షులలో భృగుమహర్షిని, రాజర్షులలో స్వాయంభువ మనువును, ,దేవర్షులలో నారదుడను, గోవులలో కామధేనువును.(14)

15శ్లో॥ సిద్ధేశ్వరాణాం కపిలః సుపర్ణోఽహం పతత్రిణామ్ ।
ప్రజాపతీనాం దక్షోఽహం పితౄణామహ మర్యమా ॥

తా:- జ్ఞానసిద్ధులలో కపిలుడను, పక్షులలో గరుత్మంతుడను, ప్రజాపతులలో దక్షుడను, పితృదేవతలలో అర్యముడను నేనే. (15)

టీ:- బ్రహ్మర్షీణామితి. హవిర్ధానీ కామధేనుః. (14,15)

16శ్లో॥ మాం విద్ధ్యుద్ధవ దైత్యానాం ప్రహ్లాదమసురేశ్వరమ్ ।
సోమం నక్షత్రౌషదీనాం ధనేశం యక్షరక్షసామ్ ॥

టీ:- మామితి. నక్షత్రౌషధీనాం ప్రభుం సోమం యక్షరక్షసాం ప్రభు కుబేరం. (16)

తా:- ఓ ఉద్ధవా! దైత్యులలో అసురప్రభువగు ప్రహ్లాదుడను, నక్షత్ర ఓషధులలో చంద్రుడను, యక్ష రాక్షసులలో కుబేరుడను. (16)

17శ్లో॥ ఐరావతం గజేంద్రాణాం యాదసాం వరుణం ప్రభుమ్ ।
తపతాం ద్యుమతాం సూర్యం మనుష్యాణాం చ భూపతిమ్॥

టీ:- ఐరావతమితి. యాదసాం ప్రభుం వరుణం తపతాం ప్రతాప వతాం ద్యుమతాం చ మధ్యే. (17)

తా:- గజములలో ఐరావతమును, జలజంతువులలో వానికి ప్రభువగు వరుణుడను, ప్రతాపవంతులలో, దీప్తిమంతులలో సూర్యుణ్ణి, మనుష్యులలో భూపాలునిగా నన్ను తెలిసికొనుము. (17)

18శ్లో॥ ఉచ్చైశ్రృవాస్తురంగాణాం ధాయానామస్మి కాంచనమ్ ।
యమః సంయుమతాం చాహం సర్పాణామస్మి వాసుకిః ॥

టీ:- ఉచ్చైశ్రృవాఇతి. సంయమతాం దండయతామిత్యర్థః.(18)

తా:- అశ్వములలో ఉచ్చైశ్రవమును, లోహములలో సువర్ణమును, దండించువారిలో యమడను, సర్పములలో వాసుకిని నేను.(18)

19శ్లో॥ నాగేంద్రాణామనంతోహం మృగేంద్రః శృంగి దంష్ట్రిణామ్ ।
ఆశ్రమాణామహం తుర్యో వర్ణానాం ప్రథమోనఘ ॥

టీ:- నాగేంద్రాణామితి. శృంగిణాం దంష్ట్రిణాం చ మధ్యే తేషాం ప్రభుర్వ్యాతుర్యః సన్న్యాసః ప్రథమః బ్రాహ్మణ.(19)

తా:- ఓ అనఘా! నాగరాజులలో శేషుడను నేను, కొమ్ములు గల జంతువులలో, కోరలుగల జంతువులలో సింహమును నేను, బ్రహ్మచర్యాద్యాశ్రమములలో నాల్గవదగు సన్యాసమును నేను, వర్ణములలో ప్రథమమగు బ్రాహ్మణ వర్ణమును నేను. (19)

20శ్లో॥ తీర్థానాం సోత్రసాం గంగా సముద్రః సరసామహమ్ ।
ఆయుధానాం ధనురహం త్రిపురఘ్నో ధనుష్మతామ్ ॥

టీ:- తీర్థానామితి. స్రోతసాం ప్రవాహానాం చ సరసాం స్థిరోదకాశయానాం. (20)

తా:- పుణ్యతీర్థములై ప్రవహించు నదులలో గంగను నేను, సరస్సులలో సముద్రమును నేను, ఆయుధములలో ధనుస్సును నేను, ధనుస్సు గల వారిలో త్రిపురులను సంహరించిన శివుడను. (20)

21శ్లో॥ ధిష్ణ్యానామస్మ్యహం మేరుర్గహనానాం హిమాలయః ।
వనస్పతీనామశ్వత్థః ఓషధీనామహం యవః ॥

టీ:- ధిష్ణ్యానామితి. ధిష్ణ్యానాం నివాసస్థానానాం గహనానాం దుర్గమాణాం. (21)

తా:- నివాస్థానములలో మేరుపర్వతమును నేను, దుర్గమములలో హిమగిరిని నేను, వృక్షములలో అశ్వత్థమును నేను, ధాన్యములలో యవ ధ్యానమును. (21)

22శ్లో॥ పురోధాసాం వసిష్ఠోఽహం బ్రహ్మిష్ఠానాం బృహస్పతిః ।
స్కందోఽహం సర్వ సేనాన్యాం అగ్రణ్యాం భగవానజః ॥

టీ:- పురోధసామితి. బ్రహ్మిష్ఠానాం వేదాంతార్థనిష్ఠానాం సేనాన్యాం చమూపతీనాం. అగ్రణ్యాం సన్మార్గప్రవర్తకానాం. అజః బ్రహ్మా.(22)

తా:- పురోహితులలో వసిష్ఠుడను, వేదాంతార్థ నిష్ఠులలో బృహస్పతిని, సేనాధిపతులలో కుమారస్వామిని, సన్మార్గప్రవర్తకులలో బ్రహ్మను నేను. (22)

23శ్లో॥ యజ్ఞానాం బ్రహ్మయజ్ఞోహం వ్రతానామవిహింసనమ్ ।
వాయ్వగ్న్యర్కాంబు వాగాత్మా శుచీనామ ప్యహం శుచిః ॥

టీ:- యజ్ఞానామితి. శుచీనాం శోధకానామపి మార్జన తక్షణ ఘర్షణా దీనాం మధ్యే వాయ్వాదిరూపః శోధకోఽహం. (23)

తా:- యజ్ఞములలో బ్రహ్మ యజ్ఞమును నేను, వ్రతములలో అహింసా వ్రతమును, శోధకములయిన మార్జన, తక్షణ, ఘర్షణ (చిమ్ముట, చెక్కుట, రాయుట) ములలోను, వాయువు, అగ్ని, సూర్యుడు, జలము, వాక్స్వరూపముగలవాడను పరిశుద్ధుల లోపరి శుద్ధుడను. (వాయ్వాది రూప శోధకుడను నేను) (23)

24శ్లో॥ యోగానామాత్మ సంరోధో మంత్రోఽస్మి విజిగీషతామ్ ।
ఆన్వీక్షకీకౌశలానాం వికల్పః ఖ్యాతి వాదినాం ॥

టీ:- యోగానామితి. యోగానామష్టాంగానాం మధ్యే ఆత్మ సంరోధః సమాధిరహం మంత్రో నీతిః. కౌశలానాం వివేకాది నైపుణానాం మధ్యే ఆన్వీక్షకీ ఆత్మానాత్మ వివేక విద్యా అఖ్యాత్యన్యథాఖ్యాతి శూన్యఖ్యాత్యసత్ఖ్యాత్య నిర్వచనీయఖ్యాతి వాదినాం ఏవమిదమేవ మిదంవేతి యో దురంతో వికల్పః సోఽహం. (24)

తా:- యమాది అష్టాంగములలో చిత్త సంయమునమను సమాధి నేను, జయింపగోరు వారిలో మంత్రము అనగా దండనీతి నేను, వివేకాది నైపుణ్యములో ఆత్మానాత్మ వివేక రూపమగు విద్యను నేను, ఖ్యాతివాదులలో, ఇది ఈ ప్రకారమైవుండవచ్చును లేదా ఇది సిద్ధాన్త మగును అని స్థిరముగా తెల్పని వికల్పమును నేను. 1) ఆత్మఖ్యాతి 2) అసత్ఖ్యాతి 3) అఖ్యాతి. 4) అన్యథాఖ్యాతి. 5) అనిర్వచనీయఖ్యాతి. (1) ఆత్మాఖ్యాతివాదులు బౌద్ధులు శుక్తియందు కన్పించు రజతము భ్రమ తానిదివరకు గాంచి బుద్ధిలో నిల్పియున్న రజతమే శుక్తి యందు కాన్పించుదురు. (2) అఖ్యాతిః బౌద్ధుల ఒక తెగ శూన్యవాదులు ప్రపంచము సత్యముగా లేదు అంతయూ శూన్యమే యగునందురు. (3) అఖ్యాతివాదులు మీమాంసకులు ప్రపంచము అసత్యముకాదు భ్రమ కాదు, సత్యముగనే యున్నదందురు. (4) అన్యథాఖ్యాతి వాదులు నైయాయికులు, వైశేషికులు అంగడియందుగాంచిన రజతము ఈ శుక్తి

యందు తోచుచున్నదందురు. (5) అనిర్వచనీయఖ్యాతివాదులు, వేదాంతులు ఈ ప్రపంచము సత్యమని కాని, అసత్యమని కాని భావింప సాధ్యము కాదని వాదింతురు. సత్యము పారమార్థికము, వ్యావహారికము ప్రాతిభాసికము అని మూడు విధములు. అందు పరబ్రహ్మము పారమార్థిక సత్యము, బ్రహ్మజ్ఞాన పర్యంతము కనుపడు ప్రపంచము వ్యావహారిక సత్యము, శుక్తి రజిత భ్రాంతి ప్రాతిభాసిక సత్యము. (24)

25శ్లో॥ స్త్రీణాం తు శతరూపాహం పుంసాం స్వాయంభువోమనుః ।
నారాయణో మునీనాం చ కుమారో బ్రహ్మచారిణామ్ ॥

టీ:- స్త్రీణామితి. కుమారః సనత్కుమారః.(25)

తా:- స్త్రీలలో శతరూపను, పురుషులలో స్వాయంభువుడను మునులలో నారాయణుడను, బ్రహ్మచారులలో సనత్కుమారుడను. (25)

26శ్లో॥ ధర్మాణామస్మి సంన్యాసః క్షేమాణామ బహిర్మతిః ।
గుహ్యానాం సూనృతం మౌనం మిథునానామజస్త్వహమ్ ॥

టీ:- ధర్మాణామితి. సన్న్యాసః భూతాభయదానం. క్షేమాణాం అభయ స్థానానాం మధ్యే అబహిర్మతిః అంతర్నిష్ఠా సూనృతం ప్రియవచనం మౌనం చ న హి ప్రియభాషణే మౌనే చ పురుషస్యాభిప్రాయో జ్ఞాయతే. అజః ప్రజాపతిః. యస్య దేహార్ధాభ్యాం మిథున మభూత్ స ఏవ ముఖ్యం మిథునం. శ్రు.“అర్ధో వా ఏష ఆత్మనో యత్పత్నీ”తి శ్రుతేః. (26)

తా:- ధర్మములలో భూతములకభయదానమిచ్చెడి సన్యాసము నగుదును, క్షేమములలో అంతర్నిష్ఠమైన మనస్సును, రహస్యములలో సత్యభాషణము, మౌనము, దంపతులలో నేను అజుడను, ప్రజాపతి నగుదును. “అర్ధోవా ఏష ఆత్మనోయత్పత్నీ బ్రహ్మ” తన దేహమును రెండు సగములుగా విభజించి దేహార్ధభాగములలో మిథునముయ్యెను అతడే ముఖ్య మిథునము. (26)

27శ్లో॥ సంవత్సరోస్మ్యనిమిషాం ఋతునాం మధుమాధవౌ ।
మాసానాం మార్గశీర్షోహం నక్షత్రాణాం తథా భిజిత్ ॥

టీ:- సంవత్సరఇతి. అనిమిషాం అప్రమత్తానాం మధుమాధవౌ వసంత ఇత్యర్థః. అభిజిత్ ఉత్తరాషాఢా చతుర్థపాదః. తథా చ శ్రు."అభిజిన్నామ నక్షత్రం ఉపరిష్టాదాషాఢానాం అధస్తాచ్ఛ్రోణాయా" ఇత్యాది. (27)

తా:- అప్రమత్తులలో సంవత్సరమునగుదును. ఋతువులలో చైత్ర వైశాఖములు గల వసంత ఋతువును, మాసములలో మార్గశీర్షమును, నక్షత్రములలో అభిజిత్తును." ఉత్తరాషాఢా చతుర్థ పాదము, శ్రవణా ప్రథమ పాదము అభిజిత్" శృతికూడా. "అభిజిన్నామ నక్షత్రముపరిష్టా దాషాఢానామధస్తాచ్ఛ్రోణాయా" అని ఈ అర్థమునే చెప్పినది. (27)

28శ్లో॥ అహం యుగానాం చ కృతం ధీరాణాం దేవలోఽసితః ।
ద్వైపాయనోఽస్మి వ్యాసానాం కవీనాం కావ్య ఆత్మవాన్ ॥

టీ:- అహమితి కృతం కృతయుగం. దేవలః అసితశ్చ. వ్యాసానాం వేదవిభాగకర్తౄణాం కవీనాం విదుషాం కావ్యశ్శుక్రః. (28)

తా:- యుగములలో కృతయుగమును, పండితులలో దేవలుడను, అసితుడను, వేద విభాగ కర్తలలో ద్వైపాయనుడను, విద్యాంసులలో నిశ్చలచిత్తుడగు శుక్రుడను నేను. (28)

29శ్లో॥ వాసుదేవో భగవతాం త్వం తు భాగవతేష్వహమ్ ।
కింపురుషాణాం హనుమాన్ విద్యా ధ్రాణాం సుదర్శనః ॥

టీ:- వాసుదేవఇతి. భగవతాం. శ్లో."ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానామాగతిం గతిమ్, వేత్తి విద్యామవిద్యాం చ సవాచ్యో భగవా" నిత్యేవం లక్షణానాం. (29)

తా:- భగవంతులలో అనగా ఉత్పత్త్యాదులు తెలిసిన వారిలో "ఉత్పత్తి ప్రళయం చైవ భూతానాం మాగతిం గతిం వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి". ఉత్పత్తి, ప్రళయములు, భూతముల రాకపోకలు, విద్య, అవిద్య, అనే ఆరుగుణములు గల భగవంతులలో వాసుదేవుడను, నేను భక్తులలో నీవే (ఉద్ధవుడను) నేను, కింపురుషులలో హనుమంతు డను, విద్యాధరులలో సుదర్శనుడను. (29)

30శ్లో॥ రత్నానాం పద్మరాగోఽస్మి పద్మకోశః సుపేశసామ్ ।
కుశోఽస్మి దర్భ జాతీనాం గవ్యమాజ్యం హవిష్షహమ్ ॥

టీ:- రత్నానామితి. పేశసాం సుందరాణాం. దర్భజాతీనాం. హవిర్షు చరు పురోడాశాదిషు ఘృతేషు వా. (30)

తా:- రత్నములలో పద్మరాగమును నేను, సుందర వస్తువులలో తామర మొగ్గను, దర్భజాతులలో కుశజాతిని నేను, హవిష్యము లందు గో ఘృతమును. (30)

31శ్లో॥ వ్యవసాయి నామహం లక్ష్మీః కితవానాం ఛలగ్రహః ।
తితిక్షాస్మి తితిక్షూణాం సత్వం సత్వవతామహమ్ ॥

టీ:- వ్యవసాయినామితి. లక్ష్మీః ధనాది సంపత్. (31)

తా:- వ్యవసాయము చేయు వారిలో ధనాది సంపదను నేను, జూదరులలో కపటమును నేను, శీతోష్ణాది ద్వంద్వమును సహించుకొను వారిలో ఆ సహనమును నేను, సాత్వికులలో సత్వగుణమును నేను. (31)

32శ్లో॥ ఓజః సహో బలవతాం కర్మాహం విద్ధి సాత్వతామ్ ।
సాత్వతాం నవమూర్తీనాం ఆదిమూర్తిరహం పరా ॥

టీ:- ఓజితి. బలవతాం ఓజశ్చ. సహశ్చ సాత్వతాం భాగవతానాం భక్త్యా కృతం కర్మాహమిత్యర్థః. తేషాం మేవ నవవ్యూహార్చనే వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ నారాయణ హయగ్రీవ వరాహ నృసింహ వామనా ఇతి. యా నవ మూర్తయస్తానాం మధ్యే వాసుదేవాఖ్యా.(32)

తా:- బలవంతులలో శరీర బలము, మనోబలము నేను, భక్తులు భక్తితో చేయు పూజాది కర్మ నేను, భక్తుల యొక్క నవవ్యూహార్చన యందలి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నారాయణ, హయగ్రీవ, వరాహ, నారసింహ, వామను లగు నవమూర్తులలో ప్రథముడగు వాసుదేవ మూర్తిని నేను. (32)

33శ్లో॥ విశ్వావసుః పూర్వచిత్తిః గంధర్వాప్సరసామహమ్ ।
భూ ధరణామహంస్థైర్యం గంధమాత్రమహం భువః ॥

టీ:- విశ్వావసురితి. గంధర్వాణాం విశ్వావసుః అప్సరసాం పూర్వచిత్తిః. గంధమాత్రం అవికృతం.(33)

తా:- గంధర్వులలో విశ్వావసువును, అప్సరసలలో పూర్వచిత్తిని, శైలములలో స్థిర శక్తిని, భూమిలో అవికారమయిన గంధగుణమును నేను. (33)

34శ్లో॥ అపాం రసశ్చ పరమస్తేజిష్ఠానాం విభావసుః ।
ప్రభాసూర్యేందు తారానాం శబ్దోహం నభసః పరః ॥

టీ:- అపామితి. పరమః మధురః పరః పరాఖ్యశబ్దః.(34)

తా:- నీటిలో మధుర రసమును, అధిక తేజోవంతులలో సూర్యుడను, సూర్యచంద్ర తారకలలో ప్రకాశమును, ఆకాశములో పరాఖ్య శబ్దమును. (34)

35శ్లో॥ బ్రాహ్మణ్యానాం బలిరహం వీరాణామహమర్జునః ।
భూతానాం స్థితిరుత్పత్తి రహం వై ప్రతిసంక్రమః ॥

టీ:- బ్రహ్మణ్యానామితి. అర్జునః పార్థః. భూతానాం ప్రాణినాం. ప్రతిసంక్రమః ప్రళయః. (35)

తా:- బాహ్మణ భక్తులలో బలిని, వీరులలో అర్జునుడను, ప్రాణులలో ఉత్పత్తి, స్థితి, లయములు నేనే. (35)

36శ్లో॥ గత్యుత్సర్గో పాదాన మానంద స్పర్శ లక్షణమ్ ।
ఆస్వాద శృత్యవఘ్రాణమహం సర్వేంద్రియేంద్రియమ్ ॥

టీ:- గతీతి. గత్యాదయః పంచకర్మేంద్రియవ్యాపారాః. జ్ఞానేంద్రియ వ్యాపారాః. అత్ర లక్షణం దర్శనం. సర్వేంద్రియాణామింద్రియం తత్త దర్థగ్రహణ శక్తిరప్యహం. (36)

తా:- గమన, విసర్జన, వచన, గ్రహణ, ఆనందమనే కర్మేంద్రియ వ్యాపారములు నేను, స్పర్శ, దర్శన, ఆస్వాద, శ్రవణ, ఆఘ్రాణములనే జ్ఞానేంద్రియ వ్యాపారములు నేను, అన్ని ఇంద్రియముల అర్థ గ్రహణము నేనే. (36)

37శ్లో॥ పృథివీ వాయురాకాశ ఆపోజ్యోతిరహం మహాన్ ।
వికారః పురుషోఽవ్యక్తం రజః సత్త్వం తమః పరమ్ ॥
అహమే తత్ప్ర సంఖ్యానం జ్ఞానం తత్వవినిశ్చయః ॥

టీ:- తదేవం తత్ర నిర్ధారణేన తత్తత్సంబంధేన చ విశేషతో విభూతీర్ని రూప్య ఇదానీం సామాన్యతః సర్వా అపి నిరూపయతి సార్ధద్వయేన పృథివీతి. పృథివ్యాదిశబ్దైస్తన్మాత్రాణి వివక్షితాని అహంకారః మహాన్ మహత్తత్వం. ఏతాః సప్త ప్రకృతి వికృతయః వికారః పంచమహాభూతాని ఏకాదశేంద్రియాణీత్యేవం షోడశకళః. పురుషో జీవః. అవ్యక్తం ప్రకృతిః ఏవం పంచవింశతి తత్త్వాని. తదుక్తం. శ్లో."మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త. షోడవకళశ్చ వికారో న ప్రకృతి ర్నచ వికృతిః పురుష"ఇతి. కించ. రజస్సత్త్వం తమ ఇతి ప్రకృతేర్గుణాశ్చ పరబ్రహ్మ చ. తదేతత్సర్వం అహమేవ. కించ. అహమితి. ఏతత్ప్ర సంఖ్యానం ఏతేషాం పరిగణనం ఏతేషాం లక్షణతో జ్ఞానం చ. ఏతత్ఫలం తత్త్వవినిశ్చయశ్చాహమేవ.(37)

తా:- ఈ ప్రకారము ఆయా వస్తువులయందు వాని వాని సంబంధము ద్వారా విశేషించి అన్ని విభూతులను నిరూపించి ఇప్పుడు సామాన్యముగా అన్నింటినీ నిరూపించుచున్నారు. భూమి, వాయువు, ఆకాశము, అగ్ని అనువాని పంచతన్మాత్రలు నేను. మహత్త్వము పంచమహా భూతములు, జీవుడు, ప్రకృతి సత్త్వరజస్తమస్సులు నేను. మూల ప్రకృతి రవికృతిర్మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్తషోడశకస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అను పంచభూత సూక్ష్మములు, అహంకారము, మహత్తత్వము ఇవి ఏడు ప్రకృతి వికృతులు వికారమనగా పంచ మహాభూతములు. జ్ఞానేంద్రియముల ఐదు, కర్మేంద్రియములు ఐదు, మనస్సు చేరి పదహారును వికృతులు జీవుడు ప్రకృతి మొత్తము పంచవింశతి తత్త్వములు సత్వ, రజ స్తమస్సులను త్రిగుణము పరబ్రహ్మము నేనగుదును, ఈ పంచవింశతి తత్త్వములు మొదలగు పరిగణనము వీని లక్షణము విభాగము పొందు సంఖ్య వీని ఫలమును నేనే యగుదును. (37)

38శ్లో॥ మయేశ్వరేణ జీవేన గుణేన గుణినా వినా ।
సర్వాత్మనాపి సర్వేణ న భావో విద్యతే క్వచిత్ ॥

టీ:- ఏతదేవ సంక్షిప్యాహ- మయేతి. జివేశ్వరరూపో ద్వివిధోయో భావఃయశ్చ గుణగుణిరూపః యశ్చ క్షేత్ర క్షేత్రజ్ఞరూపః ససర్వోఽపి మయావినా మద్వ్యతిరేకేణ నాస్తి. అహమేవ సర్వమిత్యర్థః. (38)

తా:- దీనినే సంక్షేపించి చెప్పుచున్నాడు జీవుడు, ఈశ్వరుడు, గుణమగు క్షేత్రము, గుణములు, నీలక్షేత్రజ్ఞుడు, సర్వమునకు ఆత్మయైన సమస్తమైన నన్ను వీడి(నేనులేక) న భావః = పదార్థము ఎప్పుడునూ వుండదు. (38)

39శ్లో॥ సఙ్ఖ్యానం పరమాణూనాం కాలేన క్రియతే మయా ।
న తథా మే విభూతీనాం సృజతోఽండాని కోటిశః ॥

టీ:- నను సామాన్యతః కిమేవం సంక్షిప్య కథయసి పూర్వవన్నిర్ధారణ సంబంధాభ్యాం విశేషతస్సర్వాః కథయేతి చేత్తత్రాహ - సంఖ్యానమితి సంఖ్యానం పృథివ్యాది పరమాణూనాం కాలేన మహతా తదపి మయైవ క్రియతే కృత్వా చ వక్తుం శక్యతే తథా మే విభూతీనాం సంఖ్యానం కర్తుం న శక్యతే- కుత ఇత్యతఆహ - సృజతోఽండానీతి. యదా మయా సృజ్యమానానాం బ్రహ్మాండానామేవ తావత్సంఖ్యా నాస్తి తదా కుత స్తద్గతానాం విభూతీనాం సంఖ్యేత్యర్థః. (39)

తా:- సామాన్యముగా ఏమి? ఈ ప్రకారము సంక్షేపించి చెప్పుచున్నావు పూర్వమువలె నిర్ధార సంబంధములతో విశ్లేషించి అన్నింటినీ చెప్పుము అనిన చెప్పుచున్నాడు. పృథివి మొదలయిన వాటి పరమాణువుల గణన చాలా కాలముచే నాచే చేయబడెను కాని కోట్ల కొలది బ్రహ్మాండములను సృజించుచున్న నా విభూతును అట్లు లెక్కింప వీలుగాదు.(39)

40శ్లో॥ తేజఃశ్రీః కీర్తిరైశ్వర్యం హ్రీస్త్యాగః సౌభగం భగః ।
వీర్యం తితిక్షా విజ్ఞానం యత్ర యత్ర సమేఽంశకః ॥

టీ:- తథాపి విశేషత ఏవ సర్వా అపి సంక్షేపతః కథయామీత్యాహ- తేజ ఇతి. తేజః ప్రభావః శ్రీస్సంపత్ సౌభగం మనో నయనాహ్లాదకత్వం భగః భాగ్యం. బలం వీర్యం అంశకః విభూతిః విభూతిః.(40)

తా:- అయిననూ విశేషముగానే అన్నీ సంక్షేపముగా చెప్పుదును అనుచున్నాడు. ప్రభావము, సంపద, కీర్తి, ప్రభుత్వము, లజ్జ, త్యాగము, సౌభ్యాగ్యము, బలము, ఓర్పు, అనుభవజ్ఞానము ఎక్కడెక్కడ కలవో అవి నా అంశములని తెలియుము. (40)

41శ్లో॥ ఏతాస్తే కీర్తితాః సర్వాః సంక్షేపేణ విభూతయః ।
మనోవికారా ఏవైతే యథా వాచాభి ధీయతే ॥

టీ:- ఉపసంహరతి- ఏతా ఇతి. ఏతే విభూతిభేదాస్తు మయి చిత్తావతారాయ కథితాః అతో నాత్ర అతీవ అభినివేశః కర్తవ్య ఇత్యాహ - మనోవికారా ఏవైతే న తు పరమార్థాః. యథా కించిత్ఖ పుష్పాది వాఙ్మాత్రేణాభి ధీయతే తత్తుల్యాః. (41)

తా:- ఉపసంహరించుచున్నాడు. ఈ విభూతులన్నీ నీకు సంగ్రహముగా చెప్పినాను. ఇవి నా యందు చిత్తము నిలుపుటకై చెప్పబడినవి అందువలన వీని యందు ఎక్కువ అభినివేశము చేయదగదు . ఇవి మనస్సునకు కలత కలగించునవేయగును. పరమార్థములు కావు ఏ విధముగా ఆకాశ పుష్పములు వాఙ్మాత్రముగా చెప్పబడుచున్నవో అట్లే ఇవి యగును. (41)

42శ్లో॥ వాచం యచ్ఛ మనోయచ్ఛ ప్రాణాన్ యచ్ఛేంద్రియాణి చ ।
ఆత్మానమాత్మనా యచ్ఛ న భూయః కల్పసేఽధ్వనే ॥

టీ:- తస్మాత్ వాచమితి. వాగదీని నియచ్ఛ అత్మానం బుద్ధిం ఆత్మనా సత్త్వసంపన్నయా తయైవ నియచ్ఛ. అధ్వనే సంసార మార్గాయ.(42)

తా:- వాక్కును నిరోధింపుము, మనస్సును నిగ్రహింపము, ప్రాణమును నిరోధింపుము, ఇంద్రియములను అరికట్టుము, బుద్ధిని సత్త్వ సంపన్న బుద్ధితో నియమింపుము. ఇట్లు చేసితివేని నీవు మరల సంసారము దారికి రావు. (42)

43శ్లో॥ యో వై వాఙ్మనసీ సమ్యగ్ అసంయచ్ఛన్ ధియాయతిః ।
తస్య వ్రతం తపో దానం స్రవత్యామఘటాంబువత్ ॥

తా:- ఏ యతి వాక్కును, మనస్సును, శుద్ధ బుద్ధితో చక్కగా నిరోధింపడో అతని వ్రతము, తపస్సు, జ్ఞానము పచ్చికుండలోని నీరువలె కారిపోవును. (43)

టీ:- అసంయమనే దోషమాహ - యఇతి. అసంయచ్ఛన్ న సంయచ్ఛతి. (43)

44శ్లో॥ తస్మాన్మనో వచః ప్రాణాన్నియచ్ఛేన్మత్పరాయణః ।
మద్భక్తి యుక్తయా బుద్ధ్యా తతః పరి సమాప్యతే ॥

తా:- కాబట్టి నా భక్తితో కూడిన బుద్ధితో వాక్కును, మనస్సును, ఇంద్రియములను, నియమింపవలెను అట్లు చేసెదవేని కృతకృత్యుడవు కాగలవు. (44)

టీ:- తస్మాదితి. పరిసమాప్యతే కృతకృత్యో భవిష్యతీత్యర్థః. (44)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
షోడశోఽధ్యాయః

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
షోడశాధ్యాయము సమాప్తము.

## సప్తదశోఽధ్యాయః

### ఉద్దవ ఉవాచ

1శ్లో॥ యస్త్వయాభిహితః పూర్వం ధర్మస్త్వద్భక్తి లక్షణః ।
వర్ణాశ్రమాచారవతాం సర్వేషాం ద్విపదామపి. ॥

టీ:- శ్లో.తతస్సప్తదశే పృష్టే స్వధర్మే భక్తి లక్షణే, హంసోక్తం ధర్మమన్వాహ బ్రహ్మచారి గృహస్థయోః. కర్మహంవిద్ధి సాత్వతామిత్యత్ర భక్త్యా కృతం కర్మ మోక్ష సాధనం మద్విభూతిరిత్యుక్తం. భక్తి సాధనత్వం చ కర్మణాం మయోదితేష్వవహితస్స్వధర్మేష్విత్యాదినా. తత్ర తత్రోక్తం. న చ. కర్మానుష్ఠాతౄణాం నియమేన భక్తిర్దృశ్యతే. అతః పృచ్ఛతి సప్తభిః య ఇతి. పూర్వం కల్పాదౌ త్వద్భక్తి లక్షణః త్వద్భక్తిజ్ఞాపకః తత్సాధన మిత్యర్థః. స చ వర్ణాశ్రమాచారవతామపి సర్వేషాం చ ద్విపదాం వర్ణాశ్రమహీనానామపి నరాణాం. (1)

2శ్లో॥ యథానుష్ఠీయమానేన త్వయి భక్తిర్నృణాం భవేత్ ।
స్వధర్మేణారవిందాక్ష తన్మమాఖ్యాతు మర్హసి ॥

టీ:- యథేతి. యథా యేన ప్రకారేణానుష్ఠీమయానేన స్వధర్మేణ.నను సంప్రదాయాదేవ జ్ఞాస్యతే కిం పునర్వర్ణనేన? తత్రాహ (2)

## పదిహేడవ అధ్యాయము.

### ఉద్ధవుడు చెప్పుచున్నాడు

తా:- తతః సప్తదశేపృష్టే స్వధర్మే భక్తి లక్షణే హంసోక్తం ధర్మమన్వాహ బ్రహ్మచారి గృహస్థయోః. ఈ పదిహేడవ అధ్యాయమున స్వధర్మమగు భక్తి లక్షణముగు ప్రశ్న చేయబడగా అందుకు హంస స్వరూపడైన భగవంతుడు, ఇది వరలో చెప్పిన బ్రహ్మచారి గృహస్థ ధర్మములు వర్ణింప బడును. "కర్మాహంవిద్ది సాత్త్వతాం" అను శ్లోకము నందు భక్తితో చేయబడిన పూజదికము మోక్షసాధనము, నా విభూతి యని చెప్పిబడినది "నాచే చెప్పబడిన స్వధర్మములందే" "మయోదితేషు ఇత్యాదినా" కర్మలకు భక్తి సాధనత్వము అక్కడక్కడ చెప్పబడినది. కాని కర్మానుష్ఠాతలకు నియమముగా భక్తి కనుపించుట లేదు. అందు వలన దానిని గూర్చి ఏడు శ్లోకములచే ప్రశ్నించుచున్నాడు. వర్ణాశ్రమచారము గల అందరికి, వర్ణాశ్రమహీనులకు నీ భక్తిని సాధించునదైన ఏ ధర్మము నీచే చెప్పబడినది. (1)

తా:- ఓ పుండరీకాక్ష ! ఏ ప్రకారము స్వధర్మానుష్ఠానము చేయు బడుట వలన నరులకు నీ యందు భక్తికలుగునో ఆ ధర్మానుష్ఠాన ప్రకారము నాకు చెప్పుము. (2)

3శ్లో॥ పురాకిల మహాబాహో ధర్మం పరమకం ప్రభో
యత్తేన హంసరూపేణ బ్రహ్మణేఽభ్యాత్థ మాధవ ॥

టీ:- పురేతి . పరమ కం పరమశ్చాసౌ కం సుఖరూపశ్చ తం యత్ యం.హంసరూపే ధర్మోఽ ప్యుక్త ఏవ. న తు యోగమాత్రం. శ్లో. "జానీత మాగతం యజ్ఞం యుష్మద్ధర్మవివక్షయే"త్యుక్తత్వాత్. (3)

తా:- ఓయీ ! సంప్రదాయము వలననె తెలియబడదువు, అందులకై వర్ణన ఎందులకనగా చెప్పుచున్నారు. ఓ మహాబాహూ! పూర్వము నీవు హంస స్వరూపుడనై బ్రహ్మకు ఏ నిత్య సుఖరూపమైన ధర్మమును చెప్పితివో, కేవలము యోగము మాత్రముకాదు. "మీకు ధర్మమును చెప్పగోరి వచ్చిన నన్ను యజ్ఞపురుషునిగా తెలిసికొనుడు"అని చెప్పుట వలన ధర్మము కూడా చెప్పబడినది యోగము మాత్రమే కాదు. (3)

4శ్లో॥ స ఇదానీం సుమహతా కాలేనామిత్ర కర్శన ।
న ప్రాయో భవితా మర్త్యలోకే ప్రాగనుశాసితః ॥

టీ:- స ఇతి. ప్రాగనుశాసితోఽపి న భవితా న భవిష్యతి. (4)

తా:- ఓ శత్రుకర్శనా! పూర్వము నీ వనుశాసించిన ఆ ధర్మము చాలా కాలమయినందున మనుష్య లోకమునందు అట్లే స్థిరముగా యుండదు కదా! (4)

5శ్లో॥ వక్తా కర్తాఽవితా నాన్యో ధర్మస్యాచ్యుత తే భువి ।
సభాయామపి వైరించ్యాం యత్రమూర్తి ధరాః కలాః ॥

6శ్లో॥ కర్త్రా విత్రా ప్రవక్త్రా చ భవతా మధుసూదన ।
త్యక్తే మహీతలే దేవ వినష్టం కః ప్రవక్ష్యతి ॥

టీ:- అత్ర హేతుమాహ - ద్వాభ్యాం వక్తేతి. యే వదంతి బ్రాహ్మణాః యే చ కర్తారో మహాంతః. యే చ పాలయంతః క్షత్రియాస్తేషాం మధ్యే ధర్మస్య తే త్వత్తః అన్యః కలాః వేదాద్యాః. (5,6)

తా:- ఇచ్చట హేతువును చెప్పుచున్నాడు. ఓ అచ్యుతా! ధర్మము యొక్క వక్త, కర్తా, రక్షించువాడు, నీ కంటే అన్యుడు బ్రహ్మసభలో ననూ ఉండడు. ఏ సభయందు వేదాది విద్యలు మూర్తి మంతములై యుండును. (5)

తా:- ఓ మధుసూదనా! ధర్మకర్త, ప్రవక్త, రక్షకుడవైన నీవు భూతల మును త్యజించిన, నష్టప్రాయమయిన ఈ ధర్మమును చెప్పు వారెవ రుందురు. (6)

7శ్లో॥ తత్త్వం నః సర్వ ధర్మజ్ఞ ధర్మస్త్వద్భక్తి లక్షణః ।
యథా యస్య విధీయేత తథా వర్ణయ మే ప్రభో ॥

టీ:- తదితి. తత్తస్మాత్. నః అస్మాకం మనుష్యాణాం మధ్యే. యో ధర్మో యస్య యథా విధీయతే. (7)

తా:- అన్ని ధర్మములు తెలిసినవాడా! అందువలన నీవు భక్తి లక్షణమగు ధర్మము, ఎట్లు, ఎవడు, ఏ ప్రకారమనుష్ఠించ వీలగునో? ఆ ధర్మమును నాకు చెప్పుము. (7)

శ్రీ శుక ఉవాచ

8శ్లో॥ ఇత్యం స్వభృత్య ముఖ్యేన పృష్టః స భగవాన్ హరిః ।
ప్రీతః క్షేమాయ మర్త్యానాం ధర్మానాహ సనాతనాన్ ॥

శ్రీ శుకుడు చెప్పుచున్నాడు

తా:- ఈ విధముగా తన భృత్యులలో ముఖ్యడయిన ఉద్ధవుడడుగగానే ఆ భగవంతుడయిన హరి సంతుష్టుడై మానవులకు క్షేమము చేకూరుటకై సనాతన ధర్మములను చెప్పెను. (8)

శ్రీభగవానువాచ

9శ్లో॥ ధర్మ ఏష తవ ప్రశ్నో నైశ్రేయస కరో నృణామ్ ।
వర్ణాశ్రమాచారవతాం తముద్ధవ నిభోధ మే ॥

టీ:- ధర్మ్యఇతి. ధర్మ్యః ధర్మాదనపేతః. కుతః నైశ్శ్రేయసకరః భక్తి జనకః అతః మే మత్తః తం ధర్మం నిభోధ. (8,9)

శ్రీభగవంతుడుచెప్పెను

తా:- ఓ ఉద్ధవా! నీవున్నడిగిన ప్రశ్న ధర్మబద్ధమైనది. నరులకు శ్రేయస్కరమయినది. వర్ణాశ్రమాచారవంతులగు నరులకు మోక్ష ప్రదమయినది. కావున ఆ ధర్మమును నా వలన వినుము. (9)

10శ్లో॥ ఆదౌకృతయుగే వర్ణోనృణాం హంస ఇతి స్మృత ।
కృత కృత్యాః ప్రజా జాత్యా తస్మాత్కృతయుగం విదుః ॥

టీ:- తత్రాదౌ మదుపాసనా లక్షణ ఏవ ముఖ్యధర్మ ఆసీత్. ఆచార లక్షణస్తు ధర్మః ప్రశ్చాత్ ప్రవృత్తః. స చైవమనుష్ఠితో భక్తియోగం జనయతీతి వర్ణయితుమాహ - ఆదావితి. కల్పాదౌ యత్కృతయుగం తస్మిన్. తే చ తదానీం మామూపాసత ఏవ కేవలం. నాన్యత్కుర్వంతీతి వక్తుం కృతయుగనామ నిరుక్తిమాహ - కృతకృత్యా ఇతి. జాత్యా జన్మనైవ. (10)

తా:- అందు మొదట సృష్టి ప్రారంభమన నా యొక్క ఉపాసనా లక్షణమే ముఖ్య ధర్మమై యుండెను. ఆచార లక్షణమైన ధర్మము మాత్రము తరువాత ప్రవర్తించినది. ఈ ప్రకారము ఆధర్మము అనుష్ఠిపబడినదై భక్తియోగమును జనింపజేయుచున్నదని వర్ణించుటకు చెప్పుచున్నారు. కల్పాది లేక సృష్టి ప్రారంభమునందు (కృతయుగము నందు) కేవలము నన్నే ఉపాసించుచుండిరి. అన్యమేమి చేయకుండిరి. అని చెప్పుటకు కృతముగ నామమును నిర్వచించున్నారు. కల్పాది యందు కృతయుగమున నరుల జాతి హంసయని చెప్పబడును. ఆ జాతిచేతనే జన్మ చేతనే ప్రజలు కృతార్థులు కృతకృత్యులు అగుచుండిరి. కావున ఆ యుగమునకు కృతయుగ మను నామముసార్థకమగునని తెలిసికొనుము. (10)

11శ్లో॥ వేదః ప్రణవ ఏవాగ్రే ధర్మోఽహం వృషరూప ధృక్ ।
ఉపాసతే తపోనిష్ఠా హంసం మాం ముక్తకిల్బిషాః ॥

టీ:- కించ. విధాయకా భావాదపి తదానీం నాన్యత్ కర్మాస్తీత్యాహ - వేదఇతి. ధర్మశ్చ మనోవిషయోఽహమేవ వృషరూప ధృత్ చతుష్పాత్. సక్రియావిశేషో యజ్ఞాదిః. అత స్తపోనిష్ఠాః శ్లో. "మనసశ్చేంద్రియాణాం చహ్యైకాగ్ర్యం పరమం తప"ఇతి వచనాత్. ఏకాగ్రతయా హంసం శుద్ధం మాం ధ్యాయంతీత్యర్థః. (11)

తా:- ఇట్టి ధ్యానమున కన్న అప్పుడన్యమగు విధాయకమగు కర్మఏదియూ లేదనుచున్నారు. ఆది యుగము నందు ఓంకారమే వేదమైయుండెను. మనో విషయమైన, ధర్మ స్వరూపుడనైన నేను నాలుగు పాదములుగల వృషభరూపధరుడనయియున్నాను. అది క్రియా విశేషమై యజ్ఞాదికమై యుండెను. ప్రజలు వీడిన పాపములు గలవారై, తపస్సు నందు నిష్ఠ గలవారై (మనస్సు, ఇంద్రియము లేకాగ్రమగుట తపస్సు అగును) శుద్ధుడనగు నన్ను ఉపాసించుచుండిరి. "మనసశ్చేంద్రి

యాణాం చ హ్యైకాగ్ర్యం పరమం తప." మనస్సును ఇంద్రియములను ఏకాగ్రము చేయుటయే ఉత్తమమయిన తపస్సు ఈ వచనము వలన ఏకాగ్రతతో హంసుడను శుద్ధుడనయిన నన్ను ధ్యానము చేయచున్నారని అర్థము. (11)

12శ్లో॥ త్రేతాముఖే మహాభాగ ప్రాణాన్మే హృదయాత్త్రయీ ।
విద్యా ప్రాదురభూత్తస్యా అహమాసం త్రివృన్మఖః ॥

టీ:- త్రేతాముఖ ఇతి. పశ్చాత్త్రేతాయుగ ప్రవేశే మే వైరాజరూపస్య ప్రాణాన్నిమిత్తాత్. హృదయాత్సకాశాత్. తస్యాః త్రయ్యాః సకాశాత్ . హౌత్రాధ్వరౌద్గాత్రైః త్రిః త్రివృత్ త్రిరూపః మఖః యజ్ఞః. శ్రు. "యజ్ఞో వై విష్ణురి"తి. శ్రుతేః. (12)

తా:- త్రేతాయుగ ప్రవేశమందు ప్రాణనిమిత్తమైన హృదయము నుండి వేదవిద్య ఆవిర్భవించినది. ఆ విద్య వలన నేను హోత్రము, అధ్వర్యము, ఔద్గాత్రము అను మూడింటిలో కూడిన యజ్ఞస్వరూపుడనయితిని. "యజ్ఞో వై విష్ణు" అనిశృతి. (12)

13శ్లో॥ విప్ర క్షత్రియ విట్ఛూద్రా ముఖబాహూరు పాదజాః ।
వైరాజాత్పురుషా జ్ఞాతా య ఆత్మాచార లక్షణా ః ॥

టీ:- వర్ణానామాశ్రమాణాం చ ధర్మాన్ వక్తుం తేషాముత్పత్తిమాహ-ద్వాభ్యాం. విప్రేతి. స్వధర్మ ఏవ లక్షణం జ్ఞాపకో యేషాం తే. (13)

తా:- వర్ణాశ్రమముల ధర్మములను చెప్పుటకై వాని ఉత్పత్తిని రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అను నాలుగు జాతులుగల వారై వారి వారి జాత్యాచారములు స్వధర్మ లక్షణములతో కూడిన వారయిరి. (13)

14శ్లో॥ గృహాశ్రమో జఘనతో బ్రహ్మచర్యం హృదోమమ ।
వక్షస్థానాద్వనేవాసో న్యాసః శీర్షణి సంస్థితః ॥

టీ:- గృహాశ్రమ ఇతి. మమ వైరాజరూపస్య హృదః వక్షసోఽధస్తాత్. బ్రహ్మచర్యమితి నైష్ఠికాభిప్రాయం. (14)

తా:- విరాట్పురుషడనయిన నా జఘన ప్రదేశము నుండి గృహస్థాశ్రమము, వక్షస్థలము కింది భాగము నుండి బ్రహ్మచర్యము, వక్షస్థలము నుండి వానప్రస్థము, శిరస్సు నుండి సన్యాసము అను ఆశ్రమములు జనించినవి. (14)

15శ్లో॥ వర్ణానామాశ్రమాణాం చ జన్మభూమ్యను సారిణీః ।
ఆసన్ప్రకృతయో నృణాం నీచైర్నీచోత్తమోత్తమాః ॥

టీ:- తేషామధికారి విశేషేణ స్వభావానాహ - పంచభిః. వర్ణానామితి. జన్మస్థానానుసారిణ్యః. నీచైరిత్యవ్యయం. అతోఽయమర్థః. మందాభిర్జన్మభూమితిః మందాః మధ్యమాభిర్మధ్యమాః ఉత్తమాభిరుత్తమాశ్చేతి. (15)

తా:- వర్ణాశ్రమములకు అధికారి విశేషముతో స్వభావములను చెప్పుచున్నాడు ఐదు శ్లోకములతో, వర్ణములకు ఆశ్రమములకు వారి వారి జన్మస్థానముననుసరించి నరుల స్వభావములు మధ్యమోత్తములుగా మూడు విధములయ్యెను బ్రాహ్మణులు విరాట్ పురుషుని ఉత్తమ ప్రదేశమగు ముఖము నుండి జన్మించినవారు కావున ఉత్తమస్వభావులు. గృహస్థాశ్రమము ఉత్తమాశ్రమము. వాని స్వభావము ఉత్తమమయినది. (15)

16శ్లో॥ శమో దమస్తపశ్శౌచం సంతోషః క్షాంతిరార్జవమ్ ।
మద్భక్తిశ్చ దయా సత్యం బ్రహ్మ ప్రకృతయ స్త్విమాః ॥

టీ:- శమ ఇతి. తపః ఆలోచనం. (16)

తా:- శమము, దమము, ఆలోచనము, (తపము) శౌచము, సంతోషము, క్షాంతి, ఆర్జవము, నా యందలి భక్తి, దయ, సత్త్వము అనునవి బ్రాహ్మణ జాతికి స్వభావ గుణములు. (16)

17శ్లో॥ తేజోబలం ధృతి శ్శౌర్యం తితిక్షౌదార్య ముద్యమః ।
స్థైర్యం బ్రహ్మణ్య తైశ్వర్యం క్షత్రప్రకృతయస్త్విమాః ॥

తా:- తేజము, (ప్రతాపము) ధృత్రి, ధైర్యము, శౌర్యము, తితిక్ష, (సహనము) ఔదార్యము, ఉద్యమము, (ప్రయత్నము) స్థైర్యము, బ్రహ్మణ్యత, (బ్రాహ్మణ భక్తి) ఐశ్వర్యము, (ప్రభుధర్మము) అనునవి క్షత్రియజాతి స్వభావగుణములు. (17)

18శ్లో॥ ఆస్తిక్యం దాననిష్ఠా చ అందభో బ్రహ్మసేవనమ్ ।
అతుష్టిరర్థోపచయైర్వైశ్య ప్రకృతయస్త్వివమాః ॥

తా:- ధనాది సంపదల అభివృద్ధి, విషయమున తుష్టి లేకుండుట, దేవుడున్నాడను విశ్వాసము, దానముచేయుటయందు నిష్ఠ, దాంభికము లేకుండుట, విప్రసేవ అనునవి వైశ్య స్వభావములు.(18)

19శ్లో॥ శుశ్రూషణం ద్విజగవాం దేవానాంచాప్య మాయయా ।
తత్ర లబ్ధేన సంతోషః శూద్ర ప్రకృతయస్త్విమాః ॥

టీ:- తేజ ఇతి. తేజః ప్రతాపః.(17,18,19)

తా:- విప్రులకు, గోవులకు, దేవతలకు వంచన లేక సేవచేయుట దానిచే లభించిన అన్నాదులచే సంతోషించుట శూద్ర జాతి స్వభావ ములు. (19)

20శ్లో॥ అశౌచమనృతం స్తేయం నాస్తిక్యం శుష్క విగ్రహః ।
కామః క్రోధశ్చ తర్షశ్చ స్వభావోఽన్తేవసాయినామ్ ॥

టీ:- ఏతైరేవ ఆశ్రమస్వభావా అపి జ్ఞేయాః. తద్బాహ్యానాం స్వభావా నాహ- అశౌచ మితి. శుష్కవిగ్రహః నిర్మూల కలహః తర్షః తృష్ణా. (20)

తా:- ఆశ్రమాదులకు బాహ్యులయిన వారి స్వభావ గుణములను చెప్పుచున్నారు. శుచి లేకుండుట, అసత్యము చౌర్యము నాస్తికత , కారణము లేని కలహము, కామము, క్రోధము, తృష్ట అనునవి ఆశ్రమ బాహ్యులయిన వారి స్వభా గుణములు. (20)

21శ్లో॥ అహింసా సత్యమస్తేయ మకామక్రోధ లోభతా ।
భూతప్రియ హితేహా చ ధర్మో೭యం సార్వవర్ణికః ॥

టీ:- తత్ర తావత్సర్వసాధారణం ధర్మమాహ-అహింసేతి. వర్ణగ్రహణ ముపలక్షణార్థం. వర్ణధర్మాన్ గృహస్థ ప్రకరణే వక్షతి. (21)

తా:- అహింస, సత్యము, చౌర్యములేనితనము, కామ, క్రోధ, లోభములు లేకుండుట, ప్రాణులకు మేలు చేయకోరిక అనునవి సర్వ వర్ణములకు సంబంధిచిన ధర్మములు. వర్ణగ్రహణముపలక్షణార్థము వర్ణధర్మములు గృహస్థ ప్రకరణమున చెప్పబడును. (21)

22శ్లో॥ ద్వితీయం ప్రాప్యాను పూర్వ్యా జ్జన్మోపనయనం ద్విజః ।
వసన్ గురుకులే దాన్తో బ్రహ్మాధీయాత చా೭హూతః ॥

టీ:- ప్రథమం తావదాశ్రమేషు బ్రహ్మచారిణో ధర్మాః వర్ణ్యంతే స చ ద్వివిధః ఉపకుర్వాణో నైష్ఠికశ్చేతి. తత్రాద్యస్య ధర్మానాహ – నవభిః ద్వితీయమితి ద్విజః త్రైవర్ణికః, ఆనుపూర్వ్యాత్ గర్భాధానాది సంస్కార క్రమేణ. ద్వితీయముపనయనాఖ్యం జన్మప్రాప్య ఆచార్యేణాహూతః. బ్రహ్మ వేదమధీయాత చకారాత్తదర్థం చ విఛారయేత్.(22)

తా:- ప్రథమమున ఇప్పుడు ఆశ్రమముల యందు బ్రహ్మచారి ధర్మములు వర్ణింపబడును. ఉపకుర్వాణుడు, నైష్ఠికుడని బ్రహ్మచారి రెండు విధములు అందు మొదటి వాడగు ఉపకుర్వాణుని ధర్మములను తొమ్మిది శ్లోకములచే చెప్పుచున్నాడు. త్రైవర్ణికుడు గర్భాధానాది సంస్కార క్రమమున రెండవ జన్మయైన ఉపనయనమును పొంది గురుకులము నందు నివసించుచు జితేంద్రియుడై ఆచార్యుని చేత పిలువబడి వాఙ్నియమము కలవాడై వేదము నధ్యయనము చేయవలెను. చకారము వలన అర్థమును విచారించవలెను. (22)

23శ్లో॥ మేఖాలాజిన దండాక్ష బ్రహ్మసూత్ర కమండలూన్ ।
జటిలో೭ధౌత దద్వాసో೭రక్తపీఠః కుశాన్ దధత్ ॥

టీ:- మేఖలేతి. మేఖలాదీన్ కుశాంశ్చ దధత్. తత్రాక్షశబ్దేనాక్షమాలా కథంభూతః జటిలః అనభ్యంగాదినా జాతజటః. తథా అధౌతదద్వాసో

తా:- దర్భల మోలత్రాడు, జింకచర్మము, దండము, అక్షమాల యజ్ఞోపవీతము, కమండలము అనువానిని, దర్భలను ధరించుచూ అభ్యంగన స్నానములు లేక, జడలు దాల్చినవాడై నిర్మలములు కాని దంత, వస్త్రములు కలవాడై, రంజనమయిన రక్త (ఎఱ్ఱని) కంబళాదికము ఆసనముగా లేనివాడు కావలెను.(23)

రక్తపీఠః దంతాశ్చ వాసాంసి చ దద్వాసాంసి న ధౌతాని యస్య సః సచాసావరక్త పీఠశ్చన కౌతుకాదినా రక్తం పీఠం ఆసనం యస్య సః (23)

24శ్లో॥ స్నాన భోజన హోమేషు జపోచ్చారేచ వాగ్యతః ।
నచ్ఛింద్యాన్నఖ రోమాణి కక్షోఽ పస్థ గతాన్యపి ॥

టీ:- స్నానేతి. జపశ్చ ఉచ్చారో మూత్రపురీషోత్సర్గశ్చ జపోచ్చారం తస్మిన్ వాగ్యతః మౌనీ భవేత్. (24)

తా:- స్నాన, భోజన,క్రియలయందు, జపమందు, మలమూత్ర విసర్జన మందు మౌనియై ఉండవలెను. చంకలు, మర్మస్థానము నందున్న వెంట్రుక లను ఛేదింపరాదు. (24)

25శ్లో॥ రేతోనావికరేజ్జాతు బ్రహ్మవ్రతధరః స్వయమ్ ।
అవకీర్ణేఽ వ గాహ్యాప్సు యతాసు స్త్రిపదీం జపేత్ ॥

టీ:- రేతిఇతి. రేతో బుద్ధిపూర్వకం నావికరేత్ నోత్సృజేత్. బ్రహ్మవ్రత ధరః అగృహస్థః. స్వయమేవ కథంచిదవకీర్ణే అవగాహ్య స్నాత్వా యతాసుః కృతప్రాణాయామః త్రిపదీం గాయత్రీం జపేత్.(25)

తా:- వేదాధ్యయన దీక్షగలవాడు ఎప్పుడయిననూ వీర్యమును బుద్ధి పూర్వకముగా స్ఖలనము చేయరాదు. దైవికముగా వీర్యము స్ఖలనమ యినప్పుడు నీళ్ళలో మనిగి ప్రాణాయామము చేసి గాయత్రిని జపించవలెను. (25)

26శ్లో॥ అగ్న్యర్కాచార్యనో విప్ర గురు వృద్ధసు సురాన్ శుచిః ।
సమాహిత ఉపాసీత సంధ్యే చ యత వాగ్జపన్ ॥

టీ:- అగ్నీతి. సంధ్యే చ ద్వే. యతావాన్ జపన్నుపాసీత. చ శబ్దాత్ మధ్యాహ్న సంధ్యాయామపి యద్వా. మధ్యాహ్నే సంధ్యా నిమిత్తం మౌనం నాస్తితి ద్వివచనం. (26)

తా:- అగ్ని , సూర్య, ఆచార్య, గో, విప్ర, గురు, వృద్ధ, సురులను సేవింపవలెను. శుద్ధుడై ఏకాగ్రచిత్తుడై యుండవలెను. వాక్కునియమము గలవాడై ప్రాతస్సాయంకాల సంధ్యలను జపించుచూ ఉపాసించవలెను. మధ్యాహ్నమున సంధ్యానిమిత్తమయిన మౌనములేదని ద్వివచనము. 26

27శ్లో॥ ఆచార్యం మాం విజానీయాన్నావమన్యేత కర్హిచిత్ ।
నమర్త్య బుద్ధ్యాఽసూయేత సర్వదేవమయో గురుః ॥

తా:- తనకు వేదాధ్యయనము చెప్పు ఆచార్యుని నన్నుగా తెలుసుకోవలెను. ఒకప్పుడు అవమానింపవలదు మానవ బుద్ధితో అసూయపడరాదు. గురువు సకల దేవాతాస్వరూపుడు.(27)

28శ్లో॥ సాయంప్రాతరుపానీయ భైక్ష్యంతస్మై నివేదయేత్ ।
యచ్చాన్య దప్యనుజ్ఞాత ముపయుంజీత సంయుతః ॥

టీ:- సాయమితి. అన్యదపి యత్సంప్రాప్తం తచ్చ నివేదయేత్ తేనానుజ్ఞాతః. సంయతస్సన్నుపయుంజీత ఉపభుంజీతేత్యర్థః. (27,28)

తా:- సాయం ప్రాతః కాలముల యందు తెచ్చిన భిక్షాన్నమును గురువుకు నివేదింపవలెను. అన్యమయినది ఏది దొరికిననూ గురువుకు నివేదించవలెను. గురువు అనుమతి పొంది, నియత చిత్తుడై భిక్షాన్నము భుజింపవలెను. (28)

29శ్లో॥ శుశ్రూషమాణ ఆచార్యం సదోపాసీత నీచవత్ ।
యానశయ్యాసనస్థానైర్నాతి దూరే కృతాంజలిః ॥

టీ:- శుశ్రూషమాణ ఇతి. యానశయ్యాసనస్థానైః యాంతం పృష్ఠతో యానేన. నిద్రితమప్రమత్తతయా సమీపశయనేన విశ్రాంతం పాద సంవాహనాదిభిః. సమీపాసనేన ఆసీనం కృతాంజలిర్వియోగ ప్రతీక్షయా నాతిః దూరావస్థానేనేత్యర్థః. (29)

తా:- గురువును సేవించుచూ ఎల్లప్పుడు తాను అల్పుని వలె నమస్కరించుచూ, పడుకున్నప్పుడు, యానము నందు కాని, ఆసనము నందుకాని తాను అల్పునిగా కొంత దూరమున ఉంటూ చేతులు జోడించి సేవింపవలెను. (29)

30శ్లో॥ ఏవం వృత్తో గురుకులే వసేద్భోగ వివర్జితః ।
విద్యా సమాప్యతే యావద్బి భ్రద్వ్రతమఖండితమ్ ॥

టీ:- ఏవంవ్రత ఇతి. ఏవంభూతం వ్రతం వృత్తం యస్య.(30)

తా:- ఇట్టి నియమము కలవాడై ఎంత వరకు విద్య పూర్తియగునో అంత వరకు ఇంద్రియ భోగములను వర్జించిన వాడై స్ఖాలిత్యము పొందని వ్రతమును భరించుచు గురుకుల మందు నివసింపవలెను. (30)

31శ్లో॥ యద్యసౌ ఛందసాం లోకమారోక్ష్యన్ బ్రహ్మవిష్టపమ్ ।
గురవే విన్యసేద్దేహం స్వాధ్యాయార్థం బృహద్వ్రత ః ॥

టీ:- ఏవముపకుర్వాణస్య ధర్మానుక్త్వా నైష్ఠికస్య విశేషధర్మానాహ-షడ్భిః యదీతి. అసౌ బ్రహ్మచారీ యది ఛందసాం లోకం మహర్లోకం. తతో బ్రహ్మలోకం చారోక్ష్యన్. ఆరోఢుమిచ్ఛన్నిత్యర్థః. యద్వా ఛందసాం లోకమితి. బ్రహ్మలోకవిశేషణం. యత్ర మూర్తిధరాః కలా ఇత్యుక్తత్వాత్. తర్హి బృహద్వ్రతస్సన్ బృహత్ నైష్ఠికం వ్రతం యస్య సః వినయసేత్స మర్పయేత్. అధికస్వాధ్యాయార్థం వా అధీతనిష్క్రియార్థం వా.(31)

తా:- ఈ ప్రకారముపకుర్యాణుని ధర్మములు చెప్పినైష్ఠిక బ్రహ్మచారి విశేష ధర్మము లు చెప్పుచున్నాడు ఆరు శ్లోకములతో. ఈ బ్రహ్మచారి వేదముల లోకమగు మహర్లోకమును, అచ్చటి నుండి బ్రహ్మలోక మును ఎక్కగోరిన వాడగుచు అని అర్థము లేదా. ఛందస్సుల లోకమనగా వేదములు మూర్తిమంతమై యుండు బ్రహ్మలోకమును అని విశేషణముగా చెప్పుకొనవచ్చును."యత్రమూర్తి ధరాః కలాః" అని చెప్పుట వలన నైష్ఠికవ్రతము కలవాడై అధికముగా వేదమునధ్యయనము చేయుటకుగాని అధ్యయనము చెప్పిన గురుని ఋణము తీర్చుటకు గాని గురువునకు తన దేహమును సమర్పింపవలెను. (31)

32శ్లో॥ అగ్నౌగురావాత్మని చ సర్వభూతేషు మాం పరమ్ ।
అపృథగ్ధీరుపాసీత బ్రహ్మవర్చస్వ్యకల్మషః ॥

టీ:- అగ్నావితి బ్రహ్మవర్చః వేదాభ్యాసజం తేజః తద్వాన్.(32)

తా:- అగ్నియందు, గురువునందు, తనయందు, సర్వభూతముల యందు భేద బుద్ధి లేనివాడై, వేదాధ్యయనము వలన తేజస్సు గలవాడై, పాపరహితుడై (పరుడైన) నన్ను సేవింపవలెను. (32)

33శ్లో॥ స్త్రీణాం నిరీక్షణ స్పర్శ సల్లాపక్ష్వేళ నాదికమ్ ।
ప్రాణినో మిథునీ భూతాన గృహస్థోఽగ్రతస్త్యజేత్ ॥

టీ:- తస్యైవ వనస్థ యతి సాధారణాన్ ధర్మానాహ – స్త్రీణామితి. నిరీక్షణం భావగర్భం. క్ష్వేళనం పరిహాసః ఏవమాదికం త్యజేత్ మిథునీ భూతానగ్రతస్త్యజేత్. న పశ్యేదిత్యర్థః. (33)

తా:- వానప్రస్థ యతి ధర్మములను చెప్పుచున్నారు. స్త్రీలను చూచుట, తాకుట, వారితో మాట్లాడుట, వారిని పరిహసించుట, దంపతులై కలిసి యున్న ప్రాణులను చూచుట గృహస్థుడు కానివాడు చేయరాదు. (33)

34శ్లో॥ శౌచమాచమనం స్నానం సంధ్యోపాసనమార్జవమ్ ।
తీర్థసేవా జపోఽస్పృశ్యా భక్ష్యా సంభాష్య వర్జనమ్ ॥

తా:- అతనికే సర్వాశ్రమ సాధారణ ధర్మములను రెండు శ్లోకములతో చెప్పుచున్నారు. శరీరమునకు పారిశుద్ధ్యము, ఆచమనము, స్నానము, సంధ్యోపాసనము, నన్ను పూజించుట, తీర్థసేవ, జపము, స్పృశింపరాని, తినరాని, సంభాషింపరాని వానిని విడుచుట ఇవి గలవాడు కావలెను. (34)

35శ్లో॥ సర్వాశ్రమ ప్రయుక్తోఽయం నియమః కులనందన ।
మద్భావః సర్వభూతేషు మనోవాక్కాయ సంయమః ॥

టీ:- తస్యైవ సర్వాశ్రమ సాధారణ ధర్మానాహ – ద్వాభ్యాం. శౌచమితి. (34,35)

తా:- ఈ నియమము అందరికీ ఉపయుక్తమైనది అన్ని భూతము లందు నన్ను దర్శింపగలిగి, మనస్సు, వాక్కు, శరీరములను అదుపు లోనుంచుకొనుట. (35)

36శ్లో॥ ఏవం బృహద్వ్రతధరో బ్రాహ్మణోగ్నిరివ జ్వలన్ ।
మద్భక్తస్తీవ్ర తపసా దగ్ధ కర్మాశయోఽమలః ॥

తా:-నిష్కామనైష్ఠికునకు మోక్షము ఫలము అనుచున్నారు. ఈ ప్రకారము బ్రహ్మచర్యమునను ష్ఠించిన బ్రాహ్మణుడు అగ్నివలె జ్వలించుచు నా

టీ:- నిష్కామనైష్ఠికస్య మోక్షం ఫలమాహ - ఏవమితి. అమలః నిష్కామశ్చ దగ్ధః కర్మాశయః అంతఃకరణం యస్య తథా భూతస్సన్ మద్భక్తో భవతి. (36)

భక్తుడై కఠోర తపస్సుచే కర్మవాసనలన్నియు నశించి చిత్తశుద్ధి గలవాడగుచున్నాడు. (36)

37శ్లో॥ అథానన్తరమావేక్ష్య న్యథా జిజ్ఞాసితాగమః ।
గురవే దక్షిణాం దత్వా స్నాయాద్గుర్వనుమోదితః ॥

టీ:- ఉపకుర్వాణస్య సమావర్తన ప్రకారమాహ - అథేతి. అనంతరం ద్వితీయాశ్రమః. ఆవేక్ష్యన్ ప్రవేష్టుమిచ్ఛన్. యథా యథా వద్విచారిత వేదార్థః స్నాయాత్ అభ్యంగాదికం కుర్వన్ సమావర్తేతేత్యర్థః. (37)

తా:- ఉపకుర్వాణ బ్రహ్మచారికి సమావర్తనము చేయువిధానము చెప్పుచున్నారు. తరువాత రెండవదగు గృహస్థాశ్రమమును ప్రవేశింప గోరుతూ యథా విధిగా వేదార్థ విచారము చేసినవాడై గురువుకు దక్షిణ నిచ్చి గురువు ఆమోదము పొంది అభ్యంగన స్నానము చేయవలెను . (మరలవలెను అని అర్థము) (37)

38శ్లో॥ గృహం వనం వా ప్రవిశేత్ప్రవ్రజే ద్వా ద్విజోత్తమః ।
ఆశ్రమాదాశ్రమం గచ్ఛేన్నాన్యథామత్పరశ్చరేత్ ॥

టీ:- తస్యాధికారాను రూపాశ్రమవికల్ప సముచ్చయానాహ - గృహమితి. సకామశ్చేద్గృహం. అంతఃకరణ శుద్ధాదికామశ్చేద్వనం ప్రవిశేత్. శుద్ధాంతఃకరణః స చ ద్విజోత్తమః ద్విజోత్తమ ఇత్యుక్తే క్షత్రియ వైశ్యయోర్నప్ర వ్రజ్యాధికారం సూచయతి బ్రాహ్మణశ్చేత్ప్రవ్రజేదిత్యర్థః. యద్వా. ఆశ్రమాదాశ్రమాంతరం గచ్ఛేత్ అన్యథా. అనాశ్రమీ

తా:- వానికి అధికారానురూపమైన ఆశ్రమ వికల్పమును సముచ్చయమును చెప్పుచున్నారు. సకాముడైనచో గృహమును ప్రవేశించవలెను. అంతఃకరణ శుద్ధ్యాది కాముడైనచో వనమును ప్రవేశింపవలెను. శుద్ధాంతఃకరణుడైనచో సన్యసించవలెను. ద్విజోత్తః బ్రాహ్మణశ్రేష్ఠుడు అనుటచే క్షత్రియ, వైశ్యులకు ప్రవ్రజ్యాధికారములేదని సూచించుచున్నారు. బ్రాహ్మణుడైనచో సన్యసించవలెను. లేదా ఒక ఆశ్రమము నుండి తరువాత ఆశ్రమమును క్రమముగా పొందవలెను. ఏ ఆశ్రమము లేనివాడై వ్యతిక్రమముగా పై ఆశ్రమము నుండి క్రింది

ప్రతిలోమం చ నాచరేదిత్యర్థః. అమత్పర ఇతి వా పదచ్ఛేదః.స్వభక్తస్యా శ్రమ నియమాభా వస్య వక్ష్యమాణత్వాత్.(38)

ఆశ్రమమును పొందరాదు లేక నా భక్తుడై చరించ వలెను నా భక్తుడు కానివాడు అనియు పదవిభాగము స్వభక్తునిని ఆశ్రమ నియమాభావము ముందు చెప్పగలరు. (38)

39శ్లో॥ గృహార్థీ సదృశీం భార్యాం ఉద్యహేదజుగుప్సితామ్ ।
యవీయసీం తు వయసా సమ వర్ణామనుక్రమాత్ ॥

టీ:- వివాహనియమపూర్వకం వర్ణధర్మైస్సహ గృహస్థస్య ధర్మానాహ- గృహార్థీతి. సదృశీం సమవర్ణాం అనుక్రమాత్ అజుగుప్సితాం కులతో లక్షణతశ్చానిందితాం. కామతస్తు యామన్యాముద్వహేత్. తాం సమవర్ణా వను తస్యాః అనంతరం తత్రాపి వర్ణక్రమేణోద్వహేదిత్యర్థః. శ్లో. "తిస్రోవర్ణానుపూర్వ్యేణ ద్వే తథైకాం యథా క్రమం, బ్రాహ్మణ క్షత్రియ విశాం భార్యాస్తాశ్శూద్రజన్మన"ఇతిస్మృతేః.(39)

తా:- వివాహాది నియమ పూర్వకముగా వర్ణధర్మములతో సహా గృహస్థ ధర్మములను చెప్పుచున్నాడు. గృహస్థుడు కాగోరినవాడు తనకు సాటియై, కులమును బట్టి నిందిత కానిదై, తనకన్నా చిన్నదైన తన కులములోని దైన కన్యను కులక్రమము ననుసరించి భార్యగా స్వీకరించవలెను. కామమును బట్టి ఇతర కన్యలను వివాహ మాడవలసినచో వర్ణక్రమము ననుసరించి వివాహమాడవలెను."తిస్రోవర్ణాను పూర్వ్యేణ ద్వే తథైకాం యథా క్రమం బ్రాహ్మణ క్షత్రియ విశాం భార్యాస్తాశ్శూద్రజన్మనః" వర్ణక్రమమునసరించి బ్రాహ్మణుడు మూడు కులముల కన్యలను క్షత్రియుడుద్దరిని వైశ్యుడు శూద్రకన్యను వివాహమాడవచ్చును శూద్రుడు శూద్రకన్యనే వివాహమాడవలెను. (39)

40శ్లో॥ ఇజ్యాధ్యయన దానాని సర్వేషాం చ ద్విజన్మనామ్ ।
ప్రతిగ్రహోఽధ్యాపనం చ బ్రాహ్మణస్యైవయాజనమ్ ॥

టీ:- ఇజ్యేతి. ఇజ్యాదయస్త్రైవర్ణికానామావశ్యకా ధర్మాః ప్రతిగ్రహాది త్రయం తు వృత్తిః సా చ బ్రాహ్మణస్యైవ. (40)

తా:- ద్విజులగు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు యజ్ఞము చేయుట, వేదాధ్యయనము చేయుట, దానము చేయుట తగును. బ్రాహ్మణున కొక్కనికి దానము స్వీకరించుట, అధ్యాపనము చేయుట, యజ్ఞము చేయించుట తగును. (40)

41శ్లో॥ ప్రతిగ్రహం మన్యమానస్తపస్తేజో యశోనుదమ్ ।
అన్యాభ్యామేవ జీవేత శిలైర్వాదోషదృక్తయోః ॥

టీ:- తత్రాపి ముఖ్యాం ముఖ్యతమాం చాన్యాం వృత్తిమాహ - ప్రతిగ్రహమితి. తయోర్యజనాధ్యాపనయోరపి కార్పణ్యాది దోషం పశ్యన్ శిలైః స్వామిపరిత్యక్తైః క్షేత్రపతితైః కణిశైః. (41)

తా:- అందుననూ ముఖ్యము ముఖ్యతమము అయిన ఇంకొక వృత్తిని చెప్పుచున్నా డు. దానమును గ్రహించుట, తపస్సు, తేజస్సు, కీర్తియను వానిని హరించునదిగా తలచుచూ యాజనాధ్యాపనముల యందు కార్పణ్యాది దోషముచూచువాడై యాజనాధ్యాపనములచే జీవించ వలెను. యజమాని త్యజించిన క్షేత్రపతితములయిన ధ్యాన్యపు గింజలచే జీవించవలెను. (41)

42శ్లో॥ బ్రాహ్మణస్య తు దేహోఽయం క్షుద్ర కర్మాయ నేష్యతే ।
కృచ్ఛ్రాయ తపసే చేహ ప్రేత్యానంత సుఖాయ చ ॥

టీ:- ఏవం చ వృత్తికార్యం బ్రాహ్మణేన సోఢవ్యమిత్యాహ - బ్రహ్మాణస్యేతి. (42)

తా:- వృత్తి వలన కృశించుట బ్రాహ్మణుడు సహించవలెననుచున్నాడు. బ్రాహ్మణుని ఈ దేహము తుచ్ఛమగు కామమునకు ప్రార్థింపదగదు. కృచ్ఛ్రాదికమగు తపస్సుచేయుటకు దేహపాతమయిన తరువాత మోక్షమును పొందుటకు మాత్రమే కోరబడుచున్నది.(42)

43శ్లో॥ శిలోంఛ వృత్త్యా పరితుష్ట చిత్తో
ధర్మం మహాన్తం విరజం జుషాణః ।
మయ్యర్పితాత్మా గృహఏవతిష్ఠన్
నాతి ప్రసక్తః సముపైతిశాన్తిమ్ ॥

టీ:- ఉంచవృత్తిర్నామ ఆపణాది పతిత కణోపాదానం తాం శిలవృత్త్యా ఏకీకృత్యా తయా తుష్ట చిత్తస్య మోక్షం ఫలమాహ - శిలోంఛవృత్త్యేతి. మహాంతం ఆతిథ్యాది లక్షణం. విరజం నిష్కామం సేవమానః.(43)

తా:- శిలమనగా పొలమునందు రాలిన ధాన్యపుగింజ లేరుకొనుట ఉంఛమనగా అంగడి వీధులందు పడియున్న ధ్యాన్యపు గింజలను ఏరితెచ్చుకొనుట. ఈ రెండు వత్తులచే సంతృప్తి చెందిన చిత్తము గలవాడు అతిథిసత్కారరూపమయిన పెద్ద దైవధర్మమును నిష్కామముగా సేవించుచున్నవాడై నా యందు అర్పించిన చిత్తము గలవాడై ఇంటి యందే ఉంటూ ఎక్కువ ఇంద్రియ సుఖాసక్తి లేనివాడై మనశ్శాంతిని పొందుచున్నాడు. (43)

44శ్లో॥ సముద్ధరన్తి యే విప్రం సీదన్తం మత్పరాయణమ్ ।
తానుద్ధరిష్యేనచిరా దాపద్భ్యో నౌరివార్ణవాత్ ॥

టీ:- ఏవమధనస్య మహత్ఫలముక్త్వా సధనానామప్యాహ- త్రిభిః సముద్ధరంతీతి. సముద్ధరంతి దారిద్రాదుత్తారయంతి. విప్రమిత్యుప లక్షణం మత్పరాయణం యం కమపి.(44)

తా:- ఈ ప్రకారము అధునునికి మహత్ఫలమును, చెప్పి స ధనులకు మహాఫలమును చెప్పుచున్నాడు మూడు శ్లోకములలో. ఎవరయితే నా భక్తుడయిన, కష్టపడుచున్న విప్రునికి అన్నాదులనిచ్చి పోషించు చున్నారో వారిని ఆపదలనుండి, సముద్రమున ఓడవలె శీఘ్రముగా ఉద్ధరింతును. (44)

45శ్లో॥ సర్వాః సముద్ధరేద్రాజా పితేవ వ్యసనాత్ప్రజాః ।
ఆత్మానమాత్మానో ధీరో యథా గజపతిర్గజాన్ ॥

తా:- రాజునకావశ్యకమయిన దానిని చెప్పుచున్నారు. రాజు తండ్రి వలె ప్రజలందరిని దుఃఖముల నుండి ఉద్ధరించవలెను. గజరాజు ఇతర గజములను ఉద్ధరించినట్లు, ధీరుడై తనను, తన నిర్మల బుద్ధితో ఉద్ధరింపవలెను.(45)

46శ్లో॥ ఏవం విధోనరపతిర్విమానే నార్క వర్చసా ।
విధూయోహా శుభం కృత్స్నమిన్ద్రేణ సహ మోదతే ॥

టీ:- రాజ్ఞస్త్వావశ్యక మేతదిత్యాహ - సర్వాఇతి. (45,46)

తా:- ఇట్లు ప్రవర్తించు రాజు ఈ లోకమునందు అన్ని పాపములను తొలగించుకొని సూర్యతేజము గల విమానముతో ఇంద్రునితో గూడి సంతోషమందుచున్నాడు. (46)

47శ్లో॥ సీదన్విప్రో వణిగ్వృత్త్యా పణ్యైరేవాపదం తరేత్ ।
ఖడ్గేన వా పదాక్రాంతో న శ్వ వృత్త్యా కథంచన ॥

టీ:- సర్వేషామాపద్వృత్తీరాహ - త్రిభిః.సీదన్నితి.పణ్యైః విక్రయార్హైః న తు సురాలవణాద్యైః. తత్రాప్యాపదాక్రాంతశ్చేత్. ఖడ్గేన క్షత్రియ వృత్త్యా వా. యద్యపి గౌతమోఽనంతరాం పాపీయసీం వృత్తిమాతిష్ఠేత్ ఇతి స్మరన్. ఖడ్గధారణం పణ్యవిక్రయాత్ శ్రేష్ఠం మన్యతే. తథాపి హింసాతో వణిగ్వృత్తిరేవ శ్రేష్ఠేతి భగవతోమతం న తు శ్వవృత్త్యా నీచసేవయా.(47)

తా:- దారిద్ర్యముచే కష్టపడుతున్న విప్రుడు వైశ్యవృత్తిన వలంబించి అమ్మదగిన వస్తువులనమ్ముతూ (సురాలవణాదులను పరిహరించి) ఆపదను దాటవలెను ఆ వృత్తిలో ఆపద పొందినచో క్షత్రియ వృత్తిచే కత్తిపట్టి ఆపదనుతరించవలెను. నీచసేవనెట్టి సమయాన గ్రహించరాదు. గౌతముడు "అనంతరాపాపీయసీం వృత్తిమాతిష్ఠేత్"అని చెప్పుతూ పణ్య విక్రయమున కన్నా ఖడ్గ ధారణము శ్రేష్ఠమయినదని చెప్పిననూ హింస కన్నా వణిగ్వృత్తి శ్రేష్ఠమని భగవదభిప్రాయము. (47)

48శ్లో॥ వైశ్యవృత్త్యా తు రాజన్యో జీవేన్మృగయయాఽపది ।
చరేద్వా విప్రరూపేణ న శ్వ వృత్త్యా కథంచన ॥

టీ:- వైశ్యవృత్త్యేతి. తత్రాప్యాపది. మృగయయాపి. విప్రరూపేణ అధ్యాపనాదినావా.(48)

తా:- రాజు ఆపత్కాలమందు వైశ్యవృత్తిచే జీవింపవలయును. ఆపద లందు వేటాడి జీవింపవలెను. విప్రునివలె వేదాధ్యాపనముతో (వేదము శిష్యులకు చెప్పి) జీవించవలెను. కాని ఎట్టి పరిస్థితులలో నీచవృత్తి (సేవ) పనికిరాదు. (48)

49శ్లో॥ శూద్రవృత్తిం భజేద్వైశ్యః శూద్రః కారుకటక్రియామ్ ।
కృచ్ఛ్రాన్ముక్తో న గర్హ్యేణ వృత్తిం లిప్సేత కర్మణా ॥

టీ:- శూద్రవృత్తిమితి. కారవః ప్రతిలోమజ విశేషాః బురుడాదయః తేషాం వృత్తిం కటాది క్రియాం. ఆపదత్తీర్ణస్తు నానుకల్పేన వర్తేతేత్యాహ - కృచ్ఛ్రాదితి. (49)

తా:- వైశ్యుడు ఆపద యందు శూద్ర వృత్తిని ఆశ్రయించవచ్చును. శూద్రుడు శిల్పులు, మేదరివాండ్రుచేయు శిల్ప, దారుమయ పని, చాప లల్లుట వంటి వాటిని స్వీకరించవచ్చును. ఆపద లాలగిన వెంటనే నింద్యమైన వృత్తిని వదలవలెను. (49)

50శ్లో॥ వేదాధ్యాయ స్వధాస్వాహ బల్యన్నాద్యైర్యథోదయమ్ ।
దేవర్షి పితృ భూతాని మద్రూపాణ్యన్వహం యజేత్ ॥

టీ:- తదేవం వృత్తివ్యవస్థాముక్త్వా పునర్గృహస్థస్యావశ్యకాన్పంచ యజ్ఞానాహ - వేదేతి. వేదాధ్యాయః బ్రహ్మయజ్ఞః.తేన ఋషీన్. స్వధాకారేణ పితౄన్. స్వాహాకారేణ దేవావ. బలిహరణేన భూతాని. అన్నాద్యైరన్నోదకాదిభిర్మనుష్యానితి జ్ఞాతవ్యం. యథోదయం విభవానుసారతః తేష్వీశ్వరదృష్టిం విధత్తేమద్రూపాణీతి. (50)

తా:- ఈ విధముగా వృత్తి వ్యవస్థను చెప్పి మళ్ళీ గృహస్థునకు ఆవశ్యకములైన పంచ మహాయజ్ఞములను చెప్పుచున్నాడు. వేదాధ్యయనముచే ఋషులను, స్వధాకారముచే పితురులను, స్వాహాకారముచే హవిస్సును సమర్పించి, దేవతలను బలిహరణము వలన, భూతములను అన్నోదకములచే, మనుష్యులను నా రూపములుగా ఎప్పుడూ పూజించవలెను. (50)

51శ్లో॥ యదృచ్ఛయేపపన్నేన శుక్లేనోపార్జితే నదా ।
ధనేనా పీడయన్ భృత్యాన్ న్యాయేనైవా హరేత్క్రతూన్ ॥

టీ:- ఆవశ్యకం ధర్మముక్త్వా శక్త్యనుసారం ధర్మమాహ-యదృచ్ఛయేతి. యదృచ్ఛయా ఉద్యమంవినా ఉపార్జితేన వా శుక్లేన శుద్ధేన స్వవృత్త్యా లబ్ధేన ధనేన వా భృత్యాన్. పోష్యాన్. (51)

తా:- ఆవశ్య ధర్మమును చెప్పి శక్త్యనుసారమయిన ధర్మమును చెప్పుచున్నాడు. ప్రయత్నములేక ప్రాప్తించిన పరిశుద్ధమయిన, స్వవృత్తిచే ఆర్జించిన ధనముతో, సేవకులను పీడింపక, ధన మార్జించుచూ నన్ను గూర్చి క్రతువులను చేయవలెను. (51)

52శ్లో॥ కుటుంబేషు న సజ్జేత న ప్రమాద్యేత్కుటుంబ్యపి ।
విపశ్చిన్నశ్వరం పశ్యే దదృష్టమపి దృష్టవత్ ॥

తా:- గృహస్థునికి గూడ నివృత్తి నిష్టనే చెప్పుచున్నాడు మూడు శ్లోకములతో. కుటుంబీకులగు భార్యా పుత్రాదుల యందు ఆసక్తుడు కారాదు. కుటుంబమున్ననూ ఈశ్వరనిష్ఠయందు ప్రమత్తుడు కారాదు.

టీ:- గృహస్థస్యాపి నివృత్తినిష్ఠామేవాహ - త్రిభిః కుటుంబేష్వితి.న ప్రమాద్యేత ఈశ్వర నిష్ఠాయాం ప్రమత్తో న భవేత్. నను దృష్టా దృష్టార్థ కర్మాసక్తస్య కథమప్రమాదో విచారేణేత్యాహ - విపశ్చిదితి. (52)

దృష్టా దృష్టార్థకర్మాసక్తునికి (దృష్టార్థకర్మ వివాహాదులు, అదృష్టార్థకర్మ యజ్ఞాదులు) ఎట్లు ప్రమాదమనగా వాని యందు ఆసక్తియే ప్రమాదమని భావము. విద్వాంసుడు స్వర్గాది సుఖమును కూడా ఐహిక సుఖమువలె నశించునదిగా చూడవలెను. (52)

53శ్లో॥ పుత్రాదారాప్త బంధూనాం సంగమః పాంథ సంగమః ।
అనుదేహం వియన్త్యేతే స్వప్నో నిద్రానుగో యథా ॥

టీ:- తత్రాపి దృష్టేష్వాసక్తేరధికత్వాత్తేషాం నశ్వరతాం ప్రపంచయతి- పుత్రేతి. పుత్రాదీనామేకత్ర సంగమః పాంథానాం ప్రపాయాం సంగమ ఇవ. తత్ర హేతుః. అనుదేహం. ప్రతిదేహం ఏతే వియంతి నశ్యంతి. నిద్రానువర్తీ స్వప్నో నిద్రాపాయే యథేతి. (53)

తా:- దృష్టములయిన వాటియందు ఆసక్తి అధికమగుట వలన వాని నాశస్వభావమును చెప్పుచున్నాడు. పుత్రుడు, భార్య, ఆప్తబంధువులు అను వీరి కలయిక బాటసారులతోడి కూడిన వంటిదగును. నిద్ర వచ్చినప్పుడు స్వప్నమెట్లో ఆ రీతిగనే ప్రతి దేహమునందు ఈ దారా పుత్రాదులు నశింతురు. (53)

54శ్లో॥ ఇత్థం పరిమృశన్ముక్తో గృహేష్వతిథి వద్వసన్ ।
నగృహైరనుబద్ధ్యేత నిర్మమో నిరహం కృతః ॥

టీ:- ఇతమితి అతిథివదుదాసీనః (54)

తా:- ఇట్లు శాస్త్ర యుక్తులతో విమర్శించుచూ, గృహమునందు అతిథి వలె నివసించుచూ, ఇది నాది అను మమకారమును, ఈ దేహము నేను అహంకారమును, లేనివాడై గృహదారాదులతో బంధితుడు కారాదు. (54)

55శ్లో॥ కర్మభిర్గృహ మేధీయై దిష్ట్వా మామేవ భక్తిమాన్ ।
తిష్టేద్వనం వోపవిశేత్ప్రజావాన్వా పరివ్రజేత్ ॥

టీ:- అస్యాప్యాశ్రమ వికల్పమాహ- కర్మభిరితి. గృహాశ్రమ ఏవ తిష్ఠేత్. యది ప్రజావాన్ తర్హి ప్రవ్రజేత్. (55)

తా:- వానికినూ ఆశ్రమ వికల్పమును చెప్పుచున్నాడు. గృహస్థునకు సంబంధించిన కర్మలచే భక్తిగలవాడై నన్నే పూజించి గృహమందే ఉండవలెను. బిడ్డలుగల వాడైనచో వనమును ప్రవేశించవలెను సన్యసించవలెను. (55)

56శ్లో॥ యస్త్వాసక్తమతిర్గేహే పుత్ర విత్తైషణాతురః ।
స్త్రైణః కృపణ ధీర్మూఢో మమాహమితి బధ్యతే ॥

టీ:- గృహాద్యాసంగే దోషమహ- త్రిభిః.(56)

తా:- గృహాద్యాసంగమున దోషము చెప్పుచున్నాడు. ఎవడు గృహమునందు, పుత్రులందు, ధనమందు కోరికచే సంభ్రమించువాడు, స్త్రీ చపలుడు, దీనభావముగలవాడు, మూర్ఖుడు ఇది నాది నేను అని తలంచుచూ సంసార బద్ధులగుదురు. (56)

57శ్లో॥ అహో మే పితరౌ వృద్ధౌ భార్యా బాలాత్మజాత్మజాః ।
అనాథా మామృతే దీనాః కథం జీవన్తి దుఃఖితాః ॥

టీ:- బంధమేవాభినయేన దర్శయతి. అహో ఇతి. బాలాః ఆత్మజా యస్యాస్సా ఆత్మజాశ్చ మాం వినా అనాథాస్సంతః కథం జీవిష్యంతీతి. (57)

తా:- బంధమునే అభినయముతో తెలుపుచున్నాడు నా తల్లిదండ్రులు వృద్ధులు, భార్య, చిన్నబిడ్డలు అనాథులై నేను లేక ఎట్లు జీవింతురు దుఃఖము పొందిన వారు అయి (57)

58శ్లో॥ ఏవం గృహాశయాక్షిప్త హృదయో మూఢధీరయమ్ ।
అతృప్తస్తాననుధ్యాయన్మృతోఽధం విశతే తమః ॥

టీ:- ఏవమితి. గృహేయ ఆశయో వాసనా తేన ఆసర్వతః క్షిప్తం హృదయం యస్య సః అంధం తమః అతితామసీం యోనిమ్.(58)

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
సప్తదశోఽధ్యాయః

తా:- ఈ ప్రకారము గృహమందు ఆసక్తమైన చిత్తము కలవాడు, అసంతృప్తిగలవాడు, మూఢ బుద్ధియైన గృహస్థు, ఆ గృహదారాదులను చింతించుచూ మృతుడై తామసికమైన అధమజన్మను పొందుచున్నాడు. (58)

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
సప్తదశాధ్యాయము సమాప్తము.

## అష్టాదశోऽధ్యాయః

### శ్రీ భగవానువాచ

1శ్లో॥ వనం వివిక్షుః పుత్రేషు భార్యం న్యస్య సహైవవా ।
వన ఏవ వసేచ్ఛాన్త స్తృతీయం భాగమాయుషః ॥

టీ:- శ్లో. అష్టాదశేऽవదద్ధర్మం వనస్థయతిగోచరమ్, అధికార విశేషం-విశేషేణచాపి తద్గతం. క్రమప్రాప్తత్వేన వనస్థధర్మానాహ-వనమితి. ఆయుషః భాగం పంచసప్తతివర్షపర్యంతం. తతః పరం. క్షీణేంద్రియస్యేషద్విరాగేऽపి సన్న్యాసస్యాధికారస్యాదితి. భావః. (1)

2శ్లో॥ కందమూలఫలైర్వన్యైర్మేధ్యైర్వృత్తిం ప్రకల్పయేత్ ।
వసీత వల్కలం వాసస్తృణపర్ణాజినాని చ ॥

టీ:- కందేతి. వసీత పరిదధీత. (2)

## అష్టాదశాధ్యాయము

### శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు

తా:- ఈ పదునెమిదవ అధ్యాయమున వానప్రస్థ, సన్న్యాసుల ధర్మము అధికారి తారతమ్యమును బట్టి అందు విశేషమును చెప్పబడును. క్రమప్రాప్తమైన వనస్థ ధర్మములను చెప్పుచున్నాడు. వనము ప్రవేశింప గోరినవాడై భార్యను పుత్రులయందుంచి లేదా ఆమెతో గాని ఆయువున మూడవ భాగము శాంతుడై అడవియందు నివసించవలెను. ఆయువు యొక్క మూడవభాగము దెబ్బయి అయిదు సంవత్సరముల వరకు. ఆ తరువాత ఇంద్రియ క్షీణము గలవానికి కొంత వైరాగ్యము కలిగిననూ సన్న్యాసమున కధికారము కల్గును. (1)

తా:- వనమున లభించు పవిత్రములైన కందమూల ఫలములచే జీవనము కల్పించుకొనవలెను. నార చీరను వస్త్రము వలె కట్టుకొన వలెను గడ్డి, ఆకులు మొదలు వానితో వస్త్రమును ధరించవలెను. (2)

3శ్లో॥ కేశరోమ నఖశ్మశ్రు మలాని బిభృయాద్దతః ।
న ధావేదప్సు మజ్జేత త్రికాలం స్థండిలేశయ ః॥

టీ:- కేశేతి. దతః దంతాన్. న ధావేత్ న శోధయేత్. త్రికాల మప్సు మజ్జేత ముసలవత్ స్నాయాత్. స్థండిలేశయః భూమిశాయీ.(3)

తా:- తలవెంట్రుకలు, శరీరరోమము, గోళ్ళు, మీసము, గడ్డము మొదలుయిన మాలిన్యము భరించవలెను. పండ్లు కడుక్కొనరాదు. మూడువేళ లందు నీట మునుగవలెను. నేలమీద పడుకొనవలెను.(3)

4శ్లో॥ గ్రీష్మే తప్యేత పంచాగ్నీన్వర్షాస్వాసార షాడ్ జలె
ఆ కంఠమగ్నః శిశిర ఏవం వృత్త స్తపశ్చరేత్ ॥

టీ:- గ్రీష్మఇతి. తప్యేత పంచాగ్నీవ సూర్యేణ సహ చతుర్దక్షు అగ్నీన్నిధా యాత్మానం తాపయేదిత్యర్థః. ఆసారం సహత ఇతి. ఆసారషాట్ ఆసారం ధారా సంపాతం సహత ఇతి. అభ్రవాసం నామవ్రతం చరేదిత్యర్థః జలే ఆకంఠమగ్నః ఉదకవాసం నామవ్రతం చరేత్. (4)

తా:- గ్రీష్మర్తువు నందు నాలుగు దిక్కుల నాలుగగ్నులను పైన సూర్యుడు చేరిన అయిదగ్నులు నిమిత్తముగా శరీరమును తపింపజే యునది. వాని నడుమ నుండి తపస్సు చేయవలెనని భావము వర్షర్తువునందు వర్ష ధారల సంపాతమును వహించువాడై అభ్రవాస మను వ్రతము నాచరించవలెను. శిశిర ఋతువునందు నీట కంఠము వరకు మునిగినవాడై యుంటూ తస్సునాచరించాలి. (4)

5శ్లో॥ అగ్నిపక్వం సమశ్నీయాత్ కాలపక్వమథాపి వా ।
ఉలూఖలాశ్మ కుట్టోవా దంతోలూఖల ఏవ వా ॥

టీ:- అగ్నిపక్వంమితి. ఉలూఖలేన వా అశ్మనా వా కుట్టతి నీవారాన్ ఖండయతీతి తథా. దంతా ఏవోలూఖలం యస్య స తథా. (5)

తా:- అగ్నిచే పక్వమయిన అన్నమును గడ్డలను తినవలెను. కానిచో కాలముచే పక్వమైన ఫలాదికమును తినవలెను. రోలు రాయి మొదల యిన వానిచే నీవారాదికముదంచుట వానిగా గాని, దంతములే రోలుగా గల వానిగా కావలెను. (5)

6శ్లో॥ స్వయం సంచినుయాత్సర్వ మాత్మనో వృత్తికారణమ్ ।
దేశకాల బలాభిజ్ఞో నాదదీతా న్యదాహృతమ్ ॥

టీ:- స్వయమితి. సంచినుయాత్ ఆహరేత్. అన్యదా కాలాంతరే. ఆహృతం నాదదీత. శ్లో."కాలాంతరే హ్యాహృతం తు నాదదీత వనాశ్రమీ, లబ్ధేన వేనవేఽన్నాద్యే పురాణం తు పరిత్యజే"దితి నారదోక్తేః. (6)

తా:- తనకు జీవా ధారమ్ అయినందున కందమూల ఫలాదులను తానే స్వయముగా సంపాదించుకోని తీసుకొనిరావలయును ఎవరో తెచ్చిన వేరోక వస్తువును గ్రహింపరాదు."లబ్దేనవెనవేకన్నాద్యే పురాణం తు పరిత్యజేత్ " కోత్తదగు అన్నాదిక మదోరికి నంతనే పాత దానిని విడువ వలెనని నారదుడు చెప్పెను. (6)

7శ్లో॥ వన్యైశ్చరుపురోడాశైః నిర్వపేత్కాలచో దితాన్ ।
న తు శ్రౌతేన పశునా మాం యజే తవ నాశ్రమీ ॥

టీ:- వన్యైరితి. కాలచోదితాన్ ఆగ్రయణాదీన్.(7)

తా:- వానప్రస్థుడు వనమున లభించు నీవారాదికముచే చరు, పురోడాశములను సంవత్సరకాలమున వచ్చు ఆగ్రయశాది ఇష్టులను చేయవలెను. శృతిచోదితములగు పశు యజ్ఞములు చేయరాదు.(7)

8శ్లో॥ అగ్నిహోత్రం చ దర్శశ్చ పూర్ణమాసశ్చ పూర్వవత్ ।
చాతుర్మాస్యాని చ మునేరామ్నాతాని చ నైగమైః ॥

టీ:- కించ. అగ్నిహోత్రమితి. మునేశ్చ. నైగమైర్వేదవాదిభిః ఆమ్నాతాని. (8)

తా:- అగ్నిహోత్రము, దర్శపూర్ణ మాసములు, చాతుర్మాస్యము ఆగ్రహాయణ్యాదులు వానప్రస్థునికి తగినవని వేదవిదులు చెప్పుచున్నారు.(8)

9శ్లో॥ ఏవంచీర్ణేన తపసా మునిర్ధమని సంతతః ।
మాం తపోమయమారాధ్య ఋషిలోకాదుపైతి మామ్ ॥

టీ:- అస్య నిష్కామస్య ఫలమాహ- ఏవమితి. ధమనీభిః సిరాభిః సంతతః వ్యాప్తః యావజ్జీవం కృతేన తపసా శుష్కమాం స ఇత్యర్థః. ఋషిలోకాత్ మహర్లోకాదిక్రమేణ. అయం భావః. అంతఃకరణశుద్ధి భక్తిద్వారాత్రైవ తావన్ముచ్యతే. ప్రతిబంధకబాహుళ్యేన క్రమేణ ముచ్యత ఇతి. (9)

తా:- ఈ నిష్కామునకు ఫలము చెప్పుచున్నారు. ఈ ప్రకారము తపస్సుతో కృశించిన శరీరములో, ముని అనరములు వ్యాపించినవాడు, మాంసము శుష్కించిన శరీరము గలవాడు, తప స్వరూపడనగు నన్నారాధించి ఋషులుండు మహర్లోకమున నన్ను పొందుచున్నాడు. అంతఃకరణ శుద్ధి, భక్తి గలవాడై ఇక్కడి నుండే ముక్తిని పొందును. ప్రతిబంధ బాహుళ్యమున్నచో క్రమముగా ముక్తుడగును.(9)

10శ్లో॥ యస్త్వేత తృచ్ఛ్రుత శ్చీర్ణం తపో నిశ్శ్రేయసం మహత్ ।
కామాయాల్పీయసే యుంజ్యాద్బాలిశః కోపరస్తతః ॥

టీ:- తం సకామం నిందంతి. యస్త్వితి. నిశ్రేయసం మోక్షఫలం. అల్పీయసే ఆవిరించ్యల్పతమమేవ తస్మై.(10)

తా:- ఎవడు అతికష్టముగా కృశించి పోందిన మోక్ష ప్రదమయిన గొప్ప తపస్సును చాలా స్వల్పమయిన ఇంద్రియ సుఖము కొరకు వినియోగించునో వాని కన్నా మూర్ఖుడు వేరొకడుండడు.(10)

11శ్లో॥ యదాసౌ నియమేఽకల్పో జరయా జాతవే పథుః ।
ఆత్మన్యగ్నీన్సమారోప్య మచ్చిత్తోఽగ్నిం సమావిశేత్ ॥

తా:- ఎవడిట్లు కామప్రతిబంధము లేక యావజ్జీవము తపము చేయునో వానికి మోక్షము. జీవితపు తృతీయ భాగము చివర వైరాగ్యము దృఢముగ లేకున్నను సన్యాసము నందధికారము కలదు. ఆ తృతీయ భాగమునకు ముందే తన వానప్రస్థ ధర్మము నిర్వహింపలేని వాడగుచో

టీ:- ఏవం యావజ్జీవం వర్తమానస్య మోక్షః తృతీయభాగావసానే తు మందవిరాగేఽపి సన్న్యాసాధికారః యది తు తతోఽర్వాగేవ స్వధర్మాశక్తో భవేత్ తదాపి సమ్యగవిరక్తో వా. తత్రావిరక్తస్య కృతమాహ - యదేతి. జాతో వేపథుః కంపో దేహే యస్య సః.(11)

అతడు అవిరక్తుడా విరక్తుడా. విరక్తుని కృత్యము తెలుపుచున్నాడు. ఈ వానప్రస్థుడు ఆశ్రమ నిష్ఠయందు అశక్తుడై ముసలి తనము చేత శరీరకంపము గలవాడగునో అప్పుడు తన యందు అగ్నులను ఆరోపించుకొని నా యందు మనస్సు కలిగి అగ్నిని ప్రవేశించవలెను. 11

12శ్లో॥ యదా కర్మ విపాకేషు లోకేషు నిరయాత్మసు ।
విరాగో జాయతే సమ్యక్ న్యస్తాగ్నిః ప్రవ్రజేత్తతః ॥

టీ:- విరక్తంప్రత్యాహ- యదేతి. లోకేషు బ్రహ్మలోకపర్యంతేషు. నిరయాత్మసు దుఃఖోదర్కేషు న్యస్తాగ్నిస్సన్. తత ఇతి. అగ్నిహోత్రాది కర్మణః వర్ణాశ్రమాద్వా. (12)

తా:- విరక్తుని గురించి చెప్పుచున్నాడు. ఎప్పుడు కర్మఫలప్రాప్తములై నరకప్రాయములైన ఇహ, పరలోకములందు విరక్తి జనించునో అప్పుడు అగ్నులనుద్వాసన చేసి ఆ యాశ్రమము నుండి సన్యసింపవలెను. (12)

13శ్లో॥ ఇష్ట్వా యథోపదేశం మాం దత్వా సర్వస్య మృత్విజే ।
అగ్నీన్స్వప్రాణ ఆవేశ్య నిరపేక్షః పరివ్రజేత్ ॥

టీ:- తత్రాదౌ కృత్యమాహ- ఇష్ట్వేతి. యథోపదేశం శ్రాద్ధాష్టక పూర్వకం ప్రాజాపత్యేష్టాం మాం ఇష్టాం. స్వే ప్రాణోపాధావాత్మని.(13)

తా:- అందు మొదటి కృత్యమును చెప్పుచున్నాడు. శాస్త్రమునందు చెప్పబడిన రీతిలో అష్టకాశ్రాద్ధ పూర్వకముగా ప్రాజాపత్యమను ఇష్టిని నాకు ప్రీతిగా కావించి అగ్నులను ప్రాణోపాధి గల ఆత్మయందు ఆరోపించి ఏ అపేక్ష లేక సన్న్యసించవలెను. (13)

14శ్లో॥ విప్రస్యవై సన్న్యసతో దేవా దారాది రూపిణః ।
విఘ్నాన్ కుర్వన్త్యయం హ్యస్మానాక్రమ్య సమీయాత్పరమ్ ॥

తా:- సన్యాసమునందు విఘ్నములు కల్గును వానిని లెక్కింపక సన్యాసమే గ్రహించవలెనను ఆశయముతో చెప్పుచున్నారు.

టీ:- సన్న్యాసే విఘ్నా భవంతి తానవిగణయ్య సన్న్యసేదేవేత్యాశయే నాహ - విప్రస్యేతి. కేనాభిప్రాయేణ కుర్వంతి తమాహ - అయమితి. పరం బ్రహ్మ. (14)

15శ్లో॥ బిభృయాచ్చేన్మునిర్వాసః కౌపీనాచ్ఛదనం పరమ్ ।
త్యక్తం న దండ పాత్రాభ్యా మన్యత్కించి దనాపది ॥

టీ:- ఏవం ప్రవ్రజితస్య ధర్మానాహ - బిభృయాదితి. పరం కౌపీనా దన్యద్వాసో యది ధారయితుమిచ్ఛతి తర్హి కౌపీనమాచ్ఛాద్యతే యావతా తావన్మాత్రం ధారయేదిత్యర్థంః. త్యక్తం ప్రేషోచ్చారణాత్పూర్వమేవ అతోఽన్యత్కించిదపి న బిభృయాత్. దండపాత్రాభ్యామిత్యావశ్యక జల పాత్రాదేరుప లక్షణమ్.(15)

16శ్లో॥ దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం పిబేజ్జలమ్ ।
సత్యపూతాం వదే ద్వాచం మనః పూతం సమాచరేత్ ॥

టీ:- పరమహంసస్య విధినిషేధాగోచరత్వాత్ బహూదకాది ధర్మాన్ భగవానాహ - దృష్టిపూతమితి. మనఃపూతం మనసా సమ్యక్ విచార్య యచ్ఛుద్ధం తదాచరేత్. (16)

సన్యసింపబోవు విప్రునకు భార్యాపుత్రాదుల రూపమున నన్ను ఇంద్రాది దేవతలు "ఈ విప్రుడు మనస్థానములను దాటి పరబ్రహ్మనుపొందు"నని సన్యాసమునకు విఘ్నము కల్గింతురు.(14)

తా:- ఇట్లు ప్రవ్రజితుడయిన వాని ధర్మములను చెప్పుచున్నాడు. సన్యాసి కౌపీనమున కంటే ఇతరమగు వస్త్రమును ధరింపకోరినచో ఆ కౌపినమును కప్పునంత వస్త్రమును మాత్రము ధరింపవలెను. కష్ట కాలము కానిచో ప్రేషోచ్చారమునకు విడిచినట్టి దండ కమండలముల కంటే ఇతర మయిన దేనినీ ధరింపరాదు. (15)

తా:- పరమహంసకు విధి నిషేధములు గోచరింపనందున బహూదకాది ధర్మములను భగవంతుడు చెప్పుచున్నారు. కంటి చూపుచే నిష్కంటకమయిన చోటుకు చూచి అడుగు పెట్టవలెను. వస్త్రమున వడగట్టిన నీరుత్రాగవలెను. సత్యముచే పావనమయిన మాటను మాట్లాడవలెను. మనస్సుచే చక్కగా విచారించి పనిని చేయవలెను.(16)

17శ్లో॥ మౌనసీహానిలా యామా దండా వాగ్దేహ చేతసామ్ ।
నహ్యేతే యస్య సంత్యంగ వేణుభిర్న భవేద్యతిః ॥

టీ:- మౌనేతి. మౌనం వాచో దండః అనీహాకామ్యకర్మ త్యాగో దేహస్య ప్రాణాయామశ్చేతసః. ఏతే అంతస్త్రయో దండా యస్య న సంతి. అంగ హే ఉద్ధవ అంగే ధృతైర్వేణుభిరితి వా. (17)

తా:- ఓ ఉద్ధవా! వాక్కునకు మౌనము, దేహమునకు కామ్యకర్మ త్యాగము, చిత్తమునకు ప్రాణాయామము అనుదండములు మూడును ఎవనికి ఉండవో అతడు సన్యాసికాడు. కేవల దండక మండలములచే సన్యాసికాడు. (17)

18శ్లో॥ భిక్షాం చతుర్షు వర్ణేషు విగర్హ్యాన్వర్జయంశ్చరేత్ ।
సప్తాగారా నసంక్లిప్తాం స్తుష్యేల్లబ్ధేన తావతా ॥

టీ:- భిక్షామితి. బ్రాహ్మణేష్వేవ వృత్తిభేదేన చతుర్విధేషు పూర్వపూర్వా సంభవే చ విగర్హ్యాన్ అభిశస్తపతితాన్. అసంక్లిప్తాన్. అత్రాయం లాభో భవిష్యతీతి పూర్వమనుద్దిష్టాన్. (18)

తా:- వృత్తిభేదముచే నాల్గు విధములైన బ్రాహ్మణుల వర్ణములందే ముందు ముందుండువారు. దొరకక పోయినచో నిందితులను, పతితులను, ఈ లాభము కలుగదని పూర్వముద్దేశించిన వారిని విడిచిపెట్టుచూ ఏడు గృహములను భిక్షనాచరించవలెను. (18)

19శ్లో॥ బహిర్జలాశయం గత్వా తత్రోపస్పృశ్య వాగ్యతః ।
విభజ్య పావితం శేషం భుంజీతా శేషమాహృతమ్ ॥

టీ:- బహిరితి. బహిర్గ్రామాత్. పావితం ప్రోక్షణాదిభిః శోధితం విభజ్య విష్ణు బ్రహ్మార్కభూతేభ్యః. అశేష మిత్యధికాహరణం నిరస్తం. యాచితమితి పాఠే మాధుకరేణ యాచితమన్నం చేత్తర్హి విభజ్య భుంజీత న త్వయాచిది

తా:- గ్రామమునకు బయట నుండు జలాశయమునకు పోయి అక్కడ కాళ్ళు, చేతులు కడిగికొని మౌనియై ప్రోక్షణాదులచే పవిత్రమైన అన్నమును విష్ణు, బ్రహ్మ, సూర్య, భూతములకు సమర్పించి, తెచ్చిన దానిలో మిగిలిన ఆహారమంతా దినవలెను దీని వలన అధికముగా తెచ్చుట నిరసింపబడినది. యాచితం అను పాఠమున మాధూకరమున యాచించి తెచ్చిన అన్నమును భుజించునదని అర్థము

భైక్షచతుష్టయమిత్యర్థః. శ్లో."మాధూకరే తు నైవేద్యం భైక్షానాన్యేషు విద్యతే నైవేద్యకం క్షిపేదప్సు త్రితయం భౌతికం విదు"రితి. స్మృతేః. యద్వా తదానీం కేనాపి యాచితం చేత్తన్మధ్యే తస్మై కించిద్విభజ్య దత్వేత్యర్థః. (19)

కాని అయాచిత భైక్ష చతుష్టయము కాదు. మాధూకరమున తెచ్చిన అన్నము నివేదించుట, భిక్షాన్నమితరుల కిచ్చుట, నివేదించిన అన్నమును జలములందు వేయుట ఈమూడును భూత తృప్తి కల్గించును. అప్పుడెవడయిన యాచించినచో వానికిచ్చి మిగిలిన దానిని జలములందు వేయవలెను. "మాధూకరే తు నైవేద్యం భైక్ష్యేనాన్యేషు విద్యతే నైవేద్యకం క్షిపేదప్సు త్రితయం భౌతికంవిదుః" అనిస్మృతి, లేదా. అప్పుడు మధ్యన ఎవరయిన యాచించినచో అతనికి కొంచెము విభజించి ఇచ్చి అని అర్థము. (19)

20శ్లో॥ ఏకశ్చరేన్మహీమేతాం నిస్సంగః సంయతేంద్రియః ।
ఆత్మక్రీడ ఆత్మరతః ఆత్మవాన్సమదర్శనః ॥

టీ:- కించ. ఏకఇతి. ఏకర్చరేత్ ఆత్మన్యేవ క్రీడా కౌతుకం యస్య సః ఆత్మన్యేవ రతః సంతుష్టః ఆత్మవాన్ ధీరః.(20)

తా:- ఆత్మయందు వినోదించుచు పరమేశ్వరునియందు సక్తుడై ధీరుడై అంతట బ్రహ్మము నొక దానిని సమముగాచూచి ఇతరులతోడి సంబంధ ములేని వాడుగా ఇంద్రియములను వశమందుంచుకొనినవాడై ఒక్కడే ఈ భూమి యందు సంచరింపవలెను. (20)

21శ్లో॥ వివిక్తక్షేమ శరణో మద్భావ విమలాశయః ।
ఆత్మానం చింతయేదేకమభేదేన మయా మునిః ॥

టీ:- వివిక్తేతి. వివిక్తం విజనం క్షేమం నిర్భయం శరణం స్థానం యస్య సః. మయి భావేన భక్త్యా విమలః ఆశయో యస్య సః. (21)

తా:- జనుల సందడి లేక ఏ పీడయూ లేని ప్రదేశమున ఉంటూ నా మీద భక్తిచే నిర్మలమైన చిత్తముతో భేదములేని నాతో గూడి ఒక్కడే అయిన పరమాత్మను ధ్యానింపవలెను. (21)

22శ్లో॥ అన్వీక్షేతాత్మనో బంధం మోక్షం చ జ్ఞాననిష్ఠయా ।
బంధ ఇంద్రియ విక్షేపో మోక్ష ఏషాం చ సంయమః ॥

తా:- జ్ఞాన నిష్ఠతో తనకు గల బంధమును మోక్షమును విమర్శించి చూడవలెను. ఇంద్రియముల స్వేచ్ఛా వ్యాపారము బంధమని, వాని సంయమనమే మోక్షమని తెలియవలెను. (22)

23శ్లో॥ తస్మాన్నియమ్య షడ్వర్గం మద్భావేన చరేన్మునిః ।
విరక్తః క్షుల్లకామేభ్యో లబ్ధ్వాత్మని సుఖం మహత్ ॥

తా:- అందువలన జ్ఞానేంద్రియములనైదింటిని, మనస్సును నిగ్రహించి జయించి సర్వ కామముల నుండి విరక్తుడై తన చిత్త మందు గొప్ప సుఖమును పొంది సంచరించవలెను. (23)

టీ:- అన్వీక్షేతేతి. బంధం మోక్షం చ కేన వా బంధః ? కేన వా మోక్షః? ఇతి తత్రాహ - బంధ ఇతి. (22,23)

24శ్లో॥ పుర గ్రామ వ్రజాన్ సార్థాన్ భిక్షార్థం ప్రవిశంశ్చరేత్ ।
పుణ్యదేశ సరిచ్ఛైల వనాశ్రమ వతీం మహీమ్ ॥

తా:- కోట బురుజులు గల పట్టణములు, గ్రామములు, గొల్ల పల్లెలు, యాత్రిక జన సమూహములను భిక్షకొరకు ప్రవేశించుచు చరించవలెను పుణ్యప్రదేశములు, పర్వతములు, అడవులు, ఆశ్రమములుగల భూమిని సంచరించవలెను. (24)

టీ:- సురేతి. పురాణి ఆట్టాలాదిమంతి గ్రామాః తద్వివర్జితాః ప్రజాః గోష్ఠాని తాన్ సార్థాన్ యాత్రిక జనసమూహాన్. (24)

25శ్లో॥ వానప్రస్థాశ్రమ పదేష్వభీక్ష్ణం భైక్ష్యమాచరత్ ।
సంసిద్ధ్యత్యాశ్వసం మోహః శుద్ధసత్వః శిలాంధసా ॥

తా:- వానప్రస్థాశ్రమ నివాసములందు అనేక సార్లు భిక్షాచర్యను ఆచరించవలెను. శిలవృత్తిచే లభించు అన్నమును తిని పరిశుద్ధ చిత్తుడై మోహము నశించిన వాడై బంధ విముక్తిని పొందుచున్నాడు. (25)

టీ:- వానప్రస్థేతి. యతః శిలవృత్త్యా ప్రాప్తేన తదీయేనాంధసా అన్నేన శుద్ధసత్త్వస్సన్ నివృత్త మోహస్సంసిద్ధ్యతి ముచ్యతే. (25)

26శ్లో॥ నైతద్వస్తుతయా పశ్యేద్దృశ్యమానం వినశ్యతి ।
అసక్తచిత్తో విరమే దిహాముత్ర చికీర్షితాత్ ॥

టీ:- నను మృష్టాన్నం విహాయ కథం శిలాన్నే ప్రవృత్తిస్స్యాదత ఆహ- నేతి. ఏతద్దృశ్యమానం మృష్టాన్నాది వస్తుతయా న పశ్యేత్ యతో వినశ్యతి. అతః ఇహాముత్ర చ లోకే ఆసక్తచిత్తస్సన్ చికీర్షితాత్తదర్థకృత్యా ద్విరమేత్.(26)

తా:- మృష్టాన్నము విడిచి శిలాన్నమున ఎట్లు ప్రవృత్తి కల్గుననగా చెప్పుచున్నాడు. ఈ కన్పించు మృష్టాన్నము సత్య వస్తువుగా చూడరాదు కనబడునది నశించును. ఆసక్తిలేని చిత్తముకల వాడై ఇహ పర సుఖములకై చేయు కర్మను విరమింపవలెను.(26)

27శ్లో॥ యదేతదాత్మని జగన్మనో వాక్ ప్రాణసంహతమ్ ।
సర్వం మాయేతి తర్కేణ స్వస్థస్త్యక్త్వా నతత్స్మరేత్ ॥

టీ:- నను తథాపి యావద్వినాశం సుఖహేతుత్వాత్ అన్నచింతావతః కుతో విరాగస్స్యాత్తత్రాహ- యదితి. ఏతజ్జగత్ మమతాస్పదం. మనోవాక్ప్రాణై సంహతం సంహితం. అహంకారాస్పదం శరీరం చ. సర్వం తజ్జన్యం సుఖం చ ఆత్మని మాయామాత్రమితి తర్కేణ స్వప్నాది దృష్టాంతేన త్యక్త్వా స్వస్థః ఆత్మనిష్ఠస్సన్ పునస్తన్న స్మరేత్. (27)

తా:- దృశ్యమగు మృష్టాన్నము వినాశమగు పర్యన్తము సుఖహేతు వగుట వలన అన్నచింత గల వానికి విరాగమెట్లు కల్గుననగా చెప్పుచున్నాడు. మమకారమునకాస్పదమయిన ఈ జగత్తు. మనస్సు, వాక్కు, ప్రాణము, ఇంద్రియములతో కూడిన ఈ శరీరము తజ్జన్యమగు సుఖము గూడా మాయా మాత్రమని స్వప్నాది దృష్టాంతముచే ఆత్మ యందు నిశ్చయించి, వానియందాసక్తిని విడిచి ఆత్మనిష్ఠగలవాడై తిరిగి వానిని స్మరించరాదు.(27)

28శ్లో॥ జ్ఞాననిష్ఠో విరక్తో వా మద్భక్తో వా నపేక్షకః ।
సలింగానాశ్రమాం స్త్యక్త్వా చరేదవిధిగోచరః ॥

తా:- ఈ ప్రకారము బహూదకాది యతి ధర్మములను చెప్పి పరమహంసాదుల ధర్మములను చెప్పుచున్నారు. బాహ్యేంద్రియముల

టీ:- ఏవం బహూదకాదిధర్మానుక్త్వా పరమహంసాది ధర్మానాహ- సార్ధైర్దశభిః - జ్ఞాననిష్ఠ ఇతి. బహిర్విరక్తోముముక్షుస్సన్ యో జ్ఞాననిష్ఠో మోక్షేఽప్యనపేక్షో మద్భక్తో వా సలింగాన్ త్రిదండాది సహితాన్ ఆశ్రమాన్ సద్ధర్మాన్ త్యక్త్వా తదాసక్తిం చ పరిత్యజ్య యథోచితం ధర్మంచరేదిత్యర్థః. న పునరత్యంత త్యాగఏవ వివక్షితః. పునర్ధర్మవిధానాత్ అక్రియత్వస్యోత్తరాధ్యాయే వక్ష్యమాణత్వా చ. తర్హి పూర్వస్మాత్కో విశేష స్తత్రాహ-అవిధిగోచరః విధికింకరో న స్యాదితి ఏతదేవ స్ఫుటీ కరిష్య తీతి. శ్లో."శౌచమాచమనం స్నానం న తు చోదనయాచరే"దిత్యాదినా. (28)

సౌఖ్యముల నుండి విరక్తుడై ముముక్షువగుచూ జ్ఞాన నిష్ఠగలవాడై మోక్షమందపేక్ష లేనివాడై నా భక్తుడైనవాడు త్రిదండాదులతో గూడిన సన్యాసాశ్రమములను విడిచి విధికి గోచరుడుగాక చరించవలెను. వాని యందాసక్తిని వీడి యథోక్తమయిన ధర్మమును ఆచరించవవలెనని యర్థము. మరి అత్యంత త్యాగమే చెప్పబడక మరల ధర్మము విధించుట వలన అక్రియుని ధర్మమును ఉత్తరాధ్యాయ మందు చెప్పబోవుచున్నారు. పూర్వము చెప్పిన దానికి దీనికిని విశేషమేమనగా విధికింకరుడు. కారాదు. దీనినే స్పష్టపరుచగలడు."శౌచమాచమనం స్నానం న తు చోదనయాచరేత్" ఇత్యాదులచే (శుచి, ఆచమనము స్నానము వీటిని చోదనాదులవలన ఆచరించరాదు) (28)

29శ్లో॥ బుధో బాలక వత్క్రీడేత్ కుశలో జడవచ్చరేత్ ।
వదేదున్మత్తవద్విద్వాన్ గోచర్యాం నైగమశ్చరేత్ ॥

టీ:- తర్హి కథం చరేత్తత్రాహ - బుధఇతి. బుధః వివేకవానపి బాలకవత్ మానావమాన వివేకరాహిత్యేన కుశలః నిపుణోఽపి జడవత్ ఫలానుపంధానాభావేన విద్వాన్ పండితోఽపి ఉన్మత్తవల్లోకరంజనా భావేన నైగమః వేదార్థనిష్ఠోఽపి గోచర్యాం అనియతాచారమేవేత్యర్థః (29)

తా:- ఎట్లు చరింపవలెననగా చెప్పుచున్నారు. వివేకము గలవాడైనను మానావమానముల వివేకములేని బాలునివలె ఆడవలెను. నిపుణుడై నను మందునివలె ఫలానుసంధానములేనివాడై, చరించునది.పండితుడై నను పిచ్చివానివలె లోకరంజనాభావమున వచింపవలెను వేదార్థ నిష్ఠ గల వాడైనను అనియతాచారుడై చరింపవలెను. (29)

30శ్లో॥ వేదవాదరతోనస్యా న్నపాషండీ న హైతుకః ।
శుష్క వాద వివాదేన కించిత్పక్షం సమాశ్రయేత్ ॥

టీ:- వేదేతి. వేదవాదరతః కర్మకాండ వ్యాఖ్యానాది నిష్ఠః పాషండీ శ్రుతి స్మృతి విరుద్ధానుష్ఠాతా. హైతుకః కేవలం తర్కనిష్ఠః. శుష్కవాదే నిష్ప్రయోజన గోష్ఠ్యాం యో వివాదస్తస్మిన్. (30)

తా:- కర్మకాండాది వ్యాఖ్యాన నిష్ఠుడు కారాదు. శృతి స్మృతి విరుద్ధానుష్ఠాత కారాదు. తర్కనిష్ఠుడు కారాదు నిష్ప్రయోజనమగు గోష్ఠితో ఏ పక్షమును ఆశ్రయించరాదు. (30)

31శ్లో॥ నోద్విజేత జనాద్ధీరో జనంచో ద్వేజయేన్న తు ।
అతివాదాంస్తితిక్షేత నావ మన్యేత కంచన ।
దేహముద్దిశ్య పశువద్వైరం కుర్యాన్న కేనచిత్ ॥

టీ:- నేతి. అతివాదాన్ దురుక్తాని. (31)

తా:- ధీరుడై ఏ జనుల వలననూ కలత చెందరాదు అట్లే జన సముదాయును కలత పెట్టదగదు. దురుక్తు ను సహింపవలెను. ఎవనిని అవమానింపరాదు. దేహమును ప్రధానముగా నెంచి పశువు వలె ఎవనితోను పగబూనరాదు. (31)

32శ్లో॥ ఏక ఏవ పరోహ్యాత్మా భూతేష్వాత్మాన్యవస్తితః ।
యథేందు రుద పాత్రేషు భూతాన్యేకాత్మకాని చ ॥

టీ:- దేహమితి. ఆత్మాదృష్ట్యాతా వద్వైరకారణం నాస్తీత్యుక్తం. ఏవేతి. దేహదృష్ట్యాపి నాస్తీత్యాహ - భూతాని య దేహా అపి. కారణరూపేణై కాత్మకాని. (32)

తా:- ఒక్కడే పరమేశ్వరుడు అన్ని భూతముల యందు, తనయందు ఉన్నాడు. ఏ విధముగా చంద్రుడు ఉదకపాత్ర యందు ప్రతిబించు చున్నాడో ఆ విధముగానే సర్వభూతములు ఒక్క ఆత్మగలవి. కనుక దేహమును కారణముగా తీసికొని పశువు వలె ఎవరితోనూ వైరము పెట్టుకొనరాదు. ఆత్మదృష్ట్యా వైరకారణములేదని ఏక ఏవ అని చెప్పి దేహదృష్ట్యా కూడా వైరకారణములేదని భూతాని అని చెప్పుచున్నాడు. దేహములు కూడా కారణ రూపమున ఏకాత్మకములు. (32)

33శ్లో॥ అలబ్ధ్వా న విషీదేత కాలే కాలేఽశనం క్వచిత్ ।
లబ్ధ్వాన హృష్యేద్ధృతిమాన్ ఉభయం దైవ తంత్రితమ్ ॥

టీ:- అలబ్ధ్వేతి. దైవతంత్రితం దైవాధీనం. యతః. (33)

తా:- ఒకప్పుడు భోజనము సమయమున లభించనిచో లభించలేదని, దుఃఖించరాదు. లభించినచో లభించినదని సంతోషపడరాదు. రెండును లభించుట, లభించక పోవుట అనునవి దైవాధీనములని తలచవలెను. (33)

34శ్లో॥ ఆహారార్థం సమీహేత యుక్తం తత్ప్రాణధారణమ్ ।
తత్త్వం విమృశ్యతే తేన తద్విజ్ఞాయ విముచ్యతే ॥

టీ:- అలంతర్హి భిక్షాప్రయత్నేనాపి తత్రాహ - ఆహారార్థమితి. ఆహార మాత్రార్థం సమీహేతైవ యతస్తస్య ప్రాణధారణం యుక్తం. సమ్యక్ కథం తేనైవ ప్రాణధారణేన తత్త్వం విచార్యతే. కిం తేనాపి? తదాహ- తద్విజ్ఞాయేతి. (34)

తా:- మరియిప్పుడు భిక్షా ప్రయత్నము చాలునని విరమింపవలెనని చెప్పుచున్నాడు. ప్రాణధారణకు మాత్రము సరిపడు ఆహారమును కోరవలెను. ప్రాణధారణచేత ఆత్మతత్త్వము విమర్శింపబడును. ఆ విమర్శ ద్వారా ఆత్మను తెలిసికొని బంధముక్తుడగును. (34)

35శ్లో॥ యదృచ్ఛయోపపన్నాన్నమద్యా చ్ఛ్రేష్ఠముతాపరమ్ ।
తథావాస స్తథా శయ్యాం ప్రాప్తం ప్రాప్తం భజేన్మునిః ॥

టీ:- తర్హి కిం మృష్టాన్నాదిక మగ్రాహ్యమేవ. కేనైవముక్తమిత్యాహ- యదృచ్ఛయేతి. (35)

తా:- అట్లయిన మృష్టాన్నము అగ్రాహ్యమా ఎవనిచే ఇట్లు చెప్పబడినది అనుదానికి చెప్పుచున్నారు. స్వప్రయత్నము లేక లభించిన అన్నము శ్రేష్ఠమయినది. లేక తక్కువైనది అయినను తినవలెను. అట్లే నివాసము, వస్త్రము, శయ్య లభించునవి కీడుగాని, మేలుగాని గ్రహించవలెను.(35)

36శ్లో॥ శౌచమాచమనం స్నానం న తు చోదనయా చరేత్ ।
అన్యాంశ్చ నియమాన్ జ్ఞానీ యథాహం లీలయేశ్వరః ॥

టీ:- శౌచమితి. యథాహమీశ్వరో లీలయా చరామి. తథా జ్ఞానీ జ్ఞాననిష్ఠః అనాసక్తః కుర్యాత్. న తు విధికింకరత్వేన తస్య జ్ఞాననిష్ఠా విరోధాదిత్యర్థః. (36)

తా:- జ్ఞాని శౌచ, ఆచమన, స్నానములను శృతిచోదితముగా ఆచరింపరాదు ఇతర నియమములను నేను ఏ ప్రకారము ఈశ్వరుడుగా లీలామాత్రముగా ఆచరింతునో అట్లా విధికింకరుడు జ్ఞాననిష్ఠా విరోధి కనుక యని యర్థము. (36)

37శ్లో॥ న హి తస్య వికల్పాఖ్యాయా చ మద్వీక్షయా హతా ।
ఆదేహన్తాత్క్వచి త్ఖ్యాతి స్తతః సంపద్యతే మయా ॥

టీ:- కుతో విధికింకరత్వాభావస్తస్య? తత్రాహ- నేతి. న హి తస్య వికల్పాఖ్యాభేద ప్రతీతిః, నన్వ స్తి సా సత్యం. యా చాసీత్సాపి మద్వీక్షయా జ్ఞానేన హతా. నను హతా సా పునర్దృశ్యమానత్వాస్తత్రాహ - ఆదేహాంతాత్ క్వచిత్ కదాచిత్ బాధితైవ ఖ్యాతిర్భవతి. (37)

తా:- ఎందువలన అతనికి విధికింకరత్వము లేదనగా చెప్పుచున్నారు. ఆ యతికి వికల్పరూపమగు భేదప్రతీతి లేదు. ఓయీ ! అది ఉన్నది సత్యమే ఏది ఉండెనో అది నా వీక్షచే (జ్ఞానముచే) కొట్టబడెను. అట్లుకొట్టబడలేదు. మరల కనబడుటవలన అందువలన చెప్పుచున్నాడు. దేహనాశ పర్యంతము ఒకప్పుడు అభేద ప్రతీతి భాసితముగానే యుండును దేహపాతానంతరము మత్తుల్య సంపత్తిని పొందును.(37)

38శ్లో॥ దుఃఖోదర్కేషు కామేషు జాత నిర్వేద ఆత్మవాన్ ।
అజిజ్ఞాసిత మద్ధర్మో గురుం ముని ముపావ్రజేత్ ॥

టీ:- తదేవం విరక్తస్య అపరోక్షజ్ఞానవతః సన్న్యాసం తద్ధర్మాం శ్చోక్త్వా. కేవలం వైరాగ్యవంతం వివిదిషుం ప్రత్యాహ - దుఃఖోదర్కేష్వితి. న జిజ్ఞాసితో మద్ధర్మో మత్ప్రాప్తి సాధనం యేన సః. (38)

తా:- ఈ ప్రకారము విరక్తుడై అపరోక్ష జ్ఞానముగల వానికి సన్యాసము, దాని ధర్మములు చెప్పి కేవలము వైరాగ్యమునకు ఆత్మజ్ఞానము తెలిసికోగోరు వానిని గూర్చి చెప్పుచున్నారు. ఉత్తర కాలమందు దుఃఖము కల్గించు ఇంద్రియ సుఖములందువిరక్తిగలవాడు. చిత్తస్థైర్యము గలవాడు నా ప్రాప్తి సాధనమైన భక్తి యోగము నెరుగనివాడు అయిన యతి గురువును సమీపించవలెను. (38)

39శ్లో॥ తావత్పరిచరేద్భక్తః శ్రద్ధావాననసూయకః ।
యావద్బ్రహ్మ విజానీయాత్ మామేవ గురుమాదృతః ॥

టీ:- తావదితి. మామేవ మద్బుద్ధ్యైవ గురుం పరిచరేత్. తతః పర మేకశ్చరేదిత్యాది ధర్మే వర్తేతేతి భావః. (39)

తా:- బ్రహ్మజ్ఞానము కలుగునంతవరకు బుద్ధిమంతుడు, శ్రద్ధగలవాడు, అసూయలేనివాడై గురువును నన్నుగా ఆదరించుచూ, శుశ్రూష చేయవలెను. ఆ తరువాత ఒక్కడే చరించునది అను ధర్మములతో ఉండవలెనని భావము. (39)

40శ్లో॥ యస్త్వ సంయుత షడ్వర్గః ప్రచండేంద్రియ సారథిః ।
జ్ఞానవైరాగ్య రహిత స్త్రిదండముపజీవతి ॥

టీ:- అనధికారిణః సన్న్యాసం నిందతి ద్వాభ్యాం. య ఇతి. ప్రచండోఽత్యాసక్త ఇంద్రియసారథిర్బుద్ధిర్యస్య సః. (40)

తా:- అనధికారికి సన్యాసమును నిందించుచున్నాడు రెండుశ్లోకములతో. ఎవడైతే నియమించుకొనని ఐదు ఇన్ద్రియములు, మనస్సు కలవాడో, చాలా ఆసక్తములయిన ఇన్ద్రియములకు సారథియైన బుద్ధి కలవాడో జ్ఞానవైరాగ్యములు లేనివాడో అతడు త్రిదండ సన్యాసము గ్రహించి జీవించును. (40)

41శ్లో॥ సురానాత్మన మాత్మస్థం నిహ్నుతే మాం చ ధర్మహా ।
అవిపక్వ కషాయోఽస్మాదముష్మాచ్చ విహీయతే ॥

టీ:- సురానితి. సురాన్ యష్టవ్యాన్ దేవాన్. ఆత్మానం ఆత్మస్థం. మాం చ. నిహ్నుతే ప్రతారయతి - నిహ్నవఫలమాహ- అస్మాదితి.(41)

తా:- ఎవడు యజింపదగు ఇంద్రాది దేవతలను, తనను, ఆత్మయందున్న నన్ను ధర్మానాశకుడై మోసగించునో అట్టి పరిపక్వము కాని ఇంద్రియ, మనోవాసనలు గలవాడు, ఇహలోకము నుండి పరలోకము నుండి భ్రష్టుడగుచున్నాడు. (41)

42శ్లో॥ భిక్షోర్ధర్మః శమోఽహింసా తప ఈక్షా వనౌకసః ।
గృహిణో భూత రక్షేజ్యా ద్విజస్యాచార్య సేవనమ్ ॥

టీ:- చతుర్ణాం ఆశ్రమిణాం ప్రధానధర్మానాహ - భిక్షోరితి.(42)

తా:- నాలుగు ఆశ్రమముల వారికి ప్రధాన ధర్మములు చెప్పుచున్నాడు. శాంతి, అహింస, సన్యాసిధర్మములు. వానప్రస్థునకు తపస్సు, పరమాత్మ దర్శనము ధర్మములగును. గృహస్థునకు భూతరక్షణము, యజ్ఞము ధర్మములగును. బ్రహ్మచారికి గురుసేవ ధర్మమగును. (42)

43శ్లో॥ బ్రహ్మచర్యం తపః శౌచం సంతోషో భూతసౌహృదమ్ ।
గృహస్థస్యాప్యృతౌ గంతుః సర్వేషాం మదుపాసనమ్ ॥

టీ:- అన్యధర్మాన్ కాంశ్చిత్ గృహస్థేఽప్యతిదిశతి. బ్రహ్మచర్యమితి. శౌచం రాగాదిరాహిత్యం. తస్య బ్రహ్మచర్యప్రకారమాహ- ఋతౌ గంతురితి.(43)

తా:- ఋతుకాలమున భార్యాగమనముచేయు గృహస్థునకు బ్రహ్మచర్య వ్రతఫలము లభించును. శౌచము, సంతోషము, ప్రాణులందు మైత్రీ భావము. నన్ను భజించుట అనునవి అందరికీ సమానము. (43)

44శ్లో॥ ఇతిమాం యః స్వధర్మేణ భజన్నిత్య మనన్య భాక్ ।
సర్వభూతేషు మద్భావో మద్భక్తిం విందతేఽచిరాత్ ॥

టీ:- ఏవం భూతవర్ణాశ్రమధర్మఫలమాహ - ఇతీతి. దృఢాం మద్భక్తిం విందతి. (44)

తా:- ఇట్టి వర్ణాశ్రమ ధర్మముల ఫలమును చెప్పుచున్నారు. ఇట్లు స్వవర్ణాశ్రమోచిత ధర్మము కలిగి అనన్యచింతకుడై నన్ను భజించుచున్న వాడు సర్వభూతములందు నా స్వరూపము గాంచువాడై నా భక్తిని త్వరలోనే పొందుచున్నాడు. (44)

45శ్లో॥ భక్త్యోద్ధవానపాయిన్యా సర్వలోక మహేశ్వరమ్ ।
సర్వోత్పత్త్యప్యయం బ్రహ్మ కారణం మోపయాతి సః ॥

టీ:- తతః కిమత ఆహ-భక్త్యేతి. మహేశ్వరత్వే హేతుః సర్వోత్పత్త్యప్యయం సర్వస్య ఉత్పత్త్యప్యయౌ యస్మాత్. అతఏవ తత్కారణం మామాం బ్రహ్మస్వరూపం వైకుంఠవాసినం. యద్వా బ్రహ్మణోవేదస్య కారణం. మాముపయాతి. సామీప్యేన ప్రాప్నోతి. (45)

తా:- దాని వలన ఏమగునో చెప్పుచున్నారు. ఓ ఉద్ధవా ! అన్ని లోకాలను పాలించువారి ప్రభువును, అన్ని ప్రాణుల ఉత్పత్తి లయములు చేయువాడను, సర్వ జగత్కారణుడను, బ్రహ్మ స్వరూపుడను అగు నన్ను, ఎడతెగని భక్తితో పొందుచున్నాడు. (45)

46శ్లో॥ ఇతి స్వధర్మ నిర్ణిక్త సత్త్వో విజ్ఞాత మద్గతిః ।
జ్ఞాన విజ్ఞాన సంపన్నో న చిరాత్సముపైతి మాం ॥

టీ:- తతశ్చాసౌ ముక్తఏవేత్యాహ ఇతీతి. ఇత్యేవం భూతేన స్వధర్మేణ నిర్ణిక్తం శుద్ధం సత్త్వం యస్య సః.అత ఏవ విజ్ఞాతా మమ గతి రైశ్వర్యం యేన. (46)

తా:- అందువలన అతడు ముక్తుడై అనుచున్నాడు. ఈ ప్రకారము స్వధర్మముచే పరిశుద్ధమైన బుద్ధిగలవాడును, నా ఈశ్వర స్వరూపము తెలిసిన వాడును, పరోక్షజ్ఞానములతో గూడిన వాడును, విరక్తుడై నన్ను పొందుచున్నాడు. (46)

47శ్లో॥ వర్ణాశ్రమవతాం ధర్మ ఏష ఆచార లక్షణః ।
స ఏవ మద్భక్తి యుతో నిశ్శ్రేయసకరః పరః ॥

టీ:- ఉక్తం ధర్మం సంక్షిప్యాహ - వర్ణేతి. య ఏష ఆచార లక్షణః పితృలోకప్రాప్తిః ఫలం మద్భక్తియుతః. మదర్పణేన కృతః. (47)

తా:- ఉక్తధర్మమును సంక్షేపించి చెప్పుచున్నాడు. వర్ణాశ్రమములు గలవారికి చెందిన దైవ, పితృలోక ప్రాప్తి గలదైన ఈ ధర్మము నాయందు సమర్పించబడినదగునేని ఉత్తమమైన మోక్షము నిచ్చును. (47)

48శ్లో॥ ఏతత్తేఽభిహితం సాధో భవాన్పృచ్ఛతి యచ్చమామ్ ।
యథా స్వధర్మ సంయుక్తో భక్తో మాం సమియాత్పరమ్ ॥

టీ:- ప్రకారణార్థముపసంహరతి ఏతదితి. ఏతచ్చ తేఽభిహితం యథా భక్తో భూత్వా మాం పరం సంప్రాప్నుయాదితి. (48)

తా:- ప్రకారణార్థమును ఉపసంహరించుచున్నాడు. ఓ సాధూ ! నీవు ఏ ధర్మమును గూర్చి నన్నడిగినావో ఆ యీ ధర్మము నీకు చెప్పినాను. ఆ ప్రకారము స్వధర్మముతో గూడిన భక్తుడు పరబ్రహ్మమగు నన్ను పొందుచున్నాడు. (48)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**అష్టాదశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**అష్టాదశాధ్యాయము సమాప్తము.**

## ఏకోనవింశోఽధ్యాయః

**శ్రీభగవానువాచ**

1.శ్లో॥ యోవిద్యాశ్రుత సంపన్న ఆత్మవాన్నాను మానికః ।
మాయామాత్రమిమం జ్ఞాత్వా జ్ఞానం చ మయి సన్యసేత్ ॥

టీ:- జ్ఞానాదేర్నిర్ణయం పూర్వం కృతోహ్యాశ్రమ ధర్మతః ఏకోనవింశతితమే జ్ఞానాదేస్త్యాగ ఉచ్యతే పా. జ్ఞానినో వర్ణ్యతే కర్మాభావ ఏకోనవింశకే, యుక్తితర్కస్వరూపాభ్యాం నష్టజ్ఞానస్య సర్వదా. తదేవం తర్కతో బాధితోఽపి దేహాది ప్రపంచో యావదపరోక్షానుభవేన దిఙ్మోహాదిరివ న లీయతే. తావత్ జ్ఞానాభ్యాసస్తతో ముక్తిరిత్యుక్తం. శ్లో."అదేహాంతాత్క్వచిత్ ఖ్యాతిస్తతస్సంపద్యతే మయే"త్యాదినా. యస్య త్వపరోక్షానుభవేన. ప్రపంచో లీనప్రాయః. తస్య న కించిత్కృత్యమస్తీత్యాహ- యఇతి. విద్యా అనుభవః తత్పర్యంతేన శ్రుతేన సంపన్నః. అత ఏవాత్మవాన్ ప్రాప్తాత్మతత్త్వః నానుమానికః కేవలపరోక్షజ్ఞానవాన్న భవతి అనకారపాఠే ప్రాక్ శ్రుత్యనుకూల తర్కతోనిర్ణీతార్థః స ఇదం ద్వైతం తన్నివృత్తిసాధనం చ మయి మాయామాత్రమితి జ్ఞాత్వా జ్ఞానం తత్సాధనం చ న్యసేత్. అయమేవ విద్వత్సన్న్యాసోనామ.(1)

## ఏకోనవింశాధ్యాయము

తా:- కడచిన అధ్యాయమందు పూర్వము ఆశ్రమ ధర్మమును బట్టి జ్ఞానాదుల నిర్ణయము చేయబడినది. ఈ పందొమ్మిదవ అధ్యాయము నందు ఆ జ్ఞానాదుల త్యాగము చెప్పబడుచున్నది. ఈ ప్రకారము తర్కము వలన బాధితమయినను దేహాది ప్రపంచము ఎంత వరకు అపరోక్షజ్ఞానానుభవముచే దిగ్భ్రాంతి మొదలగునది వలె లీనముకాదో అంతవరకు జ్ఞానాభ్యాసము చేయవలెను. దానివలన మోక్షము కలుగునని ."ఆదేహాన్తాత్క్వచిత్ఖ్యాతిః తతః సంపద్యతే మయా" అనుదానిచే చెప్పబడినది. ఎవనికి అపరోక్షానుభవము వలన ప్రపంచము లీనప్రాయమగునో వానికి చేయవలసిన కృత్యము లేదనుచున్నారు. ఎవడు అనుభవపర్యంతము బ్రహ్మవిద్యాశ్రవణముతో గూడిన వాడో ఆత్మతత్త్వ ప్రాప్తి గలవాడో కేవలము పరోక్షజ్ఞానము లేనివాడో లేక శృత్యనుకూలమగు తర్కముచే నిర్ణయముగల వాడో అతడు ఈ ద్వైత ప్రపంచమును నివృత్తి కావించు సాధనము, జ్ఞానమును నా యందు మాయచే తోచుచున్నదని తెలిసికొని జ్ఞానమును నా యందుంచవలెను. ఇదియే విద్యత్సన్యాసమగును. (1)

2శ్లో॥ జ్ఞానినస్త్వహమే వేష్టః స్వార్థో హేతుశ్చ సంమతః ।
స్వర్గశ్చై వాపవర్గశ్చ నాన్యోఽర్థో మదృతే ప్రియః ॥

టీ:- అత్రహేతుమాహ - జ్ఞానిన ఇతి. యస్మాదహమేవ తస్యేష్టః అపేక్షితః. స్వార్థః ఫలం హేతుః తత్సాధనం చ. సమ్మతః స్వర్గోఽభ్యుదయశ్చ అపవర్గః సంసార నివృత్తిశ్చ. అతస్తస్య న ప్రాప్యం కృత్యం చ వా కించిదస్తీత్యర్థః.(2)

తా:- అందు హేతువును చెప్పుచున్నాడు జ్ఞానికి, నే నిష్టుడను ప్రాప్యఫలము, దానికి సాధనమగు జ్ఞానము, అభ్యుదయమగు స్వర్గమును, సంసార నివృత్తియగు మోక్షమును నేనే నేను తప్ప అన్యమగు వస్తువుగాని, ప్రయోజనముగాని లేదు. (2)

3శ్లో॥ జ్ఞాన విజ్ఞాన సంసిద్ధాః పదం శ్రేష్ఠం విదుర్మమ ।
జ్ఞానీ ప్రియతమోఽతో మే జ్ఞానేనాసౌ బిభర్తిమామ్ ॥

టీ:- అత్ర విద్వదనుభవం ప్రమాణయతి. జ్ఞానేతి. యథోక్తం జ్ఞానినమభినందతి.- జ్ఞానేతి. యతోఽసౌ జ్ఞానేన మాం ధారయతి.(3)

తా:- ఇచ్చట విద్వదనుభవమును ప్రమాణీకరించుచున్నాడు. జ్ఞానము విజ్ఞానముతో కూడిన వారు నా స్థానమును శ్రేష్ఠముగా తెలిసికొందురు. వీరితో జ్ఞాని నా కత్యంత ప్రీతిపాత్రుడు ఇతడు జ్ఞానముతో నన్ను భరించుచున్నాడు. (3)

4శ్లో॥ తపస్తీర్థం జపోదానం పవిత్రాణీతరాణి చ ।
నాలం కుర్వన్తి తాం సిద్ధిం యాజ్ఞాన కలయాకృతా ॥

టీ:- తస్య జ్ఞానం స్తౌతి తప ఇతి. అలమత్యర్థం. జ్ఞానస్య కళయా లేశేన. (4)

తా:- అతని జ్ఞానమును స్తుతించుచున్నాడు. తపస్సు పుణ్యతీర్థములకు వెళ్ళుట, జపము, దానము, ఇతరములయిన పవిత్ర కర్మలును, చిత్తనైర్మల్యమును, ఇవి ఏవియు జ్ఞానముచే పొందబడు స్థితిని పొందింపలేవు. (4)

5శ్లో॥ తస్మాద్ జ్ఞానేన సహితం జ్ఞాత్వా స్వాత్మాన ముద్ధవ ।
జ్ఞాన విజ్ఞాన సంపన్నో భజ మాం భక్తి భావితః ॥

టీ:- తస్మాదితి. జ్ఞానేన సహితం తావత్పర్యంతం యథా భవతి తథా జ్ఞాత్వా. తత్సంపన్నస్సన్ మామేవ భజ. అన్యత్సర్వం త్యజేదిత్యర్థః.(5)

తా:- ఓ ఉద్ధవా! అందువలన స్వాత్మనుజ్ఞానముతో కూడిన వానినిగా ఎరింగి భక్తి భావమును పొంది నన్ను సేవింపుము. (5)

6శ్లో॥ జ్ఞాన విజ్ఞాన యజ్ఞేన మామిష్ట్వాత్మాన మాత్మని
సర్వయజ్ఞపతిం మాం వై సంసిద్ధిం మునయోగమన్ ॥

టీ:- తస్య ప్రత్యయార్థం పూర్వేషాం వృత్తమాహ - జ్ఞానేతి. మామేవ సంసిద్ధిం ప్రాప్తాః. (6)

తా:- దానిని తెలియజేయుటకు పూర్వుల వృత్తమును చెప్పుచున్నాడు. బ్రహ్మతత్త్వము శ్రవణము చేసి పరోక్ష జ్ఞానము పొంది తరువాత భక్తిధ్యానాదులచే అపరోక్షమగు అనుభవజ్ఞానము నొంది జ్ఞాన యజ్ఞముచే అన్ని యజ్ఞములకు ఫలప్రదుడు పరమాత్మయైన తనను తన హృదయమందు పూజించి మునులు ముక్తిని పొందిరి. (6)

7శ్లో॥ త్వయ్యుద్ధ వాశ్రయతి యస్త్రివిధో వికారో
మాయాన్తరాపతతి నాద్యపవర్గయోర్యత్ ।
జన్మాదయోఽస్య యదమీ తవ తస్య కింస్యు
రాద్యన్తయోర్యదసతోఽస్తి తదేవ మధ్యే ॥

టీ:- తదేవం జ్ఞానం సంక్షేపత ఉపదిశతి త్వయీతి. త్రివిధః ఆధ్యాత్మికాదిర్యో వికారో దేహాదిః. స మాయా న తు పరమార్థః యత్ యస్మాత్

తా:- అదే జ్ఞానమును సంక్షేపముగా ఉపదేశించుచున్నాడు. ఉద్ధవా నీ యందు ఆధ్యాత్మికమగు దేహేంద్రియాదికము ఆధిదైవికమగు ఇంద్రియాది దైవత వర్గము, ఆధిభౌతికమగు పంచభూతములు శబ్దాది వృత్తులు అనుమూడు విధములగు ఏ వికారములు కలుగుచున్నవో ఇదంతయూ మాయా మాత్రములు సత్యము కాదు. ఏలయన రజ్జువునందు మొదట లేక మధ్యకాలమునందు తోచి విమర్శించిన పిదప చివరకు లేకపోవు సర్పము మాలిక మొదలగు వానివలె

అంతరా మధ్య ఏవాపతతి. రజ్జౌ సర్పమాలాదివత్. నాద్యపవర్గయోః నత్వాదావంతే చాస్తి. అతః యత్ యదా అస్య వికారస్య అమీ జన్మాదయ స్స్యుః. తదా తస్య తవాధిష్ఠాన భూతస్య కిం న కించిదిత్యర్థః. తస్యాపి వస్తుతో న సంతి తస్యాసత్త్వాదిత్యాహ- ఆద్యంతయోరితి. అసతః సర్పాదేః ఆద్యంతయోర్యదస్తి రజ్వాది తదేవ మధ్యేపి న తు సర్పాది. తద్వదయం వికారో నా స్తీత్యర్థః. యద్వా ఆద్యంతయోర్యదస్తి తన్మధ్యేఽపి అస్త్యేవ న తస్య జన్మాదయస్సంతి అతస్త్వం నిర్వికారం బ్రహ్మేతి.(7)

ఇదియును అసత్యమగును. మరియు ఈ దేహాదులకు కలుగుజన్మ జరామరణాదులగు వికారములు వానికి అధిష్ఠాన భూతుడవైన నీకు కొంచెము కూడా లేవు. ఆ జన్మాదులు కూడా వాస్తవము గావు అసత్తుగా నుండి తోచు సర్పాదికమునకు మొదటను చివరను ఏ రజ్జ్వాదికము సత్యమై యున్నదో అదియే మధ్యకాలము నందున్నది గాని సర్పాదికము లేదు. అట్లే ఈ దేహాది వికారము వాస్తవముగాలేదు. ఏది ఆద్యంతము నందు కలదో అదియే మధ్యకాలమందును కలదు. దానికి జన్మాదులు లేవు. అందువలన నీవు నిర్వికారమైయున్న బ్రహ్మమైయున్నావు. (7)

**ఉద్ధవ ఉవాచ**

8శ్లో॥ జ్ఞానం విశుద్ధం విపులం యథైత
ద్వైరాగ్య విజ్ఞాన యుతం పురాణామ్ ।
ఆఖ్యాహి విశ్వేశ్వర విశ్వమూర్తే
త్వద్భక్తి యోగం చ మహద్విమృగ్యమ్ ।

టీ:- జ్ఞానాదేర్విశేషం జిజ్ఞాసుః పృచ్ఛతి - జ్ఞానమితి. విశుద్ధమేతత్ జ్ఞానం విపుల నిశ్చితం యథా భవతి తథా కథయేతి. మహద్భిః బ్రహ్మాదిభిర్విమృగ్యం. (8)

**ఉద్ధవుడు పలికెను**

తా:- జ్ఞానాదుల విశేషమును తెలిసికొనగోరినవాడై అడుగుచున్నాడు. ఓ విశ్వపతీ! ఏది విశుద్ధమై శుద్ధసాత్వికమై విస్తరించినదై సనాతనమై వైరాగ్యము, అనుభవ జ్ఞానము అను వానితో కూడినదైన, అట్టి విజ్ఞానమును, బ్రహ్మాదులచేతనూ వెతుకదగినట్టి ఆ నీ భక్తి యోగమును చెప్పుము. (8)

9శ్లో॥ తాపత్రయేణాభి హతస్యఘోరే
సంతప్యమానస్య భవాధ్వనీశ ।
పశ్యామినాన్యచ్ఛరణం తవాంఘ్రి
ద్వంద్వాత పత్రాదమృతాభి వర్షాత్ ॥

టీ:- మహద్విమృగ్యత్వమభినయేనాహ - తాపత్రయేణేతి. తాపత్రయేణాభి హతస్య అతః సంతప్యమానస్య. అంఘ్రిద్వంద్వమేవాత పత్రం తస్మాత్ న కేవల మాతపత్రతా కింత్వమృతమప్యభితో వర్షతి యద్యస్మాత్. (9)

తా:- మహాత్ములన్వేషింపదగు ఆ భక్తియోగమును పొందగోరికతో చెప్పుచున్నాడు. ఓ పరమేశ్వరా! భయంకరమైన సంసార మార్గమునందు ఆధ్యాత్మికాది తాపత్రయముచే కొట్టబడి తాపము పొందిన నాకు అమృతపుజల్లులు కురియు శీతోష్ణాది ద్వంద్వములనుండి రక్షించు నీ పాదయుగమగు ఛత్రముకంటే ఇతరమగు శరణమును చూడకున్నాను. (9)

10శ్లో॥ దృష్టం జనం సంపతితం బిలేఽస్మిన్
కాలాహినా క్షుద్ర సుఖోరుతర్షమ్ ।
సముద్ధరైనం కృపయాపవర్గ్యైః
వచోభిరాసిం చ మహానుభావ ॥

టీ:- అతికృపాముత్పాదయన్నాహ - దృష్టిమితి. అస్మిన్ బిలే సంసార కూపే పతితం తత్ర చ కాలాహినా దష్టం. ఏవమపి క్షుద్రసుఖేష్వేవ ఉరుస్తర్షస్తృష్టా యస్య తం దహ్యమానః కథం సముద్ధరణీయ ఇతి చేత్తత్రాహ అపవర్గ్యైః అపవర్గబోధకైః వాగమృతైరాసించేతి.(10)

తా:- అతి దయను కలిగించుచు ఇట్లనుచున్నాడు ఓ మహానుభావా! ఈ సంసారకూపమునందు పడినదియూ, అక్కడ కాలసర్పముచే కరువబడినదియూ, అల్పసుఖములందే మిక్కిలి తృష్ణ గలిగియున్న ఈ జనుని ఉద్ధరింపుము. దయతో అపవర్గ బోధకములగు వాక్కులతో తడుపుము. (10)

**శ్రీ భగవానువాచ**

11శ్లో॥ ఇత్థమేతత్పురా రాజాభీష్మం ధర్మభృతాం వరమ్ ।
అజాతశత్రుః పప్రచ్ఛ సర్వేషాం నో ఽనుశృణ్వతామ్ ॥

12శ్లో॥ నివృత్తే భారతేయుద్ధే సుహృన్నిధన విహ్వలః ।
శృత్వా ధర్మాన్ బహూన్ పశ్చాన్మోక్ష ధర్మాన పృచ్ఛత ॥

టీ:- తద్విశ్వాసార్థం విద్వత్సభాయాం నిర్ణీతమహం వక్ష్యామీత్యాహ- ఇత్థమితి. (11,12)

13శ్లో॥ తానహం తేఽభి ధాస్యామి దేవవ్రత ముఖాచ్ఛ్రుతాన్ ।
జ్ఞాన వైరాగ్య విజ్ఞాన శ్రద్ధా భక్త్యుపబృంహితాన్ ॥

టీ:- తానితి. జ్ఞానాదిభిరుపబృంహితాన్ తత్సహితానిత్యర్థః. (13)

14శ్లో॥ న వైకాదశ పంచత్రీన్ భావాన్ భూతేషు యేన వై ।
ఈక్షేతాథైక మప్యేషు తత్ జ్ఞానం మమ నిశ్చితమ్ ॥

**భగవంతుడు చెప్పుచున్నాడు**

తా:- విశ్వాసము కల్గుటకు విద్వత్సభయందు నిర్ణీతమయిన అర్థము చెప్పెదననుచున్నాడు. నీ వడిగన ప్రకారము ఈ జ్ఞానమును గూర్చి పూర్వము ధర్మరాజు ధర్మవేత్తలలో ఉత్తముడైన భీష్ముని మేమందరం వినుచుండగా ప్రశ్నించెను. (11)

తా:- భారతసంగ్రామమంతయూ సమాప్తమయిన తరువాత చాలా మంది బంధుమిత్రాదులు వధింపబడినందులకు బాధపడుతూ ధర్మరాజు భీష్ముని వలన రాజధర్మములు ఆపద్ధర్మములు విని తరువాత మోక్ష ధర్మములను గూర్చి అడిగెను. (12)

తా:- నేను అట్టి భీష్ముని ముఖమున వినిన జ్ఞాన, విజ్ఞాన, వైరాగ్య, శ్రద్ధ, భక్తి మొదలయిన వానిని పెంపొందింపచేయు మోక్షధర్మములను నీకు చెప్పెదను. (13)

తా:- జ్ఞానమును చెప్పుచున్నాడు. ప్రకృతి పురుష మహదహంకార పంచతన్మాత్రలు అను తొమ్మిదియు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు మనస్సుతో కలసి పదకొండు, సత్త్వ రజస్తములను మూడు గుణములు,

టీ:- తత్ర జ్ఞానం కథయతి నవేతి. ప్రకృతిపురుషమహదహంకార పంచతన్మాత్రాణి. ఏకాదశేంద్రియాణి. పంచమహాభూతాని. త్రయో గుణాః.ఏతాన్ భావానష్టావింశతితత్త్వాని భూతేషు బ్రహ్మాది స్థావరాం తేషు. అనుగతాని యేన జ్ఞానేనేక్షేత అథ ఏష్వపి భావేషు. ఏకం పరమాత్మతత్త్వం అనుగతం యేనేక్షేత. కార్యకారణాత్మకం జగత్పశ్యన్ పరమకారణాత్మకం వైతత్ న తు తతః పృథగితి యేన పశ్యేత్ తత్ జ్ఞానమిత్యర్థః. (14)

పంచతన్మాత్రలు ఈ ఇరువది ఎనిమిది తత్త్వములను, బ్రహ్మాది స్థావరముల వరకు ఉండు ప్రాణులందు అనుగతములయిన వానిని ఏ జ్ఞానముచే చూచునో, మరి ఈ భావములందును ఒక్క పరమాత్మ తత్త్వమనుగతమైన దానిని ఏ జ్ఞానముచే చూచునో, అట్టికార్య కారణాత్మకమైన జగత్తు పరమకారణాత్మకముగానే దానికన్నా వేరుకాదని ఏ దానిని చూచునో అది జ్ఞానమని అర్థము. చూచు ఆ జ్ఞానము నాచే నిశ్చయింపబడినది. (14)

15శ్లో॥ ఏతదేవహి విజ్ఞానం న తథైకేన యేన యత్ ।
స్థిత్యుత్పత్త్యప్యయాన్ పశ్యేద్భావానాం త్రిగుణాత్మనామ్ ॥

టీ:- విజ్ఞానమాహ - శ్లోకార్ధేన. ఏకదితి. యత్. యదా యేనైకేన. అనుగతాన్ అనేకాత్మకాన్ పూర్వమైక్షత. తాన్ తథా పూర్వవన్నేక్షేత కింతు పరమకారణం బ్రహ్మైవ. తదా ఏతదేవ విజ్ఞానముచ్యతే - ఏతదుక్తం భవతి. పరోక్ష జ్ఞానేనాపరోక్షభ్రమస్య దిఙ్మోహాదిష్వివ నివృత్త్యభావాత్తదా జగత్పశ్యన్నప్యాత్మనః పృథక్ సదితి మన్యేత అపరోక్ష జ్ఞానే బాధితమేవ. జీవన్ముక్తః సంస్కార శేషం పశ్యతి తతః పరం న పశ్యతి చ. అతః పరోక్షాపరోక్షజ్ఞానే జ్ఞానవిజ్ఞానశబ్దాభ్యాముచ్యేతే ఇతి. 15

తా:- విజ్ఞానమును చెప్పుచున్నాడు. ఏతదేవ అని అర్ధశ్లోకముతో. ఏది ఎప్పుడు ఏ ఒక్కదానిచే అనుగతములయిన వానిని అనేకాత్మకము లను పేర్కొనబడిన వానిని పూర్వము చూచునో వానిని పూర్వమువలె చూడరాదు. మరి ఏమనగా అది ఒక్క పరమకారణమైన బ్రహ్మ మే అప్పుడు. ఇదియే విజ్ఞానమని చెప్పబడును దీని భావమిది. పరోక్ష జ్ఞానముచే అపరోక్ష భ్రమము దిఙ్మోహాదులందువలె తొలగనందున వలన అప్పుడు బ్రహ్మాత్మకమగు జగత్తును చూచువాడైనను ఆత్మకంటే వేరుగా సత్తు ఉండేనని తలంచుచూ అపరోక్ష జ్ఞానముచే అది బాధిత మగును వేరుగాదు. జీవన్ముక్తుడు సంస్కారశేషమును కాలిన వస్త్రమువలె చూచుచు అటుమీదట చూడడు అందువలన పరోక్షాపరోక్షజ్ఞానములు

16శ్లో॥ ఆదావంతేచ మధ్యే చ సృజ్యాత్సృజ్యం యదన్వియాత్ ।
పునస్తత్ప్రతి సంక్రామే యచ్ఛిష్యేత తదేవ సత్ ॥

టీ:- ఏకేన సర్వకార్యాణామనుగతిం కార్యాణాం కారణాత్పృథగసత్త్వం చోపపాదయతి సార్ధేన. తత్ర యది న కదాచిదనీదృశం జగదిత్యాది జ్ఞాన విజ్ఞాన శబ్దములచే చెప్పబడును. (ముందు ఒక్క దానితో కూడిన దానిని అనేక స్వరూపములుగా చూచెను అట్లుగాక అవి అన్నియు పరమకారణమైన ఒక్క బ్రహ్మమే అని చూచుట విజ్ఞానమగును) ఒకదానితో సర్వకార్యముల అనుగతియును కార్యములు కారణము కన్నా వేరుగా నుండదని ఒక్కటిన్నరశ్లోకముచే ఉపపాదించుచున్నాడు. అచ్చట ఆ విజ్ఞానమున ఒకప్పుడు జగత్తు ఇట్టిదిగా నుండనిచో ఇత్యాది మతమున ఈ భావములకు ఉత్పత్త్యాదులుండును. అప్పుడు కారణ మొక్కటి కాకపోవుచున్నందువలన ఏకాత్మకత మిథ్యాత్వము సంభవించక పోవును. అందువలన వాని ఉత్పత్త్యాదిలను సాధించుచున్నారు. "స్థిత్యుత్పత్తి" అనేడి శ్లోకముచే త్రిగుణస్వరూపములై సావయవములైన దేహాదుల యొక్క ఉత్పత్తి స్థితిలయములను వానిని చూడవలెను. విమతములయిన భావములు, ఉత్పత్తాదులు గలవి సావయవములయినందున, ఘటమువలె అని అనుమాన ప్రయోగము. (15)

తా:- ఆది యందు ఉత్పత్తికి, అంతమందు లయమందును, స్థితి యందును, కార్యమునుండి కార్యాన్తరమునకు ఏది అనుగతమై యున్నదో మరియు సర్వప్రళయ సమయమున ఏది శేషించి యుండునో అదియే సత్యము సత్పదార్థము అని చూడవలెను.(16)

మతేనైతేషాం భావానాముత్పత్త్యాదయస్స్యుః తర్హి కారణస్యైకస్యా భావాదేకాత్మతా మిథ్యాత్వం చ న స్మాత్ అతస్త్వేషాముత్పత్త్యాదీన్ సాధయతి - స్థితీతి. త్రిగుణాత్మనాం సావయవానామిత్యర్థః విమతాః భావాః ఉత్పత్త్యాదిమంతః, సావయవత్వాత్. ఘటాదివదితి పశ్యేత్ తతః ఆదౌ ఉత్పత్తౌ అంతే పరిణామాంతరాపత్తే చ. కారణత్వేన. మధ్యే చాశ్రయత్వేన. సృజ్యాత్సృజ్యం కార్యాత్కార్యాంతరం ప్రతి. యదన్వియాత్ అనుగచ్ఛత్ తత్ప్రతిసంక్రామే తేషాం ప్రళయే చ యదవశిష్యేత తదేవ సదితి పశ్యేదిత్యర్థః. (16)

17శ్లో॥ శృతిః ప్రత్యక్షమైతిహ్య మనుమానం చతుష్టయామ్ ।
ప్రమాణేష్వనవస్థానా ద్వికల్పాత్స విరజ్యతే ॥

టీ:- వైరాగ్యమాహ - ద్వాభ్యాం. శ్రుతిరితి. శ్రుతి "నేహ నానాస్తి కించనే"త్యాది. ప్రత్యక్షం పటాదికార్యం తంత్వాది వ్యతిరేకేణన న దృశ్యతే, ఏవం చైతన్యవ్యతిరేకేణ న కించిద్దృశ్యత ఇతి. ఐతహ్యం మహాజన ప్రసిద్ధిః అనుమానం విమతం మిథ్యా, దృశ్యత్వాత్. శుక్తిరజత వదిత్యాది. ఏవం ప్రమాణచతుష్టయం ఏతేష్వనవస్థానాత్ ఏతైర్బాధి తత్వాత్ స ఏవం సర్వానుగతం సత్యమాత్మతత్త్వం పశ్యన్ వికల్పస్య చ మిథ్యాత్వాత్తతో విరజ్యతే విరక్తో భవతీత్యర్థః.(17)

తా:- వైరాగ్యమును రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు. "ఈ లోకమునఅనేకముగా ఉండునది ఏ కొంతయునూ లేదు". అనునది శృతి ప్రత్యక్షము - పటాదికార్యము తంత్వాదివ్యతిరేకముగాలేదు, అనునది ఐతిహ్యము - మమాజనులందు ప్రసిద్ధము అనుమానం - విమతము భేదము, మిథ్య, దృశ్యమగుట వలన, శుక్తియందు రజతము వలె, ఈ ప్రకారముపై నాల్గుప్రమాణములయందు నిరూపణము బాధి తమగుట వలన, సత్యమగు ఆత్మతత్త్వము నిరూపణమగుట వలన, వికల్పము మిథ్యయగుట వలన, అతడీరీతిగా విరక్తుడగుచున్నాడు.(17)

18శ్లో॥ కర్మణాం పరిణామత్వాదావిరించాద మంగళమ్ ।
విపశ్చిన్నశ్వరం పశ్యేద దృష్టమపి దృష్టవత్ ॥

టీ:- నను వేదోక్త స్వర్గాది సుఖాశ యాన్య విరజ్యేతేత్యత ఆహ - కర్మణామితి. ఆవిరించాత్ బ్రహ్మలోకపర్యంతం. అదృష్టమపి సుఖం అమంగళం మత్వా దుఃఖరూపం నశ్వరం చ పశ్యేత్.(18)

తా:- వేదోక్తమగు స్వర్గాది సుఖాశతో విరక్తుడు కాకూడదు గదా అనిన దానికి చెప్పుచున్నారు. యాగాది కర్మల ఫలపరిణామముగా లభించు బ్రహ్మాది లోకములు సహితము దుఃఖ రూపములగుచూ, కంటికి కనబడే ఇహలోక సుఖమువలె, కంటికి కనబడని స్వర్గాది సుఖము కూడా నశ్వరమగునని విద్వాంసుడు తలచును. (18)

19శ్లో॥ భక్తి యోగః పురైవోక్తః ప్రీయమాణాయతేఽనఘ ।
పునశ్చ కథయిష్యామి మద్భక్తేః కారణం పరమ్ ॥

టీ:- భక్తియోగస్య కారణమాహ - భక్తియోగ ఇతి. భక్తియోగః పూర్వముక్తఏవ. తథాపి తస్మిన్ ప్రీతిం ప్రాప్నువతే తేభ్యం పునశ్చ కథయిష్యామి. (19)

తా:- భక్తియోగమును సకారణముగ తెలుపుచున్నాడు. ప్రీతిపాత్రుడవైన నీకు నా భక్తియోగము పూర్వమే చెప్పబడినది. అయిననూ నా భక్తి యొక్క పరమకారణమును చెప్పగలను. (19)

20శ్లో॥ శ్రద్ధాఽమృత కథాయాం మే శశ్వన్మదనుకీర్తనమ్ ।
పరినిష్ఠా చ పూజాయాం స్తుతిభిః స్తవనం మమ ॥

తా:- నా అమృత తుల్యమయిన కథలను శ్రవణము చేయుట, శ్రద్ధ, ఎప్పుడూ నన్ను కీర్తించుట, పూజయందు పరిపూర్ణ నిష్ఠ, స్తుతులచే నన్ను స్తుతించుట.(20)

21శ్లో॥ ఆదరః పరిచర్యాయాం సర్వాంగై రభివందనమ్ ।
మద్భక్తపూజాభ్యధికా సర్వభూతేషు మన్మతిః ॥

టీ:- శ్రద్ధేతి. శ్రద్ధా శ్రవణాదరః. శశ్వదితి సర్వత్రానుషజ్యతే మదనుకీర్తనం శ్రవణానంతరం మత్కథావ్యాఖ్యానమిత్యర్థః. (20,21)

తా:- నా సేవయందాదరము నాకు సాష్టాంగప్రణామము ఆచరించుట నా భక్తులనధికముగా పూజించుట సర్వభూతముల యందు నా యునికిని నా స్వరూపమును చూచుట. (21)

22శ్లో॥ మదర్థేష్వంగ చేష్టా చ వచసామద్గుణేరణమ్ ।
మయ్యర్పణం చ మనసః సర్వకామ వివర్జనమ్ ॥

టీ:- మదర్థేష్వితి. అంగచేష్ట లౌకికీ క్రియా వచసా లౌకికేనాపి మద్గుణానామీరణం కథనం. (22)

తా:- నా సేవాకార్యముల యందు లౌకిక క్రియను, దేహమును ప్రవర్తింపచేయుట. వాక్కుచే నా గుణములను కీర్తించుట, మస్సును నా యందు నిలుపుట(సమర్పించుట) అన్ని కామములను విడుచుట. (22)

23శ్లో॥ మదర్థేఽర్థ పరిత్యాగో భోగస్య చ సుఖస్య చ ।
ఇష్టం దత్తం హుతం జప్తం మదర్థం యద్వ్రతం తపః ॥

టీ:- మదర్థఇతి. మదర్థే మద్భజనార్థం తద్విరోధినోఽర్థస్య పరిత్యాగః భోగస్య తత్సాధనస్య చ చందనాదేః సుఖస్య పుత్రోప లాలనాదేః ఇష్టాది వైదికం యత్కర్మ తదపి మదర్థం కృతం భక్తేః కారణమిత్యర్థః.(23)

తా:- నా భజన కొరకు ధనాదికము త్యాగము చేయుట భోగసాధనము చందనాదికమును, పుత్రోప లాలనాదికమయిన సుఖమును, త్యాగము చేయుట, వైదికకర్మ, దానము, హోమము, అనుభవింపబడినది. ఏ వ్రతము కలదో దానిని నా కొరకు త్యాగము చేయుట భక్తికి కారణమని యర్థము. (23)

24శ్లో॥ ఏవం ధర్మైర్మనుష్యాణా ముద్ధవాత్మ నివేదినామ్ ।
మయి సంజాయతే భక్తిః కోఽన్యోర్థోఽస్యావశిష్యతే ॥

టీ:- ఏవమితి. భక్తిః ప్రేమలక్షణా సంజాయతే. అస్య భక్తస్య అన్యః కోఽర్థః సాధనరూపః సాధ్యరూపో వావశిష్యతే. సర్వోఽప్యర్థస్స్వతేవ భవతీత్యర్థః.(24)

తా:- ఓ ఉద్ధవా ! ఈ చెప్పిన పూజాది ధర్మముల చేత, తనను తాను సమర్పించుకొనుట వలన, మనుష్యులకు నాయందు భక్తి కల్గుచున్నది. భక్తికి ఇంతకన్నా వేరొక ప్రయోజనము లేదు. (24)

25శ్లో॥ యదాత్మన్యర్పితం చిత్తం శాంతం సత్త్వోపబృంమితమ్ ।
ధర్మం జ్ఞానం స వైరాగ్య మైశ్వర్యం చాభిపద్యతే ॥

టీ:- తదేవాహ - కిం బహునా. చిత్తమేవాంతర్బహిర్నిష్ఠార్థానర్థయోః కారణమిత్యాహ- ద్వాభ్యాం. యదేతి. యదాత్మని మయి ఈశ్వర చిత్తమర్పితం తదా పుమాన్ ధర్మాదీన్ ప్రాప్నోత్యేవ. (25)

తా:- బహుప్రలపించుట ఎందులకు చిత్తమే అంతర్బహిర్నిష్ఠలకు అర్థానర్థములకు కారణమని శ్లోకములచే చెప్పుచున్నారు. ఎప్పుడు పరమాత్మయగు నా యందు సత్వగుణముచే పెంపొందిన శాంతమగు చిత్తము అర్పింపబడినదో అప్పుడు ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్యము లను పొందుచున్నాడు. (25)

26శ్లో॥ యదర్పితం తద్వికల్పే ఇంద్రియైః పరిధావతి ।
రజస్వలం చాసన్నిష్ఠం చిత్తం విద్ధి విపర్యయమ్ ॥

టీ:- ఏతదేవ వ్యతిరేకేణ ద్రఢయతి యదితి. యత్ యదా చిత్తం వికల్పే దేహే గృహాదావర్పితం సత్ పరిధావతి. తదాదికం రజస్వల ససన్నిష్ఠ భవతి. తతశ్చ విపర్యయం అధర్మాదికం విద్ధి. (26)

తా:- దీనినే వ్యతిరేకముగా దృఢీకరించుచున్నాడు. చిత్తము ఎప్పుడు వికల్పమగు దేహ గృహాదిక మందు అర్పింపబడినదై, ఇంద్రియములతో పరుగిడుతున్నదో, కలుషితమై, అసత్యమగు సంసారమున యున్నదో, అప్పుడు అధర్మాదికము కలుగును అని తెలిసికొనుము. (26)

27శ్లో॥ ధర్మో మద్భక్తికృత్ప్రోక్తో జ్ఞానం చైకాత్మ్య దర్శనమ్ ।
గుణేష్వసంగో వైరాగ్యమైశ్వర్యం చాణిమాదయః ॥

టీ:- స్వాభిప్రేతాన్ ధర్మాదీన్ వ్యాచష్టేధర్మ ఇతి. ధర్మో మద్భక్తికృత్ యతః స ఏవ ప్రోక్తః. ప్రకృష్టః ఉక్తః శాస్త్రేషు. (27)

తా:- స్వాభిప్రేతములయిన ధర్మాదులను చెప్పుచున్నాడు. నాభక్తిని కావింపచేయునది ధర్మముగా చెప్పబడినది. అట్లే సర్వము ఒక్క పరమాత్మగా చూచు జ్ఞానమును, ఇంద్రియ సుఖముల యందాసక్తిలేని తనమును, వైరాగ్యము, ఐశ్వర్యము, అణిమాదిసిద్ధులు కూడా అగును. (27)

### ఉద్ధవ ఉవాచ

28శ్లో॥ యమః కతివిధః ప్రోక్తో నియమో వారికర్శన ।
కశ్శమః కోదమః కృష్ణ కాతితిక్షా ధృతిః ప్రభో ॥

టీ:- ధర్మాదీనాం మహాజన ప్రసిద్ధానా మన్యథావ్యాఖ్యా తత్వాద్యమాదిష్వపి సంఖ్యాతః స్వరూపతో వా కించ ద్వైలక్షణ్యం స్యాదితి సంభావనయా తద్విశేష జిజ్ఞాసుః పృచ్ఛతి పంచభిః యమఇతి.(28)

29శ్లో॥ కిం దానం కిం తపశ్శౌర్యం కిం సత్య మృతశౌచకే ।
కస్త్యాగః కిం ధనం చేష్టం కోయజ్ఞః కాచదక్షిణా ॥

టీ:- కిమితి. ఇష్టం అభ్యర్థితం ధనం చ కిం. (29)

30శ్లో॥ పుంసః కిం స్విద్బలం శ్రీమన్ భగో లాభశ్చకేశవ ।
కావిద్యాహ్రీంః పరాకా శ్రీః కిం సుఖం దుఃఖమేవ చ ॥

31శ్లో॥ కః పండితః కశ్చమూర్ఖః కః పంథా ఉత్పథశ్చ కః ।
కః స్వర్గో నరకః కస్విత్కోబంధురుత కిం గృహమ్ ॥

టీ:- పుంసఇతి. పరేతి విద్యాదీనాం విశేషణం శ్రీర్మండనం.(30,31)

### ఉద్ధవుడు అడుగుచున్నాడు

తా:- ధర్మాదులు మహాజన ప్రసిద్ధములైనను అన్యథా వ్యాఖ్యానించుట వలన యమాదులందు సంఖ్యనుబట్టి, స్వరూపమునుబట్టి, కొంచెము వైలక్షణ్యము కలుగుచున్నదన్న ఊహతో వాని విశేషము తెలియగోరి అయిదు శ్లోకములతో ప్రశ్నించుచున్నాడు. ఓ శత్రుసూదనా! యమము ఎన్ని విధములుగా చెప్పబడినది? నియమమెన్ని విధములు? శమమనయేమి? దమమననేమి? తితిక్షయననేమి? ధృతియననేమి? (28)

తా:- దానమననేమి? తపమేది? శౌర్యమన నేమి? సత్యము, శౌచములననేమి? త్యాగ మననేమి? ధనమననేది? ఇష్టమననేది? యజ్ఞమననేమి? దక్షిణయననేమి? (29)

తా:- ఓ కేశవా? పురుషేనికి బలమేది ? శ్రీమంతమగు సౌభాగ్యము లాభము ఏది? విద్యా హ్రీ అనునవి ఏవి? శ్రేష్ఠమయిన అలంకారమేది? సుఖ దుఃఖము లేవి? (30)

తా:- పండితుడెవ్వడు? మూర్ఖుడెవ్వడు ? ధర్మమార్గమేది? అధర్మ మార్గమేది? స్వర్గమననేమి ? నరకమేది? బంధువెవరు? గృహమననేది? (31)

32శ్లో॥ కఆఢ్యః కోదరిద్రోవా కృపణః కః క ఈశ్వరః ।
ఏతాన్ప్రశ్నాన్ మమబ్రూహి విపరీతాంశ్చసత్పతే ॥

టీ:- కఇతి. ప్రశ్నాన్ పృష్టార్థాన్ విపరీతాన్ అశమాదీన్.(32)

తా:- సాధుజనవల్లభా! ఆఢ్యుడెవడు? దరిద్రుడెవడు? కృపణుడెవడు? ఈశ్వరుడెవడు? ఈ ప్రశ్నలను గూర్చి ఇంకను వానికి విపరీతముల యిన అశమాదుల గూర్చియు నాకు సదుత్తరములిమ్ము. (32)

శ్రీభగవానువాచ

భగవంతుడు వచించెను

33శ్లో॥ అహింసా సత్య మస్తేయ మసంగో హ్రీరసంచయః ।
ఆస్తిక్యం బ్రహ్మచర్యం చ మౌనంస్థైర్యం క్షమాభయమ్ ॥

టీ:- యమనియామానాహ - త్రిభిః అహింసేతి. అస్తేయం మనసాపి పరస్వాగ్రహణం. ఆస్తిక్యం ధర్మేవిశ్వాసః.(33)

తా:- యమ నియమములను మూడు శ్లోకములచే చెప్పుచున్నాడు. అహింస, సత్యము, దొంగతనములేకుండుట, అసంశము, హ్రీ అకార్యములందు సిగ్గు, ధనము కూడాబెట్టకుండుట, ఆస్తిక్యము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము, అభయము, ఇవియమములు. (33)

34శ్లో॥ శౌచం జపస్తపోహోమః శ్రద్ధాతిథ్యం మదర్చనమ్ ।
తీర్థాటనం పరార్థేహా తుష్టిరాచార్య సేవనమ్ ॥

టీ:- శౌచమితి. శౌచం బాహ్యామాభ్యంతరం చేతి ద్వివిధం. అతః ఏతే ద్వాదశ నియమాః. శ్రద్ధా ధర్మాదరః. (34)

తా:- శౌచము బాహ్యము ఆభ్యంతరమని ద్వివిధము. బహిశ్శౌచము అంతశ్శౌచము, జపము, తపము, హోమము, శ్రద్ధ, ఆతిథ్యము, నా పూజ, తీర్థయాత్ర, పరులకు మేలు చేయకోరిక, సంతృప్తి, ఆచార్యుని సేవించుట, ఈ పన్నెండు నియమములు. (34)

35శ్లో॥ ఏతేయమాః సనియమా ఉభయోర్ద్వాదశస్మృతాః ।
పుంసాముపాసితాస్తాత యథా కామం దుహంతి హి ॥

టీ:- ఏతఇతి. ఉభయోశ్శ్లోకయో యే స్మృతాః తే యమాః నియమాశ్చ. యద్వా ఉభయోః ప్రవృత్త నివృత్తయోః. ముముక్షోర్యమా ముఖ్యాః సకామస్య నియమా ముఖ్యాః స్మృతా ఇత్యర్థః. అత్ర హేతుమాహ - హి యస్మాత్ ఉపాసితాః సేవితాస్సంతః. పుంసాం ప్రవృత్తానాం నివృత్తానాం చ. యథా కామం కామానుసారేణ. మోక్షమభ్యుదయం చ దుహంతీతి. (35)

తా:- పై రెండు శ్లోకములందు పండ్రెండు యమములు పండ్రెండు నియమములు చెప్పబడినవి. లేదా ప్రవృత్తి నివృత్తులకు చెప్పబడినవి. ముముక్షువుకు యమములు ముఖ్యమని, సకామునకు నియమములు ముఖ్యమని తెలియవలెను. వాని నుపాసించిన పురుషునికి వారి వారి వాంఛకు తగినట్లు మోక్షమును, ఇహలోక సుఖమును, స్వర్గమును, ఇచ్చుచున్నవి. (35)

36శ్లో॥ శమోమన్నిష్ఠతా బుద్ధేర్దమ ఇంద్రియ(నిగ్రహః) సంయమః ।
తితిక్షా దుఃఖ సంమర్షో జిహ్వోపస్థ జయో ధృతిః ॥

టీ:- ముముక్షోరుపాదేయాన్ శమాదీన్ హేయాంశ్చా శమాదీన్ మహాజన ప్రసిద్ధేభ్యోవిలక్షణానాహ - యావత్సమాప్తి శమఇతి. ఏతేనైవ తద్విపరీతా అశమాదయోఽప్యున్నేయాః. శమో మన్నిష్ఠతా బుద్ధిః. న తు శాంతి మాత్రం దమ ఇంద్రియ సంయమః న చేరాదిదమనం. తితిక్షా విహిత దుఃఖస్య సంమర్షః. సహనం న భారాదేః. జిహ్వోపస్థయో ర్జయో వేగధారణం. ధృతిః. నత్వనుద్వేగమాత్రం.(36)

తా:- ముముక్షువుచే ఉపాదేయులయిన శమాదులను, హేయములయిన దుఃఖాదులను, మహాజనప్రసిద్ధములయిన వానికన్నా విలక్షణమయిన వానిని చెప్పుచున్నాడు అధ్యాయసమాప్తి వరకు. దీని వలననే తద్విపరీతములయిన అశమాదులను ఊహించవలెను. నా యందు దృఢముగా భక్తి నిల్పుట శమమగును. కాని కేవలము క్షాంతికాదు. ఇంద్రియములను నిరోధించుట దమమగును. కాని చోరాది దండము కాదు. విహితకర్మానుష్ఠాన శ్రమ సహనము తితిక్ష యగును. కేవలము భార్యాదుల సహించుట కాదు. జిహ్వను, ఉపస్థను, జయించుట, వాని వేగమును నిరోధించుట, ధృతియగును. కాని మనః క్షోభము లేకుండుట కాదు. (36)

37శ్లో॥ దండన్యాసః పరం దానం కామత్యాగస్తపః స్మృతమ్ ।
స్వభావ విజయః శౌర్యం సత్యం చ సమదర్శనమ్ ॥

టీ:- దండేతి. దండో భూతద్రోహః తస్యత్యాగః దానం. న ధనార్పణం. కామత్యాగః భోగపేక్షా తపః. నకృచ్ఛ్రాది స్వభావో వాసనా. తస్యాః విజయః ప్రతిబంధః శౌర్యం న విక్రాంతిః. సమం బ్రహ్మ. తస్య దర్శనమాలోచనం. సత్యవిషయాత్సత్యం న యథార్థభాషణమాత్రం.(37)

తా:- భూతములను హింసింపకుండుట ఉత్తమమగు దానము, కేవలము ధనార్పణము కాదు. భోగములందుపేక్ష వహించుట తపమగును, కృచ్ఛ్రచాంద్రాయణాదికముకాదు. బ్రహ్మను సరిగ్గా విచారించుట సత్యమగును, యథార్థాభిభాషణము కాదు.(37)

38శ్లో॥ ఋతం చ సూనృతా వాణీ కవిభిః పరికీర్తితా ।
కర్మస్వసంగమః శౌచం త్యాగః సన్యాస ఉచ్యతే ॥

టీ:- ఋతమితి. అన్యచ్ఛ ఋతం సూనృతా సత్యా ప్రియా చ వాక్ ఏవం ఋత సత్యయోః స్ఫుట ఏవ వివేకః. క్రమ ప్రాప్తం త్యాగం వ్యాఖ్యాతు మాదౌ తతోఽర్థ భేదేన శౌచం వ్యాచష్టే -తస్యాసి మలత్యాగ రూపత్వేన త్యాగభేద ప్రతీతేః కర్మసు అసంగమః అనాసక్తిః శౌచం త్యాగస్తు సన్న్యాస ఇతి తయోర్భేదఇత్యర్థః. (38)

తా:- సత్యము, ప్రియమునగు వాక్కు ఋతము అని కవులచే చెప్పబడినది. ఈ ప్రకారముగా ఋత సత్యములు స్ఫుటముగా వివేచింపబడినవి. శౌచము, మలత్యాగరూపమగుటచే త్యాగభేద ప్రతీతియే కలుగును. కనుక క్రమప్రాప్తమయిన త్యాగమును వ్యాఖ్యానించుటకు మొదట దాని కంటే అర్థభేదముచే శౌచమును వ్యాఖ్యానించుచున్నారు. కర్మలందు తత్ఫలితములందు అనాసక్తి శౌచమగును. త్యాగమనగా సన్యాసమని చెప్పబడుతున్నది. (38)

39శ్లో॥ ధర్మ ఇష్టం ధనం నృణాం యజ్ఞోఽహం భగవత్తమః ।
దక్షిణా జ్ఞానసందేశః ప్రాణాయామః పరం బలమ్ ॥

టీ:- ధర్మ ఇతి. నృణాం ఇష్టం ధనం ధర్మః. నపశ్వాది సాధారణం భగవత్తమః పరమేశ్వరః అహమేవ యజ్ఞః మద్బుద్ధ్యా యజ్ఞోఽనుష్ఠేయః

తా:- నరులకు ఇష్టమైన ధనము ధర్మాచరణ, పశ్వాదికముకాదు. పరమేశ్వరుడనగు నేను యజ్ఞమగుదును. నేనను బుద్ధితో యజ్ఞమనుష్ఠింపవలెను. కేవలము క్రియా బుద్ధితో గాదు. యజ్ఞార్థమైన దానము దక్షిణయగును. అది జ్ఞానోపదేశమగును. హిరణ్యాది దానము

న క్రియాబుద్ధ్యేత్యర్థః. యజ్ఞార్థం దానం దక్షిణా సా చ జ్ఞానోపదేశః. న హిరణ్యాదిదానం తేన హి యజ్ఞరూపో విష్ణుః ప్రాప్యతే దుర్దమదమనం బలం తచ్చమనో దమ హేతుత్వాత్ ప్రాణాయామ ఇతి. (39)

కాదు. దాని వలన (దానిని)యజ్ఞరూపుడగు విష్ణు పొందును. మనస్సును దమింపచేయు ప్రాణాయామమే బలమగును దుష్టులను దండించుట కాదు. (39)

40శ్లో॥ భగోమ ఐశ్వరోభావో లాభో మద్భక్తిరుత్తమః ।
విద్యాత్మనిభిదా బాధో జుగుప్సా హ్రీర కర్మసు ॥

టీ:- స్వాభిమతం లాభం వ్యాచిఖ్యాసుః ప్రథమం భగం తతోఽ భేదేన వ్యాచష్టే లోకే తయోయరభేద ప్రసిద్ధేః భగఇతి. భగో భాగ్యం తచ్ఛ మే ఐశ్వరో భావః. మదీయమైశ్వర్యాదిషాడ్గుణమిత్యర్థః. ఉత్తమో లాభస్తు మద్భక్తిః. న పుత్రాదిః. విద్యాచాత్మని ప్రతీతస్య భేదస్య బాధః న జ్ఞానమాత్రం. అకర్మసు జుగుప్సా హేయత్వతర్శనం. హ్రీః లజ్జా. న త్రపామాత్రం. (40)

తా:- లాభమును గురించి వ్యాఖ్యానించుచూ మొదట భగమను దాని కన్నా భేదముగా వ్యాఖ్యానించుచున్నాడు. లోకమునందు వాటికి అభేదము ప్రసిద్ధము ! భగము-భాగ్యము-నా యొక్క ఐశ్వర్యాది షాడ్గుణ్యము కేవలము సంపదకాదు. నా భక్తియే ఉత్తమలాభము పుత్రాది లాభము కాదు. ఆత్మయందు తోచు భేదమునకు బాధయగునది విద్య జ్ఞానమాత్రము కాదు. ఏవగింపు హ్రీయగును. కేవలము సిగ్గుకాదు. (40)

41శ్లో॥ శ్రీర్గుణానైపేక్షాద్యాః సుఖం దుఃఖ సుఖాత్యయః ।
దుఃఖం కామ సుఖాపేక్షా పండితో బంధమోక్షవిత్ ॥

టీ:- శ్రీరితి. గుణా ఏవ శ్రీర్మండనం. న కిరీటాది. సుఖ దుఃఖయోః అత్యయః అతిక్రమః అననుసంధానం సుఖం. న భోగఃవిషయ భోగాపేక్షైవ దుఃఖం. నాగ్నిదాహాది. బంధాన్మోక్షద్వయం వా యో వేత్తి స పండితః. న విద్వన్మాత్రం. (41)

తా:- అపేక్షలేని మొదలయిన సద్గుణములు అలంకారము. కిరీటాది కము కాదు. సుఖ దుఃఖముల నతిక్రమించి వాని ననుసంధింపనిది సుఖము. భోగముకాదు. విషయభోగాపేక్షయే దుఃఖము అగ్నిదాహాదులు కాదు. బంధ మోక్షములను ఎరిగిన వాడు పండింతుడు. కేవలము విద్వాంసుడు కాదు. (41)

42శ్లో॥ మూర్ఖో దేహాద్యహం బుద్ధిః పంథా మన్నిగమః స్మృతః ।
ఉత్పథశ్చిత్త విక్షేపః స్వర్గః సత్త్వగుణోదయః ॥

టీ:- మూర్ఖ ఇతి. అహం బుద్ధిత్యుపలక్షణం. దేహగేహాదిష్వహం మమేత్యభిమానవాన్ మూర్ఖః న ఘాతుకః మన్నిగమః మాం నితరాం గమయతి యో నివృత్తిమార్గః స తు పంథాస్సన్మార్గః న కంటకాది శూన్యః. చిత్తవిక్షేపః ప్రవృత్తిమార్గః ఉత్పథః న తు చోరాద్యాకులః సత్త్వ గుణస్య ఉదయః ఉద్రేకః స్వర్గః నేంద్రాదిలోకః. (42)

తా:- దేహము నేను, దేహాదులు నావి అను గుణములు కలవాడు మూర్ఖుడగును. ఘాతకుడు కాదు. నన్ను పొందింపచేయు నివృత్తి మార్గము సన్మార్గము కంటకాది శూన్యమయినది కాదు. చిత్తము విక్షేపము చేయు ఉత్పథము మార్గము. చోర్యాదికము కాదు. సత్త్వ గుణము యొక్క ఉద్రేకము స్వర్గము ఇంద్రాది లోకము కాదు.(42)

43శ్లో॥ నరకస్తమ ఉన్నాహో బంధుర్గురురహం సఖే ।
గృహం శరీరం మానుష్యం గుణాఢ్యోహ్యాఢ్య ఉచ్యతే ॥

టీ:- నరక ఇతి. తమసః ఉన్నాహః ఉద్రేకః సః నరకః. న తామిస్రాదిః గురురేవ బంధుః.న భ్రాత్రాదిః సచాహమేవ యదాహ జగద్గురుః, శో"ఏక ఏవ పరో బంధుర్విష మే సముపస్థితే, గురుస్సకల ధర్మాత్మా యత్రాకించనగో హరి"రితి. ససాధనం భోగాయతనం గృహం తచ్చ మానుష్యం మానుషరూపం శరీరమేవ న హర్మ్యాదిగుణైస్సంపన్నః ఆఢ్య ఉచ్చతే. న ధన్యాఢ్యః. (43)

తా:- తమము యొక్క ఉద్రేకము నరకము. తామిస్రాదికము కాదు. గురువే బంధువు. అతడు నేనే. భ్రాత్రాదులుకారు. "ఏక ఏవ పరోబంధు రిషమే సముపస్థితే! గురుః సకల ధర్మాత్మా యత్రా కించనగో హరిః" విషమ సిత్థి సంభవించినపుడు గురువు ఒక్కడే ఉత్తమ బంధువు. సకలధర్మాత్ముడు భక్తులను రక్షించువాడు హరియగును. స సాధనమగు భోగాయతన మగు శరీరము గృహమగును హర్మ్యాదులుకావు ధర్మాదిగుణ సంపన్నుడు ఆఢ్యుడు, ధనవంతుడు కాదు. (43)

44శ్లో॥ దరిద్రో యస్త్వ సంతుష్టః కృపణో యోఽజితేంద్రియః ।
గుణేష్వసక్త ధీరీశో గుణసంగో విపర్యయః ॥

టీ:- దరిద్ర ఇతి. అసంతుష్టో యః స దరిద్రః న నిస్స్వః. యః అజితేంద్రియః స కృపణః శోచ్యః న దీనః విషయేష్వనాసక్తధీర్యస్య ఈశస్స్వతంత్రః న రాజాదిః. గుణసంగః గుణేషు సంగో యస్య సః విపర్యయః అనీశః ఏతచ్చ శమాదివిపర్యయోపలక్షణార్థం.(44)

తా:- సంతృప్తి లేనివాడు దరిద్రుడగును ధనహీనుడు కాడు. ఇంద్రియములను జయింపనివాడు కృపణుడు. దీనుడు కాడు. విషయ గుణములు యందు ఆసక్తిలేని వాడు ఈశ్వరుడు, స్వతంత్రుడు. రాజాదులుకారు. గుణముల యందా సక్తి గలవాడు అనీశుడు. ఇది శమాది విపర్యయమునకు ఉపలక్షణముగా చెప్పబడినది. (44)

45శ్లో॥ తత ఉద్ధవ తే ప్రశ్నాః సర్వే సాధునిరూపితా ః
కింవర్ణితే న బహునా లక్షణం గుణ దోషయోః
గుణదోష దృషిర్దోషో గుణస్తూభయ వర్జితః ॥

టీ:- ఉపసంహరతి ఏత ఇతి. సాధుమోక్షోపయోగిత్వాత్. ఏతచ్చ సర్వం గుణదోషయోర్వివేకాయోద్ధవేన పృష్టమితి. తయోః సంక్షేపతో లక్షణమాహ- కిమితి. కింబహునా వర్ణితేన. గుణ దూషణయోర్లక్షణ మేతావాదేవ తదాహ - గుణదోషయోర్దృశిర్దర్శనం దోషః. గుణస్తు తదుభయదర్శన వర్జితస్వభావ ఇతి.(45)

తా:- ఉపసంహరించుచున్నాడు. ఉద్ధవా! నీ ప్రశ్నలన్నియును సదుత్తరములలో చక్కగా నిరూపింపబడినవి. ఈ సమస్తము గుణ దోషముల వివేకము కొరకు ఉద్ధవునిచే ప్రశ్నింపబడినది. వానికి సంక్షేపముగా లక్షణము చెప్పుచున్నారు. గుణదోషముల లక్షణమును ఎక్కువగా వర్ణించుటచే నేమి ప్రయోజనము గుణదోషములు లక్షణము ఇంతమాత్రమే అగును గుణదోషముల దర్శనము దోష మగును ఆ రెండింటిని విడుచుట గుణమగును. (45)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**ఏకోనవింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**ఏకోనవింశాధ్యాయము సమాప్తము.**

## వింశోఽధ్యాయః

**ఉద్ధవ ఉవాచ**

1శ్లో॥ విధిశ్చ ప్రతిషేధశ్చ నిగమో హీశ్వరస్యతే ।
అవేక్షతేఽరవిందాక్ష ! గుణం దోషం చ కర్మణామ్ ॥

టీ:- శ్లో. వింశే యోగత్రయం ప్రోక్తం భక్తిజ్ఞాన క్రియాత్మకమ్, గుణదోషవ్యవస్థార్థమధికారి విభాగతః, గుణదోషదృశిర్దోషో గుణస్తూభయ వర్జిత ఇతి యదుక్తం తదా క్షిపతి-పంచభిః. విధిరితి. విధిశ్చ ప్రతిషేధశ్చ ఈశ్వరస్య తే నిగమః త్వదాజ్ఞారూపో వేదః స చ విధేయానాం ప్రతిషేధ్యానాం చ కర్మణాం గుణం దోషం చ పుణ్యపాప ఫలరూపమపేక్షతే. (1)

2శ్లో॥ వర్ణాశ్రమ వికల్పం చ ప్రతిలోమానులోమజమ్ ।
ద్రవ్యదేశ వయః కాలాన్ స్వర్గం నరకమేవ చ ॥

టీ:- వర్ణేతి. ఉత్తమాధమభావేనతదధికారిణాం వర్ణాశ్రమాణాం వికల్పం భేదం చ గుణదోషరూపమే వాపేక్షతే. ప్రతిలోమానులోమజం చ గుణం దోషం తథైవాపేక్షతే ప్రతిలోమజాః ఉత్తమవర్ణాసు స్త్రీషు హీనవర్ణేభ్యః పురుషేభ్యోజాతాః సూతవైదేహకాదయః అనులోమజాస్తూత

## వింశాధ్యాయము

**ఉద్ధవుడు చెప్పుచున్నాడు**

తా:- ఇరువదియవ అధ్యాయమున గుణదోషవ్యవస్థ కొరకు అధికారి విభాగమును బట్టి భక్తి జ్ఞానక్రియా రూపములుగల మూడు యోగములు చెప్పబడును "గుణదోష దృషిర్దోశో గుణస్తూభయవర్జిత"అని చెప్పిన దానిని ఐదు శ్లోకములచే ఆక్షేపించుచున్నారు. ఓ అరవిందాక్షా ! చేయవలసిన విధి రూపమగు కర్మ, చేయదగని కర్మ, నిషేధమును తెల్పునది, పరమేశ్వరుడవైన నీ యొక్క ఆజ్ఞారూపమైన వేదముకదా, ఆ వేదము కర్మల యొక్క గుణమును దోషమును అనగా పుణ్యపాప ఫలరూపపులను అపేక్షించును గదా. (1)

తా:- వర్ణములు, ఆశ్రమములు అనువాని భేదమును వర్ణముల అనుకూల ప్రతికూలము వలన జనించిన జాత్యాదికమును, ద్రవ్యము, దేశము, వయస్సు, కాలమును, స్వర్గము, నరకము, ఉత్తమాధమ భావములో అధికారులైన వారికి వర్ణాశ్రమ భేదములును వాని గుణ దోషములను బట్టియే భేదము కలుగుచున్నది. ప్రతిలోమ అనులోమ పద్ధతి ద్వారా జనించిన వారిలో గూడా భేదము వారి గుణ దోషముల బట్టియే చెప్పబడుచున్నది. ప్రతిలోమ జాతియనగా ఉత్తమ జాతులగు

వర్ణేభ్యః పురుషేభ్యో హీనవర్ణాసు స్త్రీషు జాతాః మూర్ధావసిక్తాంబష్ఠాదయః తేషాం చ. శ్లో. అసత్సంతస్తువిజ్ఞేయాః ప్రతిలోమానులోమజాఇతి. గుణ దోషౌ ద్రవ్యాదీన్ కర్మార్థ్వతానర్థ్వతాభ్యాం స్వర్గం నరకం చ తత్ఫలతయా గుణదోష రూపమేవాపేక్షతే. ఏతచ్ఛోత్తధ్యాయే ప్రపంచయిష్యతే. (2)

3శ్లో॥ గుణదోషభిదా దృష్టి మంతరేణ వచస్తవ ।
నిశ్రేయసం కథం నృణాం నిషేధ విధి లక్షణమ్ ॥

టీ:- తథాపి ప్రస్తుతేకిమాయాతమతాఆహ - గుణదోషేతి. గుణదోష దృశిర్దోష ఇతి. నిరాకృతత్వాత్ గుణదోషాభిదా దృష్టిమంతరేణ తాం వినా నిషేధవిధిలక్షణం కర్మకాండం తవ వచః కథం తచ్చ వచోఽ౦ తరేణ నృణాం నిశ్రేయసం కథం స్యాత్, తత్రాపి శ్రోతవ్యో మంతవ్య ఇత్యాదినా సాధనవిధేః శ్లో. "నాను ధ్యాయే ద్బహూంచ్ఛబ్దాన్వాచో విగ్లాపనంహితది" త్యాది నిషేధస్య చావశ్యకత్వాదితి భావః. యద్వా గుణదోషభిదాదృష్టిమంతరేణ నిషేధవిధిలక్షణం తవ వచో వినేతి సామానాధికరణ్యమేవాస్తు. యద్వా గుణదోషభిదా దృష్టిమంతరేణ నిషేధవిధిలక్షణమపి తవ వచః కథం ను తత్త్వమస్యాది వాక్యవత్ నిశ్రేయస పరంస్యాత్. సర్వస్య వేదస్య తత్పరత్వాంగీకారాదిత్యర్థః.(3)

స్త్రీలయందు హీన వర్ణులగు పురుషుల వలన జనించిన సూతవై దేహకాదులు. అనులోమ జాతులనగా ఉత్తమ వర్ణులగు పురుషుల వలన హీనవర్ణులగు స్త్రీల యందు జనించినవారు. మూర్ధావస్తికులు, అంబష్ఠులు మొదలగువారు వారికిని "అసత్యంతస్తు విజ్ఞేయాః ప్రతిలోమానులోమజాః" ఈ ప్రతిలోమ అనులోమ మార్గమున జనించిన వారు అసత్సంతతులని తెలియదగినవారు. (2)

తా:- అట్లైనను ప్రకృతమున దీనిచే నేమి ప్రయోజనము కల్గును అనగా చెప్పుచున్నారు. నిషేధము, విధి అను రెండు రూపములగు కర్మకాండ నీ మాటయగు వేదము. గుణము దోషము అను భేద దృష్టి లేక మనుష్యులకు మోక్షమెట్లు లభించును. గుణదోష దర్శనము దోషమని నిరాకరించుట వలన గుణము, దోషము అను భేద దృష్టి నిషేధ, విధి లక్షణమైన కర్మకాండమును నా వాక్కుగు వేదము లేక నరులకు మోక్ష మెట్లు కలుగును? అందుననూ "శ్రోతవ్యోమన్తవ్యః " అను సాధన విధికి "నానుద్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం సహితత్" అనేక శబ్దములను పలుకకూడదు. అది వాక్కునకుశ్రమ అగును. ఇత్యాది నిషేధము సాధన విధికి ఆవశ్యకమగుట వలన అని భావము. లేదా గుణ, దోష భేద దృష్టి రూపము. నిషేధ, విది లక్షణము అయిన నీ వాక్కు లేక అని సామానాధికరణ్యమైన కానిమ్ము, లేదా గుణ, దోష భేద దృష్టి లేక నిషేధ విధి లక్షణమయిన నీ వాక్కు

4శ్లో॥ పితృదేవ మనుష్యాణాం వేదశ్చక్షుస్తవేశ్వర ।
శ్రేయస్త్వనుపలబ్ధేఽర్థే సాధ్య సాధనయోరపి ॥

టీ:- నను పితరో దేవాశ్చ సర్వజ్ఞాః ఆరాధితాః ప్రత్యక్షతో దృష్ట్వా మనుష్యేభ్యః కథయిష్యంతి నేత్యాహ - పితృదేవేతి. పిత్రాదీనాం సర్వేషాం తవ త్వద్వాక్యరూపో వేదఏవ శ్రేయః శ్రేష్ఠం చక్షుః ప్రమాపకం క్వ అనుపలబ్ధే అర్థే స్వర్గాదౌ మోక్షే చ. తథా సాధ్యసాధనయోః. ఇదమస్య సాధ్యం ఇదమస్య సాధనమిత్యత్రాపి. తదేవం గుణదోషదృష్ట్యభావే నిశ్శ్రేయసం ఘటతే. (4)

5శ్లో॥ గుణదోషభిదా దృష్టిర్నిగమాత్తే న హిస్వతః ।
నిగమే నాపవాదశ్చ భిదాయా ఇతి హ భ్రమః ॥

టీ:- కించ శాస్త్రేణైవ హి తాం భేదదృష్టి తస్మిన్నేవ విషయే శాస్త్రం కథం నివర్తయేదిత్యాహ - గుణదోషేతి. తే నిగమాత్ త్వదాజ్ఞారూపా ద్వేదాదేవ న హి స్వతః. యస్మాదర్థ ప్రాప్తత్వేన నివర్తేత హ స్ఫుటం భ్రమో భవతి తం నివర్తయేతి శేషః. (5)

వేదము. ఎట్లు తత్త్వమస్యాది వాక్యము వలె నిశ్శ్రేయస పరమగును? వేదమున కంతటికీ తత్పరత్వము అంగీకరించుట వలన. (3)

తా:- సర్వజ్ఞులగు పితరులు, దేవతలు ఆరాధింపబడిన వారై ప్రత్యక్షముగా వచ్చి చూచి మనుష్యులకు ఆ విధి, నిషేధములను చెప్ప గలరు. అనగా కాదనుచున్నారు. పిత్రాదులకు అందరికీ నీ వాక్య రూపమయిన వేదము మాత్రమే ఉత్తమమయిన చక్షురింద్రియము ప్రమాపకము. ప్రమాణము ఎక్కడ? ప్రత్యక్షాదుల వలన పొందుటకు వీలు లేని అర్థములయిన సర్గాదుల యందు, అట్లే సాధ్యసాధనముల యందు ఇది దీనికి సాధ్యము. ఇది దీనికి సాధన అనుచోట కూడా, ఈ విధముగా గుణదోష దృష్టి లేనిచో నిశ్శ్రేయసము కలుగదు. (4)

తా:- మరియు శాస్త్రము చేతనే చెప్పబడిన భేద దృష్టికి శాస్త్రమే ఎట్లు నివర్తకమగును? అనగా చెప్పుచున్నారు. నీ ఆజ్ఞారూపమయిన వేదము వలననే గుణ దోషములు భేద దర్శనము చెప్పబడినది. స్వయముగా గాక, ఆవేదము చేతనే గుణదోష దర్శనము పనిలేదను అపవాదము చెప్పుట వలన ఒక్కవేదమే భేదమును తన్నివర్తనమును ఎట్లు చెప్పునని భ్రాంతి కల్గుచున్నది ఏది భేదమో అది భ్రమయగును ఏ అర్థము పొందదగినదో దానిని నివర్తంచిన భేదము, భ్రమయగును దానిని నివృత్తి చేయుము అని శేషము. (5)

**శ్రీ భగవానువాచ**

6శ్లో॥ యోగాస్త్రయోమయా ప్రోక్తా నృణాం శ్రేయో విధిత్సయా ।
జ్ఞానం కర్మచ భక్తిశ్చ నోఽపాయోఽన్యోస్తి కుత్రచిత్ ॥

టీ:- విషయాభేదేఽప్యధికారి భేధేనా విరోధం వక్తుం ప్రథమం యోగ త్రయమాహ - యోగాఇతి. యోగా ఉపాయాః బ్రహ్మకర్మదేవతా కాండైః ప్రోక్తాః కర్మ చ నిష్కామం శ్రేయోవిధిత్సయా మోక్షసాధనేచ్ఛయా అన్య ఉపాయో నాస్తీతి కామ్యకర్మాదికం వ్యావర్తయతి తథా చోత్తరాధ్యాయే స్ఫుటీకరిష్యతి య ఏతానిత్యాదినా. (6)

**భగవంతుడు చెప్పచున్నాడు**

తా:- విషయ భేదము లేకున్నను అధికారి భేదముచే అవిరోధమును చెప్పుటకై మొదట యోగత్రయమును చెప్పుచున్నాడు. నరులకు శ్రేయస్సు లేక మోక్షము సాధనేచ్ఛచే జ్ఞానము, నిష్కామకర్మ, భక్తియని మూడు యోగములు నాచే చెప్పబడినవి. వీని కన్నా మోక్షసాధనోపాయ మింకొకటి ఎక్కడా లేదు అని కామ్యకర్మను నిషేధించుచున్నారు. అది పై అధ్యాయమందు 'యఏతాన్" ఇత్యాదిగా స్పష్టమగును. (6)

7శ్లో॥ నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినామిహకర్మసు ।
తేష్వనిర్విణ్ణ చిత్తానాం కర్మయోగస్తు కామినామ్ ॥

టీ:- తేష్వధికారిభేదమాహ - ద్వాభ్యాం. నిర్విణ్ణానామితి. ఇహ ఏషాం మధ్యే కర్మసు నిర్విణ్ణానాం దుఃఖ బుద్ధ్యా తత్ఫలేషు విరక్తానాం అతఏవ తత్సాధన భూత కర్మన్యాసినాం జ్ఞానయోగః సిద్ధిద ఇత్యుత్తరేణాన్వయః అనిర్విణ్ణచిత్తానాం దుఃఖబుద్ధిశూన్యానాం అతః కామినాం తత్ఫలేష్వ విరక్తానామిత్యర్థః కర్మయోగస్సిద్ధిదః. (7)

తా:- వానియందు అధికారి భేదమును రెండు శ్లోకములతో చెప్పు చున్నాడు. ఈ జగత్తు నందు ఆ మూడు ఉపాయముల లోపల కర్మలందు దుఃఖ బుద్ధిచే వాని ఫలములందు విరక్తులైన, వానికి సాధన భూతములైన కర్మలను త్యజించిన వారికి జ్ఞానయోగము సిద్ధి ప్రదమగును. ఆ కర్మలందు దుఃఖ బుద్ధిలేని వారికి ఆ కర్మఫలములందు విరక్తి లేనివారికి ఇచ్ఛ గలవారికి కర్మయోగము సిద్ధి ప్రదమగును. (7)

8శ్లో॥ యదృచ్ఛయా మత్క థాదౌజాతశ్రద్ధస్తు యః పుమాన్ ।
న నిర్విణ్ణో నాతిసక్తో భక్తి యోగోఽస్య సిద్ధిదః ॥

టీ:- యదృచ్ఛయేతి. యదృచ్ఛయా కేనాపి భాగ్యోదయేన మత్కథాదౌ జాతశ్రద్ధో యః కర్మసు నిర్విణ్ణో న భవతి తత్ఫలేషు చ సక్తో న భవతి తస్య భక్తియోగస్సిద్ధిదః, తత్ర కామ్యకర్మసు ప్రవర్తమానస్య సర్వాత్మనా విధిప్రతిషేధాదికార ఇత్యుత్తరాధ్యాయే పక్షతి నిష్కామకర్మయోగాధికారి ణస్తు యథాశక్తి. స చ జ్ఞానభక్తియోగాధికారాత్ప్రాగేవ తదధికృతయోస్తు స్వల్పః తాభ్యాం సిద్ధానాం తు నకించిదిత్యర్థః.(8)

9శ్లో॥ తావత్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా ।
మత్కథా శ్రవణాదౌ వా శ్రద్ధాయావన్నజాయతే ॥

టీ:- సావధిం కర్మయోగ మాహ - నవభిః తావదితి. కర్మాణి నిత్య నైమిత్తికాని యావతా యావత్. (9)

10శ్లో॥ స్వధర్మస్థో యజన్ యజ్ఞైరనాశీః కామ ఉద్ధవ ।
న యాతి స్వర్గ నరకౌ యద్యన్యన్న సమాచరేత్ ॥

టీ:- కర్మయోగినో జ్ఞానభక్తి భూమికారోహ ప్రకారమాహ -స్వధర్మస్థ

తా:- అపూర్వ భాగ్యోదయముచే కామ్యకర్మల యందు ప్రవర్తించు వానికి విధి ప్రతిషేధాధికారము సర్వాత్మనా ఉన్నదని ఉత్తరాధ్యాయమున చెప్పగలడు. నిష్కామకర్మ యోగాధికారికి మాత్రము యథా శక్తి. అదియును జ్ఞానభక్తియోగాధికారమున కన్న పూర్వమే, వానియందధి కృతులయిన వారికి విధి ప్రతిషేధములు స్వల్పము. వానిచే సిద్ధు లయిన వారికి విధి ప్రతిషేధము కించిత్తు లేదు. ఏదో ఒక భాగ్యోదయ ముచే నా కథ యందు జనించిన శ్రద్ధ కలవాడై ఏ పురుషుడు కలడో, కర్మల యందు విరక్తుడుకాడో, కర్మఫలములందు అభిలాషికాడో అట్టివానికి భక్తియోగము ప్రసిద్ధము. (8)

తా:- అవధితో కూడిన కర్మయోగమును చెప్పుచున్నాడు. తొమ్మిది శ్లోకములచే. ఎంతవరకు నిర్వేదమును పొందడో అంతవరకు కర్మలను చేయవలెను. ఎంతవరకు నా కథాదికమునందు శ్రద్ధ జనింపదో అంతవరకు కర్మలను చేయవలసి యుండును. (9)

తా:- కర్మయోగికి జ్ఞానభక్తి భూమికారోహక్రమమును చెప్పుచున్నాడు. తన వర్ణాశ్రమమునందుండు వాడై ఫలకామిగాక యజ్ఞముల నాచరించు చు ఇతరములు అయిన నరక సాధనము నాచరించనివాడై (రెండు విధములుంటుంది నరకయానము) విహితాతి క్రమణము వలన

ఇతి. అనాశీః కామః అఫలకామః అన్యత్ నిషిద్ధం కామ్యం నరకసాధనం హ ద్విధైవ విహితాతిక్రమాద్వా నిషిద్ధాచరణాద్వా. అతః స్వధర్మస్తత్వా న్నిషిద్ధ వర్జనాచ్చ నరకం న యాతి. అఫలకామత్వాన్న స్వర్గమపీత్యర్థః (10)

నిషిద్ధాచరణము వలన. ఇతడు స్వధర్మమునందున్న వాడగుట వలన నిషిద్ధమును వర్జించుట వలన నరకమును పొందదు. ఫలకామనా లేకపోవుట వలన స్వర్గమును కూడా పొందదు. (10)

11శ్లో॥ అస్మిన్ లోకే వర్తమానః స్వధర్మస్థోఽనఘః శుచిః ।
జ్ఞానం విశుద్ధమాప్నోతి మద్భక్తిం వా యదృచ్ఛయా ॥

తా:- ఈ లోకమందు, ఈ దేహమందు ఉంటూ తన వర్ణాశ్రమోచిత ధర్మమున ఉంటూ, నిషిద్ధ త్యాగమున పాపరహితుడై నివృత్తమలుడై యున్నవాడు శుద్ధసత్త్వమగు జ్ఞానమును పొందును లేక అప్రయత్నము గనే నా భక్తినైనా పొందును కేవలజ్ఞానము కంటే భక్తి దుర్లభమని తోపించుచున్నాడు. (11)

టీ:- కింతు. అస్మిన్నితి. అస్మిన్ లోకే అస్మిన్నేన దేహే అనఘః నిషిద్ధత్యాగే అతః శుచిః నివృత్తరాగాదిమలః యదృచ్ఛయేతి కేవల జ్ఞానాదపి భక్తేర్దుర్లభతాం ద్యోతయతి.(11)

12శ్లో॥ స్వర్గిణోఽప్యేత మిచ్ఛంతి లోకం నిరయిణస్తథా ।
సాధకం జ్ఞాన భక్తిభ్యాముభయం తదసాధకమ్ ॥

తా:- ఈ ప్రకారము జ్ఞాన భక్తి సాధనమైన నరదేహమును స్తుతించు చున్నాడు. స్వర్గమున నివసించు దేవతలును, నరకమున నివసించు నారకులును, జ్ఞానమునకు భక్తికిని సాధకమయిన ఈ భూలోకమును వాంఛింతురు. దేవతలున్న స్వర్గముగాని నారకులున్న నరక లోకము గాని ఆ జ్ఞాన భక్తులకు సాధనములు కావు. (12)

టీ:- అనేన ప్రకారేణ జ్ఞాన భక్తిసాధనత్వాన్నరదేహం స్తౌతి – స్వర్గిణ ఇతి. నిరయిణ ఇతి దృష్టాంతత్వేనోక్తం జ్ఞాన భక్తిభ్యాం జ్ఞానభక్త్యోః తదుభయం స్వర్గి నారకి శరీరం. (12)

13శ్లో॥ నవరః స్వర్గతిం కాంక్షే న్నారకీం వా విచక్షణః ।
నేమం లోక చ కాంక్షేత దేహవేశాత్ప్రమాద్యతి ॥

టీ:- అతః నేతి. నరః స్వర్గతిం న కాంక్షేత్ యథా నారకీమితి దృష్టాంతః. యద్వా స్వర్గనరకసాధనకర్మాణి న కుర్యాదిత్యర్థః. అస్యాతి శ్రేష్ఠత్వాత్పునరపి మనుష్యో భవేయమిత్యపి న కాంక్షేత్. యతో దేహావేశాత్ దేహే సక్త్యాస్వార్థే ప్రమాద్యతి అవధానశూన్యో భవతి.(13)

తా:- పండింతుడైన నరుడు స్వర్గమును కోరరాదు. నారకీమని దృష్టాంతము లేదా స్వర్గ నరక సాధన కర్మలను చేయకూడదని యర్థము. ఇది చాలా శ్రేష్టమయినదని మళ్ళీ మనుష్యుడనే కాగలనని కూడా కోరరాదు. ఈ భూలోకమును కోరరాదు. దేహసక్తి వలన ప్రమాద మును అవధానశూన్యమను జాగ్రత్తలేమిని పొందును. (13)

14శ్లో॥ ఏతద్విద్వాన్ పురా మృత్యో రభవాయ ఘటేతసః ।
అప్రమత్త ఇదం జ్ఞాత్వా మర్త్యమప్యర్థ సిద్ధిదమ్ ॥

టీ:- అపిత ఏతదితి. ఏతద్దేహం సాధకమితి విద్వాన్ తచ్చార్థ సిద్ధిదమపి మర్త్యమితి జ్ఞాత్వా అస్మిన్ దేహే అప్రమత్తః అనాసక్తస్సన్ మృత్యోః పూర్వమేవ మోక్షాయ యతేత యత్నం కుర్యాత్. (14)

తా:- మరియు ఈ దేహము అర్థసాధకమని ఎగిరినవాడై అతడు మృత్యువురాక పూర్వము మోక్షము కొరకు ప్రయత్నింపవలెను. మరియు ఈ శరీరము మరణ ధర్మము గలదైనను మోక్ష పురుషార్థ సిద్ధిప్రదమని తెలిసికొని ఆసక్తి లేనివాడై యత్నింపవలెను. (14)

15శ్లో॥ ఛిద్యమానం యమైరేతైః కృతనీడం వనస్పతిమ్ ।
ఖగః స్వకేతముత్సృజ్య క్షేమం యాతిహ్యాలంపటః ॥

టీ:- అప్రమత్తో ముక్తసంగః సుఖం ప్రాప్నోతీత్యత్ర దృష్టాంతః. ఛిద్యయానమితి. యమైః యమవన్నిర్దయైః పురుషైః కృతం నీడం యస్మిన్ త్వం స్వకేతం స్వస్యాశ్రయం అలంపటః అనాసక్తః (15)

తా:- యమునివలె కఠినాత్ములైన పురుషులు వచ్చి ఖడ్గాదులతో తాను గూడు కట్టుకుని, నివసించుచున్న వృక్షమును, తనకాశ్రయమయిన దానిని నరుకుచుండగా చూచినప్పుడు పక్షి ఆ వృక్షమునందు ఆసక్తి లేనిదై దానిని వీడి తనకు క్షేమంకరమైన మరియొక స్థానమును పొందుచున్నది. (15)

16శ్లో॥ అహోరాత్రైశ్ఛిద్యమానం బుద్ధ్వాయుర్భయవేపథుః ।
ముక్తసంగః పరం బుద్ధ్వా నిరీహ ఉపశామ్యతి ॥

టీ:- దార్ష్టాంతికమాహ - అహోరాత్రైరితి. అహోరాత్రైః ఛిద్యమానం ఆయుర్బుధ్యా భయేన వేపథుః యస్య సః.(16)

తా:- దృష్టాంతమును చెప్పుచున్నాడు. పగలు రాత్రులచే ఖండింపబడుచున్న ఆయువును తెలిసికొని సంగము వీడి పరమేశ్వరుడిని తెలిసికొని వాంఛలు లేని వాడై పరమశాంతిని పొందుచున్నాడు.(16)

17శ్లో॥ నృదేహమాద్యం సులభం సుదుర్లభం
ప్లవం సుకల్పం గురుకర్ణధారమ్ ।
మయానుకూలేన నభస్వతేరితం
పుమాన్ భవాబ్ధిం న తరేత్స ఆత్మహా ॥

టీ:- ఏవమప్రయతమానం ప్రమత్తం నిందతి - నృదేహమితి. నృదేహం ప్లవం నావం ప్రాప్యేత్యధ్యాహారః. యోభవాబ్ధిం న తరేత్. స ఆత్మహా తత్ర హేతవః ఆద్యం సర్వఫలానాం మూలం ఏతదుపార్జిత కర్మభిః సర్వ ప్రాప్తేః కించ. సుదుర్లభం ఉద్యమకోటిభిరపి ప్రాప్తుమశక్యం తథాపి సులభం యదృచ్ఛయా లబ్ధత్వాత్ తం చ సుకల్పం పటుతరం. కించ. గురుః సంశ్రితమాత్ర ఏవకర్ణధారో నేతా యస్య తం మయా చ స్మృతమాత్రేణానుకూల మారుతేనేరితం ప్రేరితం.(17)

తా:- ఇట్లు ప్రయత్నము చేయక ప్రమత్తుడైన వానిని నిందించుచున్నాడు. సర్వఫలములకు మూలమై దీనిచే ఆర్జించిన కర్మలచే సర్వమును ప్రాప్తింపచేయబడునదియు కోటి ఉద్యమములచే పొందశక్యము కానిదియు, స్వప్రయత్నము లేక లభించినది కనుక సులభమైనది. దృఢతరమైనదై ఆశ్రయించినంత మాత్రమున కరుణించు గురువను నావికుడు గలదై తెప్పయైన మానవ శరీరమును స్మరణమాత్రమున అనుకూలుడైన నేనను వాయువుచే ప్రేరేపింపబడిన మానవ శరీరమును పొంది ఏ పురుషుడు సంసారమును తరింపడో వాడు ఆత్మ ఘాతుకుడగుచున్నాడు. (17)

18శ్లో॥ యదారంభేషు నిర్విణ్ణో విరక్తస్సంయతేంద్రియః ।
అభ్యాసేనాత్మనో యోగీ ధారయేదచలం మనః ॥

టీ:- ఏవం తావదవిరక్తస్య వైరాగ్యద్వారా జ్ఞానభక్తి సాధకం కర్మయోగ ముక్త్వా. ఇదానీం సమ్యక్ విరక్తస్య జ్ఞానయోగం తస్య చ జ్ఞానప్రాప్తేః పూర్వం కించత్కృత్యం వర్జనీయం చాహ సార్ధైర్నవభిః -యదేతి యదా తు ఆరబ్ధేషు కర్మసు నిర్విణ్ణః దుఃఖదర్శనేనోద్విగ్నః తత్ఫలేషు విరక్తశ్చ తదా సంయుతేంద్రి యస్సన్. ఆత్మనోஉభ్యాసేనఆత్మ విషయవృత్తి సంతత్యా. అచలం యథా భవతి తథా మనోధారయేత్.(18)

తా:- ఈ ప్రకారము ఇంతవరకు విరక్తుడుగాని వారికి వైరాగ్యము ద్వారా జ్ఞానభక్తి సాధకమగు కర్మయోగము చెప్పి ఇప్పుడు చక్కగా విరక్తుడైన వానికి జ్ఞానయోగము, ఆ జ్ఞానప్రాప్తికి పూర్వము కర్తవ్యము వర్జనీయమును తొమ్మిదిన్నర శ్లోకములచే చెప్పుచున్నారు. కర్మల యందును, ఆ కర్మ ఫలయందును ఎప్పుడును దుఃఖ దర్శనముచే కలతనందిన వాడును విరక్తుడునగుచు. అప్పుడు ఇంద్రియములను నిరోధించి పరమాత్మ ధ్యాన సంతానముచే మనస్సును నిశ్చలముగా ధరింపవలెను. (18)

19శ్లో॥ ధార్యమాణం మనో యర్హి భ్రామ్యదాశ్వనవస్థితమ్ ।
అతంద్రితోஉనురోధేన మార్గేణాత్మ వశం న యేత్ ॥

టీ:- తత్ర ప్రథమమేవాత్యంత ధారణా సంభవాత్. తత్స్వభావాను సారేణ వశీకరణమాహ-ధారమాణమితి. యర్హి ఆశుభ్రామ్యత్ పరిభ్ర మత్ అనవస్థితం భవతి తదా అనురోధేన కించిదపేక్షాపూరణద్వారుణ. (19)

తా:- మొదటనే మనస్సును నిశ్చలముగా నిలుపుట సాధ్యము కాదు కనుక తత్స్వభావమును బట్టి వశీకరింపవలెననుచున్నారు. అభ్యాస వశమున ధరింపబడుచున్న మనస్సు శీఘ్రముగా తిరుగుచున్నదో, స్థిరముగా నిలువనిదై యుండునో, అప్పుడు యోగి తొందర పడక అనుకూలమగు అపేక్షను లభింపచేయునట్టి మార్గము ద్వారా మనస్సు ను తన వశము చేసికొనవలెను.(19)

20శ్లో॥ మనోగతిం న విసృజే జ్జితప్రాణో జితేన్ద్రియః ।
సత్త్వసంపన్నయా బుద్ధ్యా మన ఆత్మవశం న యేత్ ॥

తా:- పూర్వము వలెనే మనస్సు చంచలమగుచో ఎట్లు అనగా అందుకు చెప్పుచున్నాడు. మనస్సు గమనమును విడిచిపెట్టరాదు

టీ:- నను తర్హి యథా పూర్వమేవస్యాత్ తత్రాహ మనోగతమితి. మనోగతిం తేన విసృజేత్ నోపేక్షిత కింతు అప్రమత్తస్సన్ ఆత్మానం లక్షయేదిత్యర్థః.(20)

ప్రాణాయామముచే ప్రాణవాయువును వశము చేసికొన్నవాడై ఇంద్రియములను జయించి సత్త్వగుణ సంపన్నమైన బుద్ధిచేత మనస్సును ఆత్మవశము చేయవలెను. (20)

21శ్లో॥ ఏష వై పరమోయోగో మనసస్సంగ్రహస్మృతః ।
హృదయజ్ఞత్వమన్విచ్ఛన్ దమ్యస్యే వార్యతో ముహుః ॥

టీ:- అనురోధమార్గం సదృష్టాంతం స్తౌతి-ఏషఇతి. ఏష అనువృత్తి మార్గేణ మనసః సంగ్రహః యోగః తత్సాధనత్వాత్ ఉపచారేణ స్తుతిః యథా ఆదాంతస్య అదమనీయస్య అర్వతః అశ్వస్య హృదయజ్ఞత్వం స్వాభిప్రాయేణ గతిమన్విచ్ఛన్ అపేక్షమాణః అశ్వధారకః. ప్రథమం కించిత్తద్గతి మనువర్తతే తదా చరశ్మినా తం ధృత్వైవగచ్ఛతి. న తూపేక్షతే. తద్వదిత్యర్థః.(21)

తా:- అవరోధమార్గమును సదృష్టాంతముగా వర్ణించుచున్నాడు. ఇదియే అనుకూల మార్గమున మనస్సును సంగ్రహించుట ఉత్తమమైన యోగమని చెప్పబడినది. యోగ సాధన మగుట వలన ఉపచారముచే ఇదియే యోగమని స్తుతి. ఏ ప్రకారము శిక్షణ పొందని అశ్వము యొక్క స్వాభిప్రాయమగుదాని గతిని అపేక్షించుచు అశ్వధారకుడు ప్రథమమున కొంత గుర్రమునను వర్తించుచూ అప్పుడు కళ్ళెముచే దానిని ధరించియే పోవుచున్నాడో. ఉపేక్షించడో అట్లే మనస్సును మెల్లగా లొంగదీసుకొనవలెను. (21)

22శ్లో॥ సాంఖ్యేన సర్వభావానాం ప్రతిలోమానులోమతః ।
భవాప్యయా వను ధ్యాయేన్మనో యావత్ప్రసీదతి ॥

టీ:-ఏవమీషద్వశీకృతస్యమనసోఽత్యంతనైశ్చల్యోపాయానాహ త్రిభిః సాంఖ్యేనేతి. సాంఖ్యేన తత్త్వ వివేకేన సర్వభావనాం మహదాది

తా:- ఈ ప్రకారము కొంత వశీకృతమైన మనస్సున కత్యంత నిశ్చలత్యమునకుపాయములను మూడుశ్లోకములచే చెప్పుచున్నారు. తత్త్వముల యొక్క వివేకముచే మహత్తత్వము మొదట దేహపర్యంత మున్న తత్త్వముల యొక్క అనులోమ ప్రకారము ప్రకృతి మొదలు మహదాది క్రమమున జగము ప్రాణి సముదాయమున జనించు

దేహాంతానాం అనులోమతః ప్రకృత్యాది క్రమేణ భవం ప్రతిలోమతః పృథివ్యాది క్రమేణాప్యయం చ అనుధ్యాయేత్. ప్రసీదతి నిశ్చలం భవతి. (22)

క్రమమున ప్రతిలోమ క్రమమము పృథివ్యాది ప్రపంచలయము ప్రకృతి క్రమమున జన్మము పృథివ్యాది క్రమమున లయములను మనస్సు ఎంత వరకు ప్రసన్నమగునో అంత వరకు ధ్యానించవలెను. (22)

23శ్లో॥ నిర్విణ్ణస్య విరక్తస్య పురుషస్యోక్త వేదినః ।
మనస్త్యజతి దౌరాత్మ్యం చింతితస్యానుచింతయా ॥

టీ:- ననూపాయసహస్రేణాపి మనోవిషయాకారతాం న త్యజతి భూయో భూయః కిముపదేశేనేతి చేత్తత్రాహ నిర్విణ్ణేతి. తతశ్చాగమాపాయిషు తేషు అవధిభూతాత్మ దర్శనాత్తదవివేకాపన్నసంసారే నిర్విణ్ణస్య అతో విరక్తస్య తతశ్చ ఉక్తవేదినః గురూపదిష్టార్థాలోచకస్య తతో గురూపదిష్టస్యైవ చింతితస్య పునః పునరనుచింతయా దౌరాత్మ్యం దేహాద్యభిమానం త్యజతి. (23)

తా:- ఉపాయ సహస్రమునైనను మనస్సు విషయాకారత్వమును త్యజింపదు మళ్ళీ ఉపదేశించుట వలన ఏమి ప్రయోజనము అనిన చెప్పుచున్నాడు. ఆగమాపాయములు రాకపోకలు జన్మ మరణములు గల దేహమందు అవధి భూతమై యున్న ఆత్మదర్శనమున దాని వివేకము లేని సంసారము నందు ఉద్విగ్నుడై భోగములందు విరక్తుడై గురూపదేశమైన అర్థమును తెలిసి చింతించు ఆలోచనకలవాడైన పురుషుని యొక్క మనస్సు మాటి మాటికి చింతించుటచేత దేహాద్యభిమానమును త్యజించుచున్నది.(23)

24శ్లో॥ యమాది భిర్యోగ పథైరన్వీక్షిక్యా చ విద్యయా ।
మమార్చోపాసనాభిర్వా నాన్యైర్యోగ్యం స్మరేన్మనః ॥

టీ:- కించ. యమాదిభిరితి. యమాదిభిర్యోగమార్గైః ఆన్వీక్షక్యాపదార్థ ద్వయ శోధనేన మమార్చనధ్యానాదిభిర్వా. వా శబ్దేనాన్యపక్షస్య స్వాతంత్ర్యం దర్శయతి - ఏతైరుపాయైర్యోగ్యం పరమాత్మానం మామను స్మరేత్. నాన్యైః అతోఽన్యన్న కుర్యాదిత్యర్థః.(24)

తా:- మరియు యమము మొదలయిన యోగ మార్గములచే తత్వ విచార పరమైన బ్రహ్మవిద్య చేతను నా పూజా ధ్యానములచేతగాని యోగ్యుడనైన పరమాత్మనగు నన్ను ముని స్మరింపవలెను. ఇతర మార్గములచే ఇతరమును చేయరాదు. (24)

25శ్లో॥ యది కుర్యాత్ప్రమాదేన యోగీ కర్మ విగర్హితమ్ ।
యోగేనైవ దహేదంహో నాన్యత్తత్ర కదాచన ॥

టీ:- నను పాపోత్పత్తౌ తత్ప్రాయశ్చిత్తం కార్యమేవ తత్రాహ - యదీతి. యోగేన జ్ఞానాభ్యాసేనైవ ఏతచ్చ భక్తస్యాపి నామసంకీర్తనాద్యుప లక్షణార్థం. నాన్యత్ కృచ్ఛ్రాది. (25)

తా:- పాపము సంభవించెనేని ప్రాయశ్చిత్తకర్మ చేయవలసినదే అందులకు చెప్పుచున్నాడు. జ్ఞాని పొరపాటున నింద్యకర్మ చేసిన వాడగునేని జ్ఞానాభ్యాసము చేతనే పాపమును దహింపవలెను. ఇట్లు చెప్పుట భక్తుడు భగవన్నామ. సంకీర్తనము చేతనే పాపము దహించును ఇత్యాదులకుపలక్షణము ఎప్పుడునూ జ్ఞాని కృచ్ఛ చాంద్రాయణాదులు ప్రాయశ్చిత్తముగా చేయరాదు. (25)

26శ్లో॥ స్వే స్వేఽధికారే యానిష్ఠా సగుణః పరికీర్తితః ।
విపర్యస్తు దోషస్స్యాదుభయోరేష నిశ్చయః ।
కర్మణాం జాత్యశుద్ధానామనేన నియమః కృతః ।
గుణదోష విధానేన సంగానాం త్యాజనేచ్ఛయా ॥

టీ:- నను నిత్యనైమిత్తికం కర్మ సత్త్వశోధకత్వాద్గుణః. హింసాదికం సత్త్వశుద్ధిహేతుత్వాత్ దోషః తత్రచ తన్నివర్తకత్వాత్కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తం గుణ ఇతి విధి ప్రతిషేధాభ్యాముక్తత్వాత్ప్రాయశ్చిత్తం వినా యోగేనైవ కథం పాపం దహేత్తత్రాహ - ద్వాభ్యాం. స్వే స్వే ఇతి. స ఏవ గుణో నేతరః. తదుపపాదయతికర్మాణామితి. యస్మాద్విధినిషేధాభ్యామనేన గుణదోషవిధానేన కర్మాణాం నియమః సంకోచః కృతః కుత ఇత్యత ఆహ జాత్యా ఉత్పత్త్యైవ అశుద్ధానాం స చ ప్రాప్తానాం. సంగానాం త్యాజ నేచ్ఛయా అయం భావః పురుషస్యా శుద్ధిర్నామ న ప్రవృత్తేరన్యాస్తి

తా:- ఓయీ! నిత్యనైమిత్తికమగు కర్మ సత్వశోధకమగుట వలన గుణమగును హింసాదికము అశుద్ధి హేతుకమగుట వలన దోషమగును అందు ఆ దోషమును నివర్తించునది అగుట వలన కృచ్ఛ్రాది ప్రాయశ్చిత్తము గుణమని విధి ప్రతిషేధములచే చెప్పబడినందున ప్రాయశ్చిత్తము లేక యోగము చేతనే పాపమెట్లు దహింపబడుననగా అందులకు చెప్పుచున్నాడు. తమ తమ అధికారమందు వర్ణాశ్రమాధికారమందు ఏ కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠ చెప్పబడినదో అది గుణమని చెప్పబడినది. ఉత్పత్తి చేతనే అశుద్ధములయిన కర్మల సంగములను విడిచివేయవలెననెడి ఇచ్చచే. ఇది గుణము ఇది దోషము అను విధానము చేత నియమము చేయబడినది. దీని భావమిది. పురుషునకు అశుద్ధి అనునది ప్రవృత్తి మార్గమున కంటే అన్యములేదు. స్వాభావిక ప్రవృత్తి చేతనే అతడు మలినుడగుట వలన సర్వకర్మల నివృత్తి శీఘ్రముగా చేయ శక్యము కాదు కావున కర్తవ్యమిది కాదు, కర్తవ్యమిది యను స్వాభావిక ప్రవృత్తిని

స్వాభావిక ప్రవృత్త్యైవ తస్య మలినత్వాత్. న చ సహసా సర్వతోనివృత్తిః కర్తుం శక్యతే. అత ఇదం న కర్తవ్యమిదమేవ కర్తవ్యమితి స్వాభావిక ప్రవృత్తి సంకోచద్వారేణ నావృత్తిరేవ క్రియతే తథా చ న ప్రవృత్తి పరో వేదః తథోత్తరాధ్యాయే వక్ష్యామః ఉత్పత్త్యైవ హి కామేష్విత్యాదినా. అతో యోగినః స్వాభావికప్రవృత్త్యభావా న్న ప్రాయశ్చిత్తావధిగోచరతేతి. (26)

సంకోచించుట ద్వారా దీని నివృత్తియే చేయబడుచున్నది. ఏ ప్రకారము వేదము ప్రవృత్తి పరముకాదో ఆ విధమును ఉత్తరాధ్యాయమందు చెప్పగలము. "ఉత్పత్త్యైవ హి కామేషు" ఇత్యాదిగా అందువలన యోగికి స్వాభావిక ప్రవృత్తి లేనందున ప్రాయశ్చిత్తాది విధిగోచరము కాదు.(26)

27శ్లో॥ జాతశ్రద్ధో మత్కథాను నిర్విణ్ణః సర్వకర్మసు ।
వేద దుఃఖాత్మకాన్ కామాన్ పరిత్యాగేఽప్య నీశ్వర ॥

టీ:- భక్త్యధికారిణో భక్తియోగమాహ- నవభిః. జాతశ్రద్ధ ఇతి. మత్కథాసు జాతశ్రద్ధః అత ఏవాన్యేషు కర్మసు ఉద్విగ్నః న తు తత్ఫలేషు విరక్తః. తదాహ - వేదేతి. యద్యపి వేద. తథాపి తత్పరిత్యాగే అనీశ్వరః అశక్తః. (27)

తా:- భక్త్యధికారి యొక్క భక్తి యోగమును చెప్పుచున్నాడు. నా కథల యందు శ్రద్ధ జనించినవాడు. ఇతర కర్మలయందు మనస్సు పోనివాడు వాని ఫలములందు విరక్తుడు కాడు. కామ పరిత్యాగము నందు అశక్తుడయ్యును ఇంద్రియ సుఖములగు కామములను దుఃఖ స్వరూప ములని తెలిసికొనుచున్నాడు. (27)

28శ్లో॥ తతో భజేత మాం ప్రీతః శ్రద్ధాలుర్దృఢ నిశ్చయః ।
జుషమాణశ్చ తాన్ కామాన్ దుఃఖో దర్కాంశ్చ గర్హయన్ ॥

టీ:- తత ఇతి. ఏవం భూతో యః శ్రద్ధాళుః భక్త్యైవ సర్వం భవిష్యతీతి దృఢనిశ్చయస్సన్ తత స్తదనంతరం మాం ప్రీత్యా భజేత విషయాంస్తు సేవామానోఽపి తేషు ప్రీతిం న కుర్యాదిత్యాహ-గర్హయన్నితి.(28)

తా:- ఇట్టివాడెవ్వడు శ్రద్ధాళువై భక్తిచేతనే సర్వమగునని దృఢ నిశ్చయము గల వాడై తర్వాత నన్ను ప్రీతితో భజంచినచో విషయ సుఖములను సేవించువాడయ్యూ వాటియందు ప్రీతిని పొందరాదను చున్నాడు. అందువలన శ్రద్ధగలవాడు దృఢ నిశ్చయము గలవాడు ఉత్తరకాలమున దుఃఖమును కల్గించు విషయ సుఖముల నను భవించుచూ వానిని నిందించుచూ నన్ను భక్తితో భజింపవలెను.(28)

29శ్లో॥ ప్రోక్తేన భక్తియోగేన భజతోమాఽసకృన్మునేః ।
కామా హృదీయా నశ్యన్తి సర్వే మయి హృదిస్థితే ॥

టీ:- కథం భజేత కిం వా తతో భవతి తదాహ-ద్వాభ్యాం. ప్రోక్తేనేతి. శ్లో."శ్రద్ధామృతకథాయాంమేశశ్వన్మదనుకీర్తనమి"త్యాదినా తత్ర తత్రోక్తేన మా మాం. అసకృన్నిత్యం భజతః. హృదీయాః హృద్గతాః కామాః నశ్యంతి. (29)

తా:- ఎట్లు భజింపవలెను? దానివలన ఏమగును? అనగా చెప్పుచున్నాడు. రెండు శ్లోకములచే "శ్రద్ధామృత కథాయాం మే శశ్వన్మదను కీర్తనమ్" ఇత్యాదిగా పూర్వము చెప్పిన భక్తియోగముచే నన్ను ఒక్క సారయినను భజించు మునికి హృదయమందున్న కామము లన్నియూ నేను హృదయమున ఉండియుండగా నశించుచున్నవి. (29)

30శ్లో॥ భిద్యతే హృదయ గ్రంథిశ్ఛింద్యంతే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి మయి దృష్టేఽఖిలాత్మని ॥

టీ:- భిద్యత ఇతి. హృదయమేవ గ్రంథిరహంకారః. తత్పూర్వకాశ్చ సర్వే సంశయా అసంభావనాదయః. కర్మాణ్యనారబ్ధఫలాని చ సంసార హేతుభూతాని. (30)

తా:- సర్వాత్మ స్వరూపుడనగు నేను కాన వచ్చినంతనే హృదయమను గ్రంథి, అహంకారము పటాపంచలగుచున్నది. సర్వసంశయములు తత్పూర్వకములైన అసంభావనాదులు విచ్ఛిన్నములగును సంసార హేతుకములగు అనారబ్ధ ఫలములు. ఆరబ్ధ ఫలములు క్షీణించును. (30)

31శ్లో॥ తస్మాన్మద్భక్తి యుక్తస్య యోగినోవై మదాత్మనః ।
న జ్ఞానం న చ వైరాగ్యం ప్రాయః శ్రేయో భవేదిహ ॥

టీ:- తదేవం వ్యవస్థయాధికారత్రయముక్తం. తత్ర చ భక్తేరన్యనిరపేక్షత్వాదన్యస్య చ తత్సాపేక్షత్వాద్భక్తియోగ ఏవ శ్రేష్ఠ ఇత్యుపసంహరతి - త్రిభిః. తస్మాదితి. మదాత్మనః మయి ఆత్మా చిత్రం యస్య తస్య. ప్రాయః శ్రేయస్సాధనం. (31)

తా:- ఈ ప్రకారమగు వ్యవస్థచే అధికారత్రయము చెప్పబడినది. అందును భక్తి అన్య నిరపేక్ష గలదగుట వలనను ఇతరము దాని సాపేక్ష మగుట వలననూ భక్తియోగమే శ్రేష్ఠమని మూడు శ్లోకములతో నుపసంహరించుచున్నాడు. అందువలన నా యందలి భక్తితో గూడి నా యందు చిత్తము కలిగిన యోగికి జ్ఞానము వల్ల గాదు, వైరాగ్యము వల్ల గాదు, భక్తి వల్లనే అతనికి శ్రేయస్సు కలుగును. (31)

32శ్లో॥ యత్కర్మభిర్యత్తపసా జ్ఞాన వైరాగ్యతశ్చయత్ ।
యోగేన దాన ధర్మేణ శ్రేయభిరితరైరపి ॥

టీ:- తత్ర హేతుః యత్కర్మభిరిత్యాది. యదితి. ఇతరైరపి తీర్థయాత్రా వ్రతాదిభిః. శ్రేయస్సాధనైః యద్యద్భావం సత్త్వశుద్ధ్యాది. (32)

33శ్లో॥ సర్వం మద్భక్తి యోగేన మద్భక్తో లభతేఽఞ్జసా ।
స్వర్గాపవర్గం మద్ధామ కథం చిద్యది వాంఛతి ॥

టీ:- సర్వమితి. తత్సర్వమంజసా అనాయాసేనైవ. స్వర్గమపవర్గం. మద్ధామ వైకుంఠం లభత ఏవ వాంఛాతు నాస్తీత్యుక్తం యది వాంఛతీతి. (33)

34శ్లో॥ న కించిత్సాధవో ధీరాః భక్తాహ్యేకాన్తినో మమ ।
వాంఛంత్యపి మయా దత్తం కైవల్యమపునర్భవమ్ ॥

టీ:- తత్ర హేతుమాహ - నేతి. ధీరాః ధీమంతః. యతో మమ ఏకాంతినః మయ్యేవ ప్రీతియుక్తాః అతో మయా దత్తమపి న గృహ్ణంతి కిం పునర్వక్తవ్యం న వాంఛంతీతి అపునర్భవం ఆత్యంతికమపి కైవల్యం. (34)

తా:- అందుకు హేతువును చెప్పుచున్నాడు. కర్మలచే ఏది సాధ్యమో, తపస్సుచేనేది ప్రాప్తమో, జ్ఞానవైరాగ్యముల వలన ఏది గమ్యమో, దాన ధర్మములు, తీర్థయాత్రలు, వ్రతములచేత, ఇతరశ్రేయోమార్గములచేత ఏది సంప్రాప్తమగునో. (32)

తా:- పైన చెప్పిన దంతయూ నా భక్తి యోగముచే నా భక్తుడు శీఘ్రముగా పొందును. స్వర్గము మోక్షము నా స్థానమగు వైకుంఠము లభించుచునేయున్నది. కోరెనేని అని అనుటచే వాంఛలేదని చెప్పబడినది. (33)

తా:- అక్కడ హేతువును చెప్పుచున్నాడు. ధీరులగు నా భక్తులు నా యందు ప్రీతిగలవారు నాచే ఇవ్వబడు పునర్జన్మలేని మోక్షమును గూడా గ్రహించరు. వారికి కొంచెమయిననూ వాంఛలేదు. వాంఛించరని యర్థము. ఆత్యంతికమయిన కైవల్యమును కూడా. (34)

35శ్లో॥ నైరపేక్ష్యం పరం ప్రాహుర్నిశ్శ్రేయస మనల్పకమ్ ।
తస్మాన్నిరాశిషో భక్తిర్నిరపేక్షస్య మే భవేత్ ॥

టీ:- ఏతదుపపాదయతి -నైరపేక్షమితి. నైరపేక్షమేవ పరం ఉత్కృష్టం అనల్పకం మహత్ నిశ్శ్రేయసఫలం తత్సాధనం చ ప్రాహుః. మే భక్తిర్నిరాశిషః ప్రార్థనాశూన్యస్య నిష్కామస్య నిరపేక్షస్య ప్రార్థనా కారణ భూతాపేక్షారహితస్య పుంసో భవేత్. యద్వా. మే నిరపేక్షస్యయాభక్తిః సా నిరాశిషో భవేదిత్యర్థః. (35)

తా:- దీనినుపపాదించుచున్నారు. అపేక్ష లేకుండటయే ఉత్కృష్టమైన నిశ్శ్రేయస ఫలము దాని సాధనము కూడా అని చెప్పుచున్నారు. అందువలన నా యొక్క భక్తి ప్రార్థనాశూన్యుడై ప్రార్థనా కారణభూతమగు అపేక్ష లేని పురుషునకు భక్తికల్గును. లేదా నిరపేక్షుడనయిన నా యే భక్తి కలదో అది ప్రార్థనాశూన్యమై యుండునని అర్థము. (35)

36శ్లో॥ న మయ్యేకాన్త భక్తానాం గుణ దోషోద్భవా గుణాః ।
సాధూనాం సమ చిత్తానాం బుద్ధేః పరముపేయుషామ్ ॥

టీ:- అనేన చ ప్రకారేణ జ్ఞానభక్తిసిద్ధానాం న గుణదోషాం ఇతి విరోధపరిహారముక్తముపసంహరతి నేతి. గుణదోషైర్విహిత ప్రతిషేధైరుద్భవో యేషాం తే. గుణాః పుణ్య పాపాదయః సాధూనాం నిరస్త రాగాదీనాం. అతస్సమచిత్తానాం. అత ఏవ బుద్ధేః పరమీశ్వరం ప్రాప్తానాం.(36)

తా:- ఈ ప్రకారము జ్ఞాన భక్తులు సిద్ధించిన వారికి గుణదోషములు లేవు అని విరోధ పరిహారమునుపసంహరించుచున్నాడు. నా యందు ఏకాంత భక్తులై రాగాదులను నిరసించినవారై సాధువులై అన్నింటి యందు సమచిత్తులై బుద్ధి వలన పరమేశ్వరుని పొందిన వారికి గుణ దోషము వలన జనించు గుణము లేవియు కలుగవు. (36)

37శ్లో॥ ఏవమేతాన్మయాదిష్టా నను తిష్ఠన్తి మే పథః ।
క్షేమం విందంతి మత్థానం యద్బ్రహ్మ పరమం విదుః ॥

టీ:- కామ్యకర్మ నిష్ఠాం నిందిష్యన్ దివ్యానేతాన్ముక్తిమార్గానుసంహరతి - ఏవమితి. మే పథః మత్ప్రాప్త్యు పాయాన్ యేఽనుతిష్ఠంతి. తే క్షేమం కాలమాయాది విరహితం మమ లోకం విందంతి. యత్పరమం బ్రహ్మ తచ్చ విదుః. (37)

తా:- కామ్యకర్మ నిష్ఠను నిందించుచూ దివ్యములైన ముక్తి మార్గముల నుపసంహరించుచున్నాడు. ఈ ప్రకారము నా చే చెప్పబడిన ఈ యుపాయములను నన్ను పొందు మార్గములను ఎవరనుష్ఠించుచున్నారో వారు కాలమాయాది రహితమయిన నా స్థానమును పరబ్రహ్మముగా చెప్పబడుదానిని పొందుచున్నారు. (37)

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**వింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**వింశాధ్యాయము సమాప్తము.**

## ఏకవింశోఽధ్యాయః

**శ్రీభగవానువాచ**

1శ్లో॥ యఏతాన్మత్పథో హిత్వా భక్తి జ్ఞాన క్రియాత్మకాన్ ।
క్షుద్రాన్ కామాంశ్చలైః ప్రాణై ర్జుషన్తః సంసరన్తి తే ॥

టీ:- శ్లో. జయతి స్వపరానందరానందనృకేసరీ, యత్కృపాలవలేశేన శ్రీధరస్సంస్కృతః కృతీ.ఏకవింశే క్రియాజ్ఞానభక్తినధికారిణామ్. కామినాం ద్రవ్యదేశాదిగుణదోషాః ప్రపంచితాః తదేవం గుణదోషవ్యవస్థార్థం యోగ త్రయం ముక్తం. తత్ర చ జ్ఞానభక్తిసిద్ధానాం న కించిద్గుణ దోషౌ సాధకానాం తు స్వల్పం ప్రథమతో నివృత్తి కర్మనిష్ఠానాం యథా శక్తి నిత్యనైమిత్తికం కర్మ సత్త్వశోధకత్వాత్. గుణః తదకరణం నిషిద్ధకరణం చ తన్మలీమసకరణత్వాద్దోషః తన్నివర్తకత్వాచ్చ కృచ్ఛాదిప్రాయశ్చిత్తం గుణః విశుద్ధసత్త్వానాం తు జ్ఞాననిష్ఠానాం జ్ఞానాభ్యాస ఏవ సిద్ధి హేతుత్వాద్గుణః. భక్తినిష్ఠానాం పునః శ్రవణకీర్తనాది భక్తిరేవ గుణః. తద్విరుద్ధం సర్వముభయేషాం దోష ఇత్యుక్తం. ఇదానీం తనానాం మధ్యేయే తు న సిద్ధాః నాపి సాధకాః. కింతు కేవలం కామ్యకర్మప్రధానా స్తేషాం సకలగుణదోషాన్ ప్రపంచయిష్యన్ సన్ ఆదౌ తానతి బహిర్ముఖా న్నిందతి యఇతి. మత్పథః మదుక్తముక్తిమార్గాన్. క్షుద్రాన్ తుచ్ఛాన్. చలైః అస్థిరైః. ప్రాణైర్దేవాయుభిరింద్రియైర్వా. జుషంతః సేవామానాః భవంతి. తే సంసరంతి నిఖిలగుణదోషభాక్త్వేన నానా యోనీః ప్రాప్ను వంతీత్యర్థః.(1)

## ఏకవింశాధ్యాయము

తా:- స్వీయమైన బ్రహ్మానందము చేత ఇతరులకానంద స్వరూపుడ యిన నరసింహమూర్తి సర్వోత్కర్షతో జయించుచున్నాడు. ఎవని కృపా లవ లేశముచే శ్రీధరుడు సంస్కరింపబడి ధన్యుడైనాడో, సత్పురుషులు ఇచ్ఛతో చూడండి. నా సాహసమును క్షమించండి. నేను నా బోధకై దీనిని చేసినాను. సర్వతః నా పాండిత్య దర్శనమునకై కాదు. ఈ ఇరవై యొక్కటవ అధ్యాయమున కర్మజ్ఞాన భక్తులందు అనదికారులై ఫలకాములైన వారికి ద్రవ్యదేశాది గుణదోషములు ప్రవంచింపబడినవి. ఈ ప్రకారము గుణదోష వ్యవస్థ కొరకు యోగత్రయము చెప్పబడినది. అందు జ్ఞాన భక్తి సిద్ధులకు గుణదోషములులేవు సాధకులకు మాత్రము స్వల్పముండును. ప్రథమముననే కర్మనిష్ఠను నిర్వర్తించు వారికి యథాశక్తి నిత్య నైమిత్తిక కర్మగలదు. అది సత్వశోధకమైయున్నందున అది గుణము. నిత్య నైమిత్తిక కర్మను చేయకుండుట నిషిద్ధ కరణమగును. అది మలీమసమగుట వలన దోషము. ఆ దోషము నివర్తించిన దగుటకు కృచ్ఛాది ప్రాయశ్చిత్తము గుణమగును. విశుదంధ సత్త్వులయిన జ్ఞాన నిష్ఠులకు జ్ఞానాభ్యాసమే సిద్ధహేతువగుటచే గుణము. భక్తి నిష్ఠులకు శ్రవణ కీర్తనాదులే గుణమగును. తద్విరుద్ధ మయినది సర్వము ఉభయులకూ దోషమని చెప్పబడినది. ఇప్పుడు

ఎవరు సిద్ధులుకారో, ఎవరు సాధకులుకారో, కామ్య కర్మప్రధానులో అట్టి వారికి సకలగుణ దోషములను ప్రవంచించుతూ మొదట అట్టి బహిర్ముఖులను నిందించుచున్నారు. ఎవరు నేను చెప్పిన ఈ ముక్తి మార్గములను భక్తి జ్ఞానక్రియారూపముల ను వదిలి అస్థిరములైన దేహప్రాణముల చేతను ఇంద్రియముల చేతను తుచ్ఛములైన ఇంద్రియ భోగములనుసేవించుచున్నవారో వారు నిఖిల దోష భాజనులగుటచే నానా యోనులను పొందుచున్నారు. (1)

2శ్లో॥ స్వే స్వేऽధికారే యా నిష్ఠాస గుణః పరికీర్తితః ।
విపర్యయస్తు దోషః స్యాదుభయోరేష నిశ్చయః ॥

టీ:- నను తైరేవ కర్మభిః కేచిద్గుణదోషభాజః కేచిన్నేతి కుతో వైషమ్యం. నహ్యగ్నినా కేచిత్తప్యంతే కేచిన్నేతి సంభవతి తత్రాహ - స్వే స్వే ఇతి. అధికారిభేదేన కల్పితౌ గుణదోషౌ న వస్తునిష్ఠావితి భావః. (2)

తా:- ఓయీ! ఆ కర్మల చేతనే కొందరు గుణ దోషభాజనులగుదురు. కొందరు కారు. మరి ఈ వైషమ్యమెట్లు సంభవించును? అగ్నిచే కొందరు తాపాన్ని పొందుతారు. మరికొందరు తాపమును పొందరు. అనుట సంభవించును కదా అంటే అందుకు చెప్పుచున్నారు.వారి వారి వర్ణాశ్రమానుసారము తమ తమ అధికారముననుసరించి ఎవరెవరికి ఏది ధర్మనిష్ఠయో అదియే వారికి గుణమని చెప్పబడినది. దానికి విపరీతముగా ఆచరించుట దోషము అని ఈ విధముగా గుణదోషముల నిశ్చయము చేయబడినది గుణదోషములు అధికార భేదమును బట్టి కల్పితములగునుగాని వస్తు నిష్ఠగలవి కావు.(2)

3శ్లో॥ శుద్ధ్యశుద్ధీ విధీయేతే సమానేష్వపివస్తుషు ।
ద్రవ్యస్య విచికిత్సార్థం గుణదోషౌ శుభా శుభౌ ॥

టీ:- తదాహ-శుద్ధ్యశుద్ధీ ఇతి. విచికిత్సార్థం యోగ్యమయోగ్యం వేతి సందేహద్వారా స్వాభావికప్రవృత్తిప్రతిబంధార్థమిత్యర్థః. తత్ర శుద్ధ్యశుద్ధీ యోగ్యత్వా యోగ్యత్వే. గుణదోషౌ తన్నిమిత్తోపాదేయత్వానుపాదేయత్వే శుభాశుభౌ తన్నిమిత్తావర్థానర్థౌ. (3)

4.శ్లో॥ ధర్మార్థం వ్యవహారార్థం యాత్రార్థమితి చానఘ ।
దర్శితోయం మయాచారో ధర్మముద్వహతాంధురమ్ ॥

టీ:- ధర్మార్థమితి.తత్ర శుద్ధ్యశుద్ధీ ధర్మార్థం.శుద్ధేన ధర్మః అశుద్ధేనా ధర్మఇతి. గుణదోషౌ వ్యవహారార్థం అశుద్ధావపి రాజాదీనాం వ్యవహార దర్శనాద్యుదేయం నాన్యదితి. శుభాశుభౌ యాత్రార్థం. దోషత్వేఽప్యా పత్సు శరీరనిర్వాహమాత్రోపాదానే న పాపం. అధికోపాదానే తు పాపమితి. మయా మన్వాది రూపేణ ధర్మారూపాం ధురం భారం, కర్మజడనామిత్యర్థః. (4)

తా:- దానిని చెప్పుచున్నారు. వస్తువులు సమానములలై ఒక్కరీతిగ ఉన్ననూ ఈ వస్తువు యోగ్యమా అయోగ్యమా అను సందేహము ద్వారా స్వాభావిక ప్రవృత్తిని ప్రతిబంధించుట కొరకు శుద్ధము అశుద్ధము యోగ్యత్వము అయోగ్యత్యము తన్నిమిత్తమైన గుణ దోషములు ఉపాదేయత్వము అనుపాదేయత్వము తన్నిమిత్త మగు అర్థము అనర్థము విధింపబడుచున్నది. కాలమునకాశుద్ధాశుద్ధులు చెప్పుచున్నారు. ద్రవ్య సంపత్తిని బట్టి స్వయముగా గాని కర్మార్హమైన ఆ కాలము కర్మవిషయమైన గుణము కలది, దేనినుండి ద్రవ్యలోపముచే గాని రాష్ట్ర విప్లవాదికముచే గాని, కర్మ నివర్తింపబడునో సూతకాదిక మందు దశాహాది లక్షణమై దేని కర్మానర్హము అని చెప్పబడినది.(3)

తా:- పైన చెప్పబడినవానియందు శుద్ధి, అశుద్ధి అను రెండునూ ధర్మము కొరకు చెప్పబడినవి. శుద్ధమగు వస్తు గ్రహణముచే ధర్మము. అశుద్ధమగు దానిచే అధర్మము కలుగును. అట్లే గుణ దోషములు వ్యవహార నిమిత్తము. అశుద్ధములగు గుణ దోషములు రాజాదుల వ్యవహారమందు కనబడుచున్నవి. కావున ఆ రాజ వ్యవహారమందే అట్లు గ్రాహ్యమనియు ఇతరత్ర గ్రాహ్యము కావనియు, మరియు శుభాశుభములు దేహ యాత్రకై చెప్పబడినవి. దోషమైనను ఆపదలందు శరీర నిర్వహణకు మాత్రము అగ్రాహ్యమగు పరాన్నమును గ్రహించుట పాపముకాదు. అధికము గ్రహించుట పాపమగును. ఇట్లు పూర్వము

ధర్మరూపమైన భారమును వహించి మన్వాది రూపమున నేను ఆ ఆచారమును కర్మ జడులకు తెల్పియున్నాను. (4)

5.శ్లో॥ భూమ్యంబగ్న్యనిలాకాశా భూతానాం పంచధాతవః ।
ఆబ్రహ్మ స్థావరాదీనాం శరీరా ఆత్మ సంయుతాః ॥

టీ:- శుద్ధ్యశుద్ధీ ప్రపంచయిష్యన్ వేదోక్తత్వేన తదభినివేశో మాభూదితి సమానేష్వపి వస్తుష్వితి యదుక్తం తత్ప్రపంచయతి త్రిభిః. భూమీతి. భూతానాం ప్రాణినాం ధారయంతీతి ధాతవః కారాణాని శారీరాః శరీరారంభకాః. దేహతస్సామ్యముక్తం. జీవతోఽప్యాహ – ఆత్మయుతా ఇతి. (5)

తా:- శుద్ధ్యశుద్ధుల గురించి చెప్పుచూ వేదోక్తములగుటచే వాని యందభినివేశము కూడదని, సమానములగు వస్తువులందు ఏది చెప్పబడినదో వానిని మూడు శ్లోకములచే విస్తరించుచున్నారు. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, ప్రాణుల యొక్క ధరింపచేయు ధాతువులై కారణములై, బ్రహ్మ మొదలు వృక్షాది స్థావరముల పర్యంతము ఉన్న ప్రాణులకు ధరించు ధారణములు కారణము శరీరారంభకములు దేహమును బట్టి సామ్యము చెప్పబడినది. జీవుని బట్టి సామ్యము చెప్పుచున్నారు. ఆత్మతో కూడినవై యున్నవి. (5)

6.శ్లో॥ వేదేన నామరూపాణి విషయాణి సమేష్వపి ।
ధాతుషూద్ధవ కల్ప్యన్త ఏతేషాం స్వార్థ సిద్ధయే ॥

టీ:- వేదేనేతి. ధాతుషు దేహేషు నామరూపాణి వర్ణాశ్రమాదీని కల్పనాయాః ప్రయోజనమాహ – ఏతేషాం ప్రాణినాం స్వార్థసిద్ధయే ప్రవృత్తి నియమద్వారా ధర్మాదిపురుషార్థసిద్ధయే.(6)

తా:- ఓ ఉద్ధవా ! ఈ ప్రాణులకు ప్రకృతి నియమము ద్వారా ధర్మాది పురుషార్థ సిద్ధి కొరకు దేహములందు, సమములైన వానియందు భిన్నములగు నామ రూపములు, వర్ణాశ్రమాది ధర్మములు వేదముచే కల్పింపబడుచున్నవి. (6)

7.శ్లో॥ దేశకాలాది భావానాం వస్తూనాం మమ సత్తమ ।
గుణ దోషౌ విధీయతే నియమార్థం హి కర్మణామ్ ॥

టీ:- న కేవలం దేహేష్వేవ అపి తు దేశేతి. దేశకాలాదిభావానామపి ఆదిశబ్దేనానుపాదేయానాం ఫలనిమిత్తాధికారిణాం గ్రహణం. వస్తునాం ఉపాదేయానాం వ్రీహ్యాదీనా మపి మమ మయా నియమార్థం కర్మసంకోచార్థమిత్యర్థః. (7)

తా:- ఓ సత్పురుషుడా! కేవలము దేహములందే కాదు, దేశ, కాలము మొదలయిన వానికి కూడా ఉపాదేయములైన వ్రీహ్యాది వస్తువులకు సయితము నా చే కర్మల సంకోచము కొరకు గుణ దోషములు విధించబడుచున్నవి. (7)

8.శ్లో॥ అకృష్ణసారో దేశానామబ్రహ్మణ్యోఽశుచిర్భవేత్ ।
కృష్ణసారోఽప్యసౌవీర కీకటోఽసంస్కృతేరిణమ్ ॥

టీ:- ఏవం గుణదోష విషయం పరిశోధ్య తయోః శుద్ధ్యశుద్ధి మూలత్వాత్ శుద్ధ్యశుద్ధీ ప్రపంచయత్యష్టభిః అకృష్ణసార ఇతి. దేశానాం మధ్యే కృష్ణహరిణ సంచార రహితో దేశః ఆశుచిః. తత్రాపి అబ్రహ్మణ్యం బ్రాహ్మణ భక్తిశూన్యో దేశః అత్యంతమశుచిః. కృష్ణసారోఽపి కృష్ణేన మృగేణసారః శ్రేష్ఠో యః సోఽపి అసౌవీరః కీకటః సువీరాః సత్పురుషాః తద్వాన్ సౌవీరః కీకటోఽపి శుచిః. తదుక్తం.శ్లో."స వై పుణ్యతమో దేశస్సత్పాత్రం యత్ర లభ్యత" ఇతి.తద్వర్జితః అసౌ వీరః యః కీకటః అంగవంగకళింగాదిః సః అశుచిః తత్రాపి అసంస్కృతః సంమార్జనాది శూన్యః మ్లేచ్ఛ బహుళో వా దేశః తత్రాపి ఇరిణం ఊషరం ఏకవద్భావః తత్ అశుచి. తదస్య శుచిరిత్యర్థాదుక్తం భవతి. (8)

తా:- ఈ ప్రకారము గుణదోషములను పరిశోధించి అవి శుద్ధ్యశుద్ధి మూలకములని శుద్ధ్యశుద్ధులను ఎనిమిది శ్లోకములచే చెప్పుచున్నారు. దేశములలో నల్ల జింక ఎక్కడ స్వేచ్ఛగా సంచరించదో, బ్రాహ్మణ భక్తి ఎక్కడ లేదో ఆ దేశము అశుచియగును. కృష్ణసార మృగ సంచారముచే శ్రేష్ఠమై సువీరులు అయిన సత్పురుషులు గల కీకట దేశమయిననూ శుచియగును. " స వై పుణ్యతమో దేశః సత్పాత్రం యత్ర లభ్యతే" ఎక్కడ సత్పాత్రము లభించునో అది పుణ్య తమమగు దేశము. అట్టి సత్పురుషులు లేనిది అంగ వంగ కళింగాది దేశము అశుచి. సమ్మార్జనాది శూన్యమైన మ్లేచ్ఛ బహుళమైన దేశము అందునూ ఊషర దేశము అశుచి. దానికన్యము శుచి. (8)

9.శ్లో॥ కర్మణ్యో గుణవాన్ కాలో ద్రవ్యతః స్వత ఏవ వా ।
యతో నివర్తతే కర్మ స దోషోఽకర్మకః స్మృతః ॥

టీ:- కాలస్య శుద్ధ్యశుద్ధీ దర్శయతి కర్మణ్య ఇతి. ద్రవ్యతః ద్రవ్య సంపత్త్యా స్వతో వా పూర్వాహ్ణాదిర్యః కర్మణ్యః కర్మార్హః సకాలస్తస్మిన్ కర్మణి గుణవాన్. యతః యస్మిన్. ద్రవ్యాలాభేన వా రాష్ట్రవిప్లవాదినా వా కర్మ నివర్తతే. యశ్చ సూతకాదౌ దశాహాది లక్షణః అకర్మకః.కర్మార్హః స్మృతః. స కాలో దోషః అశుద్ధ ఇత్యర్థః.(9)

తా:- కాలమునకు శుద్ధ్యశుద్ధ్యములు చెప్పుచున్నారు. ద్రవ్య సంపత్తిని బట్టి స్వయముగాగానీ కర్మార్హమైన ఆకాలము కర్మ విషయమైన గుణము కలది దేని నుండి ద్రవ్య లోపముచేగాని రాష్ట్రవిప్లవాదికముచే గాని, కర్మ నివర్తింపబడునో సూతకాదికమందు దశాహాది లక్షణమైనదేని కర్మానర్హము అని చెప్పబడినది. (9)

10శ్లో॥ ద్రవ్యస్సశుద్ధ్యశుద్ధీ చ ద్రవ్యేణ వచనేన చ ।
సంస్కారేణా కాలేన మహత్త్వాల్ప తయాథవా ॥

టీ:- వస్తుశబ్దోపాత్తానాం ద్రవ్యాణాం శుద్ధ్యశుద్ధీ దర్శయతి. చతుర్భిః ద్రవ్యస్యేతి. ద్రవ్యేణ తోయాదినా శుద్ధిః మూత్రాదినా త్వశుద్ధిః. వచనేన శుద్ధమశుద్ధం వేతి సందేహే శుద్ధమిత్యేవం రూపేణ బ్రాహ్మణ వచేన శుద్ధిః. విపరీతేనాశుద్ధిః సంస్కారేణ ప్రోక్షణాదినా పుష్పాదేశ్శుద్దిః. న పర్యుషితాన్నాదేః. అవఘ్రాణాదినా త్వశుద్ధిః కాలేన దశాహాదినా నవోదకాదేః శుద్ధిః నోచ్ఛిష్టాదేః విపరీతే నాశుద్ధిః అంత్యజాద్యు పహతానాం తటాకాద్యుదకానాం మహత్త్వాల్పత్వాభ్యాం శుద్ధ్యశుద్ధీ.(10

తా:- వస్తు శబ్దముతో చెప్పబడిన ద్రవ్యముల శుద్ధ్యశుద్ధులు నాలుగు శ్లోకములచే చెప్పుచున్నారు. ద్రవ్యమునకు జలము మొదలయిన వాటిలో శుద్ధి మూత్రాదికముచే అశుద్ధి కలుగును. బ్రాహ్మణ వచనముచే శుద్ధమా, అశుద్ధమా అను సందేహమునందు శుద్ధమే అను బ్రాహ్మణ వచనముచే శుద్ధి విపరీతమయిన దానిచే నశుద్ధి జలప్రోక్షణాదికముచే పుష్పాదికమునకు శుద్ధి వాసన చూచుట వలన అశుద్ధి. పర్యుషితాన్నాదికమునకు శుద్ధిలేదు దశాహాది కాలముచే అన్నోదకాదికమునకు శుద్ధి విపరీతమగు వానిచే అశుద్ధి ఉచ్ఛిష్టాదిక మునకు శుద్ధి లేదు. అంత్యజులుపయోగించిన తటాకాదులు పెద్దవైనచో శుద్ధి చిన్నవైనచో అశుద్ధి. (10)

11శ్లో॥ శక్త్యా౽శక్త్యా చ వా బుద్ధ్యా సమృద్ధ్యా చ యదాత్మనః ।
అఘం కుర్వన్తి హి యథా దేవావస్థానుసారతః ॥

టీ:- శక్త్యేతి. శక్త్యా అశక్త్యా సూర్యోపరాగసూతకాన్నాదేః శక్తాన్ప్రత్య శుద్ధిః అశక్త్యాన్ప్రతి శుద్ధిః. బుద్ధ్యా పుత్రజన్మాదౌ దశాహోద్భహిర్జ్ఞానేన శుద్ధిః. సమృద్ధ్యా జీర్ణమలవద్వస్త్రాదేః సమృద్ధం ప్రత్యశుద్ధిః. దరిద్రం ప్రతి శుద్ధిః. తత్రాపి విశేషమాహ - యదితి. ఏతే ద్రవ్యవచనాదయో ద్రవ్యాశుద్ధి ద్వారా ఆత్మనో యదఘం కుర్వంతి తద్దేశావస్థానుసారత ఏవ యథా యథావత్ కుర్వంతి న సర్వతః తథాహి. నిర్భయఏవ దేశే కుర్వంతి. న తు చోరాద్యాకులే. తథా రోగాది వ్యతిరిక్త యువాద్య వస్థాయామేవ కుర్వంతి. న బాల్యరోగాద్యమవస్థాయామితి. తథా చ స్మృతిః. శ్లో."దేశం కాలం తథాత్మానం ద్రవ్యం ద్రవ్యప్రయోజనమ్, ఉపపత్తిమవస్థాం చ జ్ఞాత్వా శౌచం ప్రకల్పయేది"తి. (11)

తా:- శక్తిచేతను అశక్తిచేతను సూర్యోపరాగము సూతకాన్న గ్రహణము లచే శక్తులకు అశుద్ధి. అశక్తులకు శుద్ధియగును. పుత్ర జన్మాదికమందు పదిదినములు తరువాత తెలియు శుద్ధి. పదిదినముల లోపల తెలియుట అశుద్ధి. చినిగి, మురికి అయిన వస్త్రమునకు సంపద గల వానిని గూర్చి అశుద్ధి. దరిద్రుని గూర్చి శుద్ధి. అందును విశేషమును చెప్పుచున్నారు. ఆత్మకు ఈ ద్రవ్య వచనాలు ద్రవ్యముల అశుద్ధి ద్వారా తమకు యథా తథముగా ఏ పాపమును చేయుచుండుట. దేశకాలాదు లననుసరించియే అదియు అంతటనూ చేయవు. అది యుక్తము దేశమందు చేయుచున్నవి, చోర వ్యాకుల ప్రదేశమందు చేయవు. ఆ ప్రకారము రోగాది వ్యతిరిక్తమగు యువాద్యవస్థ యందు చేయనుగాని బాల్యరోగాద్యవస్థ యందు పాపము కలిగింపవు. "దేశం కాలం తథాత్మానం ద్రవ్యం ద్రవ్య ప్రయోజనం ఉపపత్తి మవస్థాం చ జ్ఞాత్వా శోచం ప్రకల్పయేత్". దేశము కాలము ఆత్మ ద్రవ్యము ద్రవ్య ప్రయోజనము ఉపపత్తి అవస్థ వీటిని తెలిసికాని శౌచమును కల్పింప వలెను. (11)

12శ్లో॥ ధాన్య దార్వస్థి తంతూనాం రసతైజస చర్మణామ్ ।
కాలవాయ్వగ్ని మృత్తోయైః పార్థివానాం యుతా యుతైః ॥

తా:- ద్రవ్యాదులచే ద్రవ్యమునకు శుద్ధి చెప్పబడినది. అందు వచనాది శుద్ధి, ఒకే విధము గలది. ద్రవ్యముచే శుద్ధి బహురూపములనుండును. అశుద్ధిని ప్రవంచించుచున్నారు. ధ్యానము, కట్టె, ఆజ్యము, మొదలయిన

టీ:- ద్రవ్యాదిభిః ద్రవ్యస్య శుద్ధిరిత్యుక్తం. తత్ర వచనాది శుద్ధిరేక రూపైవ ద్రవ్యతస్తు శుద్ధిర్బహురూపేతి తాం ప్రపంచయతి -ధాన్యేతి. ధాన్యానాం వాయునా. దారు లౌకికగ్రహ చమసాది. అస్థి గజదంతాది. రసాస్తైలఘృతాదయః తైజసా సువర్ణాదయః. తేషాం అగ్నినా చర్మణాం మృత్తోయాభ్యాం. పార్థివానాం రథ్యాకర్దమఘటేష్టకాదీనాం యథా యథం కాలాదిభిశ్శుద్ధిః. తత్రాపి కాకాంత్యజాద్యుపఘాతతారతమ్యేన దేశకాలావస్థాద్యనుసారేణ చ. ఏతైరన్యైశ్చ యుతాయుతతైర్మిళితైః కేవలైశ్చ. కాలస్య పునర్గ్రహణం యుతత్వప్రదర్శనార్థం. (12)

వానిని గ్రహించు చమసాదికము గజ దంతాదికము నూలు వస్త్రము మొదలగు వానికి రసఘృత తైలాదులు, సువర్ణాదులు, కృష్ణాజినము మొదలగువానికి రాజవీధి, బురద, ఘటము, ఇటుక మొదలగు వానికి కూడినవి కూడనివి యైన కాలముచే వాయువుచే అగ్ని, మృత్తికతో, జలముచే శుద్ధి వాని వాని శుద్ధి కాలాదుల చేతను. కాకాంతజులు మొదలగు వాని స్పర్శయందలి తారతమ్యముచే దేశకాలానుసారము జరుగును. (ధాన్యములకు వాయు, ఆతప, ప్రోక్షణలచే, దారువులకు- గ్రహం చ మసాదులకు మృత్సహితమయిన ఉష్ణోదకముచే గజ దంతాదులకు వాయ్వాతపాదులచే కాలముచే , తంతువులకు నీటిచే రసములు- తైజసములయిన వాటికి అగ్నితో, చర్మ వస్తువులకు మృత్తోయములతో, పార్థివములయిన వాటికి కాలాదులచే శుద్ధి. (12)

13శ్లో॥ అమేధ్యలిప్తం యద్యేన గంధ లేపం వ్యపోహతి ।
భజతే ప్రకృతిం తస్య తచ్ఛౌచం తావదిష్యతే ॥

టీ:- అస్పృశ్య స్పర్శే శుద్ధిముక్త్వా లేపవిషయేఽప్యాహ అమేధ్యేతి. యత్ పీఠపాత్రవస్త్రాది యేన తక్షణఘర్షణ క్షారామ్లోదకాదినా గంధం చ లేపం చ వ్యపోహతి త్యజతి స్వగతం చ మలం త్యక్త్వా ప్రకృతిం స్వమేవ రూపం భజతే. తస్య తత్ శౌచం శోధకం. యావతా చ తక్షణాదినా వ్యపోహతి. తావత్ప్రమాణం స్వరూపతః ఆవృత్తితో వా తత్కర్తవ్యమిష్యతే.(13)

తా:- అస్పృశ్యమగు దానిని స్పృశించుటకు శుద్ధిని చెప్పి లేని విషయ మందు చెప్పుచున్నారు. అపరిశుద్ధ పదార్థముచే పూయబడిన పీఠము, పాత్రము, వస్త్రము మొదలగునవి క్రమముగా చెక్కుట, పులుసు పోయుట మొదలయిన వానిచే శుభ్రపరచుటచే వానికంటిన పూత, గంధము పోయినవగును. తన మొదటి రూపమేర్పడునంత వరకు శోధనము కర్తవ్యము అని కోరబడుచున్నది. (13)

14శ్లో॥ స్నాన దాన తపోఽవస్థా వీర్య సంస్కార కర్మభిః ।
మత్స్మృత్యా చాత్మనః శౌచం శుద్ధః కర్మాచరేద్ద్విజః ॥

టీ:- ఏవం తావద్ద్రవ్య శుద్ధిముక్త్వా ఇదానీం కర్తృశుద్ధిమాహ - స్నానేతి. అవస్థా కౌమారాదిః. వీర్యం శక్తిః. సంస్కార ఉపనయనాదిః కర్మశౌచ సంధ్యోపాసనా దీక్షాలక్షణం. ఆత్మనః సాహంకారస్య కర్తుః. ఏతైః స్నానాదిభిర్యథా యథం తత్తత్కార్యానుసారిణీ శుద్ధిః. ఇయం చ శుద్ధిః న వ్యవహారార్థా. కింతు. విహితకర్మార్థేత్యాహ - శుద్ధ ఇతి. ద్విజ ఇత్యుపలక్షణం. శూద్రాదేరపి. (14)

తా:- ఈ ప్రకారము ద్రవ్య శుద్ధిని చెప్పి ఇప్పుడు కర్తృశుద్ధిని చెప్పుచున్నారు. స్నానము, దానము, తపస్సు, అవస్థ- (కౌమారాదిదశ) శక్తి, ఉపనయనాది సంస్కారము, సంధ్యోపాసనా దీక్షాలక్షణము నా స్మరణచేత, సాహంకారుడైన ఈ స్నానాదులతో యథా యథము నా శుద్ధిని పొందును. ఈశుద్ధి వ్యవహారము కొరకు కాదు, మరేమన విహిత కర్మ కొరకని చెప్పవలెను. ద్విజుడనునది శూద్రాదులకుపలక్షణము. (14

15శ్లో॥ మంత్రస్య చ పరిజ్ఞానం కర్మశుద్ధిర్మదర్పణమ్ ।
ధర్మస్సంపద్యతే షడ్భిరధర్మస్తు విపర్యయః ॥

టీ:- మంత్రశుద్ధిమాహ- మంత్రేతి. సద్గురు ముఖాద్యథావత్పరిజ్ఞానం మంత్రస్య శుద్ధి. కర్మశుద్ధిమాహ-ఈశ్వరార్పణం కర్మణః శుద్ధిః ధర్మాద్యర్థం శుద్ధశుద్ధీ ప్రపంచతః ప్రదర్శ్యోపసంహరతి. ధర్మఇతి. దేశకాలద్రవ్యకర్తృ మంత్రకర్మభిః షడ్భిశ్శుద్ధైర్ధర్మస్సంపద్యతే. ఏతేషాం యో విపర్యయః సః అధర్మః. తద్ధేతురిత్యర్థః. (15)

తా:- మంత్ర శుద్ధిని చెప్పుచున్నారు. సద్గురు ముఖమున సత్త్వ పరిజ్ఞానము మంత్రమునకు శుద్ధి. సమగ్రజ్ఞానము ఈశ్వరుడనయిన నా యందు సమర్పించుట కర్మశుద్ధి. ధర్మాదుల కొరకు శుద్ధ్య శుద్ధులను సవిస్తరముగా తెలిపి ఉపసంహరించుచున్నా రు. దేశము, కాలము, ద్రవ్యము, కర్త, మంత్రము, కర్మఅను ఆరింటిచే శుద్ధమగు ధర్మము పొందబడును. అధర్మమన్న దీనికి వ్యతిరిక్తము. (15)

16.శ్లో॥ క్వచిద్గుణోఽపి దోషః స్యాద్దోషోఽపి విధినాగుణః ।
గుణదోషార్థ నయమస్తద్భిదామేవ బాధతే ॥

టీ:- అయం చ గుణదోషవిభాగో న వాస్తవ ఇత్యాహ - క్వచిదితి. ఆపద ప్రతిగ్రహో గుణోఽప్యనాపది నిషిద్ధత్వాద్దోషః పరధర్మశ్చ పరస్య దోషః దోషోఽపి కుటుంబత్యాగాదిః విరక్తాదేర్నదోషః. అపి తు విధిబలేన గుణః. శ్రు. "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజే ది"తి శ్రుతేః. విరక్తస్య కుటుంబత్యాగో గుణోఽపి అవిరక్తస్య దోషః."ఋతౌ భార్యాముపేయాది"తి. వచనాత్. ఏవం యోఽయం గుణదోషయో రేకస్మిన్నేవార్థే నియమః. గుణదోషార్థం వా నియమః. నియామకం శాస్త్రం. స తయోర్భేదమేవ బాధతే.(16)

తా:- ఈ గుణదోష విభాగము వాస్తవము కాదనుచున్నారు. ఒకప్పుడు గుణము సైతము దోషమగును. ఆపత్సమయమందు ప్రతిగ్రహము గుణమైనను ఆపదలేనప్పుడు నిషిద్ధమగుటచే దోషమగుచున్నది. పరధర్మము కూడా పరునకు గుణమైనను తనకు దోషమగుచున్నది. ఒకప్పుడు దోషము సైతము విధిబలమున గుణమే యగును. "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్". ఏ దినము విరక్తి కలుగునో ఆ దినమే సన్యసింపవలెను. అని శృతి అర్థము. విరక్తునికి కుటుంబత్యాగము గుణమైననూ, అవిరక్తునికి దోషమగుచున్నది. ఋతుకాలమందు భార్యను పొందవలెననెడి నియమము గుణదోషముల కొరకైన నియమము. ఆ గుణదోషముల భేదమునే బాధించుచున్నది. (16)

17శ్లో॥ సమానకర్మాచరణం పతితానాం న పాతకమ్ ।
ఔత్పత్తికో గుణః సంగో నశయానః పతత్యధః ॥

టీ:- దోషస్య క్వచిద్దోషత్వాభావే గుణత్వేచోదాహరణం దర్శయతి- సమానేతి. సమానస్య తస్యైవ కర్మణః సురాపానాదేరాచరణం. అపతితానాం పతనహేతురపి జాత్యా కర్మణా వా పతితానాం పునః పాతకం అధికారభ్రంశకం న భవతి. పూర్వమేవపతితత్వాత్. అతోఽత్ర

తా:- దోషమునకు ఒకప్పుడు దోషత్వము లేకపోవుటకు గుణత్వము లభించుటకు ఉదాహరణమును తెల్పుతున్నాడు. సమానమైన కర్మ ఆచరించుటనగా సురాపానాదికము యొక్క ఆచరణము అపతితులకు పతన హేతువైనను, జాతి కర్మలచే పతితులయిన వారికి పాతకము కాదు. అధికారభ్రంశము కాదు. పూర్వమే పతితులయినందున, అందువలన ఇది దోషమయ్యీ ఇందు దోషత్వము లేదని యర్థము. ఆ ప్రకారము సంగమము యతికి దోషమైనను, గృహస్థునికి పూర్వ

దోషస్యాపి దోషతానాస్తీత్యర్థః. తథా సంగోఽపియో యతేర్దోషః. గృహస్థస్యోత్పత్తికః పూర్వస్వీకృతః న దోషః అపి తు గుణః "ఋతౌ భార్యాముపేయాది" త్యాదివాధానాత్ ఉభయత్ర దృష్టాంతః. పూర్వమే వాధశ్మయానో యథా న పతతీతి. (17)

స్వీకృతమైనది గుణమగుచున్నది. పూర్వమే నేలపైన బడుకొన్నవాడు క్రిందబడడు గదా.(17)

18శ్లో॥ యతోయతో నివర్తేత విముచ్యేత తతస్తతః ।
ఏష ధర్మో నృణాం క్షేమః శోకమోహ భయాపహః ॥

టీ:- అతో గుణదోషనియమ విధీనాం ప్రవృత్తి సంకోచ ద్వారా నివృత్తావేవ తాత్పర్యమిత్యభిప్రేత్యాహ- యత ఇతి.(18)

తా:- అందువలన గుణదోష నియమ విధులకు ప్రవృత్తి సంకోచము ద్వారా నివృత్తి యందే తాత్పర్యమని అంగీకరించి చెప్పుచున్నారు. ఏ యే వాని వలన నివృత్తి పొందుచున్నాడో ఆ యా వాని వలన విముక్తి చెందుచున్నాడు. నరులకు ఈ శోకమోహములను భయమును పోగొట్టునట్టి ఈ ధర్మము క్షేమంకరమయినది. (18)

19శ్లో॥ విషయేషు గుణాధ్యానాత్పుంసః సంగస్తతో భవేత్ ।
సంగాత్తత్ర భవేత్కామః కామాదేవ కలిర్నృణామ్ ॥

టీ:- యథా శ్రుత ప్రవృత్తి పరతాం వేదస్య నిరాకర్తుం ప్రవృత్తి మార్గస్యానర్థహేతుతాం దర్శయతి- చతుర్భిః. విషయేష్వితి. ప్రథమం విషయేషు గుణధ్యానాత్ రమణీయతాబుద్ధిః. తతస్తేషు సంగ ఆసక్తిః తత్ర తేషు విషయేషు యేన ప్రతిహన్యతే సకామస్తేన సహ కామాదేవ కలిః కలహోవివాదః. (19)

తా:- వేదమునకు యథాశృతమయిన ప్రవృత్తిపరతను నిరాకరించుటకు. ప్రవృత్తి మార్గమునకు అనర్థహేతుతను చూపుచున్నాడు. విషయేషు అని నాల్గుశ్లోకములచే. పురుషునికి ఇంద్రియ భోగములందు గుణ ధ్యానము వలన ఆ విషయముల యందు ఆసక్తి, వానిచే కలియుట వలన కామము కలగును. కామమువలననే దానితో కూడిన కలి కలహము కలుగుచున్నది. (19)

20శ్లో॥ కలేర్దుర్విషహః క్రోధస్తమస్తమనువర్తతే ।
తపసాగ్రస్య తే పుంసశ్చేతనా వ్యాపినీ ద్రుతమ్ ॥

టీ:- కలేరితి. దుర్విషమాహస్తీవ్రః క్రోధః. తం క్రోధమనుతమః సంమోహః తేన తమసా. చేతనా. కార్యకార్యస్మృతిః. ద్రుతం శీఘ్రం.(20

తా:- కలహమువలన సహింపరాని తీవ్రమైన క్రోధము, ఆ క్రోధమును సమ్మోహము అనువర్తించును. ఆ సమ్మోహముచే శీఘ్రముగా వ్యాపించు పురుషుని కార్యకార్యస్మృతి (బుద్ధి) మ్రింగవేయబడును. (20)

21శ్లో॥ తయా విరహితః సాధో జంతుః శూన్యాయ కల్పతే ।
తతోఽస్య స్వార్థ విభ్రంశో మూర్ఛితస్య మృతస్య చ ॥

టీ:- తయేతి. శూన్యాయ కల్పతే అసత్తుల్యోభవతీత్యర్థః. స్వార్థ విభ్రంశః పురుషార్థహానిః మూర్ఛితస్య మృతతుల్యస్య. (21)

తా:- సాధో ! ఆ కార్యాకార్యస్మృతిచే హీనుడై ప్రాణి, ప్రాణములేని వానికి సమమగును. అందువలన మూర్ఛపొందినవానికి చనిపోయిన వానికి వీనికి పురుషార్థహాని కలుగును. (21)

22శ్లో॥ విషయాభి నివేశేన నాత్మానం వేదనా పరమ్ ।
వృక్షజీవికయా జీవన్ వ్యర్థం భస్త్రేవ యః శ్వసన్ ॥

టీ:- తత్తుల్యత్వం ప్రపంచయతి విషయేతి. వ్యర్థం వృక్షజీవక యైవ యో జీవన్వర్తతే. స మూర్ఛితతుల్యః అత ఏవ యో భస్త్రేవశ్వసన్ వర్తతే స మృతతుల్యః అతః స్వార్థనాశ ఇత్యర్థః. (22)

తా:- మూర్ఛితునితో, మృతునితో సమానత్వమును ప్రవంచించు చున్నారు. ఎవడు భోగములందు లగ్న మనస్కుడై తననెరుగడో ఇతర మెరుగడో వ్యర్థమగు వృక్షము వలె జీవించుచున్నాడో, వాడు మూర్ఛిత తుల్యుడు తిత్తివలె గాలి పీల్చుకొనుచూ విడుచుచూ వాడు మృత తుల్యుడగును అందువలన స్వార్థనాశము కల్గును. (22)

23శ్లో॥ ఫలశృతిరియం నృణాం న శ్రేయోరోచనం పరమ్ ।
శ్రేయో వివక్షయా ప్రోక్తం యథా భైషజ్య రోచనమ్ ॥

టీ:- నను ప్రవృత్తస్య స్వర్గాదిఫలశ్రవణాత్కుతః స్వార్థవిభ్రంశస్తత్రాహ- ఫలశ్రుతిరితి. ఇయం ఫలశ్రుతిః, న శ్రేయః పరమ పురుషార్థ పరా న భవతీత్యర్థః. కింతు బహిర్ముఖానాం నృణాం మోక్షవివక్షయా అవాంతరఫలైః. కర్మసురుచ్యుత్పాదనమాత్రం యథా భైషజ్యే ఔషధే రోచనం రుచ్యుత్పాదనం ఖండలడ్డు కాది. తథాహి. శ్లో. పిబ నింబం ప్రదాస్యామి ఖలు తే ఖండలడ్డుకాన్, పిత్రైవ ముక్తః పిబతి సఫలం తావదేవ తు. (23)

తా:- ప్రవృత్తి మార్గమున ప్రవర్తించు వానికి స్వర్గాది ఫలము కలుగునని వేదశ్రవణమున తెలియుటవలన స్వార్థవిభ్రంశమెట్లు కలుగుననగా అందులకు చెప్పుచున్నాడు. శ్రుతుల వలన విననైన ఈ ఫలశ్రవణము పరమ పురుషార్థపరము కాదు. కాని బహిర్ముఖులగు నరులకు కేవలము గుడ జిహ్వికా న్యాయముచే మోక్షసాధనములందు అభిరుచిని మాత్రము కలిగించును. మోక్షము వచింపగోరుచు ఏ ప్రకారము ఔషధమందు రుచిని కల్గించు ఖ్యాద్య లడ్డు కాదిక మెట్లో, "పిబ నింబం ప్రదాస్యామి ఖలుతే ఖండలడ్డుకాన్. పిత్రైవముక్తః పిబతి న ఫలం తావదేవ తు" వేపాకు రసము త్రాగుము నీకు కలకండ లడ్డూల నిచ్చెదను అని తండ్రి చెప్పగా పుత్రుడు త్రాగి ఫలము నెట్లు పొందుచున్నాడో అట్లే కర్మలయందురుచినుత్పాదించుటకై పైన చెప్పిన మాటలు చెప్పబడినవి. (తథా మాతృ వాక్యం చ "శిఖాతే వర్షతే వత్స గుడాచీం శ్రద్ధయాపిబ" ఇతి. అట్లే తల్లి వాక్యము కూడా, ఓ వత్సా! గుడూచీని శ్రద్ధగా త్రాగుము నీ వెంట్రుకలు పెరుగును అని ఒక ఫలమే కాదు ఆరోగ్యము కూడా) (23)

24శ్లో॥ ఉత్పత్త్యైవ హి కామేషు ప్రాణేషు స్వజనేషు చ ।
ఆసక్తమనసో మర్త్యా ఆత్మనోఽనర్థహేతుషు ॥

తా:- కర్మకాండయందు మోక్షము యొక్క నామము సైతము విన్పించుటలేదు. ఏల ఈ ప్రకారము వ్యాఖ్యానించుట? వినినట్టుగా జరుగుట లేదు కదా? అని రెండు శ్లోకములచే చెప్పుచున్నారు.

టీ:- నను కర్మకాండే మోక్షస్యనామాపి న శ్రూయతే కుత ఏవం వ్యాఖ్యాయతే. యథా శ్రుతస్య ఘటనాదిత్యాహ ద్వాభ్యాం. ఉత్పత్త్యేతి. ఉత్పత్త్యా స్వభావత ఏవ కామేషు పశ్వాదిషు. ప్రాణేషు ఆయురింద్రియ బల వీర్యాదిషు పుత్రాదిషు అనర్థహేతుషు పరిపాకతో దుఃఖహేతుషు. (24)

స్వభావముగానే మానవులు తమకు కీడును కలిగించు కారణములగు కామ సుఖములందు ఆయురింద్రియబల శౌర్యాదులందు పుత్రాదు లందు ఆసక్తమైన మనస్సుగల వారగుదురు. (24)

25శ్లో॥ నతా న విదుషః స్వార్థం భ్రామ్యతో వృజినాధ్వని ।
కథం యుంజ్యాత్ పునస్తేషు తాంస్తమో విశతో బుధః ॥

టీ:- అతః నతానితి. స్వార్థం పరమసుఖం అవిదుషః. అతో నతాన్ ప్రహ్వీభూతాన్. వేదో యద్బోధయిష్యతి తదేవ శ్రేయ ఇతి. విశ్వసితా త్యర్థః. తానేవం భూతాన్. వృజినాధ్వని కామవర్త్మని దేవాది యోనిషు భ్రామ్యతః. అతః పునః తమః వృక్షాది యోనిం విశతః పశుకామ ఇతి ఆయురింద్రియాదికామ ఇతి చ పుత్రాదికామ ఇతి చ కథం పునస్తేష్వేవ కామేషు స్వయం బుధో వేదో యుంజ్యాత్. ప్రవర్తయేత్. తథా సతి అనాప్తస్యాదితి భావః. (25)

తా:- పరమ సుఖమును ఎరుగని వారైన, నమ్రులయిన వేదమేది చెప్పునో అదే శ్రేయస్సు నిచ్చునదని విశ్వసించువారిని అని అర్థము. అట్టి వారిని పాపమగు కామ మార్గమందు దేవ యోనులందు భ్రమిం చుచు వృక్షాది యోనిని పొందుచున్న వారిని మరల పశుకాముడు, ఆయురింద్రియ కాముడు, పుత్రకాముడు అని ఆ కామములందే స్వయము జ్ఞానము గల వేదము ఎట్లు ప్రవర్తింపజేయును అట్లయినచో అనాప్తమగునని భావము. (25)

26శ్లో॥ ఏవం వ్యవసితం కేచిదవిజ్ఞాయ కుబుద్ధయః ।
ఫలశృతిం కుసుమితాం న వేదజ్ఞా వదంతి హి ॥

తా:- అట్లయిన కర్మ మీమాంసకులు వేదమును కర్మఫల పరముగా తలంతురు, అనగా అందుకు చెప్పుచున్నారు. ఈ ప్రకారము

జనోజీవః. స్వప్నే బహూన్ ఆసతోజనాన్ దేహాన్‌కుర్వన్ పశ్యన్ బహురూపోభాతితద్వత్. యద్వా ఇదం త్రైవిధ్యం అధ్యాత్మాదిరూపం భాతి. అసజ్జన కృత్ దుష్పుత్రోత్పాదకః జనః పితా. స్వయం సమోఽపి పుత్రాభిమానతస్తదరిమిత్రాదిషు యథా ఛేద హేతుర్భవతి తద్వదితి. అన్యత్సమానం. 41

శ్లో॥ నిత్యదాహ్యంగ భూతాని భవంతి న భవంతి చ ।
కాలేనాలక్ష్యవేగేన సూక్ష్మత్వాత్తన్న దృశ్యతే ॥ 42

టీ:- తదేవం లోక ప్రసిద్ధౌ జన్మమృత్యూ నిరూప్య సూక్ష్మావపృష్టావపి తౌ వైరాగ్యాయ నిరూపయతి-నిత్యదేతి. నిత్యదా ప్రతిక్షణం. భూతాని శరీరాణి. ఉత్పద్యంతే నశ్యంతి చ. కాలస్యాతిసూక్ష్మత్వాత్తత్కృతం భవన భవనం వా అవివేకిభిర్న లక్ష్యతే. 42

శ్లో॥ యథార్చిషాం స్రోతసాం చ ఫలానాం వా వనస్పతేః ।
తథైవ సర్వభూతానాం వయోవస్థాదయః కృతాః ॥ 43

టీ:- సతోర్జన్మ మరణయోరజ్ఞానే కారణమేతద్భవేత్. సత్త్వ మేవ తయోః కుత ఇత్యాశంక్యానుమానేన తత్సాధయతి-యథేతి. అర్చిషాం

ప్రీతిచే వాని శత్రువులందు భేదకారణుడై యుండునట్లు దేహాభిమానమున ఇట్లగును. 41

ఈ ప్రకారము లోక ప్రసిద్ధములైన జన్మ మృత్యువులను నిరూపించి ప్రశ్నించినవి. కాని వైననూ సూక్ష్మములైన వానిని వైరాగ్యమునకై నిరూపించుచున్నారు.

ఓ ఉద్ధవా! కానరాని వేగమున ప్రతిక్షణము శరీరములు పుట్టుచున్నవి, నశించుచున్నవి. కాలము చాలా సూక్ష్మమగుటచే దానిచే నగు జన్మమృత్యువులు అవివేకులకు తెలియరాదు. 42

జననమరణములున్నచో వానిని తెలియకపోవుటకు కారణమిది యగుగాక, ఈ జన్మమరణములకు సత్త యెట్లు అని ఆశంకించి అనుమానముచే దానిని సాధించుచున్నారు. దీపజ్వాలలకు పరిణామాదులచే, ప్రవాహములకు గతులచేత ఆమ్రాది వృక్షముల యొక్క పండ్లకు రూపాదులచే ఏ ప్రకారము అవస్థా విశేషములు

పరిణామాదిభిః స్రోతసాం గత్యాదిభిః. ఫలానాం రూపాదిభిః. యథా అవస్థావిశేషాః కృతాః కాలేనేతి పూర్వస్యానుషంగః. ఆదిశబ్దేన తేజో బలకౌశలాదీనా ముపాదానం. విమతం ప్రతిక్షణోత్పత్తి వినాశవత్ అవస్థాభేదాస్పదత్వాత్ దీప జ్వాలాదివదిత్యనుమానం. 43

శ్లో॥ సోఽయం దీపోఽర్చిషాం యద్వత్స్రోతసాం తదిదం జలమ్
సోఽయం పుమానితి నృణాం మృషాగీర్ధీర్మృషాయుషామ్ ॥ 44

టీ:- కథం తర్హి ప్రత్యభిజ్ఞా తద్వదేవ సాదృశ్యావలంబినీత్యాహ-స ఇతి. సాదృశ్యాదర్చిషామేవ యథా సోఽయం దీప ఇతి ప్రత్యభిజ్ఞా యథా చ స్రోతసాం ప్రవాహజలనామేవ తదితం జలమితి తథా సోఽయం పుమానితి గీర్ధీశ్చ మృషా. నృణాం బహూనాం శరీరిణాం. మృషా వ్యర్థమేవాయుర్యేషాం తేషా మవివేకినాం భవతి. 44

శ్లో॥ మాస్యస్య కర్మబీజేన జాయతే సోఽప్యజః పుమాన్ ।
మ్రియతేవామరో భ్రాంత్యా యథాగ్నిర్దారుసంయుతః ॥ 45

కాలముచే చేయబడినవో (ఆదిశబ్దముతో తేజోబలకామకౌశలాదులు గ్రాహ్యములు) ఆ ప్రకారమే ప్రతిక్షణోత్పత్తి వినాశములు గలుగుట వలన అవస్థాభేదాదుల వలన సర్వభూతములకు బాల్యాది వయస్సుల యొక్క దశలు చేయబడినవి. విమతము ప్రతిక్షణోత్పత్తి వినాశనము గలది, అవస్థాభేదము ఉండుట వలన దీపజ్వాలాదులవలె అని అనుమానము. 43

అనుక్షణము మారుచున్నచో అదియే ఇది, అతడే ఇతడని ప్రత్యభిజ్ఞా కలుగుట ఎట్లనగా చెప్పుచున్నాడు. జ్వాలల సాదృశ్యమును బట్టి ఆ దీపమే ఈ దీపమని, ప్రవాహముల సాదృశ్యమును బట్టి ఆ జలమే ఈ జలమని ఎట్లు ప్రత్యభిజ్ఞ కలుగునో అట్లే ఆ పురుషుడే ఈ పురుషుడను అనేక శరీర ధారులగు మనుష్యులయొక్క ప్రత్యభిజ్ఞా వ్యర్థముగా ఆయువు గడుపునవివేకులకు గలుగుచున్నది. 44

దేహమే నేనను అధ్యాస గల పురుషునికి కర్మజననమరణములు గలుగును. అట్లు అధ్యాసలేని వానికి కలుగవను వ్యవస్థ ఎట్లు ఘటించును? లేదని భావము. పురుష భేదముచే ఘటమునకు

టీ:- నను కథం దేహాధ్యసవతః. పుంసః కర్మజన్మ మరణాని సంతి నాన్యస్యేతి వ్యవస్థా. న హి ఘటతే. ఘటస్య పురుషభేదేన సత్త్వమసత్త్వం చేతి న అజ్ఞస్యాపి వస్తుత స్తదభావాదిత్యాహ-నేతి. నైవ స్వస్యాత్మనః కర్మణా బీజభూతేన. సోఽపి. అజ్ఞోఽపి పుమాన్ జాయతే మ్రియతే వా. కింతు అయం భ్రాంత్యాః. అజన్మాపి జాయత ఇవ అమరోఽపి మ్రియత ఇవ. యథా మహాభూత తేజోరూపోగ్నినా కల్పాంతమ వస్థితోఽపి దారుయోగ వియోగాభ్యాం జన్మనాశౌ ప్రాప్నోతి తద్వత్. 45

శ్లో॥ నిషేకగర్భజన్మాని బాల్యకౌమారయౌవనమ్ ।
వయోమధ్యం జరామృత్యురిత్యవస్థాస్తనోర్నవ ॥ 46

టీ:- సిద్ధవత్కృత్యోక్తాః వయోవస్థాః ప్రపంచయతి-నిషేకేతి. నిషేకో జఠరేప్రవేశః. గర్భస్తన్మధ్యే వృద్ధిః. బాల్య ఆపంచమాబ్దాత్. కౌమారం ఆషోడశవర్షాత్. తతో యౌవనమాచత్వారింశతః. తతో వయో మధ్యం. ఆషష్టివర్షాత్. 46

శ్లో॥ ఏతా మనోరథమయీర్హ్యన్యస్యోచ్చావచా స్తనూః ।
గుణసంగాదుపాదత్తే క్వచిత్కశ్చిజ్జహాతి హ ॥ 47

సత్వాసత్వములు కలుగవుగదా! అజ్ఞునికి సైతము వాస్తవమునకవి లేవని భావము చెప్పుచున్నారు.

బీజతుల్యమైన స్వకర్మచే అజ్ఞుడైన పురుషుడుసైతము నిజముగా జనించుట లేదు. మరణించుటయును లేదు. అయినను తాను పుట్టుక లేనివాడయ్యు, పుట్టినవాని వలె, మరణము లేనివాడయ్యు మరణించు వాని వలె, ఏ విధముగా మహాభూతమే తేజోరూపమై ఆ కల్పాంతము నుండు అగ్నిధారు సంయోగమున జ్వలించి వియోగమున నశించు చుండునో అట్లే జన్మ నాశనములను భ్రాంతిచే పొందుచున్నారు. 45

సిద్ధముగానున్నట్లు గావించి చెప్పిన యవస్థలను ప్రవచించు చున్నాడు. గర్భప్రవేశము, గర్భమార్గమున వృద్ధి, జన్మవరకు బాల్యము; (ఐదేండ్ల వయస్సు) కౌమారము (పదహారేండ్ల వయస్సు) యౌవనము (నలబది ఏండ్ల వయస్సు) నడిమి వయస్సు (అరువది ఏండ్ల వయస్సు) జరమృత్యువులని శరీరమునకు తొమ్మిది అవస్థలు. 46

దేహసంబంధము వలన జన్మమరణాదులు కలుగునని ఉపపాదితమైన అర్థమునుపసంహరించుచున్నాడు.

టీ:- దేహసంబంధా జన్మమరణాదీనీత్యుపపాదితమర్థముపసంహరితి - ఏతా ఇతి. హి స్ఫుటం. అన్యస్య సంబంధనీః ఏతాః మనోరథ మయీః తనూః అవస్థాః గుణసంగాత్ ప్రకృత్య వివేకాత్. కశ్చిదుపాదత్తే పరమేశ్వరానుగృహీతః కశ్చిజ్జహాతి. కథం జహాతి. నహ్యవస్థావతో దేహస్య ద్రష్టా తదవస్థావానితి వివేకజ్ఞానేన. 47

శ్లో॥ ఆత్మనః పితృపుత్రాభ్యామనుమేయౌ భవాప్యయౌ ।
నభవాప్యయవస్తూనామభిజ్ఞోద్వయ లక్షణః ॥ 48

టీ:- నను తదానీం మూర్తిమత్వేన జన్మమరణవాన్ దేహో న దృశ్యతే తత్రాహ-ఆత్మన ఇతి. పితృదేహస్యౌర్ధ్వదైహికం కుర్వతాప్యయ దర్శనాత్. పుత్రదేహస్య చ జాతకర్మణి జన్మదర్శనాత్ ఆత్మనః స్వదేహస్యాపి భవాప్య యావనుమేయౌ. ఏవం చ దృశ్యత్వే సతి భవాప్యయవతాం వస్తూనాం దేహానామజ్ఞో ద్రష్టాద్వయలక్షణో భవాప్యయధర్మకో న భవతి. 48

శ్లో॥ తరోర్బీజవిపాకాభ్యాం యో విద్వాన్ జన్మసంయమౌ ।
తరోర్విలక్షణో దృష్ట ఏవం ద్రష్టా తనోః పృథక్ ॥ 49

టీ:- ఏతదేవ దృష్టాంతేన స్పష్టయతి-తరోరితి. తరుశబ్దేనోద్భిజ్జమాత్రో

ఇతరమగు దేహసంబంధములగు ఈ మత్ సంకల్ప క్రియల వల్లనైన వివిధములగు నిషేకాద్యవస్థలను త్రిగుణ ప్రకృతిని తెలియ నందును ఒకానొకడు గ్రహించును. పరమేశ్వరానుగ్రహము పొందిన వాడు అవస్థలుగల దేహమునకు దృష్టను నేను ఈ అవస్థలు గలవాడను గానని ఆయా వస్థలను పొందకున్నాడు. 47

అట్లగుచో మూర్తిమంతమగుటచే జన్మమరణ వర్తితమగు దేహము కనబడదు గదా అనగా అందులకు చెప్పుచున్నాడు.

తండ్రికి పితృకర్మ చేయుచున్నప్పుడు మరణమును, పుత్రుని జాతకర్మ యందు జన్మమును తెలుసుకొన్నవాడై తన జన్మమరణముల నట్లే అనుమానముచే ఊహించి జన్మ మరణములుకల దేహములకు ద్రష్టయైన వాడు జన్మమరణ ధర్మముగల వాడుకాడు. 48

ఈ విషయమునే దృష్టాంతముచే ప్రవచించుచున్నాడు. ఫల పాకాంతములైన వ్రీహ్యాదులకు అని అర్థము. విత్తనమునుండి జన్మించుట పరిణామమున ఫలించి నశించుట కలదు. ఆ వ్రీహ్యాది కమునకు వేరుగా ద్రష్ట ఎట్లుండునో అట్లే దేహ తరువునందు ఆత్మ

పలక్షణం. ఫలపాకాంతస్య వ్రీహ్యాదేత్యర్థః. యద్వా. తరోరేవాంత్యః. పరిణామో విపాకః. బీజాజ్జన్మ. విపాకాత్సంయమం నాశం చ విద్వాన్ తరోర్జన్మ వినాశయోః ద్రష్టా. యథా న తద్వాన్ ఏవం దేహే వర్తమానోఽపి ఆత్మాతద్భవాప్యయాభ్యాం న సంబంధ్యతే. 49

శ్లో॥ ప్రకృతేరేవమాత్మాన మవివిచ్యాబుధః పుమాన్ ।
తత్త్వేన స్పర్శసంమూఢస్సంసారం ప్రతిపద్యతే ॥ 50

టీ:- అవివేకినః సంసారం ప్రపంచయతి–పంచభిః ప్రకృతేరితి. తత్త్వే నతత్త్వతః. అవివిచ్య. తత్త్వదృష్ట్యా స్పర్శేషు విషయేషు సంమూఢ ఇతి వా. 50

శ్లో॥ సత్త్వసంగాదృషీన్ దేవాన్ రజసా సురమానుషాన్ ।
తమసా భూతతిర్యక్త్వం భ్రామితో యాతి కర్మభిః ॥ 51

టీ:- గుణభేదేన త్రివిధం. తత్రాపి తత్తత్తారతమ్యేనైకైకత్ర ద్వివిధం సంసారమాహ–సత్త్వేతి. 51

దేహమునకు వేరై, సాక్షియై దేహముయొక్క జన్మనాశనములను పొందదు. (అనగా దేహమునందుండు ఆత్మ ఆ జన్మ నాశనములను పొందదని అర్థము). 49

అవివేకి సంసారమును ఐదు శ్లోకములచే ప్రవచించుచున్నాడు. ఈ ప్రకారము ప్రకృతి కార్యమగు దేహము తన్ను వేరుగానెంచక అజ్ఞుడగునరుడు సత్యదృష్టిచే విషయములందు మూఢుడై సంసారమును పొందుచున్నాడు. ఇట్లు ప్రకృతి కార్యమగు దేహమునుండి తాను వేరని తత్త్వమార్గమును తెలియని పురుషుడు విషయభోగములు సత్యములని నమ్మి వానియందు తగిలి మూఢుడై సంసారమును పొందుచున్నాడు. 50

గుణభేదముచే త్రివిధమును అందు దాని తాత్పర్యముచే ఒక్కొక్కదానియందు ద్వివిధమునగు సంసారమును (ఋషిదేవాది యోన్యాత్మకమైన) చెప్పుచున్నాడు. సత్యగుణసంగముచే ఋషులు, దేవతలును; రజస్సంగములవలన అసురమానుష జన్మములును; తమస్సంగముల వలన భూతములు, పశుపక్ష్యాదులు మొదలగు వానిజన్మమును కర్మలచే తిరుగువాడు పొందుచున్నాడు. 51

శ్లో॥ నృత్యతో గాయతః పశ్యన్ యథైవానుకరోతితాన్ ।
ఏవం బుద్ధిగుణాన్ పశ్యన్ననీహోఽ ప్యనుకార్యతే ॥ 52

టీ:- నన్వకర్తురాత్మనః కుతః కర్మభిః భ్రమణం?తత్రాహ-నృత్యత ఇతి. నృత్యతో గాయతో జనాన్ జనః పశ్యన్అనుకరోతి. తద్గతస్వర తాళాది గతిం శృంగార కరుణారసం చ మనస్యనువర్తయతీత్యర్థః అనుకార్యతే గుణైః బలాదిత్యర్థ. అనేన దృష్టాంతేన దృశ్య ధర్మో ద్రష్టరి స్ఫురతీతి దర్శితం. 52

అయ్యా! అకర్తయగు ఆత్మకు కర్మలచే భ్రమణ మెట్లనుననగా చెప్పుచున్నాడు.

నృత్యముచేయు వానిని, గానముచేయు వానిని చూచుజనము ఏ ప్రకారము వారి పద, స్వర, తాళాది గతిని; శృంగారాది రసమును; మనస్సునందనుకరించుచున్నారో; ఆ ప్రకారము బుద్ధియందు కనబడు సత్వాది గుణములను చూచుచూ కోరిక లేనివాడు అయినను ఆ గుణముల బలాత్కారమన వానిననుకరించుచున్నాడు. దీనిని బట్టి దృశ్యధర్మము ద్రష్టయందు స్ఫురించుచున్నదని తెలుపబడినది. 52

శ్లో॥ యథాంభసా ప్రచలతా తరవోఽపి చలాఇవ ।
చక్షుషా భ్రామ్యమాణేన దృశ్యతే భ్రామ్యతీవ భూః ॥ 53

టీ:- ఉపాధిధర్మాశ్చోపహితేఅవభాసంతఇత్యత్రదృష్టాంతమాహ-యథేతి.తీరస్థాఃతరవోధావంతఇవయథాదృశ్యంతే.జలే ప్రతిబింబి తావా చంచలా ఇవేతి. విషయగ్రాహకేణ మనసా పరికల్పితా ఏవ తేషు లావణ్యాదయో గుణాః న వస్తుతః సంతి అతో మనోనిబంధన ఏవాయం సంసార ఇత్యభిప్రేత్య గ్రాహక గుణా గ్రాహ్యేఽవభాసంత ఇత్యత్ర దృష్టాంత మాహ - చక్షుషేతి. 53

ఉపాధి ధర్మములు ఉపహితమునందు భాసించుననుదానికి దృష్టాంతమును చెప్పుచున్నాడు.

ఏ ప్రకారము కదులుచున్న జలముచే తీరమునందున్న తరువులు జలమునందు ప్రతిబింబించి చలించుచున్నట్టు కన్పడునో, తన చుట్టూ తాను తిరుగువాని కంటికి భూతములు తిరుగుతున్నట్టు కనబడుచున్నవో, అట్లే శబ్దాది విషయముల నింద్రియములద్వారా గ్రహించిన మనస్సుచే లావణ్యాదులగు గుణములు కల్పించి నవేయగును గానీ వాస్తవమునకు లేవు. అందువలన నీ సంసార మహా నిబంధనకు అంగీకరించి గ్రాహక గుణములు గ్రాహ్యమునందవ భాసించుచున్న దానికి చక్షుదృష్టాంతమును చెప్పెను. 53

శ్లో॥ యథా మనోరథధియో విషయానుభవో మృషా ।
స్వప్నదృష్టాశ్చ దాశార్హ తథాసంసార ఆత్మనః ॥ 54

టీ:- భోగస్యాపి మిథ్యాత్వే దృష్టాంతద్వయమాహ-యథేతి. యథా ఏతాః ప్రసిద్ధాః మనోరథధియః స్వప్నదృష్టాశ్చ యథా మృషా. ఏవమాత్మనో విషయానుభవః సంసారో మృషా. 54

భోగమునకు మిథ్యాత్వమునందు దృష్టాంతద్వయము చెప్పుచున్నారు. (భోగము మిథ్య అను దానికి)

స్వప్నమున చూడబడిన వస్తువులును ఎట్లు మిథ్యయగునో అట్లే మనస్సంకల్పముచే తోచు లావణ్యాది గుణ విషయములు, విషయభోగ రూపమైన సంసారము గూడా మిథ్యయగుచున్నది. 54

శ్లో॥ అర్థేహ్యవిద్యమానేఽపిసంసృతిర్న నివర్తతే ।
ధ్యాయతోవిషయానస్య స్వప్నేఽనర్థాగమో యథా ॥ 55

టీ:- నను యది మృషా తర్హి కిం తన్నివృత్తి శ్రమేణ-తత్రాహ-అర్థ ఇతి. అస్యాత్మనః. 55

అట్లు సంసారము మిథ్యయైన ఎడల దాని నివృత్తికై శ్రమఏల అనగా అందులకు చెప్పుచున్నాడు.

శబ్దాది విషయములను లేదా విషయభోగములను ధ్యానించు చుండుటవలన దృశ్యమగు దేహాది సంఘాతము వాస్తవముగా లేకున్నను సంసారము స్వప్నమునందు అనర్థాగమమువలె (కీడు వచ్చుట వలె) నివర్తించదు. 55

శ్లో॥ తస్మాదుద్ధవ మాభుంక్ష్వ విషయాన సదింద్రియైః ।
ఆత్మా గ్రహణనిర్భాతం పశ్యన్ వైకల్పికం భ్రమమ్ ॥ 56

టీ:- తతో భోగోద్యమో న కర్తవ్య ఇత్యాహ-తస్మాదితి. 56

అందువలన భోగోద్యమము కర్తవ్యము కాదనుచున్నాడు. అందువలన ఓ ఉద్ధవా! పరమాత్మనెరుంగక పోవుటచే వెలుగుచున్నదై, భేదకల్పితమైన భ్రాంతి జగమును చూచుచున్నను మిథ్యాభూతములైన ఇంద్రియములద్వార విషయ భోగములను అనుభవింపకుము. 56

శ్లో॥ క్షిప్తోఽవమానితో సద్భిః ప్రలబ్ధోఽసూయితోఽథవా ।
తాడితసన్నిరుద్ధో వా వృత్త్యా వా పరిహారితః ॥ 57

టీ:- దుఃఖ ప్రతికారోద్యమమపి పరిత్యజ్య పరమేశ్వరనిష్ఠైనైవ భావ్య మిత్యాహ-ద్వాభ్యాం. క్షిప్త ఇతి. క్షిప్తః ఆక్షిప్తః నున్న ఇతివా. ప్రలబ్ధః అపసంహితః. 57

దుఃఖప్రతీకారోద్యమమును సైతము పరిత్యజించి, పరమేశ్వర నిష్ఠ చేతనే ప్రవర్తించవలెననుచున్నారు. దుష్టులు తనను తోసివేసినను, అవమానించినను, పరిహసించినను, అసూయపడినను లేక కొట్టినను, కట్టివేసినను, జీవనమునుండి తొలగింపబడినవాడైనను...57

శ్లో॥ నిష్ఠితో మూత్రితో వాజ్ఞైర్బహుధైవం ప్రకంపితః ।
శ్రేయస్కామః కృచ్ఛ్రగత ఆత్మనాత్మాన ముద్ధరేత్ ॥ 58

టీ:- నిష్ఠిత ఇతి. నిష్ఠితః నిష్ఠీవన విషయాకృతః. మూత్రితః మూత్రేణార్ద్రీకృతః ప్రకంపితః పరమేశ్వరనిష్ఠాయాః ప్రచ్యావితోఽపి. కృచ్ఛ్రగతః కష్టం ప్రాప్తోఽపి. 58

అజ్ఞానులచేత ఉమ్మివేయబడినవాడైననూ, తన పైన మూత్రము పోయబడిననూ, ఈ ప్రకారము అనేక విధములుగా పరమేశ్వర నిష్ఠ నుండి లాగబడిన వాడయ్యు శ్రేయస్సును, మోక్షమును కోరువాడు కష్టమును పొందినవాడయ్యు వివేకబుద్ధితో ఆత్మను ఉద్ధరించుకొన వలెను. 58

**ఉద్ధవ ఉవాచ**

శ్లో॥ యథైవ మను బుధ్యేయం వదనో వదతాం వర ।
సుదుస్సహమిమం మన్యఆత్మన్యదతిక్రమం ।
విదుషామపి విశ్వాత్మన్ ప్రకృతిర్హి బలీయసీ ।
ఋతే త్వద్ధర్మనిరతాన్ శాంతాంస్త్వచ్చరణాశ్రయాన్ ॥ 59

టీ:- యథేతి. ఏవం త్వదుక్తం యథా అనుబుద్ధ్యేయం తథా నః సర్వాన్ ప్రతి వద. సుదుస్సహమితి. త్వద్ధర్మనిష్ఠితాన్ ఋతే. విదుషామపి అసద్భిః కృత మతి క్రమం అపరాధం సుదుస్సహం మన్య ఇత్యన్వయః. ప్రకృతిః స్వభావః.శ్లో. నిరస్య సర్వసందేహానేకీకృత్య సుదర్శనమ్, ప్రకాశితరహస్యం తం భజామి గురుమీశర్వరమ్. 59

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**ద్వావింశోఽధ్యాయః**

**ఉద్ధవుడు ఈ విధముగా పలికెను**

చెప్పువారిలో శ్రేష్ఠుడా! నీవు చెప్పిన ఈ సంసార స్వరూపమును తన్నివృత్తి ఎట్లుండగలదో మాకు బోధింపుము. దుష్టులు తన్నుగావించు నపరాధములు నీ భక్తి, ధర్మనిష్ఠ కలిగి శాంతులై నీ పాదముల నాశ్రయించిన భక్తులకు తప్ప విద్వాంసులకు కూడా సహింప సాధ్యము కావని తలంతును. ఏలయనగా స్వభావము బలీయమైనది. 59

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**ద్వావింశోధ్యాయము సమాప్తము.**

## త్రయోవింశోఽధ్యాయః

శ్లో॥ త్రయోవింశే తిరస్కార సహనోపాయ ఈర్యతే ।
భిక్షుగీతా ప్రకారేణ మనసస్సంయమో ధియా ॥

శ్లో॥ దుర్జనో పద్రవో నూనం దుస్సహోఽపి మహీయసామ్ ।
అతశ్చతుర్భిరధ్యాయైస్సహనో పాయవర్ణనమ్ ॥

**శ్రీ శుక ఉవాచ**

శ్లో ॥ సఏవ మాశంసిత ఉద్ధవేన
భాగవతమాఖ్యేన దాశార్హ ఋషభః !
సభాజయన్ భృత్యవచో ముకుంద
స్తమాబభాషే శ్రవణీయవీర్యః ॥ 1

టీ:- తత్ర తావదస్మిన్నధ్యాయేభిక్షుగీతయా మనోవిజయః. ఉత్తరస్మిన్ ప్రకృతిపురుష వివేకః. తదుత్తరస్మిన్ గుణవృత్తివిజయః. తతః పరస్మిన్నైలగీతయా విషయసంగత్యాగేన సత్సంగ ఇతి క్రమేణోపాయా భగవతా వర్ణ్యంతే. స ఇతి. ఆశంసితః ప్రార్థితః భృత్యస్య వచః సత్కుర్వన్ తం భృత్యం ప్రత్యాబభాషే. 1

## 23వ అధ్యాయము

ఈ ఇరువది మూడవ అధ్యాయము నందు విషయభోగ తిరస్కారము, దుష్టాపరాధ సహనము భిక్షుగీత దృష్టాంతముచే చెప్ప బడినది. దుర్జనులచే అయ్యో ఉపద్రవము నిజముగా పెద్దవారికి సహింప కష్టసాధ్యము. అందువలన చెప్పబోవు నాలుగధ్యాయము లందును ఆ ఉపద్రవము సహించునుపాయము వివరించబడుచున్నది.

అందు మొదట ఈ అధ్యాయమునందు భీక్షుగీతచే మనోవిజయ మును చెప్పి తరువాతి అధ్యాయమునందు ప్రకృతి పురుషుని వివేకము, ఆ తరువాత అధ్యాయమునందు ఏల గీతద్వార విషయసంగత్యాగముచే సత్సంగము అను నుపాయములు క్రమముగా భగవంతునిచే వర్ణింపబడినవి. (ప్రార్థించిన భృత్యుని వాక్కును సత్కరిస్తూ భృత్యుని గురించి మాట్లాడెను)

**శ్రీశుకుడు ఈ విధముగా అనుచున్నాడు.**

భాగవతోత్తముడగు ఉద్ధవుడు ఇట్లు ప్రార్థించినంత దాశార్హ వంశీయులలో శ్రేష్ఠుడు, శ్రోతవ్య ప్రభావముగల కృష్ణుడాభక్తుని వచనములను గౌరవించుచు అతనిని గూర్చి ఇట్లు మాట్లాడెను. 1

**శ్రీ భగవానువాచ**

శ్లో ॥ బార్హస్పత్య సనహ్యాత్ర సాధుర్వై దుర్జనేరితైః ।
దురుక్తైర్భిన్నమాత్మానం యస్సమాధాతుమీశ్వరః ॥ 2

టీ:- తత్ర తావదంగీకారతస్తద్వచః సంపూజయతి-ద్వాభ్యాం. బార్హస్పత్యేతి. హే బార్హస్పత్య బృహస్పతే శ్శిష్య. అత్రలోకే. ససాధుర్నాస్తి. యో దుర్జనోక్తిభిః భిన్నం క్షుభితం ఆత్మానం మనః. శమయితుం ఈశ్వరస్సమర్థస్స్యాత్. 2

**శ్రీభగవానుడు అనుచున్నాడు**

అప్పుడు అంగీకరించుచూ, ఆ వాక్కులను రెండు శ్లోకములచే గౌరవించుచున్నాడు. ఓ బృహస్పతి శిష్యా! ఈ లోకమునందు దుష్టులు పలికెడి దూషణ వాక్యములచే క్షోభనొందిన మనస్సును శాంతపరచు కొనుటకు సమర్థుడైన సాధుపురుషుడు లేడు. 2

శ్లో ॥ న తథా తప్యతే విద్ధః పుమాన్ బాణైరజిహ్మగైః ।
యథా తుదంతి మర్మస్థాహ్యసతాం పరుషేషవః ॥ 3

టీ:- కుత ఇత్యత ఆహ-నేతి. యథా మర్మస్థా మర్మస్వేవ నిత్యం స్థితాః పురుషోక్తిరూపా ఇషవః. తుదంతి వ్యథయంతి తథా ఇతరే బాణాః న తుదంతి. అతస్తై స్తథా న తప్యత ఇత్యర్థః. 3

ఎందువలన అనగా చెప్పుచున్నాడు. దుష్టుల కఠినోక్తులను బాణములు మర్మస్థానమున గుచ్చుకొని నరుడెట్లు బాధచెందునో, అట్లు పదునైనబాణములచే గ్రుచ్చబడియూ పురుషుడు తాపము నొందడు. 3

శ్లో ॥ కథయంతి మహత్పుణ్యమితిహాసమిహోద్ధవ ।
తమహం వర్ణయిష్యామి నిబోధ సుసమాహితః ॥ 4

అట్లయిననూ నాచే చెప్పబడబోవు ఉపాయములచే సమస్తమును సహింపశక్యమగునను. అభిప్రాయముచే ఇతిహాసములను ప్రస్థావించుచున్నాడు.

ఓ ఉద్ధవా! ఈ విషయమై పెద్దలు ఒక గొప్ప పూర్వకథను చెప్పెదరు. దానిని నీకు చెప్పెదను. నిశ్చల మనస్కుడవై వినుము. 4

శ్లో ॥ కేనచిద్భిక్షుణా గీతం పరిభూతేన దుర్జనైః ।
స్మరతా ధృతియుక్తేన విపాకం నిజకర్మణామ్ ॥ 5

టీ:- తథాపి మయావక్ష్యమాణైరుపాయైః సర్వం సోఢుం శక్యత ఇత్యభిప్రాయేణేతిహాసం ప్రస్తౌతి-కథయంతీతి. మహద్యథా భవతి తథా. పుణ్యమితిహాసం గాథాం కథయంతి.(4-5)

శ్లో ॥ అవంతీషు ద్విజః కశ్చిదాసీదాఢ్యతమ శ్రియా ।
వార్తావృత్తిః కదర్యస్తు కామీ లుబ్ధో ఽతికోపనః ॥ 6

టీ:- స తు భిక్షుః పూర్వం ధనాఢ్యః కృచ్ఛ్రార్జితస్య ధనస్య నాశేన సంతప్యమానో నిర్విణ్ణస్సన్ప్రవ్రజ్య భిక్షామటన్ దుర్జనైరుపద్రుతః ప్రస్తుతో పయోగినీం గాథామగాయతేతి వక్తుం తస్య చరితమాహ-అవంతీష్వితి. అవంతీషు మాళవేషు వార్తాకృషివాణిజ్యాదిరూపా వృత్తి రస్య సః.కదర్యస్తుస్మృతావుక్తః. శ్లో."ఆత్మానం ధర్మకృత్యం చ పుత్ర దారాంశ్చ పీడయన్, దేవతాతిథి భృత్యాంశ్చ స కదర్య ఇతిస్మృతః "ఇతి. 6

పూర్వమొక సన్యాసి దుష్టులు తనను బాధింప, అవమానితుడై తన తొలుత కర్మల పరిణామమును ధైర్యముతో స్మరించుచూ చెప్పిన కథ ఇది. 5

ఆ సన్యాసి పూర్వము ధనాఢ్యుడై కష్టార్జితమైన ధనము నాశనమగుటచే చాలా బాధపడి నిర్విణ్ణుడై సన్యాసియై భిక్షమునకు తిరుగుతూ దుర్జనులచే తరుమబడి ప్రస్తుతోపయోగియైన గాథను గానము చేసెనని చెప్పుటకు పూర్వచరితను చెప్పుచున్నాడు.

మాళవ జనపథంనందు ఒక బ్రాహ్మణుడు ఐశ్వర్యములతో కూడిన భాగ్యము గలవాడు. కృషివాణిజ్యాదిరూపమైన జీవనము కలవాడు. ధర్మకార్యములు చేయక ప్రతివారిని బాధించువాడు. భోగాభిలాష గలవాడై లుబ్ధుడై, మహాకోపియై ఉండెను. (ఈ విషయమే చెప్పబడినది) కదర్యుడనునది స్మృతి యందీవిధముగా చెప్పబడినది.

ఆత్మానం ధర్మకృత్యం చ పుత్ర దారాంశ్చ పీడయన్ ।
దేవతాతిథిభృత్యాంశ్చ స కదర్య ఇతిస్మృతః ॥ 6

శ్లో ॥ జ్ఞాతయో౽తిథయస్తస్య వాఙ్మాత్రేణాప్యనర్చితాః ।
శూన్యావసథ ఆత్మాహం కాలే కామైరనర్చితః ॥ 7

శ్లో ॥ దుశ్శీలస్య కదర్యస్య ద్రుహ్యంతే పుత్రబాంధవాః ।
దారా దుహితరో భృత్యా విషణ్ణా నాచరన్ ప్రియమ్ ॥ 8

టీ:- జ్ఞాతయ ఇతి. తస్య యే జ్ఞాతయో బాంధవాః. అతిథయో అధ్వనీనాశ్చ. తేనా నార్చితా ఇత్యర్థః శూన్యా వసథే ధర్మకామహీనే గృహే దేహేవా. (7-8)

శ్లో ॥ తస్యైవం యక్షవిత్తస్య చ్యుతస్యోభయలోకతః ।
ధర్మ కామవిహీనస్య చుక్రుధుః పంచభాగినః ॥ 9

టీ:- తస్యేతి. యక్షాణాం విత్తమివ కేవలం రక్షణీయం విత్తం యస్య. పంచభాగినః పంచయజ్ఞదేవతాః. 9

శ్లో ॥ తదవధ్యాన విస్రస్తపుణ్యస్కంధస్య భూరిద ।
అర్థో౽ప్యగచ్ఛన్నిధనం బహ్వాయాసపరిశ్రమః ॥ 10

టీ:- తదతి. తేషామవధ్యానమనాదరః తేన విస్రస్తో విశీర్ణః పుణ్యస్య స్కంధః అర్థలాభమాత్ర హేతురంశో యస్య తస్య బహ్వాయాసైః కృష్యాదిభిః కేవలం శ్రయో యస్మిన్ సః. 10

అతడు తన బంధువులను గాని ఇంటికి వచ్చు అతిథులనుగాని మంచి మాటలచేగూడా సత్కరింపలేదు. ధర్మకామవిహీనమగు అతని గృహమునందు అతడు తన శరీరమునైననూ వివిధములగు కోరికలతో తృప్తినొందింపలేదు. 7

లోభియై పరులను బాధించుచూ, చెడ్డ స్వభావముగల వాడగు అతని యొక్క పుత్రులు, బాంధవులు, భార్యా కూతుళ్ళు, భృత్యులు దుఃఖితులై అతనిపై ద్వేషముతో అతనికి ప్రియమాచరింపరైరి. 8

ఈ ప్రకారము యక్షుల విత్తమువలె కేవలము రక్షింపదగు విత్తము గలవాడై, ఇహ పరలోకముల నుండి పతితుడై ధర్మ కామ రహితుడగు వానిపై పంచయజ్ఞాది దేవతలగు దేవ, ఋషి, పితృ, నర, భూతములు కోపించినవి. 9

ఓ దానశీలా! ఆ పంచయజ్ఞాది దేవతలను అనాదరించుటచే తన పుణ్యమంతా నశించగా, అతని యొక్క మిక్కిలి పరిశ్రమ కుషలమగు ధనాదికము చివరకు నాశనమయ్యెను. 10

శ్లో ॥ జ్ఞాతయో జగృహుః కించిత్కించిద్దస్యవ ఉద్ధవ ।
దైవతః కాలతః కించిద్బ్రహ్మబంధోర్నృ పార్థివాత్ ॥ 11

ఎట్లు నాశనమయ్యెననగా చెప్పుచున్నాడు. ఆ దుష్టబ్రాహ్మణుని ధనము జ్ఞాతులు కొంత గ్రహించిరి, దొంగలు కొంత గ్రహించిరి, కాలగతిన గృహదాహాధికము వలన, పాతరవేసిన ధాన్యాదులు చెడి, కొంత నశించెను. నరులు, రాజులు, మిగిలిన కొంత హరించిరి. 11

శ్లో ॥ స ఏవం ద్రవిణేనష్టే ధర్మ కామవివర్జితః ।
ఉపేక్షితస్సర్వజనైశ్చింతా మాప దురత్యయామ్ ॥ 12

టీ:- కుతో నిధన మగచ్ఛత్తత్రాహ - జ్ఞాతయ ఇతి. దైవతః గృహ దాహాదినా కాలతః నిఖాతధాన్యాదినా పార్థివానాం చ ద్వంద్వైక్యం తస్మాత్. (11-12)

ఈ ప్రకారము తన ఆస్తియంత నష్టమైపోగా ఆ ద్విజబంధువు దాన భోగములు లేనివాడై జనులందరిచే బహిష్కృతుడై దాటశక్యము గాని చింతను పొందెను. 12

శ్లో ॥ తస్యైవం ధ్యాయతో దీర్ఘం నష్టరాయస్తపస్వినః ।
ఖిద్యతో బాష్పకంఠస్య నిర్వేద స్సుమహానభూత్ ॥ 13

టీ:- తస్యేతి. నష్టరాయః నష్టాః రాయః అర్థాః యస్య తస్య. తపస్వినః సంతప్తస్య. 13

ఈ ప్రకారము చాలా కాలము చింతనొందుతు నశించిన ధనము గలవాడు సంతప్తుడై ఖేదమొందుచు కన్నీళ్ళు కంఠమున కక్కుతున్న ఆ విప్రునికి చాలా తీవ్రమైన వైరాగ్యము కలిగినది. 13

శ్లో ॥ సచాహేదమహో కష్టం వృథాత్మా మేఽనుతాపితః ।
న ధర్మాయ న కామాయ యస్యార్థాయాస ఈదృశః ॥ 14

టీ:- సఇతి. మే మయా. ఆత్మాదేహః. వృథైవానుతాపితః. అనుతాపం ప్రపంచయతి-న ధర్మాయేత్యాదినా. యస్య ఈదృశః అర్థాయాసస్తేన మయా. 14

ఆ విప్రుడు తనలోతానిట్లనుకొనెను. ఔరా! ఎంత కష్టము వచ్చినది. ధనార్జనకై ఎట్లు శ్రమపడితినో దానిని ధర్మమునకుగాని, భోగమునకుగాని, ఖర్చుచేయక నా శరీరమును వ్యర్థముగా బాధ పెట్టితిని కదా! 14

శ్లో ॥ ప్రాయేణార్థః కదర్యాణాం న సుఖాయ కదాచన ।
ఇహచాత్మోపతాపాయ మృతస్య నరకాయ చ ॥ 15

టీ:- ప్రాయేణేతి. నరకాయచ సత్యప్యర్థే ధర్మాననుష్ఠానాత్. 15

శ్లో ॥ యశో యశస్వినాం శుద్ధం శ్లాఘ్యాయే గుణినాం గుణాః ।
లోభస్స్వల్పోఽపితాన్ హంతిశ్విత్రం రూపమివోర్జితమ్ ॥ 16

టీ:- యశ ఇతి. శ్విత్రం శ్వేతకుష్ఠం. 16

శ్లో ॥ అర్థస్య సాధనే సిద్ధ ఉత్కర్షే రక్షణేవ్యయే ।
నాశోపభోగ ఆయాసస్త్రాసశ్చింతాభ్రమో నృణామ్ ॥ 17

టీ:- అర్థస్యేతి. సిద్ధేఽప్యర్థే తస్యోత్కర్షే సంవర్ధనే నాశోపభోగయోర్ద్వంద్వైక్యం. నాశే ఉపభోగే చేత్యర్థః. సాధనోతర్కర్షయోరాయాసః. తత త్రాసః చింతా చ. నాశే భ్రమ ఇతి. 17

శ్లో ॥ స్తేయం హింసా నృతం దంభః కామః క్రోధస్స్మ యోమదః ।
భేదో వైరామవిశ్వాస స్సంస్పర్ధా వ్యసనాని చ ॥ 18

పిసినిగొట్టు ధనము సుఖానికి ఎప్పుడు పనికిరాదు. ఆ పిసినిగొట్టు ఈ లోకమునందు శరీరమును కష్టపెట్టి మనస్సునకు వ్యధపెట్టి భోగమునాశింపక తాపమును పొందును. దానధర్మాలు చేయనందున చచ్చిన తరువాత వానికి నరకాలు కలుగును. 15

సద్గుణములు గలవారి యొక్క ఏ గుణములు పొగడ్తకెక్కినవో ఆ కీర్తిమంతుల యొక్క నిర్మలమైన యశస్సు, పిసినిగొట్టుతనము కొంత నైనను, హతమార్చును. ( శ్రేష్ఠమగు రూపమును కుష్ఠ రోగము వలె) 16

నరులకు ధనముసిద్ధించినను దానిని సాధించునప్పుడు, పెంపొందిచునప్పుడు చాలా శ్రమకలుగును. రక్షణము నందు భయమును కలుగును. భోగము నందు చింత సంభవించును. నాశనము నందు భ్రమ కలుగును. (పిచ్చి పట్టును) 17

మరియు చౌర్యము, హింస, అసత్యము, డాంభికము, కామము, క్రోధము, గర్వము, మదము, భేదము, వైరము, అపనమ్మిక, పోటీ, వ్యసనము అనునవి అర్థము వలన కలుగును. అర్థప్రాప్తికి ఆరు

శ్లో॥ ఏతే పంచదశానర్థాహ్యర్థమూలా మతానృణామ్ ।
తస్మాదనర్థమర్థాఖ్యం శ్రేయోऽర్థీ దూరతస్త్యజేత్ ॥ 19

టీ:- ఏతఇతి. అర్థ ప్రాప్త్యర్థా స్తేయాదయః షడనర్థాః. ప్రాప్తేऽర్థే స్మయా దయో వ్యసనైస్సహ నవ. తత్ర వ్యసనాని స్త్రీ ద్యూత మద్య విషయాణి త్రీణి. (18,19)

శ్లో॥ భిద్యంతే భ్రాతరో దారాః పితర స్సుహృద స్తథా ।
ఏకాస్నిగ్ధాః కాకణినా సద్యస్సర్వేऽరయః కృతాః ॥ 20

టీ:- భేదవైరస్పర్ధాః ప్రపంచయతి ద్వాభ్యాం. భిద్యంత ఇతి. భిద్యంతే స్నేహం త్యజంతి. కథం భూతాః ఏకా స్నిగ్ధాః ఏకే ఏకప్రాణాః తే చ తే అస్నిగ్ధాః అతి ప్రియాశ్చేత్యర్థః. కృతః కాకణినా పుంస్త్వమౌర్ఢం. వింశతి వరాటికాః కాకణిః తయా. 20

చౌర్యములనుండి అనర్థములు. అర్థము ప్రాప్తించిన తరువాత స్మయాదులు వ్యసనములతో తొమ్మిది అనర్థములు వ్యసనములనగా స్త్రీ, ద్యూత, మద్య విషయములు మూడు. 18

ఈ పదునైదు అనర్థములు ధనకారణములుగా నరులకు తలంచబడుచున్నవి. అందువలన అర్థమనునది అనర్థము తెచ్చి పెట్టును. శ్రేయస్సును కాంక్షించువాడు ఆ ధనమును దూరముగా త్యజించవలెను. 19

భేద, వైర, స్పర్ధలను రెండు శ్లోకములచే వర్ణించుచున్నాడు. తోబుట్టువులు, భార్యలు, తండ్రులు, స్నేహితులు, స్నేహమును త్యజింతురు. ఒకే ప్రాణముగా గలవారు, అతిప్రియులు కూడా ఒక్క నాణెము కొరకు (ఇరువది వరాటికలు ఒక్క కాకణి) శత్రువులగుదురు. 20

శ్లో ॥ అర్థేనాల్పీయసాప్యేతే సంరబ్ధాదీప్తమన్యవః ।
తృజంత్యసూన్ స్పృధో ఘ్నంతి సహసోత్సృజ్య సౌహృదమ్॥21

టీ:- అర్థనేతి. సంరబ్ధాః క్షుభితాః. స్పృధః స్పర్ధమానాః. 21

చాలా స్వల్పమైన ధనముచేతకూడా ఈ సోదరులందరు క్షోభ చెందినవారై మండుచున్న కోపముగలవారై వారి ప్రాణాలను వీడుదురు. పగబూనినవారై స్నేహమును విడిచి వెంటనే చంపుదురు. 21

శ్లో ॥ లబ్ధ్వా జన్మామరప్రార్థ్యం మానుష్యం తద్ద్విజాగ్ర్యతామ్ ।
తదనాదృత్యయే స్వార్థం ఘ్నంతి యాంత్యశుభాం గతిమ్॥22

టీ:- ఇహతావదర్థ నిష్ఠానామేతేఽనర్థాః పరలోకేఽప్యనర్థా ఏవ తేషామిత్యాహ-త్రిభిః. లబ్ధ్వేతి. మానుష్యం జన్మ తత్. తత్రాపి ద్విజాగ్ర్యతాం బ్రాహ్మణ్యం స్వార్థం ఘ్నంతి ఆత్మహితం న కుర్వంతి యే. తే అశుభాం గతిం యాంతి. 22

ధనాశపరులకు ఈ లోకమందు మాత్రము అనర్థములు కలుగునా లేక పరలోకమందునూ అనర్థములు కలుగునా అనగా చెప్పుచున్నారు.

దేవతలచే అర్థింపనగు మనుష్య జన్మమును, అందున బ్రాహ్మణ్యమును పొంది ఆ పావన జన్మమును ఆదరింపక ఎవరు ఆత్మహితమును నాశనముచేయుదురో వారు దుర్గతిని పొందుదురు. 22

శ్లో ॥ స్వర్గాపవర్గయోర్ద్వారం ప్రాప్యలోకమిమం పుమాన్ ।
ద్రవిణే కోఽనుషజ్జేత మర్త్యోఽనర్థస్య ధామని ॥ 23

టీ:- అమరప్రార్థ్యతాం దర్శయన్నాహ-స్వర్గేతి. లోకం దేహం. అనుషజ్జేత ఆసక్తిం కుర్యాత్. 23

అమర ప్రార్థనీయత్వమును తెలుపుచున్నాడు. స్వర్గమోక్షములకు సాధనమైన ఈ దేహమును పొందిన పురుషుడు, మరణశీలుడగు నరుడు, కీడునకు స్థానమైన ధనమునందు (ఎవడు) ఎందుకాసక్తుడగును? 23

శ్లో ॥ దేవర్షి పితృభూతాని జ్ఞాతిబంధూంశ్చ భాగినః ।
అసంవిభజ్య చాత్మానం యక్షవిత్తః పతత్యధః ॥ 24

టీ:- దేవేతి. ఋషయో మనుష్యయజ్ఞ బ్రహ్మయజ్ఞయోః దేవతాః దేవ పితృ భూతానీతరేషు. జ్ఞాతయః సగోత్రాః. బంధవో వివాహాది సంబంధాస్తాన్ అన్యాంశ్చ భాగినః భాగార్హాన్. ఆత్మానం చ అసంవిభజ్య అన్నాదిభిరసంతర్ప్య. 24

దేవతలు, ఋషులు, పితరులు, భూతములు, సగోత్రులు, వివాహాది సంబంధము కలవారిని, భార్యాదులను, ఇతరులను, తనను (తనకుతానే) అన్నాదులచే సంతృప్తులను చేయక, యక్షుల ద్రవ్యమునకు వలె కేవల రక్షకుడనైనవాడు క్రింద పడును. దుర్గతి పొందును. 24

శ్లో ॥ వ్యర్థయార్థేహయా విత్తం ప్రమత్తస్య వయోబలమ్ ।
కుశలా యేన సిధ్యంతి జరఠః కిన్ను సాధయే ॥ 25

టీ:- ఏవంవిమృశ్యానుతప్యమాన ఆహ-వ్యర్థయేతి. వ్యర్థయార్థేహయా ప్రమత్తస్య మమ విత్తాదిగతమితి శేషః. యేన విత్తాదినా కుశలాః వివేకినః సిధ్యంతి ముచ్యంతే. జరఠో వృద్ధః. 25

ఇట్లు విమర్శించి అనుతాపమునొంది ఇట్లనుచున్నారు. నిష్ప్రయోజనమగు ధనసంపాదనేచ్ఛచే చాలా మత్తుడనైన నా యొక్క ధనము, వయస్సు, శక్తియు తొలిగినది. ఏ విత్తాదులతో వివేకులు ముక్తిని పొందుదురో వాటితో ముదుసలినై నేను దేనిని సాధింతును. (25)

శ్లో ॥ కస్మాత్సంక్లిశ్యతే విద్వాన్ వ్యర్థయార్థేహయా సకృత్ ।
కస్యచిన్మాయయా నూనం లోకోఽయం సువిమోహితః ॥ 26

టీ:- అన్యమపి స్వసదృశం శోచతి-కస్మాదితి. కస్మాదేవ మనర్థం విద్వానపి సంక్లిశ్యతే. కారణం సంభావయతి. కస్యచిదితి. 26

తనవంటి అన్యుని గూర్చియు శోకించుచున్నారు. అర్థము అనర్థము నిచ్చునని తెలిసిన పండితుడు కూడా ఎందుకో వ్యర్థముగా అర్థాశచే అనేకమార్లు చాలా కష్టమునొందుచున్నారు. (కారణములు తెలుపుతున్నాడు) ఏదో ఒకానొక మాయచేత, ఈ లోకము చాలా మోహమును పొందుచున్నది. 26

శ్లో ॥ కిం ధనైర్ధనదైర్వా కిం కామైర్వాకామదైరుత ।
మృత్యునాగ్రస్యమానస్య కర్మభిర్వోతజన్మదైః ॥ 27

టీ:- నను నాయంమోహితః క్లిశ్యతి. కింతు ధనాది లిప్సయా భోగాది విషయసంపాదనేచ్ఛయా చేత్యత ఆహ-కిమితి. ఉత పునరపి. 27

అయ్యా! ఇతడు మోహితుడై క్లేశాన్ని పొందుటలేదు. కాని ధనాదులచే భోగాదులను పొందవలెనను ఇచ్ఛచే అందురా? అందులకై చెప్పుచున్నాడు. మృత్యువుచే మ్రింగబడుచున్న వానికి ధనములచే, ధనమునిచ్చు వారిచే ఏమి ప్రయోజనము? కామముచే, కామము ఇచ్చువానిచే ఏమి ప్రయోజనము? జన్మలగలిగించు కర్మలచే నేమి ప్రయోజనము కలుగును? 27

శ్లో ॥ నూనం మే భగవాన్ ప్రీతస్సర్వదేవమయో హరిః ।
యేన నీతో దశామేతాం నిర్వేదశ్చాత్మనః ప్లవః ॥ 28

టీ:- ఇదానీం సంపన్నవివేకః. సంహృష్యన్నాహ-త్రిభిః. నూనమితి. యేన ప్రీతేనాత్మనః ప్లవరూపో నిర్వేదశ్చ భవతి. స హరిర్మే నూనం ప్రీత ఇతి. 28

ఇప్పుడు వివేకమునొంది హర్షించుచు చెప్పుచున్నాడు. నేను ఆయన చేతనే ఈ దశను పొంది సంసారసాగరమును తరింప తెప్ప యైన వైరాగ్యమునొందితిని. నిజముగా నా వలన సర్వదేవతా స్వరూపుడా హరి సంప్రీతుడైనాడు. 28

శ్లో ॥ సోఽహం కాలావశేషేణ శోషయిష్యేఽంగ మాత్మనః ।
అప్రమత్తోఽఖిలస్వార్థే యది స్యాత్సిద్ధ ఆత్మని ॥ 29

టీ:- స ఇతి. అంగం శోషయిష్యే తపసా. యద్వా. విద్యయా లయం నేష్యామి, యదిస్యాత్కాలావశే షస్తర్హ్యాత్మన్యేవ సిద్ధస్తుష్టస్సన్. అఖిలే స్వార్థే ధర్మాదిసాధనే అప్రమత్తస్సన్. 29

అట్లు నిర్వేదమును పొందినను జీవితకాలమింక మిగిలి యున్నచో జీవితకాల శేషముచేత నా దేహమును తపస్సుచే శోషింపచేసెదను. ఆత్మయందు తుష్టుడనై, సమస్తమైన ధర్మాదిసాధనము నందు మరుపు వీడిన వాడనయ్యెదను. 29

శ్లో ॥ తత్ర మామనుమోదేరన్ దేవాస్త్రిభువనేశ్వరాః ।
ముహూర్తేనా బ్రహ్మలోకం ఖట్వాంగస్సమసాధయత్ ॥ 30

టీ:- తత్రేతి. అనుమోదేరన్ అనుగృహ్ణంతు. నను దేవైరనుమోదితోఽపి జరతః స్వల్పేన కిం సాధయిష్యతి? తత్రాహ. ముహూర్తేనేతి. 30

ఆ తపోనిష్ఠలోనున్న నన్ను ముల్లోకములకు ప్రభువులగు త్రిమూర్తులు, ఇంద్రాదిదేవతలు అనుమోదింతురు. అయ్యో! దేవతలను మోదించినను జరతుడు (ముసలివాడు) స్వల్ప కాలమున ఏమి సాధించగలరు అనిన చెప్పుచున్నారు-ఖట్వాంగుడు ముహూర్త కాలములో వైకుంఠమును సాధించెను. 30

**శ్రీభగవానువాచ**

శ్లో ॥ ఇత్యభిప్రేత్యమనసా హ్యావంత్యోద్విజసత్తమః ।
ఉన్ముచ్యః హృదయగ్రంథీన్ శాంతో భిక్షురభూన్మునిః ॥ 31

టీ:- ఇతీతి. అభిప్రేత్య నిశ్చిత్య. ఆవంత్యః అవంతీదేశ సంభవః. హృదయగ్రంథీన్ అహంకారాదీన్. 31

**శ్రీభగవానుడు ఈ విధముగా చెప్పచున్నాడు.**

ఇట్లు మనస్సున నిశ్చయించి అయ్యవంతీ దేశ విప్రుడు అహంకారాదులను అన్నింటిని త్యజించి, శాంతుడై, మౌనియై, భిక్షువయ్యెను. 31

శ్లో ॥ స చచార మహీమేతాం సంయతాత్మేంద్రియానిలః ।
భిక్షార్థం నగరగ్రామానసంగోఽలక్షితోఽవిశత్ ॥ 32

టీ:- స ఇతి. అసంగః ఆసక్తిశూన్యః. అలక్షితః శ్రైష్ఠ్యమద్యోతయన్. 32

ఇంద్రియములనరికట్టి, మనస్సును నిరోధించినవాడై ఆ భిక్షకుడీ భూమిని సంచరించుచు అసంగుడై, శ్రేష్ఠుడుగా తెలియనివాడై భిక్షకొరకు నగర, గ్రామాలను జొచ్చెను. 32

శ్లో ॥ తం వై ప్రవయసం భిక్షుదువధూత మసజ్జనాః ।
దృప్తాః పర్యభవన్ భద్రబహ్వీభిః పరిభూతిభిః ॥ 33

టీ:- తమితి. ప్రవయసం వృద్ధం. అవధూతం మలినం. పర్యభవన్ అవమేనిరే. హే భద్ర. పరిభూతిభిస్తిరస్కారైః. 33

ఓ భద్రా!చాలా వృద్ధుడైన, మలినుడైన ఆ భిక్షువును దుష్టులు, పొగరుబోతులు అనేకవిధముల తిరస్కారములచే అవమానించిరి. 33

శ్లో ॥ కేచిత్త్రివేణుం జగృహురేకే పాత్రకమండలూ ।
పీఠం చైకేఽక్షసూత్రం చ కథాం చీరాణి కేచన ॥ 34

టీ:- పరిభవానేవ దర్శయతి-సప్తభిః. కేచిదితి. 34

కొందరు పురుషులు ఆ వృద్ధ సన్యాసి దండమును గ్రహించిరి. కొందరు అన్నపాత్రలను, కొందరు కమండలమును, కొందరు కృష్ణాజినమును, అక్షమాలను గ్రహించిరి. కొందరు బొంతను, కాషాయ వస్త్రములను గ్రహించిరి. 34

శ్లో ॥ ప్రదాయ చ పునస్తాని దర్శితాన్యాదదుర్మునేః ।
అన్నం చ భైక్షసంపన్నం భుంజానస్య సరిత్తటే ॥। 35

టీ:- ప్రదాయేతి. భో భగవన్ గృహాణేతి దర్శితాని ప్రదాయ పునశ్చా దదుః. 35

తాము తీసుకొన్న వానిని ఓ భగవంతుడా తీసుకొమ్మని మునికి చూపి, వానిని మరలా గ్రహించి, ఆ పాపాత్ములు అతడు భిక్షమెత్తి సంపాదించు కొన్న అన్నమును సైతము గైకొనిరి. 35

శ్లో ॥ మూత్రయంతి చ పాపిష్ఠా నిష్ఠీవంత్యస్య మూర్ధని ।
యతవాచం వాచయంతి తాడయంతి న వక్తిచేత్ ॥ 36

భిక్షుని శిరమున ఆ పాపాత్ములు మూత్రముపోసిరి. ఉమ్మివేసిరి. వాఙ్నియమముగల వానిని మాట్లాడించెదరు. మాట్లాడనిచో కొట్టెదరు. 36

శ్లో ॥ తర్జయంత్యపరే వాగ్భిః స్తేనోఽయమితి వాదినః ।
బధ్నంతిరజ్జ్వా తం కేచిద్బధ్యతాం బధ్యతామితి ॥ 37

వాక్కులచే బెదిరించిరి. కొందరు తాడుతో ఆ భిక్షువును కొట్టుడు కొట్టుడని కొట్టసాగిరి. 37

టీ:- అన్నమితి. అన్నేమూత్రయంతి. మూర్ధని చ నిష్ఠీవంతి పూత్కారేణశ్లేష్మణః ప్రక్షిపంతి. (36-37)

శ్లో ॥ క్షిపంత్యేకేఽవజానంతి హ్యేషధర్మ ధ్వజశ్శఠః ।
క్షీణవిత్త ఇమాంవృత్తి మగ్రహీత్స్వజనోర్ఝితః ॥ 38

టీ:- బధ్నంతీతి. క్షిపంతి నిందంతి నిందామేవాహ-ఏష ధర్మధ్వజః త్రిదండలింగోపజీవీ. శఠో లోకవంచకః తదేవాహుః-క్షీణవిత్త ఇతి. 38

శ్లో ॥ అహో ఏష మహాసారో ధృతిమాన్ గిరిరాడివ ।
మౌనేనసాధయత్యర్థం బకవద్దృఢనిశ్చయః ॥ 39

టీ:- అహో ఇతి. మహాసారః అతిబలీ. 39

శ్లో ॥ ఇత్యేకే విహసంత్యేన మన్యేదుర్వాంతయంతి చ ।
తం బబంధుర్నిరురుధుర్యథా క్రీడనకం ద్విజమ్ ॥ 40

టీ:- ఇతీతి. దుర్వాతయంతి తదుపర్యధోవాయుం ముంచంతి. బబంధుః శృంఖలైర్నిరురుధుః. కారాగృహాదిషు ద్విజం శుక శారికాదిం యథా. 40

శ్లో॥ ఏవం సభౌతికం దుఃఖం దైహికం చ యత్ ।
భోక్తవ్యమాత్మనో దిష్టం ప్రాప్తంప్రాప్త మబుధ్యత ॥ 41

టీ:- ఏవమితి. భౌతికం దుర్జనాదికృతం దైహికం జ్వరాదినిమిత్తం. దైవికం శీతోష్ణాదిభవం. దిష్టం దైవ ప్రాప్తం. 41

కొందరు నిందింపసాగిరి వీడు కపట ధర్మపు వేశమువాడు. దుష్టుడు, ధనము పోగొట్టుకొనిన వాడు. బంధువులచే విడువ బడినవాడు. ఈ భిక్షువృత్తిని స్వీకరించెను అని అవమానించిరి. 38

ఔరా! ఇతడు పర్వతరాజువలె బలిష్ఠుడు, ధైర్యశాలి, కొంగవలె దృఢనిశ్చయుడైమౌనమున స్వప్రయోజనమును సాధించుచున్నాడు. 39

ఇట్లు కొందరు పరిహసింపసాగిరి, కొందరు అపానవాయువును విడుతురు. ఆ భిక్షువును క్రీడాసాధనమైన శుకసారికాదులను వలె కారాగారమున బంధించిరి. 40

ఈ ప్రకారము ఆ భిక్షువు దుర్జనులు చేసిన భౌతికమయినవి యగు, దైహిక, జ్వరాది దుఃఖమును దైవికమైన శీతోష్ణాది దుఃఖమును తనకు తప్పక అనుభవింపదగినదని దైవప్రాప్తమైనదని తెలిసికొనెను. 41

శ్లో॥ పరిభూత ఇమాం గాథా మగాయత నరాధమైః ।
పాతయద్భిస్స్వధర్మస్థో ధృతిమాస్థాయసాత్వికీమ్ ॥ 42

టీ:- పరిభూత ఇతి. ధర్మాత్పాతయద్భిః పరిభూతోఽపి. సాత్వికీం ధృతి మాస్థాయ. స్వధర్మఏవ స్థితిః. ఇమాం వక్ష్యమాణాం గాథా మగాయత. సాత్వికీ ధృతిశ్చ గీ. శ్లో."ధృత్యాయయా ధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః, యోగేనా వ్యభిచారిణ్యా ధృతిస్సాపార్థ సాత్వికీ" తి స్మృతేః. 42

అధర్మమున తనను కొట్టుచున్న ఆ నీచులచే అవమానితుడై, తన ధర్మమున ఉండి సత్వగుణమును బొందియును, ధైర్యమును కూడగట్టుకొని ఈ గాథను గానము చేసెను. సాత్వికీధృతి-ధృత్యా యయాధారయతే మనఃప్రాణేంద్రియ క్రియాః యోగేనావ్యభిచారిణ్యా ధృతిసా పార్థసాత్వికీ 42

భిక్షురువాచ

శ్లో॥ నాయంజనో మే సుఖ దుఃఖ
హేతుర్న దేవతాత్మగ్రహకర్మకాలాః ।
మనః పరం కారణమామనంతి
సంసార చక్రం పరివర్త యేద్యత్ ॥ 43

టీ:- తామేవ షోడశశ్లోకీం గాథామాహ-నేతి. నచాత్మా నాపి గ్రహాదయః. మనః పరంకేవలం సుఖదుఃఖయోః కారణం వదంతి. శ్రు. "మనసా హ్యేవ పశ్యతి మనసా శృణోతీ" త్యాది శ్రుతయః. 43

భిక్షువు ఈ విధముగా అనుచున్నాడు

ఈ దుష్ట జనము, దేవతలు, ఆత్మ, కర్మ, కాలము నా సుఖ దుఃఖములకు కారణము కాదు. ఏది సంసార చక్రమును తిప్పుచున్నదో ఆ మనస్సే ముఖ్య కారణమని చెప్పబడుచున్నది. శ్రుతి చెప్పుచున్నది. 'మనసాహ్యేవపశ్యతిమనసాశ్రుణోతి' మనస్సుచే చూచుచున్నాడు, మనస్సుచే వినుచున్నాడు అని 43

శ్లో॥ మనోగుణాన్వైసృజతే బలీయ
స్తతశ్చకర్మాణి విలక్షణాని ।
శుక్లాని కృష్ణాన్యతిలోహితాని
తేభ్యస్సవర్ణా స్సృతయో భవంతి ॥ 44

టీ:- పరివర్తన ప్రకారమేవాహ-మన ఇతి. గుణాన్ గుణవృత్తీః సృజతి. తతస్తేభ్యః గుణేభ్యః. శుక్లాని సాత్వికాని-కృష్ణాని తామసాని. అతిలోహితాని రాజసాని. తేభ్యః సవర్ణాస్తత్తత్కర్మానురూపాః. సృతయః దేవతిర్యఙ్నరాది జాతయః భవంతి. 44

బలీయమైన మనస్సు సత్వాది గుణములను సృజించును. ఆ వృత్తుల వలన నిర్మలములగు సాత్వికములు, పాపాస్వాదులగు తామసములు పుణ్యాపుణ్యాత్మకములగు రాజసములు మొదలగు కర్మలు కలుగును. వాని వలన వానివాని కర్మానుసారము క్రమముగా సాత్వికులు, దేవతలు; తామసులు, రాక్షసులు; రాజసులు, నరులుగా అవుదురు. 44

శ్లో॥ అనీహ ఆత్మా మనసా సమీహతా
హిరణ్మయో మత్సఖ ఉద్విచష్టే ।
మనస్స్వలింగం పరిగృహ్య కామాన్
జుషన్నిబద్ధో గుణసంగతోఽసౌ ॥ 45

టీ:- తర్హి మనస ఏవ సంసారస్యావాన్నాత్మన ఇత్యాశం క్యాహ - అనీహ ఇతి. అయమర్థః. అవిద్యయా మనసోఽధ్యాసేన - ఇయమాత్మన సంసృతిః. న తు స్వతః. యతస్త్రద్రహితస్యేశ్వరస్య సా నాస్తి-కింతు తద్వతో జీవస్యైవేతి. తదేవాహ-మనసా సమీహమా

అయినచో మనస్సునకే సంసారము, ఆత్మకు కాదని ఆశంకించి చెప్పుచున్నాడు. ఇది అర్థము - అవిద్యా ధ్యాసతో ఇది ఆత్మకు సంసారముతప్ప స్వతహాగా కాదు. ఎందులకనగా తద్రహితుడైన ఈశ్వరునికి సంస్మృతిలేదు కాని సంసారముగల జీవునికే అని తాత్పర్యము. అదే చెప్పుచున్నాడు.

సంకల్ప వికల్పములు చేయు కార్యములను కోరుచున్న మనస్సుచే ఏ కోరికలు క్రియలునూ లేనివాడైన పరమాత్మ విద్యా శక్తి ప్రధానుడు. నా జీవమునకు సఖుడు, నియంత, స్వతంత్రుడు అతిరోహిత జ్ఞానముచే కేవలము నన్ను చూచుచున్నాడు. అందువలన

నేన సహ నియంతృత్వేన వర్తమానోఽపి పరమాత్మా అనీహాఃతత్క్రియా సంగరహితః. యతో హిరణ్మయః విద్యాశక్తి ప్రధానః. కుతః. యతో మత్సఖః మమ జీవస్య సఖా నియంతా అతః ఉత్ ఉచ్చైః విచష్టే అతిరోహితజ్ఞానేన కేవలం పశ్యతీత్యర్థః. అతోఽసౌ పునరహం జీవః స్వలింగం స్వస్మిన్నాత్మని లింగయతి. ద్యోతయతి సంసారమితి తథా ఆత్మనః పరిగృహ్య ఆత్మత్వేన స్వీకృత్య. తస్య మనసో గుణైః కర్మభి స్సంగతస్సంబద్ధః గుణసంగాద్వా. కామాన్ జుషన్నిబద్ధ ఇతి. 45

ఈ జీవుడనైన నేను నాయందు ఈ సంసారము కలిగేట్టుగా చేయు మనస్సును నేనుగా పరిగ్రహించి సత్వాది గుణముల వలన సేవించుచు కర్మలతో సంబంధముగలవాడినై బంధింపబడితిని. 45

శ్లో॥ దానం స్వధర్మోనియమో యమశ్చ
శ్రుతం చ కర్మాణి చ సద్వ్రతాని ।
సర్వే మనోనిగ్రహ లక్షణాంతాః పరోహి
యోగో మనస స్సమాధిః ॥ 46

టీ:- అతో మనోనిగ్రహే కృతే సర్వం కృతం స్యాత్. తం వినాతు సర్వం వ్యర్థ మిత్యాహ-ద్వాభ్యాం. దానమితి. స్వధర్మః నిత్య నైమిత్తిక రూపః స్వద్వ్రతాని ఏ కాదశ్యుపవాసాదీని. అన్యాని చ యావంతి కర్మాణి. ఏతేసర్వే ఉపాయాః మనోనిగ్రహలక్షణఃఅతో నిష్ఠా ఫలం యేషాం తే తథా - నను జ్ఞానాంగత్వం తేషాం ప్రసిద్ధం తత్రాహ - మనసః సమాధిర్నిగ్రహ ఏవ పరోయోగః జ్ఞానం. 46

అందువలన మనోనిగ్రహము చేసినచో సర్వము చేసినట్లే అని. ఆ నిగ్రహములేకున్న సర్వమునువ్యర్థమని రెండుశ్లోకములచే చెప్పు చున్నాడు. దానము, నిత్య నైమిత్తికమగు ధర్మము, తపస్వాధ్యాయది నియమములు, అహింసా, సత్యాదియమము, వేదాంతశాస్త్రాది శ్రవణము, ఏకాదశ్యుపవాసాది వ్రతములు ఇతరమగు కర్మలు అన్నియు మనోనిగ్రహమొక్కటే ఫలము కాగలవి. అయ్యో! జ్ఞానాంగత్వము వాటికి ప్రసిద్ధి యున్నదిగదా అనగా చెప్పుచున్నాడు. మనోనిగ్రహమే ఉత్కృష్ట జ్ఞానమగును. 46

శ్లో॥ సమాహితం యస్య మనః ప్రశాంతం
దానాదిభిః కిం వద తస్య కృత్యం ।
అసంయతం యస్య మనో వినశ్యే
ద్దానాదిభిశ్చేదపరం కిమేభిః ॥ 47

టీ:- సమాహిత మితి. అతో యస్య మనస్సమాహితం భవతి. తస్య కిం కృతమస్తి. వదేతి పరం ప్రత్యుపదిశన్నివ స్వయమేవాహ - అసంయంతం విక్షిప్తం చేత్. యద్వా. వినశ్యేత్. ఆలస్యాది నా లీయమానం చేత్ - భవేత్ తర్హి ఏభిర్దానాదిభిః కిం ప్రయోజనం స్యాత్? న కించిదిత్యర్థః. 47

శ్లో॥ మనోవశేఽన్యేహ్యభవంశ్చ దేవా
మనశ్చ నాన్యస్య వశం సమేతి ।
భీష్మోహి దేవ స్సహసస్సహీయాన్
యుంజ్యాద్వశంతం సహి దేవ దేవః ॥ 48

టీ:- నన్వితరేంద్రియజయః ప్రయోజనం స్యాన్నేత్యాహ-మనోవశ ఇతి. దేవా ఇంద్రియాణి తదధిష్ఠాతారో వా. భీష్మః యోగినామపి భయంకరః. మనోలక్షణో దేవః కుతః. సహసః బలాదపి బలినోఽపివా

ఎవని మనస్సు నిశ్చలమై పరమశాంతమగునో వానికి దానములు మొదలైనవానిచే ఏమిపని. చెప్పుమని ప్రత్యుపదేశమును చేయుచు స్వయముగనే చెప్పుచున్నాడు. ఎవని మనస్సు కట్టుపడనిదిగ, చంచలమై, ఆలస్యాదులతో నశించుచున్నదగునో అతనికి ఈ దానము మొదలైన వానిచే వేరు ప్రయోజనమేమి. 47

అయ్యా! ఇతరములగు ఇంద్రియజయము వలన ప్రయోజనము కలదా అనగా కాదనుచున్నాడు.

మనస్సు వశమగుచుండగా ఇతరములగు ఇంద్రియములు, వాని అధిష్ఠాతలగు దేవతలు మనస్సుకు వశము అయిరి. మనస్సు ఇతరులకు వశముకాదు. యోగులకు కూడా భయంకరుడగు, మనోరూపుడు బలవంతునికంటే బలవంతుడు ఎవడు. అతనిని వశమొనర్చుకొన్న వాడే సర్వేంద్రియజేత యగుచున్నాడు. ఇతరులు కారు అట్లే శృతియూ.

సహీయాన్ అతస్తం యో వశవర్తినం కుర్యాత్ స ఏవ దేవదేవః సర్వేంద్రియజేతాభవతి. నాన్యః. తథాచ.శ్రు."మనసో వశే సర్వమిదం బభూవ-నాన్యస్య మనోవశమన్వియాయ. భీష్మోహి దేవ స్సహస స్సహీయాని" తి. 48

శ్లో॥ తం దుర్జయం శత్రు మసహ్య
వేగమరుంతుదంతన్న విజిత్య కేచిత్ ।
కుర్వంత్యసద్విగ్ర హమత్ర మర్త్యైర్మి
త్రాణ్యుదాసీనరిపూంశ్చ మూఢాః ॥ 49

టీ:- అతః తన్నిగ్రహవ్యతిరేకేణ ఇతర నిగ్రహాయ ప్రవృత్తామూఢా ఇత్యాహ-తమితి. అసహ్యా రాగాదయోవేగాయస్యతం-అతఏవ అరుంతుదం ఆరుర్మర్మ తత్తుదతి వ్యధయతీతి అరుంతుదః తం తత్. నేతిచ్ఛేదః తన్న విజిత్య అవిజిత్వా తత్ తతః. యేకేచిన్మర్త్యాః కేశ్చిన్మర్త్యైస్సహ అసద్వి గ్రహం కుర్వంతి. తత్ర తత్రానుకాలప్రతికూలాదీన్ అన్యాన్ మిత్రాదీన్ కుర్వంతి. తే మూఢా ఇత్యర్థః. 49

'మనసో వశే సర్వమిదం బభూవ-నాన్యస్య మనోవశమన్వి యాయ. భీష్మోహి దేవ స్సహసస్సహీయాన్' అని మనస్సు వశమైనచో అన్యములగు ఇంద్రియము వానినధిష్ఠించిన దేవతలును వశ్యుల గుదురు. ఇది ఇతరములగు ఇంద్రియాదికమునకు వశమగునది కాదు. ఈ మనోదేవుడు యోగులకు సైతము చాలా భయంకరుడు. 48

గెలువ శక్యముకానిది సహింపరాని రాగాదుల వేగముగలది, మర్మముల వ్యధ పెట్టునది అయిన ఆ మనస్సును జయింపక కొందరు మర్త్యులు, మర్త్యులతో వాస్తవముగా కలహము చేయరు. ఇచ్చట మూఢులు అనుకూలమును బట్టి మిత్రులను ఉపేక్షావంతులను, శత్రువులనుగా చేయుచున్నారు. 49

శ్లో॥ దేహం మనోమాత్రమిమం గృహీత్వా
మమాహమిత్యంధధియో మనుష్యాః ।
ఏషోऽహమన్యోऽయమితి భ్రమేణ
దురంత పారే తమసి భ్రమంతి ॥ 50

టీ:- తతాశ్చానేన ప్రకారేణ సంసారే భ్రమంతీ త్యాహ-దేహ మితి. మనోమాత్ర పరికల్పితమిమం స్వదేహ మహమితి పుత్రాదిదేహం చ మమేతి స్వీకృత్య-తమసి సంసారే. 50

తరువాత ఆ ప్రకారమున సంసారమున తిరుగుచుందురను చున్నాడు. మనస్సుచే మాత్రము కల్పించిన ఈ దేహమును పుత్రాది దేహమును నాదియని స్వదేహమును నిగ్రహముతో గ్రహించి అజ్ఞాన బుద్ధిగల మనుష్యులు. ఇది నేను ఇతడు వేరు అను భ్రాంతిచే తరింపశక్యముకాని సంసారమందు తిరుగుచుందురు. 50

శ్లో॥ జనోऽస్య హేతు స్సుఖదుఃఖయో
శ్చేత్కి మాత్మనశ్చాత్ర హి భౌమయోస్తత్ ।
జిహ్వాం క్వచిత్స్వాం దశతి స్వదద్భిస్త
ద్వేదనాయాం కతమాయకుప్యేత్ ॥ 51

టీ:- తదేవం మనస ఏవ సుఖదుఃఖకారణత్వముపపాద్యేదానీం జనాదీనాం షణ్ణామకారణత్వం షడ్భిః ప్రపంచయతి-జన ఇతి. అత్ర చ అస్మిన్నపి పక్షే ఆత్మనః కిం. న కించత్. సుఖదుఃఖకర్మత్వం తత్కర్తృత్వం చ నాస్తీత్యర్థః. కుత ఇత్యత ఆహ-హి నిశ్చితం భౌమయో ర్భూమివికారయోర్దేహయో స్తత్. సత్వాత్మనః. అమూర్తస్యాక్రియస్య హననాదిషు కర్మత్వకర్తృత్వానుపపత్తేః. తథాపి దుఃఖమాత్మపర్యవసాయ్యే

ఈ ప్రకారము మనస్సునే సుఖదుఃఖకారణమని యుపపాదించి జనాదులగు ఆరింటిని కారణములు కావని ఆరు శ్లోకములచే చెప్పుచున్నాడు. ఈ సంసారముయొక్క సుఖ దుఃఖములకు జనము కారణమయినచో ఈ పక్షమందు ఆత్మకు సుఖదుఃఖాదికమున్నదా? ఏమియు లేదు. ఆత్మకు సుఖదుఃఖ కర్మత్వము తత్కర్తృత్వము లేదని అర్థము. ఏలననగా చెప్పుచున్నాడు. భూమి, వికారములగు స్థూలసూక్ష్మ దేహములకేయగును. ఆత్మకుగాదు. అమూర్తుడు అక్రియుడు అయిన వానికి హననాదులయందు కర్మత్వ కర్తృత్వానుపపత్తి. అట్లయిననూ దుఃఖము ఆత్మపర్యవసాయియేతున్నచో ఐనను పరమాత్మకు ఉభయత్ర (స్వదేహమున, పరదేహమున) కూడా ఒక్కడేయగుట వలన కోపవిషయ మతడుకాడని స్వదృష్టాంతములో తెలుపుతున్నాడు-తన నాలుకను

వేతి చేత్ ఏవమప్యాత్మనః ఉభయత్రాప్యేకత్వాన్న కోపవిష యోఽస్తీతి స్వదృష్టాం తేన దర్శయతి-జిహ్వామితి. 51

శ్లో॥ దుఃఖస్య హేతుర్యది దేవతాస్తు
కిమాత్మ స్తత్ర వికారయో స్తత్ ।
యదంగమం గేన నిహన్యతే
క్వచిత్రుక్ధ్యేత కస్మై పురుషస్తతోఽన్యః ॥ 52

టీ:- దుఃఖస్యేతి. యది దేవతాః. అస్తు నామ. తత్రాపి పక్షే ఆత్మనః కిం యతో వికారయోర్విక్రియమాణయోర్దేవతయో స్తత్. హస్తేన ముఖే ఽభి హతే తేన వా హస్తే దష్టే తదభిమానినోర్వహ్నీంద్రయోరేవ తత్. నత్వవిక్రియస్యానహంకారస్యాత్మనః. దేవతానాం చ సర్వ దేహే ష్వభేదాన్న కోపవిషయోఽస్తీతి స్వదేహదృష్టాంతమాహ - యదితి. యత్ యదా అంగం దేవతాధిష్ఠానం హస్తముఖాది. అత ఏవపూర్వత్ర దేవతానధిష్ఠానభూ వికారదంతోదాహరణం. 52

శ్లో॥ ఆత్మాయది స్యాత్సుఖదుఃఖ హేతుః
కిమన్యత స్తత్రనిజస్వభావః ।
సహ్యాత్మనోఽన్యద్యది తన్మృషా స్యా
త్రుక్ధ్యేత కస్మాన్న సుఖం న దుఃఖమ్ ॥ 53

తన దంతములచే కొరుక్కున్న వానికి ఎవనిపై కోపమునకు వచ్చును? 51

దేవతలకు సర్వదేహములందు అభేదము వలన కోపవిషయము లేదని స్వదేహదృష్టాంతముతో చెప్పుచున్నాడు. దుఃఖమునకు కారణము ఒకవేళ ఇంద్రియాధిదేవతలైన అట్లేఅగుగాక ఆ పక్షమునందును ఆత్మకే మిగలదు. వికారము పొందిన దేవతల ముఖమును హస్తము కొట్టగా ఆ ముఖముచే హస్తము కొరకబడగా ఆ బాధ ఆ అధిష్ఠాన దేవతయగు ఇంద్రునకు అగును, కాని ఆ ఇంద్రియదేవతల కంటే అన్యుడు అనహంకారుడగు ఆత్మకుగాదు. హస్తముపొందు బాధకై ఎవని కొరకు కోపించును. దేవతలకు సర్వదేహములందు అభేదము వలన కోపవిషయము లేదని స్వదేహదృష్టాంతము చెప్పెను. అందుకనే దేహ పక్షమున దేవతాధిష్ఠానముకాని భూ వికారవదంతోదాహరణము చూపబడినది. 52

సుఖదుఃఖాకార పరిణామములు ఆత్మవలననే కలిగిన యెడల వానికి ఆ పక్షమునందును ఇతరమైన దాని వలన ఏమియును కాదు. ఎవని కొరకై కోపించునో తన స్వభావమేయై యున్నది. ఎవనికై ఆత్మకు పరిణామము అన్యము వలన కలుగును? ఓయీ! ఆత్మకు పరిణామము

టీ:- ఆత్మేతి. ఆత్మనః సుఖ దుఃఖాద్యాకారాపరిణామః అత ఏవ హేతుర్యది స్యాదాత్మా తర్హి తత్ర తస్మిన్పక్షే అన్యతః కింన కించిదన్యతో భవతి. తస్మై కుప్యేదిత్యర్థః. యతో నిజ ఏవ స్వభావః సః నన్వాత్మన స్తథా పరిణామః అన్యనిమిత్తో భవతి. అతోఽస్తి కోపవిషయ ఇతి చేత్ తత్రాహ-నహీతి. ఆత్మ వ్యతిరిక్తం నాస్త్యేవ యది స్యాదస్తీతి ప్రతీయేత తర్హి తన్మృషైవ అతః కస్మాద్ధేతోః క్రుధ్యేత యతో నాస్తినిమిత్తం న చ సుఖం దుఃఖం చేత్యర్థః. 53

అన్యనిమిత్తము అగును. అందులకు కోప విషయమగు దానిని చెప్పుచున్నాడు. ఆత్మకంటే వ్యతిరిక్తమైనది లేనేలేదు. ఒకవేళ ఉన్నచో ఉన్నట్లుగా తోచును అది మిథ్యయే. అందుకని ఏ హేతువు వలన కోపించును నిమిత్తము లేనందున సుఖదుఃఖములు లేవు. 53

శ్లో॥ గ్రహానిమిత్తం సుఖదుఃఖయోశ్చేత్కి
మాత్మనోఽజస్య జనస్య తేవై ।
గ్రహైర్గ్రహస్యైవ వదంతి పీడాం
క్రుధ్యేత కస్మై పురుష స్తతోఽన్యః ॥ 54

టీ:- గ్రహా ఇతి. గ్రహపక్షేఽప్యజస్యాత్మనః కిం. యతో జన్యత ఇతి జనో దేహస్తస్యైవ జన్మలగ్నా పేక్షయా ద్వాదశాష్టమాదిరాశిస్థాస్తే సుఖ దుఃఖయోర్నిమిత్తం భవంతి. కించ. అంతరిక్షస్థైర్గ్రహైస్తత్రస్థస్య గ్రహస్యైవ పాదార్ధాదిదృష్ట్యాది భేదైః పీడాం వదంతి దైవజ్ఞాః. న తు గ్రహకోణాదిషు స్థితస్య తద్దృష్ట్యగోచరస్య పురుషస్య గ్రహగత్యైవతు పీడా తల్లగ్నోత్పన్నే దేహే తస్యాభిమానాద్భవతి. అతః పురుషస్తతో గ్రహాత్ దేహాచ్చాన్యః కస్మైక్రుధ్యేత. 54

సుఖదుఃఖాదులకు కారణము సూర్యాదిగ్రహములన్నచో ఆ పక్షమునందు అజుడగు ఆత్మకు ఏమి కలుగదు. దుఃఖములేదు. ఏ కారణముచే జన్మించుచున్నదో ఆ దేహమునకే జన్మ లగ్నమును బట్టి ద్వాదశరాశులయందుండు ఆ గ్రహములు సుఖదుఃఖకారణములగు చున్నవి. మరి అంతరిక్షమునందున్న గ్రహమునకు పాదార్థ దృష్ట్యాది భేదములచే పీడకలుగునని దైవజ్ఞులు చెప్పుదురు. వానిదృష్టి కగోచరు డైన పురుషుని గ్రహ గతిచే అగుపీడ ఆ లగ్నమునందున్న దేహము నందు ఆ దేహాభిమానమున సుఖ దుఃఖాదికము కలుగుచున్నది. అందువలన పురుషుడు ఆ గ్రహములకంటే ఇతరుడుగా నుండువాడు ఎవనిపై కోపించును. 54

శ్లో॥ కర్మాస్తు హేతుస్సుఖదుఃఖయో

శ్చేత్కిమాత్మనస్తద్ధి జడాజడత్వే ।

దేహస్త్వచిత్పురుషోఽయం సుపర్ణః

క్రుధ్యేత కస్మై న హి కర్మమూలమ్ ॥ 55

టీ:- కర్మేతి కర్మహేతుశ్చేత్. అస్తిత్వసూయోపగమః కర్మైవ నాస్తి. కుత స్తస్య హేతుత్వమితి. తదాహ-హి యస్మాత్కర్మ ఏకస్య జడాజడత్వే సతి స్యాత్. జడత్వాద్వికారిత్వోపపత్తేః అజడత్వాచ్చ హితానుసంధానతః ప్రవృత్తిసంభవాత్. అచిత్ జడోదేహః అతస్తస్య ప్రవృత్తిర్న సంభవతి. పురుషస్తు సుపర్ణః శుద్ధజ్ఞానస్వరూపః అతః కస్మై క్రుధ్యేత్. యతః సుఖదుఃఖయో ర్మూలభూతం కర్మైవ నాస్తీతి. 55

సుఖదుఃఖములకు కర్మయే హేతువైనచో కానిమ్ము ఆత్మకేమి యగును? (సుఖదుఃఖకర్మత్వముగాని కర్తృత్వముగాని లేదనుట) ఎందువలన అనగా ఆ కర్మ దేనికైననూ ఒకదానికి జడాజడత్వమున్ననే ఏర్పడును. జడమగుటచే వికారిత్వము, అజడమగుటచే హితమును అనుసంధానించుట వలన ప్రవర్తించుటయుండును గనుక. దేహమో జడముగావున దానికి ప్రవృత్తిలేదు ఈ పురుషుడు శుద్ధజ్ఞానస్వరూపుడు కనుక ఆయనకు వికారిత్వము లేదు. కావున ఎవ్వనిపై కోపించును. ఎందువల్లననగా సుఖదుఃఖములకు మూలమగు కర్మనే లేదుకదా. 55

శ్లో॥ కాలస్తు హేతు స్సుఖదుఃఖయోశ్చే

త్కిమాత్మన స్తత్రతదాత్మకోఽసౌ ।

నాగ్నేర్హి తాపోన హిమస్య తత్స్యా

త్క్రుధ్యేత కస్మై న పరస్య ద్వంద్వమ్ ॥ 56

టీ:- కాల ఇతి. తత్రకాలక్షేఽపి ఆత్మనః కిం యతోఽసౌ కాలాత్మక ఏవ. బ్రహ్మాంశత్వాత్స్వాంశస్య స్వతః పీడా నాస్తీతి. అత్ర దృష్టాంతః

సుఖ దుఃఖములకు కాలము హేతువయినచో ఆత్మకు దానితో నేమి? ఏలయన కాలము పరమాత్మ అంశమే అగుచున్నది. కనుక తన యంశకు తన వలననే పీడ కలుగదు. అగ్ని తనయంశ యగు జ్వాలాదులు నశించుటకు హేతువు కాదు. ఆ అగ్నికి ఉపాధి యగు కట్టెముక్కను కాల్చి వేయుటచే దానికి నాశము కలుగును. దృష్టాంతాంతరము చెప్పుచున్నాడు. మంచునకుగల చల్లదనము ఆ మంచుయొక్క అంశయగు తుషారకణమునకు నాశకముకాదు. ఆ

-నాగ్నేర్హే తో స్తదంశస్య జ్వాలాదేస్తాపః దాహతో నాశో నాస్తి తత్రోపాధిభూతకాష్ఠాంశదాహాన్నాశస్స్యాదితి దృష్టాంతాంతర మాహ-హిమస్య తచ్ఛైత్యం తదంశభూతస్య తుషారకణస్య నాశకం న స్యాదిత్యర్థః. కించ ఆస్తాం అంశత్వం వస్తుతః పర ఏవాయం. స పరస్య ద్వంద్వం సుఖదుఃఖాదికమస్తీతి. 56

అంశత్వము మాట అటులుంచుదము. వాస్తవమున పరబ్రహ్మకు సుఖదుఃఖాదులు లేవు. 56

శ్లో॥ న కేనచిత్క్వాపి కథంచ నాస్య
ద్వంద్వోపరాగః పరతః పరస్య ।
యథాహ మస్సంసృతిరూపిణ
స్స్యాదేవం ప్రబుద్ధో న బిభేతి భూతైః ॥ 57

టీ:- తదేహం షడేతే హేతవః ప్రసిద్ధాః నిరస్తాః.యది కశ్చిద్ధేత్వంతర ముద్భావయేత్. తదపి వస్తుమహిమాపేక్షాయాం న సంభవతీ త్యాహ -నేతి. నన్వపరోక్షః కథ మపహ్నూయతే? తత్రాహ -యథేతి. సంసృతి మవిద్యమానామేవ రూపయతి ప్రకాశయతీతి తథా అస్య అహమః అహంకారస్య యథా స్యాత్. న తథా పరతః ప్రకృతేః పరస్యాత్మనో ద్వంద్వసంబంధః అహంకార నిమిత్తోఽస్తి న వాస్తవ ఇత్యర్థః. ఏవం ప్రబుద్ధో యః సభూతైః కృత్వా న బిభేతి. 57

అని ఇట్లు ప్రసిద్ధములగు హేతువులారునూ నిరస్తములయినవి. ఇంకనూ ఎవరయిన వేరొక హేతువునూహించిననూ అది వస్తు మహిమనుబట్టి సంభవముకాదు అనుచున్నాడు. అయ్యా! అపరోక్షము ఎట్లు కప్పిపుచ్చబడుతుందియన చెప్పుచున్నాడు. అవిద్యమానమగు సంసారమును ప్రకాశింప చేయునట్టి అహంకారమునకు ఎట్లు ద్వంద్వం సంబంధముండునో అట్లు ప్రకృతికంటే పరుడగు ఈ ఆత్మకు ఎవ్వనిచేతనూ, ఎందునూ, ఎట్లునూ, ద్వంద్వ సంబంధము కలుగదు. ఈ విధముగ తెలిసినవాడు భూతములచే భయమునొందడు. 57

శ్లో॥ ఏతాం స ఆస్థాయ పరాత్మనిష్ఠా
మధ్యాసితాం పూర్వతమైర్మహర్షిభిః ।
అహం తరిష్యామి దురంతపారం
తమోముకుందాంఘ్రి నిషేవయైవ ॥ 58

టీ:- అతోఽహమప్యేతయైవ పరమాత్మనిష్ఠయా తరిష్యామీత్యాహ- ఏతామితి. సోఽహమిత్యన్వయః. నన్వియం నిష్ఠైవ కథం భవేత్తదాహ- ముకుందేతి. 58

కావున నేనును అట్లే పరమాత్మ నిష్ఠతో తరింతుననుచున్నాడు. అట్టి నేను చాలా పూర్వులగు మహర్షులచే అధిష్ఠితమగు పరమాత్మ నిష్ఠనుపొంది ముకుందుని పాదములను సేవించుట చేతనే అంతులేని పారముగల తమస్సును దాటెదను. 58

**శ్రీ భగవానువాచ**

శ్లో॥ నిర్విద్య నష్టద్రవిణో గతక్లమః
ప్రవ్రజ్యగాం పర్యటమాన ఇత్థమ్ ।
నిరాకృతో సద్భిరపి స్వధర్మా
దకంపితోఽమూం మునిరాహ గాథామ్ ॥ 59

టీ:- ప్రస్తావేన సహ గాథార్థం సంక్షేపతో దర్శయతి-ద్వాభ్యాం. నిర్విద్యేతి. ఇత్థం నష్టద్రవిణో నిర్విద్య గతక్లమః. ప్రవ్రజ్య గాం పర్యటన్. అసద్భిర్నిరాకృతోఽపి స్వధర్మాదకంపితః. స మునిః. అమూం గాథామాహేత్యన్వయః. 59

**శ్రీభగవానుడు ఈ విధముగా చెప్పచున్నాడు.**

ప్రస్తావనా సహితముగా గాథార్థమును రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. ఈ ప్రకారమున ధనము నశించిన వాడగుటచే నిర్వేదమునుపొంది సన్యసించి భూమిపై తిరుగుచూ శ్రమ తొలగినవాడై పరమాత్మనిష్ఠనొందినవాడై దుష్టులచే నిరాకరింపబడినవాడైయూ తన ధర్మమునుండి చలింపక ముని ఈ గాథను పలికెను. 59

శ్లో॥ సుఖదుఃఖప్రదో నాన్యః పురుషస్యాత్మవిభ్రమః ।
మిత్రోదాసీనరిపవస్సంసార స్తమసః కృతః ॥ 60

టీ:- సుఖేతి. మిత్రోదాసీనరిపవః సంసారోస్సర్వోఽపి చ తమసః అజ్ఞానతః. ఆత్మనో మనసో విభ్రమమాత్రః కృతః. న తాత్త్విక ఇత్యర్థః 60

మిత్రులు, ఉదాసీనులు, శత్రువులు అను ఈ త్రివిధ రూపమగు సంసారము అంతా అజ్ఞానకృతమయినది. సుఖదుఃఖములను కలిగించునది. పురుషునకు మనస్సు భ్రమింపచేయునది అంత కంటే వేరొకటికాదు. 60

శ్లో॥ తస్మాత్సర్వాత్మనా తాత నిగృహాణ మనోధియా ।
మయ్యావేశితయా యుక్త ఏతావాన్ యోగసంగ్రహః ॥ 61

టీ:- ఉక్తం ద్వంద్వసహనోపాయముపసంహరతి-తస్మాదితి. 61

తండ్రీ అందువలన సర్వ విధములుగా నా యందు ప్రవేశపెట్టబడిన మనస్సుచే కూడినవాడవై నీ మనస్సును నిగ్రహింపుము. ఇదియే సంగ్రహముగా నీకు తెలుపు యోగము. 61

శ్లో॥ య ఏతాం భిక్షుణా గీతాం బ్రహ్మనిష్ఠాం సమాహితః ।
ధారయన్ శ్రావయన్ శృణ్వన్ ద్వంద్వైర్నైవాభిభూయతే ॥ 62

టీ:- మనోనిగ్రహాశక్తోఽపి ఏతచ్ఛ్రవణాదినిష్ఠస్తత్ఫలం ప్రాప్నోతీత్యాహ-యదితి. ద్వంద్వైస్సుఖదుఃఖాదిభిః. శ్లో॥భిక్షుగీతాం ఫలం కృత్వా భక్తచిత్తగతో హరిః మోహం నిఘ్నన్నిహాభాతి పరమానందరూపతః 62

మునిచే గానము చేయబడిన ఈ బ్రహ్మనిష్ఠను ఎవ్వడు నిలుపుకొనునో, అవహితుడై వినిపించునో, వినునో అతడు సుఖ దుఃఖాదులచే బాధింపబడడు. 62

హరి భిక్షుగీతను మిషగా పెట్టి భక్తచిత్తగతమయిన మోహమును తొలగిస్తూ పరమానందరూపమును చూపెను.

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే, త్రయోవింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు త్రయోవింశోధ్యాయము సమాప్తము.**

## చతుర్వింశోఽధ్యాయః

శ్లో॥ చతుర్వింశే తు సాంఖ్యేన మనోమోహో నివార్యతే ।
ఆత్మన స్సర్వభావానామాగమాపాయచింతయా ॥

శ్లో॥ స్వపద ద్వంద్వభక్తనా మద్వంద్వత్వాయ సంయమమ్ ।
చిత్తస్యోక్త్వా పునః కృష్ణస్సాంఖ్యమత్రాహ తత్కృతే ॥

అద్వితీయాత్పరమాత్మనో మాయయా
ప్రకృతిపురుషద్వారా సర్వం ద్వైత ముదేతి ।

శ్లో॥ అథతే సంప్రవక్ష్యామి సాంఖ్యాం పూర్వవినిశ్చితమ్ ।
యద్విజ్ఞాయ పుమాన్ సద్యో జహ్యాద్వైకల్పికం భ్రమమ్ ॥ 1

టీ:- పున స్తత్రైవ లీయతే. ఇత్యేవ మనుసంధధానస్య ద్వంద్వభ్రమో నివర్తత ఇతి వక్తుం సాంఖ్యం ప్రస్తౌతి–అథేతి.పూర్వైః కపిలాదిభిర్వి నిశ్చితం వైకల్పితం భేదనిమిత్తం. భ్రమం సుఖ దుఃఖాది రూపం. 1

## 24వ అధ్యాయము

ఈ ఇరువది నాల్గవ అధ్యాయమున సాంఖ్యము వివరించ బడుచున్నది. దీనిచే సకల వస్తుజాతము పరమాత్మనుండే ఉద్భవించి అతనియందే లయమునందునని తలంచుట ద్వారా మనస్సు యొక్క అజ్ఞానము నివారింపబడుచున్నది. శ్రీకృష్ణ పరమాత్మ తన పాదముల జంటపై భక్తిని నిలిపిన వారికి ద్వంద్వ భ్రమ కలుగకుండుటకు మనో నియమమునుపదేశించి మళ్ళీ వారికై ఈ అధ్యాయమున సాంఖ్యా శాస్త్రమును చెప్పుచున్నాడు.

'అద్వితీయుడగు ఈ పరమాత్ముని మాయచే ప్రకృతిపురుషుల ద్వారా ద్వైతమంతయూ జనించును. అది మళ్ళీ ఆ పరమాత్మలోనే లయించును' అని మననము చేయువానికి ద్వంద్వభ్రమ తొలుగునని తెలుపుటకు సాంఖ్యమును గూర్చి ఇట్లు ప్రాస్తావించుచున్నారు.

ఇటుపైన నీకు పూర్వులగు కపిలాదులచే నిశ్చయింపబడిన సాంఖ్యమను తెలిపెదను. ఏ సాంఖ్యమును తెలిసికొని నరుడు శీఘ్రముగా భేదభ్రమను విడిచిపెట్టునో. 1

శ్లో॥ ఆసీత్జ్ఞానమథో అర్థ ఏకమేవా వికల్పితమ్ ।
యదా వివేకనిపుణాఆదౌ కృతయుగే యుగే ॥ 2

టీ:- ఆసీదితి. అథోశబ్దః కార్త్స్న్యే.జ్ఞానం ద్రష్టా.తేనదృశ్యః కృత్స్నో ఽ ప్యర్థః.అవికల్పితంవికల్పశూన్యమేకమేవ బ్రహ్మణ్యేవ లీనమాసీదిత్యర్థః కదేత్య పేక్షాయామాహ – ఆదౌ యుగే యుగేభ్యఃపూర్వం ప్రళయ ఇత్యర్థః. తథా అదౌ యుత్కృతయుగం తస్మింశ్చ అన్యదాపి. యదా వివేకనిపుణా జనా భవంతి. తదాపి తేషాం భేదాస్ఫూర్తేః. 2

ద్రష్ట, అద్రష్టకు దృశ్యమగు సమస్తమైన పదార్థమును వికల్పము లేని బ్రహ్మయందే లీనమై ఏకమైయుండెను. ఎప్పుడట్లుండెనో చెప్పుచున్నాడు. యుగములకు పూర్వము ప్రళయ కాలమున అని యర్థము. అట్లే ఆ మొదటి కృతయుగమునందును. అట్లే ఏ కాలమున జిజ్ఞాసులుందురో అప్పుడునూ జ్ఞానులకు భేదము స్ఫురించదు కావున. (2)

శ్లో॥ తన్మాయాఫలరూపేణ కేవలం నిర్వికల్పకమ్ ।
వాఙ్మనోగోచరం నిత్యం ద్విధా సమభవద్బృహత్ ॥ 3

టీ:- తదితి. తద్బృహత్ బ్రహ్మవాఙ్మనోఽగోచరం యథా భవతి తథా. మాయాదృశ్యం ఫలం తత్ప్రకాశః తద్రూపేణ మాయావిలాసరూపేణ వా. ద్విధా సమభవత్. 3

ఒక్కటియే ఐన ఆ బృహద్బ్రహ్మము, దృశ్యముగు ప్రపంచము, బ్రహ్మ యొక్క ప్రకాశమను రూపములతో రెండుగా అయ్యెను. బ్రహ్మకంటే భిన్నముకానివి మాటలకు మనస్సుకు అందనిది మాయ, అవ్యక్తరూపము కనుక జీవుడతి సూక్ష్ముడు కనుక. 3

శ్లో॥ తయోరేకతరో హ్యర్థః ప్రకృతిశ్శోభయాత్మికా ।
జ్ఞానమన్యతమాభావః పురుషస్సోఽభిధీయతే ॥ 4

టీ:- తయోరితి. తయోర్ద్విధా భూతయోరంశయోర్మధ్యే. ఉభయాత్మికా కార్యకారణరూపిణీ. 4

ఆ రెంటిలో ఒక వస్తువు ప్రకృతి యనబడును. ఆ ప్రకృతి కార్యకారణ స్వరూపము. వేరొకటి జ్ఞానము. అదే పురుషుడని చెప్పబడును. 4

శ్లో॥ తయోరజస్సత్త్వమితి ప్రకృతే రభవన్ గుణాః ।
మయా సంక్షోభ్యమాణాయాః పురుషానుమతేన వా ॥ 5

టీ:- తమ ఇతి. అభవన్ అభివ్యక్తా బభూవుః. మయా పరమేశ్వరేణ జీవాదృష్టప్రయుక్తత్వాత్ సృష్టేః పురుషానుమతత్వం. యద్వా. స్వస్యైవ ప్రకృతీక్షణరూపా యా పురుషావస్థా. తదనుమతేన తద్ద్వారేణేత్యర్థః. 5

సృష్టి జీవుని అదృష్టముచే ప్రయుక్తమైనది కనుక అట్టి జీవునికి అంగీకార్యమగు లేదా తనదే అగు ప్రకృతిని చూచుటయను ఏ పురుషావస్థ కలదో దాని ద్వారా పరమేశ్వరుడనగు నా చే కలపబడు చున్న ప్రకృతి వలన తమస్సు, రజస్సు సత్యమనెడి గుణములు అభివ్యక్తము లయినవి. లేదా తనదేయైన ప్రకృతీక్షణ రూపమయిన యే పురుషావస్థ కలదో దాని అనుమతి ద్వారా (తద్వారాయని అర్థము)5

శ్లో॥ తేభ్యస్సమభవత్సూత్రం మహాసూత్రేణ సంయుతః ।
తతో వికుర్వతో జాతో యోఽహంకారో విమోహనః ॥ 6

టీ:- తేభ్య ఇతి. సూత్రం క్రియాశక్తిమాన్ ప్రథమో వికారః. తతో మహాన్ జ్ఞానశక్తిః. నన్వయం మహానేవప్రథమో వికారః ప్రసిద్ధః తత్రాహ - జ్ఞానస్య క్రియాగర్భత్వాత్ సూత్రేణ సంయుతః న పృథక్ ఏకమేవ తత్త్వం క్రియాజ్ఞాన శక్తిభ్యాం ద్విధోచ్యత ఇత్యర్థః. విమోహనః జీవస్య భ్రమ హేతుః. సజాతః. 6

ఆ గుణముల వలన క్రియాశక్తిగల ప్రథమ వికారము ఏర్పడెను. దానినుండి జ్ఞానశక్తి పుట్టెను. మహత్తత్త్వము లేక జ్ఞానశక్తియే ప్రథమ వికారమనిగదా ప్రసిద్ధము. అనగా ఇట్లు చెప్పుచున్నాడు.

ఆ జ్ఞానశక్తి జ్ఞానక్రియలు రెండును కలదియగుటచే సూత్రముచే (వేర్వేరుగా కాక) కలసియున్నది. ఒకే తత్త్వము క్రియాజ్ఞానశక్తులచే రెండుగా చెప్పబడుచున్నదనియర్థము. వికారము పొందిన మహతత్త్వమునుండి అహంకారము పుట్టెను. అదియే జీవులకు భ్రమ హేతువు. 6

శ్లో॥ వైకారికస్తైజసశ్చ తామసశ్చేత్యహం త్రివృత్ ।
తన్మాత్రేంద్రియమనసాం కారణం చిదచిన్మయః ॥ 7

అహంకారము వైకారికము, తైజసము, తామసము అని మూడు విధములుగా; పంచతన్మాత్రలు, ఇంద్రియములు, మనస్సు. మన శ్శబ్దము దేవతలకును ఉపలక్షణమగుట వలన దేవతలకు కారణము

టీ:- వైకారిక ఇతి. యతస్తన్మాత్రాదీనాం కారణం. మనశ్శబ్దేన దేవతానమప్యుపలక్షణం. చిదచిన్మయః చిదాభాస వ్యాప్తత్వాదుభయ గ్రంథిరూప ఇతి జీవోపాధిత్వం దర్శితం. యద్యపి. శ్రు. "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూత" ఇత్యాది శ్రుతేః. శ్రు. "అన్నమయం హి సోమ్యమన" ఇత్యాది శ్రుతేశ్చ. ప్రథమం భూతాని జాయంతే. తేభ్యశ్చాపంచీకృతేభ్యః ప్రాణాదిక్రమేణ సమస్త్యాత్మకం లింగ శరీరం. పంచీకృతేభ్యశ్చ బ్రహ్మాండం. తస్మిన్ వైరాజస్త దంతర్యామీ లీలావిగ్రహః క్షీరాబ్ధిశాయీ నారాయణః. తన్నాభిపద్మే చ వైరాజస్య భోగవిగ్రహ శ్చతురాననః. తతో యథావసరమనేష్యాం జీవానామావిర్భావ ఇతి ప్రక్రియా. తథాపి. చిత్తాభివ్యక్తిపూర్వకోఽహంకారః. తతో భూతేంద్రి యాది వ్యవహార ఇత్యేతావతా మహదాదిక్రమేణ సృష్టిరుచ్యతే. తథాచోక్తం. శ్లో. "మృల్లోహవిస్ఫులింగాద్యై స్సృష్టిర్యా చోదితాన్యథా, ఉపాయస్సోఽవతారాయ నాస్తి భేదః కథం చ నే" తి. 7

చిదాభాస వ్యాప్యమగుటచే ఉభయగ్రంథి రూపము అని జీవోపాధిత్వము దర్శితమయినది. యద్యపి తస్మాద్వాఏతస్మాదాత్మనఆకాశస్సంభూతః అను శ్రుతి వలన 'అన్నయయగ్ంహిసోమ్యమనః' అను శ్రుతి వలననూ మొదట భూతములు పుట్టును. అపంచీకృతములయిన వాటి నుండి ప్రాశాదిక్రమేణ సమష్ట్యాత్మకమయిన లింగశరీరము, పంచీకృతముల యిన ఆ భూతముల వలన బ్రహ్మాండము. దానియందు వైరాజము (విరాట్టుగు) తదంతర్యామి, లీలా స్వరూపుడు, క్షీరాబ్ధిశయనుడు శ్రీనారాయణుడు. ఆయన నాభి పద్మమునందు భోగమూర్తియగు చతురాననుడు. ఆయన వలన అవసరమునుబట్టి తక్కిన జీవుల ఉత్పత్తి అని అది ప్రక్రియ అయ్యును. చిత్తాభివ్యక్తి పూర్వకముగా అహంకారము, దానివలన భూతేంద్రియాది వ్యవహారము అని ఇట్లు మహదాదిక్రమము ననుసరించి సృష్టి చెప్పబడుచున్నది. ఇదియే ఇట్లు చెప్పుబడినది.

మృల్లోహవిస్ఫులింగాద్యైస్సృష్టిర్యాచోదితాన్యథా ।
ఉపాయస్సోఽవతారాయ నాస్తి భేదః కథం చ న ॥ అని

మృల్లోహవిస్ఫుంగాదుల వలన ఏ సృష్టి అన్యథా చెప్పబడినదో అది దానియందు తాత్పర్యము కాదు. పరమాత్మను పట్టుటకై సృష్టి వాక్యములు ఉపాయములే కాని ఇన్ని రకాల సృష్టియని సృష్టిని చూపుట శ్రుతి తాత్పర్యము కాదు. 7

శ్లో॥ అర్థస్తన్మాత్రతో జజ్ఞే తామసాదింద్రియాణి చ ।
తైజసాద్దేవతా ఆసన్నే కాదశ చ వైకృతాత్ ॥ 8

టీ:- తస్మాత్త్రివిధా త్రివిధ ప్రపంచోత్పత్తిం దర్శయతి-అర్థ ఇతి. తన్మాత్రాత్ శబ్దాదితన్మాత్రకారణాత్ తామసాత్ తద్ద్వారా. అర్థో మహాభూత రూపో జజ్ఞే బభూవ. భూతానామావరణస్వభావత్వాత్. ఇంద్రియాణి దశ. తైజసాత్ రాజసాత్. తేషాం ప్రవృత్తిస్వభావత్వాత్. వైకృతాత్. సాత్త్వికాత్. దేవతాః. శ్లో. దిగ్వాతార్కప్రచేతో౽ శ్వివహ్నీంద్రో పేంద్రమిత్రకాః. చంద్రశ్చేత్యేకాదశ. చ శబ్దాత్ మనశ్చ.తేషాం ప్రకాశ స్వభావత్వాత్. 8

ఆ త్రివిధాహంకారమునుండి త్రివిధమగు ప్రపంచపుటుత్పత్తిని ప్రదర్శించుచున్నాడు. శబ్దాది తనాత్మత్రలకు కారణమైన తామసాహంకారము ద్వారా భూతములావరించు స్వభావముకల మహాభూతములు జనించెను. రాజసాహంకారము ద్వారా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు పది జన్మించెను. అవి ప్రవర్తించు స్వభావము కలవి. సాత్వికాహంకారము వలన దిక్కులు, వాయువు, సూర్యుడు, వరణుడు, అశ్విని దేవతలు, అగ్ని , ఇంద్రుడు, ఉపేంద్రుడు, మిత్రుడు, చంద్రుడు అను పదకొండు చకారముచే మనస్సును జన్మించినది. ప్రకాశించుట వీటి స్వభావమైయున్నది. 8

శ్లో॥ మయా సంచోదితా భావాస్సర్వే సంహత్యకారిణః ।
అండముత్పాదయామాసుర్మమాయతన ముత్తమమ్ ॥ 9

టీ:- మయేతి. మమ వైరాజస్యాంతర్యామిణః. 9

సమస్తమైన మహదాదులు నాచే ప్రేరేపితములై కలిసి కార్యోత్పాదన సమర్థములై వైరాజాంతర్యామియగు నాకు శ్రేష్ఠమగు స్థానమైన, బ్రహ్మాండమును సృజించినవి. 9

శ్లో॥ తస్మిన్నహం సమభవమంతే సలిలసంస్థితౌ ।
మమనాభ్యామభూత్పద్మం విశ్వాఖ్యం తత్ర చాత్మభూః ॥ 10

జలమందున్న ఆ అండమందు నేను శ్రీమన్నారాయణ రూపుడైన లీలావిగ్రహముతోఉంటిని. నా నాభియందు విశ్వమను పేరుగల లోకకారణభూతమగు పద్మమావిర్భవించెను. ఆ పద్మమందు

టీ:- తస్మిన్నితి. సలిలే సంస్థితిర్యస్య తత్ సలిల సంస్థితి. తస్మిన్ సలిల సం స్థితావండే. శ్రీనారాయణరూపో లీలావిగ్రహేణ సమభవం స్థిత ఇత్యర్థః. విశ్వాఖ్యం లోకకారణభూతం. తత్ర చాత్మభూః చతురానన రూపేణ భోగ విగ్రహేణ పునర్వైరాజ ఏతస్మిన్నావిర్భూత ఇత్యర్థః. 10

చతురాననరూప భోగవిగ్రహముతో ఆ వైరాజుడే ఆవిర్భవించెను. 10

శ్లో॥ సోఽసృజత్తపసా యుక్తో రజసా మదనుగ్రహాత్ ।
లోకాన్ సపాలాన్విశ్వాత్మాభూర్భువస్స్వరితి త్రిధా ॥ 11

టీ:- రజసాయుక్తో మదనుగ్రహాత్తపసా సృజత్. భూః అతలాది సహితా. భువః అంతరిక్షలోకః. స్వః స్వర్గః. మహర్లోకాదేరప్యుపలక్షణం. (11)

ఆ చతుర్ముఖుడు రజోగుణ సంయుక్తుడై నా యనుగ్రహముచే, (తపస్సుచే) లోకపాలురతో కూడి, అతలాదిసహితమగు భూలోకమును, అంతరిక్షలోకమును, స్వర్గలోకమును (ఇది మహర్లోకాదులకుప లక్షణము) సృష్టించెను. 11

శ్లో॥ దేవానా మోక ఆసీత్స్వర్భూతానాం చ భువః పదమ్ ।
మర్త్యాదీనాం చ భూలోకస్సిద్ధానాం త్రితయాత్పరమ్ ॥ 12

టీ:- లోక సృష్టి ప్రయోజనమాహ-సార్ధేన. దేవానామితి. ఓకో నివాసః. పదం స్థానం. త్రితయాత్పరం మహర్లోకాది భూమేరధః అతలాది. (12,13)

లోకసృష్టికి ప్రయోజనమును చెప్పుచున్నారు. స్వర్గము దేవతలకు నివాసమయ్యెను. భువర్లోకము భూతములకు స్థానమయ్యెను. భూలోకము మనుజులు మొదలగు వారికి నివాసమయ్యెను. ఈ మూడు లోకములకంటే పరమగు మహర్లోకము సిద్ధులకు నివాసమయ్యెను. 12

శ్లో॥ అధో సురాణాం నాగానాం భూమేరేకోఽసృజత్ప్రభుః ।
త్రిలోక్యాం గతయస్సర్వాః కర్మణాం త్రిగుణాత్మనామ్ ॥ 13

ప్రభువగు ఆ చతుర్ముఖుడు భూలోకమునకు క్రిందుగా అసురుల యొక్క ఉరగులయొక్క నివాసమును సృష్టించెను. పాతాళాది సహితమైన భూర్భువస్వర్లోకములందు గార్హస్థ్య ధర్మముల యొక్క ఫలాత్మక స్థానములు భోగాది తారతమ్యముచే కలుగును. 13

శ్లో॥ యోగస్య తపసశ్చైవ న్యాయస్య గతయోఽమలాః ।
మహర్జనస్తపః సత్యం భక్తియోగస్య మద్గతిః ॥ 14

టీ:- ఏవం వ్యవస్థాయాం కారణమాహ-సార్ధేన. త్రిలోక్యామితి. త్రిలోక్యాం పాతాళాదిసహితాయాం. యోగాదితారతమ్యేన యథోత్తరం మహర్లోకాదయః. మద్గతిః శ్రీవైకుంఠలోకః. 14

అష్టాంగయోగము, తపస్సు, సన్యాసములచే మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములు పొందబడుచున్నవి. భక్తి యోగమునకు వైకుంఠము చేరుటయే సద్గతి. 14

శ్లో॥ మయా కాలాత్మనాధాత్రాకర్మ యుక్తమిదం జగత్ ।
గుణప్రవాహ ఏతస్మిన్నున్మజ్జతి నిమజ్జతి ॥ 15

టీ:- తత్ర తు మద్గతి వ్యతిరేకేణేతరాః గతయశ్చంచలా ఇత్యాహ - మయేతి. వైరాగ్యార్థం మయా కాలాత్మనా కాలశక్తినా. ధాత్రా పరమేశ్వరేణ కర్మఫలప్రదేన హేతుభూతేన. గుణప్రవాహే సంసారే. ఉన్మజ్జతి ఆసత్య లోకముత్తమాగతీః ప్రాప్నోతి. పునర్నిమజ్జతి ఆస్థావరం నీచాః గతీః ప్రాప్నోతి. 15

అందు మద్గతి తప్ప తక్కిన గతులు చంచలములని వైరాగ్యము కొరకై చెప్పుచున్నారు. కాలాత్మకుడను, పరమేశ్వరుడను అగు నాచే కర్మఫలముతో సంబంధింపచేయబడిన ఈ జగత్తు సంసారమునందు సత్యలోకము వరకు ఉత్తమ గతులను పొందును. మళ్ళీ స్థావరముల వరకు నిమ్నగతిని పొందును. 15

శ్లో॥ అణుర్బృహత్కృశస్థూలో యో యోభావః ప్రసిధ్యతి ।
సర్వోఽప్యుభయసంయుక్తః ప్రకృత్యా పురుషేణ చ ॥ 16

టీ:- సృష్టినిరూపణస్యా ద్వితీయాత్మ ప్రతిపత్త్యర్థత్వాత్ తత్ప్రతిపాదనాయ కారణేన కార్యస్యవ్యాప్తిమాహ - అణురితి. ఉభయేన సంయుక్తః వ్యాప్తః. తదేవాహ - ప్రకృత్యేతి. 16

సృష్టి నిరూపణము, అద్వితీయాత్మ జ్ఞానమే కారణము, ప్రయోజనము కాగలదగుటచే దానిని ప్రతిపాదించుటకు కారణముచే కార్యవ్యాప్తిని చెప్పుచున్నాడు. ఏ యే భావము అణువు, మహత్తు కృశించినది లావైనది యని ప్రసిద్ధినందుచున్నదో ఆ యా భావమంత యూ ప్రకృతిచే లేదా పురుషునిచే ఈ రెంటిచేతనే వ్యాప్తమైయున్నది. 16

శ్లో॥ యస్తు యస్యాదిరంతో వై స వై మధ్యం చ తస్య తత్ ।
వికారోవ్యవహారార్థో యథా తైజసపార్థివాః ॥ 17

టీ:- ఇదానీం కార్యస్య యః ఆదికారణం. అంతః. లయస్థానం చ, తస్య మధ్యం మధ్యావస్థాపి స ఏవ. వై ప్రసిద్ధం మృత్సువర్ణాదిషు. అత ఏవావ్యభిచారిత్వాత్ స ఏవ సన్నేతరః. అలం తర్హి మిథ్యాభూత కార్యసృష్ట్యా. తత్రాహ-వికార ఇతి. తైజసాః కటకకుండలాదయః. పార్థివా ఘటశరావాదయశ్చ యథేతి. 17

ఇప్పుడు కార్యము కారణరూపమగుటను చూపుచున్నాడు. ఎవరైతే ఏ కార్యమునకు కారణమును, లయస్థానమును అగుచున్నాడో దానికి మధ్యావస్థయు అతడే. ఇది మృత్యువర్ణాదులలో చూపబడినది. అవ్యభిచారియగుటచే అతడేకాని వేరొకడు కాడు. అట్లయినచో మిథ్యా భూతమయిన కార్యసృష్టియేల అనగా చెప్పుచున్నారు. కార్యరూపమగు వికారము వ్యవహరించుట కొరకు ఎట్లో అట్లు తైజసములగు కటకకుండలాదులును, పార్థివములగు ఘటశరావాదులునూ. 17

శ్లో॥ యదు పాదాయ పూర్వస్తుభావో వికురుతే పరమ్ ।
ఆదిరంతో యదా యస్య తత్సత్యమభిధీయతే ॥ 18

అట్లగుచో స్వకార్యము కొరకు మహదాదులకు కూడా ఆద్యంత రూపత్వముండుట వలన సత్యములే కావలెనని చెప్పుచున్నాడు.

ఏ రూపమును ఉపాదాన కారణముగా స్వీకరించి పూర్వకారణ

టీ:- నన్వేవం తర్హి స్వకార్యం ప్రతి మహదాదీనామ ప్యాద్యంత రూపత్వాత్సత్యత్వం స్యాత్తత్రాహ- యదితి. యద్రూపముపాదాయ ఉపాదాన కారణతయా స్వీకృత్య పూర్వః కారణరూపో మహదాదిర్భావః. పరం అహంకారాదికం భావం. వికురుతే సృజతి. యథా. మృత్పిండో మృదముపాదాయా స్వయం నిమిత్త భూతో ఘటం సృజతి. తద్వత్స ఏవ సన్నితి పూర్వస్యానుషంగః కథం తర్హి మృత్తికేత్యేవ సత్యమిత్యాది శ్రుతిస్తత్రాహ-ఆదిరితి-యద్యదా యస్యాదిరంతశ్చ విద్యతేతదా తత్సత్య మిత్యభిధీయతే. శ్రుత్యా పరమకారణస్యాత్మనః సత్యత్వవివక్షయేత్యర్థః (18)

మగు మహదాది భావము, అహంకారాది భావమును సృజించుచున్నదో ఎట్లు పిండము మట్టిని తీసికొని తానే నిమిత్తమై ఘటమును సృజించుచున్నదో అట్లు , అట్లగునో 'మృత్తికేత్యేవసత్య' మను శృతి ఎట్లు పొసగును అనగా చెప్పుచున్నాడు. ఏది, ఎప్పుడు, దేనికి ఆది, అంతముగను వివక్షితమగుచున్నదో అప్పుడు అది అసత్యమని చెప్పబడుచున్నది. పరమ కారణమయినదే సత్యమని శృతి వివక్ష చేసినది గనుక. 18

శ్లో॥ ప్రకృతిర్హ్యస్యోపాదానమాధారః పురుషః పరః ।
గుణాభివ్యంజకః కాలో బ్రహ్మతత్త్రితయం త్వహమ్ ॥ 19

ఓయీ! అట్లయ్యును ప్రకృతిపురుషకాలములు కార్యములు కావు కనుక భిన్నములగుటచే అద్వితీయత ఎట్లు అనగా చెప్పుచున్నాడు.

టీ:- నను తథాపి సర్వవికారమిథ్యాత్వే ప్రకృతి మహాపురుషకాలానాం పృథక్సత్యత్వమేవ వక్తవ్యం. అకార్యభూతానాం భిన్నత్వాత్కథమద్వితీయతా. తత్రాహ- ప్రకృతి రితి. అస్య సతః కార్యస్య. ఉపాదానం ఉపాదానతయా ప్రసిద్ధా ప్రకృతిః. యశ్చ తస్యా ఆధారః అధిష్ఠాతా పరః పురుషః.యశ్చ గుణక్షోభేణాభివ్యంజకః కాలః. తత్త్రియం బ్రహ్మరూపోఽహమేవ. న తు పృథక్ ప్రకృతేః శక్తిత్వాత్. పురుషకాలయోరవస్థా రూపత్వాత్. 19

ఈ సత్తగు కార్యమునకు ఉపాదానముగా ఏ ప్రకృతి ప్రసిద్ధమై యున్నదో ఆ ప్రకృతికాధారమైన అధిష్ఠాతయెవడో, పరమపురుషుడెవ్వడు గలడో, గుణక్షోభతో అభివ్యంజకమగు కాలమేదికలదో, ఆ మూడును బ్రహ్మరూపుడనగు నేనే కాని వేరు కాదు. ప్రకృతి శక్తి కనుక పురుష కాలములు అవస్థారూపములగుట చేతను ఇవి వేరుకావు. (19)

శ్లో॥ సర్గః ప్రవర్తతే తావత్పౌర్వాపర్యేణ నిత్యశః ।
మహాన్ గుణవిసర్గార్థస్స్థిత్యంతో యావదీక్షణమ్ ॥ 20

టీ:- ఏవం తావత్కాలత్రయేఽప్యవ్యభిచారాత్. బ్రహ్మైవ సత్యమితి వక్తుం తస్య సృష్టికారణత్వేనాదౌ సత్త్వముక్త్వా మధ్యేఽపి తస్యైవ సత్త్వ ముపపాద్యాంతే. అవధిత్వేన సత్త్వం దర్శయిష్యన్ సర్గ ప్రవాహ రూపాయాః స్థితేరవధిమాహ-సర్గ ఇతి-మహాన్ బహుళః. పౌర్వాపర్యేణ పితృపుత్రాదిరూపేణ. నిత్యశఃఅవిచ్ఛేదేన. కిమర్థం ప్రవర్తతే? తత్రాహ- గుణేషు వివిధతయా సృజ్యత ఇతి గుణవిసర్గో జీవః తదర్థః. తద్భోగప్రయోజనః. కిం పర్యంతం ప్రవర్తతే. యావత్ స్థితేరంతః. సోఽపి కిమవధి స్తదాహ-యావదీక్షణం పరమేశ్వరస్య. తావత్. 20

ఈ ప్రకారము త్రికాలములందును వ్యభిచరించనిదగుటచే బ్రహ్మయే సత్యమని చెప్పుటకై, దానికి సృష్టికారణముగ మొదట సత్యమును చెప్పి నడుమగూడా దానికి సత్వమునే ఉపపాదించి చివరకు అవధిగా సత్యత్వమును చూపబోవుచు సృష్టి ప్రవాహరూప మగు స్థితి యొక్క అవధిని చెప్పుచున్నారు.

ఆ స్థితి గొప్పదియు, పితృపుత్రాది రూపముగా ఎడతెగక సృష్టి ప్రవర్తించును. అది దేహములందు వివిధముగా సృజింపబడు జీవుని భోగమే ప్రయోజనము కాగలది. ప్రళయము వరకు ఉండునది. ఆ స్థితియు భగవత్సంకల్పము ఉన్నంత వరకు ఉండునది. 20

శ్లో॥ విరాణ్మయాసాద్యమానో లోకకల్పవికల్పకః ।
పంచత్వాయ విశేషాయ కల్పతే భువనైస్సహ ॥ 21

టీ:- ప్రళయం నిరూపయతి-విరాడితి. విరాట్ బ్రహ్మాండం. మయా కాలాత్మనా. ఆపాద్యమానః వ్యాప్యమానః. లోకానామహరహః కల్పాః సృష్టి ప్రళయాః వివిధాః కల్ప్యంతే యస్మిన్ తాన్ వా విశ్వస్మిన్ కల్పయతీతి వా తథా. సః తథా భూతోఽపి. పంచత్వాయ పంచత్వ రూపాయ విశేషాయ విభాగాయ కల్పతే యోగ్యో భవతి. పంచానాం భూతానామైక్యరూపం తేషాం పృథగ్భావాపత్త్యా నశ్యతీత్యర్థః. 21

ప్రళయమును నిరూపించుచున్నాడు. బ్రహ్మాండము కాలాత్మకు డనగు నాచే వ్యాపించబడుచున్నదై లోకములకు ప్రతిదినము వివిధము లగు సృష్టి ప్రళయములు కల్పించుచున్నదైనను, పంచత్వరూపమగు విశేషమునకై అనగా విభాగమునకైయోగ్యమగుచున్నది. ఈ బ్రహ్మాండము పంచభూతములకైక్య రూపమగుటచే ఆ పంచ భూతములెపుడు వేరగునో అపుడది నశించుచున్నది. 21

శ్లో॥ అన్నేప్రలీయతే మర్త్య మన్నం ధానాసు లీయతే ।
ధానాభూమౌ ప్రలీయంతే భూమిర్గంధే ప్రలీయతే ॥ 22

టీ:- అత్ర. శ్రు.“తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః. ఆకాశాద్వాయుః. వాయోరగ్నిః. అగ్నే రాపః, అద్భ్యః పృథివీ. పృథివ్యా ఓషదయః. ఓషదీభ్యోఽన్నం-అన్నాత్పురుష” ఇతి. శ్రుత్యుక్త సృష్టిక్రమ ప్రాతిలోమ్యేన ప్రళయమాహ-అన్న ఇతి. మర్త్యం శరీరం. యేనో పచితం తస్మిన్నన్నే శతవర్షయా అనావృష్ట్యా క్షీణే సతి. తత్రైవ లీయత ఇత్యర్థః. అన్నం ధానాసు బీజమాత్రావశేషం భవతీత్యర్థః. ధానాభూమౌ. ఉప్తాన ప్రరోహంతీత్యర్థః. భూమిర్గంధే. సంవర్తకాదిత్యశోషితా సంకర్షణ ముఖాగ్నినా దగ్ధా చ సతీ భూత సూక్ష్మరూగంధతన్మాత్రావశేషాభవతి. 22

అందు ‘తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషయధః, ఓషధీభ్యోన్నం, అన్నాత్పురుషః’ అని వేదోక్తమగు సృష్టికి ప్రతిలోమముగా లయమును చెప్పుచున్నాడు. శరీరము దేనిచే వృద్ధి పొందెనో ఆ అన్నము శతవర్ష అనావృష్టియందు క్షీణింపగా అచటనే లయించుచున్నదని భావము. అన్నము బీజమాత్రావశిష్టమగుచున్నది. బీజములు నాటబడియు మొలకెత్తవు. భూమి ప్రళయకాలపు సూర్యునిచే శోషింపచేయబడినదై సంకర్షుని ముఖాగ్నిచే తగులబడినదై భూత సూక్ష్మరూపమగు గంధము మాత్రమే మిగిలినదగుచున్నది. 22

శ్లో॥ అప్సుప్రలీయంతేగంధ ఆపశ్చస్వగుణేరసే ।
లీయతే జ్యోతిషి రసో జ్యోతీరూపే ప్రలీయతే ॥ 23

టీ:- అప్సిత్వి. అప్సు గంధః. శతవర్ష యా వృష్ట్యా ప్లావ్యమానోఽప్సు లీయతే. ఏవమేవాపశ్చ జ్యోతిషా శోష్యమాణా రసమాత్రావశేషా భవంతి తతో రసోఽపి తస్మిన్ లీయతే జ్యోతిశ్చ వాయునాభిభూయమానం రూప మాత్రం సత్తస్మిన్ లీయతే. 23

గంధము నూరు సంవత్సరముల వానచే తడువబడి జలమందు లీనమగుచున్నది. జలములును జ్యోతిస్సుచే ఇంకించబడినవై తమగుణ మగు రసమందు లీనమై, రసమాత్రావశిష్టములగుచున్నవి. అంతట రసమును జ్యోతిస్సునందు నశించుచున్నది. తేజము వాయువుచే తిరస్కరింపబడినదై రూపామాత్రవశిష్టమగుచున్నది. 23

శ్లో॥ రూపం వాయౌ స తు స్పర్శేలీయతేసోఽపి చాంబరే ।
అంబరం శబ్దతన్మాత్ర ఇంద్రియాణి స్వయోనిషు ॥ 24

టీ:- రూపమితి-వాయుస్తు కాలప్రేరితే నాంబరేణ గ్రస్తః స్పర్శ మాత్రస్సన్ లీయతే. అంబరం చ భూతాదినా అహంకారేణ గ్రస్యమానం శబ్దతన్మాత్రే లీయతే తదేవం తామసాహంకారకార్యస్య. శబ్ద పర్యంతం లయముక్త్వా రాజసాహంకార కార్యస్యాప్యాహ - ఇంద్రియాణి స్వయోనిష్వితి. స్వప్రవర్తకదేవతాసు తేషాం. ప్రవృత్తి స్వభావత్వాత్ ప్రవృత్తేశ్చ దేవతాధీనత్వాత్తాసు లయ ఇతి. వాచోయుక్తిః. వస్తు తస్తు స్వకారణే రాజసాహంకార ఏవ లయోఽభిప్రేతః. 24

రూపము వాయువునందును, ఆ వాయువును స్పర్శయందును, ఆ స్పర్శము ఆకాశమందును, ఆ ఆకాశము శబ్దతన్మాత్రయందును, ఇంద్రియములు తమకు ప్రవర్తకములైన దేవతలయందును లయించుచున్నవని అభిప్రాయము. వస్తుతః స్వకారణమైన రాజసాహంకారమునందు లయము అభిప్రేతమయి యున్నది. 24

శ్లో॥ యోనిర్వైకారికే సౌమ్య లీయతే మనసీశ్వరే ।
శబ్దోభూతాదిమప్యేతి భూతాదిర్మహతి ప్రభుః ॥ 25

టీ:- యోనిరితి-యోనిరిత్యుద్దేశ్యగతత్వాదేకత్వమవివక్షితం. యోనయో దేవతాస్తు మనసి. కుతః. ఈశ్వరే నియంతరి శ్లో. "మనో వశేఽన్యేహ్య భవంశ్చ దేవా" ఇత్యుక్తత్వాత్. ఇంద్రియ లయోక్త ఏవాత్రాప్యభిప్రాయః. మనశ్చ దేవతాభిస్సహ వైకారికే అహంకార ఇత్యర్థః. తమసాహంకారకార్యవశేషితస్య శబ్దస్య లయమాహ - శబ్దో భూతాదిం తామసాహంకారం అప్యేతి తస్మిన్ లీయత ఇత్యర్థః. భూతాది రిత్యుపలక్షణం. త్రివిధోఽప్యహంకారో మహతి జడాంశం విహాయ

యోనిః ఇంద్రియ ప్రవర్తక దేవతలు. (యోనిఅనిఉద్దేశగతమయి ఉన్నందున ఏకత్వము అవివక్షితమైనది) నియంతయగు మనస్సునందు 'మనోవశేన్యేహ్యభవం స్మదేవాః' అని చెప్పబడుట వలన ఇంద్రియ లయమే ఇక్కడ చెప్పబడినదని అభిప్రాయము. మనస్సు దేవతలతోసహా వైకారికాహంకారమునందుయని అర్థము. తామసాహంకారకార్యావ శేషితమైన శబ్దమునకు లయము చెప్పుచున్నాడు. శబ్దము తామసాహంకారమును పొందును. దానియందు లయమగునని అర్థము భూతాదియని ఉపలక్షణము. త్రివిధాహంకారము జడాంశమునువీడి జ్ఞానక్రియాశకిమాత్ర రూపముగా నుండును. కథం భూతః = ఎట్టివి

జ్ఞానక్రియాశక్తిమాత్రరూపో భవతి. కథం భూతః ప్రభుః సమర్థః. సర్వ జగన్మోహకత్వాత్. 25

యనగా ప్రభుః = సర్వజగన్మోహకుడగుటచే సమర్థుడు). 25

శ్లో॥ సలీయతే మహాన్ స్వేషు గుణేషు గుణవత్తమః ।
తేఽవ్యక్తే సంప్రలీయంతే తత్కాలే లీయతేఽవ్యయే ॥ 26

టీ:- స ఇతి. స చ మహాన్ స్వకారణేషు. జ్ఞానక్రియాశక్తి మత్త్వాద్గుణ వత్తమః. తాదృగ్భావం విహాయ గుణమాత్రరూపో భవతి. తే చావ్యక్తే ప్రకృతౌ సామ్యావస్థాం గచ్ఛంతీత్యర్థః. తదవ్యక్తం కాలే. కాలాధీనత్వా త్తేనైకీభూయావతిష్ఠతే. అవ్యయే ఉపరతవృత్తౌ. 26

జడాంశము జ్ఞానక్రియాశక్తిమంత మగుటచే గుణవత్తమగును. గుణవత్తమగు ఆ మహతత్త్వము స్వకారణ గుణములందు లీనమగుచున్నది. ఆ గుణములు అవ్యక్తమందు లీనమగుచున్నవి. ఆ అవ్యక్తము ఉపరతవృత్తి గల కాలాధీనమగుటచే దాని యందే లయము నొందుచున్నది. 26

శ్లో॥ కాలో మాయామయే జీవే జీవ ఆత్మని మయ్యజే ।
ఆత్మాకేవల ఆత్మస్థో వికల్పాపాయలక్షణః ॥ 27

టీ:- కాల ఇతి. మాయామయే మాయాప్రవర్తకే జ్ఞానమయే వా. అత ఏవ జీవయతీతి జీవః తస్మిన్ మహాపురుషే. అయం భావః విశ్వస్రష్టుః మహాపురుషస్యోపకరణరూపః కాలో వృత్త్యంశేన సృజ్యశ్చ అత స్తదాత్మనావతిష్ఠత ఇతి. తదుక్తం సప్తమే-శ్లో. "కాలఞ్చరంతం సృజతీశ ఆశ్రయం ప్రధానపుంభ్యాం నరదేవ సత్యకృది" తి. దశమేచ శ్లో. " యోయం కాలస్తస్య తేవ్యక్త బంధోశ్చేష్టారూపశ్చేష్టతే యేన విశ్వం, నిమేషాదిర్వత్సరాంతో మహీయాన్ తంత్వేశానం క్షేమధామ

కాలము మాయాప్రవర్తకుడు లేదా జ్ఞానమయుడగు జీవుని యందు (జీవుడనగా జీవింపచేయువాడు) విశ్వస్రష్టయగు మహా పురుషుని ఉపకరణ రూపము కాలము. అది వృత్త్యంశచే సృజ్యము. కావున అది జీవరూపమున నిలుచును. కావుననే సప్తమస్కంధమున 'కాలఞ్చరంతం సృజతీశ ఆశ్రయం ప్రధానపుంభ్యాం నరదేవ సత్యకృత్' అని దశమమున 'యోయం కాలస్తస్య తేవ్యక్త బంధోశ్చేష్టారూపశ్చేష్టతే యేన విశ్వం, నిమేషాదిర్వత్సరాంతో మహీయాన్ తంత్వేశానం క్షేమధామ ప్రపద్య' అనియూ చెప్పబడినది. ప్రతియోగి లేకుండుటచే పరిపూర్ణుడగుటచే జీవుడు అజుడను, ఆత్ముడను అగు నా యందు సద్రూపముతో ఉండును. ఆత్మయు, ఆత్మయందే ఉండునుగాని

ప్రపద్య” ఇతి. జీవ ఆత్మని ప్రకృతేర్లీనత్వేన ప్రతియోగ్యభావాత్పరిపూర్ణేన సద్రూపేణావతిష్ఠతే. ఆత్మాతు ఆత్మస్థ ఏవ నాన్యత్ర లీయతే. యతః కేవలో నిరుపాధిః. తత్ర హేతుః. వికల్పాపాయాభ్యాం విశ్వోత్పత్తిలయాభ్యాం లక్ష్యతే అధిష్టానత్వేన అవధిత్వేన చేతి తథాసః. 27

దేనియందు లయింపదు. ఎందుకనగా కేవలుడు=నిరుపాధికుడు విశ్వోత్పత్తి ప్రళయములకు అధిష్ఠానముగ అవధిగల క్షితుడగుచున్నాడు. 27

శ్లో॥ ఏవమన్వీక్షమాణస్య కథం వైకల్పికో భ్రమః ।
మానసో హృదితిష్ఠేత వ్యోమ్నీ వార్కోదయేతమః ॥ 28

టీ:- అస్య కథనస్య ప్రస్తుతోపయోగమాహ-ఏవమితి. మానసః కథం భేదనిమిత్తో భ్రమస్స్యాత్. జాతో వా కథం హృది తిష్ఠేదితి. 28

ఈ చెప్పిన దానికి ప్రస్తుతోపయోగమును చెప్పుచున్నాడు. ఈ విధముగా పై విషయములన్నింటిని విచారదృష్టితో చూచువారికి మనస్సునందు వైకల్పిక భ్రమ కలుగుటెట్లు. ఒకవేళ కలిగినను అది ఆకాశమున సూర్యుడుదయింపగా చీకటి తొలగినట్లు తొలగునేగాని మదిలో నిలిచియుండదు. 28

శ్లో॥ ఏష సంఖ్యావిధిః ప్రోక్తస్సంశయ గ్రంథిభేదనః ।
ప్రతిలోమాను లోమాభ్యాం పరాపరదృశా మయా ॥ 29

టీ:- ఉపసంహరితి- ఏష ఇతి. శ్లో॥ప్రత్యక్షమివ యేనేదం దర్శితం తత్త్వమాత్మనః । సాంఖ్య ప్రఖ్యానతస్తస్మై హరయే గురవే నమః ॥ 29

ఉపసంహరించుచున్నాడు. కార్యాకారణములు, స్థూల సూక్ష్మములు అగు వానినెల్ల దర్శింపగల వాడనగు నా చేత సందేహములు నివారించునట్టి ఈ సాంఖ్యావిధి ఇప్పుడు ఉత్పత్తి ప్రళయరూపముగా వివరించబడింది. 29

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**చతుర్వింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**చతుర్వింశోధ్యాయము సమాప్తము.**

## పచవింశోऽధ్యాయః

శ్లో॥ పంచవింశే స్వనైర్గుణ్య ప్రతిపత్త్యై నిరూప్యతే ।
చిత్తప్రభవసత్త్వాదిగుణవృత్తిరనేకధా ॥

శ్లో॥ ప్రకృతిపురుషవివేకజ్ఞానవతోऽపి యావత్ప్రయత్న విశేషేణ ।
గుణత్రయవృత్తిజయో న స్యాత్ నతా వద్ద్వంద్వోపరమః ॥

శ్రీభగవానువాచ

శ్లో॥ గుణానామసమిశ్రాణాం పుమాన్ యేన యథా భవేత్ ।
తన్మేపురుషవర్యేదముపధారయ శంసతః ॥ 1

టీ:- అతస్తజ్జయోపాయకథనాయ గుణత్రయవృత్తినిరూపణార్థమాహ - గుణానామితి. సహమిశ్రీభూయ వర్తమానాః సమిశ్రాః న సమిశ్రాః అసమిశ్రాః తేషాం విభక్తానాం మధ్యే యేన గుణేన. యథా యాదృశో భవేత్. తదిదం కథయతో మత్తో నిబోధేత్యర్థః. 1

శ్లో॥ శమోదమస్తితిక్షేక్షాతపస్సత్యం దయాస్మృతిః ।
తుష్టిస్త్యాగో స్పృహా శ్రద్ధాహ్రీర్దయాదిస్స్వనిర్వృతిః ॥ 2

## 25వ అధ్యాయము

ఈ ఇరువది ఐదవ అధ్యాయమునందు ఆత్మయొక్క నిర్గుణత్వము తెలియుటకై మనస్సునందు పుట్టెడి సత్త్వము మొదలుగా గల గుణములయొక్క వ్యాపారమనేక విధములుగా నిరూపించబడుచున్నది.

ప్రకృతిపురుష వివేక రూపమగు జ్ఞానము కలవాడయ్యు ఎంతవరకు ప్రయత్న విశేషముచే సత్త్వాది గుణత్రయవృత్తిని జయింపడో అంతవరకు ద్వంద్వములు తొలుగవు. కావున ఆ గుణత్రయ వ్యాపారమును జయించుటకుపాయమగు గుణనివృత్తిని నిరూపించుటకు చెప్పుచున్నాడు.

**శ్రీభగవానుడు ఈ విధముగా చెప్పచున్నాడు.**

ఓ నరశ్రేష్ఠుడా పురుషుడు వేరువేరు గుణములలో ఏ గుణముచే ఎట్టివాడగునో దానిని చెప్పుచున్న నా వలన వినుము. 1

మనోనిగ్రహము, బాహ్యేంద్రియనిగ్రహము, సహనము, వివేకము, తన ధర్మమున వర్తించుట, సత్యము పలుకుట, దానము

టీ:- తత్రసత్త్వవృత్తీరాహ - శమ ఇతి. ఈక్షావివేకః. తపః స్వధర్మ వర్తిత్వం స్మృతిః పూర్వాపరానుసంధానం తుష్టిర్యథాలాభ సంతోషః త్యాగః వ్యయశీలత్వం. అస్పృహా వైరాగ్యం. శ్రద్ధా ఆస్తిక్యం. హ్రీః అనుచితే కర్మణి ప్రవృత్తౌ లజ్జా. దయా దానం. దయాదానగతిరీక్షణేష్వితి స్మరణాత్. ఆది శబ్దేన ఆర్జవ వినయాదిః స్వనిర్వృత్తిః ఆత్మరతి. 2

'దయదానగతిరక్షణేశు' అని స్మరించుట వలన పూర్వాపరముల నాలోచించుట లభించిన దానితో సంతోషించుట,వ్యయించు స్వభావము, విషయములందు వైరాగ్యము, ఆస్తికత, అనుచితకార్యము లందు లజ్జ, అట్టి కార్యములను చూడకుండుట, దయ, ఆర్జవము, వినయము మొదలగునవి ఆత్మరతి సత్వవృత్తులు. 2

శ్లో॥ కామ ఈహామదస్తృష్ణా స్తంభ ఆశీర్భిదా సుఖమ్ ।
మదోత్సాహో యశః ప్రీతిర్హాస్యం వీర్యబలోద్యమః ॥ 3

టీ:- రజసోవృత్తీరాహ-కామఇతి. కామోఽభిలాషః. ఈహ వ్యాపారః . మదోదర్పః, తృష్ణాలాభే సత్యప్యసంతోషః. స్తంభః గర్వః. ఆశీః ధనాభిలాషేణ దేవతాదిప్రార్థనం. భిదా భేదబుద్ధిః. సుఖం విషయభోగః . మదోత్సాహః మదేన యుద్ధాద్యభినివేశః. యశః ప్రీతిః స్తుతిప్రియతా. హాస్య మపహాసః. వీర్యం ప్రభావావిష్కారః, బలోద్యమః బలేన ఉద్యమః రాజసః న్యాయేనోద్యమః సాత్త్విక ఏవ. 3

రజోవృత్తులను చెప్పుచున్నాడు.అభిలాష, వ్యాపారము, దర్పము, లభించిన దానితో సంతోషింపకుండుట, గర్వము, ధనాదుల నభిలషించి, దేవతాదులను ప్రార్థించుట, నేను వేరనే భేదబుద్ధి, విషయ భోగము, మదముచే యుద్ధాదులను చేయుటయందు పట్టుదల, కీర్తి, స్తుతిప్రియత్వము, పరిహాసము, గొప్పదనమును వెల్లడించుట, బలముతో ఉద్యమించుట. ఇవి రాజసవ్యాపారములు. న్యాయముగా నుద్యమించుట సాత్త్వికమగును. 3

శ్లో॥ క్రోధో లోభోఽనృతం హింసా యాచ్ఞాదంభః కలిః కమ్లః ।
శోకోమోహౌ విషాదార్తీ నిద్రాశాభీరనుద్యమః ॥ 4

తమోవృత్తులను చెప్పుచున్నాడు. సహింప లేకుండుట, వెచ్చించుటకిష్టపడకుండుట, శాస్త్రీయము కాని దానిని ప్రమాణమని పలుకుట, ద్రోహము, కోరిక, ధర్మమును ప్రదర్శించుట, శ్రమము,

టీ:- తమసోవృత్తీరాహ - క్రోధఇతి. క్రోధః అసహిష్ణుతా. లోభః వ్యయపరాఙ్ముఖతా. అనృతం అశాస్త్రీయం ప్రమాణమితి. భాషణం. హింసానామ ద్రోహః యాచ్ఞా ప్రార్థనా దంభః. ధర్మధ్వజిత్త్వం క్లమః శ్రమః కలిః కలహః శోక మోహహౌ అనుశోచనం భ్రమశ్చ. వాషాదార్తీ దుఃఖం దైన్యం చ. నిద్రా తంద్రా. ఆశా ఇదం మమ భవిష్యతీత్యన్వీక్షా. భీర్భయం, అనుద్యమః జాడ్యం. 4

శ్లో॥ సత్త్వస్య రజసశ్చైతా స్తమసశ్చానుపూర్వశః ।
వృత్తయో వర్ణితప్రాయాస్సన్నిపాత మథో శృణు ॥ 5

టీ:- సత్త్వ స్యేతి. అనుపూర్వశః క్రమేణ. ఏతా శ్లోకత్రయోక్తాః వర్ణితప్రాయాః. అన్యా అప్యూహ్యా ఇతి భావః. 5

శ్లో॥ సన్నిపాతస్త్వహమితి మమేత్యుద్ధవయామతిః ।
వ్యవహారస్సన్నిపాతో మనోమాత్రేంద్రియాసుభిః ॥ 6

టీ:- విభక్తానాం గుణానాం వృత్తయో వర్ణితాః. మిశ్రాణామహ-త్రిభిః సన్ని పాత ఇతి. అహం మమేతి చ మతావుక్త సర్వవృత్తి సామానాధి కరణ్య దర్శనా త్సన్నిపాతత్వం. అహం శాంతః కామి క్రోధీత్యాహి.

కలహము, దుఃఖించుట, భ్రమ, దైన్యము,తంద్రా(సోమరితన ము) నాకిదిలభించునని యెదురుచూచుట, భయము, జాడ్యము. 4

ఈ విధముగా వరుసగా సత్వగుణవృత్తులు, రజోగుణవృత్తులు, తమోగుణవృత్తులు, వర్ణింపబడినవి. ఇవిగాక మరికొన్నింటిని గూడా ఈ వృత్తులతోబాటు ఊహించుకొనవచ్చు. ఇకపై వీని మిశ్రమమును గూర్చి తెలిపెదను వినుము. 5

విభక్తములైన గుణములవృత్తులు వర్ణింపబడినవి. మిశ్రముల గుణములను ఇకపై చెప్పుచున్నాడు. మూడు శ్లోకములచే. ఉద్ధవుడా నేను నాదియను మమత్వముతోకూడి, సకలవృత్తి సాధారణమయిన బుద్ధి గుణత్రయ సన్నిపాతము వలన కలిగినట్టిదే. నేను శాంతుడను, నేను కాముకుడను, నేను క్రోధకుడను మొదలగునది నాకు శాన్తి కలదు, కామమున్నది, క్రోధమున్నది, ఇత్యాదికమగు బుద్ధి గుణత్రయ సన్నిపాతజన్యమే. ఇట్లు మనస్సుచే శబ్దాదులచే తన్మాత్రలచే ప్రాణము

తథా మమశాంతి రస్తి కామః క్రోధోఽస్తీత్యాది ద్రష్టవ్యం. తత్పూర్వకః సర్వో వ్యవహారశ్చ సన్నిపాతకార్యమిత్యాహ–వ్యవహార ఇతి. అత్ర హేతుః మనశ్చ మాత్రాణి చ ఇంద్రియాణి చ అసవశ్చతైః. మన ఆదీనాం సాత్వికరాజసతామసత్వాత్ తైర్వ్యవహారః సన్నిపాత ఇతి భావః. 6

లచే చేయబడు వ్యవహారమంతా గుణత్రయ సముదాయము వల్లనే కలుగుచున్నది. 6

శ్లో॥ ధర్మేచార్థే చ కామే చ యదాసౌపరినిష్ఠితః ।
గుణానాం సన్నికర్షోఽయం శ్రద్ధారతి ధనావహః ॥ 7

టీ:– ధర్మ ఇతి. అసౌ పురుషో యదా ధర్మాదిషు పరిష్ఠితో భవతి. తదా యంత్రిషు నిష్ఠారూపః సన్నికర్షః సన్నిపాతకార్యం. ధర్మాదీనాం సత్వతమోరజః కార్యత్వాత్. విషయతః. సన్నిపాతజత్వ ముక్తం. ఫలతశ్చ తథాత్వమాహ శ్రద్ధారతిధనాని సత్త్వరజస్తమోమయాన్యావహతీతి తథా. (7)

ఈ పురుషుడు ఎప్పుడు ధర్మమందు, అర్థమందు, కామ పురుషార్థ మందును నిష్ఠగలవాడగునో అప్పుడు ఈ త్రివర్గము నందు నిష్ఠారూపమయిన సన్నికర్ష సన్నిపాతకార్యము శ్రద్ధను, ప్రీతిని ధనమును కలిగించును. ధర్మాదులకు సత్వతమోరజ, కార్యములయి నందు వలన ప్రతిపత్తికై ప్రతిపాదనకొరకు సన్నిపాతజత్వము చెప్పబడినది. ఫలతః సన్నిపాతజత్వాన్ని శ్రద్ధారతి ధనావహాః అని తెలుపుచున్నాడు. 7

శ్లో॥ ప్రవృత్తిలక్షణే నిష్ఠాపుంసో యర్హి గృహాశ్రమే ।
స్వధర్మేచానుతిష్ఠేత గుణానాం సమితి ర్హిసా ॥ 8

టీ:– ధర్మనిష్ఠాయా మేవ సన్నిపాతః దర్శయతి–ప్రవృత్తీతి. ప్రవృత్తి లక్షణే కామ్యే ధర్మే తదా పుంసో నిష్ఠా భవతి యదా పుమాన్ గృహాశ్రమ

ధర్మనిష్ఠయందును సన్నిపాతమును చెప్పుచున్నాడు. కామ్యధర్మ మందు ఎప్పుడు నిలుకడయుండునో అప్పుడు పురుషుడు గృహస్థాశ్రమ మునందే ఆసక్తుడై యుండవలెను. తరువాత నిత్య నైమిత్తకమగు తన ధర్మమునందు నిష్ఠగలిగి యుండవలెను. ఆ నిష్ఠయూ త్రిగుణముల సన్నిపాతము వలన ఏర్పడినదే. 8

ఏవాసక్తస్తిష్ఠేత్. అనుపశ్చాత్ స్వధర్మే చ నిత్యనైమిత్తికే తిష్ఠేత. సాపి సమితిః సన్నిపాతః. హి యస్మాత్కామ్యధర్మ గృహాసక్తిః స్వధర్మః రజస్తమః సత్త్వమయ ఇత్యర్థః. 8

శ్లో॥ పురుషంసత్త్వసంయుక్తమనుమీయాచ్ఛమాదిభిః ।
కామాదిభీ రజోయుక్తం క్రోథాద్యై స్తమసా యుతమ్ ॥ 9

టీ:- తదేవం మిశ్రామిశ్రగుణవృత్తీః ప్రదర్శ్య ఇదానీం. శ్లో. "పుమాన్ యేన యథా భవేది"తి. యదుక్తం తద్దర్శయతి-త్రిభిః. పురుషమితి. (9-10)

అని ఇట్లు మిశ్రములు విభక్తములగు గుణముల వృత్తములను ప్రదర్శించి ఇప్పుడు పుమాన్ యేన యథా భవేత్ అని పూర్వము చెప్పిన దానిని మూడు శ్లోకములచే వివరించుచున్నాడు. పురుషునిలోని శమాదిగుణములను బట్టి అతడు సత్వగుణము కలవాడనియు. కామాది గుణములను బట్టి రజోగుణము కలవాడ నియు క్రోధాది గుణములచే తమోగుణముకలవాడని ఊహించవలెను. (9)

శ్లో॥ యదా భజతి మాంభక్త్యా నిరపేక్షస్స్వకర్మభిః ।
తం సత్త్వప్రకృతిం విద్యాత్పురుషం స్త్రియమేవ వా ॥ 10

ఎప్పుడు ఏ కోరికలేక తన కర్మలచేతనే నన్ను భక్తితో సేవించునో ఆ వ్యక్తిని పురుషునిగాని, స్త్రీనిగాని సాత్త్వికప్రవృత్తిగల వ్యక్తిగా తెలిసికొనవలెను. 10

శ్లో॥ యదాహ్యాశిష ఆశాస్య మాం యజేత స్వకర్మభిః ।
తం రజః ప్రకృతిం విద్యాద్ధింసా మాశాస్య తామసమ్ ॥ 11

టీ:- యదేతి. హింసాం శత్రుమరణాదిక మాశాస్యయో భజేత్. తం తామసం విద్యాత్. ఏతైర్గుణై రేవంభూతో భవతీతి తాత్పర్యార్థః. 11

ఎప్పుడైతే కోరికలను కోరి తన పనులచే నన్ను సేవించునో అతనిని రజోగుణవంతునిగను, శత్రుమరాణాదికము కోరి ఎవడు నన్ను సేవించునో అతనిని తమోగుణ స్వభావునిగను ఎరుగవలెను. ఇట్లు ఆ యా గుణములచేత ఆయా ఆచరణకల వాడగునని అర్థము. 11

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణా జీవస్యనైవ మే ।
చిత్తజాయైస్తు భూతానాం సజ్జమానో నిబధ్యతే ॥ 12

టీ:- నను తవాపి గుణ విశేషణ కర్తృత్వాద్యవిశేషాత్. కేన విశేషణ త్వం సేవ్యః జీవస్సేవక ఇతి నియమః. యతో మాం భజేతి వారం వారముచ్యతే తత్రాహ- సత్త్వమితి. జీవస్యైవ న మే. కుతః. యతశ్చిత్తజాః జీవోపాధౌ చిత్తేఽభివ్యంజ్యం తే. అతః యైస్స ఏవ బధ్యతే. కీదృశః. భూతానాం దేహరూపాణామన్యేషాం చ మధ్యే సజ్జమానః. అహం త్వసజ్జమానో గుణనియంతృత్వేన సృష్ట్యాదికర్తాపి నిత్యముక్తః అతో మహాన్ విశేష ఇతి భావః. యద్వా. భూతానాం అపంచీకృతానాం యత్కార్య భూతం చిత్తం.శ్రు."అన్నమయం హి సోమ్యమన" ఇతి శ్రుతేః.తత్ర చిత్తేప్రభవాః. అతో భూతోపహితస్య జీవస్యైవేతి. అన్యత్సమానం. 12

అయ్యా ! మీకునూ గుణవశముచే కర్తృత్వము సమానమే కనుక ఏ విశేషమును బట్టి మాటిమాటికి నన్ను సేవించమని అనుచున్నారు? ఏ విశేషముచే మీరు సేవ్యులు. జీవుడు సేవకుడు అనునియమము ప్రవర్తించుననగా చెప్పుచున్నాడు.

సత్వము, తమస్సు, రజస్సు అను గుణములు జీవునకేకాని, నాకు కాదు. ఎందువలనయనగా అవి జీవనోపాధియగు చిత్తమందభివ్యక్తమగునట్టివి. అందులకతడే వాటిచే బద్ధుడగును ఎట్టివాడు- దేహ రూపములు తద్భిన్నములగు వాని నడుమ సంయుక్తుడగుటచే. కావునవానిచే అతడే బుద్ధుడగును నేను మాత్రము అట్లు సక్తుడను కాను. లేదా 'అన్నమయగ్ంహిసోమ్యమనః' అను శ్రుతిని బట్టి అపంచీకృతములగు భూతములకు కార్యభూతమగు ఏ చిత్తము కలదో ఆ చిత్తము వలన పుట్టినవగుటచే భూతోపహితుడగు జీవునికే ఆ గుణములతో సంగము నాకు కాదని భావము. 12

శ్లో॥ యదేతరౌ జయేత్సత్త్వం భాస్వరం విశదం శివం ।
యదా సుఖేన యుజ్యేత ధర్మజ్ఞానాదిభిః పుమాన్ ॥ 13

టీ:- తదేవం మిశ్రామిశ్ర గుణకార్యాణి ప్రదర్శ్య. ఇదానీమేకైకగుణో ద్రేక కార్యాణి దర్శయతి - సప్తదశభిః. యదేతి. యదేతరౌ గుణౌ. జయేత్. అభిభవేత్. భాస్వరం ప్రకాశకం. విశదం స్వచ్ఛం. శివం

ఈ ప్రకారము మిశ్రగుణముల, అమిశ్రగుణముల కార్యములను ప్రదర్శించి ఇపుడొక్కొక్క గుణోద్రేకముచే కలుగు కార్యములను పదిహేడు శ్లోకములచే చెప్పుచున్నాడు.

ఎప్పుడు ప్రకాశము స్వచ్ఛము శాంతము అగు సత్త్వగుణము తక్కిన రెండు గుణములను జయించునో అప్పుడు నరుడు సుఖముతో

శాంతం. శివత్వవిశదత్వభాస్వరత్వానాం యథా క్రమం సుఖధర్మజ్ఞాన హేతుత్వాత్తదా తైర్యుజ్యతే. ఆది శబ్దాచ్ఛమదమాదిభిశ్చ. 13

ధర్మజ్ఞానాదులతో ఆది శబ్దముచే శమదమాదులచేతనూ కూడిన వాడగును. 13

శ్లో॥ యదా జయే తమస్సత్త్వం రజస్సంగం భిదాచలం ।
తదా దుఃఖేన యుజ్యేత కర్మణా యశసా(శ్రియా ॥ 14

టీ:- యదేతి. తమః సత్త్వం చ కర్మభూతం. రజః కర్తృ. సంగం సంగహేతుః. భిదా భేదహేతుః. చలం ప్రవృత్తి స్వభావం. అతః సంగ హేతుత్వాత్ యశసా శ్రియా చ యుజ్యేత. తత్కామః పుమాన్ భవతీత్యర్థః భిదా హేతుత్వాత్ దుఃఖేన యుజ్యేత. శ్రు. "ద్వితీయాద్వై భయం భవతీ" తి శ్రుతేః చలత్వాత్ కర్మణా యుజ్యేత. 14

ఎప్పుడు తమస్సును, సత్యమునుకూడా సంగహేతువును, భేదహేతువును, ప్రవృత్తి స్వభావము కలదియునగు రజో గుణము జయించునో అప్పుడు దుఃఖముతో, కర్మముతో, కీర్తితో కూడిన వాడగును. భేదహేతువు వలన దుఃఖితుడవుతాడు. 'ద్వితీయాద్వైభయం భవతి' అనే శ్రుతివలన బలహేతువువలన కర్మతోకూడినవాడగును. 14

శ్లో॥ యదా జయే(ద్రజస్సత్త్వం తమోమూఢం లయం జడం ।
యుజ్యేత శోకమోహాభ్యాం నిద్రయాహింసయాశయా ॥ 15

టీ:- యదేతి. యదా రజస్సత్త్వం చ కర్మభూతం. తమః కర్తృ. మూఢం వివేక భ్రంశకం. లయం ఆవరణాత్మకం. జడం అనుద్యమాత్మకం. అతో మూఢత్వాచ్ఛోక మోహహింసాభిః. లయత్వాన్నిద్రయా. జడత్వాదుద్య మాభావేన కేవలమాశయా యుజ్యేతేతి ద్రష్టవ్యం. జనఇతి పాఠే లయా త్మకత్వమేవ నిద్రాశయోర్హేతుః. 15

ఎప్పుడు రజస్సును సత్వమును తమోగుణమును జయించునో ఆ తమస్సు ఎట్టిదనగా వివేకమును పోగొట్టునది. ఆవరణ రూపమయినది. ఉద్యమములేనట్టిది. మూఢమగుటచే శోకమోహ హింసలచే లయమగుట వలన నిద్రతోడను జడమగుటచే ఉద్యమ ముండదు కనుక హింసచేతను కేవలమాశతోడను కూడినవాడగును అని గమనింపదగును. జన అని పాఠమునందు లయాత్మకమే నిద్రాశయములకు హేతువని గమనించవలెను. 15

శ్లో॥ యదాచిత్తం ప్రసీదేత చేంద్రియాణా చ నిర్వృతిః ।
దేహేభయం మనోసంగం తత్సత్త్వం విద్ధి మత్పదమ్ ॥ 16

టీ:- కించ. యదేతి. యదాచిత్తం ప్రసీదేత స్వచ్ఛం భవేత్. నిర్వృతి రుపరతిః. తత్తదా. మత్పదం మదుపలబ్ధిస్థానం. సత్త్వముద్రిక్తం విద్ధి. 16

ఎప్పుడు మనస్సు ప్రసన్నమగునో, ఇంద్రియములకు ఉపరతి యగునో, దేహమందు నిర్భయమును, మనస్సునందు సంగరాహిత్య మేర్పడునో అప్పుడు నాయుపలబ్ధి స్థానమగు సత్త్వ గుణము ఉద్రిక్తమైనట్లు తెలిసికొనుము. 16

శ్లో॥ వికుర్వ న్క్రియయా చాధీరనివృతశ్చ చేతసాం ।
గాత్రాస్వాస్థ్యం మనోభ్రాంతం రజ ఏతైర్నిశామయ ॥ 17

టీ:- వికుర్వన్నితి. యదా పునః పుమాన్ క్రియయా వికుర్వన్ వికారం ప్రాప్నువన్. ఆధీర్భవతి. ఆసమంతా ద్విక్షప్తా ధీర్యస్య సః. చేతసాం బుద్ధీంద్రియాణాం అనివృత్తిః అనుపరతిః గాత్రాణి కర్మేంద్రియాణి. తేషా మస్వాస్థ్యం వికారాధిక్యం మనో భ్రాంతం చంచలం. రజ ఉత్కటం చ నిశామయ జానీహి. 17

ఏప్పుడైతే క్రియచే వికారమును పొందుచూ అంతటనూ విక్షేపమునొందిన బుద్ధికలవాడగునో బుద్ధీంద్రియములయొక్క ఉపరతి కలుగదో, కర్మేంద్రియములకు వికారమధికమగునో, మనుస్సు చంచల మగునో, అప్పుడు రజోగుణము ఉద్రిక్తమైనదని తెలియును. 17

శ్లో॥ సీదచ్చిత్తం విలీయేత చేతసో గ్రహణే క్షమం ।
మనో నష్టం తమోగ్లాని స్తమస్తదుపధారయ ॥ 18

టీ:- సీదదితి. యదా సీదత్. తిరోభవత్. చేతసో గ్రహణే చిదాకారపరిణామే. అక్షమం సచ్చిత్తం లీయేత. మనోపి సంకల్పాత్మకం. నష్టం లీనం. తమః అజ్ఞానం. గ్లానిర్విషాదశ్చ భవతి. తత్తదా. తమ ఉత్కటం ఉపధారయ విద్ధిః. 18

ఎప్పుడు తిరోభావము పొందుచున్నదియూ, చిదాకార పరిణామమునందు అసమర్థమగుచున్నదై వివేకమునశించునో, సంకల్పాత్మకమగు మనస్సుకూడా లయమునందునో, అజ్ఞానము, విషాదమూ కలుగునో దానిని ఉద్రిక్తమయిన తమస్సుగా తెలిసికొనుము. 18

శ్లో॥ ఏధమానే గుణేసత్త్వే దేవానాం బలమేధతే ।
అసురాణాం చ రజసి తమస్యుద్ధవ రక్షసామ్ ॥ 19

టీ:- కించ. ఏధమాన ఇతి. ఇంద్రియాణ్యేవ నివృత్తిమోహస్వభావాని దేవాసురరక్షాంసీతి జ్ఞేయం. యద్వా. ప్రసంగాదాధిదైవికాధ్యాత్మికాధి భౌతికానాం గుణానా ముత్కర్ష కార్యాణ్యుక్తానీతిజ్ఞేయం. 19

ఉద్ధవా సత్వగుణము వృద్ధినొందుచుండగా దేవతల బలము పెరుగును. రజోగుణము వృద్ధినందుచుండగా అసురుల బలము వృద్ధి నొందును. తమోగుణము వృద్ధినందుచుండగా రాక్షసుల బలము పెరుగును. ఇంద్రియములేని వృత్తి, ప్రవృత్తి మోహస్వభావములు దేవాసుర, రాక్షసులు లేదా ఆధిదైవికములు అయిన గుణముల ఉత్కర్షకార్యాలు చెప్పబడినవి. అని తెలిసికొనవలెను. 19

శ్లో॥ సత్త్వాజ్జాగరణం విద్యాద్రజసస్స్వప్న మాదిశేత్ ।
ప్రస్వాపం తమసో జంతో స్తురీయం త్రిషు సంగతమ్ ॥ 20

టీ:- గుణోత్కర్షతోఽవస్థాభేదం దర్శయతి-సత్త్వాదితి. ప్రసంగాన్ని ర్గుణావస్థామాహ-తురీయం చతుర్థ మవస్థాంతరంనామ త్రిషు జాగరణాదిషు సంతతమేకరూపం ఆత్మతత్త్వమేవేత్యర్థః. 20

సత్వగుణోద్రేకము వలన మేల్కొనుటయూ తెలియవలెను. రజోగుణముచే నిద్రను తెలియవలెను. తమోగుణముచే ప్రాణియొక్క గాఢనిద్రను తెలియువలెను. ప్రసంగవశముచే నిర్గుణావస్థను తెలుపుచున్నారు. నాల్గవది అనగా వేరొక అవస్థ జాగ్రత్స్వప్నసుషుప్తులు మూడింటి యందును ఎల్లప్పుడు నుండునది ఏకరూపమగు ఆత్మ తత్త్వమే యని అర్థము. 20

శ్లో॥ ఉపర్యుపరి గచ్ఛంతి సత్త్వేన బ్రాహ్మణా జనాః ।
తమసాఽధోఽధ ఆముఖ్యా ద్రజసాంతరచారిణః ॥ 21

టీ:- గుణోత్కర్షద్వారేణ తత్తత్కర్మఫలనిష్ఠాం దర్శయతి-ఉపర్యుపరీతి. బ్రాహ్మణాః వేదతాత్పర్యవిదః వేదార్థానుష్ఠానయుక్తా ఇత్యర్థః. ఆబ్రహ్మణ ఇతి పాఠే బ్రహ్మలోకమభివ్యాప్యేత్యర్థః. ఆముఖ్యాత్ స్థావరా నభివ్యాప్య. అంతరచారిణః మనుష్యాఏవ భవంతి. 21

గుణోత్కర్షద్వారా ఆయా కర్మఫలనిష్ఠను ప్రదర్శించుచున్నారు. సత్వగుణముచే వేదానుష్ఠానయుక్తులగువారు ఊర్ధ్వలోకములకు వెళ్ళుదురు. 'ఆబ్రాహ్మణ' అను పాఠమున బ్రహ్మలోకము వరకు అని అర్థము. తమోగుణముచే స్థావరముల వరకు అధోలోకములను చేరెదరు. రజోగుణముచే ఊర్ధ్వలోకములకు అధోలోకములకు నడుమ చరించు మనుష్యులు అగుదురు. 21

శ్లో॥ సత్త్వేప్రలీనా స్స్వర్యాంతి నరలోకం రజోలయాః ।
తమోలయస్తు నిరయం యాంతి మామేవ నిర్గుణాః ॥ 22

టీ:- దేహాదుత్క్రాంతికాలీనగుణోత్కర్షఫలమాహ - సత్త్వేతి. సత్త్వే ప్రవృద్ధే సతి ప్రలీనాః మృతాః. రజోలయాః రజసి ప్రవృద్ధేసతి లయో యేషాంతే. ఏవం తమోలయా ఇత్యపి. నిర్గుణా ఇత్యత్ర తు లయశబ్దా నుపాదానాజ్జీవంతోఽపి నిర్గుణాశ్చేత్ మామేవ యాంతీత్యర్థః. 22

శ్లో॥ మదర్పణాం నిష్ఫలం వా సాత్త్వికం నిజకర్మ తత్ ।
రాజసం ఫలసంకల్పం హింసాప్రాయాదితామసమ్ ॥ 23

టీ:- ఇదానీం గుణోత్కర్షకృతమేవ తత్తత్ఫలసాధనకర్మ త్రైవిధ్యమాహ- మదర్పణమితి. మదర్పణం మత్ప్రాప్త్యుద్దేశేన కృతం. నిష్ఫలం కేవలం దాసభావేనైవ కృతం. యత్ నిజం కర్మ ఇత్యాది. తత్సాత్త్వికం. ఫలం సంకల్ప్యతే యస్మిన్ తత్. హింసాప్రాయం హింసోద్దేశేన కృతం. హింసా బహుళం వా ఆదిశబ్దాద్దంభమాత్సర్యాదికృతం చ. 23

శ్లో॥ కైవల్యం సాత్త్వికం జ్ఞానంరజో వైకల్పికం తు యత్ ।
ప్రాకృతం తామసం జ్ఞానం మన్నిష్ఠం నిర్గుణంస్మృతమ్ ॥ 24

టీ:- ఇదానీం సగుణ నిర్గుణభేదేన జ్ఞానాదీనాం చాతుర్విధ్యమాహ

దేహమును జీవి నిష్క్రమించు సమయమందలి గుణోత్కర్షకు ఫలమును చెప్పుచున్నారు. సత్వగుణము వృద్ధినొందగా మరణించిన వారు స్వర్గమునకు వెళ్ళుదురు. రజోగుణమువృద్ధినొందగా మరణించినవారు మనుష్యలోకమును పొందుదురు. తమోగుణము వృద్ధి నొందగా మరణించినవారు నరకమును పొందుదురు. జీవించి యుండియూ గుణసంగము లేనివాడయినచో నన్నే చేరుదురు. 22

ఇప్పుడు గుణోత్కర్షవల్ల కలిగెడి ఆ యా ఫలములు సాధించు త్రివిధకర్మలను తెలుపుచున్నాడు. నాకు ప్రీతి కలుగవలెనని యుద్దేశించి చేయబడిన, కేవలము దాసభావము చేతనే, ఫలము కోరక చేయబడిన ఏ కర్మకలదో ఆ నిత్యకర్మ మొదలయినది సాత్త్వికము. ఫలముకోరి చేయుకర్మ రాజసము. హింసనుద్దేశించి లేదా హింసాబాహుళ్యముగల కర్మ తామసము. 23

ఇప్పుడు సగుణనిర్గుణ భేదముతో జ్ఞానాదుల చాతుర్విధ్యమును చెప్పుచున్నాడు. దేహాదివ్యతిరిక్తముగా ఆత్మ కలదను జ్ఞానము సాత్త్వికము. ఏది దేహాదులకంటే ఆత్మ వేరుకాదను జ్ఞానము కలదో అది రజోగుణకృతము అగు జ్ఞానము. బాలురు, మూగవారి జ్ఞానముతో

–కైవల్యమితి. కైవల్యం దేహాదివ్యతిరిక్తాత్మ విషయం–వైకల్పికం దేహాది విషయం యత్. తద్రజః రాజసం. ప్రాకృతం బాలమూకాదిజ్ఞాన తుల్యం. మన్నిష్ఠం పరమేశ్వరవిషయం. 24

సమానమయినది తామసజ్ఞానము. పరమేశ్వర విషయకమయినది నిర్గుణముగా చెప్పబడినది. 24

శ్లో॥ వనం తు సాత్త్వికో వాసో గ్రామో రాజస ఉచ్యతే ।
తామసం ద్యూతసదనం మన్నికేతం తు నిర్గుణమ్ ॥ 25

టీ:– వనమితి. వనం వివిక్తత్వాత్సాత్త్వకో వాసః. భగవన్నికేతనం తు సాక్షాత్తదావిర్భావాన్నిర్గుణం స్థానం. 25

ఏకాంతమగుటచే అరణ్యము సాత్త్వికవాసము. ఊరు రాజస వాసము. జూదమాడు ఇల్లు తమో నివాసము. నా నివాసము, దేవాలయాదికము నిర్గుణ నివాసము. 25

శ్లో॥ సాత్త్వికః కారకో సంగీ రాగాంధో రాజసస్స్మృతః ।
తామసః స్మృతి విభ్రష్టో నిర్గుణో మధుపాశ్రయః ॥ 26

టీ:– సాత్త్విక ఇతి. కాలికః. కర్తా అసంగీ అనాస్తకః. రాగాంధః. అత్యభినివేశవాన్ స్మృతి విభ్రష్టః అనుసంధానశూన్యః. మదుపాశ్రయః మదేకశరణః. స హి నిరహంకారత్వాన్నిర్గుణః. 26

కర్త అనాసక్తుడయిన, సాత్వికుడు, అత్యంత అభినివేశము, పట్టుదల కలవాడు రాజసుడు. రజోగుణముకలవానిగా గుర్తించాలి. స్మృత్యుక్త ధర్మముననుష్ఠించనివాడు తామసుడగును. నన్నే శరణు చొచ్చినవాడు నిర్గుణుడు అగును. 26

శ్లో॥ సాత్త్విక్యాధ్యాత్మికీ శ్రద్ధాకర్మశ్రద్ధా తు రాజసీ ।
తామస్య ధర్మేయా శ్రద్ధామత్సేవాయాం తు నిర్గుణా ॥ 27

టీ:– సాత్త్వికీతి. అధర్మే ధర్మఇతి యా శ్రద్ధా. 27

అధ్యాత్మశాస్త్రమందలి శ్రద్ధ సాత్వికము, యజ్ఞయాగాది కర్మలయందలి శ్రద్ధ రాజసము అధర్మమునందు ధర్మబుద్ధితో కూడిన శ్రద్ధ తామసము. నా సేవయందు లగ్నమయిన శ్రద్ధ నిర్గుణము. 27

శ్లో॥ పథ్యం పూతమనాయ స్తమాహార్యం సాత్త్వికం స్మృతం ।
రాజసం చేంద్రియప్రేష్ఠం తామసం చార్తిదాశుచి ॥ 28

టీ:- పథ్యమితి. పథ్యం హితం. పూతం శుద్ధం. అనాయస్తం అనాయాసతః ప్రాప్తం. ఆహార్యం భక్ష్యభోజ్యాది. ఇంద్రియాణాం ప్రేష్ఠం కట్వామ్లలవణాది. ఆర్తిదాశుచి దైన్యకరమశుద్ధం చ. చశబ్దాదస్మన్నివేదితం నిర్గుణ మిత్యభిప్రేతం. 28

హితము, శుద్ధము, అనాయాసముగా లభించినది అగు ఆహారము సాత్వికము. భోజనకాలమందు మాత్రము సుఖము కలిగించు కారము, పులుపు, ఉప్పు మొదలయిన ఆహారము రాజసము. దేహేంద్రియములకు బాధ కలిగించునది, అపరిశుద్ధమయినది తామసము. 28

శ్లో॥ సాత్త్వికం సుఖమాత్మోత్థం విషయోత్థం తు రాజసం ।
తామసం మోహదైన్యోత్థం నిర్గుణం మదుపాశ్రయమ్ ॥ 29

టీ:- సాత్త్వికమితి. ఆత్మోత్థం సుఖం మదుపాశ్రయమిత్యపిత్వం తత్పదార్థవిషయత్త్వేన జ్ఞానవదేవ ద్రష్టవ్యం. 29

ఆత్మానుభావ సంతోషరూపమగు సుఖము సాత్వికము. విషయసంగముచే కలిగినది రాజసము. మాదకద్రవ్య భక్షణము వలన కలిగెడి పారవశ్యము, పుత్రకళత్రాదులను తన వశమునందుంచుకొనుట వలన కలిగెడి సుఖము తామస సుఖము మద్విషయకమగు జ్ఞానము నిర్గుణమగును. 29

శ్లో॥ ద్రవ్యం దేశః ఫలం కాలో జ్ఞానం కర్మచ కారకః ।
శ్రద్ధావస్థాకృతిర్నిష్ఠా త్రైగుణ్యస్సర్వ ఏవహి ॥ 30

టీ:- ఉక్తం సంసారహేతుభూతం త్రైగుణ్యముపసంహరతి-ద్వాభ్యాం. ద్రవ్యమితి. ద్రవ్యం పథ్యభూతాది. దేశో వనగ్రామాదిః. ఫలం. సాత్త్వికం సుఖమాత్రోత్థమిత్యాది కాలః. యదా భజతి మాం భక్త్యా. యదేతరౌ జయేదిత్యాదినా యోఽర్థాదుక్తః. జ్ఞానం. కైవల్యసాత్త్వికం జ్ఞాన

ఇంతవరకు చెప్పబడిన సంసారహేతుభూతమయిన త్రైగుణ్యమును రెండు శ్లోకములతో ఉపసంహరించుచున్నాడు. పథ్యము, పవిత్రమయిన ద్రవ్యము, వన గ్రామాది రూపమగు ప్రదేశము, 'సాత్వికంసుఖం' ఇత్యాదిగా వెనుకచెప్పబడినది. ఎప్పుడు నన్ను భక్తితో సేవించునో ఎప్పుడు ఇతరములు రెండింటిని జయించునో అని యేకాలము చెప్పుబడినదో ఆ కాలము 'కైవల్యంసాత్వికంజ్ఞానం'

మిత్యాది. కర్మమదర్పణమిత్యాది. కారకః. సాత్త్వికః కారకో సంగీత్యాదిః శ్రద్ధా సాత్త్వికాధ్యాత్మికీ శ్రద్ధేత్యాదిః. అవస్థా. సత్త్వాజ్జాగరణమిత్యాదిః ఆకృతిః ఉపర్యుపరి గచ్ఛంతీత్యాదినా ఉక్తా దేవత్వాదిరూపా. నిష్ఠా. సత్త్వే ప్రలీనాస్స్వర్యాంతీత్యాదినా ఉక్తస్వర్గాదిః ఏవం సర్వోఽప్యయం భావః త్రైగుణ్యః. త్రిగుణాత్మకః. 30

ఇత్యాదిగా చెప్పబడినది. భగవదర్పణ రూపమగు కర్మ 'సాత్త్వికః కారకోసంగీ' ఇత్యాది రూపమయినది. సాత్త్విక రూపమగు శ్రద్ధ 'సత్త్వాజ్జాగరణం' ఇత్యాది అవస్థ ఉపర్యుపరీత్యాదిగా చెప్పబడిన దేవత్వాదిరూపము. 'సర్వేప్రలీనాఃస్వర్యాంతి' ఇత్యాదిగా చెప్పబడిన స్వర్గాదికము. ఇట్లు ఈ భావమంతయూ త్రిగుణాత్మకము. 30

శ్లో॥ సర్వేగుణమయా భావాః పురుషా వ్యక్తధిష్ఠితాః ।
దృష్టం శ్రుతమనుధ్యాతం బుద్ధ్వావా పురుషర్షభ ॥ 31

టీ:- న కేవలమేషఏవ. కింతు. సర్వఇతి. యావంతః. పురుషావ్యక్త యోర్ధిష్ఠితా స్సర్వే భావాః గుణమయా ఏవ. తత్రప్రపంచః దృష్టమితి. 31

మనము చూచునవి, వినునవి, బుద్ధితో తలచునవి ఇట్లు పురుషునిచే అవ్యక్తముచే అధిష్ఠితములయిన భావములు అన్నియూ గుణరూపములు. 31

శ్లో॥ ఏతాసంసృతయః పుంసో గుణకర్మనిబంధనాః ।
యేనేమే నిర్జితా స్సౌమ్య గుణా జీవేన చిత్తజాః ॥ 32

టీ:- ఇదానీముక్తత్రైగుణ్యస్య సంసారహేతుత్వమనువదంస్తన్నిర్ణయా న్మోక్ష ఇత్యాహ-సార్ధేన. ఏతాఇతి. యేన నిర్జితాః. పశ్చాదవిక్షిప్తేన భక్తి యోగేన మన్నిష్ఠస్సన్. మద్భావాయ మోక్షాయ ఉపపద్యతే. యోగ్యో భవతి. 32

ఇకపై ముందు చెప్పబడిన త్రైగుణ్యము సంసారహేతువగుట ననువదించూచూ దానిని జయించుట వలన మోక్షము కలుగునను చున్నాడు. ఓ సజ్జనుడా! ఇవి అన్నియూ గుణకర్మలను బట్టి మనుజునకు కలిగెడి సంసార స్థితిగతులు. చిత్తజములగు ఈ గుణములను ఎవడు జయించునో వాడు భక్తియోగసాధనచే నాయందే నిష్ఠగలవాడై మోక్షము పొందుటకు యోగ్యుడగును. 32

శ్లో॥ భక్తియోగేన మన్నిష్ఠో మద్భావా యోపపద్యతే ।
తస్మాద్దేహమిమం లబ్ధ్వా జ్ఞానవిజ్ఞానసంభవం ।
గుణసంగం వినిర్ధూయ మాం భజేతవిచక్షణః ॥ 33

టీ:- తస్మాద్వివేకినామిదమేవ యుక్తమిత్యాహ-తస్మాదితి. జ్ఞాన విజ్ఞానయో స్సంభవో యస్మిన్ తమిమం నరదేహం. 33

వివేకముగలవారికిదియే యుక్తమనుచున్నాడు. కావున భక్తియోగము వలనను నిష్ఠుడయి, నా భావమును పొందుచున్నాడు. జ్ఞానవిజ్ఞాన సంభవమయిన ఈ దేహమును పొంది గుణములతో కూడి సంగమును తొలగించుకొని పండితులగువారు నన్ను సేవింతురు గాక. 33

శ్లో॥ నిస్సంగో మాం భజేద్విద్వాన ప్రమత్తో జితేంద్రియః ॥ 34

భజనప్రకారమును చెప్పుచున్నాడు. జ్ఞానియగువాడు సంగమువిడిచి అప్రమత్తుడై ఇంద్రియములను తన వశమున ఉంచుకొని నన్ను సేవించవలెను. 34

శ్లో॥ రజస్తమశ్చాభిజయేత్సత్త్వసంసేవయా మునిః ।
సత్త్వం చాభిజయేద్యుక్తో నైరపేక్ష్యేణ శాంతధీః ॥ 35

టీ:- భజన ప్రకారమేవాహ - సార్ధేన. నిస్సంగఇతి. సత్త్వం సంసేవయా. శ్లో. "సాత్త్వికాన్యేవ సేవేత పుమాన్ సత్త్వవివృద్ధయ" ఇతి. ప్రాగుక్తయా. నైరపేక్ష్యేణ ఉపశమాత్మమకేన సత్త్వేనైవ. (34,35)

మునియై సత్వగుణమునవలంబించుటచేరజస్తమోగుణములను జయించవలెను. అట్లు సత్వయుక్తుడైన తరువాత ప్రశాంతమైన బుద్ధి కలవాడై కోరికలు వీడి సత్వగుణమునుకూడా జయించవలెను. 35

శ్లో॥ సంపద్యతే గుణైర్యుక్తో జీవో జీవం విహాయమామ్ ।
జీవో జీవేన నిర్ముక్తో గుణైశ్చాశయసంభవైః ।
మయైవ బ్రహ్మణా పూర్ణో న బహిర్నాంతరశ్చరేత్ ॥ 36

టీ:- ఏవం చ సతి మాం ప్రాప్నోతీత్యాహ-సంపద్యత ఇతి. జీవం జీవిత్వాకారణం. లింగశరీరం మాం ప్రాప్తస్య న పునస్సంసార ఇత్యాహ - జీవఇతి. న బహిర్విషయభోగేన నాంతరః. తత్స్మరణేన. శ్లో. గుణకృతామురు సంసరణప్రధామజితపుణ్యకథాకథనాదిభిః. ధనుత భక్తిరసేన వివేకినో న హి పునస్సులభం జనురీదృశం. 36

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
పంచవిశోఽధ్యాయః

ఇట్లయినచో నన్ను పొందుననుచున్నాడు. జీవుడిట్లు త్రిగుణముల చేత విడువబడినవాడై జీవత్వమునకు కారణమైన లింగ శరీరమునువీడి నన్ను పొందును. జీవుడు లింగశరీరమును వీడి అంతఃకరణము నందు పుట్టెడి గుణముల చేతను విడువబడి పరమాత్మనగు నా చేతనే నిండినవాడై బయటవిషయ భోగములను గాని అంతరంగముచే వానిని స్మరించుటగాని ఆచరింపడు. 36

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
పంచవిశోధ్యాయము సమాప్తము.

## షడ్వింశోఽధ్యాయః

శ్లో॥ షడ్వింశే యోగనిష్ఠాయా విఘాతో దుష్టసఙ్గతః ।
సాధుసంగేన తన్నిష్ఠా పరాకాష్ఠేతి వర్ణ్యతే॥
యోగినో యోగవిభ్రంశస్సఙ్గత స్సంభవేదితి ।
సర్వథా తన్నివృత్త్యర్థమైళగీతం వితన్యతే ॥

శ్లో॥ నిస్సంగో మాం భజేద్విద్వా
నప్రమత్తో జితేంద్రియ ఇత్యుక్తం ॥

టీ:- తత్ర విపక్షేఽనర్థం కథయిష్యన్ జీవన్ముక్తస్యాపి తర్హి సంగో దుర్వార ఇత్యనర్థః స్యాదిత్యాశంక్యోక్తానువాద పూర్వకం పరిహరతి - సార్ధద్వాభ్యాం.

శ్రీ భగవానువాచ

శ్లో॥ మల్లక్షణమివం కాయం లబ్ధ్వా మద్ధర్మ ఆస్థితః ।
ఆనందం పరమాత్మానమాత్మస్థం సముపైతి మామ్ ॥ 1

టీ:- మల్లక్షణమితి. మల్లక్షణం మత్స్వరూపం లక్ష్యతే యేన తం. ఇమం కాయం నరదేహం లబ్ధ్వా. మద్ధర్మే భక్తిలక్షణే ఆస్థితస్సన్-ఆత్మస్థం ఆత్మన్యేవ నియంతృత్వేన స్థితం. పరమానందరూప మాత్మానం మాం సముపైతి సమ్యక్ప్రాప్నోతి. 1

## 26వ అధ్యాయము

ఈ ఇరువదిఆరవ అధ్యాయమున దుష్టసాంగత్యముచే యోగనిష్ఠ చెడునని, సజ్జన సాంగత్యము వలన ఆ నిష్ఠ పరాకాష్ఠను పొందునని యు వర్ణింపబడుచున్నది. యోగి సంగముచే యోగభ్రష్టుడగు నని అట్లు యోగి సంగమును వర్జించుటకు ఐలగీతము వివరించ బడుతున్నది.

వెనక 'నిస్సంగోమాంభజేద్విద్వాన్ అప్రమత్తో జితేంద్రియః' అని చెప్పబడినది. అట్లు నిస్సంగుడు, అప్రమత్తుడు, జితేంద్రియుడు కానిచో అనర్థము కలుగునని చెప్పబోవుచు అట్లగుచో జీవన్ముక్తునకుగూడా సంగము వారింప శక్యముగానిది. కనుక అనర్థము కలుగుననియు శంకించి పూర్వోక్తముననువదించి ఒకటిన్నర శ్లోకముచే దానిని పరిహరించుచున్నారు.

**శ్రీభగవంతుడు ఈ విధముగా చెప్పచున్నాడు.**

నా స్వరూపమును దర్శింపజేయు ఈ నరదేహమునుపొంది భక్తిరూపమగు నా ధర్మమందు నిష్ఠగలవాడై తనయందే నియంతనై యున్న పరమానంద స్వరూపుడనగు పరమాత్మనైన నన్ను చక్కగా పొందుము. 1

శ్లో॥ గుణమయ్యా జీవయోన్యా విముక్తో జ్ఞాననిష్ఠయా ।
గుణేషు మాయామాత్రేషు దృశ్యమానేష్వవస్తుతః ॥ 2

టీ:- నచైవం భూతస్య విషయస్సంగో నామాస్తీత్యాహ-గుణమయ్యేతి. గుణమయీ యా జీవయోనిః జీవోపాధిస్తయా విముక్తః. గుణేషు వర్తమానోఽపి తైర్నయుజ్యతే సంగం న ప్రాప్నోతి. అత్ర హేతుః అవస్తుభిః నన్వవస్తుభిరప్యన్యే యుజ్యమానా దృశ్యంతే తత్రాహ - అవస్తుత్వేన దృశ్యమానేషు. 2

అట్టివానికి విషయసంగము కలుగదు కదా అన్నచో అట్లు కాదనుచున్నారు. జ్ఞాననిష్ఠచే గుణరూపమయిన జీవనోపాధిచే విడువబడినవాడైన నరుడు వాస్తవము కాకయే కేవలము మాయా మాత్రమే ఐన గుణములయందు నివసించుచూ కూడా వాస్తవములు గానట్టి ఆ గుణములతో కూడినవాడు కాడు.(గుణప్రభావాతీతుడు)2

శ్లో॥ సంగం న కుర్యాదసతాం శిశ్నోదరతృపాం క్వచిత్ ।
తస్యానుగస్తమస్యంధే పతత్యంధానుగాంధవత్ ॥ 3

టీ:- తథాపి సంగం వర్జయేదిత్యాహ - సంగమితి. అసతాం లక్షణ మాహ - శిశ్నోదరం తర్పయంతీతి శిశ్నోదరతృప్తః తేషాం క్వచిత్కదాచి దపి. ఆస్తాం తావద్బహూనాం సంగః. కింతు. తస్త్యైకస్యాప్యనుగః అనువర్తీ అంధమనుగచ్ఛతి యోఽంధ స్తద్వత్. 3

అట్లయ్యును సంగమును వర్జింపవలెననుచున్నాడు. శిశ్నమును, ఉదరమును మాత్రము తృప్తినొందించు కొనునట్టి దుష్టుల యొక్క సంబధమును ఒక్కసారైనను చేయరాదు. అట్టి దుష్టునొక్కని ననుసరించువాడైనను గుడ్డివాని ననుసరించిన గుడ్డివాని వలె, (గాఢాంధకారము నందు) అంధతామిస్ర నరకమందు పడును. 3

శ్లో॥ ఐళ స్సమ్రాడిమాం గాథామగాయత బృహచ్ఛ్రవాః ।
ఊర్వశీవిరహా న్ముహ్యన్నిర్విణ్ణ శ్శోకసంయమే ॥ 4

టీ:- అత్రేతిహాసమాహ-ఐళ ఇతి. ఐళః పురూరవాః సమ్రాట్ చక్రవర్తీ బృహచ్ఛ్రవః కీర్తిర్యస్య సః. ఊర్వశీవిరహాత్. ప్రథమంముహ్యన్. పశ్చాత్

ఇందులకు దృష్టాంతము చూపుచున్నారు. గొప్పకీర్తిగలవాడు చక్రవర్తియగు పురూరవుడు ఊర్వశితో ఎడబాటు వలన మొదట ఆమెయందు మోహమునబడుచు కురుక్షేత్రమున ఆమెను కలిసికొని, గంధర్వులిచ్చిన అగ్నితో దేవతలకు యాగముచేసి తిరిగి యూర్వశీ లోకమునకు వెళ్ళి అచట శోకము తొలగిపోగా నిర్వేదమునొంది ఈ

కురుశ్రేష్ఠ తాం దృష్ట్వా సమాగమ్య గంధర్వదత్తేనాగ్నినా దేవానిష్ట్వా పునరూర్వశీలోకం ప్రాప్య శోకసంయమే శోకాపగమే సతి. తతో నిర్విణ్ణ స్సన్నిమాం గాథామగాయతేతి నవస్కంధానుసారేణ ద్రష్టవ్యం. 4

గాథను గానము చేసెనని నవమస్కంధానుసారముగా చూచుకొన వలెను. 4

శ్లో॥ త్యక్త్వాత్మానం వ్రజంతీం తాం నగ్న ఉన్మత్తవన్నృపః ।
విలపన్నన్వగాజ్జాయే ఘోరే తిష్ఠతి విక్లబః ॥ 5

టీ:- తస్య ప్రాక్తనీం మోహావస్థామాహ-త్యక్త్వేతి. ఆత్మానం రాజానం త్యక్త్వా. అథవా శయ్యాయా మాత్మానం త్యక్త్వా వ్రజంతీ మన్వగాత్, నమస్కరిష్యే ఘోరే తిష్ఠేతి శ్రు. "అహోజాయే మనసా తిష్ఠఘోరే వచాంసి మిశ్రా కృణవావహైమ-న నౌమంత్రా అనుదితా స ఏతే మయస్కరన్ పరతరే చనాహన్ని" త్యేవం మంత్రైర్విలపన్. 5

మొదటి మోహావస్థను చెప్పుచున్నాడు. తనను విడిచి పోవుచున్న లేదా శయ్యపై తనను విడిచిపోవుచున్న ఆమెతో ఆ రాజు నగ్నుడై పిచ్చివానివలె ఓ కాంతా! కఠినాత్మురాలా! నిలువుము. అని వివశుడై ఏడ్చుచు వెంటబడెను. 'అహో జాయేమనసా తిష్ఠఘోరే వచాంసి మిశ్రాకృణవావహైమ. న నౌమంత్రా అనుదితాస ఏతేమయస్కర న్పరతరేచ నాహన్' ఓ కోమలస్వరూపిణీ. మనమిద్దరము కలిసి ప్రేమాలాపములను చేయుదము. అహో మన ఇరువురికి ఈ మంత్రములు అనిందితములు అవ్యక్తములుగా లేవు. ఓ ప్రేమగలదానా పూర్వకృతములయిన మంత్రములు నష్టములు కాలేవు. అనెడి మంత్రములను పఠిస్తూ, విలపిస్తూ వెంటబడెను. 5

శ్లో॥ కామానతృప్తోనుజుషన్ క్షుల్లకాన్వర్షయామినీః ।
నవేద యాంతీర్నాయాంతీరూర్వశ్యాకృష్ణ చేతనః ॥ 6

టీ:- వైక్లబ్యేకారణమాహ-కామానితి. వర్షాణాంయామినీః రాత్రీః. యాంతీః అపయాంతీః ఆయాంతీః ఆగామినీః అకృష్ణాచేతనాయస్య సః. 6

ఆ పురూరవుడు ఊర్వశియందనురక్తుడై స్వేచ్ఛగా కామ భోగములనుభవించుచూ రాత్రులు గడుచుట వచ్చుటను గూడ గమనించక కొన్ని సంవత్సరములు క్షుద్రసుఖములతో గడిపెను. 6

ఐళ ఉవాచ

శ్లో॥ అహో మే మోహవిస్తారః కామకశ్మల చేతసః ।
దేవ్యా గృహీతకంఠస్య నాయుః ఖండా ఇమేస్మృతాః ॥ 7

టీ:- తస్య గంధర్వలోకం ప్రాప్తస్య బహుకాలమూర్వశీ సంభోగానంతరం నిర్విణ్ణస్య గాథా మహాష్టాదశభిః-తత్రాష్టభిరనుతాపః ప్రపంచ్యతే. - అహోఇతి. యతో మే మయా ఇమే అహోరాత్రరూపా ఆయుః ఖండాః న స్మృతాః. 7

ఐళుడు ఈ విధముగా పలుకుచున్నాడు.

అట్లు గంధర్వ లోకముచేరి బహుకాలము ఊర్వశీసంభోగానంతరము నిర్వేదమునొందిన పురూరవుని గానము పద్దెనిమిది శ్లోకములతో చెప్పుచున్నారు. అందున ఎనిమిదింటిచే ఆయన పరితాపము తెలుపబడుచున్నది.

అయ్యో! కామముచే మలినమైన మనస్సుకల నాయొక్క మహామోహమెంతటిది? ఊర్వశిచే కంఠాలింగనము చేసికొనిన నాచే ఈ అహోరాత్రరూపములగు ఆయుష్షు విభాగములుస్మరింపబడలేదు. 7

శ్లో॥ నాహం వేదాభినిర్ముక్తస్సూర్యోవా భ్యుదితోఽముయా ।
ముషితో వర్షపూగానాం బతాహాని గతాన్యుత ॥ 8

టీ:- తదేవాహ-నేతి. అభినిర్ముక్తః మయిరమమాణే అస్తం గతః అభ్యుదితో వా సూర్య ఇతి. అముయా ఊర్వశ్యా వంచితః. బతేతి ఖేదే. అపి. వర్ష పూగానామపి గతాన్యహాని న వేదేతి. 8

దానినే చెప్పుచున్నారు. ఈ ఊర్వశి నా వివేకము పోగొట్టినది. కావుననే ఆమెతో విహరించుచుండగా సూర్యోదయాస్తమయాలు కూడా తెలియకుండునట్లు ఎన్ని ఏండ్లు గడచినవో అయ్యో తెలియనైతిని. 8

శ్లో॥ అహో మే ఆత్మసంమోహోయేనాత్మా యోషితా కృతః ।
క్రీడా మృగశ్చక్రవర్తీ నరదేవశిఖామణిః ॥ 9

టీ:- అహోఇతి. యేన సంమోహేన ఆత్మా దేహః క్రీడామృగవత్ అధీనః. 9

నేను చక్రవర్తినయ్యు, రాజులలో గొప్పవాడనయి కూడా మోహితుడనై నన్ను నేను స్త్రీలకొక క్రీడామృగమును చేసికొంటిని. నేనెం అనాత్మజ్ఞుడను. 9

శ్లో॥ సపరిచ్ఛదమాత్మానం హిత్వా తృణమివేశ్వరం ।
యాంతీం స్త్రియం చాన్వగమం నగ్న ఉన్మత్తవద్రుదన్ ॥ 10

టీ:- నను ప్రణయకుపితాయాః అనునయార్థమధీనతాయుక్తైవ. సత్యం. నత్వత్రతదస్తీత్యాహ. సపరిచ్ఛదమితి. సపరిచ్ఛదం రాజ్యాది సహితం. ఈశ్వరం చక్రవర్తినం. తృణమివ త్యక్త్వాయాంతీమపి అన్వగమం అనుగతోఽస్మి. 10

అయ్యా! ప్రణయకుపితమైన నాయిక నోదార్చుటకామె కధీనుడగుట యుక్తము కదా అని అందువా! నిజమే కాని ఇక్కడ ప్రణయ కోపము లేదనుచున్నాడు.

రాజ్యాదులతో కూడినవాడను చక్రవర్తినగు నన్ను గడ్డిపోచవలె విడిచిపెట్టి పోతున్న స్త్రీ వెంట నగ్నుడనై పిచ్చివానివలె ఏడ్చుచూ వెంటపోయితిని. 10

శ్లో॥ కృతస్తస్యానుభావస్స్యాత్తేజ ఈశిత్వమేవ వా ।
యోఽన్వగచ్ఛం స్త్రియం యాంతీం ఖరవత్పాద తాడితః॥ 11

టీ:- కించ. మమ ప్రభావాద్యాభిమానోవృథైవేత్యహ - కుత ఇతి. కుతస్త స్యమే తేజోబలం. ఖరో యథా పాదతాడితోఽపి ఖరీమనుగచ్ఛతి తద్వత్. 11

మరియు నా ప్రభావాదులపై నాకు గల అభిమానము వ్యర్థమనుచున్నాడు. ఆమె పోవుచుండగ నేనామె వెన్నంటి పోయితిని. ఆమె గాడిదవలె నన్ను కాలితో తన్నినది. అట్లయిన నా కింక మహిమ ఎక్కడిది? పరాక్రమమెక్కడిది? చక్రవర్తిత్వమెక్కడిది? 11

శ్లో॥ కిం విద్యయా కిం తపసా కింత్యాగేన శ్రుతేన వా ।
కిం వివిక్తేన మౌనేన స్త్రీభిర్యస్య మనోహృతమ్ ॥ 12

టీ:- ఏవం భూతస్య సర్వం సాధనం వ్యర్థ మిత్యాహ-కిమితి. త్యాగేన సన్న్యాసేన వివిక్తేన ఏకాంతసేవయా మౌనేన వాఙ్నియమేన. 12

ఇట్టి నాకు సాధనములన్ని వ్యర్థమనుచున్నాడు. ఎవని మనస్సు స్త్రీలచే వశీకరించుకొనబడినదో వానికి విద్యచే ప్రయోజనమేమి? తపస్సుచేతను, త్యాగముచేతను, అధ్యయనముచేతను, ఏకాంత ప్రదేశమునందుండుట చేతను, మౌనముగాఉండుటచేతను ఏమి ప్రయోజనము. 12

శ్లో॥ స్వార్థస్యాకోవిదం ధిఙ్మాం మూర్ఖం పండితమానినమ్ ।
యోఽహమీశ్వరతాం ప్రాప్య స్త్రీభిర్గో ఖరవజ్జితః ॥ 13

టీ:- అనుతప్తస్సన్ ఆత్మానం నిందతి ద్వాభ్యాం - స్వార్థస్యేతి. అకోవిదమజ్ఞాతారం గో ఖరవత్ గౌరివ ఖర ఇవేతి. 13

ఇట్లనుతాపము చెంది తనను రెండు శ్లోకములచే నిందించుకొనుచున్నాడు. మూఢుడగు ప్రాజ్ఞునిగా నన్ను తలచుకొనువాడను. ఆత్మ శేయస్సు యొక్క అజ్ఞానినియగు నాకు ధిక్కారము. నేను చక్రవర్తిత్వమును పొందియూ ఎద్దువలె, గాడిదవలె పరస్త్రీలచే జయింపబడితి. 13

శ్లో॥ సేవతో వర్ష పూగాన్మే ఊర్వశ్యా అధరాసవమ్ ।
నతృప్య త్యాత్మభూః కామో వహ్నిరాహుతిభిర్యథా ॥ 14

టీ:- సేవత ఇతి. అధరాసవం సేవమానస్య ఆత్మభూః మనసి పునః పునరుద్భవన్. 14

అనేక సంవత్సరములు ఊర్వశియొక్క అధరాసవమును సేవించుచున్న నాకు, ఆహుతులచే అగ్నితృప్తి చెందని విధముగా కామము తృప్తి చెందుటలేదు. 14

శ్లో॥ పుంశ్చల్యాపహృతం చిత్తం కోన్వన్యో మోచితుం ప్రభుః ।
ఆత్మారామేశ్వరమృతే భగవంత మధోక్షజమ్ ॥ 15

టీ:- ఏవ మష్టభిర్నిర్వేదో నిరూపితః. ఇదానీం తస్య వివేక మహ- దశభిః. పుంశ్చల్యేతి. అయంభావః. యజ్ఞైర్దేవానిష్ట్వా దుఃఖమేవ ప్రాప్తోఽస్మి. అతః పరమేశ్వరమేవ భజేయమితి. 15

ఇట్లెనిమిది శ్లోకములచే రాజునకు కలిగిన నిర్వేదము నిరూపించబడినది. ఇప్పుడాతనికి కలిగిన వివేకమును తెలుపుచున్నాడు.

నా మనస్సొక వ్యభిచారిణికి వశమయినది. ఇంద్రియాధీనములేని జ్ఞానము కలవాడను, విషయవిముఖుడనై ఆత్మయందే రమించెడి నన్ను ఈశ్వరుడైన భగవంతుడొక్కడు తప్ప ఇతరుడెవ్వడు విడిపించ గలడు ఇది భావము. కర్మచే దేవతలను పూజించి దుఃఖమునే పొందియున్నాను. అటు తరువాత పరమేశ్వరుడినే భజింతును అని. 15

శ్లో॥ బోధితస్యాపి దేవ్యా మే సూక్తవాక్యేన దుర్మతేః ।
మనోగతో మహామోహోనాపయాత్యజితాత్మనః ॥ 16

టీ:- పరమేశ్వర ప్రసాదం వినా దేవైరుపదిష్టాదపి వేదవాక్యాన్మోహో న నివర్తత ఇత్యాహ. బోధితస్యేతి. దేవ్యా ఊర్వశ్యా సూక్తవాక్యేన యథార్థ వచనేన. శ్రు. "పురూతవో మా మృథామాప్రతప్తో మాత్వా వృకాసో అశివాస ఉక్షన్. న వైస్త్రైణాని సఖ్యాని సంతి సాలావృకాణాం హృదయాని చైతా" ఇత్యనేన. 16

పరమేశ్వరుని యనుగ్రహములేకపోతే దేవతలచే ఉపదేశింపబడిన వేదవాక్యముచేతకూడా మోహము తొలుగదనుచున్నాడు. ఊర్వశిచేత యథార్థవచనముచే 'పురూరవోమామృథా మాప్రతప్తో మాత్వా వృకాసో అశివాస ఉక్షన్, న వైస్త్రైగాని సఖ్యాని సంతి సాలా వృకాణాం హృదయాని చైతా' అను వచనము చేత ఉపదేశింపబడిన వాడనైనను కామాసక్తుడనైన, ఇంద్రియవశుడనయిన నా యొక్క మనస్సు నందు కాంతయందలి ('ఈమేభోగింపదగినది' అనునట్టి) మోహము తొలగుటలేదు.

(ఓ పురూరవా నువ్వు వట్టిగా, వృథాగా మరణించకు. నా విరహముతో తాపాగ్ని చెందకు. అమంగళములయిన, ఇంద్రియ లక్షణములయిన తోడేళ్ళు నిన్ని భక్షించకుండ ఉండుగాక. ఇంద్రియ వశుడవుకాకుమనియర్థము. స్త్రీ సంబంధమయిన విశ్వాసములు లేవు. వారియందు విశ్వాసము పెట్టరాదు. ఎందులకనగా ఈ స్త్రీల హృదయాలు కుక్కలవలె కొంగ్రొత్త వాటిని ఆకాంక్షిస్తుంటాయి అని మంత్రార్థము). 16

శ్లో॥ కిమేతయా నోపకృతం రజ్జ్వా వా సర్ప చేతసః ।
ద్రష్టు స్స్వరూపావిదుషో యోఽహం యదజితేంద్రియః॥ 17

పూర్వము 'పుంశ్చత్యాపహృతంచిత్తం' అని అమెచేసిన అపచారము స్మరించి ఇప్పుడాయపరాధము నాదే అనుచున్నాడు. కాముకులకు ఈమెచే అపకారము చేయబడినది కొంచెము కూడా

టీ:- పూర్వం. శ్లో. "పూంశ్చల్యాపహృతం చిత్తమి" త్యాదినా తస్యా అపకారోఽనుస్మృతః ఇదానీం మమైవాయమపరాధ ఇత్యాహ-కిమితి. నః అస్మాకం కామినాం ఏతయా కిమపకృతం న కించిదపి. యథా రజ్జుస్వరూపావిదుషో రజ్జుద్రష్టుః పుంసః తస్యాం సర్పకల్పనాయా ఖిద్యతః రజ్జ్వాదికమపకృతం. న కిమపి. తద్వత్. యద్యస్మాద్యోఽహ మేవంభూతః స ఏవాజితేంద్రియత్వాదపరాధీత్యర్థః. 17

లేదు. త్రాడు యొక్క స్వరూపమును తెలియకయే త్రాటిని చూచి సర్పమను బుద్ధిచే ఖేదపడువానికి ఆ త్రాటిచే ఏమియు, ఎట్లును అపకారము చేయబడలేదో అట్లు నేనింద్రియవశుడనగుట వలన నా కామె అపకారిణికాదు సరికదా హితబోధచేయుటచే ఉపకారిణి యగు చున్నది. అజితేంద్రియుడనగుట వలన అపరాధిని అని అర్థము. 17

శ్లో॥ క్వాయం మలీమసః కాయో దౌర్గంధ్యాద్యాత్మకోఽశుచిః ।
క్వ గుణాస్సౌమనస్యాద్యాహ్యధ్యాసో విద్యయా కృతః ॥ 18

టీ:- నను తథాపి సైవ సౌగంధ్యప్రేమాదిగుణైః సమ్మోహమూల మిత్యాశంక్యతేఽపి స్వపరికల్పితా ఏవేత్యాహ - చతుర్భిః. క్వేతి. మలీమసః అతిమలినః. సుమనసాం కుసుమానామివ గంధ సౌకుమా ర్యాది. సౌమనస్యం శోభనమనోభావో వా. 18

ఓయీ! అట్లయినను సుగంధము కలిగియుండుట, ప్రేమ మొదలగు గుణములచే ఆమెయే ఈ సమ్మోహమునకు మూలము కదా అని శంకించి ఆ సౌగంధ్యాదులును తన బుద్ధితో కల్పించిన వేయని నాలుగు శ్లోకములలో చెప్పుచున్నాడు. చాలా మలినము దుర్గంధమున కాలవాలము, అపరిశుద్ధమగు ఈ కాంతాశరీరము, నా శరీరము ఎక్కడ? మంచి మనస్సు కలిగియుండుట మొదలగు శ్రేష్ఠగుణములు ఎక్కడ? స్వరూపాజ్ఞానముచే నాకీ భ్రమ కలిగినది. 18

శ్లో॥ పిత్రోః కిం స్వంనుభార్యాయా స్స్వామినోఽగ్నేశ్శ్వగృధ్రయోః ।
కిమాత్మనః కింసుహృదామితి యొ నావసీయతే ॥ 19

టీ:- మమత్వమపి తస్మిన్ పరికల్పితమేవేత్యాహ - పిత్రోరితి. పిత్రోః

మమత్వము కూడా అందులో కల్పితమేయనుచున్నాడు. ఈ శరీరము ఎవరిది? జనకులు గనుక, తల్లిదండ్రులదా? భోగములిచ్చు నది కనుక భార్యదా? అధీనుడు కనుక యజమానిదా? అంతేష్టిలో అగ్నికి ఆహుతియగునది కనుక అగ్నిదా? కుక్కలకు గ్రద్ధలకు భక్ష్యము

కిం స్వం కాయః. జనకత్వాత్. ను వితర్కే భార్యాయా వా భోగప్రదత్వాత్. అత్రానుపయుక్తమప్యేత తన్న్యాయతుల్యత్వాదుక్తం స్వామినో వా. అధీనత్వాత్. అగ్నేర్వా. అంత్యేష్ట్యాం తదాహుతిత్వాత్. శ్వ గృధ్రయోర్వా భక్ష్యత్వాత్కిం వాత్మనః తత్కృత శుభాశుభ భాగిత్వాత్. కింవా సుహృదాం. ఉపకారిత్వాత్. ఏవం యోన నిశ్చీయతే. 19

కనుక వాటిదా? శరీరకృతములగు శుభాశుభములను అనుభవించునది కనుక ఆత్మదా? ఉపకారులు కనుక మిత్రులదా? అనియే నేను నిశ్చయింపలేకున్నాను. 19

శ్లో॥ తస్మిన్ కళేబరేఽమేధ్యే తుచ్ఛనిష్ఠేవిషజ్జతే ।
అహో సుభద్రం సునసం సుస్మితం చ ముఖం స్త్రియః ॥ 20

టీ:- తస్మిన్నితి. తుఛ్ఛా క్రిమివిట్ భస్మలక్షణా నిష్ఠ అంతో యస్య తస్మిన్ కళేబరే కాయే. విషజ్జతే ప్రియత్వేన గృహ్ణీతే. మూఢా ఇతి శేషః. విషంగమేవాహః - అహోఇతి. సునసం శోభననాసికం. 20

క్రిములు, మలములతోకూడి చివరకు భస్మముగా పరిణమించు అపవిత్రమైన శరీరమును చూచి ఆహా ! ఈమె శరీరము సుఖము కలిగించునది. చక్కని నాసిక గలది. చక్కని చిరునవ్వు కలదీ స్త్రీయొక్క ముఖము అని సంసక్తుడగును. 20

శ్లో॥ త్వఙ్మాంస రుధిర స్నాయు మేదో మజ్జాస్థి సంహతౌ ।
విణ్మూత్రపూయే రమతాం క్రిమీణాం క్రియదంతరమ్ ॥ 21

టీ:- అతో గుణబుద్ధ్యా రమమాణా మాదృశాః క్రిమిసమా ఇత్యాహ- త్వగితి. త్వగాది సంహతౌ తత్సంఘాతే దేహేవిణ్మూత్రాధి సంహతౌ రమతాం క్రిమీనాం చ . 21

కావున గుణములనారోపించి రమించు నాబోటి వారు క్రిమి తుల్యులు అనుచున్నాడు. చర్మము, మాంసము, రక్తము, నరము, మెదడు, ఎముకలయందుండెడి ద్రవము, మలమూత్రములు, చీము వీటియందు విహరించు క్రిములకంటే నాకు భేదమేమున్నది. 21

శ్లో॥ తథాపి నో విషజ్జేత స్త్రీషు స్త్రైణేషు చార్థవిత్ ।
విషయేంద్రియ సంయోగాన్మనః క్షుభ్యతి నాన్యథా ॥ 22

టీ:- తదేతి. యద్యప్యేవం బీభత్సితా స్త్రియః తథాపి. నోవిషజ్జేత అవలోకనాది నాపి సంగం న కుర్యాత్. అర్థవిద్వివేకి అత్రహేతుః విషయేతి. 22

అట్లునూ ఆత్మహితముకోరువాడు స్త్రీలతో, స్త్రీలకువశులగు వారి తోడను సంగము కలిగి యుండరాదు. విషయేంద్రియముల యొక్క సంగముచే మనస్సు క్షోభిల్లునేకాని వేరొకవిధముగాకాదు. 22

శ్లో॥ అదృష్టాదశ్రుతా ద్భావాన్న భావ ఉపజాయతే ।
అసంప్రయుంజతః ప్రాణాన్ శామ్యతి స్తిమితం మనః ॥ 23

టీ:- నను క్వచిన్నిమీలితనయనాదేరపి మనః క్షోభో దృశ్యతే. సత్యం. సోఽపి పూర్వదర్శనాధికంవినా న భవతీత్యాహ-అదృష్టాదితి. భావాత్ పదార్థాత్. భావో మనః క్షోభః అతః. ప్రాణాన్ ఇంద్రియాణి. అసం ప్రయుంజతః. నియచ్ఛతః. స్థిమితం నిశ్చలం సత్. 23

ఓయీ! ఒక్కొక్కచో కన్నులు మూసికొనుట మొదలగు వానివలన కూడా చిత్తక్షోభ కలుగుట చూచుచున్నాము కదా అన్నచో నిజమే అదియూ పూర్వదర్శనాదులులేక సంభవించుచున్నదనుచున్నాడు. చూడబడినది, వినబడినది అగు పదార్థము వలన చిత్తక్షోభము కలుగదు. ఇంద్రియములను నియమించుకొనిన వాని మనస్సు నిశ్చలమై, రాగాదికలుషితము కాకుండును. 23

శ్లో॥ తస్మాత్సంగో న కర్తవ్యః స్త్రీషు స్త్రైణేంద్రియైః ।
విదుషామప్య విస్రబ్ధష్షడ్వర్గః కిముమాదృశామ్ ॥ 24

టీ:- తస్మాదితి. ఇంద్రియైః కృత్వా అవిస్రబ్ధః అవిశ్వసనీయః. మాదృశాం అవివేకినాం. 24

అందువలన స్త్రీలతో, స్త్రీలకు వశపడువారితో, ఇంద్రియములతో పొత్తు చేయదగనది. ఆరు విధములగు ఇంద్రియ సమూహము పండితలకునూ విశ్వసింపదగనది. అనగా నా వంటి వారి విషయమున ఏమి చెప్పవలెను. 24

**శ్రీ కృష్ణ ఉవాచ**

శ్లో॥ ఏవం ప్రగాయన్నృప దేవ దేవస్స
ఊర్వశీలోక మథోవిహాయ ।
ఆత్మానమాత్మన్యవగమ్య మాం వై
ఉపారత్ జ్ఞానవిధూతమోహః ॥ 25

టీ:- ఫలితమాహ ద్వాభ్యాం - ఏవమితి. నృపేషు దేవేషు సదీవ్యతీతి తథా. 25

**శ్రీభగవానుడు అనుచున్నాడు.**

ఫలితమును రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు. రాజులకు దేవతలకు దేవుడగు ఆ ఐలుడు ఈ ప్రకారముగా గొప్పగా గానముచేస్తు పరమాత్ముడనగు నన్ను తనయందు తెలిసికొని జ్ఞానముచే మోహము తొలగినవాడై సంసారమునుండి నివృత్తుడయ్యెను. 25

శ్లో॥ తతో దుస్సంగముత్సృజ్య సత్సు సజ్జేత బుద్ధిమాన్ ।
సంత ఏతస్య ఛిందంతి మనోవ్యాసంగముక్తిభిః ॥ 26

టీ:- తథ ఇతి. ఉక్తిభిః హితోపదేశైరితి. తీర్థ దేవతాది సంగాదపి సత్సంగః శ్రేయానితి దర్శయతి. 26

కావున బుద్ధిమంతుడగువాడు దుష్టులతో స్నేహాన్ని వదిలి సజ్జనులతో కూడి ఉండవలెను. సత్పురుషులు అట్టివాని మనస్సు నందలి విషయ వ్యాసంగమును సదుపదేశములచే ఛేదింతురు. 26

శ్లో॥ సంతోఽనపేక్షామచ్చితాః ప్రశాంతాస్సమదర్శినః ।
నిర్మమా నిరహంకారా నిర్ద్వంద్వా నిష్పరిగ్రహాః ॥ 27

టీ:- సతాం లక్షణమాహ-సంత ఇతి. విశేషణాష్టకస్య యథేష్టం హేతు హేతుమద్భావః. 27

సత్పురుషుల లక్షణము చెప్పుచున్నాడు. సత్పురుషులు నాకంటే వేరు విషయములందాపేక్ష లేనివారు. నా పైననే మనస్సు నిలిపిన వారు. నిర్మలమైన మనస్సు కలవారు. సర్వమును బ్రహ్మస్వరూపము గానే చూచువారు. అహంకార మమకారములను వీడిన వారు. శీతోష్ణాది ద్వంద్వములచే వికారము పొందనవారు. విషయములకు వశము కానివారు. 27

శ్లో॥ తేషు నిత్యం మహాభాగ మహాభాగేషు మత్కథాః ।
సంభవంతి హి తా నృణాం జుషతాం ప్రపునంత్యఘమ్॥ 28

టీ:- న చ తేషూపదేశాపేక్షా అపితు కేవలం తత్సన్నిధేరేవ తారయ తీత్యాహ- సప్తభిః తేష్వితి. 28

శ్లో॥ తా యే శృణ్వంతి గాయంతి హ్యనుమోదంతి చాదృతాః ।
మత్పరాశ్శ్రద్దధానాశ్చ భక్తిం విదంతి తే మయి ॥ 29

టీ:- తా ఇతి. శ్రవణాదిభిరేవ మత్పరాః శ్రద్ధదానాశ్చ సంతః. భక్తిం విందంతి. (29-30)

శ్లో॥ భక్తిలబ్ధవతస్సాధోః కిమన్యదవశిష్యతే ।
మయ్యనంతగుణే బ్రహ్మణ్యానందానుభవాత్మని ॥ 30

శ్లో॥ యథోపశ్రయమాణస్య భగవంతం విభావసుమ్ ।
శీతం భయం తమోఽప్యేతి సాధూన్ సంసేవత స్తథా ॥ 31

టీ:- యథేతి. విభావసుమగ్నిం సూర్యం వా సేవమానస్య అప్యేతి నశ్యతి. తథా కర్మాదిజాడ్యం. ఆగామి సంసార భయం. తన్మూల మజ్ఞానం చ. నశ్యతీత్యర్థః. 31

వారుపదేశింపవలెనని అపేక్షించ పనిలేదు. వారి సాన్నిధ్యమే తరించుననుచున్నారు. ఓ భాగ్యశాలీ! మహాభాగ్యశాలులగు ఆ సత్పురుషులు సదా నాకు సంబంధించిన కథలతోనే ప్రొద్దుపుచ్చువారు. నా కథలు నరులకు హితముగూర్చును. అది వినువారియొక్క పాపమును శోధనచేయును. 28

ఆ కథలను ఎవరు నా యందే ఆసక్తులై శ్రద్ధకలవారై వినుచున్నారో ఆదరయుక్తులై అనుమోదింతురో వారు నా యందు భక్తిని పొందెదరు. 29

అనంతగుణుడను, నిరతిశయానందరూపుడను, పరబ్రహ్మను అగు నా యందు భక్తినిలిపిన వాడు సాధింపక మిగిలినదేమున్నది. 30

ఏ విధముగా సూర్యుని, అగ్నిని సేవించుచున్నవానికి చలి భయము, చీకటి నశించునో అట్లే సత్పురుషులను సేవించు వారికి కర్మజాడ్యము, సంసారభయము, తన్మూలమగు అజ్ఞానము నశించును. 31

శ్లో॥ నిమజ్జ్యోన్మజ్జతాం ఘోరే భవాబ్ధౌ పరమాయనమ్ ।
సంతో బ్రహ్మవిదశ్శాంతా నౌర్దృఢేవాప్సు మజ్జతామ్ ॥ 32

టీ:- నిమజ్జ్యేతి. నిమజ్జ్యోన్మజ్జతాం ఉచ్చావచయోనీర్గచ్ఛతాం. పరమాయణం పరమాశ్రయః. 32

నీళ్ళలోమునుగు వారికెట్లు దృఢమగు నౌక శరణ్యమో అట్లు భీకరమగుభవాబ్ధిలో మునిగితేలువారలకు, నానా విధయోనులలో జన్మించువారికి బ్రహ్మవిదులు, శాంతులగు, సజ్జనులు ప్రాప్యులు. 32

శ్లో॥ అన్నం హి ప్రాణినాం ప్రాణఆర్తానాం శరణం త్వహం ।
ధర్మో విత్తం నృణాం ప్రేత్యసంతోఽర్వాక్‌బిభ్యతోరణమ్ ॥ 33

టీ:- కించ అన్నమితి. యథా అన్నమేవ ప్రాణిణాం ప్రాణోజీవనం. అహమేవ యథా శరణం. ధర్మఏవ యథాప్రేత్య పరలోకేవిత్తం. తథా సంథ ఏవ అస్మాత్ సంసారపాతాద్బిభ్యతః పుంసః అరణం శరణం 33

అన్నమెట్లు ప్రాణులకు జీవనాధారమో. నేనెట్లు ఆర్తులకు రక్షకుడనో, పరలోకమున నరులకు ధర్మమెట్లు ధనమో, అట్లు సత్పురుషులే సంసారమునపడి భయపడుచున్నవారికి శరణము. 33

శ్లో॥ సంతో దిశంతి చక్షూంషి బహిరర్కస్సముత్థితః ।
దేవతా భాంధవాస్సంతస్సంత ఆత్మాహమేవ చ ॥ 34

టీ:- కించ. సంత ఇతి. సంతః చుక్షూంషి సుగుణనిర్గుణజ్ఞానాని దిశంతి. అర్కః పునస్సమ్యగుత్థితోఽపి బహిస్థదప్యేకమేవచక్షురిత్యర్థః 34

సూర్యుడు చక్కగా ఉదయించియూ బయట మాత్రమే దర్శన సాధనము కలిగించుచున్నాడు. కాని సత్పురుషులు సుగుణ, నిర్గుణ జ్ఞాన రూపములగు నేత్రములను కలిగింతురు. దేవతలు, బంధువులు సత్పురుషులే నాకాత్మీయులు. వారు నేనేయను భావముతో సేవింప దగినవారు. 34

శ్లో॥ వైరసేన స్తతో౽ ప్యేవ మూర్వశ్యాలోకనిస్పృహః ।
ముక్తసంగో మహీమేతామాత్మారామశ్చరాచరః ॥ 35

టీ:- అధ్యాయార్థముపసంహరతి-వైరసేన ఇతి. సుద్యుమ్నభావేనో మావనం ప్రవిష్టస్య వీరాసేనా స్త్రీ భావం ప్రాప్తా యస్య తస్య స్త్రీభావం ప్రాప్తస్య పుత్రో వైరసేనః. పురూరవాః. ఏవముక్తప్రకారేణోర్వశ్యా లోకాత్థ్వానాదవలోకద్వా నిస్పృహః. తతో౽ పి తత్సంగాదపి హేతోర్ముక్త సంగస్సన్ ఆత్మారామో భూత్వాయథేచ్ఛం చచారేతి. 35

శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,
షడ్వింశో౽ ధ్యాయః

అధ్యాయార్థమునుపసంహరించుచున్నాడు. సుద్యుమ్ననిగా ఉమావనమున ప్రవేశించి అక్కడ స్త్రీత్వమును పొందిన వీతసేనుని (వీతము అనగా తన పూర్వరూపమును కోల్పోయి స్త్రీత్వమునొందిన సేనకలవాడు వీతసేనుడు.) కుమారుడు పురూరవుడు ఈ ప్రకారము గా ఊర్వశీలోకమునందు కాంక్ష తొలగినవాడై సజ్జన సాంగత్యముచే నిస్సంగుడై పరమాత్మ నిష్ఠుడై యథేచ్ఛగా తిరిగెను. 35

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
షడ్వింశోధ్యాయము సమాప్తము.

## సప్తవింశోఽధ్యాయః

శ్లో॥ సప్తవింశే క్రియాయోగస్సద్యశ్చిత్తప్రసాదకః ।
సర్వకామాప్తి హేతుశ్చ సాంగః ప్రోక్తస్సమాసతః ॥
రాగాద్యాకులచిత్తానాం కుతో సంగాదిసంభవః ।
ఇతి కృష్ణార్చనం భద్రమనుస్మృత్యాపృచ్ఛతి ॥

**శ్రీ ఉద్ధవ ఉవాచ**

శ్లో॥ క్రియా యోగం సమాచక్ష్వ భవదారాధనం ప్రభో ।
యస్మాద్యేత్వాం యథార్చంతి సాత్త్వతాస్సాత్త్వతర్షభ ॥ 1

టీ:- క్రియా యోగమితి. భవదారాధనరూపం. యస్మాదితి కారణాధిష్ఠానాది ప్రశ్నః సర్వకారకాణాం నిమిత్తస్య విశిష్టత్వాత్. యథేతి. కస్మిన్నధిష్ఠానాదౌ ప్రకారేణేతి ప్రశ్నః. యే అధికారిణః సాత్త్వతాః భక్తాః. 1

శ్లో॥ ఏతద్వదంతి మునయో ముహుర్నిశ్శ్రేయసం నృణాం ।
నారదో భగవాన్ వ్యాస ఆచార్యోఽంగిరసస్సుతః ॥ 2

టీ:- అస్య పునర్విశేషతః ప్రశ్నేకారణమాహ - చతుర్భిః. ఏతదితి. ఏతత్త్వదర్చనం పరం నిశ్శ్రేయసకరం వదంతి అంగిరసస్సుతో బృహస్పతిః. 2

## 27వ అధ్యాయము

ఈ ఇరువది ఏడవ అద్యాయమునందు శీఘ్రమే మనస్సును ప్రశాంతపరచునది, సకలాభీష్టములు లభించుటకు మూలమయినది యగు యోగము సాంగముగా సంగ్రహరూపముగా చెప్పబడినది. రాగాదులచే మనోవ్యాకులతను పొందినవారు నిస్సంగులెట్లగుదురు. అని అట్టివారికై శుభమగు కృష్ణార్చనము అనుస్మృతిగా ప్రశ్నోత్తరములతో తెలుపుచున్నాడు.

**ఉద్ధవుడు అనుచున్నాడు.**

ఓ ప్రభూ! సాత్వత శ్రేష్ఠుడా! ఏ కారణఅధిష్టానముల వలన నిను భక్తులు పూజింతురో అట్టి నీ పూజారూపమగు క్రియా యోగమును చెప్పుము. (ఏఅధిష్ఠానమునందు ఏ ప్రకారముగా అని ప్రశ్న). 1

దీనికి మళ్ళీ విశేషమయిన ప్రశ్న వేయడంలో కారణము నాలుగు శ్లోకాలలో చెప్పుచున్నాడు. నారద, వ్యాస, బృహస్పత్యాది మునులు అందరూ ఈ క్రియా యోగము నరులందరికి మోక్షప్రదమని అనేకమార్లు చెప్పుదురు. 2

శ్లో॥ నిస్సృతం త్వన్ముఖాం భోజాద్యథాహ భగవానజః ।
పుత్రేభ్యో భృగుముఖ్యేభ్యో దేవ్యై చ భగవాన్భవః ॥ 3

టీ:- నిస్సృతమితి. నిస్సృతం త్వయోపదిష్టమిత్యర్థః. దేవ్యై పార్వత్యై. 3

నీ ముఖకమలమునుండి వెలువడిన ఈ కర్మయోగమును బ్రహ్మ తన పుత్రులు, భృగువు మొదలగు వారికిని; శివుడు పార్వతికిని ఉపదేశించెను. 3

శ్లో॥ ఏతద్వై సర్వవర్ణానామాశ్రమాణాం చ సంమతం ।
శ్రేయసాముత్తమం మన్యే స్త్రీశూద్రాణాం చ మానదః ॥ 4

టీ:- ఏతదితి. స్వర్ణ వర్ణానాం త్రైవర్ణికానాం. 4

నీ ఆరాధనము మూడు వర్ణములవారికి అన్ని ఆశ్రమముల వారికినీ సమ్మతము అంతేకాదు స్త్రీలకు శూద్రులకు గూడా ఇది పరమశ్రేయస్కరమని తలంతురు. 4

శ్లో॥ ఏతత్కమలపత్రాక్ష కర్మబంధవిమోచనం ।
భక్తాయచానురక్తాయ బ్రూహి విశ్వేశ్వరేశ్వర ॥ 5

టీ:- ఏతదితి. విశ్వేశ్వరాయే తేషామీశ్వర. 5

ఓ కమలనేత్రా! కర్మబంధములు తొలగించునదగు దీనిని, భక్తుడను అనురక్తుడనగు నాకు వివరించుము. 5

శ్రీభగవానువాచ

శ్లో॥ నహ్యంతోఽనంతపారస్య కర్మకాండస్య చోద్ధవ ।
సంక్షిప్య వర్ణష్యామి యథావదనుపూర్వశః ॥ 6

టీ:- నేతి. కర్మకాండస్య పూజావిధానస్య. నాస్త్యంతో గ్రంథతః పారం చానుష్ఠానతో యస్య తస్య. 6

భగవానుడు చెప్పచున్నాడు

ఓ ఉద్ధవా! అంతులేని కర్మకాండకు తుదియన్నదిలేదు. కావున యథాతథముగా క్రమముగా సంగ్రహముగా నీకుపదేశింతును. 6

శ్లో॥ వైదికస్తాంత్రికో మిశ్ర ఇతి మే త్రివిధో మఖః ।
త్రయాణామీప్సితేనైవ విధినా మాం సమర్చయేత్ ॥ 7

టీ:- వైదిక ఏవ మంత్రో వైదికాన్యేవాంగాని చ యస్మిన్ పురుషసూక్తాదౌ స వైదికః. ఏవం తాంత్రికోஉపి. మిశ్రోஉష్టాక్షరాదిః మఖః పూజా. 7

వైదికము, తాంత్రికము, మిశ్రము అని నా పూజ మూడు విధములయినది. వైదికాంగములుగల పురుషసూక్తాదికముతో పూజ వైదికము. పాంచరాత్రాది తాంత్రికము. అష్టాక్షరాది వైదికతాంత్రికముల సమన్వయముతో ఏర్పడిన పూజ మిశ్రమము. ఈ మూడు పద్ధతులతో నన్ను పూజింపవలెను. 7

శ్లో॥ యథా స్వనిగమేనోక్తం ద్విజత్వం ప్రాప్య పూరుషః ।
యథా యజేత మాం భక్త్యా శ్రద్ధయా తన్నిబోధమే ॥ 8

టీ:- యదా త్రైవర్ణికో యజేత తదా విశేషమాహ - యథేతి. యథా గర్భాష్టమైకాదశాబ్దాదికాలే. స్వనిగమేన స్వాధికార ప్రవృత్తేన వేదేన ఉక్తం. ద్విజత్వం ఉపనయనం. 8

పురుషుడు గర్భాష్టమ, ఏకాదశ, ద్వాదశ అబ్దాది కాలములందు తన అధికారానుగుణముగా, వేదముచే చెప్పబడిన ఉపనయ సంస్కారమును పొందినవాడై, భక్తి శ్రద్ధలతో నన్ను పూజింపవలెను. ఆ విధానమును తెలుపెదను వినుము. 8

శ్లో॥ అర్చాయాం స్థండిలేஉగ్నౌవా సూర్యేஉప్సు హృదివా ద్విజే ।
ద్రవ్యేణ భక్తియుక్తోஉర్చేత్స్వగురుం మామమాయయా ॥ 9

టీ:- అర్చాయామితి. అర్చాయాం ప్రతిమాదౌ. 9

ప్రతిమయందుగాని, చక్రాబ్జమండలాదుల యందు గాని, అగ్నియందు గాని, సూర్యుని యందు గాని, బ్రాహ్మణుని యందు గాని, వీనిలో ఏదో ఒకదాని యందు పూజా సాధనములతో తన గురువగు నన్ను నిష్కపటభావముతో భక్తితో పూజించవలెను. 9

శ్లో॥ పూర్వం స్నానం ప్రకుర్వీత ధౌతదంతోఽఙ్గశుద్ధయే ।
ఉభయైరపి చ స్నానం మంత్రైర్మృద్గ్రహణాదిభిః॥ 10

టీ:- పూర్వమితి. స్నానవిశేషమాహ-ఉభయైర్వైదికైస్తాంత్రికైశ్చ మంత్రైః. 10

పండ్లు తోముకొని అవయవముల పరిశుద్ధికై మొదట స్నానము చేయవలెను. బంకమన్ను, గోమయము మొదలైన వాటిని శరీరానికి పూసుకొని వైదికతాంత్రిక మంత్రములతో స్నానముచేయవలెను. 10

శ్లో॥ సంధ్యోపాస్త్యాదికర్మాణి వేదేనాచోదితాని మే ।
పూజాం తైః కల్పయేత్సమ్యక్సంకల్పః కర్మపావనీమ్ ॥ 11

టీ:- కించ. సంధ్యేతి. సంధ్యోపాసనాదీని కర్మాణి. ఆచోదితాని సాకల్యేన విహితాని యస్య తాని. తైస్సహ మే పూజాం కుర్యాత్. న తు తాని పరిత్యజేదిత్యర్థః. సమ్యక్పరమేశ్వరవిషయ ఏవ సంకల్పో యస్య తథా భూతస్సన్. కర్మపావనీం కర్మనిర్వాణీం. 11

వేదముచే సాకల్యముగా విహితములైన సన్ధ్యోపాసన మొదలగు కార్యములేవి కలవో, వానిచే పరమేశ్వర విషయమగు సంకల్పముతో కర్మలను పోగొట్టునట్టి నా పూజను చేయవలెను. 11

శ్లో॥ శైలీదారుమయీ లౌహీలేప్యా లేఖ్యాచ సైకతీ ।
మనోమయీ మణిమయీ ప్రతిమాష్టవిధా స్మృతా ॥ 12

టీ:- అర్చాభేదానాహ-సార్ధేన. శైలీతి. శైలీ శిలామయీ లౌహీ సువర్ణాదిమయీ. లేప్యా మృచ్చందనాదిమయీ హృది పూజాయాం మనోమయీ. ప్రకర్షేణ తిష్ఠత్యస్యామితి ప్రతిష్ఠా ప్రతిమైవ. జీవస్య భగవతో మందిరం .యద్వా. ప్రతిష్ఠయా కళాన్యాసేన భగవన్మందిరం భవతీతి. (12,13)

అర్చాభేదములను చెప్పుచున్నాడు. భగవత్ప్రతిమ శిలా నిర్మితము, కొయ్యతో చేసినది, సువర్ణ మయము, మట్టి చందనము మొదలయిన వానితో చేసినది, పత్రాధికముపై గీచినది, ఇసుకతో నిర్మించినది, మనోమయీ (హృదయమునందు పూజించిన) అని ఇట్లు ఎనిమిది విధములుగా (ప్రతిమ) చెప్పబడినది. 12

శ్లో॥ చలాచలేతి ద్వివిధా ప్రతిష్ఠాజీవమందిరమ్ ।
ఉద్వాసనాహనేన సస్థిరాయాయముద్ధవార్చనే ॥ 13

ఓ ఉద్ధవా! ఆ ప్రతిమ చల, అచల అని రెండు విధములు. కళాన్యాసాదికముతో ప్రతిష్ఠింపగా అది దేవాలయము అగును. అచల రూపమగు ప్రతిమయందు ఆరాధన చేయునపుడు ఆవాహన విసర్జనలు ఉండవు. 13

శ్లో॥ అస్థిరాయాం వికల్పస్స్యాత్ స్థండిలేత్యుభవేద్ద్వయం ।
స్వప్నం త్వవిలేప్యాయమన్యత్రపరిమార్జనమ్ ॥ 14

టీ:- ప్రతిమాభేదే విశేషమాహసార్ధేన-ఉద్వాసేతి. ఉద్వాసో విసర్జనం. అస్థిరాయామర్చనే వికల్పః. సాలగ్రామేన కుర్యాత్ సైకతాయం కుర్యాత్ అన్యత్ర కుర్యాద్వా నవేతి. అవిలేప్యాయాం మృణ్మయలేఖ్య వ్యతిరిక్తాయాం. అన్యత్ర విలేప్యాయాం చ లేఖ్యాయాం చ పరిమార్జనమేవ. 14

చర ప్రతిమ అయినచో ఆవాహన విసర్జనలు ఒక్కచో చేయబడవచ్చును. ఒక్కచో చేయకున్నను దోషములేదు. వేదికపైన ఆవాహన విసర్జనలు రెండునూ ఉండును. మృణ్మయ లేఖ్యములు విడిచి మిగతా చోట్ల స్వపనము చేయవలెను. లేప్యా లేఖ్యా సైకతములకు పరిమార్జనము మాత్రమే. 14

శ్లో॥ ద్రవ్యైః ప్రసిద్ధైర్మద్యాగః ప్రతిమాదిష్వమాయునః ।
భక్తస్య తు యథాలబ్ధైర్హృది భావేనచైవ హి ॥ 15

టీ:- ఇదానీం సకామనిష్కామభేదేన విశేషమాహ - ద్రవైరితి. ప్రకర్షేణసిద్ధైః సుశోభనైః అమాయినః. నిష్కామస్య భక్తస్య తు యథా లబ్ధైర్యత్ర చందనాది నలభ్యతే తత్రహృది భావేనయా. యద్వా. హృది చేన్మద్యాగః. తదా భావేన మనోమయైర్ద్రవ్యైరిత్యర్థః. 15

ఇప్పుడు సకామనిష్కామ భేదములతో విశేష రూపమును చెప్పుచున్నాడు. సకాముడు ప్రతిమాదులయందు ప్రశస్త ద్రవ్యములతో నా పూజచేయవలెను. భక్తుడు (నిష్కాముడు) తనకు లభించిన ద్రవ్యముల తోడనే నా పూజ చేయవలెను. అట్లు చందానాదులు లభించనిచో తన మనస్సులోనే నా యాగము చేయుచున్నట్లు భావన చేసి మనోమయ ద్రవ్యములతో పూజ చేయవలెను. 15

శ్లో॥ స్నానాలంకరణం శ్రేష్ఠమర్చాయామేవ తూద్ధవః ।
స్థండిలేతత్త్వవిన్యాసో వహ్నౌ వాజ్యప్లుతం హవిః ॥ 16

టీ:- అధిష్ఠానభేదేన ప్రధానోపచారానాహసార్ధేన- స్నానేతి. తత్త్వ విన్యాసః యథా స్థానమంగ ప్రధాన దేవతానాం తత్తన్మంత్రైః స్థాపనం. అభ్యర్హణం ఉపస్థానార్ఘ్యాది. సలిలాదిభిస్తర్పణాదినా యజనం. 16

అధిష్ఠానభేదముచే ప్రధానోపచారమును చెప్పుచున్నాడు. ఓ ఉద్ధవా! స్నానము, అలంకరణము ప్రతిమయందే నాకు ప్రియతమమైనది. స్థండిలము యందు యథా స్థానముగా అంగప్రధాన దేవతలను ఆ యా మంత్రములతో స్థాపించుట, అగ్నియందు నేతితో తడుపబడిన హవిర్ద్రవ్యము విడుచుట నాకు ప్రియము. 16

శ్లో॥ సూర్యేచాభ్యర్హణం ప్రేష్ఠం సలిలే సలిలాదిభిః ।
శ్రద్ధయోపహృతం ప్రేష్ఠం మమభక్తేన వార్యపి ॥ 17

టీ:- సర్వత్ర సాధారణమాహ-శ్రద్ధయేతి. 17,18

సూర్యరూపియగు ప్రతిమయందు ఉపస్థానముతో పూజించుట, స్తోత్రములతో ఆరాధించుట అభిమతము. జలమునందు నీరు, చందనము,పుష్పములు, అక్షంతలు మొదలగు వానిచే పూజ అభీష్టము. నా భక్తునిచే శ్రద్ధతో తేబడిన జలముకూడా నాకు ఇష్టమైనది. 17

శ్లో॥ భూర్యప్య భక్తోపహృతం న మే తోషాయ కల్పతే ।
గంధోధూపస్సుమనసో దీపోఽన్నాద్యం చ కిం పునః ॥18

నాకు భక్తుడుకానివాడు ఆడంబరమునకై గంధము, ధూపము, పుష్పములు, అన్నాది నైవేద్యములు విశేషముగా సమర్పించిననూ అది నాకెంత మాత్రము తృప్తిని కలిగింపదు. ఇంక తక్కిన ద్రవ్యముల విషయము వేరుగా చెప్పవలెనా? 18

శ్లో॥ శుచిస్సంభృతసంభారః ప్రాగ్దర్భైః కల్పితాసనః ।
ఆసీనః ప్రాగుదగ్వార్చేదర్చాయాం త్వథ సమ్ముఖః ॥ 19

ఇట్లు అధికారాధి వ్యవస్థను చెప్పి ఇప్పుడు పూజాప్రకారమును చెప్పుచున్నాడు. పరిశుద్ధుడై పూజాద్రవ్యములు సమకూర్చుకొనినవాడై

టీ:- ఏవమధికారాదివ్యవస్థాముక్త్వా ఇదానీం పూజా ప్రకారమాహ -శుచిరితి. సంభృతాః సంభారాః పూజాసాధనాని యేన సః.ప్రాగగ్రైః దర్భైః. యద్వా ప్రాగేవ సంభృత సంభారస్సన్నాసీనః. నత్వాసీనస్సన్ పశ్చాత్తత్తత్సం భారార్థం వారం వార ముత్తిష్ఠేదిత్యర్థః. ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వా ఆసీనః. అర్చాయాం తు స్థిరాయాం సంముఖః అర్చాభి ముఖ ఉపవిష్టస్సన్. 19

తూర్పునకు కొనలున్న దర్భలతో చేయబడిన పీఠముపై తూర్పు లేదా ఉత్తరాభిముఖముగా కూర్చుండి పూజింపవలెను. కూర్చున్న తరువాత సామాగ్రి కొరకై పదేపదే లేవరాదని అర్థము. 19

శ్లో॥ కృతన్యాసః కృతన్యాసాం మదర్చాం పాణినా మృజేత్ ।
కలశం ప్రోక్షణీయం చ యథావదుపాదయేత్ ॥ 20

టీ:- కృతన్యాస ఇతి. అనంతరం గుర్వాదినమస్కార పూర్వకం యథోపదేశం స్వస్మిన్ కృతన్యాసః. కృతో మూలమంత్రన్యాసో యస్యాం తాం మమార్చాం. ఆమృజేత్ నిర్మాల్యాపకర్షణాదినా శోధయేత్. కలశం పూర్ణకుంభం. ప్రోక్షణీయం ప్రోక్షణార్థోదకపాత్రం చ. ఉపసాధయే చ్చందన పుష్పాదిభిస్సంస్కుర్యాత్. 20

తరువాత గుర్వాదులకు నమస్కారము చేసి యథోపదేశముగా తనయందు మూలమంత్రన్యాసము చేసుకొని ఆ మూలమంత్రన్యాసమే చేయబడిన ఆ అర్చాప్రతిమను చేతితో నిర్మాల్యాదులను తొలగించి శోధించవలెను. పూర్ణకుంభమును ప్రోక్షణార్థమగు ఉదక పాత్రను యథాప్రకారముగా నమస్కరించవలెను. 20

శ్లో॥ తదద్భిర్దేవయజనం ద్రవ్యాణ్యాత్మానమేవ చ ।
ప్రోక్ష్యపాత్రాణి త్రీణ్యద్భి స్తైస్తైర్ద్రవ్యైశ్చ సాధయేత్ ॥ 21

ఆ కలశోదకముతో యాగభూమిని, సాధనములను, తన దేహమును, పాద్యాది పాత్రలను మూడింటిని (అర్ఘ్యపాద్యఆచమనీయ) ప్రోక్షణము చేసి కలశోదకమును ఆ యా ద్రవ్యములలో నింపవలెను.

టీ:- తదితి. తదద్భిః ప్రోక్షణీయాద్భిః. దేవయజనం దేవపూజస్థానం. పాద్యాద్యర్థం త్రీణి పాత్రాణి కలశోదకైః పూరితాని తైస్తైర్ద్రవ్యైస్సాధయేత్. తత్ర పాద్యాదిద్రవ్యాణి. శ్లో."పాద్యే శ్యామాకదూర్వాబ్జ విష్ణు క్రాంతాది రిష్యతే అర్ఘ్యేతు". శ్లో. "గంధపుష్పాక్షతయవకుశాగ్ర తిల సర్షపాః. దుర్వాచేతి క్రమాదర్ఘ్యద్రవ్యాష్టక ముదీరితమ్". ఆచమనీయకే తు. శ్లో. జాతీలవంగ తక్కోలైర్మతమాచమనీయకమితి. 21

పాద్యాది ద్రవ్యములేవి అనగా 'పాద్యేశ్యామాక దూర్వాబ్జవిష్ణుక్రాంతాదిరిష్యతే, గంధపుష్పాక్షతయవకుశాగ్ర తిల సర్శపా దూర్వాచేతి క్రమాదర్ఘ్య ద్రవ్యాష్టన్ ముదీరితం. జాతీ లవంగ తక్కోలైర్మత మాచమనీయకం' అనగా శ్యామాకము, గరిక, పద్మము, విష్ణుక్రాంతము ఇవి పాద్య ద్రవ్యములు. గంధము, పుష్పము, అక్షతలు, యవలు, కుశాగ్రములు, తిలలు, తెల్లావాలు, గరిక, ఈ అష్టద్రవ్యములు అర్ఘ్యము. జాజికాయ లవంగము, తక్కోలములు ఆచమనీయ ద్రవ్యములు. 21

శ్లో॥ పాద్యార్ఘ్యాచమనీయార్థం త్రీణిపాత్రాణి దేశికః ।
హృదా శీర్ష్ణా చ శిఖాయా గాయత్ర్యా చాభిమంత్రయేత్ ॥ 22

టీ:- పాద్యేతి. తాని చ త్రీణి పాత్రాణి యథాక్రమం హృదయాది మంత్రైర్గాయత్ర్యా చ సర్వాణ్యభిమంత్రయేత్. 22

ఆచార్యుడు పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయములకై మూడు పాత్రలను క్రమముగా హృదయ మంత్రముచేతను, శిరోమంత్రము చేతను, శిఖా మంత్రముచేతను అన్ని పాత్రలను గాయత్రి మంత్రము చేతను అభిమంత్రించవలెను. 22

శ్లో॥ పిండే వాయ్వగ్నిసంశుద్ధే హృత్పద్మస్థాం పరాం మమ ।
అణ్వీంజీవకళాం ధ్యాయేన్నాదాంతే సిద్ధభావితామ్ ॥ 23

టీ:- పిండ ఇతి. తదనంతరం. పిండేదేహే. వాయ్వగ్నిసంశుద్ధ ఇతి కోష్ఠగతేన వాయునా శోషితే, ఆధారగతేనాగ్నినా దగ్ధే పునర్లలాటస్థ

తరువాత లింగదేహమునందు పంచకోశాత్మకగతమైన వాయువుచే శోషితమైన; మూలాధారములోని అగ్నిచే దగ్ధమైన; లలాటమందున్న చంద్రమండల మందలి అమృతధారామయమైన; అకార, ఉకార, మకార, బిందు, నాదములనెడి ఐదు అంశములుగా సిద్ధస్వరూపమున (ప్రణవమును); శ్రేష్ఠమైన, జీవకళారూపమైన

చంద్రమండలామృతప్లావేనామృతమయే జాతే తస్మిన్. హృత్పద్మస్థాం పరాం శ్రేష్ఠాం జీవకళాం శ్రీనారాయణమూర్తిం ధ్యాయేత్. కథం భూతాం. నాదాం తే సిద్ధభావితాం ప్రణవస్య అకారోకారమ కార బిందునాదాః పంచాంశాః తత్రనాదాంతే సిద్ధైర్ధ్యాతాం. తథా చ. శ్రు. "యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః, తస్య ప్రకృతిలీనస్య యః పరస్సమహేశ్వర" ఇతి. 23

నారాయణమూర్తిని హృదయకమలమందు ధ్యానించవలెను. 23

శ్లో॥ తయాత్మభూతాయ పిండే వ్యాప్తే సంపూజ్యతన్మయః ।
ఆవాహ్యార్చాదిషు స్థాప్య న్యస్తాంగం మాం ప్రపూజయేత్ ॥ 24

టీ:- తయేతి. తయాత్మభూతయాస్వేనైవ చింతితయా. అమృతమయపిండే దీపేన ప్రభయా గృహమివ వ్యాప్తే సతి. తస్మిన్నేవాదౌ మానసైరుపచారై స్సంపూజ్య తన్మయస్సన్. అర్చాదిష్వావాహన స్థాపన ముద్రయా స్థాపయిత్వా. మాం ప్రపూజయేత్. 24

స్వభావముచేతనే ధ్యానించబడినట్టి ఆ జీవకళచే అమృతమయమైన పిండము (దీపముచే గృహమందు కాంతివలె) వ్యాపించగా దానియందే మొదట మానసోపచారములతో పూజించి భగవన్మయుడై ఎనిమిది విధములగు ప్రతిమలందు ఆవాహనముచేసి భగవంతుని అచట సన్నిహితునొనర్చి హృదయాద్యం మంత్రముల నా ధ్యానము చేసి నన్ను పూజించవలెను. 24

శ్లో॥ పాద్యోపస్పర్శార్హణాదీనుపచారాన్ప్రకల్పయేత్ ।
ధర్మాదిభిశ్చనవభిః కల్పయిత్వాసనం మమ ॥ 25

టీ:- కథం ప్రపూజయేత్తదాహ - ద్వాభ్యాం. పాద్యేతి. ధర్మాదిభిర్మమాసనం కల్పయిత్వా. 25

ఎట్లు పూజించవలెనన్న రెండుశ్లోకములలోచెప్పుచున్నాడు.

ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్య, అధర్మ, అజ్ఞాన, అవైరాగ్య, అనైశ్వర్యములు అను పాదములతో కూడిన పీఠమందు విమలా, ఉత్కర్షిణీ, జ్ఞానా, క్రియా, యోగా, మహీ, సత్యా, ఈశానా, అనుగ్రహా, అను తొమ్మిది మూర్తులతో కూడినది. కర్ణికతో, కేసరములతో

శ్లో॥ పద్మమష్టదళం తత్ర కర్ణికాకేసరోజ్జ్వలం ।
ఉభాభ్యాం వేదతంత్రాభ్యాం మహ్యం తూభయసిద్ధయే ॥ 26

టీ:- పద్మమితి. తత్ర పద్మంచ కల్పయిత్వా. ఉభాభ్యాం. వేద తంత్రాభ్యాం. ఉభయసిద్ధయే మహ్యం పాద్యాదీనుపచారాన్ ప్రకల్ప యేదిత్య న్వయః. ఉపస్పర్శః ఆచమనం అర్హణమర్ఘ్యం. ఉభయసిద్ధయే వేద తంత్రోక్త భుక్తి ముక్తిప్రాప్తయే. అయమర్థః ధర్మ జ్ఞాన వైరాగ్యై శ్వర్యాణ్యాసన పర్యంక స్యాగ్నేయాది చతుష్కోణేషు పాదాః. అధర్మాజ్ఞానా వైరాగ్యానైశ్వర్యాణి పర్యంకస్య పూర్వాదిదిక్షు గాత్రాణి పర్యంక మధ్యే త్రయో గుణాః పట్టికాః. తత్రపూర్వాదిక్రమేణ మధ్యేచ. శ్లో. విమలోత్కర్షణీ జ్ఞానా క్రియా యోగా తథైవచ, ప్రజ్ఞాసత్యాతథేశానానుగ్రహాచేతి శక్తయః ఏవం యథోపదేశం ధర్మాదిభిరష్టభిర్నవభిశ్శక్తిభిర్గుణైశ్చాసనం కల్పయి త్వేతి. కర్ణికాయాః కేసరైర్గుణ త్రయోపరిస్థాపితైస్సోమ సూర్యాగ్ని మండలై శ్చోజ్జ్వలమిత్యర్థః. 26

శ్లో॥ సుదర్శనం పాంచజన్యం గదాసీషుధనుర్హలాన్ ।
ముసలం కౌస్తుభం మాలాం శ్రీవత్సం చానుపూజయేత్ ॥ 27

టీ:- ఆయుధాది పూజామాహ - త్రిభిః. సుదర్శనమితి. తత్రన్యస్తాంగ మిత్యంగా వరణపూజా సూచితా. ఆసనేనైవ న శక్త్యానువరణ ముక్తం.

ప్రకాశించునది. ఎనిమిది దళములు కలదియగు పద్మములు నాకు ఆసనముగా కల్పించి అందు వేదతంత్రోక్తమగు భుక్తి, ముక్తులు కలుగుటకై వేద పాంచతంత్రములతో పాద్యము, ఆచమనము, అర్ఘ్యము మొదలగు ఉపచారములను కల్పించవలెను.

ఇది యర్థము. ధర్మ, జ్ఞాన, వైరాగ్యైశ్వర్యములు ఆసన, పర్యంక మునకు ఆగ్నేయాది చతుష్కోణములందు పాదములు. అధర్మాదులు పూర్వాది దిక్కులయందు గాత్రములు. మూడు గుణములు పట్టికలు పూర్వాది క్రమముగా మధ్యలో విమలోత్కర్షిణీత్యాది నవశక్తులు. ఈ విధముగా ఉపదేశముననుసరించి ధర్మాది నవశక్తులతో ఆసనము కల్పించుకొని అని. (25-26)

ఇటుపై ఆయుధాది పూజను చెప్పుచున్నాడు. సుదర్శన, పాంచ జన్య, గదా, కౌమోదకి, నందకబాణ, శార్ఙ్గహల, ముసలములు ఎనిమిది ఆయుధములను పూజించవలెను. సుదర్శనాది ముసలాంత ఆయుధముల నష్టదిక్కులయందు కౌస్తుభమాలా శ్రీవత్సములను వక్షస్థలమున. 27

తత స్సుదర్శనాదిముసలాంతాన్యాయుధాన్యష్టసు దిక్షు–కౌస్తుభమాలా శ్రీవత్సానురసి. 27

శ్లో॥ నందం సునందం గరుడం ప్రచండం చండమేవచ ।
మహాబలం బలం చైవ కుముదం కుముదేక్షణమ్ ॥ 28

టీ:- నందమితి. నందాదీన్ పార్షదానాదిక్షు. గరుడం పురతః. 28

శ్లో॥ దుర్గాం వినాయకం వ్యాసం విష్వక్సేనం గురూన్ సురాన్ ।
స్వే స్వే స్థానే హ్యభిముఖాన్ పూజయేత్ప్రోక్షణాదిభిః ॥ 29

టీ:- దుర్గామితి. దుర్గాదీన్ కోణేషు. గురూన్వామతః. సురానింద్రాది లోకపాలాన్ పూర్వాదిదిక్షు. ఏవ మేతాన్ దేవస్యాభిముఖాన్ ప్రోక్షణాదిభి రర్ఘ్యాదిభిః. పూజయేదిత్యర్థః. (28,29)

నందుడు, సునందుడు, ప్రషండుడు. చండుడు, మహాబలుడు, బలుడు, కుముదుడు, కుముదేక్షణుడు అను భగవత్పార్షదులను అష్ట దిక్కులందును. గరుడిని నా యెదుటను దుర్గను, వినాయకుని, వ్యాసుని, విశ్వక్సేనుని కోణములందును గురువులను వామప్రదేశము లందు ఇంద్రాది లోకపాలకులను వారివారి దిక్కులందు ఇట్లు వీరిని నాకభిముఖముగా అర్ఘ్యాదులతో పూజించవలెను. (28–29)

శ్లో॥ చందనోశీర కర్పూరకుంకుమాగరువాసితైః ।
సలిలైస్స్నాపయేన్మంత్రైర్నిత్యదా విభవే సతి ॥ 30

టీ:- పాద్యాదీనుపచారాన్. ప్రకల్పయేదిత్యుక్తం. తానేవ గుణవృధిభిః ప్రపంచయతి షడ్భిః. చందనేతి. 30

పాద్యాద్యుపచారములను కల్పించవలెనని చెప్పెను. వానినే గుణవిధులతో ప్రవచించుచున్నాడు ఆరు శ్లోకములచే. చాలినంత ధనమున్నచో చందనము, వట్టివేళ్ళు, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, అగురు మొదలగు పరిమళ ద్రవ్యములు కలిపిన జలముతో నిత్యము స్నపనమాచరించవలెను. 30

శ్లో॥ స్వర్ణ ఘర్మానువాకేన మహాపురుషవిద్యయా ।
పౌరుషేణ చసూక్తేన సామభీరాజనాదిభిః ॥ 31

టీ:- మంత్రానాహ-స్వర్ణేతి. స్వర్ణఘర్మానువాకః. శ్రు."సువర్ణ ఘర్మం పరివేదనమి"త్యాది. మహాపురుషవిద్యయా. శ్లో. "జితంతే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన, నమస్తేఽస్తు హృషీకేశ మహాపురుషపూర్వజే"తి పౌరుషం సూక్తం సహస్రశీర్షేత్యాది రాజనాదీని సామాని. శ్రు. "ఇంద్ర న్నరో నేమధితాహవంత" ఇత్యస్యామృచి గీతాని. ఆదిశబ్దేన రౌహిణా దీని. 31

మంత్రములను చెప్పుచున్నాడు. 'సువర్ణంఘర్మంపరివేదవేనం' అనునదిస్వర్ణఘర్మానువాకం. 'జితం తే పుండరీకాక్షనమస్తేవిశ్వభావన. సుబ్రహ్మణ్య నమస్తేస్తు మహాపురుషపూర్వజ' అనునది మహాపురుష విద్యా. 'సహస్రశీర్షా'ఇత్యాదిపురుషసూక్తము. 'ఇంద్రంనరానేమధితా' రాజనాది సామములు రౌహిణ్యాదులు ఆదిశబ్దముతో గ్రహించబడును. (31)

శ్లో॥ వస్త్రోపవీతాభరణపత్రస్రగ్గంధలేపనైః ।
అలంకుర్వీత స ప్రేమ మద్భక్తో మాం యథోచితమ్ ॥ 32

టీ:- వస్త్రాద్యుపచారేష్వలంకార లక్షణం గుణం విధత్తే వస్త్రేతి. పత్రాణి కపోల వక్షస్థలాదిషు లిఖితాః. పత్రభంగ్యః మద్భక్తశ్చేత్సప్రేమ యథా భవతి తథా యథోచిత మలం కుర్వీతేత్యర్థః. 32

వస్త్రాద్యుపచారములయందు అలంకార లక్షణములైన గుణమును విధించుచున్నారు. వస్త్రములు, యజ్ఞోపవీతము, ఆభరణములు, కపోలములు, వక్షస్థలము మొదలగు ప్రదేశములందు రచింపబడు పత్రభంగులు, మాలలు, చందనములు, అగరు మొదలగు వానితో నా భక్తుడు (ప్రేమతో కూడినవాడై) తగు రీతిగా నన్ను అలంకరించవలెను. 32

శ్లో॥ పాద్యమాచమనీయం చ గంధం సుమనసోఽక్షతాన్ ।
ధూప దీపోప హార్యాణి దద్యాన్మే శ్రద్ధయార్చకః ॥ 33

టీ:- సర్వసాధారణం శ్రద్ధాలక్షణం గుణం విధత్తే-పాద్యమితి. 33

యథోచితమలంకుర్వీత అని చెప్పిన అర్థమును సర్వసాధారణమైన శ్రద్ధాలక్షణమైన గుణమును విధించుచున్నాడు. అర్చకుడు నాకు పాద్య, ఆచమనీయ, గంధ, పుష్ప, అక్షత, దూప, దీప, నైవేద్యములను శ్రద్ధతో సమర్పించవలెను. 33

శ్లో॥ గుడపాయస సర్పీంషి శుష్కుల్యాపూప మోదకాన్ ।
సంయావ దధి సూపాంశ్చ నైవేద్యం సతి కల్పయేత్ ॥ 34

టీ:- నైవేద్య వైభవలక్షణం గుణం విధత్తే-గుడేతి. శష్కుల్యః. తైల పక్వవిశేషా అపూపాః అపూపానాం మంటపాదీనాం సమూహాః. సూపాః వ్యంజనాని సతి విభవ ఇతి శేషః. 34

నైవేద్యమున వైభవలక్షణమైన గుణమును విధించుచున్నాడు. విభవమున్నచో బెల్లము, పాయసము, నెయ్యి, చకిలములు, పిండి వంటలు, లడ్డూలు, పెరుగు, పప్పులను నైవేద్యమీయవలెను. 34

శ్లో॥ అభ్యంగోన్మర్దనాదర్శ దంతధావాభిషేచనమ్ ।
అన్నాద్యగీతనృత్యాది పర్వణి స్యురుతాన్వహమ్ ॥ 35

టీ:- కాలభేదేన గుణాన్ విధత్తే అభ్యంగేతి. అభిషేచనం పంచామృతా దిస్నపనం. అన్నాద్యేతి. అన్నం భోజ్యం ఆద్యం భక్ష్యం. పర్వణ్యేకాదశ్యాదౌ అన్వహం ప్రత్యహం వా విభవే సతీతి. 35

కాలభేదముతో గుణమును విధించుచున్నాడు. అభ్యంగ తైలస్నానము, పంచామృత స్నానము, శరీరమును రుద్దుట, అద్దము చూపుట, పండ్లు తోముట, తలస్నానము, అన్నాదిభోగము, గానము, నృత్యము మొదలగునవి పండుగ సమయములందు లేదా నిత్యముగాని ఉండవలెను. 35

శ్లో॥ విధినా విహితే కుండేమేఖలావర్తవేదిభిః ।
అగ్ని మాధాయ పరిత్సమూహేత్పాణినోదితమ్ ॥ 36

టీ:- ఫలభూయస్త్వార్థినోఽగ్నావపి పూజాప్రకారమాహ-విధినేతి. విధినా స్వగృహ్యోక్తవిధానేన. మేఖలాదిభిభిరుపలక్షితే. విహితే నిర్మితే.

ఎక్కువ ఫలమును కోరెడివారు అగ్నియందు కూడా పూజించవచ్చునని ఆ ప్రకారము చెప్పుచున్నాడు. స్వగృహ్యోక్త ప్రకారముగా మేఖల, గర్తము వేదికలతో నిర్మింపబడిన హోమకుండమునందు అగ్ని నుంచి జ్వలించిన అగ్నిని చేతితో ఒక్కచోటికి చేర్చవలెను. 36

తదుక్తం. శ్లో. "విస్తారోచ్ఛ్రాయతస్త్రిస్రో మేఖలాశ్చతురంగళాః, హస్త మాత్రో భవేద్గర్తస్సయోనిర్వేదికా తథే" త్యాది. ఉదితం ప్రజ్వలితం. అగ్నిం పరితః సమూహేత్ ఏకత్ర మేళయేత్. 36

విస్తారోచ్ఛ్రాయతస్త్రిస్రో మేఖలాశ్చతురంగులాః ।
హస్తమాత్రో భవేద్గర్తో సయోనిర్వేదికాతథా ॥

విస్తారమయిన ఎత్తుతో కూడుకొని మూడు మేఖలలు నాలుగు అంగుళములతో కూడి గర్తము హస్త మాత్రముండి యోనిలో కూడిన వేదిక ఇత్యాది కుండనిర్మాణశాస్త్రమును అనుసరించి, 36

శ్లో॥ పరిస్తీర్యాథ పర్యుక్షేదన్వాధాయ యథా విధి ।
ప్రోక్షణ్యాసాద్య ద్రవ్యాణి ప్రోక్ష్యాగ్నావావహేత మామ్ ॥ 37

టీ:- పరిస్తీర్యేతి. దర్భైః పరిస్తీర్య పర్యుక్షేత్. పరితః ప్రోక్షయేత్. అన్వాధాయ అన్వాధాన సంజ్ఞికం వ్యాహృతిభిః. సమిత్ప్రక్షేపాదిరూపం కర్మకృత్వా. అగ్నేరుత్తరతో ద్రవ్యాణిహోమోపయోగీన్యాసాద్య విధాయ ప్రోక్షణ్యా ప్రోక్షణీపాత్రోదకేన ప్రోక్ష్య. అగ్నౌమాం ధ్యాయేత్. 37

దర్భలతో పరిస్తరణముచేసి శాస్త్రోక్తముగా వ్యాహృతులతో అన్వాధానమను పేరుగల సమిథలను వేయుకార్యమును సంకల్పించి ప్రోక్షణ పాత్రోదకములతో ఆజ్యపాత్ర మొదలయిన వానిని ఆసాధనచేసి (చల్లి) అగ్నియందు నన్ను భావించవలెను. 37

శ్లో॥ తప్తజాంబూనద ప్రఖ్యం శంఖచక్రగదాంబుజైః ।
లసచ్చతుర్భుజం శాంతం పద్మకింజల్కవాసనమ్ ॥ 38

టీ:- తప్తేతి. శంఖాదిభిర్లసంతః శోభమానాశ్చత్వారో భుజా యస్య తం. 38

మేలిమి బంగారమువలె ప్రకాశించుచు నాలుగు చేతులందును శంఖ, చక్ర, గదా, పద్మములను ధరించి శాంతుడై పీతాంబరమును దాల్చి కిరీట, కంకణములను, మొలత్రాడును, భుజకీర్తులు కలవాడను, శ్రీవత్సమను పుట్టుమచ్చతో కూడినవాడను, కౌస్తుభమణితో ప్రకాశించు వాడను, వనమాలదాల్చిన వాడనుగా నన్ను భావించవలె. (38-39)

శ్లో॥ స్ఫురత్కిరీట కటక కటిసూత్రవరాంగదమ్ ।
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభం వనమాలినమ్ ॥ 39

టీ:- స్ఫురదితి. స్ఫురంతి కిరీటాదీని యస్య తం. 39

శ్లో॥ ధ్యాయాన్నామర్చ్య దారూణి హవిషాభిఘృతాని చ ।
ప్రాస్యాజ్య భాగౌ ఆఘారౌ దత్వా చాజ్యప్లుతం హవిః ॥ 40

టీ:- ధ్యాయన్నితి. హవిషా ఘృతేన అభిఘృతాని సంస్తికాని. దారుణి శుష్కసమిధః. ప్రాస్య ప్రక్షిప్త ఆఘారౌ తత్సజ్ఞాకౌ యాగౌ. ఏవమాజ్యభాగౌ చ. దత్వా తదర్ధా ఆహుతీర్హుత్వేత్యర్థః. తత్రాఘారౌ ప్రజాపతయే స్వాహేంద్రాయ స్వాహేతి చోత్తర దక్షిణపరిధిమారభ్యా గ్నిమధ్యాదాపరిధ్యంతం. ఘృతక్షారణరూపౌ ఆజ్యభాగౌ అగ్నయే స్వాహా సోమాయ స్వాహేత్యేవం హోమరూపౌ. 40

పైన చెప్పినట్లు ధ్యానముచేయుచూ పూజించి నేతితో తడుప బడిన ఎండు కట్టెలను అగ్నియందుంచి, ఆఘారములు ఆజ్యభాగములు అనబడు ఆజ్యాహుతులను ఇచ్చి తదర్థాహుతులనిచ్చి అని అర్థము. 'ప్రజాపతయేస్వాహా' 'ఇంద్రాయస్వాహా'. ఉత్తర దక్షిణ పరిధుల మధ్యలో ఆరంభించి అగ్నిమధ్యనుండి పరిధుల చివర వరకు నేతిని వేయుటను ఆఘారములందురు. 'అగ్నియే స్వాహా, సోమాయ స్వాహా' అనెడి హోమరూపములు ఆజ్యభాగములు. 40

శ్లో॥ జుహుయాన్మూలమంత్రేణ షోడశర్చావదానతః ।
ధర్మాదిభ్యో యథా న్యాయం మంత్రైస్స్విష్టకృతం బుధః ॥ 41

టీ:- జుహుయాదితి. మూలమంత్రేణ అష్టాక్షరేణ తథా షోడశఋచో యస్మిన్ తేన పురుషసూక్తేన వా. అవదానతః ప్రత్యృచమాహుతి గ్రహణే

అష్టాక్షర మంత్రములతో పురుషసూక్తముతో, ప్రతిఋక్కునకు ఆహుతిని గ్రహించుచూ పురుష సూక్తముతో నారాధించుచు పురుష సూక్తముచేతనే ఆరాధించిన పక్షమున అదేమూలమంత్రము. దానితోనే ప్రతిఋక్కు అవధానముతో హోమము. స్వాహాకారముతోముగియు నామమంత్రములలో పూజాక్రమముననే అగ్నికి 'అగ్నయేస్విష్టకృతే

నేత్యర్థః. పురుషసూక్తేనారాధనపక్షే స ఏవ మూలమంత్రః. తేనైవ ప్రత్యృచమవదానతో హోమ ఇతి మంత్రైః. యథాన్యాయం పూజక్రమేణైవ. అగ్నయే స్విష్టకృతే స్వాహేత్యేవం స్విష్టకృతం చ హుత్వా. 41

స్వాహా'అనెడి రూపమయిన స్విష్టకృతమగు హోమము చేయవలెను. 41

శ్లో॥ అభ్యర్చ్యాథ నమస్కృత్య పార్షదేభ్యోబలిం హరేత్ ।
మూలమంత్రం జపేద్బ్రహ్మస్మరన్నారాయణాత్మకమ్ ॥ 42

టీ:- అభ్యర్చేతి. తతో వహ్నిస్థం భగవంతమభ్యర్చ్య. అథ నమస్కృత్య. పార్షదేభ్యో నందాదిభ్యః. అష్టసు దిక్షు బలింహరేత్. తతః పూజాస్థానమాగమ్య దేవస్యాగ్రే సముపవిశ్య యథాశక్తి మూలమంత్రంజపేత్. 42

ఆ తరువాత అగ్నియందు అంతర్యామియైయున్న భగవంతుని అర్చించి ప్రణామముచేసి నందాది పార్షదులను పూజించి నారాయణ రూపియగు పరమాత్ముని స్మరించుచూ మూలమంత్ర జపము చేయవలెను. 42

శ్లో॥ దత్వాచమనముచ్ఛేషం విష్వక్సేనాయ కల్పయేత్ ।
ముఖవాసం సురభిమత్తాంబూలాద్యమథార్హయేత్ ॥ 43

టీ:- దత్వేతి. తతః ఉభయత్ర భగవతో భోజనసమాప్తిం ధ్యాత్వా ఆచమనందత్వా ఉచ్ఛేషం విష్వక్సేనాయ కల్పయిత్వా తదనుజ్ఞయా పశ్చాత్ స్వయం భుంజీత. తతః. సురభిమత్ సుగంధవత్ తాంబూలాద్యం ముఖవాసందత్వా. అథ పునరపి. అర్చయేత్ పుష్పాంజలినా పూజయేత్. 43

విశ్వక్సేనునకు ఆచమనమిచ్చి భగవన్నివేదితమును ఇచ్చి తదనుమతితో తాను భుజించవలెను. తరువాత పరిమళించు కర్పూరాదులతో కూడిన తాంబూలము మొదలైన ముఖవాసనమును సమర్పించవలెను. తిరిగి పుష్పాంజలితో పూజించవలెను. 43

శ్లో॥ ఉపగాయన్ గుణన్నృత్యన్ కర్మాణ్యాభినయన్మమ ।
మత్కథాశ్శ్రావయన్ శృణ్వన్ ముహూర్తం క్షణికో భవేత్ ॥ 44

టీ:- ఉపగాయన్నితి. అభినయన్ స్వస్మినావిష్కుర్వన్ క్షణికః వైయగ్ర్యం పరిత్యజ్య లబ్ధావసరో భవేత్. 44

పాడుచూ, కీర్తించుచూ నృత్యము చేయుచూ నా చరితములను వినుచూ తన్మయత్వముతో ముహూర్తకాలమును క్షణమువలె గడుపవలెను. 44

శ్లో॥ స్తవైరుచ్చావచైస్తోత్రైః పౌరాణైః ప్రాకృతైరపి ।
స్తుత్వా ప్రసీద భగవన్నితి వందే తదండవత్ ॥ 45

టీ:- స్తవైరితి. స్తవ స్తోత్రాణాం భేదం దర్శయతి - పౌరాణైః ప్రాకృతైరపీతి. 45

స్తవస్తోత్రముల భేదమును చూపుచున్నాడు. వేదోక్త పురాణోక్తములగు నానావిధ స్తోత్రములతో స్తుతించి ఓ భగవంతుడా ప్రసన్నుడవుకమ్ము అని దండవత్ప్రణామము చేయవలెను. 45

శ్లో॥ శిరోమత్పాదయోః కృత్వా బాహుభ్యాం చ పరస్పరమ్ ।
ప్రపన్నం పాహి మామీశ భీతం మృత్యుగృహార్ణవాత్ ॥ 46

టీ:- కథం ప్రణమేదిత్యపేక్షయామాహ - శిర ఇతి. బాహుభ్యాం దక్షిణోత్తరాభ్యాం. పరస్పరం మమ దక్షిణోత్తరౌ పాదౌ గృహీత్వా. యద్వా. పృష్ఠతః పరస్పరనిబద్ధాభ్యాం. కృతాపరాధ ఇవ ప్రపన్నమిత్యాది విజ్ఞాప్య చ ప్రణమేత్. 46

ఎట్లు ప్రణామము చేయవలెననగా చెప్పుచున్నాడు. తలను నా పాదములవద్దవంచి కుడిచేతితో కుడిపాదమును ఎడమ చేతితో ఎడమపాదమును స్పృశించి ఓ భగవంతుడా నీకు ప్రపన్నుడను. మృత్యువు, పిశాచము మొదలగు వానివలన భయపడిన వాడనగు నన్ను కాపాడుము లేదా పృష్ఠభాగమున నిబంధించిన బాహువులు కలవాడై ప్రసన్నుడనైన నన్ను కాపాడుమని ప్రార్థించవలెను. 46

శ్లో॥ ఇతి శేషాం మయా దత్తాం శిరస్యాధాయ సాదరమ్ ।
ఉద్వాసయే ద్యదుద్వాస్యం జోతిర్జ్యోతిషి తత్పునః ॥ 47

టీ:- తతః శేషాగ్రహణపూర్వకం వైకల్పికోద్వాసనప్రకారమాహ- ఇతీతి. ఇత్యనయైవ. ప్రార్థనయా. శేషాం నిర్మాల్యం మయా దత్తాం. శిరస్యాధాయ ధృత్వా. యద్యుద్వాసయేత్. తర్హి. ప్రతిమాయాం యన్న్యస్తం జ్యోతి స్తత్పునరపి హృత్పద్మస్థజ్యోతిష్యేవోద్వాసనీయం. 47

ఈ ప్రకారముగాప్రార్థించి నిర్మాల్యమును నా చేత ఈయబడిన దిగా భావించి ఆదరముతో శిరస్సునదాల్చి ఉద్వాసన చేయదగినదగుచో ప్రతిమయందు ఉద్వాసము చేయబడిన జ్యోతిస్సును తిరిగి హృదయగతమగు జ్యోతిస్సునందు ఉద్వాసన చేయవలెను. 47

శ్లో॥ అర్చాదిషు యదాయత్ర శ్రద్ధామాం తత్ర చార్చయేత్ ।
సర్వభూతేష్వాత్మని చ సర్వాత్మ హ మవస్థితః ॥ 48

టీ:- ఏతేష్వధిష్ఠానేషు కిం ముఖ్యమిత్య పేక్షాయా మాహ - అర్చాదిష్వితి. యదా యత్ర శ్రద్ధా తదా తత్ర తత్వధిష్ఠానే ముఖ్యా ముఖ్యత్వం. కుతః. పునః. యతః సర్వభూతేష్వితి. 48

ఈ అధిష్ఠానములలో ఏది ముఖ్యమనగా చెప్పుచున్నాడు. అర్చాది ప్రతిమలెనిమిదింటిలో దేనియందధికమగు శ్రద్ధయున్న దాని యందు నన్ను పూజింపవచ్చును. సర్వశరీరములు నావే. నేను సకల ప్రాణులందును, నా యందును కూడా అంతర్యామియై యున్నాను. (48)

శ్లో॥ ఏవం క్రియా యోగపథైః పుమాన్ వైదిక తాంత్రికైః ।
అర్చన్నుభయత స్సిద్ధిం మత్తో విదంత్యభీప్సితామ్ ॥ 49

టీ:- ఏవ మితి. ఉభయతః ఇహాముత్ర చ. 49

ఈ ప్రకారముగా వైదికతాంత్రికములతో నన్నర్చించుటకు తగిన ఉపాయములనేకములచే మనుజుడు పూజించుచూ నా వలన అభీష్ట మగు ఇహపరముల రెండింటియందు సిద్ధిని పొందుచున్నారు. 49

శ్లో॥ మదర్చాం సంప్రతిష్ఠాప్య మందిరం కారయేద్దృఢం ।
పుష్పోద్యానాని రమ్యాణి పూజయాత్రోత్సవాశ్రితాన్ ॥ 50

సమర్థుడైన వానికి చెప్పుచున్నాడు మూడుశ్లోకాలతో. దృఢమగు దేవాలయములు నిర్మించవలెను. అందు నా అర్చామూర్తిని ప్రతిష్ఠించి

టీ:- సమర్థం ప్రత్యాహ-త్రిభిః. మదార్చామితి. పుష్పోద్యానాని చ కారయేత్. పూజా యాత్రోత్సవాశ్రితాన్. పూజా ప్రత్యహం. యాత్రా విశిష్టే పర్వణి. బహుజనసమాగమః. ఉత్సవః.వసంతాదికాలే మహోత్సవః. తదాశ్రితాన్ క్షేత్రాదీన్ దత్వా. 50

నిత్యార్చన, రథయాత్ర మొదలగు నిత్యోత్యవపక్షోత్సవాదులకు కావలసిన పూదోటలను ఏర్పరచి సుందరమైన వానినిగా చేయవలెను. 50

శ్లో॥ పూజాదీనాం ప్రవాహార్థం మహాపర్వసు చాన్వహం ।
క్షేత్రాపణ పురగ్రామాన్ దత్వా మత్సార్ష్టితామియాత్ ॥ 51

టీ:- పూజా యాత్రోత్సవాశ్రితా నిత్యస్య వివరణం. పూజాదీనామితి. ప్రవాహార్థం సంతతానువృత్త్యర్థం మత్సార్ష్టింతాం మత్సమానైశ్వర్యం. (51)

పూజయాత్ర మొదలగునవి ఎల్లప్పుడు అనువర్తించుట కొరకు గొప్ప పర్వదినములందు పొలములు, దుకాణములు, పురములు, గ్రామములనిచ్చి నాతో సమానమగు ఐశ్వర్యమును పొందవలెను. 51

శ్లో॥ ప్రతిష్ఠయా సార్వభౌమం సద్మనా భువనత్రయం ।
పూజాదినా బ్రహ్మలోకం త్రిభిర్మత్సామ్యతామియాత్ ॥ 52

టీ:- ప్రతిష్ఠాదీనాం వ్యస్తసమస్తానాం ఫలమాహ-ప్రతిష్ఠయేతి. మత్సామ్యతాం మయా సమతాం. 52

భగవన్మందిరమును ప్రతిష్ఠించుటచే సార్వభౌమపదమును, దేవాలయ నిర్మాణముచే త్రైలోక్య సుఖమును, పూజ మొదలగు వానిచే బ్రహ్మలోకమును, ప్రతిష్ఠదేవాలయ నిర్మాణము, పూజలచే నా సాధర్మ్య మును పొందును. 52

శ్లో॥ మామేవ నైరపేక్ష్యేణ భక్తి యోగేన విందతి ।
భక్తియోగం స లభతే ఏవం యః పూజయేత మామ్ ॥ 53

ఈ విధముగా ఎవడు ఫలాభిసంధిలేని భక్తియోగముతో నన్నారాధించునో వాడు నన్ను చేరును. అతడు భక్తియోగమునందును. 53

టీ:- సకామం ప్రత్యుక్తం. అహైతుకభక్తం ప్రత్యాహ-మామితి. అహైతుకభక్తియోగ ఏవ కథం భవతి? తత్రాహ-భక్తియోగమితి. 53

శ్లో॥ యస్స్వదత్తాం పరైర్దత్తాం హరేత సుర విప్రయోః ।
వృత్తిం ప్రజాయతే విడ్భుగ్వర్షాణా మయుతాయుతమ్ ॥ 54

టీ:- దాతుః ఫలముక్తం అపహర్తారం నిందతి-య ఇతి. విడ్భుక్ విష్ఠాభోజీ క్రిమిః. 54

ఎవడు దేవ బ్రాహ్మణులకు తాను గాని, ఇతరులు గాని దాన మొసగిన భూమి మొదలగువాని హరించునో అతడు కోట్లాది సంవత్సరముల వరకు మలభక్షకి యగు క్రిమిగా ఉంటాడు. 54

శ్లో॥ కర్తుశ్చ సారథే ర్హేతో రనుమోదితురేవ చ ।
కర్మాణాం భాగినః ప్రేత్య భూయో భూయసి తత్ఫలమ్ ॥ 55

టీ:- కర్తుర్యత్ఫలం తదేవాన్యేషామప్యాహ-కర్తురితి. సారథే స్సహకారిణః. హేతోః. ప్రయోజకస్య. అనుమోదితుశ్చ. ప్రేత్య తత్ఫలమిత్యన్వయః. కుతః. యతః. కర్మణా మేతే భాగినః భాగార్హాః. తత్రాపి విశేషమాహ-భూయసి కర్మణి సారథ్యాదౌ చాధికం ఫలమితి. శ్లో. పయః పత్రాది మాత్రేణ పూజితో యః పరం పదమ్, ప్రాగేవ దిశతి ప్రీత స్సకృష్ణ శ్శరణం మమ. 55

కర్తకు ఏ ఫలమో ఇతరులకును అదే ఫలము అనుచున్నాడు. కర్తకేఫలము లభించునో ఆ కర్తయగు వానితో కలిసి పనిచేయువారు, సహకర్త ప్రయోజకుడు. సమ్మతినిచ్చువాడు వీరందరు కర్మల ఉత్కర్షను బట్టి ఉత్కృష్టఫలములను పొందుదురు. 55

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**సప్తవింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**సప్తవింశోధ్యాయము సమాప్తము.**

## అష్టావింశోఽధ్యాయః

శ్లో॥ అష్టావింశే తు యః పూర్వం విస్తరేణోపవర్ణితః ।
జ్ఞానయోగః పునశ్చాసౌసమాహృత్య నిరూప్యతే ॥

## 28వ అధ్యాయము

ఈ ఇరువదిఎనిమిదవ అధ్యాయమున పూర్వము ఏ జ్ఞాన యోగము విస్తారముగా వర్ణింపబడినదో అదియే సంగ్రహముగా నిరూపింపబడుచున్నది.

శ్రీభగవానువాచ

శ్లో॥ పరస్వభావకర్మాణి న ప్రశంసేన్నగర్హయేత్ ।
విశ్వమేకాత్మకం పశ్యన్ప్రకృత్యా పురుషేణచ ॥ 1

టీ:- ఇదానీమతివిస్తరేణోక్తం జ్ఞానయోగం సంక్షేపేణ వక్తుమాహ- పరేతి. పరేషాం స్వభావాన్ శాంతఘోరాదీన్ కర్మాణి చ. తత్ర హేతుర్విశ్వమితి. 1

శ్రీభగవానుడు అనుచున్నాడు.

ప్రపంచమును గుణసామ్యరూపమగు ప్రకృతి తోడను ప్రకృతిని రక్షించు పురుషునితోడను సర్వావయవియగు పరమాత్మయే మూల స్వరూపముగా కలది అనిచూచుచున్నవాడై, ఇతర స్వభావములను, పనులను మెచ్చుకొనరాదు, నిందింపరాదు. 1

శ్లో॥ పరస్వభావకర్మాణి యః ప్రశంసతి నిందతి ।
స ఆశు భ్రంశతే స్వార్థాదసత్యభినివేశతః ॥ 2

టీ:- విపక్షేదోషమాహ. పరేతి.స్వార్థాత్. జ్ఞాననిష్ఠాలక్షణాత్. అసతి మిథ్యాభూతే ద్వైతే అభినివేశాత్. 2

అట్లు ప్రసంసించుటో, నిందించుటో చేయుట దోషమని చెప్పుచున్నాడు. ఎవడు ఇతరుల స్వభావమును, కృత్యములను మెచ్చుకొనునో, నిందించునో అతడు మిథ్యాభూతమగు ద్వైతమందు పట్టుదల కలిగి ఉండుట వలన జ్ఞాననిష్ఠారూపమగు స్వార్థమునుండి శీఘ్రమే భ్రంశమునొందును. 2

శ్లో॥ తైజసే నిద్రయాపన్నే పిండస్థో నష్టచేతనః ।
మాయాం ప్రాప్నోతి మృత్యుం వా తద్వన్నానార్థదృక్పుమాన్॥3

టీ:- భ్రంశమేవ దృష్టాంతతో దర్శయతి - తైజస ఇతి. తైజసే రాజసాహంకారకార్యే ఇంద్రియగణే నిద్రయా ఆపన్నే అభిభూతే సతి. పిండస్థోజీవః కేవలం మనోమాత్రేణ మాయాం స్వప్నరూపాం ప్రాప్నోతి. తతో మనసి లీనే సతి నష్టచేతనస్సన్మృత్యుతుల్యాం సుషుప్తిం వా ప్రాప్నోతి. యథా. తద్వదేన నానార్థదృక్ ద్వైతాభినివేశి విక్షేపం లయం చ ప్రాప్నోతి. యథా ప్రాజ్ఞసంపర్కాద్విశ్వస్య భోగ క్షయ లక్షణో భ్రంశః ఏవమనాత్మసంపర్కాదాత్మనోఽపి స్వరూపభ్రంశ ఇతిభావః. 3

ఆ భ్రంశమునే దృష్టాంతముతో చూపుచున్నాడు. రాజహంకారము వలన కలుగు ఇంద్రియసముదాయము నిద్రచే అభిభూతముకాగా జీవుడు మనోమాత్రము చేతనే స్వప్నరూపమగు మాయను పొందును. తరువాత మనస్సు లీనముకాగ చైతన్యము తొలగినవాడై మృత్యువును లేదా మృత్యుతుల్యమైన సుషుప్తినిగాని పొందును. ఆ ప్రకారముగనే ద్వైవాభినివేశముగల పురుషుడు విక్షేపమును, లయమును పొందుచున్నాడు. ప్రజ్ఞసంపర్కము వలన విశ్వమునకెట్లు భోగక్షయలక్షణభ్రంశమో అట్లే అనాత్మ సంపర్కము వలన ఆత్మకు కూడా స్వరూప భ్రంశయని అర్థము. 3

శ్లో॥ కిం భద్రం కిమభద్రం వా ద్వైతస్యావస్తునః కియత్ ।
వాచోదితం తదనృతం మనసా ధ్యాతమేవ చ ॥ 4

టీ:- ద్వైతాసత్యతయా స్తుతినిందయోర్నిర్విషయత్వం ప్రపంచయతి - సార్ధైష్షడ్భిః. కిమితి. అవస్తునో ద్వైతస్యమధ్యే కిం భద్రం. కింవా అభద్రం. కియద్భద్రం. కి యద్వా అభద్రమిత్యర్థః. అవస్తుత్వ మేవాహ- వాచేతి. బాహ్యేంద్రియోపలక్షణం. వాచా ఉదితం ఉక్తం. చక్షురాదిభిశ్చ యద్దృష్టం తదనృతమితి. 4

ద్వైతము అసత్యమగుటచే స్తుతి నిందలు నిర్విషయములని ఆరున్నర శ్లోకములచే చెప్పుచున్నాడు. అ వాస్తవమైన ద్వైతములో ఏది శుభము, ఏది అశుభము ఎంత శుభము, ఎంత అశుభమని వాక్కుచే ఏది పలుకబడినదో ఇది చక్షురాదులకు ఉపలక్షణము. చక్షురాదులచే ఏదిదృశ్యమో మనస్సుచే ఏది ధ్యానించబడినదో అది అంతయూ అసత్యము. 4

శ్లో॥ ఛాయా ప్రత్యాహ్వయాభాసా హ్యసంతో౽ ప్యర్థకారిణః ।
ఏవం దేహాదయో భావా యచ్ఛంత్యామృత్యుతో భయమ్ ॥ 5

టీ:- నన్వేవం సతి దేహాది భావానామసత్త్వా త్కథం భయహేతుత్వ మిత్యాశంక్య హేతుత్వం దృష్టాంతేనాహ-ఛాయేతి. ఛాయా ప్రతిబింబం. ప్రత్యాహ్వయః పతిధ్వనిః. ఆభాసః శుక్తి రజతాదిః. ఏతే యథా అసంతో ౽ ప్యర్థకారిణో భవంతి. అమృత్యుతః మృత్యుమభివ్యాప్య. యద్వా. మృత్యుర్లయః జ్ఞానేన యావన్నైవ లీయతే తావత్పర్యంతమిత్యర్థః. 5

అట్లగుచో దేహాదిభావములను లేవుకదా అని, అట్టిచో అవి భయహేతువులెట్లు అనగా దానిని సదృష్టాంతముగా చెప్పుచున్నాడు. ప్రతిబింబము; ప్రతిధ్వని; శుక్తి, రజతాది భ్రాంతి అనునవి అవాస్తవము లయ్యును వాస్తవములవలె, కార్యకారులగుచున్నవి. ఇట్లే దేహము మొదలగు భావములును మరణ పర్యంతము భయకారణములగు చున్నవి. లేదా జ్ఞానము వలన ఎంత వరకు లయము పొందవో అంతవరకు అని అర్థము. 5

శ్లో॥ ఆత్మైవ తదిదం విశ్వం సృజ్యతే సృజతి ప్రభుః ।
త్రాయతే త్రాతి విశ్వాత్మా హ్రియతే హరతీశ్వరః ॥ 6

టీ:- నను సృష్ట్యాది శ్రుతిభిరేవద్వైతం నిరూపితం. కథమసత్యం స్యాత్తత్రాహ-ద్వాభ్యాం. ఆత్మేతి త్రాయతే పాల్యతే త్రాతి పాలయతి. 6

ఓయీ! సృష్ట్యాది ద్వైతమును శృతులే నిరూపించినవి కదా మరి అదెట్లు అసత్యమగుననగా రెండున్నర శ్లోకములలో చెప్పుచున్నాడు. ఈ ప్రపంచమంతయు పరమాత్మ రూపమే సర్వశక్తి సమన్వితుడగు, ఐశ్వర్యశాలి, విశ్వరూపుడగు ఆత్మ, తనను తాను సృజించుకొనును. విశ్వమును సృజించును. తనను తాను రక్షించు కొనును. విశ్వమును రక్షించును. తననుతానుపసంహరించు కొనును విశ్వమునుపహరించును. 6

శ్లో॥ తస్మాన్నహ్యాత్మనో౽ న్యస్మా దన్యభావో నిరూపితః ।
నిరూపితేయం త్రివిధా నిర్మూలాభాతి రాత్మని ।
ఇదం గుణమయం విద్ధిత్రివిధం మాయయా కృతమ్ 7

కావున ఆత్మకంటే వేరైన భావమేదియు లేదు, నిరూపింపబడ లేదు. ఈ ప్రకారము ఆధ్యాత్మికాది త్రివిధమగు భావమును నిరాధారమని నిరూపిత మైనది. దృష్ట, దృక్, దృశ్యరూపమగునది అంతయు మాయచే చేయబడి నదిగా తెలుసుకొనుము. 7

టీ:- తస్మాదితి. అన్యస్మాత్స్రగ్జ్యాదివ్యతిరిక్తాత్. త్రివిధా అధ్యాత్మాది రూపా. భాతిః. ప్రతీతిః. నను కథం నిర్మూలం ప్రతీయతే? తత్రాహ - ఇదమితి. 7

శ్లో॥ ఏతద్విద్వాన్మదుదితం జ్ఞానవిజ్ఞాన నైపుణ్యం ।
న విదంతి న చ స్తౌతి లోకేచరతి సూర్యవత్ ॥ 8

టీ:- ఏతదితి. జ్ఞానవిజ్ఞానయోర్నైపుణం నిష్ఠాం. సూర్యవత్సమో భూత్వా. 8

నేనిప్పుడు తెలిపిన జ్ఞానవిజ్ఞానముల కౌశలమును అవగతము చేసుకొనిన విద్వాంసుడు, ఎవ్వరిని నిందింపడు; ఎవ్వరిని స్తుతించడు. సూర్యునివలె సర్వభూతసముడై లోకమందు సంచరించును. 8

శ్లో॥ ప్రత్యక్షేణానుమానేన నిగమేనాత్మ సంవిదా ।
ఆద్యంతవదసజ్జ్ఞాత్వా నిస్సంగో విచరేదిహ ॥ 9

టీ:- ఏతన్నిష్ఠాప్రాప్త్యుపాయమాహ-ప్రత్యక్షేణేతి. యదాద్యంతవత్ ద్వైతం. తదసదితి జ్ఞాత్వా. నిస్సంగో విచరేత్. ఆద్యంతవత్త్వే ప్రణమాని. ప్రత్యక్షేణ ఘటాది. అనుమానేన సావయవత్వేన దృశ్యం పృథివ్యాది. నిగమేనాప్రత్యక్షమాకాశాది. ఆత్మసంవిదాస్వానుభవేన సర్వం దృశ్యం ఆద్యంతవత్ అసచ్చేతిజ్ఞాత్వేతి. 9

ఈ జ్ఞానవిజ్ఞాన నిష్ఠకలుగుటకపాయము చెప్పుచున్నాడు. ఆద్యంతములు కలది అయిన ద్వైతమేదికలదో అది మిథ్యయని తెలుసుకొని సంగము విడిచి సంచరించవలెను. ఆద్యంతములు కలిగియుండుటకు ప్రమాణములు ప్రత్యక్ష ప్రమాణముచే ఘటాదులు; అనుమానముచే సావయవమగుటచే దృశ్యమగు పృథివ్యాదికము (పృథివ్యాది దృశ్యము, ఆద్యంతము కలది, సావయవము అయినందున, ఘటాదులవలె యన్నైవంతన్నైవంయథాత్మ అని అనుమానము) వేదవాక్యముచే, శబ్దముచే అప్రత్యక్షమగు ఆకాశాదికమును స్వానుభవ ముచే దృశ్యమగు సర్వము ఆద్యంతములు కలది మిథ్య అని తెలుసుకొని దానియందు ఆసక్తిలేనివాడై చరించవలెను. 9

ఉద్ధవ ఉవాచ

శ్లో॥ నైవాత్మనో న దేహస్య సంసృతిర్ద్రష్టృదృశ్యయోః ।
అనాత్మస్వదృశోరీశ కస్యేయ ముపలభ్యతే ॥ 10

టీ:- నను యద్యాత్మసంవిదా సర్వం దృశ్యమాద్యంతవదసదిత్యుచ్యతే. తర్హ్యాత్మా స్వప్రకాశః దేహాదిద్వైతం జడ మిత్యుక్తం స్యాత్. తథాచ సంసారప్రతిభాసో న ఘటేతేతి చోదయతి.-నేతి. అనాత్మసదృశోః జడాజడయోః. అత్ర హేతుః. ద్రష్టృదృశ్యయోః. తతో మాభూద్వయోరపి తత్రాహ-ఉపలభ్యత ఇతి. 10

శ్లో॥ ఆత్మావ్యయో గుణశ్శుద్ధ స్స్వయంజ్యోతిరనావృతః ।
అగ్నివద్దారువదచిద్దేహః కస్యేతసంసృతిః ॥ 11

టీ:- ఏతత్ప్రపంచయతి-ఆత్మేతి. అవ్యయత్వాది పంచవిశేషణైర్నా శాదిరాగాది పుణ్యాపుణ్యా జ్ఞానపరిచ్ఛేదానామసంభవం దర్శయతి- హేతు హేతుమత్త్వం తు యథేష్టం. అచిత్ జడః. అయం భావః. యథైవాగ్ని దారుణో ర్భేదానుఫలంభేఽపి. దారుప్రకాశ్యమేవ అగ్నిశ్చ ప్రకాశకః. తథా దేహాత్మనోరపీతి. న సంసృతి తయోరన్యతర స్యాపి ఘటత ఇత్యర్థః. 11

ఉద్ధవుడు ఈ విధముగా చెప్పచున్నాడు.

ఓయీ! ఆత్మజ్ఞానముచే దృశ్యమంతయూ అసత్తని చెప్పబడినచో ఆత్మ స్వప్రకాశమని; దేహాదికము ద్వైతము, జడమని చెప్పినట్లగును. అట్లగుచో సంసారప్రతిభాసము కుదరదు అని ప్రేరణ చేయుచున్నాడు. ఓ ఈశ్వరుడా! చూచువాడు, చూడబడినది యగునట్టి జడాజడములకు ద్రష్టయగు ఆత్మకు, దృశ్యమగు దేహమునకు సంసారములేనిచో మరి సంసారమెవరికి కలుగును. అది అసలే లేదని యందుమా?ఆ జన్మ మరణాది రూపమగు సంసారమనుభవములో ఉన్నది కదా. అనుభవ సిద్ధమును ఎట్లు కప్పిపుచ్చుదురు? 10

దీనినే వివరించుచున్నాడు. ఆత్మనాశములేనిది, నిర్గుణము, రాగాదులులేనిది, పుణ్యాపాపరహితము, అజ్ఞానరహితము, పరిచ్ఛేద రహితము. అగ్నివలె, కొయ్యవలె శరీరము జడము. దీని భావమిది, అగ్ని దారువులు భిన్నముగా లభించకున్నను దారువు ప్రకాశింప చేయబడునది అగ్నిప్రకాశింపచేయునిది ఎట్లో అట్లే దేహాత్ములునూ. కావున ఇక్కడ సంసారమెవ్వరికి దేహాత్ములు రెండింటికినీ సంసారము పొసగదని ఉద్ధవుడు తలంచుచున్నాడు. 11

**శ్రీ కృష్ణ ఉవాచ**

శ్లో॥ యావద్దేహేంద్రియప్రాణైరాత్మనః సన్నికర్షణమ్ ।
సంసారః ఫలవాం స్తావదపార్థోఽస్య వివేకినః ॥ 12

టీ:- సత్యం తథాప్యుభయోరేవమవివేకేవ సంసారావలంబనమిత్యాహ -పంచభిః. యావదితి. సన్నికర్షణం సంబంధః. నన్వసంగస్య కుతః సంబంధ స్తత్రాహ-అవివేకతః అజ్ఞానకృత ఇత్యర్థః. నను స్వప్రకాశస్య కథమజ్ఞానతః సంసార స్తత్రాహ-అపార్థోఽపి మిథ్యాభూతోఽపి. కేవలం ఫలవాన్ ఫలం స్ఫూర్తిః. న తు తత్త్వతోఽస్తీత్యర్థః. 12

శ్లో॥ అర్థేహ్యవిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ।
ధ్యాయతో విషయానస్య స్వప్నేఽనర్థాగమో యథా ॥ 13

టీ:- నన్వసతో దేహాదేః కుతస్సంసారస్ఫూర్తి హేతుత్వమపి? తత్రాహ - అర్థ ఇతి. అస్యాత్మనః. 13

శ్లో॥ యథాహ్య ప్రతిబుద్ధస్య ప్రస్వాపో బహ్వనర్థభృత్ ।
స ఏవ ప్రతిబుద్ధస్య న వై మోహాయ కల్పతే ॥ 14

**శ్రీభగవంతుడు ఈ విధముగా చెప్పచున్నాడు.**

నీవు చెప్పినది సత్యమే. ఐననూ ఆ యుభయుల వివేకము లేకుండుటే సంసారహేతువని ఐదుశ్లోకములతో చెప్పుచున్నాడు. ఎంత వరకు దేహము, ఇంద్రియములు, ప్రాణములతో ఆత్మకు సంబంధం ఉండునో అంత వరకు ఆత్మ నిస్సంగముకదా దానికి సంబంధము కలుగుటెట్లనగా చెప్పుచున్నాడు అజ్ఞానకృతమైనది అని. ఓయీ! ఆత్మస్వప్రకాశముకదా అతనికెట్లు అజ్ఞానకృతమగు సంసారము కలుగును అనగా చెప్పుచున్నాడు. సంసారము మిథ్య అయ్యు ఆ ఫలప్రదమును ఇచ్చుట ఫలమనగా స్ఫూర్తియే గాని ఫలమన్నది వాస్తవమున లేదు అని అర్థము. 12

అయ్యా! దేహాదులు మిథ్యాభూతములు కదా? అవి సంసార స్ఫూర్తికి హేతువులెట్లు అనగా చెప్పుచున్నాడు. దేహాదికములగు అర్థము లేకున్నను విషయములను తలంచుచున్న ఈ యాత్మకు కల (స్వప్నము) యందు అనర్థము కలుగుటవలె సంసారము నివృత్తి కాదు. 13

ఓయీ దేహారంభకమగు కర్మనుబట్టి జ్ఞానముగల జీవన్ముక్తునకు కూడా విషయస్ఫూర్తి భోజనాదికాలమున అన్నాది జ్ఞానము వారింపరాని

టీ:- నను కథం చిద్ధ్యాయతో విషయస్ఫూర్తిర్జీవన్ముక్తస్యాపి దుర్వారేత్య నిర్మోక్ష ప్రసంగస్స్యాత్తత్రాహ-యథేతి. ప్రస్వాపః. స్వప్నః బహుననర్థాన్ బిభర్తి పుష్ణాతీతి తథా. 14

శ్లో॥ శోకహర్షభయక్రోధలోభమోహమదాదయః ।
అహంకారస్యదృశ్యంతే జన్మమృత్యుశ్చ నాత్మనః ॥ 15

టీ:- అహంకారలక్షణో దేహాదిసన్నికర్ష ఏవ సంసారాలంబన మిత్య న్వయ వ్యతిరేకాభ్యాం దర్శయతి -శోకేతి. సుషుప్త్యాదౌ తేషామదర్శనాత్. అహం సుఖీ దుఃఖీతివత్ చైతన్యం సుఖీ దుఃఖీతి ప్రతీత్యభావాత్ దృశ్యత్వాచ్చ సుఖాదీనాం కృశత్వాదివద్ద్రష్టృధర్మాత్వానుపపత్తేరితి భావః ఉక్తం చ. శ్లో. సుప్తేహమివ దృశ్యంతే దుఃఖదోష ప్రవృత్తయః. ఆత్మస్థ స్యైవ సంసారో న మే సంసృతి సాక్షిణః. 15

దగుటచే మోక్షము కలుగక పోవచ్చునుగదా యని చెప్పుచున్నాడు. ఏ విధముగా నిద్ర మేలుకొనని వానికి అనేక అనర్థములను కలిగించునో అట్లు ఆ నిద్రయే మేలుకొన్నవానికి అజ్ఞానము కలుగింపదు. 14

అహంకార రూపమగు దేహాదిసన్నికర్షయే సంసారాలంబన మని అన్వయవ్యతిరేకములచే (అహంకారమున్నచో సంసారము కలుగుట, అహంకారము తొలగిన సంసారము తొలగుట యనునవి అన్వయవ్యతిరేకములు) చూపుచున్నాడు. శోకము, హర్షము, భయము, కోపము, లోభము, మోహము, కోరిక, జననమరణము అనునవి అహంకారమున్ననే కనబడుచున్నవి. ఆత్మకు సంబంధించినవి కాదు. సుషుప్తియందీ శోకాదులు కనబడనందున 'నేను సుఖిని' అన్నట్లు చైతన్యముగాని, సుఖిని అనుప్రతీతిగాని లేకుండుటచేత సుఖాదులు దర్శనీయములగుటచేత కృశత్వాదులవలె ద్రష్టృధర్మములగుట కుదరదు. ఇదే చెప్పబడినది. సుప్తేఽహమి నదృశ్యన్తే సుఖదోషప్రవృత్తయః అతస్తస్యైవ సంసారోన మేసంస్మృతి లక్షణః అహంకారము నిదురించగా సుఖ దోషప్రవృత్తులు కనపడవు. కావున నా అహంకారమునకే సంసారముగాని, సంసారమునకు సాక్షినగు నాకు కాదు. 15

శ్లో॥ దేహేంద్రియప్రాణమనోఽభిమానో
జీవోఽంతరాత్మాగుణకర్మమూర్తిః ।
సూత్రం మహాని త్యురుధైవ గీతః
సంసార ఆధావతి కాలతంత్రః ॥ 16

టీ:- నను యద్యహంకారస్య సంసారః తర్హి ముక్తరపి. తస్యైవేతి ముక్తావహంకారవిశేషః ప్రసజ్యేత? తత్రాహ - దేహేతి. దేహాదిష్వభిమానో యస్య సః. ఆత్మైవ తేషామంతస్థ్సితో జీవః. అత ఏవ గుణకర్మమయీ మూర్తిరస్య సః. ఏవం చ స ఏవ సూక్ష్మోపాధిభిర్బహుధైవ సూత్రాది శబ్దైర్గీతః సంసారే కాలతంత్రః పరమేశ్వరాధీనస్సర్వతః ఆధావతి. అతో నాయం దోష ఇతి భావః. 16

శ్లో॥ అమూల మేతద్బహురూప రూపితం
మనోవచః ప్రాణ శరీరకర్మ ।
జ్ఞానాసినో పాసనయా శితేన ఛిత్వా
మునిర్గాంవిచరత్య తృష్ణః ॥ 17

టీ:- తదేవమహంకారకృతం బంధముపపాద్యేదానీం జ్ఞానేన తన్నివృతౌ ముక్తిరిత్యాహ-అమూలమితి. వస్తుతో మూలశూన్యం.

ఓయీ సంసారము అహంకారమునకే ఐనచో ముక్తియూ దానికే కావలయును. అట్లగుచో ముక్తియందంహకారము మిగిలి యుండుట సంభవించునుకదా? యన్నచో చెప్పుచున్నాడు. దేహాభిమాని, దేహము, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సులయందభిమానము కలవాడై తదంతర్గతుడై యున్నాడు. అతడు గుణకర్మమయమగు రూపము గలవాడు, సూత్రభూతుడు, సూక్ష్మరూపుడని బహుప్రకారములుగా గానము చేయబడినవాడు. కాలవశుడై సంసారమందు అంతట తిరుగుతున్నవాడు. (ఏవంచ) సూక్ష్మోపాధులతో అనేకములుగా సూత్రాది శబ్దములతో చెప్పబడినది. సంసారమునందు పరమేశ్వరాధీనుడై అంతటాతిరుగుతున్నాడు. అందులకై ఇది దోషము కాదని భావము. 16

ఈ విధముగా అహంకారకృతమైన బంధమును ప్రతిపాదించి ఇప్పుడు జ్ఞానముతో దాని నివృత్తిఅయిన ముక్తికలుగునని ప్రతిపాదించుచున్నాడు. మూలశూన్యమే అజ్ఞానముచే అనేక రూపములతో దేహాది శరీరములతో కానవచ్చునది. మనస్సు, వాక్, ప్రాణము, శరీరమును, దాని కార్యమగు అహంకారమును, గురుసేవయను తీక్ష్ణమగు జ్ఞానమనే ఖడ్గముచే నరికి, మునియై, ఏ కోరికలు లేక భూమిపై విహరించును. 17

అజ్ఞానతస్తు బహుభీరూపైః రూపితం ప్రకాశితం. ఐంద్రజాలికతుల్యమితి వా. కిం తత్తదాహ-మనఇతి. మన ఆదీనాం ద్వంద్వః. యద్వా. మన ఆదిషు క్రియత ఇతి కర్మ అహంకరణం గురూపాసనయా నిశితేన జ్ఞానఖడ్గేన ఛిత్వా. 17

శ్లో॥ జ్ఞానం వివేకో నిగమ సప్తశ్చ
ప్రత్యక్ష మైతిహ్య మథానుమానమ్ ।
ఆద్యంతయోరస్యయదేవ కేవలం
కాలశ్చ హేతుశ్చ తదేవ మధ్యే ॥ 18

టీ:- తదేవం జ్ఞానం స్వరూప సాధనఫలైర్నిరూపయతి-జ్ఞానమితి. వివేకః జ్ఞానం సాధనాన్యాహ-నిగమో వేదః. తపః స్వధర్మః. ప్రత్యక్షం స్వానుభవః. ఐతిహ్యముపదేశః. అనుమానం తర్కః. ఫలమాహ-ఆద్యంతయోర్యదస్య జగతః. మధ్యేఽపి తదేవ కేవలం. న తు జగదితి. కిం తత్. కాలః కాలయతి ప్రకాశయతి. యస్స తథా. హేతుః కారణం చ యత్తదేవ. ఏతదుక్తం భవతి. యదస్య విశ్వస్య కారణం ప్రకాశకం చ బ్రహ్మ. తదాత్మక మేవైతత్. న తతః పృథగితేవ్యం నిశ్చలఫలో నిగ మాదిసాధనైర్జాయతే యో వివేకః. తత్ జ్ఞానమితి. 18

అజ్ఞానమును స్వరూప సాధన ఫలములచే నిరూపించుచున్నాడు. వివేకము, జ్ఞానము, వేదము, స్వధర్మము, స్వానుభవము, ఉపదేశము, తర్కము మొదలగు వాటి యొక్క ఫలమును చెప్పుచున్నాడు. ఈ ప్రపంచముయొక్క ఆరంభము చివరల యందు ఏదికలదో అది జగత్తును ప్రకాశింపచేయునది, జగత్తునకు కారణభూతమయినది అగును. ఆ బ్రహ్మయే నడుమకూడా ఉన్నది. (అంతేకాని నడుమ కనబడునట్టి జగత్తుకాదు). 18

శ్లో॥ యథా హిరణ్యం సుకృతం
పురస్తా త్పశ్చాచ్చ సర్వస్య హిరణ్మయస్య ।
తదేవ మధ్యే వ్యవహార్యమాణం
నానాపదేశై రహమస్య తద్వత్ ॥ 19

టీ:- తత్ర నానాభేదవ్యవహారాలంబనస్యాపి విశ్వస్య కారణమాత్రాత్మకత్వం సదృష్టాంతమాహ-యథేతి-సుకృతం సుష్ఠు కుండలాది రూపేణ రచితం. యద్ధిరణ్యం కీదృశ్యం. హిరణ్మయస్య కుండలాదేరుత్పత్తేః పురస్తా న్నాశాచ్చ పశ్చాత్ యదస్తి హిరణ్యమాత్రం. తన్మధ్యేఽపి కటకం కుండలమిత్యాది నానావ్యపదేశైః వ్యవహారం ప్రాప్యమాణమపి తదేవ యథా. తద్వదస్య విశ్వస్య కారణభూతోఽహమేవ నానావ్యవహారాలంబనం. న తు మత్తః పృథగ్విశ్వమితి. 19

ప్రకాశాత్మకత్వ కారణమాత్రాత్మముల నడుమ నానాభేద వ్యవహారలంబమైననూ, విశ్వమునకు కారణమాత్రాత్మకత్వమును సదృష్టాంతముగా చెప్పుచున్నారు. ఏ ప్రకారముగ సువర్ణము కుండలాధికముగా చేయబడుటకు పూర్వమును; ఆ యాభరణముల ఉత్తరకాలమున, నాశనము పొందినపుడు కూడా సువర్ణమే యగును అట్లే నడుమ ఆభరణరూపముగా ఉండి కుండలములు, కంకణములు మొదలగు వివిధి నామములతో పిలువబడినప్పుడు సువర్ణమే అగును. అట్లే విశ్వమునకు కారణభూతుడనగు నేనే నానా నామములతో పిలువబడుచున్నాను కాని నా కంటే వేరులేదు. 19

శ్లో॥ విజ్ఞానమేతత్త్రియవస్థమంగ గుణత్రయం కారణకార్యకర్తృ ।
సమన్వయేన వ్యతిరేకతశ్చయేనైవతుర్యేణ తదేవ సత్యమ్ ॥20

టీ:- తదేవం కార్యస్య కారణమాత్రాత్మకతాముక్త్వా ప్రకాశస్య ప్రకాశత్మకతామాహ-విజ్ఞాన మితి. త్రియవస్థం. యకారస్య పృథక్ పాఠః. ఛందోనురోధేన. జాగ్రదాదిత్ర్యవస్థం యదిజ్ఞానం మనః. తదువస్థాకారణభూతం చ యద్గుణత్రయం. యచ్చ కారణకార్యకర్తృ

ఈ ప్రకారముగా కార్యమగు ప్రపంచము, కారణమగు బ్రహ్మ స్వరూపమేయని వివరించి ప్రకాశ్యమగు ఈ ప్రపంచము ప్రకాశమగుటను తెలుపుచున్నాడు. ఓ ఉద్ధవా! జాగ్రత్త స్వప్నసుషుప్త్యవస్థలు కలిగిన విజ్ఞానమేది కలదో, మనస్సునకుగాని, దాని అవస్థలకు గాని కారణ రూపమగు (త్రిగుణములు) సత్వ, రజస్తమస్సులు ఏవి కలవో, ఆధ్యాత్మ, అధిభూత, అధిదైవము అను గుణత్రయ కార్యభూతమగు

కారణమధ్యాత్మం కార్యమధిభూతం. కర్తృ అధిదైవం ఏవం గుణత్రయ కార్యభూతం త్రివిధం జగదేతత్. యేన తుర్యేణ సామాన్యజ్ఞానమాత్రేణ. సమన్వయేన భాతి యేనానుగతం ప్రకాశత ఇత్యర్థః. శ్రు. "తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి". తథా-శ్రు. "చక్షుష శ్చక్షురత శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యే విదురి" త్యాది శ్రుతేః. నను విశేషజ్ఞానవ్యతిరేకేణనతురీయంనామోపల భామ హే? తత్రాహ-వ్యతిరేకతశ్చ సమాధ్యాదౌ యదస్తి తదేవ సత్యమితి. 20

త్రివిధ జగత్తు, నాల్గవదగు ఏ సామాన్య జ్ఞానమాత్రముతో అనుగతమై ప్రకాశించునో అదియే సత్యము. 'తమేవభాంత మనుభాతి సర్వం' 'తస్యభాసా సర్వమిదం విభాతి చక్షుషశ్చక్షురత శ్రోత్రస్య శ్రోత్రం మనసో యేమనో విదుఇత్యాది' శ్రుతులు ప్రణామము. అయ్యా! విశేషవిజ్ఞాన వ్యతిరేకముగా నాల్గవ నామమేదియు మాకు లభ్యమగుట లేదే అనగా చెప్పుచున్నాడు. భగవత్సంబంధము లేకయే సమాధ్యాదుల యందు ఏ జ్ఞానముకలదో అదియే సత్యము అని. 20

శ్లో॥ నయత్పురస్తాదుతయన్న పశ్చాన్మ
ధ్యేఽపితన్న వ్యపదేశ మాత్రం ।
భూతం ప్రసిద్ధం చ పరేణ యద్యత్త
దేవ తత్స్యాదితి మే మనీషా ॥ 21

టీ:- ఏవం కాలత్రయేఽప్యవ్యభిచారిణః సత్యత్వముక్తం. వ్యభిచారణ స్యసత్యతామాహ-నేతి. మధ్యేఽపితత్పృథఙ్నాస్తి కింతు వ్యపదేశ మాత్రం కుతః. యద్యస్మాత్. పరేణ. అన్యేన. భూతం జాతం. ప్రసిద్ధం ప్రకాశితం చ. తత్తదేవ కారణప్రకాశకం తావన్మాత్రం స్యాత్. న పృథగితి. మే మనీషా బుద్ధిః. శ్రు. "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" "సర్వంఖలిద్వం బ్రహ్మే" త్యాది శ్రుతేచ్చ కారణ ప్రకాశక వ్యతిరేకేణ కార్యస్య ప్రకాశస్య చానుపలంభాదితి భావః. 21

ఈ విధముగా కాలత్రయమందవ్యభిచరితమైనట్టిది సత్యమని వ్యభిచరితమగు నట్టిది అసత్యమని చెప్పుచున్నారు. ఏ జగత్తు దాని సృష్టికి పూర్వము లేదో, లేక ఏ జగత్తు దాని నాశనమునకు తరువాత లేదో ఆ వస్తువు ఉత్పత్తి వినాశములకు నడుమ కూడా లేదు. అది కేవలము వ్యవహారమేకానీ సత్యముకాదు. ఎందువల్లనంటే ఏ యే వస్తువులు అన్యముచే పుట్టినవో, ప్రకాశింపచేయబడినవో ఆయా వస్తువులు స్వకారణము అయినట్టి వస్తువులే యగును. కాని వేరుకాదు అని నా తలంపు 'వాచారంభణంవికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్' 'సర్వంఖల్విదంబ్రహ్మ' మొదలగు శృతులు ఈ విషయమునే చెప్పుచున్నాయి. కారణప్రకాశమునకు వ్యతిరేకముగా కార్యముయొక్క ప్రకాశ్యము ఉపలబ్ధి కాదని భావము. 21

శ్లో॥ అవిద్య మానో౽ప్య వభాసతే యో
వైకారికో రాజససర్గ ఏషః ।
బ్రహ్మస్స్వయం జ్యోతిరతో విభాతి
బ్రహ్మేంద్రియార్థాత్మవికారచిత్రమ్ ॥ 22

టీ:- ఏవం సామాన్యతః కార్యప్రకాశ్యయోః కారణప్రకాశకాభ్యామభేదం వ్యుత్పాద్య ప్రస్తుతే తదుభయవివేకపూర్వకం ప్రపంచస్య బ్రహ్మాభేదమహ-అవిద్యమాన ఇతి. యో౽యం వైకారికో వికారసమూహః స ఏష ప్రాగవిద్య మానో౽పి రాజస ససర్గః రజోద్వారేణ బ్రహ్మకార్యభూత ఇత్యర్థః. అవభాసతే బ్రహ్మణా ప్రకాశ్యత ఇత్యర్థః బ్రహ్మతు. స్వయం స్వతస్సిద్ధం. న తు కార్యమిత్యర్థః. జ్యోతిశ్చ ప్రకాశకమిత్యర్థః. అతః కారణాత్. ఇంద్రియాణి చఅర్థాస్తన్మాత్రాణి చ ఆత్మామనశ్చ దేవానామప్యుపలక్షణం వికారాః పంచ భూతాని ఏవం చిత్రం బ్రహ్మైవభాతీతి. (22)

ఈ ప్రకారముగా కార్యప్రకాశ్యములకు, కారణప్రకాశములతో అభేదమునుపపాదించి ప్రస్తుతమారెంటి వివేకముచే ప్రపంచము బ్రహ్మభిన్నమనుచున్నారు. వికారసమూహమేదికలదో అది పూర్వము లేనట్టిదై రజోద్వారమున, బ్రహ్మకార్యమై, బ్రహ్మప్రకాశమై కనపడుచున్నది. బ్రహ్మము స్వతసిద్ధము, ప్రకాశము. అందువలన పంచేంద్రియములు, పంచతన్మాత్రలు, మనస్సు ఇవి దేవతలకుపలక్షణము ఇట్లు ఆశ్చర్యజనకమై బ్రహ్మమే పంచభూతములుగా భాసించుచున్నది. 22

శ్లో॥ ఏవం స్ఫుటం బ్రహ్మవివేక హేతుభిః
పరాపవాదేన విశారదేన ।
ఛిత్వాత్మసందేహముపారమేత స్వానంద
తుష్టో౽ఖిల కాముకేభ్యః ॥ 23

టీ:- ఉపసంహరితి-ఏవమితి. ఏవం నిగమతః ప్రత్యక్షైతిహ్యానుమానైః స్ఫుటం యథా భవతి తథా. బ్రహ్మవివేకహేతుభిః. తథా పరస్య దేహాదే

ఉపసంహరించుచున్నాడు. ఇట్లు నిగమతః ప్రత్యక్షఐతిహ్య, అనుమానములచేత స్పష్టమగునట్లుగా బ్రహ్మజ్ఞానము కలుగుటకు అవసరమగు కారణములచేతను, దేహాదులకాత్మతత్త్వమును నిరూపించునట్టి నిపుణునిచేత, నిమిత్తభూతుడగు గురువుచేత, పరమాత్మ విషయక సందేహమును నివారించి ఆత్మానందముతో పరితుష్టినొందినవాడై సమస్త ఇంద్రియాల నుండి నిస్సంగుడు కావలెను. 23

రపవాదేన ఆత్మత్వనిరాసేన చ కీదృశేన.విశారదేన నిపుణేన. గురుణా నిమిత్తభూతేనేతి వా. ఆత్మ విషయం సందేహం ఛిత్వా. స్వానంద తుష్టస్సన్ అఖిలేభ్యః కాముకేభ్యః ఇంద్రియాదిభ్యః. ఉపారమేత నిస్సంగో భవేత్. 23

శ్లో॥ నాత్మా వపుః పార్థివమింద్రియాణి
దేవాహ్యసుర్వాయుజలం హుతాశః ।
మనోఽన్నమాత్రం ధిషణా చ
సత్త్వమహంకృతిః ఖం క్షితిరర్థసామ్యమ్ ॥ 24

టీ:- పరాపవాదం ప్రపంచయతి–నేతి. వపురాత్మా న భవతి. పార్థివ త్వాత్. ఘటవత్.తథా ఇంద్రియాణి.తదధిష్ఠాతారో దేవాః అసుః ప్రాణ.మనః. ధిషణా బుద్ధిః. సత్త్వం చిత్తం. అహంకృతిరిత్యేతే ఆత్మా న భవంతి. కుతః అన్నమాత్రంఅన్నోపష్టభ్యత్వాత్. శరీరవత్. వాయు ర్జలంచ.హుతాశ స్తేజః. ఖం క్షితిరితి పంచభూతాని. అర్థాః శబ్దాదయః సామ్యంప్రకృతిశ్చాత్మానభవంతి.జడత్వాత్.ఘటవదితి.యద్వా. హిశబ్దే నానుమానాంతరాణి సూచితాని. తద్యథా. ఇంద్రియాణ్యాత్మానభవంతి. కరణత్వాత్. వాశ్యాదివేత్. దేవాశ్చవైకారికత్వాత్ మనోవత్. ప్రాణశ్చ వాయుత్వాత్ బాహ్యావాయువత్ మనః అన్నమయత్వాత్ శరీరవత్ బుద్ధి స్తైజసత్వాత్ చక్షుర్వత్ అహంకారఃపరిణామిత్వాత్శరీరవదిత్యాది. 24

పరాపవాదమును వివరించుచున్నాడు. సామ్యము, శరీరము ఆత్మకాదు. ఇంద్రియాలు ఆత్మకాదు. దేవతలు, ప్రాణము, వాయువు, జలము, అగ్ని, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ఆకాశము పృథివి, శబ్దాదులు, ప్రకృతి ఇవేవి ఆత్మకాదు. ఇచ్చట ఇవేవి ఆత్మకాదు అనుటకు అనుమాన స్వరూపములున్నాయి. పృథివి కావున, శరీరము ఆత్మకాదు. కరణములుగాన, ఇంద్రియములు ఆత్మకాదు. వైకారికులుగాన, దేవతలు ఆత్మకాదు. వాయువు కావున ప్రాణము ఆత్మకాదు. అన్నమయము కావున మనుస్సు ఆత్మకాదు. తైజసము కావున బుద్ధి ఆత్మకాదు. పరిణామి కావున అహంకారము ఆత్మకాదు. పృథివి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము ఇవి పంచభూతములు కావున ఆత్మకాదు. జడము కావున ప్రకృతి ఆత్మకాదు. ఇట్లు శరీరాదులాత్మ అనువారి మతమును నిరసించిరి. 24

శ్లో॥ సమాహితైః కః కరుణైర్గుణాత్మభిః
గుణో భవేన్మత్సు వివిక్తధామ్నః ।
విక్షిప్య మాణైరుత కింను దూషణం
ఘనైరుపేతైర్విగతైరవేః కిమ్ ॥ 25

టీ:- ఏవం వివేకజ్ఞానముతో ముక్తస్యనేంద్రియాదికృతో గుణదోష సంబంధ ఇత్యాహ-సమాహితైరితి. మత్సువివిక్త ధామ్నః. మమ సుష్ఠు వివిక్తం ధామ స్వరూపం యేన తస్య. 25

వివేకవిజ్ఞానములు కలిగిన ముక్తునికి ఇంద్రియాదులవలన కలిగెడి గుణదోష సంబంధము లేదని చెప్పుచున్నాడు. మేఘములు గుంపులుగా వచ్చిననూ విడిపోయిననూ సూర్యునికి ఏ గుణదోషములు కలుగనట్లు సత్వాది గుణరూపములైన ఇంద్రియములు సమాధానముతో ఉన్ననూ, విషయములందాసక్తమై యున్ననూ నిస్సంగమైన నా స్వరూప మగు ఆత్మకు గుణదోషములు కలుగవు. 25

శ్లో॥ యథా నభో వాయ్వనలాంబుభూగుణై
ర్గతా గతైర్వర్తుగుణైర్న సజ్జతే ।
తథాక్షరం సత్త్వరజస్తమోమలైః
అహంకృతే స్సంసృతి హేతుభిః పరమ్ ॥ 26

టీ:- ప్రకాశస్య ప్రకాశ్యగుణదోషా న భవంతీ రవిదృష్టాంతేనోక్తం. అసంగత్వేనావస్థితస్య న కోఽపి గుణదోష ఇత్యాకాశదృష్టాంతేనాహ- యథేతి. వాయ్వాదీనాం శోషణ దహన క్లేదన రజో ధూసరత్వాదిభిః. గతాగతైరాగమాపాయిభిః. ఋతుగుణైః శీతోష్ణాదిభీ ర్వా. అహంకృతేః అహంకారాత్పరమక్షరం. సంస్కృతిహేతుభిర్నయుజ్యతే యద్వా అహంకారస్య సంస్కృతి హేతుభిరితి. 26

అసంగ బ్రహ్మముగాఉన్న వానికి గుణదోషములేమియు ఉండవని ఆకాశ దృష్టాంతముచే చెప్పుచున్నాడు. ఆకాశమేవిధముగా వచ్చుపోవుచుండు వాయు, అగ్ని, జల, భూమి అను తక్కిన నాలుగు భూతముల యొక్క శోషణ దహణ, క్లేదన, రజోదూసరత్వాదులగు గుణములతో వచ్చిపోవుచుండు ఋతువుల గుణములతో, సంబంధిం చదో, సక్తమయ్యుండదో అట్లే అక్షరపరబ్రహ్మ సంసారహేతువులగు అహంకారము యొక్క సత్వ, రజస్తమస్సులను మాలిన్యములతో సంబంధము పొందదు. 26

శ్లో॥ కథాపి సంగః పరివర్జనీయో
గుణేషు మాయారచితేషు తావత్ ।
యద్భక్తియోగేన దృఢేన యావద్రజో
నిరస్యేత మనః కషాయః ॥ 27

టీ:- ముక్తవదసమ్యక్ జ్ఞానీ న యథేష్టమాచరేదిత్యాహ-ద్వాభ్యాం. తథేతి. గుణేషు. విషయేషు. రజోరాగః మనసః కషాయ ఇతి దుర్నిరాసతామాహ. 27

సమ్యక్ జ్ఞానము లేనివాడు ముక్తునివలె యథేచ్ఛగా ఆచరింపరాదని రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. (అట్లయ్యునూ) ఎంతవరకు నా యందు దృఢమగు భక్తియుక్తుడగుటచే, మనస్సును చెడగొట్టునట్టి రజోగుణము పోగొట్టబడదో అంతవరకు మాయచే కల్పితములైన విషయములయందు సంబంధము పరిత్యజింపదగినది. 27

శ్లో॥ యథా౨౨మయో సాధుచికిత్సితో
నృణాం పునః పునస్సంతుదతి ప్రరోహన్ ।
ఏవం మనోపక్వ కషాయకర్మ
కుయోగినం విధ్యతి సర్వసంగమ్ ॥ 28

టీ:- ఏతదేవ దృష్టాంతేనోపపాదయతి - యథేతి. నృణామామయో రోగః. అసాధు అసమ్యగ్యథాభవతి తథా. అపక్వకషాయకర్మ అదగ్ధాః కషాయా రాగాదయస్తన్మూలాని చ కర్మాణి యస్మిం స్తత్. అతఏవ సర్వసంగం సర్వేషు పుత్రాదిషు సజ్జమానం మనః కుయోగినం అసమ్యక్ జ్ఞానినం. విధ్యతి భ్రంశయతి. 28

దానినే దృష్టాంతముతో నుపాదించుచున్నాడు. నరులకే విధముగా చక్కగా చికిత్స చేయబడని వ్యాధి వల్ల మాటి మాటికి రోగమావిర్భవించుచునే ఉండునో, ఆ విధముగానే దహింపబడని రాగాలు, తన్మూలములగు కర్మ, పుత్రాదులంయందాసక్తమైనదగు మనస్సు, సమ్యక్ జ్ఞానములేని వానిని భ్రంశము నొందించును. 28

శ్లో॥ కుయోగినో యే విహతాంతరా యై
ర్మనుష్యభూతై స్త్రిదశోపసృష్టైః ।
తే ప్రాక్తనాభ్యాస బలేన భూయో యుంజంతి
యోగం న తు కర్మ తంత్రమ్ ॥ 29

టీ:- నను కథంచిద్విషయసంగేన యోగభ్రంశస్స్యాత్. అలం తర్హి సాపాయేన యోగమార్గేణ తత్రాహ-కుయోగిన ఇతి. మనుష్యభూతైః బంధుశిష్యాదిరూపైః త్రిదశై రుపసృష్టైః ప్రేరితైః. తథాచ. శ్రు. "తాస్మాత్త దేషాం న ప్రియం యదే తన్మనుష్యావిదురి" తి. ఆవశ్యకమాహ - భూయో జన్మాంతరే. న తు కర్మతంత్రం కర్మవిస్తారం. 29

ఓయీ! ఎట్లేని విషయసంగమేర్పడినచో యోగ భ్రంశము కలుగునందురా, అట్టిచో ఉపాయసహితముగు యోగ మార్గము ప్రయోజనముగదా అనగా ఇట్లు చెప్పుచున్నాడు. మొదట యోగాభ్యాస యుక్తులయ్యు, దైవప్రేరితులై యోగాభ్యాసమునకంతరాయము కలిగించునట్టి బంధువులు, శిష్యులు మొదలగువారి కారణముగా అసమ్యజ్ఞానులయినారో వారునూ మొదటి అభ్యాస బలముతో మళ్ళీ యోగయుక్తులగుదురే కాని, కర్మపరతంత్రులు కారు. శృతి 'యస్మాత్త దేషాం న ప్రియం యదేతన్మనుష్యావిద్యు' అని. 29

శ్లో॥ కరోతి కర్మ క్రియతే చ జంతుః
కేనాప్యసౌ చోదిత ఆనిపాతాత్ ।
న తత్రవిద్వాన్ ప్రకృతౌ స్థితోఽపి
నివృత్త తృష్ణస్స్వ సుఖానుభూత్యా ॥ 30

టీ:- నను విదుషామపి సర్వదా కర్మదుష్పరిహరమితి పునస్సంసార స్స్యాదేవాత ఆహ-కరోతీతి. విదుషోఽన్యోఽసౌ జంతుర్దేహ ఏవ భోజనాదికర్మ కరోతి క్రియతే విక్రియతే చ తేన కర్మణా పుష్ట్యాద్యపి ప్రాపోత్యీతర్థః. కేనాపి సంస్కారాదినా చోదితస్సన్. ఆనిపాతాన్మరణ పర్యంతం. విద్వాంస్తు ప్రకృతౌ దేహేస్థితోఽపి. తత్ర కర్మణి న విక్రియతే నిరహంకారిత్వాత్ హర్షవిషాదాదిభిః సంసారం న ప్రాపోన్తి. 30

ఓయీ! విద్వాంసులకుకూడా సర్వదా కర్మ పరిహరింప రాని దగుటచే తిరగి సంసారము కలుగును కదా అనగా చెప్పుచున్నాడు. విద్వాంసుడు కానట్టి జంతువు భోజనాదికర్మ చేయుచున్నది, వికారము పొందింపబడుచున్నది. (ఆ భోజనాది రూపమగు కర్మచే పుష్ట్యాదులను కూడా పొందుచున్నది) ఏదో ఒక సంస్కారము మొదలగు వానిచే ప్రేరేపింపబడినదై మరణపర్యంతము కర్మచేయుచున్నది. పండితుడగు వానికి ఆత్మమాత్రమే దేహమునందు ఉన్నదను జ్ఞానముచే, ఆత్మ సఖానుభవముచే కోరికలు లేనివాడై ఆ కర్మయందు వికారమొందదు. అహంకారములేనివాడగుటచే హర్ష విషాదులచే సంసారమునొందదు. 30

శ్లో॥ తిష్ఠంతమాసీనముత వ్రజంతం
శయానముక్షంతమదంత మన్నమ్ ।
స్వభావ మన్యత్కిమపీహమాన
మాత్మాన మాత్మస్థమతిర్న వేద ॥ 31

టీ:- కించ. ఆస్తాం తావద్దైహిక కర్మభిర్వికారశంకా. యతో దేహమప్య సౌ న పశ్యతీత్యాహ - తిష్ఠంతమితి. ఉక్షంతం మూత్రయంతం. స్వభావప్రాప్తమన్యదపి దర్శనస్పర్శనాది. ఈహమానం కుర్వంతం. ఆత్మానం దేహం. 31

దైహికమగు కర్మలచే వికారము కలుగునను శంక అటు లుండనిమ్ము. ఎందుకనగా ఈ జీవుడు దేహమునుగూడా చూడనను చున్నాడు. స్వాత్మయందే లగ్నమైన మనస్సుగల జీవుడు నిలిచినట్టి కూర్చుండునట్టి లేదా పోవుచున్నట్టి నిదురించునట్టి మూత్రించుచున్నట్టి అన్నము తినునట్టి స్వభావ ప్రాప్తమైన తదితరమైన దర్శనస్పర్శాదికమును చేయుచున్న దేహమును ఎరుగడు. 31

శ్లో॥ యదిస్మ పశ్యత్యసదింద్రి యార్థం
నానానుమానేన విరుద్ధమన్యత్ ।
నమన్యతే వస్తుతయా మనీషీ
స్వాప్నం యథోత్థాయ తిరోదధానమ్ ॥ 32

టీ:- నన్వింద్రియవతః. సర్వథా కథమదర్శనం సంభవతి? తత్రాహ-యదీతి. యద్యపి ఆసతాం బహిర్ముఖానా మింద్రియాణా మర్థం పశ్యతి. తథాపి నానాత్వాన్మిథ్యాస్వప్నవదిత్యనుమానేన విరుద్ధం బాధితం సత్ అన్యదాత్మవ్యతిరిక్తం. మనీషీ విద్వాన్. వస్తుతయా న మన్యతే. స్వప్నాదుత్థాయ ప్రబుధ్య. సంస్కారమాత్రేణ స్ఫురంతం స్వాప్నం విషయం. అతఏవ స్వయమేవ తిరోదధానం తిరోభవంతం యథా. తద్వత్. 32

ఓయీ! ఇంద్రియములు కలవానికి ఎట్లు చూడకుండుట సంభ వించుననగా చెప్పుచున్నాడు. విద్వాంసుడగు జీవుడు బహిర్ముఖములగు ఇంద్రియములయొక్క విషయములను చూచుచున్ననూ అనేక విధమ గుటచేత, (నానాత్వాన్మిథ్యాస్వప్నవత్) మిథ్యా స్వప్నమువలె అనెడి అనుమానముచేత బాధితమై ఆత్మ వ్యతిరిక్తమును వాస్తవమని తలంపడు. నిద్రలేచి ఎట్లు సంస్కారమాత్రము చేతనే స్ఫురించుచున్న స్వప్నగతమైన విషయమును, స్వయముగనే తిరోహితమగుచున్న దానిని వలె. 32

శ్లో॥ పూర్వం గృహీతం గుణకర్మ చిత్రమజ్ఞానమాత్మన్య వివిక్తమేతత్।
నివర్తతే తత్పునరీక్షయైవ న గృహ్యతేనాపి విసృజ్య ఆత్మా॥ 33

టీ:- తదేవమాత్మా న విక్రియత ఇత్యుక్తం నన్వేతదనుపపన్నం బద్ధావస్థాయాః త్యజ్యమానత్వాత్ ముక్తావస్థా. యాశ్చ గృహ్యమాణత్వాత్ న హి వ్రీహయో౽వఘాతేన వ్రీహిభావత్యాగేన తండులీ భావేన గృహ్యమాణా న విక్రియంతే తత్రాహ-పూర్వమితి. పూర్వం బద్ధావస్థాయాం గుణైః కర్మభిశ్చ చిత్రం అజ్ఞానకార్యం దేహేంద్రియాదిలక్షణం ఆత్మన్యధ్యాసేనావివిక్తం గృహీత మాసీత్. తదేవ పునః జ్ఞానేన నివర్తతే. ఆత్మా తు న కేనాపి రూపేణ గృహ్యంతే. అయం భావః. ముక్తేః క్రియాఫలత్వే భవేత్తావదాత్మనో వికారః తస్యాస్త్వారోపితా జ్ఞానతత్కార్య సంసార నివృత్తిమాత్ర రూపత్వాన్నాత్మ సంస్పర్శితం బంధమోక్షయోః అతో న వికార ఇతి. 33

ఆత్మ వికారమునొందదని చెప్పబడినది. ఓయీ! ఇది కుదరదు. ఏలయన ఇది బద్ధావస్థయందు విడువబడుచున్నది. ముక్తావస్థయందు గ్రహించబడుచున్నది. కనుక ధాన్యమును దంపినపుడు అవి వ్రీహిభావమును వీడి తండులములుగా గ్రహించబడుచున్నవి. వికారమును పొందుచునేయున్నవికదా, యనగా చెప్పుచున్నాడు. ఓయీ! బద్ధావస్థయందు సత్యాదిగుణముల చేతను తజ్జన్యములగు పుణ్య పాపముల చేతను నానావిధమగు దేహేంద్రియాది లక్షణమగు అజ్ఞానకార్యము జీవస్వరూప మందు ఇతరమందితరాభాసరూపమగు అధ్యాసచేత నేను గుడ్డిని, నేను చెవిటిని ఇత్యాద్యభిన్నముగా తెలుసికొనబడినది ఆ ధ్యాసచే అభిన్నముగా తెలిసికొనబడిన ఆ దేహదికమే తిరిగి స్వరూపజ్ఞానము చేతనే తొలగిపోవుచున్నది. ఆత్మయే ఏ రూపము తోడను గ్రహింపబడుటలేదు విడువబడుటయునూ లేదు. ఇది భావము- ముక్తి క్రియాఫలమగుచో ఆత్మకు వికారము కలిగెడిది. కాని ముక్తి ఆరోపితమగు అజ్ఞాన మాత్రము తొలగిపోవుటయను రూపము కలదియగుటచే బంధమోక్షములాత్మను స్పృశించవు కావున దానికి వికారము కలుగదు. (33)

శ్లో॥ యథా హి భానో రుదయో నృచక్షుషాం
తమో నిహన్యా న్న తు సద్విధత్తే ।
ఏవం సమీక్షా నిపుణా సతీ మే
హన్యాత్తమిస్రం పురుషస్య బుద్ధేః ॥ 34

టీ:- ఏతదేవ దృష్టాంతేన స్పష్టయతి-యథేతి. న తు పూర్వమేవ సత్ ఘటాదిపునర్విధత్తే కరోతి. మే యా సమీక్షా ఆత్మ విద్యా. 34

దీనినే దృష్టాంతముచే స్పష్టము చేయుచున్నాడు. సూర్యోదయము మానవుల నేత్రములకేర్పడిన అంధకారమును తొలగించునే కానీ ఆ యా దృశ్యమానములగు ఘటాదులను సృజింపదు. అట్లే నా యీఆత్మ విద్యయూ పురుషుని బుద్ధికి కలిగిన అంధకారమును మాత్రమే తొలగించునుగాని జ్ఞానమును కలుగజేయదు. ఆ స్వరూపభూత జ్ఞానమునకు ఆవకరమగు అజ్ఞానమును ఆత్మవిద్య తొలగించును కాని జ్ఞానము కలిగింపదు. (అనగా జ్ఞానము స్వయంప్రకాశము ఆవరణము తొలగగానే కనబడుతుంది)34

శ్లో॥ ఏష స్వయం జ్యోతిరజో௨ ప్రమేయో
మహావిభూతిస్సకలానుభూతిః ।
ఏకో௨ ద్వితీయో వచనాం విరామే
యేనేషి తా వాగసవశ్చరంతి ॥ 35

టీ:- ఆత్మనో నిర్వికారతాం ప్రపంచయతి - ఏషఇతి. ఏష ఇత్యనేనా పరోక్షతయా నిత్యప్రాప్తస్యాత్మనః ప్రాప్తిం వారయతి -స్వయం జ్యోతిరిత్యనేన అజ్ఞానమలాపాకరణలక్షణాం వికృతిం వారయతి-అజ ఇత్యుత్పత్తిం అప్రమేయ ఇతి జ్ఞానలక్షణాతి శయాధానేన సంస్కారం. మహావిభూతిరితి దేశాకాలపరిచ్ఛేదాభావేన అస్తిత్వవృద్ధి పరిణామాపక్షయ వినాశాన్. వారయతి. స్వయంజ్యోతిష్ట్వాదౌ హేతుః సకలానుభూతిరితి.

ఆత్మయొక్క నిర్వికారతను వివరించుచున్నాడు ఏషః అనుదానిచే అపరోక్షమగుటచే నిత్య ప్రాప్తమగు ఆత్మయొక్క ప్రాప్తిని వారించుచున్నారు. ఈ ఆత్మ స్వయంప్రకాశము, ఉత్పత్తిరహితము, జ్ఞానమును శక్తివిశేషమును కలిగించునట్టిది. దేశకాలపరిచ్ఛేద శూన్యమగు స్వరూపజ్ఞానము కలది. సకల జ్ఞానములకు కారణమైనది. సజాతీయ భేదశూన్యము. విజాతీయ భేదశూన్యము వాక్కులకు అగోచరమగుటచే వాక్కులు నివర్తించగా 'యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ' అనిశృతి అక్కడహేతువు యేనేషితాఃప్రేరితాః ఏయాత్మచే ప్రేరితములై వాక్కు ప్రాణములనుసంచరించుచున్నవి. 'కేనేషితంపతతిప్రేషితంమనః కేనప్రాణః ప్రథమః ప్రైతియుక్తః కేనేషితాం వాచమీమాం వదంతిచక్షుః శ్రోత్రంకఉదేవోయునక్తి శ్రోత్రస్యశ్రోత్రం యన్మనసోమనోయద్వాచో

ఏకో ద్వితీయ ఇతి వికారహేతోరన్యస్యా భావాన్న కోఽపి వికార ఇతి దర్శయతి. నను శ్రుతివిషయస్య కథం స్వయం జ్యోతిష్ట్వాది తత్రాహ– వచసాం విరామే అగోచరత్వేన నివృత్తౌ సత్యాం. తథా చ, శ్రు. "యతో వాచో నివర్తంతే. అప్రాప్య మనసా సహే" తి. అత్ర హేతుః యేనేషితాః తథాచ. శ్రు. "కేనేషితం పతతిప్రేషితం మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతిః యుక్తః కేనేషితాం వాచ మిమాం వదంతి చక్షుశ్శ్రోత్రం క ఉదేవో యునక్తి శ్రోత్యస్య శ్రోతం మనసో మనో యద్వాచోహవాక్స ఉప్రాణస్య ప్రాణః చక్షుషశ్చక్షురి" తి. 35

హ వాచం ప్రాణస్యప్రాణముతచక్షుషశ్చక్షు' అని. ఏ ఆత్మచే ప్రేషితమై హేతువు భాసిస్తుందో అదియే నిర్వికారము. 35

శ్లో॥ ఏతావానాత్మ సంమోహో యద్వికల్పస్తు కేవలే ।
ఆత్మన్నృతే స్వమాత్మాన మవలంబో న యస్య హి ॥ 36

టీ:– అథ ద్వితీయత్వముపపాదయితుం భేదస్యావాస్తవత్వమాహ– ఏతావానితి. కేవలే అభిన్నే. ఆత్మన్ ఆత్మని. వికల్ప. ఇతి యత్ ఏతావాన్ సర్వోఽప్యాత్మనో మనస్సంమోహః భ్రమః యతః స్వమాత్మానమృతే వినా యస్య వికల్పస్యావలంబః ఆశ్రయో నాస్తి రజతభ్రమస్యేవ శుక్తిం వినా. శ్రు. "నేహ నానాస్తికించన" శ్రు. "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే యుక్తాహ్యస్య హరయశ్శతా దశే" త్యాదిశ్రు తేరిత్యర్థః. 36

ఆత్మకద్వితీయత్వమునుపపాదించుటకు భేదము అవాస్తవమనుచున్నారు. అభిన్నమగు ఆత్మయందు వికల్పమని ఏది కలదో ఇది అంతయూ మనస్సు యొక్క భ్రమ మాత్రమే. ఏలయనగా ముత్యపు చిప్పలేక రజతభ్రమ లేనట్లు ఆత్మతప్ప ఏ వికల్పమునకు ఆశ్రయము లేదు. 36

శ్లో॥ యన్నామాకృతిభి ర్గ్రాహ్యం పంచవర్ణ మబాధితం ।
వ్యర్థేనాప్యర్థవాదోఽయం ద్వయం పండితమానినామ్ ॥ 37

టీ:- కేచిత్పునః ప్రత్యక్షాదిప్రతీతస్య ప్రపంచస్య బాధాయోగాత్ వేదాంతార్థానాం చ క్రత్వర్థకర్తృప్రతిపాదనపరత్వేనార్థవాదత్వాత్ ద్వైతం సత్యమితి మవ్యతే. తన్మతమనూద్య దూషయతి-యదితి. నామాకృతిభిః నామరూపై రుపలక్షితం పంచభూతాత్మకం ద్వయం ద్వైతం యత్. తదబాధితమితి. పండితమానినాం అత్ర వయమేవ పండితా ఇత్యాభిమానవతాం వేదాంతేష్వయమర్థవాద ఇతి ప్రతీతిః. న తత్త్వవిదాం యతః వ్యర్థేనాపి వినాప్యర్థేన సా ప్రతీతి. తథాహి న తావద్విధ్యేకవాకృత్వం తేషామస్తి. యతోఽర్థవాదత్వంస్యాత్. న చాకర్తృ అభోక్తృ పరమానందరూపాత్మ ప్రతిపాదనం కర్మవిధిశేషతాం భజతే. న చాబాధితత్వం ద్వైతస్య నామరూపాత్మ కత్వాత్. గ్రాహ్యత్వాత్ పంచ వర్ణాత్మకత్వాత్ స్వప్నవత్ ఇత్యాద్యనుమానైర్వాచారంభణాది శ్రుతిభిశ్చ భాతితత్వాదితి. 37

(కొందరు) ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియబడుచున్న ప్రపంచము బాధితమగుట కుదరదు కావున వేదాంతార్థములు క్రతువునకు వలయు కర్తను ప్రతిపాదించుటయందే తాత్పర్యము కలవగుటచే అర్థవాదములగుట వలన ద్వైతము సత్యమని తలంచు చున్నారు. వారి మతమును అనువదించి అద్వైతమును నిరసించు చున్నారు. నామ రూపములచే ఉపలక్షితమయినదియు, పంచ భూతాత్మక మయినదియు అగు ఏ ద్వైతము కలదో అది బాధితము కానిది అని మేమే పండితులమని అభిమానము కలవారికి వేదాంతము లందిది అర్థవాదమను ప్రతీతి కలుగును కానీ తత్త్వవాదులకు కాదు. ఏలననగా ఆ ప్రతీతి నిష్ప్రయోజనము కనుక.

అది యుక్తమే. విధ్యేకవాక్యత్వము వాటికి లేదు. అట్లయిన అర్థవాదత్వము వాటికి వచ్చును. అకర్తృ అభోక్తృ పరమానంద రూపాత్మ ప్రతిపాదన కర్మ విధివిశేషమును పొందదు. దేహమునకు ద్వైతమునకు అబాధితత్వము లేదు. నామరూపాత్మకమైనందున గ్రాహ్య మయి నందున, పంచవర్ణాత్మకమయినందున, స్వప్నము, మొదలుగా గల అనుమానములచే వాచారంభణాదిశృతులచే బాధితమయినందున ఇది అర్థవాదము. (ద్వైతము) 37

శ్లో॥ యోగినోఽపత్య యోగస్య యుంజతః కాయ ఉత్థితైః ।
ఉపసర్గైర్విహన్యేత తత్రాయం విహితో విధిః ॥ 38

టీ:- తదేవం జ్ఞానయోగం సపరికరం నిరుప్యేదానీం తన్నిష్ఠస్య విఘ్నప్రతీకారమాహ - త్రిభిః యోగిన ఇతి. యోగం యుంజతః కాయో యద్యంతరైవ ఉత్పన్నైః. ఉపసర్గైః రోగాద్యుపద్రవైః అభిభూయేత. విధిః ప్రతీకారః. 38

ఇట్లు జ్ఞానయోగమును సవిస్తారముగా నిరూపించి ఇప్పుడు తన్నిష్ఠునకు విఘ్న ప్రతీకారము మూడు శ్లోకములచే తెలుపుచున్నాడు. యోగమందు సిద్ధినొందక యోగము నవలంబించి యున్నవాని శరీరము విఘ్నములచే ఎదుర్కొనబడినచో అప్పుడీ విధానము విహితమైయున్నది. (38)

శ్లో॥ యోగధారణయా కాంశ్చిదాసనైర్ధారణాన్వితైః ।
తపోమంత్రౌషధైః కాంశ్చిదుపసర్గాన్వినిర్దహేత్ ॥ 39

టీ:- యోగేతి. యోగధారణయా సోమసూర్యాగ్నిధారణయా సంతాప శైత్యాదీన్. ఆసనైర్వాయుధారణాన్వితైః వాతాదిరోగాన్. తపోమంత్రౌషధైః పాపగ్రహసర్పాదికృతాన్. 39

సోమసూర్యాది ధారణచే, సంతాప శైత్యాదులను; ఆసనములచే వాతాది రోగములను; తపోమంత్రౌషధములచే, పాపగ్రహ, సర్పాదికృత క్లేశములను దహించవలెను. 39

శ్లో॥ కాంశ్చిన్మమానుధ్యానేన నామ సంకీర్తనాదిభిః ।
యోగేశ్వరానువృత్త్యా చ హన్యాదశుభదాన్ శనైః ॥ 40

టీ:- కాంశ్చిదితి. మమానుధ్యానాదిభిః కామాదీన్ యోగేశ్వరాను వృత్త్యా దంభమానాదీన్ హన్యాత్. 40

శ్రేయస్కరములు కాని కామాదులను నన్ను సదా ధ్యానించుట, నా నామ జపముచేతను; దంభమానాదులను, యోగీశ్వరుల ననుసరించుట చేతను మెల్ల మెల్లగా పోగొట్టవలెను. 40

శ్లో॥ కేచిద్దేహమిమం ధీరాస్సుకల్యం వయసి స్థితం ।
విధాయ వివిధోపాయైరథ యుంజంతి సిద్ధయే ॥ 41

టీ:- అన్యే తు దేహసిద్ధ్యర్థమేవైతత్సర్వం యుంజంతి తద్దూషయతి- కేచిదితి. కేచిత్పునరేతైరన్యైశ్చోపాయైర్దేహమేవ సుకల్యం జరారోగాది రహితం వయసితారుణ్యే స్థితం స్థిరం చ కృత్వా. అద్వంద్వపరకాయ ప్రవేశాదిసిద్ధయే తత్తద్ధారణానురూపం యోగం యుంజంతి న తు జ్ఞాననిష్ఠారూపం. 41

శ్లో॥ న హి తత్కుశలా దృత్యం దాయాసోహ్యపార్థకః ।
అధ్రువత్వాచ్ఛరీరస్య ఫలస్యేవ వనస్పతేః ॥ 42

టీ:- నేతి. కుశలైః ప్రాజ్ఞైరాదరణీయం న భవతి. వనస్పతి మదాత్మైవ స్థాయీ. శరీరం తు ఫలవన్నశ్వరమిత్యర్థః. 42

కొందరు దేహసిద్ధికై దీనినంతనూ చేయుచున్నారు. దానిని దూషించుచున్నారు. కొందరీ చెప్పబడినవేకాక తక్కిన వివిధోపాయములతో ఈ శరీరమును జరారోగాది రహితము, యుక్తవయస్సు కలదిగా చేసుకొని పరకాయ ప్రవేశాది సిద్ధికై యోగాభ్యాసము చేయుచున్నారే కాని జ్ఞానముకొరకు కాదు. 41

కావున బుద్ధిమంతులా విధమగు యోగాదులానాదరింపరు. దానికై చేయు శ్రమ నిరర్థకము. శరీరమెంత పోషించిననూ వృక్షము నుండి ఫలము పడినట్లు నశించును. ఆత్మయో వనస్పతివలె స్థిరముగా ఉండును. 42

శ్లో॥ యోగం షేవతో నిత్యం కాయశ్చేత్కల్యతామియాత్ ।
తచ్ఛ్రద్దధ్యాన్న మతిమాన్ యోగముత్సృజ్య మత్పరమ్ ॥ 43

టీ:- యద్యపి క్వచిత్సమాధ్యంగత్వేనాపి ప్రాణాయామాది యోగే క్రియమాణే జరారోగాద్యభావో దృశ్యతే. సత్యం. తథాపి సమాధి యుత్సృజ్య న తత్ర సజ్జేతేత్యాహ-యోగమితి. తత్ తాం దేహసిద్ధిం. న శ్రద్ధధ్యాత్ న విశ్వసేత్. 43

శ్లో॥ యోగచర్యామిమాం యోగీ విచరన్మద్వ్యపాశ్రయః ।
నాంతరాయై ర్విహన్యేత నిస్పృహస్స్వసుఖానుభూః ॥ 44

టీ:- తదేవం విఘ్నప్రతీకారైః యోగం కుర్యాదిత్యుక్తం మచ్ఛరణస్య తు న విఘ్నశంకాపీత్యాహ-యోగచర్యామితి. విచరన్ ఆచరన్. స్వసుఖే అనుభూః అనుభూతిర్యస్య సః. స్పృహామూలా హి విఘ్నాః సా చ మదుపాశ్రయస్య నివర్తతే. అతః అంతరాయై రవిహతః స్వానందోపూర్ణో భవతీతి. శ్లో. సమాహృత్య స్వయోగం తు సమస్తోపనిషద్రసమ్, సఖ్యే ముఖ్యతమాం భక్తిం ముక్త్వా పునరుపాది శత్. 44

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**అష్టవింశోఽధ్యాయః**

ఓయీ! ఒక్కొక్కచోట సమాధికంగముగా ప్రాణాయాది యోగము నాచరించుచో ముసలితనము, రోగములు లేకుండుట కనబడుచున్నది కదా? అనగా సత్యమే అట్లయ్యునూ సమాధిని వీడి దానియందు సక్తుడు కారాదనుచున్నాడు. నిత్యము యోగము నాచరించు వాని శరీరము పాటవము నొందును. బుద్ధిమంతుడు యోగమును వీడి నా యందాసక్తుడు కావలెను కానీ ఆ దేహసిద్ధిని నమ్మరాదు. 43

ఇట్లు విఘ్నములకు ప్రతీకారము చేయుటద్వారా యోగము నాచరింపవలెనని చెప్పబడినది. కాని నన్ను శరణుజొచ్చిన వానికి మాత్రము విఘ్నశంకయే లేదనుచున్నాడు. యోగి ఈ యోగచర్య నాచరించుచూ నన్నాశ్రయించినవాడు కనుక కోరికలు లేనివాడై విఘ్నములచే కొట్టబడక ఆత్మసుఖానుభుతిని పొందును. 44

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**అష్టవింశోధ్యాయము సమాప్త**

## ఊనత్రింశోఽధ్యాయః

శ్లో. ఊనత్రింశేతు యః పూర్వం విస్తారణ నిరూపితః ।
భక్తియోగస్త మేవాహ స్వభక్తాయ సమాసతః ॥

అతిక్లేశమివాలక్ష్యయోగే సంగైకసంపది సుఖోపాయం పునః కృష్ణ ముద్ధవః పరిపృచ్ఛతి. సుదుశ్చరామితి.

**శ్రీ ఉద్ధవ ఉవాచ**

శ్లో॥ సుదుశ్చరా మిమాం మన్యే యోగచర్యామనాత్మనః ।
యథాంజసా పుమాన్ సిద్ధ్యే త్తన్మే బ్రూహ్యంజసాచ్యుత ॥ 1

టీ:- అనాత్మనః అవశీకృత మనసః అంజసా ప్రయాసతో యథా సిద్ధ్యేత్. తత్తథా. అంజసా సుబోధం యథా భవతి తథా. మే బ్రూహి. 1

శ్లో॥ ప్రాయశః పుండరీకాక్ష యుంజంతో యోగినో మనః ।
విషీదంత్యసమాధానాన్మనోనిగ్రహకర్శితాః ॥ 2

టీ:- సుదుష్కరతాం ప్రపంచయతి-ప్రాయశ ఇతి. మనో యుంజంతో నిగృహ్ణంతః నిషీదంతి క్లిశ్యంతి-కుతః అసమాధానాత్ అనిగ్రహాత్. కథం చిన్మనసో నిగ్రహే కర్శితాః శ్రాంతాస్సంతః. 2

## 29వ అధ్యాయము

ఈ ఇరువదితొమ్మిదవ అధ్యాయమున పూర్వము ఏ భక్తియోగము విస్తారముగా నిరూపించబడెనో దానినే సంగ్రహముగా భగవంతుడు తన భక్తునకుపదేశించుచున్నాడు. నిస్సంగము చేతనే సాధింపదగిన యోగవిద్య చాలా కష్టమని భావించి ఉద్ధవుడు సుఖోపాయము తెలుపుమని మళ్ళీ కృష్ణున్ని అడుగుచున్నాడు.

అచ్యుతుడా! మనస్సును తన వశమునందు ఉంచుకొనని వానికి ఈ యోగవిద్య చాలా దురధిగమముగా తలుతును. మనుజుడే విధముగా సుఖముగా యోగ సిద్ధినందునో అట్టి మార్గమును స్పష్టముగా నాకు చెప్పుము. 1

యోగము సుదుష్కరమనుటను వివరించుచున్నారు. ఓ పుండరీకాక్షా! యోగనిష్ఠులు మనస్సును నిగ్రహించుకొనుచు విషాదమును పొందుతున్నారు. క్లేశమునుభవించుచున్నారని అర్థము ఎందులకనగా నిగ్రహించుకొనజాలక, మనస్సును నిగ్రహించు కొనుట యందు శ్రాంతులగుదురు. 2

శ్లో॥ అథాత ఆనందదుహం పదాంబుజం
హంసాశ్శ్రయేరన్నరవిందలోచన ।
సుఖంను విశ్వేశ్వరయోగకర్మభి
స్త్వన్మాయయామీ విహతాన మానినః ॥ 3

టీ:- అథేతి. యస్మాదేవం కేచన విషీదంతి అథాతః అత ఏవ యే హంసాః సారాసారవివేకచతురాః తే తు.ఆనందదుహం సమస్తానంద పరిపూరకం తవ పదాంబుజమేవ సుఖం యథా భవతి తథా. సునిశ్చితం శ్రయేరన్ సేవంతే అమీతు త్వన్మాయయా విహతాః యే యోగకర్మ భిర్మానినస్సంతో న శ్రయంతే. యద్వా - అమీత్వద్భక్తాః త్వన్మాయయా న విహతాః. అతఏవ యోగకర్మభిః కృత్వా మానినో న భవంతి అన్యే తు త్వన్మాయయో మోహితా స్సంతః. వయం యోగజ్ఞాః వయం కర్మ కుశలా ఇతి కేవలం గర్వితా భవంతి. న తు ముచ్యంత ఇత్యర్థః. 3

ఓ కమలేక్షణా ! ఎందువలన ఈ ప్రకారము కొందరు విషాదమును పొందుదురో అందువలన సారాసారవివేకమునందు కుశలులైనవారు సమస్తమగు ఆనందమును పూరించునట్టి నీ పాదపద్మమునే సుఖము కలుగునట్లుగా నిశ్చయముగా ఆశ్రయింతురు. లోకప్రభూ! వీరు నీమాయచే కొట్టబడినవారు. యోగముచే కర్మలచే గర్వము కలిగి మీ పదాబ్జములనాశ్రయించరు. లేదా నీ భక్తులు నీ మాయచే కొట్టబడనివారై యోగాచరణములచేత గర్వితులు కారు. ఇతరులు నీ మాయా మోహితులై మేము యోగ విదులము, మేము కర్మఠులము అని కేవలము గర్వితులగుదురు. వారు యుక్తులు కారు అని అర్థము. 3

శ్లో॥ క్రిం చిత్రమచ్యుత తవై తదశేష బంధో
దానేష్వనన్యశరణేషు యదాత్మసాత్త్వం ।
యో రోచయత్సహమృగైస్స్వమీశ్వరాణాం
శ్రీమత్కిరీట తటపీడత పాదపీఠః ॥ 4

టీ:- త్వద్భక్తాస్తు త్వత్ప్రసాదేన కృతార్థా భవంతీతి నాతిచిత్రమిత్యాహ

ఓ కృష్ణా! అందరికీ బంధువా! ఇతర శరణములేని నీ దాసులందు నంద, గోపి, బలి ప్రభృతులందు నీ యొక్క నీయధీన్యతమేది కలదో నీవు వారికధీనుడవై యుండుట అనునది ఏది కలదో అది ఒక ఆశ్చర్యము కాదు. ఏలయనగా! బ్రహ్మాది లోకప్రభువుల శ్రీమత్కిరీటాగ్రములచే రాపిడి నొందింపబడిన పాదపీఠము కలవాడవై,

–కిమితి. అనన్య శరణేషు దాసేషు తవాత్మసాత్త్వం త్వదధీనత్వం యత్. యథా నందగోపీబలి ప్రభృతిషు. ఏతత్. కిం చిత్రం నాశ్చర్యమిత్యర్థః యతో యో భవాన్ శ్రీరామరూపేణ మృగైర్వానరైస్సహ సాహిత్యం సఖ్యమితి యావత్. అరోచయాత్ ప్రీత్యా కృతవాన్. కార్యార్థం కృతం చేత్. నేత్యాహ–స్వయమీశ్వరాణామితి. కథంభూతః. ఈశ్వరాణాం బ్రహ్మాదీనాం యాని శ్రీమంతి కిరీటాని తేషాం తటాన్యగ్రాణి తైః పీడితం విలుంఠితం పాదపీఠం యస్య స్వయం తథా భూతోఽపి సన్. 4

స్వయముగా అట్టివాడవయ్యునూ నీవు శ్రీరామరూపమున వానరులతో సఖ్యము (ప్రేమతో) చేసితివి. అది నీ కార్యార్థమన్నచో నిజము కాదు (4)

శ్లో॥ తంత్వాఖిలాత్మదయితేశ్వరమాశ్రితానాం
సర్వార్థదం స్వకృతవిద్విసృజేత కోను ।
కో వా భజేత్కిమపి విస్మృతయేఽనుభూత్యై
కిం వా భవేన్న తవ పాదరజో జుషాన్నః ॥ 5

టీ:– అతస్త్వాం పరిత్యజ్య కో నామన్యత్సంశ్రయేదిత్యాహ–తమితి. తమేవం భూతం త్వాం కోను విసృజేత్ న భజేత్ కథంభూతః. స్వకృతవిత్ స్వేషు బలిప్రహ్లాదాదిషు త్వయా కృతమనుగ్రహం జానన్. యద్వా–స్వస్మిన్నేవాంతర్యామితయా కృతముపకారం విద్వాన్. తదేవాహ – అఖిలాత్మద్వయితేశ్వరం అఖిలస్య జగతః ఆత్మానం చేతయితారం ఆత్మత్వాదేవ దయితం ప్రేష్ఠం సుసేవ్యం ఈశ్వరత్వాదేవా వశ్యం

అందువలన నిన్ను పరిత్యజించి అన్యునెవడాశ్రయించుననుచున్నాడు. సర్వజగమునకు ఆత్మయూ చైతన్యము కలిగించువాడు. ప్రియుడును, సేవ్యుడును. తన్ను ఆశ్రయించిన వారికి అన్ని పురుషార్థముల నిచ్చువాడు. స్వీయులైన బలి ప్రహ్లాదాదుల యందు చేసిన అనుగ్రహము తెలిసియున్నవాడు ఎవడు నిన్ను భజింపకవీడును? నీ కంటే వ్యతిరేకమైన దేవతనుగాని, ధర్మజ్ఞానాది సాధనమునుగాని, ఐశ్వర్యము కొరకు, సంసారమునుండి మోక్షము కొరకు ఎవడు సేవించును అతి తుచ్ఛం నీ కంటే వేరైన స్వర్గాదికమును ఎవడు భజించును? నీ యొక్క పాదదూళి సేవనము చేయువారికి ఏది లభించకుండును?

అయ్యా! ఆ సాధనం లేక భోగమోక్షాదిఫలమెట్లగు అనగా

భజనీయం. కించ. ఆశ్రితానాం సర్వార్థదం తర్హి కింఫలోద్దేశే నాహం సేవ్యః. నహి నహి. కిమప్యతితుచ్ఛత్వాత్ త్వద్వ్యతిరిక్తం స్వర్గాది త్వయా దత్తమపి కోవా భజేత్. కథం భూతం తత్. యత్కేవలం భూత్యై ఇంద్రియభోగాయ అను అనంతరమేవ త్వద్విస్మృతయే భవతి - యద్వా. త్వద్వ్యతిరిక్తం కిమపి దేవతాంతరం ధర్మజ్ఞానాదిసాధనం వా భూత్యై ఐశ్వర్యాయ సంసారస్య విస్మృతయే మోక్షాయ వా. కో వా భజేత్. న కోఽపి నను తత్తత్సాధనం వినా భోగమోక్షాధిఫలం కథం స్యాత్తత్రాహ - కింవేతి. తదుక్తం. శ్లో. "యా వై సాధనసంపత్తిః పురుషార్థ చతుష్టయే, తయా వినా తదాప్నోతి నరో నారాయణాశ్రయ" ఇతి. 5

శ్లో॥ నైవోపయాన్త్యపచితం కవయస్తవేశ
బ్రహ్మాయుషాపి కృతమృద్ధముదస్స్మరంతః ।
యోఽంతర్బహి స్తనుభృతామశుభం
విధున్వన్నాచార్య చైత్యవపుషా స్వగతిం వ్యనక్తిః ॥ 6

టీ:- ఆస్తామన్యభజన వార్తా త్వత్కృతోపకారస్య త్వయ్యాత్మనివేదనేనైవ నిష్కృతిర్నాన్యథేత్యాహ-నేతి. అపచితిం ప్రత్యుపకారం ఆనృణ్యమితి యావత్. కవయో బ్రహ్మవిదోఽపి. నైవ ప్రాప్నువంతి. యతః త్వత్కృత ముపకారం స్మరంతః బుద్ధః ముదః ఉపచితపరామానందః. ఉపకారమే వాహ - యో భవాన్ బహిరాచార్యవపుషా శ్రీగురురూపేణ అంతశ్చై

చెప్పినాడు కింవా భవేత్ అని యావైసాధనసంపత్తిః పురుషార్థ చతుష్టయో తయా వినా తదాప్నోతి నరోనారాయణాశ్రయః అని పురుషార్థముల సాధనసంపత్తి ఏది కలదో అది లేకున్నను నారాయణుని ఆశ్రయించి నరుడు పురుషార్థ చతుష్టయమును పొందును. 5

ఇతర దేవతా భజన వార్త నట్లుండనిమ్ము. నీవు చేసిన ఉపకారమునకు ఆత్మ నివేదన చేయుటయే నిష్కృతిగాని, ఇతరముగా కాదు అనుచున్నాడు.

ఓ పరమేశ్వరా! నీచే చేయబడిన ఉపకారమును స్మరిస్తూ అభివృద్ధినొందిన పరమానందము కలిగిన వారగు బ్రహ్మవేత్తలు కూడా బ్రహ్మయొక్క ఆయుష్యము కలవారైననూ, వారిచే నీవు ప్రత్యుపకార మును అకృత్యమును ఏ మాత్రము పొందలేదు. శ్రీగురూపదేశమను అంతర్యామిరూపమున, నీవు జీవుల యొక్క లోపలి బయటి విషయ వాసనను తొలగించుచూ నిజరూపమును ప్రకటించుదువు. 6

తన్యవపుషా అంతర్యామిరూపేణ అశుభం విషయ వాసనాం విధున్వన్ నిరస్యన్. స్వగతి నిజరూపం. వ్యనక్తి ప్రకటయతి–తస్య తవ. 6

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఇత్యుద్ధవేన హ్యనురక్తచేతసా
పృష్టో జగత్క్రీడనకః స్వశక్తిభిః ।
గృహీతమూర్తిత్రయ ఈశ్వరేశ్వరో
జగాద సప్రేమ మనోహరస్మితః ॥ 7

టీ:– ఇతీతి. ఈశ్వరత్వే హేతుః జగత్క్రీడనకం క్రీడోపకరణం యస్య సః. నను జగత్సృష్ట్యాదినా బ్రహ్మేశానాదయః. క్రీడంతితత్రాహ– స్వశక్తిభిః సత్త్వాదిభిః. గృహీతం మూర్తిత్రయం యేన సః. సప్రేమ ప్రేమసహితం మనోహరం. స్మితం యస్య సః. సప్రేమ యథా భవతి తథా జగాదేతి వా. 7

**శ్రీశుకుడు ఈ విధముగా చెప్పుచున్నాడు**

ఇట్లు ఉద్ధవుడు అనురక్తచిత్తుడై తన్నాశ్రయించినంత మాత్రమున తన జ్ఞాన వీర్య సంపదాది శక్తులతో జగత్తునాటబంతిగా క్రీడించు కృష్ణుడు, త్రిగుణాత్మకులైన బ్రహ్మ విష్ణు రుద్రుల రూపము స్వీకరించి బ్రహ్మాది లోకపాలకులకు ప్రభువయిన కృష్ణుడు, మనోహర మయిన నవ్వుకలవాడై ప్రేమతో ఇట్లు చెప్పెను. 7

**శ్రీ కృష్ణ ఉవాచ**

శ్లో॥ హంతతే వర్ణయిష్యామి మమ ధర్మాన్ సుమంగళాన్ ।
యాన్ శ్రద్ధయాచరన్ మర్త్యో మృత్యుం జయతిదుర్జయమ్॥ 8

టీ:– హంతేతి. హంతేతి సహర్షం సంబోధనం సుమంగళాన్ సుఖ రూపాన్. మృత్యుం సంసారం దుర్జయమన్యై రూపాయైః. 8

**శ్రీభగవానుడు ఈ విధముగా చెప్పుచున్నాడు.**

ఓ ఉద్ధవా! సుఖస్వరూపములైన నా ధర్మములను నీకు తెలియచేయుచున్నాను. వీటిని తెలిసికొని శ్రద్ధగా ఆచరించినవారు ఇతర మార్గములతో జయింపశక్యము కాని సంసారమును జయించ గలరు. 8

శ్లో॥ కుర్యాత్సర్వాణికర్మాణి మదర్థం శనకైస్స్మరన్ ।
మయ్యర్పితమనోశ్చిత్తో మద్ధర్మాత్మ మనోరతిః ॥ 9

టీ:- ధర్మానేవాహ - త్రయోదశభిః. కుర్యాదితి. మాం స్మరన్ శనకైః అసంరంభతః. కుర్యాత్. తదాహ–మయీతి. మయి అర్పితే మనశ్చిత్తే సంకల్పానుసంధానాత్మకే యేన సః. ఆతఏవ ముద్ధర్మేష్వేవ ఆత్మమనసో రతి ర్యస్య సః. 9

ధర్మములనే పలుకుచున్నాడు పదమూడు శ్లోకములతో. నన్ను స్మరిస్తూ సంరంభము లేకుండగా నా యందు అర్పించబడిన సంకల్పాత్మకమైన మనస్సు, అనుసంధానాత్మకమైన చిత్తముకలవాడై నా యొక్క ధర్మములందు (ఆత్మకు) మనస్సున ప్రీతి కలవాడై అన్ని పనులను నా కొరకు చేయవలెను. 9

శ్లో॥ దేశాన్ పుణ్యాన్ శ్రయేన్నిత్యం మద్భక్తైస్సాధుభిశ్శ్రితాన్ ।
దేవాసుర మనుష్యేషు మద్భక్తాచరితాని చ ॥ 10

టీ:- దేశానితి. పుణ్యదేశలక్షణం మద్భక్తైరితి దేవాదిషు యే మద్భక్తాః తేషామాచరితాని కర్మాణి చాశ్రయేత్. 10

నా భక్తులైన సజ్జనులచేత ఆశ్రయింపబడిన పవిత్రములైన ప్రదేశములను ఎప్పుడు ఆశ్రయించవలెను. సేవించవలెను. దేవతలలో, రాక్షసులలో, మనుష్యులలోని నా భక్తులచే ఆచరింపబడిన కర్మలను గూడా ఆశ్రయించవలెను. 10

శ్లో॥ పృథక్సత్రేణవా మహ్యం వర్షయాత్రామహోత్సవాన్ ।
కారయేద్గీతనృత్యాద్యైర్మహారాజ విభూతిభిః ॥ 11

టీ:- పృథగితి. సత్రేణ సంభూయ వా. 11

ఒంటరిగాకాని, కొందరితో కలిసికాని నా కొరకున్నత గాన వాద్యములు మొదలగు మహారాజ భోగములతో ప్రతిసంవత్సరము మహాజన సముదాయముచే ఉత్సవములను చేయించవలెను. 11

శ్లో॥ మామేవ సర్వభూతేషు బహిరంతరపావృతం ।
ఈక్షేతాత్మని చాత్మానం యథా ఖమమరాశయః ॥ 12

టీ:- అంతరంగాం భక్తిమాహ. త్రిభిః. మామితి. సర్వభూతేష్వాత్మని చ ఆత్మాన మీశ్వరం స్థితం మామేవేక్షేత. కథమేకస్య సర్వేషు వృత్తిః తత్రాహ-బహిరంతః పూర్ణమిత్యర్థః. తత్కుతః. అపావృతం. అనావరణం తదపి కుతః. యథా ఖం అసంగత్వాదిత్యర్థః. 12

అంతరంగభక్తి మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు. నిర్మలాంతఃకరణుడు వెలుపల, లోపల ఆవరణరహితముగా నిండి యున్న ఆకాశమువలె, అన్ని ప్రాణులలో (ఆత్మయందు) ఈశ్వరునిగా ఉన్న నన్నే చూడవలెను. 12

శ్లో॥ ఇతి సర్వాణి భూతాని మద్భావేన మహామతే ।
సభాజయన్మన్యమానో జ్ఞానం కేవలమాశ్రితః ॥ 13

టీ:- ఇతీతి. హే మహామతే అతిప్రాజ్ఞ ఇతి అనేన ప్రకారేణ కేవలం జ్ఞానరూపాం దృష్టిమాశ్రితస్సన్ సర్వాణి భూతాని మద్భావేన మన్యమానః సభాజయన్ పండితో మత ఇత్యుత్తరేణాన్వయః. 13

ఓ ప్రాజ్ఞుడా! పైన చెప్పిన విధముగా జ్ఞానదృష్టిని ఆశ్రయించిన వాడై అన్ని ప్రాణులను నా స్వరూపముగా తలచి గౌరవించవలెను. అట్టివాడు పండితుడని ముందుశ్లోకముతో అన్వయము. 13

శ్లో॥ బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేఽర్కే స్ఫులింగకే ।
అక్రూరే క్రూరకే చైవ సమదృక్పండితో మతః ॥ 14

టీ:- నను ఉత్తమాధమేఽప్యేకరూపేణ సభాజనపాండిత్యమేవ స్యాత్ పూజ్యపూజాదివ్యతిక్రమాదిత్యాశంక్య తామేవ జ్ఞానదృష్టిం ప్రపంచయతి -బ్రాహ్మణ ఇతి. విషమేష్వపి సమదృక్ సమంమామేవ పశ్యన్. వైషమ్య

ఓయీ! ఉత్తముని అధముని ఒకే తీరుగా గౌరవించుట తగునా అను శంకకు సమాధానము చెప్పుచున్నాడు. అన్ని విధముల వైషమ్యము లలోగూడా సముడైన నన్ను చూచినవాడు సమాన గౌరవమీయ వచ్చును. ఆ వైషమ్యమును నాలుగు విధములుగా చూపుచున్నాడు. జాతి, క్రియా, గుణ, స్వభావములచే వీటిని వైషమ్యమును ఇచ్చుట

మేవ చతుర్ధా దర్శయతి-బ్రాహ్మణే పుల్కస ఇతి. జాతితో వైషమ్యం పుల్కసోఽంత్యజాతివిశేషః స్తేనే బ్రహ్మ స్వాపహారిణి బ్రహ్మణ్యే బ్రాహ్మణేభ్యో దాతరీతి కర్మతః. వైషమ్యం అర్కే స్ఫులింగక ఇతి గుణతః వైషమ్యం అక్రూరే శాంతేక్రూరే చేతి స్వభావతః వైషమ్యం. గౌతమేనాప్యుక్తం సమాసమాభ్యాం విషమసమే పూజాత ఇతి. స మయా పూజతః పూజాయా విషమే ప్రకారే కృతే అసమయా పూజతో పూజయాఃసమే ప్రకారే కృతే. స పూజకః ఐహికాదాముష్మికాచ్ఛ్రేయసో భ్రశ్యత ఇతి. అయం నియమః కర్మిష్వేవ నజ్ఞానిష్వితి తాత్పర్యం. 14

చెప్పుచున్నాడు. బ్రాహ్మణుడు, అంత్యజుడు వీరి విషయమున జాతి; బ్రాహ్మణధనమును అపహరించువాని విషయమున, బ్రాహ్మణునికి దానము చేయువాని విషయమున క్రియ; సూర్యుని విషయమున, అగ్ని కణ విషయమున గుణము? శాంతుని విషయమున, క్రూరుని విషయమున స్వభావము, ఈ విధముగా అన్ని వైషమ్యములలో నన్నే చూచువాడు పండితునిగా పరిగణించబడును. 14

శ్లో॥ నరేష్వభీక్ష్ణం మద్భావం పుంసో భావయతోఽచిరాత్ ।
స్పర్ధాసూయాతిరస్కారాస్సాహంకారా వియంతి హి ॥ 15

టీ:- నరేష్వీశ్వరదృష్టిం కుర్వతః సద్యః ఫలవిశేషమాహ-నరేష్వితి. సమోత్తమహీనేషు స్పర్ధాదయః. స్వస్మిన్నహంకారశ్చ హి నిశ్చితం వియంతి నశ్యంతి. 15

నరులయందు ఈశ్వరదృష్టి కలవారికి వెంటనే విశేషఫలము కలుగునని చెప్పుచున్నారు. మానవులయందు పదేపదే నా భావమును చింతించు పురుషునికి వెంటనే దేహాత్మాభిమానముతో కూడిన కలహము, గుణములయందు దోషము నారోపించు కోరికయైన అసూయ, అవమానములను నశించును కదా. 15

శ్లో॥ విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశ్యం వ్రీడాం చ దైహికీం ।
ప్రణమేద్దండవద్భూమా వాశ్వ చండాలగోఖరమ్ ॥ 16

టీ:- అతోఽంతర్యామీశ్వరదృష్ట్యా సర్వాన్ప్రణమేదిత్యాహ-విసృజ్యేతి. స్మయమానాన్ హసతః స్వాన్ సఖీన్ తథా దైహికీం దృశం. అహ

అంతర్యామియైన పరమాత్మను చూచుచు అందరికి నమస్కారము చేయవలయునని చెప్పుచున్నాడు. తనను చూచి పరిహసించు వారికి, తన మిత్రులకు, శునకము, చెండాలుడు, ఆవు, గాడిదల వరకు వ్యాపించిన ఈశ్వరకళకు నేను గొప్పవాడిని

ముత్తమః స తు నీచ ఇతి దృష్టిం. తయాదృశాయా వ్రీడా లజ్జా తాం చ విసృజ్య. శ్వచండాలాదీనభివ్యాప్య ప్రణమేత్. 16

వాడు నీచుడు అనుగర్వమును, దేహ సంబంధమైన సంకోచమును విడిచి నమస్కరించవలెను. 16

(ఈశ్వరో జీవకళయా ప్రవిష్టో భగవానితి)

శ్లో॥ యావత్సర్వేషు భూతేషు మద్భావో నోపజాయతే ।
తావదేవముపాసీతవాఙ్మనః కాయవృత్తిభిః ॥ 17

టీ:- ఏవం పంచభిశ్శ్లోకైః ఉక్తాయా స్సమదృష్టేరవధిమాహ-ద్వాభ్యాం యావదితి. 17

ఐదు శ్లోకములలో చెప్పిన సమదృష్టికి అవధిని రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు. ఎంతవరకు అన్ని ప్రాణులందు నా భావన కలుగదో అంతవరకు వాగ్వ్యాపారముచే కాయిక వ్యాపారముచే ఈ ప్రకారముగ ఉపాసించవలెను. 17

శ్లో॥ సర్వం బ్రహ్మాత్మకం తస్య విద్యయాత్మమనీషయా ।
పరపశ్యన్నుపరమేత్సర్వతో ముక్తబంధనః ॥ 18

టీ:- సర్వమితి. తస్య ఏవం కుర్వతః పుంసః సర్వం బ్రహ్మాత్మకమేవ భవతి. కుతః ఆత్మమనీషయా సర్వత్రేశ్వరదృష్ట్యా యా విద్యా తయా తతః పరితో బ్రహ్మైవ పశ్యన్ సర్వతః క్రియామాత్రాదుపరమేత్. 18

ఈ విధముగా ఆచరించువానికి బ్రహ్మవిద్యచే అంతయూ బ్రహ్మ స్వరూపముగా కనపడును. దానితో సంసారబంధములు తొలిగి అన్ని వ్యాపారములను వదిలివేయును. 18

శ్లో॥ అయం హి సర్వకల్పానాం సధ్రీచీనో మతో మమ ।
మద్భావస్సర్వభూతేషు మనోవాక్కాయ కర్మభిః ॥ 19

టీ:- కిమయమే వోపాయః. అస్తినాన్యోஉపీత్యపేక్షాయాం సంతి బహవః. సమీచీనస్త్వయమేత్యాహ-అయమితి. 19

ఇది ఒక్కటే ఉపాయమా? ఇతరోపాయములు కలవా? అనినచో చాలా కలవు. అన్నింటిలో ఇది శ్రేష్ఠము అని చెప్పుచున్నాడు. మనోవాక్కాయ వ్యాపారములతో అన్ని ప్రాణుల యందు నా భావనయే అన్ని ఉపాయములలో ఉత్తమమైన ఉపాయమని నా అభిమతము. 19

శ్లో॥ నహ్యంగోపక్రమే ధ్వంసో మద్ధర్మస్యోద్ధవాణ్వపి ।
మయా వ్యవసితస్సమ్యక్ నిర్గుణత్వాదనాశిషః ॥ 20

టీ:- భగవద్ధర్మ లక్ష్మణోపాయస్య సమీచీనత్వ మేవోపపాదయతి- ద్వాభ్యాం. నేతి. అంగ హే ఉద్ధవ అనాశిషో నిష్కామస్య మద్ధర్మస్య ఉపక్రమే సతి అణ్వపి ఈషదపి వైగుణ్యాదిభిర్నాశో నాస్త్యేవ యతో మయైవ నిర్గుణత్వాదయం ధర్మః సమ్యగ్వ్యవసితః నిర్ణీతః. న తు మన్వాదిముఖేన కథంచిత్. 20

భగవధర్మలక్షణోపాయమే మంచిదని రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు. ఓ ఉద్ధవా! ఈ భగవధర్మము నిష్కామము కావున దీనికి ఉపక్రమధ్వంసము లేదు. ఈ ఉపాయము నిర్గుణము కావున అన్నింటిలో శ్రేష్ఠమని నేనే నిర్ణయించితిని. 20

శ్లో॥ యోయో మయిపరే ధర్మః కల్ప్యతే నిష్ఫలాయ చేత్ ।
తదాయాసో నిరర్థస్స్యాద్భయాదేరివ సత్తమః ॥ 21

టీ:- కించ. య ఇతి. అయమర్థః కిం వక్తవ్యం మద్ధర్మస్య న ధ్వంస ఇతి. యతో లౌకికోఽపి యో యో నిరర్థః వ్యర్థః ఆయాసస్సోఽపి మయి వరే నిష్ఫలాయ చేత్ కల్ప్యతే నిష్కామనయా అర్పితశ్చేత్. తర్హి ధర్మఏవ స్యాత్ నిరర్థాయాసే దృష్టాంతః యథా భయశోకాదేర్హేతోః పలాయనాక్రందనాది క్లేశః తద్వత్. 21

ఓ ఉద్ధవా ! మనుజుడు భయముచేత చేయునవి, ప్రయోజనము లేనివి, వ్యర్థమైనటువంటివి అగు పనులు కూడా నిష్కామములై నాకు సమర్పించినవైనట్లయితే అవి ధర్మమైనవే అగును. (మానవులు వ్యర్థముగా చేయు చేష్టిత నిమిషాది వ్యాపారములు; భయము వలన చేయు పలాయనము; క్లేశము వలన చేయు ఆక్రందనము మొదలగు వ్యాపారములు కూడా ఫలాభిలాషలేక పరమాత్మయైన నా యందు అర్పణము చేసినచో అది అంతయూ ధర్మమే అగును) 21

శ్లో॥ ఏషా బుద్ధిమతాం బుద్ధిస్సామనీషా మనీషిణాం ।
యత్సత్యమనృతేనేహ మర్త్యేనాప్నోతి మామృతమ్ ॥ 22

టీ:- అతో మద్భజనమేవ బుద్ధేర్వివేకస్య మనీషాయాశ్చాతుర్యస్య చ ఫలమిత్యాహ-ఏషేతి. తామేవ దర్శయతి. సత్యమమృతం చ మామాం అనృతేన అసత్యేన మర్త్యేన వినాశినా మనుష్యాదిదేహేన ఇహ అస్మిన్నేవ జన్మని ప్రాప్నోతి యత్. సైవ బుద్ధిః. సా మనీషా చేతి బుద్ధిర్వివేకః. మనీషా చాతుర్యం. 22

నా భజనమే వివేకమునకు, చాతుర్యమునకు కుశలమని చెప్పుచున్నారు. సత్యమైన, నిత్యమైన నన్ను అసత్యమైన వినాశియైన మనుష్య దేహముచేత (ఈ జన్మలో) పొందుటయే వివేకము గలవారి వివేకము. ఇదియే చాతుర్యముగల వారి చాతుర్యము. 22

శ్లో॥ ఏషా తేఽభిహితస్సాధో బ్రహ్మవాదస్య సంగ్రహః ।
సమాసవ్యాస విధినా దేవానామపి దుర్గమః ॥ 23

శ్లో॥ అభీక్ష్ణశస్తే కథితం జ్ఞానం విస్పష్టయుక్తి మత్ ।
ఏతద్విజ్ఞాయ ముచ్యేత పురుషో నష్టసంశయః ॥ 24

టీ:- మహాప్రకరణార్థముపసంహరతి-ద్వాభ్యాం.ఏషఇతి. (23-24)

మహాప్రకరణార్థమును రెండు శ్లోకములతో ఉపసంహరించుచున్నాడు. ఓ సజ్జనుడా! దేవతలకు కూడా తెలియరాని వేదాంతార్థము సంగ్రహముగా, విస్తరముగ నీకు తెలిపితిని. 23

స్పష్టమైన యుక్తులుగల ఈ జ్ఞానమును నీకు మాటిమాటికి చెప్పితిని. దీనిని తెలుసుకొనిన మనుజుడు సంశయమును తొలిగి ముక్తుడగును. 24

శ్లో॥ సువివిక్తం తవప్రశ్నం మయైతదోఽవధారయేత్ ।
సనాతనం బ్రహ్మగుహ్యం పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥ 25

టీ:- కించ ఆస్తాం తావత్. జ్ఞానం ఏతదనుసంధాన కథన శ్రవణ

ఈ వేదాంతార్థమును అనుసంధానముచేసినవారికి, చెప్పినవారికి, వినినవారికి కూడా ఈ ఫలితమే కలుగునని నాలుగు శ్లోకములలో చెప్పుచున్నాడు. నీ ప్రశ్నకు సమాధానమును చక్కగా వివరించి

పరాణామప్యేతదేవ ఫలం భవతీత్యాహ–చతుర్భిః. సువివిక్తమితి. మయా సువివిక్తం ఏతత్ ఆఖ్యానమపి యోఽవధారయేత్ అనుసంధధ్యాత్ సః బ్రహ్మ గుహ్యం వేదేతి రహస్యం. 25

నాను. నేను వివరించిన ఈ వేదాంతరహస్యము అనుసంధా నము చేసినవారు వేదాంతార్థరహస్యమైన పరబ్రహ్మను తెలియగలరు. 25

శ్లో॥ య ఏతన్మభక్తేషు సంప్రదద్యాత్సుపుష్కలం ।
తస్యాహం బ్రహ్మదాయస్యదదామ్యాత్మానాత్మనః ॥ 26

టీ:– య ఇతి. సుపుష్కలం యథా భవతి తథా. బ్రహ్మదా యస్య బ్రహ్మదదాతీతి తథా తస్య జ్ఞానోపదేష్టుః. యద్వా. బ్రహ్మైవ దాయం వైకృతం సర్వస్వం విభాగలభ్యమితి తథా. తస్య పితుర్గురోరుపదేశలభ్యం, ఆత్మస్వరూపమేవ దాయశబ్దేనోక్తమితి భావః. 26

ఏవరైతే దీనిని స్పష్టముగా నా భక్తులకు ఉపదేశించునో ఆ బ్రహ్మోపదేశమును చేసివారికి ఆత్మలకు ఆత్మయైన పరమాత్మను ఇచ్చెదను. (పరమాత్మనైన నేను వశములో ఉండుదును). 26

శ్లో॥ య ఏతత్సమధీయీత పవిత్రం పరమం శుచి ।
స పూయేతాహరహర్మాం జ్ఞానదీపేన దర్శయన్ ॥ 27

ఆత్మశుద్ధి కరమైన, ఇతరులను శుద్ధిచేయగల ఈ జ్ఞానమును ఏవరైతే పెద్దగా చదువునో అతను ప్రతిక్షణము జ్ఞానజ్యోతిచే నన్ను చూచుచు శుద్ధిని పొందును. 27

శ్లో॥ య ఏతచ్ఛ్రద్ధయా నిత్యమవ్యగ్రశ్శృణుయాన్నరః ।
మయి భక్తిం పరాం కుర్వన్కర్మభిర్నస బధ్యతే ॥ 28

టీ:– య ఇతి. సమధీయీత ఉచ్చైః పఠేత్, పరమం శుచి అన్యేషామపి శోధకం స పూయేత శుధ్యేత్. (27–28)

ఏ మనుజుడు ఎప్పుడు సావధానమనస్కుడై ఈ వేదాంతార్థ రహస్యమును శ్రద్ధతో వినునో ఆ మనుజుడు నా యందు ఉత్తమమైన భక్తిని చేయుచూ కర్మలచే బద్ధుడుకాడు. 28

శ్లో॥ అప్యుద్ధవ త్వయా బ్రహ్మసఖే సముపధారితం ।
అపితే విగతో మోహశ్శోకశ్చాసౌ మనోభవః ॥ 29

టీ:- సమ్యగ్ జ్ఞానానుత్పత్తౌ పునరప్యుపదేక్ష్యామీత్యాశయేన పృచ్ఛతి-అపీతి. అపికిం. 29

దీనితో సమ్యజ్ఞానము కలుగనిచో మళ్ళీ ఉపదేశించెదనను చున్నాడు. ఓ మిత్రమా! ఉద్ధవా! నేను చెప్పిన బ్రహ్మమును నీవు చక్కగా నిర్ణయించి తెలుసుకొన గలగితివా? నీ మనస్సున జనించిన అజ్ఞానము, శోకము నీకు దూరమైనవా? 29

శ్లో॥ నైతత్త్వయా దాంభికాయ నాస్తికాయ శఠాయ చ ।
అశుశ్రూషోరభక్తాయ దుర్వినీతాయ దీయతామ్ ॥ 30

టీ:- ఉపధారితమాకలయ్యాహ-నైతదితి. శఠాయ వంచకాయ. 30

ఉద్ధవునకు బ్రహ్మస్వరూపము తెలిసినదని గ్రహించి చెప్పు చున్నాడు. ఓ ఉద్ధవా! నీవు తెలుసుకొన్న ఈ బ్రహ్మజ్ఞానము, వేషధారికి, (దాంభికునకు) నాస్తికునకు, వంచకునకు, శుశ్రూష చేయనివానికి, భక్తి లేనివానికి, చెడ్డఆలోచనలు కలవానికి, నీవు ఉపదేశించకుము. 30

శ్లో॥ ఏతైర్దోషైర్విహీనాయ బ్రహ్మణ్యాయ ప్రియాయ చ ।
సాధవే శుచయే బ్రూయద్భక్తిస్స్యాచ్ఛూద్రయోషితామ్ ॥ 31

టీ:- ఏతైరితి. శూద్రాణాం చ యోషితాం చ యది భక్తిః స్యాత్ తర్హి బ్రూయాత్. 31

ఈ పైన చెప్పిన దోషములు లేనివానికి, బ్రాహ్మణసేవ చేయు వానికి, సాధువునకు, నిర్మలచిత్తునకు, భక్తి సంపదలు కలిగినట్టి వానికి, భక్తి కలగియున్న శూద్రాదులకు, స్త్రీలకు ఉపదేశించవచ్చును. 31

శ్లో॥ నైతద్విజ్ఞాయ జిజ్ఞాసోర్జ్ఞాతవ్య మవశిష్యతే ।
పీత్వా పీయూషమమృతం పాతవ్యం నావశిష్యతే ॥ 32

టీ:- ఏతజ్జ్ఞానేన పుమాన్ కృతార్థో భవతీత్యాహ-నేతి. అత్ర దృష్టాంత మాహ - పీత్వేతి. పీయ్యూషం స్వాదు. 32

ఈ బ్రహ్మజ్ఞానముతో మానవుడు కృతార్థుడు అవుతాడని చెప్పుచున్నాడు. చాలా రుచిగల అమృతమును ఆస్వాదించిన తరువాత ఇంకను త్రాగదగినది ఏదియూ లేనట్లే ఈ బ్రహ్మతత్త్వము తెలుసుకొనిన జిజ్ఞాసువుకు తెలుసుకొనదగిన విషయము ఏదియునూ లేదు. 32

శ్లో॥ జ్ఞానే కర్మణి యోగే చ వార్తాయాం దండధారణే ।
యావానర్థోనృణాం తాత తావాంస్తేఽహం చతుర్విధః ॥ 33

టీ:- నను సంతి బహూని జ్ఞేయాని తత్తత్ఫలసాధనాని సత్యం సంత్యభక్తానాం భక్తస్య తు సర్వమహమేవ అతో మదేకశరణో భవేత్యాహ-జ్ఞానఇతి. జ్ఞానాదౌ యావాన్ధర్మాదిలక్షణశ్చతుర్విధోఽర్థః తావా న్ సర్వోఽపి తేఽహమేవ తత్రజ్ఞానే మోక్షః.కర్మాణి విహితే ధర్మః. స్వాభావికే తు కామః. యోగేత్వణిమాదిసిద్ధయః. వార్తాయాం కృష్యా దావర్థః దండనీతావైశ్వర్యమితి. సిద్ధ్యైశ్వర్యయోరపి కామాంతర్గతత్వాచ్చాతుర్విధ్యం. 33

ఆయా ఫలములను సాధించు సాధనములు చాలా కలవుకదా అనినచోనిజమే. భక్తులుకానివారికి చాలాఉన్నవి కాని భక్తులకు మాత్రము అన్నియూ నేనే. కావున నన్నే ఉపాసింపుము అనుచున్నారు. జ్ఞానమునందు, విహితకర్మయందు, యోగమునందు, అణిమాది సిద్ధులందు, కృష్యాదికమందు, ఆధిపత్యమునందు ఏ పురుషార్థములు కలవో అవి అన్నియునూ మనుష్యులకు ధర్మార్థ కామమోక్షములైన నాలుగునూ అవి నేనే. 33

శ్లో॥ మర్త్యో యదా త్యక్తసమస్తకర్మా
నివేదితాత్మా విచికీర్షితో మే ।
తదామృతత్వం ప్రతిపద్యమానో
మయాత్మభూయాయ చ కల్పతే వై ॥ 34

టీ:- కుత ఇత్యత ఆహ-మర్త్య ఇతి. యదాత్యక్తసమస్తకర్మా సన్ మే నివేదితాత్మా భవతి. తదా అసౌ మే విచికీర్షితః విశిష్టః కర్తుమిష్టో భవతి తతశ్చామృతత్వం మోక్షం ప్రతిపద్యమానో మయాత్మభూయాయ మమైక్యాయమత్సమానైశ్వర్యాయేతి యావత్. కల్పతే యోగ్యో భవతి. వై ధ్రువం. 34

ఎందులకనగా చెప్పుచున్నాడు. మనుజుడెప్పుడు కర్మలనన్నింటిని (త్యజించి) నాకు సమర్పించి ఆత్మతత్త్వము కలవాడగునో, అప్పుడు నాకు విశేషించి ధ్యానాధికమును చేయగోరు వాడగును. అందువలన మోక్షమును పొందుచున్నవాడై నాలో ఐక్యము కొరకు యోగ్యుడగుచున్నాడు. 34

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ స ఏవమాదర్శిత యోగమార్గ
స్తదోత్తమశ్లోకవచో నిశమ్య ।
బద్ధాంజలిః ప్రీత్యుపరుద్ధ కంఠో న
కించి దూచేஉ శ్రు పరిప్లుతాక్షః ॥ 35

టీ:- స ఇతి. ఆదర్శితో యోగమార్గో యస్మై సః. 35

శ్లో॥ విష్టభ్య చిత్తం ప్రణయావఘూర్ణం
ధైర్యేణ రాజన్ బహుమన్యమానః ।
కృతాంజలిః ప్రాహ యదు ప్రవీరం
శీర్ష్ణా స్పృశం స్తచ్చరణారవిందమ్ ॥ 36

టీ:- విష్టభ్యేతి. ప్రణయేనావఘూర్ణం క్షుభితం. చిత్తం. ధైర్యేణ. విష్టభ్య. బహుమాన్యమానః ఆత్మానం కృతార్థం మన్యమానః. 36

శ్రీశుకుడు ఈ విధముగా చెప్పచున్నాడు.

ఈ ప్రకారముగా తెలుపబడిన జ్ఞానయోగ మార్గము కలవాడైన ఆ ఉద్ధవుడు అప్పుడు పుణ్యశ్లోకుడైన శ్రీకృష్ణుని వచనమును విని, బద్ధాంజలియై, ప్రేమచే దగ్గుత్తికపడిన కంఠముగలవాడై, కన్నీట మునిగిన కన్నులు గలవాడై ఏమి మాట్లాడకుండెను. 35

ప్రేమచే కలతనొందిన చిత్తమును ధైర్యముచే చక్కదిద్ది, తనను కృతార్థునిగ తలంచి, భగవంతునికి (కృష్ణునికి) నమస్కరించి ఆయన పాదపద్మము లకు శిరముతాకించి ఇట్లనియే. 36

**ఉద్ధవ ఉవాచ**

శ్లో॥ విద్రావితో మోహమయోఽన్ధకారో
య ఆశ్రితో మేతవ సన్నిధానాత్ ।
విభావసోః కింను సమీపగస్య శీతం
తమోభీః ప్రభవంత్యజాద్య ॥ 37

టీ:- విద్రావిత ఇతి. మే మయా, యః ఆశ్రిత ఆసీత్. స తవ సన్నిధానేనైవ విద్రావితః. ప్రభవంతి కిన్ను బాధాయ సమర్థా భవంతి అజాద్య బ్రహ్మణోఽపి జనక. 37

ఉద్ధవుడు ఈ విధముగా అనుచున్నాడు.

ఓ బ్రహ్మజనకుడా! నిన్నాశ్రయించిన నా యొక్క అజ్ఞాన మయమైన చీకటి, నీ సన్నిధానము వలన తొలగిపోయినది. సూర్యుని సమీపానికి చేరిన వారికి చలి, చీకటిభయము కలుగవు కదా! 37

శ్లో॥ ప్రత్యర్పితో మే భవతానుకంపినా
తథాపి విజ్ఞానమయః ప్రదీపః ।
హిత్వా కృతజ్ఞస్తవ పాదమూలం
కోఽన్యత్సమీయాచ్ఛరణం త్వదీయమ్ ॥ 38

టీ:- కించ ప్రత్యర్పిత ఇతి. యద్యపి తవ సన్నిధానాదేవ గతః. తథాప్యనుకంపినా భవతా. విజ్ఞానమయః ప్రదీపశ్చ ప్రత్యర్పితః. స్వమాయయాపహృతః పునస్సమర్పితః. అతస్తవ కృతజ్ఞః యస్త్వయా కృతమనుగ్రహం జానాతి సకో నామ. త్వదీయం పాదమూలం హిత్వా. అన్యచ్ఛరణం సమీయాత్ ఆశ్రయేత్. 38

కనికరముగల నీచేత, భృత్యుడనైన నాకు ఆత్మానుభవ స్వరూపమైన దీపము, నీ మాయచే అపహరింపబడి, మరల సమర్పింప బడినది. నీకు కృతజ్ఞుడను. నీ అనుగ్రహము తెలిసిన ఎవడు నీ పాద మూలమును వీడి ఉతరమైన (ఇతరమైన) రక్షణను పొందును. 38

శ్లో॥ వృక్ణశ్చ మే సుదృఢస్స్నేహపాశో
దాశార్హ వృష్ణ్యంధకసాత్త్వతేషు ।
ప్రసారితస్సృష్టివివృద్ధయే త్వయా
స్వమాయయా హ్యాత్మసుబోధ హేతినా ॥ 39

టీ:- కించ. వృక్ణ ఇతి.దాశార్హాదిషు త్వయా యః స్వమాయయా స్నేహపాశః ప్రసారితః స త్వయైవాత్మజ్ఞానశస్త్రేణ వృక్ణః ఛిన్నః. 39

దాశార్హులు, వృష్ణివంశీయులు, అంధకవంశులు, సాత్వతులు అను ఈ నాలుగు తెగలయందు, నీ మాయచే ఏ స్నేహపాశము దృఢముగా నెలకొన్నదో ఆ పాశమును నీ ఆత్మజ్ఞానమను ఖడ్గముచే ఛేదించివేసితిని. 39

శ్లో॥ నమోఽస్తుతే మహాయోగిన్ ప్రపన్నమనుశాధిమాం ।
యథా త్వచ్చరణాంభోజే రతిస్స్యాదనపాయినీ ॥ 40

టీ:- ఏవం యద్యపి త్వయా బహూపకృతం. తదాప్యేతావత్ప్రార్థయ ఇత్యాహ–నమ ఇతి. అనుశాధి అనుశిక్షయ. అనుశాసనీయమిద మిత్యాహ - యథేతి. ముక్తావప్యనపాయినీ. 40

ఓ మహాయోగీ ! నీకు నమస్కారము. ముక్తికై నిన్ను శరణు పొందిన నాకు నీ పాదపద్మములందు విడిపోని ఆసక్తి కలుగునట్లు అనుగ్రహింపుము. 40

**శ్రీభగవానువాచ**

శ్లో॥ గచ్ఛోద్ధవమయా దిష్టో బదర్యాఖ్యం మమాశ్రమమ్ ।
తత్రమత్పాదతీర్థోదే స్నానోపస్పర్శనైశ్శుచిః ॥ 41

టీ:- తదుక్తమోమిత్యంగీకృత్య తథాపి మయాదిష్టో లోకసంగ్రహార్థ

**శ్రీకృష్ణుడు చెప్పెను.**

అతను చెప్పిన దానిని ఔనని అంగీకరించి ఐననూ నాచే ఆదేశింపబడినవాడవై లోకసంగ్రహము కొరకై దీనినాచరించమను చున్నాడు. ఉద్ధవా నేను చెప్పినట్లుగ నీవిప్పుడు నా ఆశ్రమమైన బదరికి వెళ్ళుము. అచట నా పాదతీర్థ జలమున స్నాన, ఆచమనాదుల

మేతావత్కుర్విత్యాహ-గచ్ఛేతి. ఆదిష్టో నియుక్తః మదాశ్రయమితి చ పాఠాంతరం. 41

శ్లో॥ ఈక్షయాలకనందాయా విధూతాశేషకల్మషః ।
వసానో వల్కలాన్యంగ వన్యభుక్సుఖ నిస్పృహః ॥ 42

టీ:- ఈక్షయేతి. స్నానాదేః పూర్వమేవ మత్పాదతీర్థోదకభూతాయా అలకనందాయా గంగాయా ఈక్షయా. వసానః పరిదధానః. 42

శ్లో॥ తితిక్షుర్ద్వంద్వమాత్రాణాం సుశీలః సంయతేంద్రియః ।
శాంతస్సమాహితాధియా జ్ఞానవిజ్ఞానసంయుతః ॥ 43

టీ:- తితిక్షురితి. ద్వంద్వమాత్రాణాం శీతోష్ణాదివిషయాణాం. సుశీలః ఆర్జవాదిస్వభావః. 43

శ్లో॥ మయాను శిక్షితం యత్తే వివిక్తమనుభావయన్ ।
మయ్యావేశితవాక్చిత్తోమద్ధర్మనిరతో భవాన్ ।
అతిక్రమ్య గతీ స్తిస్రో మా మేష్యతి తతః పరమ్ ॥ 44

టీ:- మయేతి. తే త్వయా. వివిక్తం సువిచారితం. తిస్రః త్రిగుణాత్మికాః గతీరతిక్రమ్య. 44

నిర్వర్తించి పరిశుద్ధుడవుకమ్ము. 41

నా పాద తీర్థమైన అలకనందయొక్క దర్శనము చేతనే పోగొట్ట బడిన అన్ని పాపములు కలవాడవై, నారవస్త్రములు ధరించుచూ కందమూలాలను భుజిస్తు, ఇంద్రియసుఖములందు కోరిక లేని వాడవు కమ్ము. 42

శీతోష్ణ సుఖదుఃఖాదుల సహించుచూ, ఋజుస్వభావము కల వాడవై, ఇంద్రియ నిగ్రహము కలవాడవై, కామాదివికార రహితుడవై, ఏకాగ్రచిత్తముతో ప్రత్యక్ష పరోక్ష జ్ఞానము కలవాడవు కమ్ము. 43

నాచేత నీకేది ఉపదేశింపబడినదో దానిని ఏకాంతముగా ధ్యానించుచూ నాయందుంచబడిన వాగాదీంద్రియములు, చిత్తము కలిగి నా భక్తియోగమునందు, ధర్మమునందు నిరతుడవై నీవు త్రిగుణములచే లభ్యములైన స్వర్గమర్త్య నరకములు కల దానిని దాటి దానికంటే ఇతరమైన నన్ను పొందగలవు. 44

శ్రీ శుక ఉవాచ

శ్లో॥ స ఏవముక్తో హరిమేధసోద్ధవః
ప్రదక్షిణం త్రిః పరిసృత్య పాదయోః ।
శిరో నిధాయా శ్రుకళాభిరార్ద్రధీ
ర్న్యషించ దద్వంద్వ పరోఽప్యక్రమే ॥ 45

టీ:- సఇతి. హరిమేధసా సంసారం హరతి మేధాయాస్య తేన శ్రీకృష్ణేన. అద్వంద్వపరోఽపి సుఖ దుఃఖ నిర్ముక్తోఽపి. అపక్రమే నిర్గమన సమయే. 45

శ్రీశుకుడు ఈ విధముగా చెప్పుచున్నాడు.

సంసార బంధమును హరించు మేధస్సుగల శ్రీకృష్ణుడిట్లు చెప్పగా ఆ ఉద్ధవుడు శ్రీకృష్ణునకు మూడుమార్లు ప్రదక్షిణచేసి మెత్తబడిన మనస్సు గలవాడై సుఖదుఃఖాది ద్వంద్వములను విడిచినవాడైననూ తాను భగవానుని వీడిపోవునపుడు ఆయన పాదములందు శిరుస్సుంచి వానిని కన్నీటి చుక్కలచే తడిపెను. 45

శ్లో॥ సుదుస్త్యజస్నేహవియోగకాతరోన
శక్నువం స్తం పరిహాతుమాతురః ।
కృచ్ఛ్రం యయౌ మూర్ధని భర్తృపాదుకే
బిభ్రన్నమస్కృత్య యయౌ పునః పునః ॥ 46

టీ:- కించ. సుదుస్త్యజేతి. సుదుస్త్యజః స్నేహో యస్మిన్ తేన వియోగాత్కాతరోఽతి భితః అత ఏవ తం పరిహాతుమశక్నువన్. ఆతురో విహ్వాలస్సన్ సకృచ్ఛ్రం కష్టం యయౌ ప్రాప. తతశ్చ. భర్తుః పాదుకే తేనైవ కృపయా దత్తే మూర్ధని బిభ్రత్. అతినిర్బంధరూపయా తదాజ్ఞయా తం పునః నమస్కృత్య యయౌ. అత్ర చ. శ్లో. పృష్ఠతోఽన్వగమం భర్తుః పాదవిశ్లేషణాక్షమః, ఇత్యాదితృతీయస్కంధోపక్ర మోక్తానుసారేణ

విడువరాని స్నేహమును విడుచుటకు బాధపడి శ్రీకృష్ణుని విడువలేనివాడై ఏమితోచక శిరస్సున స్వామి పాదుకలను ఉంచుకొని మాటిమాటికి నమస్కరించి అతి నిర్బంధమగు భగవదాజ్ఞచే వెళ్ళెను.

ఇచ్చట 'పృష్ఠతోన్వగమంభర్తుః పాదవిశ్లేషణాక్షమః' అని తృతీయ స్కంధోపక్రమమున చెప్పిన దానిననుసరించి బదరికాశ్రమమునకు వెళ్ళుచూ భగవంతుని ప్రభాసయాత్రను విని మెల్లగా వెనుక వెళ్ళినవాడై తన కులమునుపసంహరించిన భగవంతుడిని ఏకాన్తమున చూచి ఆ కాలమున వచ్చిన మైత్రేయునితో సహా మళ్ళీ కృపతో భగవదుపదిష్ట మయిన తత్త్వమునాకలింపచేసుకొని అతని ఆజ్ఞతో వెళ్ళెనని చూడవలెను. 46

బదరికాశ్రమం గచ్ఛన్ భగవతః ప్రభాసయాత్రాముపశ్రుత్య శనైః పృష్ఠతో గతస్సన్. ఉపసంహృత నిజకులం భగవంతమేకాంతే దృష్ట్వా తత్కాల ప్రాప్తేన మైత్రేయేణ సహ పునః కృపయా భగవతో పదిష్టం తత్త్వమాకల్య తదా తదనుజ్ఞాతో యయావితి ద్రష్టవ్యం. 46

శ్లో॥ తతస్తమంతర్హృది సన్నివేశ్యగతో
మహాభాగవతో విశాలాం ।
యథోపదిష్టాం జగదేకబంధునా
తపస్సమాస్థాయ హరేరగాద్గతిమ్ ॥ 47

టీ:- తత ఇతి. విశాలం బదరికాశ్రమం.గతస్సన్. శ్రీహరే ర్గతిమగాత్ కథం భూతాం. తేనైవ జగదేకబంధునా యథోపదిష్టాం. శ్లో.తదా మృతత్వం ప్రతిపద్యమానో మయాత్మభూయాయచ కల్పతేవై. శ్లో. "అతి వ్రజ్య గతీస్త్రిస్రోమామేష్యసి తతః పర" మిత్యేవముక్తప్రకారాం. 47

తరువాత శ్రీకృష్ణుని హృదయాంతరాళమున నిలుపుకొని భగవద్భక్తులలో ఉత్తముడైన ఆ ఉద్ధవుడు విశాలమైన బదరికాశ్రమ మును గూర్చి వెళ్ళినవాడై అక్కడ ప్రపంచమునకు ఒకేఒక బంధువైన పరమాత్మచే ఉపదేశింపబడిన (నాచే ప్రతిపాదించబడిన) అమృతమయి డాయెను. 47

శ్లో॥ య ఏతదానందసముద్రసంభృతం
జ్ఞానామృతం భాగవతాయ భాషితం ।
కృష్ణేన యోగేశ్వర సేవితాంఘ్రిణా
సచ్ఛ్రద్ధయాసేవ్య జగద్విముచ్యతే ॥ 48

యోగిపుంగవులచే సేవింపబడే, ఆనందసముద్రముతో సమమై నట్టి, భక్తిమార్గముచే ఈద గలిగిన జ్ఞానమనే అమృతమను పాదములు కలిగిన శ్రీకృష్ణునిచేత, భగవంతుని కొరకు చెప్పిన మార్గమును మంచి శ్రద్ధతో సేవించి సంసారమును విడుచుచున్నాడు. 48

టీ:- య ఇతి. ఆనంద సముద్రో భగవద్భక్తిమార్గ స్తస్మిన్ సంభృత

మేకీకృతం ఏతత్.యః సచ్ఛ్రద్ధయా ఆసేవ్య ఈషదపి సేవిత్వా వర్తతే. సముచ్యతఇతి కిమువక్తవ్యం తత్సంబంధేన జగదపి ముచ్యత ఇత్యర్థః (48)

శ్లో॥ భవభయమపహర్తుం జ్ఞానవిజ్ఞానసారం
నిగమకృదుపజహ్రే భృంగవద్వేదసారం ।
అమృతముదధితశ్చాపాయయద్భృత్యవర్గాన్
పురుష ఋషభమాద్యం కృష్ణ సంజ్ఞం నతోఽస్మి ॥ 49

టీ:- ఏవం కృతోపదేశం జగద్గురుం ప్రణమతి-భవభయమితి. భవః సంసారః భయం చ జరారోగాదినిమిత్తం తదుభయం. నివృత్తానాం చ భృత్యవర్గాణాం యథాయోగ్యమపహర్తుం యోఽమృతద్వయ ముపజహ్రే ఉద్ధృతవాన్ తదేవాహ-వేదసారమేకం. కింతత్. జ్ఞాన విజ్ఞానరూపం తత్సారం శ్రేష్ఠంచ. కథముపజహ్రే.భృంగవత్. భృంగో యథా పుష్పమకోపయన్నేవ అమృతహరతి. తథా స్వయం కృతవేదాను సారేణైవ ఉదధితశ్చైకం తచ్చోభయం యథాయథం భృత్యవర్గాన పాయ యత్.తం నతోఽస్మి. 49

శ్లో॥ యేనానుకంపితం విశ్వముద్ధవ ప్రశ్ననిర్ణయైః ।
తం వందే పరమానందం నందనందనరూపిణమ్ ॥

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే,**
**ఏకోనత్రింశోఽధ్యాయః**

జ్ఞానమతాన్ని ఉపదేశించిన జగద్గురువుకు నమస్కరించు చున్నాడు.

సంసారమను జరామరణాది భయమును పోగొట్టుటకు వేదకర్త అయిన భగవంతుడు తుమ్మెదలవలె వేదసారమును అంతర్బాహ్య జ్ఞాన, ఆత్మజ్ఞాన సారమైన అమృతమును సముద్రమునుండి తీసుకొని వచ్చెను. జ్ఞానులైన సంసారులైన సేవకులను త్రాగించెనో ఆద్యుడైన పురుషోత్తముడైన విష్ణువను సంజ్ఞ కల శ్రీకృష్ణుని నమస్కరించు చున్నాను. 49

ఉద్ధవుని ప్రశ్నలకు నిర్ణయములచే అనుకంపనచే సమాధానము లిడిన విశ్వరూపుడైన పరమానందుడు నందనందనరూపి అయిన శ్రీకృష్ణుని నమస్కరించుచున్నాడు.

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు**
**ఏకోనత్రింశోధ్యాయము సమాప్తము**

## త్రింశో౽ధ్యాయః

శ్లో॥ త్రిశేం తు ప్రాగుపక్షిప్తమౌసలచ్ఛలతో హరిః ।
స్వధామగంతు మన్విచ్ఛన్ న జహార నిజం కులమ్ ॥
వినాశాయ పురాఘోరముపక్షిప్తం హి మౌసలమ్ ।
కథావసానే తత్రైవ విశేషం పరిపృచ్ఛతి ॥

శ్రీపరీక్షిదువాచ

శ్లో॥ తతో మహాభాగవత ఉద్ధవే నిర్గతే వనం ।
ద్వారవత్యాం కిమకరోద్భగవాన్ భూతభావనః ॥ 1

టీ:- తత ఇతి. 1

శ్లో॥ బ్రహ్మశాపోపసంసృష్టే స్వకులే యాదవర్షభః ।
ప్రేయసీం సర్వనేత్రాణాం కథం స్వతనుమత్యజత్ ॥ 2

టీ:- బ్రహ్మేతి.బ్రహ్మశాపోపసంసృష్టే స్వకులే సతి. అయం భావః. న హి భగవతి బ్రహ్మశాపః ప్రభవతి యాదవత్వానుకరణాత్ సో౽పి కథం చిన్మాననీయః అతః కిమ కరోదితి. ఏతదుక్తం కథమత్యజదితి. సర్వనేత్రాణమితి సర్వేంద్రియోపలక్షణం. 2

## 30వ అధ్యాయము

ఈ ముప్పదవ అధ్యాయమందు పేర్కొను ముసలమను నెపముతో స్వధామమునకు వెళ్ళగోరి తన కాలమును ఉపసంహరించెను. ఈ కథావసానమున పరీక్షిత్తు విశేషము నడుగుచున్నాడు.

రాజు చెప్పుచున్నామడు.

గొప్ప భక్తుడైన ఉద్ధవుడు వనమునకు (బదరిక) వెళ్ళగా తరువాత భూతములను సృజించుచు భగవంతుడగు శ్రీకృష్ణుడేమి చేసెనని అడుగుచున్నాడు. 1

యాదవకులము బ్రాహ్మణశాపముచే ఆక్రమింపబడినది, కాని ఈ శాపము భగవంతుని విషయములో పొసగదు. అయిననూ తాను యాదవుడు కావున ఎట్లైన దానిని మన్నింపవలెనని యదుపుంగ వుడైన శ్రీకృష్ణుడు, అందరి ప్రాణుల, అన్ని ఇంద్రియములకు, చాలా ఇష్టమయిన తన శరీరమును ఎట్లు త్యజించెను. 2

శ్లో॥ ప్రత్యాకృష్టం నయనమబలా యత్రలగ్నం న శేకుః
కర్ణావిష్టం న సరతి తతో యత్సతామాత్మలగ్నం ।
యచ్ఛ్రీర్వాచాం జనయతి రతిం కీర్త్యమానా కవీనాం
దృష్ట్వా జిష్ణోర్యుధి రథగతం యచ్చతత్సామ్యమీయుః ॥ 3

టీ:- ఏతత్ప్రపంచయతి. ప్రత్యాకృష్టమితి. యస్మిన్ రూపే లగ్నం నయనం పరావర్తయితుమబలా న శేకుః. యచ్చకర్ణ రంధ్రేణ ప్రవిష్టం సత్సతామాత్మని లగ్నం లిఖితమివ తిష్ఠతి తతో న సరతి న నిర్గచ్ఛతి యస్య శ్రీః శోభా సంకీర్త్యమానా కవీనాం వాచాం రతిముల్లాస విశేషం జనయతి. తేషాం మానం జగత్పూజ్యతాం జనయతీతి కిమువక్తవ్యం యచ్చ విష్ణోరూపం జిష్ణోరర్జునస్య రథే స్థితం దృష్ట్వా యుధి మృతా స్తత్సామ్యం తత్సారూప్యం ఈయుః ప్రాపుః. త ద్రూపం కేన ప్రకారేణాత్య జదిత్యన్వయః. 3

దానినే వివరించుచున్నాడు. గోపికాస్త్రీలు ఏ కృష్ణుని స్వరూపము నందు లగ్నమయిన తమ నేత్రములను మరల్చుటకు సమర్థులు కాలేక పోయారో, కర్ణరంధ్రములద్వారా ప్రవేశించిన ఏ రూపము సాధువులకు హృదయమందులగ్నమై ఆ హృదయము నుండి తొలగిపోదో, ఏస్వరూప శోభ కొనియాడబడినదై కవుల యొక్క వాక్కులకు ఉల్లాసమును కలుగచేయునో , అర్జునుని రథమునందున్న శ్రీకృష్ణునియొక్క ఏ స్వరూపమును యుద్ధమునందు చూచి ఆ రూపసామ్యమును పొందిరి అటువంటి సర్వేంద్రియ ప్రీతికరమయిన శరీరమును భగవానుడు ఎట్లు వీడెను. అని పరీక్షిత్తు అడుగుచున్నాడు. 3

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ దివిభువ్యంతరిక్షే చ మహోత్పాతాన్ సముత్థితాన్ ।
దృష్ట్వాసీనాన్ సుధర్మాయాం కృష్ణః ప్రాహ యదూనిదమ్ ॥ 4

టీ:- దివీతి. దివి సూర్యపరివేషాదీన్. భువి భూకంపాదీన్. అంతరిక్షే దిగ్దాహాదీన్. మహోత్పాతాన్ స్వయమేవ ఉత్పాదితత్వాదన్యైః దుష్ప్ర తీకారాన్. 4

**శ్రీ శుకుడు అనుచున్నాడు**

ఆకాశమునందు సూర్యపరివేషాదులు, భూమియందు భూకంపాదులు, అంతరిక్షమునందు దిగ్దాహాదులు, గొప్ప ఉపద్రవములు పుట్టిన వానిని (స్వయముగా సృష్టించబడినవి గావున అన్యులచే శాంతింప చేయరానివి) చూచి శ్రీకృష్ణుడు సుధర్మయను సభయందు కూర్చొని యున్న యాదవులను గూర్చి ఈ విధముగా పలికెను. 4

**శ్రీకృష్ణ ఉవాచ**

శ్లో॥ ఏతే ఘోరామహోత్పాతా ద్వారవత్యాం యమకేతవః ।
శాపశ్చనః కులస్యాసీత్ బ్రాహ్మణేభ్యో దురత్యయః ।
మహూర్తమపి నస్థేయ మత్రనో యదుపుంగవాః ॥ 5

టీ:- ఏత ఇతి. యమస్య కేతవో ధ్వజా ఇవ మృత్యు సూచకా ఇత్యర్థః నః అస్మాభిః. 5

**శ్రీ కృష్ణుడు అనుచున్నాడు.**

భయంకరములైన గొప్పఉపద్రవాలు ద్వారకయందు యముని ధ్వజములై అనగా అపమృత్యుసూచకములై కన్పించుచున్నవి. మన కులమునకు బ్రాహ్మణుల వలన దాటరాని శాపము కలిగియుండెను. ఓ యాదవశ్రేష్ఠులారా! ఈ ద్వారకయందు మనము ఒక ముహూర్తము కూడా ఉండదగదు. 5

శ్లో॥ స్త్రియో బాలాశ్చ వృద్ధాశ్చ శంఖోద్ధారం వ్రజంత్వితః ।
వయం ప్రభాసం యాస్యామో యత్ర ప్రత్యక్సరస్వతీ ॥ 6

టీ:- స్త్రియ ఇతి. ప్రత్యక్పశ్చిమవాహినీ. 6

ఈ ద్వారక నుండి స్త్రీలు, బాలులు, వృద్ధులు శంఖద్వారమను ప్రదేశమునకు వెళ్ళండి. మేము సరస్వతీనది పశ్చిమముగా ప్రవహించు ప్రభాస తీర్థమునకు వెళ్ళెదము.. 6

శ్లో॥ తత్రాభిషిచ్య శుచయ ఉపోష్య సుసమాహితాః ।
దేవతాః పూజయిష్యామః స్నపనా లేపనార్హణైః ॥ 7

టీ:- తత్రేతి. అభిషిచ్య స్నాత్వా. 7

ఆ ప్రభాసతీర్థమున స్నానముచేసి పరిశుద్ధులమై ఉపవసించి నిశ్చల చిత్తులమై స్నాన చందనాది ఉపచారములతో దేవతలను పూజించెదము. 7

శ్లో॥ బ్రాహ్మణాంశ్చ మహాభాగాన్ కృతస్వస్త్యయనా వయం ।
గోభూ హిరణ్య వాసోభిర్గజాశ్వరథవేశ్మభిః ॥ 8

టీ:- బ్రాహ్మణానితి. బ్రాహ్మణాంశ్చ తైః కృతశాంతికాః సంతో గవాదిభిః పూజయిష్యామః. 8

పుణ్యాహవచనము మొదలగు శుభకర్మలనాచరించి పూజ్యులైన బ్రాహ్మణులను గోవులు, భూమి, బంగారము, వస్త్రములు, రథములు, గుర్రములు, ఏనుగులు, గృహములు మొదలగు వానితో పూజించెదము. 8

శ్లో॥ విధిరేష హ్యరిష్టఘ్నో మంగళాయనుమత్తమమ్ ।
దేవ ద్విజ గవాం పూజా భూతేషు పరమో భవః ॥ 9

టీ:- విధిరితి. విధిః ప్రకారః మంగళాయనం చ కించ. దేవ ద్విజ గవాం పూజా భవః ఉద్భవహేతుః. దేవలోకే పరమ ఉద్భవో భవిష్యతీతి భావః. 9

ఇట్లు పూజించిన అన్ని అశుభములు తొలగును. అన్నింటిలో ఉత్తమమైన శుభములు కలిగించు సాధనము ఇదియే. అన్ని ప్రాణులయందు దేవతలపూజ, బ్రాహ్మణపూజ, గోపూజ, దేవలోకమును (ఉత్తమగతుల) ఇచ్చును. 9

శ్లో॥ ఇతి సర్వే సమాకర్ణ్య యదువృద్ధా మధుద్విషః ।
తథేతి నౌభిరుత్తీర్య ప్రభాసం ప్రయయూ రథైః ॥ 10

టీ:- ఇతీతి. మధుద్విషో వాక్యమాకర్ణ్య తథేత్యభిన్నం ద్యనౌభిరుత్తీర్య సముద్రం. 10

యాదవుల పెద్దలందరూ కృష్ణుని మాటలువిని అట్లేయని అభినందించి నావలలో సముద్రమును దాటి రథములతో ప్రభాస తీర్థమునకు వెళ్ళిరి. 10

శ్లో॥ తస్మిన్ భగవతా దిష్టా యదుదేవేన యాదవాః ।
చక్రుః పరమయా భక్త్యా సర్వశ్రేయోపబృంహితమ్ ॥ 11

టీ:- తస్మిన్నితి. సర్వశ్రేయోపబృంహితమిత్యత్ర సంధిరార్షః. భగవతానుక్తైరపి సర్వైః శ్రేయోభిః సహితం చక్రుః. 11

యాదవ ప్రభువగు భగవంతునిచేత ఆజ్ఞాపించబడినవారై యాదవులు ఆ ప్రభాస తీర్థమందు నిశ్చలమైన భక్తితో అన్ని శుభములను పెంపొందించు పూజాదికమును చేసిరి. 11

శ్లో॥ తతస్తస్మిన్మహాపానం పపుర్మైరేయకం మధు ।
దిష్ట విభ్రంశిత ధియో యద్ద్రవైర్భ్రమతే మనః ॥ 12

టీ:- తత ఇతి. పీయత ఇతి పానం మైరేయకం మదిరావిశేషం మధుసురసందిష్టేన దైవేన విభ్రంశితధియః. నహ్యన్యథా తస్మింస్థానే తదుచితమితి భావః. యస్య ద్రవైరసైః. 12

పూజాదికాలు ముగిసిన తరువాత ఆ ప్రభాసతీర్థమునందు, దైవముచేత స్తిమితము పోగొట్టబడిన మతిగలవారై, ఏ మద్యపానము చేత మనస్సు భ్రమించునో అట్టి మైరేయక అను పేరుగల మద్యమును సేవించిరి. 12

శ్లో॥ మహాపానాభిమత్తానాం వీరాణాం దృప్తచేతసాం ।
కృష్ణమాయా విమూఢానాం సంఘర్షస్సుమహానభూత్ ॥ 13

టీ:- మహాపానేతి. శ్రీకృష్ణమాయా విమూఢానామితి ముఖ్యోహేతుః సంఘర్షః కలహః. 13

గొప్ప మద్యపానముచేత మత్తుగొనిన, పొగరుగొన్న చిత్తముగల, శ్రీకృష్ణుని మాయచేత మూఢులైన, వీరులైన ఆ యాదవులకు చాలా గొప్పనైన కలహము కలిగెను. కృష్ణమాయ విమూఢానామని ముఖ్య హేతువు. 13

శ్లో॥ యుయుధుః క్రోధసంరబ్ధా వేలాయా మాతతాయినః ।
ధనుర్భిరసిభిర్భల్లై ర్గదాభి స్తోమరేష్టిభిః ॥ 14

టీ:- యుయుధురితి. తతో యుయుధుశ్చ. 14

ఇట్లు క్రోధవశులైన యాదవులు కోపముతో ముందుకురుకువారై ఒకరితోనొకరు చంపువారై, ఆ గట్టునందు చాపములతో, ఖడ్గములతో, బల్లెములతో, గదలతో, చిల్లకొలలతో, ఈటెలతో యుద్ధము చేసిరి. 14

శ్లో॥ పతత్పతాకై రథకుంజరాదిభిః
ఖరోష్ట్రగోభిర్మహిషైర్నరైరపి ।
మిథస్సమేత్యాశ్వతరైశ్చ దుర్మదాన్యహన్
శరైర్దద్భిరివ ద్విపా వనే ॥ 15

ఎగురుచున్న ధ్వజములుగల రథములతో, ఏనుగులతో, గుఱ్ఱములతో, గాడిదలతో, ఒంటెలతో, ఎద్దులతో, దున్నలతో, నరవాహనములతో, కంచరగాడిదలతో పరస్పరము ఎదుర్కొని దుర్మధముతో అడవిలో ఏనుగులు దంతములతో చంపుకొనునట్లు బాణములతో ఒకరినొకరు చంపుకొనిరి. 15

టీ:- పతదితి. పతంత్యః ఇతస్తతశ్చలంత్యః పతాకా యేషు తైః రథాదిభిః. మిథస్సమేత్యన్యహన్ న్యఘ్నన్నిత్యర్థః. దద్భిర్దంతైరివ. 15

శ్లో॥ ప్రద్యుమ్నసాంబౌ యుధిరూఢ
మత్సరావక్రూర భోజా వనిరుద్ధసాత్యకీ ।
సుభద్ర సంగ్రామజితౌ సుదారుణౌ
గదౌ సుమిత్రాసురథౌ సమీయతుః ॥ 16

యుద్ధమునందు ఆ యాదవులు మత్సరము బాగా పెరుగగా, ప్రద్యుమ్న సాంబులు, అక్రూర భోజులు, అనిరుద్ధ సాత్వకులు, సుబద్ర సంగ్రామజిత్తులు, సుచారుగదులు, సుమిత్రాసురథులు, (అసురధా అనువాడైన కావచ్చును) ఎదుర్కొనిరి. 16

టీ:- మిథస్సమేత్యేత్యే తత్ప్రపంచయతి-చతుర్భిః. ప్రద్యుమ్నేతి. సుచారుగదౌ శ్రీకృష్ణస్య భ్రాతైకః పుత్రాశ్చాపరః తౌ సుమిత్రాసురథావితి దైర్ఘ్యమార్షం. సుమిత్రాసురథౌ అనురథనామా వా కశ్చిత్. 16

శ్లో॥ అన్యే చ యే వై భిషదోల్ముకాదయ
స్సహస్రజిచ్ఛతజిద్భానుముఖ్యాః ।
అన్యోన్య మాసాద్య మదాంధకారితా
జఘ్నుర్ముకుందేన విమోహితా భృశమ్ ॥ 17

టీ:- అన్య ఇతి. మదాంధేన మదతమసా బలాత్కారితాః. 17

ఇంకనూ భిషదుడు, ఉల్ముకుడు, సహస్రజిత్, శతజిత్, భానువు మొదలగువారు శ్రీకృష్ణునిచే బాగుగా మోహితులై మదాన్ధకారముచే బలాత్కరింపబడి ఒకరినొకరు ఎదుర్కొని చంపుకొనిరి. 17

శ్లో॥ దాశార్హ వృష్ణింధక భోజసాత్వతా
మధ్వర్బుధా మాధురశూరసేనాః ।
విసర్జనాః కుకురాః కుంతయశ్చ
మిథస్తతస్తేథ విసృజ్య సౌహృదమ్ ॥ 18

టీ:- దాశార్హేతి. దాశార్హాదయో నవ తద్వంశ్యాః అర్బుదాః మాధురాః శూరసేనాశ్చ తత్తద్దేశీయాః. 18

మదాన్ధకారముతో, వారింప శక్యముకానివారై దాశార్హ, భోజ, అంధక, వృష్ణి, సాత్వత, మాధుర, శూరసేన, వితర్జన, కుక్కుర, కుంతి, మద్ర, వంశీయులు స్నేహమును వదిలి ఒకరినొకరు చంపుకొనిరి. 18

శ్లో॥ పుత్రాస్త్వయుధ్యన్ పితృభిర్భ్రాతృభిశ్చ
స్వస్రీయ దౌహిత్ర పితృవ్య మాతులైః ।
మిత్రాణి మిత్రై స్సుహృదస్సుహృద్భిర్జ్ఞాతీం
స్త్వహన్ జ్ఞాతయ ఏవ మూఢాః ॥ 19

కొడుకులతో, తండ్రులతో, సోదరులతో, చెల్లెలు కొడుకులతో, కూతురికొడుకులతో, పినతండ్రులతో, మేనమామలతో యుద్ధముచేసిరి. మిత్రులు మిత్రులతో, ఆప్తులు ఆప్తులతో యుద్ధముచేసిరి. మూఢులైన దాయాదులు దాయాదులనే చంపిరి. 19

టీ:- పుత్రా ఇతి. భ్రాతృభిశ్చేతి భ్రాత్రాది శబ్దానాం సప్రతి యోగి వాచిత్వాత్ భ్రాతరో మాతులా ఇత్యాది జ్ఞేయం. మిత్రైశ్చ మిత్రాణి చ అహన్ హతవంతః. 19

శ్లో॥ శరేషు హీయమానేషు భజ్యమానేషు ధన్వసు ।
శస్త్రేషు క్షీయమాణేషు ముష్టిభిర్జహ్రురేరకాః ॥ 20

బాణాలు విరిగిపోగా, ఆయుధాలు క్షయింపగా పిడికిళ్ళతో తుంగపోచలను గ్రహించిరి. 20

టీ:- శరేష్వితి. ధన్వసు ధనుష్షు జహ్రుః జగృహుః. 20

శ్లో॥ తావజ్రకల్పాహ్య భవన్ పరిఘాముష్టిభిర్ధృతాః ।
జఘ్నుర్ద్విషంతః కృష్ణేన వార్యమాణాస్తు తం చ తే ॥ 21

పిడికిళ్ళతో తీసుకొనిన తుంగ పోచలే వజ్రసారములైన గుదియలుగ అయినవి. శ్రీకృష్ణుడు వారించిననూ శ్రీకృష్ణుని కొట్టిరి. 21

టీ:- తా ఇతి. పరిఘాః లోహదండాః భృతాః. తం చ శ్రీకృష్ణమపి. 21

శ్లో॥ ప్రత్యనీకం మన్యమానా బలభద్రం చ మోహితాః ।
హంతుం కృతధియో రాజన్నాపతన్నాతతాయినః ॥ 22

శ్రీకృష్ణునిమాయచే మోహితులైన ఆ యాదవులు బలరాముని కూ డా శత్రువుగా భావించి అతన్ని చంపుటకు సంకల్పించి మీది కురికిరి. 22

టీ:- ప్రత్యనీకమితి. ప్రత్యనీకం ప్రతిపక్షం. 22

శ్లో॥ అథ తావపి సంక్రుద్ధావుద్యమ్య కురనందన ।
ఏరకాముష్టిపరిఘౌ చరంతౌ జఘ్నతుర్యుధి ॥ 23

టీ:- అథేతి. ఏరకాముష్టిరూపౌ పరిఘావుద్యమ్య. 23

ఓ కురువంశీయా! అట్లు యాదవులు తమమీదికి రాగా వారుకూడా కోపించి తుంగపోచలను తీసుకొని యద్ధరంగమున తిరుగుతూ యాదవులను చంపసాగిరి. 23

శ్లో॥ బ్రహ్మశాపోపసృష్టానాం కృష్ణమాయావృతాత్మనాం ।
స్పర్ధాక్రోధః క్షయం నిన్యే వైణవోఽగ్నిర్యథావనమ్ ॥ 24

బ్రాహ్మణశాపము తాకిన శ్రీకృష్ణుని మాయతో మోహితులైన యాదవుల విరోధమువలన కలిగిన కోపము వెదురుపొదలో పుట్టిన అగ్ని ఆ వనమును నాశముచేసినట్లు వారి కులమును నాశము చేసెను. 24

శ్లో॥ ఏవం నష్టేషు సర్వేషు కులేషు స్వేషు కేశవః ।
అవతారితో భువోభార ఇతి మేనేఽవశేషితః ॥ 25

టీ:- బ్రహ్మశాపేతి. స్పర్ధానిమిత్తః క్రోధః క్షయం కులం క్షయం నిన్యే. (24-25)

ఈ ప్రకారముగా తనవారందరు నశించిన తరువాత శ్రీకృష్ణుడు నిశ్శేషముగా భూభారము తొలగించబడినదని తలచెను. 25

శ్లో॥ రామః సముద్రవేలాయాం యోగమాస్థాయ పౌరుషం ।
తత్యాజ మానుషం లోకం సంయోజ్యాత్మాన మాత్మని ॥ 26

టీ:- రామ ఇతి. పౌరుషం యోగం పరమపురుషధ్యానలక్షణం తమేవాహ-సంయోజ్యేతి. మానుషం లోకం భూలోకం మనుష్య రూపతాం వా. 26

బలరాముడు సముద్రవేలయందు చెలియలి కట్టమీద పరమ పురుషరూపధ్యానమగు యోగమును ఆశ్రయించి తన చిత్తమును పర మాత్మయందు చేర్చి భూలోకమును, మనుష్యరూపమును వదిలెను. (26)

శ్లో॥ రామనిర్వాణమాలోక్య భగవాన్ దేవకీసుతః ।
నిషసాద ధరోపస్థే తూష్ణీమాసాద్య పిప్పలమ్ ॥ 27

టీ:- రామేతి. ధరోపస్థే భూతలే. 27

దేవకీ పుత్రుడయిన శ్రీకృష్ణుడు రామనిర్యాణమును చూచి, రాగిచెట్టునాశ్రయించి భూమిమీద వట్టిగా కూర్చుండెను. 27

శ్లో॥ బిభ్రచ్చతుర్భుజం రూపం భ్రాజిష్ణు ప్రభయాస్వయా ।
దిశో వితిమిరాః కుర్వన్నిర్ధూమ ఇవ పావకః ॥ 28

టీ:- బిభ్రదితి. భ్రాజిష్ణురూపం. 28

తన దివ్యతేజముచే ప్రకాశించు నాలుగు భుజములుకల రూపమునుదాల్చి పొగలేని నిప్పువలె దిక్కులను ప్రకాశింపచేయుచున్న వాడై యుండెను. 28

శ్లో॥ శ్రీవత్సాంకం ఘనశ్యామం తప్తహాటకవర్చసం ।
కౌశేయాంబరయుగ్మేన పరివీతం సుమంగళమ్ ॥ 29

టీ:- తదేవానువర్ణయతి-చతుర్భిః. శ్రీవత్సాంకమితి. 29

దానినే అనువర్ణించుచున్నాడు. శ్రీవత్సమను పుట్టుమచ్చగల వానిని, మేఘమువలె నీలవర్ణుని, బంగారము వంటి తేజముగల పట్టు వస్త్రముల జంటచే కట్టబడిన వానిని శుభలక్షణములు కలవానిని. 29

శ్లో॥ సుందరస్మితవక్త్రాబ్జం నీలకుంతలమండితం ।
పుండరీకాభిరామాక్షం స్ఫురన్మకర కుండలమ్ ॥ 30

అందమైన చిరునవ్వుతో కూడిన ముఖపద్మముగల వానిని, నల్లని ముంగురులతో అలంకరించుకొన్న వానిని, ఎర్రని కమలముల వలె అందమైన కన్నులుకల వానిని, ప్రకాశించు మకరకుండలములు గల వానిని. 30

శ్లో॥ కటిసూత్ర బ్రహ్మసూత్ర కిరీట కటకాంగదైః ।
హారానుపుర ముద్రాభిః కౌస్తుభేన విరాజితమ్ ॥ 31

టీ:- సుందరేతి. సుందరస్మితం వక్త్రాబ్జం యస్మింస్తత్. పుండరీక వదభిరామే సుందరే అక్షిణీ యస్మిం స్తత్. (30-31)

మొలత్రాడు,జందెము,కిరీటము,కడియము,బాహుభూషణములు,ముత్యాలహారములు,అందెలు,ఉంగరము,కౌస్తుభమణి మొదలగు ఆభరణములచే శోభించువాడును. 31

శ్లో॥ వనమాలా పరీతాంగం మూర్తిమద్భిర్నిజాయుధైః ।
కృత్వోరౌ దక్షిణే పాదమాసీనం పంకజారుణమ్ ॥ 32

టీ:- వనమాలేతి. మనమాలయా పరీతాన్యంగాని యస్మిం స్తత్ నిజాయుధై శ్చక్రాదిభి ర్విరాజితం పంకజారుణం వామం పాదం దక్షిణే ఊరౌ కృత్వా ఆసీనం రూపం బిభ్రత్. 32

వనమాలచేత వ్యాపించబడిన సర్వాంగములు కల వానిని, మూర్తిమంతములైన సుదర్శనాధ్యాయుధములచేత కూడుకొనిన వానిని, పద్మములవలె నున్న ఎర్రని పాదమును కుడి తొడమీదనుంచుకొని కూర్చొనిన వానిని. (రూపమును ధరించిన వానిని అని పూర్వముతో అన్వయము) 32

శ్లో॥ ముసలావ శేషాయః ఖండ కృతేషు ర్లుబ్ధకోజరాః ।
మృగాస్యాకారచరణం వివ్యాధమృగశంకయా ॥ 33

జరుడను వేటగాడు రోకలి కొనయొక్క ఇనుపముక్కతో చేసుకొనబడిన బాణముతో, మృగాకారముతో ఉన్న శ్రీకృష్ణపాదమును మృగమనుకొని కొట్టెను. 33

శ్లో॥ చతుర్భుజం తం పురుషం దృష్ట్వా సకృతకిల్బిషః ।
భీతః పపాత శిరసా పాదయో రసురద్విషః ॥ 34

నాలుగు భుజములుకల ఆ కృష్ణునిచూచి వేటగాడు తానుచేసిన పొరపాటును తెలుసుకొని భయపడి ఆ కృష్ణుని పాదములపై పడెను. 34

శ్లో॥ అజానతా కృతమిదం పాపేన మధుసూదన ।
క్షంతుమర్హసి పాపస్య ఉత్తమశ్లోకమే ప్రభో ॥ 35

ఓ మధుసూధనా! ఉత్తమశ్లోకా! ఓప్రభూ! పాపినైన నేను తెలియక ఈ పాపము చేసినాను. ఈ పాపమును క్షమించు. 35

శ్లో॥ యస్యాను స్మరణం నృణామజ్ఞానధ్వాంతనాశనం ।
వదంతి తస్య తే విష్ణో మయా సాధుకృతం ప్రభో ॥ 36

ఓ ప్రభూ! విష్ణూ! ఒకసారి స్మరిస్తేనే అజ్ఞానాంధకారమును నశింపచేయు నీకు నేను గొప్ప అపచారము చేశాను. 36

శ్లో॥ తన్మాశుజ్జహి వైకుంఠపాప్మానం మృగలుబ్ధకం ।
యథా పునరహం త్వేవం నకుర్యాం సదతిక్రమమ్ ॥ 37

ఓ వైకుంఠా! నేను పాపిని, మృగములను వేటాడు వానిని మళ్ళీ ఇటువంటి పాపమును చేయకుండ నన్ను చంపుము. 37

టీ:- ముసలేతి. జరానామ కశ్చిల్లుబ్ధకో మృగయుః. మృగస్యాస్య మివాకారో యస్యతం చరణం. (33-37)

శ్లో॥ యస్యాత్మ యోగరచితం న విదుర్విరించో
రుద్రాదయోఽస్య తనయాః పతయో గిరాం యే ।
యన్మాయయా పిహిత దృష్టయ ఏతదంజః
కింతస్య తేవయమసద్గతయో గృణీమః ॥ 38

ఇది బ్రాహ్మణశాపమువలన జరిగినది. నీ పొరపాటు ఏమియూ లేదు. అనగా చెప్పుచున్నారు. నీమాయచేత కప్పివేయబడిన జ్ఞానము కల బ్రహ్మరుద్రాదులు, ఆ బ్రహ్మయొక్క పుత్రులు, వేదద్రష్టలుకూడా నీ యోగమాయచే నిర్మించిన ఈ జగమును తెలియలేరు. అటువంటి నీకు ఈ బ్రాహ్మణశాపమెంతటిది. అటువంటి నిన్ను అజ్ఞానులమైన మేము ఏమని వర్ణింతుము. 38

**శ్రీకృష్ణ ఉవాచ**

శ్లో॥ మాభైషీర్జర ఉత్తిష్ఠకామ ఏషకృతోహి మే ।
యాహి త్వం మదనుజ్ఞాతస్స్వర్గం సుకృతినాం పదమ్ ॥ 39

**భగవానుడు ఈ విధముగా అనుచున్నాడు.**

ఓ జరుడా! భయపడకు లెమ్ము. ఇది నా అభీష్టమే. అందువలన పుణ్యాత్ములు వెళ్ళదగు స్వర్గమునకు వెళ్ళుము. 39

టీ:- బ్రహ్మశాపకృతమేతత్. తస్మాన్న తవాపరాధ ఇతి చేదతఆహ - యస్యేతి. యస్య తవాత్మయోగరచితం స్వాధీన మాయా రచనాం విరించః అస్య తనయాః రుద్రాదయశ్చ యే చాన్యే గిరాం పతయో వేద ద్రష్టారః తేఽపి న విదుః తస్య తే అచింత్య మాయస్య ఏతత్. బ్రహ్మశాపాది. అంజసా అసద్గతయః పాపయోనయో వయం కిం గృణీమః కథం వర్ణయామః. అతస్తదాస్తాం అశు మాంజహీతి భావః. (38-39)

**శ్రీ శుక ఉవాచ**

శ్లో॥ ఇత్యాదిష్టో భగవతా కృష్ణేనేచ్ఛాశరీరిణా ।
త్రిః పరిక్రమ్య తం నత్వా విమానేన దివం యయౌ ॥ 40

**శ్రీశుకుడు అనుచున్నాడు**

తన ఇచ్ఛననుసరించి శరీరమును ధరించు భగవానుడగు శ్రీకృష్ణునిచే ఆజ్ఞాపించబడినవాడై, ఆ శ్రీకృష్ణునికి మూడుమార్లు ప్రదక్షిణము చేసి నమస్కరించి విమానములో స్వర్గమునకు వెళ్ళెను. 40

శ్లో॥ దారుకః కృష్ణపదవీ మన్విచ్ఛన్నధిగమ్యతామ్ ।
వాయుం తులసికామోదమాఘ్రాయాభి ముఖం యయౌ ॥ 41

శ్రీకృష్ణుని రథసారథియైన దారకుడు శ్రీకృష్ణునన్వేషించుచూ వచ్చువాడై, తులసిపరిమళముగల వాయువును ఆఘ్రాణించి శ్రీకృష్ణుని చూచి అతనికి ఎదురుగా వెళ్ళెను. 41

టీ:- ఇతీతి. ఇచ్ఛాశరీరిణేత్యస్యాయం భావః-శుద్ధసత్త్వమయీాం నిజాం శ్రీమూర్తిమంతర్ధాయతత్ర్పతికృత్యైవం విడంబనమాత్రమితి. ఏతదేవ స్ఫుటీకరిష్యతి-దేవాదయోబ్రహ్మముఖ్యా ఇత్యాదినా. (40-41)

శ్లో॥ తంతత్ర తిగ్మద్యుభిరాయుధైర్వృతం
హ్యశ్వత్థమూలే కృతకేతనం పతిం ।
స్నేహస్నుతాత్మానిపపాత పాదయో
రథాదవప్లుత్య సబాష్పలోచనః ॥ 42

అచ్చట రావిచెట్టు మొదట కూర్చుండి తీవ్రమైన కాంతులుగల చక్రాద్యాయుధములతో కూడుకున్న శ్రీకృష్ణభగవానుని చూచి ప్రేమచే ద్రవించిన మనస్సుగలవాడై రథమునుండి దుమికి నీరు నిండిన కనులతో శ్రీకృష్ణుని పాదములపై పడెను. 42

దారుక ఉవాచ

శ్లో॥ అపశ్యత స్తే చరణాంబుజం ప్రభోదృష్టిః
ప్రనష్టా తమసి ప్రవిష్టా ।
దిశోనజానే న లభే చ శాంతిం యథా
నిశాయా ముడుపే ప్రణష్టే ॥ 43

టీ:- తమితి తం పతిం తత్ర దృష్ట్వాతస్య పాదాయోర్నిపపాత. (42-43)

దారుకుడు అనుచున్నాడు

ఓ ప్రభూ! నీ పాదపద్మ దర్శనములేని నాకు చూపుపోయినది. చీకటే మిగిలినది. శాంతిని పొందలేకపోవుచున్నాను. రాత్రియందు చంద్రుడు అస్తమించగా దిక్కులు తెలియనట్లు నాకు దిక్కులుతెలియుట లేదు. 43

శ్లో॥ ఇతి బ్రువతి సూతే వైరథోగరుడలాంఛనః ।
ఖముత్పపాత రాజేంద్రశాశ్వధ్వజ ఉదీక్షతః ॥ 44

ఈ విధముగా సారథి పలుకుచుండగా గరుడధ్వజముతో, అశ్వములతో కూడిన రథము ఆకాశము పైకి ఎగిరెను. సూతుడు, రథము వైపు చూచెను. 44

శ్లో॥ తమన్వగచ్ఛన్ దివ్యాని విష్ణుప్రహరణాని చ ।
తేనాతి విస్మితాత్మానాం సూతమాహ జనార్దనః ॥ 45

సుదర్శనాయుధములు రథము వెంట వెళ్ళుటను చూచి ఆశ్చర్యము నొందిన సారథిని చూచి శ్రీకృష్ణుడు ఇట్లు చెప్పెను. 45

టీ:- ఇతీతి. ఉద్వీక్షమాణస్య సూతస్య సతః. (44-45)

శ్రీ భగవానువాచ

శ్రీకృష్ణుడు ఈ విధముగా పలికెను.

శ్లో॥ గచ్ఛ ద్వారవతీం సూతజ్ఞాతీనాం నిధనం మిథః ।
సంకర్షణస్య నిర్యాణం బంధుభ్యో బ్రూహిమద్ధశామ్ ॥ 46

సూతుడా! నీవు ద్వారకకు వెళ్ళి మన యాదవులందరు పరస్పరము కలహించుకొని మరణించుట, బలరాముడు తనువు చాలించుట నేనున్న స్థితి వీటినన్నిటిని అచట బంధువులకు చెప్పుము. (46)

శ్లో॥ ద్వారకాయాం చ న స్థేయం భవద్భిశ్చస్వబంధుభిః ।
మయా త్యక్తాం యదుపురీం సముద్రః ప్లావయిష్యతి ॥ 47

మన బంధువులు ద్వారకయందు ఉండరాదు. నేను విడచిన ఆ యాదవపురిని సముద్రుడు ముంచివేయును. 47

టీ:- గచ్ఛేతి. నిర్యాణం యోగమార్గేణ మద్దశామితి ఇచ్ఛా శరీరాభి ప్రాయేణ. (46-47)

శ్లో॥ స్వంస్వం పరిగ్రహం సర్వమాదాయ పితరౌ చ నః ।
అర్జునేనావితాస్సర్వ ఇంద్రప్రస్థం గమిష్యథ ॥ 48

టీ:- స్వమితి. అవితాః రక్ష్యమాణాః ఇంద్రప్రస్థం గమిష్యథేతి బ్రూహీతి పూర్వేణాన్వయః. 48

బంధువులందరు మా తల్లిదండ్రులను వారి వారి సమస్త వస్తు సామగ్రిని తీసుకొని అర్జునునిచే రక్షింపబడువారై ఇంద్రప్రస్థ నగరమునకు వెళ్ళండి. 48

శ్లో॥ త్వంతు మద్ధర్మ మాస్థాయ జ్ఞాననిష్ఠఉపేక్షకః ।
మన్మాయా రచితామేతాం విజ్ఞాయోపశమం వ్రజ ॥ 49

టీ:- త్వమితి. మన్మాయారచితామేతాం విజ్ఞాయేతి నిజశ్రీ మూర్తేరంతర్హితత్వాత్ వృథా శోకం మాకుర్విత్యర్థః. 49

నీవు మాత్రము నాయందు భక్తి నిలిపి జ్ఞాననిష్ఠ కలవాడవై, ఉదాసీనుడవై, ఇది అంతా నా మాయచే రచింపబడినది (ఈ విద్యా విషయము) అని తెలుసుకొని మనశ్శాంతిని పొందుము. 49

**శ్రీశుక ఉవాచ**

శ్లో॥ ఇత్యుక్తస్తంపరిక్రమ్య నత్వా కృష్ణం పునః పునః ।
తత్పాదౌ శీర్ష్ణ్యుపాధాయ దుర్మనాః ప్రయయౌ పురీమ్ ॥ 50

టీ:- ఇతీతి. కులస్య వినిష్టత్వాత్ దుర్మనాః. 50

**శ్రీశుకుడు అనుచున్నాడు.**

ఆ భగవానుడు ఇట్లు చెప్పగా విన్న దారకుడు శ్రీకృష్ణునికి ప్రదక్షిణము చేసి మళ్ళీమళ్ళీ మ్రొక్కి ఆయన పాదములను శిరమున ఉంచుకొని యాదవకులము నశించినదని మనఃక్షోభము కలవాడై ద్వారకాపురికి పోయెను. 50

**శ్రీ మద్భాగవతే, మహాపురాణే ఏకాదశస్కంధే, త్రింశోఽధ్యాయః**

**అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు త్రింశోధ్యాయము సమాప్తము**

## ఏకత్రింశోఽధ్యాయః

శ్లో॥ ఏక త్రింశే స్వకం ధామ జగామ భగవానితః ।
తవేవానుయయుః ప్రీత్యా వసుదేవాదయః స్తతః ॥

దేవాన్యదూన్విధాయాదౌ భూయౌ దేవాన్ విధాయ తాన్ ।
శ్రీకృష్ణస్స్వేచ్ఛయా ధామస్వతన్వైవ సమావిశత్ ॥

శ్రీశుక ఉవాచ

శ్లో॥ అథతత్రాగమద్బ్రహ్మాభవాన్యా చ సమం భవః ।
మహేంద్ర ప్రముఖా దేవాః మునయస్సప్రజేశ్వరాః ॥ 1

టీ:- అథేతి. మునయః సనకాదయః.ప్రజేశ్వరా మరీచ్యాదయః. 1

శ్లో॥ పితరస్సిద్ధగంధర్వా విద్యాధర మహోరగాః ।
చారణా యక్ష రక్షాంసి కిన్నరాప్సరసోద్విజాః ॥ 2

టీ:- పితరఇతి. ద్విజాః గరుడలోకవాసినః పక్షిణః. మైత్రేయాదయో వా. 2

## 31వ అధ్యాయము

ఈ ముప్పది ఒకటవ అధ్యాయమున శ్రీకృష్ణుడుతన ధామమునకు వెళ్ళవలెనని అనుకొనుట, వసుదేవుడు మొదలైనవారు ప్రీతితో అతనిని అనుసరించి వెళ్ళుట, దేవతలను యాదవులుగాచేసి తరువాత యాదవుల ను దేవతలుగాచేసి, శ్రీకృష్ణుడు స్వేచ్ఛగా తన తనువుతోడనే తన ధామమును చేరుట చెప్పబడును.

అంతట బ్రహ్మ, పార్వతితోకూడినపరమేశ్వరుడు, మహేంద్రాది దేవతలు, సనకాదిఋషులు, సమస్త ప్రజాదిపతులును శ్రీకృష్ణుడు ఉన్న ప్రదేశమునకు వెడలిరి. 1

పితరులు సిద్ధులు, గంధర్వులు, విధ్యాధర, మహోరగులు చారణ, యక్ష, రాక్షసులు కిన్నరాప్సరసలు ద్విజులు. 2

శ్లో॥ ద్రష్టుకామా భగవతో నిర్యాణం పరమోత్సుకాః ।
గాయంతశ్చ గృణంతశ్చ శౌరేః న కర్మాణి జన్మ చ ॥ 3

టీ:- ద్రష్టుకామా ఇతి. భగవతో నిర్యాణం ద్రష్టుకామాస్సంతః పరమోత్సుకాస్తత్రాగమన్ . 3

భగవత్కృష్ణ నిర్యాణము చూడగోరినవారై అత్యుత్సాహముతో శౌరి అయిన కృష్ణుని కర్మలు, జన్మను గానము చేస్తూ స్తుతిస్తూ అక్కడకు వచ్చిరి. 3

శ్లో॥ వవృర్షుః పుష్పవర్షాణి విమానావళిభిర్నభః ।
కుర్వంతస్సంకులం రాజన్ భక్త్యా పరమయాయుతాః ॥ 4

టీ:- తేషామౌత్సుక్య కృతం మహోత్సవమాహ -సార్ధేన. గాయంత ఇతి. 4

విమాన పంక్తులచే ఆకాశమును కిక్కిరిసినట్లుగా చేయుచూ మిక్కిలి భక్తితో కూడినవారై పుష్పవృష్టిని కురిపించిరి. 4

శ్లో॥ భగవానపి తాన్వీక్ష్య విభూతీరాత్మనో విభుః ।
సంయోజ్యాత్మని చాత్మానం పద్మనేత్రేన్యమీలయత్ ॥ 5

టీ:- భగవానితి. విభూతీః ఇంద్రాదీంశ్చ. పద్మనేత్రే న్యమీలయదిత్యత్రాయం భావః పూర్వం బ్రహ్మాదిభిః.శ్లో. "సలోకాన్ లోకపాలాన్నః పాహి వైకుంఠకింకరాని" తి ప్రార్థితత్వాత్. తదిదానీం చ స్వం స్వం లోకం ప్రతినేతుమాగతత్వాత్, తత్తల్లోకానాం వైకుంఠపురమార్గత్వాచ్చ. బహుషు చ తేషు దాక్షిణ్యాత్తాన్వంచయితుం సమాధిమివ కుర్వన్నేత్రే న్యమీల యదితి. 5

సర్వజ్ఞుడైన కృష్ణభగవానుడు తన యొక్క విభూతి స్వరూపులైన ఇంద్రాది దేవతలను చూచి, తన ఆత్మను అనగా తన విష్ణ్వంశను తనలో కలిపి కమలములవంటి తన నేత్రములను మూసెను. ముకుళింప చేసెను. ఇచట నేత్రములు ముకుళింపచేయుట పూర్వము బ్రహ్మాది దేవతలను 'సలోకాన్లోకపాలాన్నః పాహివైకుంఠ కింకరాన్' నీకింకరులమైన మమ్ములను కాపాడుము అని ప్రార్థించుట వలన వారందరూ, తమ లోకములు వైకుంఠ నగరమునకు పోవు దారిలో ఉన్నందున భగవంతుని తమ లోకములకు తోడ్కొని వెళ్ళుటకు ప్రార్థించిరి. ఆ దేవతలయందు దయగల వాడగుటచేత వారిని చూచి వారి ప్రార్థనను ఆమోదించవలయును కావున వారిని వంచించుటకు కనుల ముకుళింప చేసెను అని తెలియవలెను. 5

శ్లో॥ లోకాభిరామాం స్వతనుం ధారణాధ్యాన మంగళమ్ ।
యోగధారణయాగ్నేయ్యాఽదగ్ధ్వాధామావిశత్స్వకమ్ ॥ 6

టీ:- యోగినామివ స్వచ్ఛంద మృత్యుభ్రమం వారయతి - లోకాభిరామామితి. అయమర్థః యోగినో హి స్వచ్ఛందమృత్యవః స్వతనుమాగ్నేయ్యా యోగధారణాయా దగ్ధ్వా లోకాంతరం ప్రవిశంతి. భగవాంస్తు స తథా. కింతు. అదగ్ధైవ స్వతనుసహిత ఏవ స్వకం ధామ శ్రీవైకుంఠాఖ్యమవిశత్ తత్ర హేతుః లోకాభిరామభిరామః అభితో రమణం స్థితిర్యస్యాంతాం. జగదాశ్రయత్వేన జగతోఽపి దాహ ప్రసంగాదిత్యర్థః కించ. ధారణాయా ధ్యానస్య చ మంగళం శోభనం విషయం ఇతరథా. తయో ర్నిర్విషయత్వం స్యాత్. దృశ్యతే చాద్యాప్యు పాసకానాం తథైవ తద్రూప సాక్షాత్కారః ఫలప్రాప్తిశ్చేతిభావః. ఇచ్ఛా శరీరాభిప్రాయేణ యథా శ్రుత మేవాస్తు. తత్రాఽపి లోకాభిరామ మిత్యాది విశేషణానర్థక్య ప్రసంగాత్. తదప్యదగ్ధ్వా తిరోధాయ నిర్గత ఇత్యేవ సాంప్రతం. 6

యోగులకువలె స్వచ్ఛంద మృత్యువును భగవానుడు కూడా పొందునను భ్రమను వారించుచున్నాడు. సకల లోకజీవులకు మనోహరమైనట్టి మనోధారణ ధ్యానములచే శుభకరమయిన తన శరీరము అగ్నిప్రభయై కనబడు యోగశక్తిచే దహింపబడకయే తనకు సంబంధించిన వైకుంఠమును ప్రవేశించెను. ఇది అర్థము. యోగులు స్వచ్ఛంద మరణము కలవారు. తమ శరీరమును ఆగ్నేయీ యోగ ధారణచే దహింపచేసి లోకాంతరమును ప్రవేశించెదరు. భగవంతుడు అట్లుకాదు. తన శరీరమును దగ్ధము చేసుకొనకయే తన ధామ అయిన వైకుంఠానికి ప్రవేశించెను. ఇచట హేతువు లోకాభిరామ అని, లోకములకు అంతటా రమణస్థితి దేనికో దానిని జగదాశ్రయమైనందున జగత్తునకు దాహప్రసంగము వచ్చును అని అర్థము. (మరియూ ధారణచే ధ్యానముయొక్క మంగళము శోభనము, విషయము వేరుగా అయిన నేమి. అనగా ఆ రెండింటికి నిర్విషయత్వము చెప్పవలసి వచ్చును). నేటివరకునూ ఉపాసకుల విషయమున తద్రూప సాక్షాత్కారము మరియు ఫలప్రాప్తి కనబడుచున్నది అని భావము. ఇచ్ఛాశరీరాభిప్రాయముతోనైన యుదాశృతమైన కావచ్చును. అక్కడకూడా లోకాభిరామం విద్యాది విశేషణములకు అనర్థ్యప్రసంగము వాటిల్లుతుందనగా అయినను (అదగ్ధ్వాతిరోధాయనిర్గత) దహించక తిరోధానముచెంది నిర్గతుడైనాడనునదే సాంప్రతమై యున్నది. 6

శ్లో॥ దివిదుందుభయో నేదుః పేతుస్సుమనసశ్చ ఖాత్ ।
సత్యం ధర్మోధృతిర్భూమేః కీర్తిశ్రీశ్చాపితం యయుః ॥ 7

టీ:- తదాతు స్వమేవ లోకమాగమిష్యతీతి సంభ్రమేణ దేవాదికృతః సర్వతో దుందుభినాదపుష్పవృష్ట్యాదిమహోత్సవోఽభవదిత్యాహ-దివీతి. భూమేస్సకాశాత్ తం శ్రీకృష్ణ మనుయయుః. 7

వెళ్ళిన భగవంతుడు తమలోకానికే వచ్చుచున్నాడని, దేవతలు దేవదుందుభులు మ్రోగించిరి, పుష్పవృష్టిని కురిపించిరి. మహోత్సవ మాయె ననుచున్నాడు. స్వర్గమున దేవదుందుభులు మోగినవి. ఆకాశమునుండి పుష్పవృష్టి కురిసెను. ఈ భూమినుండి సత్యము, ధర్మము, ధృతి, కీర్తి, శ్రేయస్సు మొదలైనవి శ్రీకృష్ణననుసరించి వైకుంఠమునకు పోయినవి. 7

శ్లో॥ దేవాదయో బ్రహ్మముఖ్యానవిశంతం స్వధామని ।
అవిజ్ఞాత గతిం కృష్ణం దదృశుశ్చాతివిస్మితాః ॥ 8

టీ:- దేవాదాయ ఇతి. తదా శ్రీకృష్ణేఽంవిర్భూతే సతి. కుతోగత ఇతి వితర్కయంతోఽపి బ్రహ్మముఖ్యా దేవాదయః, స్వధామని విశంతం శ్రీకృష్ణం న దదృశుః. తత్ర హేతుః - అవిజ్ఞాతగతమితి. చిరాత్క్వచిద్ద దృశుశ్చ తతోఽతి విస్మితా బభూవురిత్యర్థః. 8

బ్రహ్మ, ఇంద్రాదిదేవతలు వైకుంఠములో ప్రవేశించుచున్న శ్రీకృష్ణపరమాత్మను చూడలేకపోయిరి. ఆయన గమనము తెలిసి కొనుటకు ఎవరికినీ సాధ్యము కాదు కనుక వారు ఆయనను దర్శించుకొనలేకపోయిరి. కాని కొందరు ఆయనను దర్శించుకొన గలిగిరి. ఇది చూచి దేవతలు ఆశ్చర్యచకితులైరి. 8

శ్లో॥ సౌదామిన్యా యథాకాశే యాంత్యాహిత్వాభ్రమండలమ్ ।
గతిర్న లక్ష్యతే మర్త్యైస్తథా కృష్ణస్య దైవతైః ॥ 9

టీ:- అవిజ్ఞాతగతిత్వం దృష్టాంతేన స్పష్టయతి-సౌదామిన్యాఇతి. సౌదామిన్యా గతిర్యథా మర్త్యైర్న లక్షతే. దేవైస్తు లక్ష్యతే తథా అభ్రమండలం హిత్వా గచ్ఛతః శ్రీకృష్ణస్య దేవైరపి న లక్ష్యతే. కింతు. తత్పార్షదైరేవ దృశ్యత ఇత్యర్థః. (9-10)

అవిజ్ఞాతగతిని దృష్టాంతముతో స్పష్టము చేయుచున్నాడు. ఏ విధముగా ఆకాశమునందు మేఘమండలాన్ని వీడి వెళ్ళుచున్న మెరుపుయొక్క గమనము, వెళ్ళిపోవునట్టి విధము మానవులచే చూడబడుటలేదో, దేవతలచేత చూడబడుతుందో, అట్లే భూమండలాన్ని వదిలి వెళ్ళుతున్న కృష్ణుని గతిని దేవతలు చూడలేకపోయిరి. పార్షదులు మాత్రము చూసిరి. 9

శ్లో॥ బ్రహ్మరుద్రాదయస్తేతుదృష్ట్వా యోగగతిం హరేః ।
విస్మితా స్తంప్రశంసంత స్స్వంస్వం ధామాగమన్నృప ॥ 10

ఓ రాజా! బ్రహ్మ, రుద్ర, ఇంద్రులు మొదలైనవారు, (దేవతలందరూ) యోగశక్తిచే స్వస్థలమయిన వైకుంఠమునకు వెళ్ళుచున్న శ్రీహరిని కానక, ఆశ్చర్యమునుచెందినవారై ఆ పరమాత్మను ప్రశంసిస్తూ వారి వారి స్థానములకు వెళ్ళిరి. 10

శ్లో॥ రాజన్పరస్య తనుభృజ్జననాప్యయేహా
మాయావిడంబనమవేహి యథా నటస్య ।
సృష్ట్వాత్మ నేదమనువిశ్య విహృత్యచాంతే
సంహృత్య చాత్మ మహిమోపరతస్స ఆస్తే ॥ 11

టీ:- అభిప్రాయా పరిజ్ఞానతః ప్రథమం క్లిష్టం. దృష్టాంతేన స్పష్టముక్తే హృష్టం దృష్ట్వా. పునస్తమేవార్థం ప్రపంచయతి–త్రిభిః. రాజన్నితి. పరస్య సర్వకారణస్య. తనుభృత్సు యాదవాదిషు జననాప్యయేహా ఆవిర్భావ తిరోభావచేష్టాః మాయయా విడంబనం అనుకరణమాత్రమవేహి నటో యథా అవికృత ఏవ నానారూపైః జన్మాదీన్ విడంబయతి తద్వత్. ఆస్తాం తావద్యాదవాదిషు జన్మాదిశంకా. యతో విశ్వసర్గనిరోధాదిష్వప్య సావకృతఏవాస్త ఇత్యాహ–సృష్ట్వేతి. ఆత్మనా స్వయమేవేదం జగత్సృష్ట్వా, అంతర్యామిత్వేనానువిశ్య. తత్ర విహృత్య క్రీడిత్వా అంతే ప్రళయే సంహృత్య చ. ఆత్మమహిమ్నా స్వమహిమ్నా. ఉపరతస్సన్ ఆస్తే. 11

మొదట చెప్పిన అభిప్రాయము క్లిష్టముగా ఉన్నది, స్పష్టమైన దృష్టాంతముతో తెలిపినట్లయితే సంతోషించెదనని పలికిన పరీక్షిత్తును చూచి మళ్ళీ ఆ విషయమునే విశదముగా మూడు శ్లోకాలలో తెలుపుతున్నాడు. ఓ పరీక్షిన్మహారాజా! సర్వజగత్కారణుడైన శ్రీహరి యాదవులందు జన్మించుట లయమగుటయనెడు చేష్టలు. నటుడు ఏ విధముగా తనది గాని మాయావేషమును ధరించి నటించి నటనానంతరము రంగ స్థలమునుండి నిష్క్రమించి తన స్థితిని పొందుచున్నాడో అట్లే ఈ పరమాత్ముని విషయమునందును తలుచుము. స్వయముగా ఈ జగత్తును సృష్టించి దానియందు ప్రవేశించి దీనియందు విహరించి ప్రళయకాలమున సంహారమొనర్చి తన మహిమ ఉపసంహరించు చున్నవాడై ప్రవర్తించుచున్నాడు. 11

శ్లో॥ మర్త్యేన యో గురుసుతం యమలోక
నీతం త్వాం చానయచ్ఛరణదః పరమాస్త్రదగ్ధం ।
జిగ్యేఽంతకాంతకమపీశమసావనీశః
కింస్వావనే స్వరనయన్మృగయుం సందేహమ్ ॥ 12

టీ:- న పునరన్యథా మంతవ్యం. యతోఽస్మిన్నేవావతారే తత్ప్రభావో నిరతిశయో దృష్ట ఇత్యాహ-మర్త్యేనేతి. యమేవ స్వం లోకం ప్రతినీతం గురుసుతం మర్త్యేన తేనైవ శరీరేణ యః అనయత్ ఆనీతవాన్. శరణదః శరణాగత రక్షకః త్వాం చ బ్రహ్మాస్త్రదగ్ధం యో రక్షితవాన్. యశ్చ అంతకానామప్యంతకం ఈశం శ్రీరుద్రమపి బాణసంగ్రామే జితవాన్ మృగయుం లుబ్ధకం. సదేహం తేనైవ దేహేన. స్వః స్వర్గం. అనయత్ నిన్యే. అసౌ స్వావనే స్వరక్షణే. అనీశః అసమర్థః కిం. 12

ఇది ఇట్లు కాదని తలంచరాదు. ఈ అవతారముననే భగవానుని నిరదిశయ ప్రభావమును చూచియున్నామని చెప్పుచున్నాడు. యమ లోకానికి తీసుకపోబడిన తనగురుపుత్రుని అదే శరీరముతో గురుసన్నిధి కి చేర్చిన శ్రీకృష్ణుడు బ్రాహ్మాస్త్రముచే దగ్ధుడవగు నిన్నుకాపాడిన కృష్ణుడు శరణాగతరక్షకుడు. బాణాసురునితో యుద్ధముచేయు సమయాన అంతకాంతకుడైన రుద్రునికూడా జయించిన కృష్ణుడు తనపై బాణము వేసిన వేటగానిని సశరీరముగా స్వర్గమునకు పంపిన శ్రీకృష్ణుడు తనను రక్షించుకొనుటయందు అసబద్ధుడా? ఏమికాదు. 12

శ్లో॥ తథాప్యశేషస్థితి సంభవాప్య
యేష్వనన్య హేతుర్యదశేషశక్తిధృత్ ।
నైచ్ఛత్ప్రణేతుం వపురత్ర శేషితం
మర్త్యేన కింస్వాత్మగతిం ప్రదర్శయన్ ॥ 13

టీ:- నను యది సమర్థస్తర్హి అత్రైవ కించిత్కాలం తేనైవ వవుషా కిం

శ్రీహరి సమర్థుడైనచో అదే శరీరముతో ఇక్కడే మరికొంత కాలము ఎందుకుండలేదను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు. అన్ని విశ్వముల జన్మ స్థితి సంహారములకు ఇతరాపేక్షలేని కారణ భూతుడు. అన్ని శక్తులు కలవాడు. అయిననూ యాదవుల నాశనము తరువాత మిగిలిన తన శరీరమును ఈ లోకమున ఉంచుటకు సంకల్పించలేదు. నశ్వరమైన మానవదేహముతో ఏమి ప్రయోజనము?

నాతిష్ఠత్? తత్రాహ-తథేతి. యద్యపి ఉక్తప్రకారేణ అశేషస్య జగతః స్థిత్యాదిషు. అనన్యహేతుర్నిరపేక్షఏవ కారణం స్వయం. యద్యస్మాద శేషశక్తిధృత్ తథాపి యాదవాన్ సంహృత్య నిజం వపుః అత్రశేషితం అవశేషితం ప్రణేతుం కర్తుం నైచ్ఛత్. కింతు స్వమేవ లోకమనయత్ అత్ర హేతుః. మర్త్యేన దేహేనకిం నకించిత్కార్యమితి. స్వానామాత్మ నిష్ఠాం దివ్యాం గతిమేవ ప్రకృష్టాం దర్శయన్. స్వస్థగతిమితి పాఠే. స్వస్థానా మాత్మనిష్ఠానాం దివ్యాం గతిమేవ ప్రకృష్టాం దర్శయన్. అన్యథా తేఽపి దివ్యాం గతి మనాదృత్య యోగబలేన దేహసిద్ధిం విధాయాత్రైవ రంతుం యతేరన్. తన్మాభూదిత్యేతదర్థమితి భావః. 13

ఏమియూ లేదనుట, తన వారికి ఆత్మనిష్ఠను తెలుపుచూ తన శరీరమును తీసుకొని వెళ్ళుటకే సంకల్పించెను. లేనిచో వారునూ దివ్యగతిని అనాదరించి యోగబలముతో దేహసిద్ధిని పొంది ఇక్కడే రమించుటకై ప్రయత్నింతురు. అదికూడదని అని అర్థము. 13

శ్లో॥ యఏతాం ప్రాతరుత్థాయ కృష్ణస్య పదవీం పరామ్ ।
ప్రయతః కీర్తయన్ భక్త్యా తామేవాప్నోత్యనుత్తమామ్ ॥ 14

టీ:- య ఇతి. ఏతాం ఉక్తప్రకారాం. పదవీం గతిం ప్రయతః భక్త్యా కీర్తయన్ తామేవాప్నోతీత్యర్థః. 14

ఓ రాజా! ఈ చెప్పబడిన కృష్ణుని యొక్క పరమోత్కృష్టమైన పరమ పదవిని, ఆ చరిత్రను గూర్చి తెల్లవారు జాముననే నిద్రమేల్కొని ప్రయత్నపూర్వకముగా చాలాభక్తితో కీర్తించువారికి అత్యంత ఉత్తమమైన ఆ పరమపదవి లభించితీరును. 14

శ్లో॥ దారుకో ద్వారకామేత్య వసుదేవో గ్రసేనయోః ।
పతిత్వాచరణావస్రైర్న్యషించత్కృష్ణవిచ్యుతః ॥ 15

తన లోకానికి వెళ్ళుతూ శ్రీకృష్ణుడు వసుదేవాదులను తన లోకమును చేర్చుటకు ఆలోచించిన ఉపాయమును తెలుపుచున్నాడు. దారకుడు, కృష్ణున్ని వదిలి ద్వారకకుచేరి వసుదేవ, ఉగ్రసేనల పాదములకు ప్రణమిల్లి వారిపాదములను తనకన్నీటిచేతడిపెను. 15

శ్లో॥ కథయామాస నిధనం వృష్ణీనాం కృత్స్నశో నృప ।
తచ్ఛ్రుత్వోద్విగ్నహృదయా జనా శ్శోకవిమూర్ఛితాః ॥ 16

ఓ రాజా! యాదవులయొక్క మరణమును సర్వనాశనమును గూర్చి వారికి చెప్పెను. ఆ విషయాన్ని విని జనులందరు కలతచెందిన హృదయముగలవారై దుఃఖాతిశయముతో మూర్ఛనొందిరి. 16

శ్లో॥ తత్ర స్మ త్వరితా జగ్ముః కృష్ణ విశ్లేష విహ్వలాః ।
వ్యసవశ్శేరతే యత్ర జ్ఞాతయోఘ్నంతి ఆననమ్ ॥ 17

శ్రీకృష్ణవియోగముచే కలతచెందిన మనస్సు కలవారై ముఖమును ఇటు అటు కొట్టుకొనుచు ఎక్కడైతే తమ బంధువులైన యాదవులు పరస్పరము కలహించుటచే ప్రాణములు విడిచి పడియుందురో ఆ సముద్రతీరానికి తొందరగా వెళ్ళిరి. 17

టీ:- తదేవం భగవతా స్వలోకం గచ్ఛతా వసుదేవాదీనామపి తత్ప్రాప్తయే య ఉపాయశ్చింతితః ఆసీత్తమాహ - దారుక ఇతి. (15-17)

శ్లో॥ దేవకీ రోహిణీ చైవ వసుదేవస్తథా సుతౌ ।
కృష్ణ రామావపశ్యంతః శోకార్తా విజహుః స్మృతిమ్ ॥ 18

దేవకీ, రోహిణి, వసుదేవుడు వారి పుత్రులగు బలరామ, కృష్ణులను చూడనివారై స్మృ తిని కోల్పోయి, మూర్ఛబోయిరి. 18

శ్లో॥ ప్రాణాంశ్చ విజహుస్తత్ర భగవద్విరహాతురాః ।
ఉపగూహ్యా పతీంస్తాం స్తాం చితా మారురుహుః స్త్రియః॥ 19

యాదవస్త్రీలందరు వారి వారి భర్తలను చేరుకొని కౌగలించుకొని చితులందు చేరిరి. భగవద్విరహాన్ని పొందినవారై ప్రాణాలను వదిలిరి. 19

శ్లో॥ రామపత్న్యశ్చ తద్దేహ ముపగుహ్యాగ్నిమావిశన్ ।
వసుదేవపత్న్యస్తద్గాత్రం ప్రద్యుమ్నాదీన్ హరేస్నుషాః ।
కృష్ణపత్న్యోఽవిశన్నగ్నిం రుక్మిణ్యాద్యా స్తదాత్మికాః ॥ 20

టీ:- దేవకీతి. కృష్ణరామౌ సుతావపశ్యంతః. (18-20)

శ్లో॥ అర్జునః ప్రేయసస్సఖ్యుః కృష్ణస్య విరహాతురః ।
ఆత్మానాం సాంత్వయామాస కృష్ణగీతైస్సదుక్తిభిః ॥ 21

టీ:- అర్జున ఇతి. సదుక్తిభిః సత్యః అవితథా ఉక్తయో యేషు తైః. శ్లో. 'నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః. మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజమవ్యయ మి' త్యాదిభిః. 21

శ్లో॥ బంధూనాం నష్టగోత్రాణాం అర్జునః సాంపరాయికం ।
హతానాం కారయామాస యథావదను పూర్వశః ॥ 22

బలరాముని భార్యలు అతనిని కౌగిలించుకొని చితిని చేరిరి. వసుదేవుని భార్యలు వసుదేవుని, కృష్ణుని భార్యలు రుక్మిణ్యాదులు కృష్ణుని, కృష్ణుని కోడళ్ళు ప్రద్యుమ్నాదులను పట్టుకొని అగ్ని ప్రవేశము చేసిరి. 20

అర్జునుడు తన అత్యంతప్రియుడైన, స్నేహితుడైన శ్రీకృష్ణుని ఎడబాటువలన కలిగిన భరింపరాని దుఃఖమును తనకింతకు ముందు భగవానుడు ఉపదేశించిన గీతావాక్యములచే 'నాహం ప్రకాశః సర్వస్య యోగమాయ సమావృతః మూఢాయాం నాభిజానాతి లోకో మా మజమవ్యయ' నేను నా యోగమాయచే ఆవరింపబడిన వాడనై అందరికి కనపడను. నేను జన్మరహితుడను. అవ్యయుడను. నన్ను మూఢచిత్తులగు లోకులు తెలిసికొనరు, మొదలగువానితో ఊరడింప చేసుకొనెను. 21

అర్జునుడు పరస్పర కలహ నిమిత్తముగా మరణించిన వారికి తన బంధువులకు, తనవారికి, కృష్ణుడు మొదలుగా గల వారికి క్రమముగా శాస్త్ర విధానములననుసరించి పుణ్యలోకప్రాప్తికై పిండోదకాది క్రియలు గావించెను. 22

శ్లో॥ ద్వారకాం హరిణాత్యక్తాం సముద్రోఽప్లావయత్క్షణాత్ ।
వర్జయిత్వా మహారాజ శ్రీమద్భగవతాలయమ్ ॥ 23

ఓ రాజా! ఇట్లు శ్రీకృష్ణునిచే విడువబడిన ద్వారకలో సంపదల కాశ్రయమైన ఒక్క శ్రీకృష్ణుని సౌధమును మాత్రము వదిలి తక్కిన పురమునంతటిని సముద్రుడు తన నీటిచేత ఒక్క క్షణములో ముంచివేసెను. 23

శ్లో॥ నిత్యం సన్నిహితస్తత్ర భగవాన్మధుసూదనః ।
స్మృత్యాశేషా శుభహరం సర్వమంగళ మంగళమ్ ॥ 24

స్మరించినంతనే సమస్తములయిన అశుభములను తొలగించినట్టి సర్వమంగళములకు మంగళమైన ఆ కృష్ణ భగవానుడు ఎల్లప్పుడు ఆ భవనమునందు సన్నిహితుడై ఉండును. 24

శ్లో॥ స్త్రీబాల వృద్ధానాదాయ హతశేషాన్ ధనుంజయః ।
ఇంద్రప్రస్థం సమావేశ్య వజ్రం తత్రాభ్యషేచయత్ ॥ 25

అర్జునుడు, చావగా మిగిలిన స్త్రీ, బాల, వృద్ధులను తీసుకొని ఇంద్రప్రస్థ నగరముచేరి అచట యాదవరాజ్యమునకు వజ్రుడను వానిని పట్టాభిషక్తుని చేసెను. 25

శ్లో॥ శ్రుత్వా సుహృద్వధం రాజన్నర్జునాత్తే పితామహాః ।
త్వాంతు వంశధరం కృత్వా జగ్ముస్సర్వే మహాపథమ్ ॥ 26

ఓ రాజా! అట్లు అర్జునుని ద్వారా శ్రీకృష్ణుడు మొదలైన బంధు మిత్రుల మరణమును గూర్చి వినినవారై మీ తాతలైన ధర్మరాజాదులు నిన్ను వంశోద్ధారకుని చేసి మహాప్రస్థానమార్గమును గూర్చి వెడలిరి. 26

టీ:- బంధూనామితి. నష్టగోత్రాణాంనష్టసంతతీనాం. సాంపరాయికం పిండోదకాది. (22-26)

శ్లో॥ య ఏతద్దేవ దేవస్య విష్ణోః కర్మాణి జన్మ చ ।
కీర్తయేచ్ఛ్రద్ధయా మర్త్యః సర్వపాపైః ప్రముచ్యతే ॥ 27

టీ:- ఆదిత ఆరభ్య శ్రీకృష్ణచరిత కీర్తనస్య ఫలమాహ - ద్వాభ్యాం. య ఇతి. 27

శ్రీకృష్ణ చరితమును కీర్తించిన ఫలితమును రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. దేవదేవుడైన కృష్ణుని అవతారకృత్యములను, జన్మవృత్తాంతమును మిక్కిలి భక్తి, శ్రద్ధలతో కీర్తించువానికి అన్ని పాపములు తక్షణమే నశించును. వెంటనే ముక్తిని పొందగలడు. 27

శ్లో॥ ఇత్థం హరేర్భగవతో రుచిరావతార
వీర్యాణి బాలచరితాని చ శంతమాని ।
అన్యత్ర చేహ చ శృతాని గృణన్మనుష్యో
భక్తిం పరాం పరమహంసగతౌ లభేత ॥ 28

టీ:- ఇత్థమితి. శంతమాని పరమమంగళాని. పరమహంసగతౌ శ్రీకృష్ణే. 28

ఈ ప్రకారముగా శ్రీకృష్ణ భగవానుని అవతారవిశేషములను, మిక్కిలి ప్రభావ సంపన్నములైన అవతారకృత్యములను, మిక్కిలి మనోహరములగు బాల్య చరిత్రములను, భక్తియుక్తుడై స్తుతించు వానికి ఇహపరములందు చక్కని శుభములు కలుగుటయే కాక పరమ హంసలైన భాగవతోత్తములకు ప్రాప్యుడైన శ్రీకృష్ణునియందు ఏకాంత భక్తిని లభించును. 28

ఇతి శ్రీమద్భాగవతే ఏకాదశస్కందే, ఏకత్రింశోఽధ్యాయః
సమాప్తః
ఏవమేకాదశస్కంధే భక్తిభావార్థదీపికా,
స్వాజ్ఞానధ్వంతభీతేన శ్రీధరేణ ప్రకాశితా.
ఏకాదశ స్కంధస్సమాప్తః

అని శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధమందు
త్రింశోధ్యాయము సమాప్తము
ఏకాదశస్కంధము సమాప్తము.

